# హంపీ నుంచి హరప్పా దాక

(తృతీయ ముద్రణ)

శ్రీ తిరుమల రామచంద్ర



అజో-విభొ-కందాళం (U.S.A.) ప్రచురణలు

2004

# హంపీ నుంచి హరప్పా దాక

## శ్రీ తిరుమల రామచంద్ర స్వీయచరిత్ర

(తృతీయ ముద్రణ)

( కేంద్ర సాహిత్య అకాడమి(2002 సం॥) పురస్కారం పొందిన
ఉత్తమోత్తమ రచన)



సంపాదకుడు

అక్కిరాజు రమాపతి రావు

అజో-విభో-కందాళం ప్రచురణలు

2004

హంపీ నుంచి హరప్పా దాక

డా. తిరుమల రామచంద్ర

HAMPI NUNCHI HARAPPAA DAKA

By: SRI TIRUMALA RAMACHANDRA

సంపాదకుడు :అక్కిరాజు రమాపతి రావు

Editor: AKKIRAJU RAMAPATI RAO

తృతీయ ముద్రణం: **2004**

ప్రతులు: **1000**

మూల్యం: రు. **200 ($)**

విదేశాలలో: **20** డాలర్లు

ముఖపత్రాలంకరణ, లోపలి చిత్రాలు: శ్రీ జి.వి.అమరేశ్వర రావు

Website: www.avkf.org

*For Copies:*

Visalandhra Book House, Bank Street, Hyderabad & all Other Branches.

Navodaya Publishers, Governorpet, Vijayawada.

Navodaya Book House,Opp. Arya Samaj Mandir, Badi Chowdi, Hyderabad.

Navayuga Book House ,Sultan Bazar, Hyderabad.

books@avkf.org

books_international@avkf.org

Printers :

Karshakart printers

Vidya nagar Hyderabad

D.T.P & Lay outs:

Sri rama Graphics , Ph:27632907

ప్రచురణ:

**అజో-విభొ-కందాళం ప్రచురణలు**



1940లలో శ్రీ రామచంద్ర దంపతులు



తిరుపతిలో (1997) ఆవిష్కరించిన ప్రతిభామూర్తి వార్షిక విశేష
సంచిక పరిశీలిస్తున్న శ్రీ తిరుమల రామచంద్ర

డాక్టర్ తిరుమల రామచంద్ర విచిత్ర వ్యక్తి; వైరుధ్యాల పుట్ట; వైపరీత్యాల మెట్ట. పాదరసాన్ని పరిహసించే పరుగు; మెరుపును మించిన చాంచల్యం!

ఇంతటి వైరుధ్యాల వైవిధ్యంలో, వైపరీత్యాల వైరూప్యంలో రచయిత కనిపిస్తాడు; విమర్శకుడు తొంగిచూస్తాడు; భాషావేత్త భాసిస్తాడు; ప్రతిదాని పుట్టుపూర్వాలు పరిశీలించే పరిశోధకుడు పలుకరిస్తాడు; కనిపించిన దాన్నంతా కలంతో కబళిద్దామనే భావుకుడు గోచరిస్తాడు; తెలిసిన దాన్నంతా కలంతో కబళిద్దామనే భావుకుడు గోచరిస్తాడు; తెలిసిన దాన్ని తేటమాటలతో అందించే పత్రికా రచయిత తారట్లాడుతాడు. ఉపనిషత్కాలపు స్వర్ణయుగం అవతరించాలనే దురాశాపరుడు ప్రత్యక్షమవుతాడు.

ఇలాటి స్థితికి కారణమేమిటి? పరిసరాలు ఎందుకు వికటించాయి? లోపాలు ఎక్కడ ఉన్నాయి? అవి సరిదిద్దుకోవడానికి వీలు లేనివా? విధి బలీయమా? ఇలాటి ప్రశ్నలకు కొంతవరకు సమాధానం ఈ

## 'హంపీ నుంచి హరప్పా దాక'

నేను తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర సంస్కృత కళాశాలలో విద్యార్థిగా ఉన్నప్పుడు దినచర్య వ్రాసే వాడిని. ప్రతిదినమూ ఏదైనా మంచి పనిచేయాలనే నియమం పాటించేవాడిని. రాత్రి పడుకోబోయే ముందు దినచర్యను ఒక పెద్దల సూక్తితో ముగించేవాడిని.

స్వాతంత్ర్యోద్యమంలో క్రియాశీల కార్యకర్త అయిన పిదప, ఆనాటి పనులన్నీ దినచర్యలో చేరేవి. అది పోలీసుల చేతుల్లో పడి, న్యాయస్థానంలో నాకే కాక, నా మిత్రులకూ ప్రతికూల సాక్ష్యం ఇచ్చే పరిస్థితి ఏర్పడింది. అప్పటి నుంచి దినచర్య వ్రాయడం మానుకున్నాను.

ఈ 'హంపీ నుంచి హరప్పా దాక' పర్యటనలో తిథుల వారీగా సంఘటనలను గుది గుచ్చడం, అందువల్లనే, సాధ్యం కాలేదు; నా జ్ఞాపకాన్ని బట్టి పేర్కొన్నాను.,

నా బోటి సామాన్యుని జీవితంలో ఏమి గొప్ప సంఘటనలు ఉంటాయి గనుక? కాని ఇదొక దేశ ద్రిమ్మరి అనుభవ విశేషంగా, సత్యాన్వేషి కథనంగా; జిజ్ఞాసువు ఆవేదనగా పాఠకుల మనసుకు దగ్గరవుతుందని నా విశ్వాసం.

**భాషా సేవకుడు**
**తిరుమల రామచంద్ర**

# తృతీయ ముద్రణం మనవి మాటలు

అచిరకాలంలోనే హంపీ నుంచి హరప్పా దాకా మూడో ముద్రణం వెలువరించటం అజో-విభొ-కందాళం ప్రచురణలకు ఎంతో ఆనందదాయకంగా ఉంది. ఇరవయ్యో శతాబ్ది తెలుగు సాహిత్య చరిత్రలోనే తిరుమల రామచంద్రగారి వంటి వైవిధ్యభరితమైన జీవితం గడిపిన కవి, పండిత, సాహిత్యవేత్తలు మరొకరు లేరు. ఆయన మనస్వి. నిరాడంబర సరళసాధు ప్రవృత్తికి మూర్తిమంతం. ఆయన వంటి బహుభాషా వేత్తలు ఈ శతాబ్దంలో వేళ్ళమీద కూడా లేరు. ఆయన గొప్ప పండితుడు, పరిశోధకుడు, పురావస్తు చరిత్ర విశారదుడు. అత్యున్నతమైన ప్రమాణాలతో 'పరిశోధన పత్రిక' శ్రీ రామచంద్ర నడిపారు.

'హంపీ నుంచి హరప్పా దాకా' ఈ శతాబ్దపు నవీనేతిహాసం. సమాజ సాహిత్య ఆంతర్య సంస్కృతి త్రివేణి. ఆధునిక పురాణం. కమనీయ కావ్యం. అద్భుత వాస్తవికతకు దర్పణమైన గొప్ప నవల. చవులూరించే కథా సంపుటి. విస్మయావహమైన సామాజిక సన్నివేశ రంగస్థల సురుచిరరూపకం. ఆయన దొడ్డ వ్యక్తిత్వనిరూపకం. మహర్షులందరు ఒకయెత్తూ అగస్త్యుడొక్కడు ఒకయెత్తు అంటారే అట్లానే శ్రీ తిరుమల రామచంద్ర సర్వసాహిత్య సృజన ఒకయెత్తూ 'హంపీ నుంచి హరప్పా దాక' ఒక యెత్తు అనవలసి ఉంటుంది. జీవితంలో డెబ్భై సంవత్సరాలు తెలుగువారి ఉత్తమ సాహిత్యాభిరుచి ప్రవర్ధనంకోసం, సంస్కృతి పునరుజ్జీవనం కోసం ఆయన గొప్ప కృషి చేశారు. వ్యాసాలు, సమీక్షలు, వేలాది సంఖ్యలో రాశారు. ఆయన ఆర్జవం ఇతరులలో మృగ్యం. ఇతరులంటే సాహితీరంగ ప్రముఖులని అర్థం.

లబ్ధప్రతిష్ఠులనీ, ప్రతిష్ఠలబ్ధులనీ మాత్రమే గుర్తించటం కాదు అజో-విభొ-కందాళం విభొ ప్రచురణ ఆశయం. ఎక్కడ ఉపజ్ఞ ఉన్నా, సృజనాత్మక మౌలిక ప్రతిభ కనపడినా, సొంతగొంతుగా ఎన్నికైనా, అటువంటి వారిని గుర్తించటం అజో-విభొ-కందాళం ఫౌండేషన్ అభిమతం. తెలుగులో మంచి పుస్తకాలు తేవటం ఫౌండేషన్ ఉనికికి మనికి అని భావిస్తున్నది. ఎటువంటి రాజకీయ సామాజిక సిద్ధాంత వ్యాపన ఉద్యమాలు, తాదాత్మ్యాలు, ప్రచారాశయాలు, వాదాలు, విభేదాలు, నాదాలు, నినాదాలు పొంత బోకుండా సాహిత్య మూల్యాలు, మానవజీవన ఉత్కృష్ట నాగరికత, సృజనాత్మకప్రతిభ,

మంచిని పెంచే సంఘర్షణ, మాటతీరు, మనిషి సౌరు తనకు ముఖ్యమని అజో-విభొ-కందాళం ఫౌండేషన్ ఆశయం. 'పురాణ మిత్యేవ...' ప్రతిపాదనం హృద్యంగా ఫౌండేషన్ స్వీకరిస్తుంది. అంగీకరిస్తుంది.

అజో-విభొ-కందాళం ప్రతి సంవత్సరం రెండు మూడు మంచి పుస్తకాలు ప్రచురించడం తన మనుగడ సాఫల్యంగా భావిస్తున్నది. ఆ మంచి పుస్తకాలను తెలుగు వారు గుర్తించటం గొప్ప ప్రోత్సాహంగా ఫౌండేషన్ ఆనందిస్తుంది.

అజో-విభొ-కందాళం వ్యవస్థాపకులు శ్రీ అప్పాజోస్యుల సత్యనారాయణ, శ్రీవిష్ణుభొట్ల రామన్న, లక్ష్మన్నగారలు తరువాత తమ చేయూతనందిస్తున్న శ్రీ కందాళం వెంకట రామానుజాచారి గారూ మంచి పుస్తకాలు ప్రచురించటం, సముచిత సాహితీ వ్యక్తిత్వ శోభిత మూర్తిని, సమాజసేవాశీలిని ప్రతిభా పురస్కారానికి ప్రతియేటా ఎంపిక చేయడం తమ ప్రధానాశయం గాభావించుకుంటున్నారు. ఇప్పటికి పదిమంది ప్రతిభా మూర్తులు ఈ విధంగా అజో-విభొ-కందాళం ఫౌండేషన్ సత్కార గ్రహీతలైనారు.

తృతీయ,ముద్రణ, ప్రూఫులు ఎంతో శ్రద్ధాసక్తులతో చూసిన డా. జి.బి. రామకృష్ణశాస్త్రి చూశారు. ఇప్పుడీ తృతీయ ముద్రణ కూడా తెలుగు వారి ఆదర పాత్రమవుతుందని ఆకాంక్ష.

హైదరాబాదు

1-1-2004

అక్కిరాజు రమాపతిరావు

# ద్వితీయ ముద్రణ విజ్ఞప్తి
## నమస్కారం

తిరుమల రామచంద్ర గారు అక్షరాలా జరామరణములు లేని వారు. 84 సంవత్సరాలు జీవించిన ఆయన శరీరానికి జర (ముసలితనం) కలగలేదు. ఒక దానిమీదొకటి పేర్చుకుని పెట్టుకొంటే నలభై అంగుళాలు (పదహారు వేల పేజీలు) రాగల ఆయన సాహిత్యానికి మరణం లేదు. 'తిరగక మగవాడు చెడ్డాడు. తిరిగి ఆడది చెడింది' - అనే దాంట్లో నిజాన్ని విపర్యయానికి అన్వయించుకుంటే "తిరిగి" బాగుపడినవారిలో ఆయన సమున్నత ఉదాహరణగా నిలిచారు. ఆయన ఎంతో గౌరవప్రదమైనవిగా భావించిన ఆంధ్ర పత్రిక, భారతి, ఆంధ్రప్రభ మొదలైన పత్రికలలో ఏ ఒక్కదానిలో స్థిరపడి ఉండినా దానికి ఆయన ప్రధాన నిర్వాహకుడు అయి ఉండేవారే. కాని, కాశీనాథుని నాగేశ్వరరావు నుండి నేటి వారి వరకు అందరు పత్రికా సంపాదకులను తన కన్న చిన్నవారుగా కాక మిన్నవారుగా అంగీకరించి, స్వీకరించిన వినయశీలి... "విద్య యొసగును వినయము" కాదా...

1997లో ఆయనను మేము ఒక రకంగా గౌరవిద్దామని అనుకొని కారణాంతరాల వల్ల వీలుపడక ఇంకొక విధంగా మా గౌరవాన్ని వ్యక్తపరచు కున్నాము. అది "హంపి నుంచి హరప్పా దాక" తొలి ప్రచురణ. ఆ వెయ్యి కాపీలు (కాపీ ధర రూ. 150/-గా నిర్ణయించినా) పదహారు నెలల్లో ఖర్చయి పోవడం వల్ల ఆయన్ను గౌరవించేవారు, వారి స్వీయచరిత్రను చదువుకుని అలనాటి దేశ, కాల, సామాజిక, ఆత్మిక పరిస్థితులను తెలుసుకోగోరేవారు; ఇంకా ఉన్నారని మాకు తెలిసింది. అట్టి గౌరవాభిలాషులు మరి కొందరి కోసం ఈ రెండో ముద్రణ.

తిరుమల రామచంద్రగారు ఈ ఆటోబయోగ్రఫీలో కవర్ చేసిన తన జీవితభాగం ఆయన బ్రతికిన దానిలో మూడవవంతు కూడా లేదు. ఆయన కలుసుకున్న వ్యక్తుల, ఆయన పరిశీలించిన గ్రంథాల స్ఫూర్తి ప్రభావాలతో ఆయన చేసిన భాషా సేవలను గురించి పది మందికీ (కాకపోతే ఎనిమిది కోట్ల మందికీ) నిరభ్యంతరంగా చెప్పుకోదగిన పరిశుద్ధ పవిత్ర జ్ఞానయాత్రానుభవాలు ఆయనవి. కాని, ఈ మాత్రమే తెలుసుకునే యోగ్యత మనది - అని సరిపెట్టుకోవలసి వస్తోంది.

క్రమంగా ఆయన రచనలన్నీ పుస్తకాలుగా వస్తే అది అసలైన భాషాసేవ కాగలదని మేము కూడా అనుకుంటున్నాము.

## ప్రథమ ముద్రణ పరిచయ వాక్యాలు

# మనస్విమాటలు

"తరవో పి హి జీవంతి జీవంతి మృగ పక్షిణ:
సజీవతి మనో యస్య మననేవ హి జీవతి"

- ఇది యోగవాసిష్ఠంలోని శ్లోకం

**"Plants also live, and birds and beasts live:
But he lives (truly) whose mind lives by thinking"**

పైన ఉదాహరించిన యోగవాసిష్ఠంలోని శ్లోకానికి ఇది ఇంగ్లీషు అనువాదం. ఈ అనువాదం చేసింది రామానంద ఛటర్జీ. 'మోదరన్ రెవ్యూ' అనే గొప్ప మాసపత్రిక సంపాదకుడు. సాహిత్య, సాంస్కృతిక, కళా, సామాజిక, జాతీయోద్యమ పునరుజ్జీవనాన్ని ప్రబుద్ధం చేసిన పత్రిక ఇది. ఆ రోజుల్లో భారత స్వాతంత్రోద్యమానికి సాంస్కృతిక భూమికను పటిష్టపరచిన గొప్ప పత్రిక ఇది. మేధావులను, కళావేత్తలను, సామాజిక, రాజకీయ, సిద్ధాంతాలను కూడా బాగా ప్రభావితం చేసింది ఈ పత్రిక.

ఈ శ్లోకాన్ని, దీని ఇంగ్లీషు అనువాదాన్ని రామానంద ఛటర్జీ ప్రస్తావించిన సందర్భం ఏమంటే విశ్వకవి రవీంద్రనాథఠాగూర్ షష్టిపూర్తి. ఆ శ్లోక సారాంశానికి అక్షరాకృతిగా శ్రీ రవీంద్రుణ్ణి, రామానంద ఛటర్జీ అభివర్ణించారు. రవీంద్రుడి షష్టిపూర్తి అభినందన సంచికలో ఇంగ్లీషులో వ్యాసం వ్రాస్తూ, నవనవోన్మేషమైన మనస్సు రవీంద్రుడిది, అది నిరంతర, నిత్య మనన శీలమైనది - అని ఆయన అభిప్రాయపడ్డారు.

చెట్లు జీవిస్తాయి, (కొన్ని అయితే వేల ఏళ్లుకూడా). మృగాలూ, పక్షులూ జీవిస్తాయి. అయితే వాటి మనస్సు పరిపక్వశీలం కాదు. ఎవరైతే మనస్సుతో మనసారా జీవిస్తారో వాళ్లే నిజంగా జీవించినట్లు. వాళ్ల జీవితమే సార్థకం - అని యోగవాసిష్ఠం చెబుతున్నది.

తిరుమల రామచంద్రగారికి షష్టిపూర్తి కాలేదు. సప్తతి జరగలేదు. అశీతి అసలే లేదు. సహస్ర చంద్ర దర్శనోత్సవం సమకూడలేదు. అంటే తెలుగువాళ్లు పట్టించుకోలేదని అర్థం. ఆయనది ఏమీ పట్టించుకోని మనస్తత్వం. వారికి నష్టమైంది ఏదీ లేదు. వారు ఎప్పుడూ మనసుతోనే, మనస్వితతోనే, మనస్విగానే జీవించారు. అట్లానే వెళ్లిపోయారు.

"హంపీ నుంచి హరప్పా దాక" అనే ఆయన ఈ రచన ఎంతో విలక్షణమైనది. విశిష్టమైనది. చారిత్రాత్మక స్వీయ చరిత్రాత్మక కథనం ఇది. ఒక నవలకన్నా వేగంగా

ఆకర్షకంగా, ఉత్తేజభరితంగా చదివిస్తుంది. మూడోవంతు జీవిత సంఘటనల సన్నివేశాల సమాహారమే ఈ, 'హంపీ నుంచి హరప్పా దాకా' అని ఆయనే చెప్పుకున్నారు. రెండింట మూడువంతులు ఇంకా ఆయన జీవితోదంతాలు మిగిలే ఉన్నాయి. వాటిని తెలుగువాళ్లు ఇక ఎప్పటికీ తెలుసుకోలేరు. అది మన దురదృష్టం.

ఈ ఇరవయ్యో శతాబ్దపు తెలుగు సాహిత్య సమీక్షలో, చరిత్రలో, అధ్యయనంలో ఒక పది, పదిహేను మంది ప్రముఖులను ఎంపిక చేయవలసివస్తే, కనీసం ఇంకా రెండు మూడు శతాబ్దాల వరకైనా నిలిచేవారిని తలచుకోవలసివస్తే వారిలో తిరుమల రామచంద్రగారు నిస్సందేహంగా ఒకరు. ఆయన నిత్యమనస్వి. నిరాడంబరవచస్వి. ఇంత వైవిధ్య సుందరమైన రచనా సంపన్నత ఈ శతాబ్ది రచయితలలో మరెవరిలోనూ లేదు. ఆయన మహాకవిగా, గొప్పపండితుడుగా, వాఙ్మిగా, మేధాశ్రీమంతుడుగా ఆధునిక తెలుగు సాహిత్యంలో కీర్తిప్రతిష్ఠలు, ప్రచార ప్రసిద్ధులు 'ఆర్జించి' ఉండకపోవచ్చు. కానీ తెలుగు వారందరికీ ఆయన ఎంతగానో కావలసినవాడు. ఎంతో దగ్గరివాడు. ఆయన నిజమైన పెద్దమనిషి. గౌరవార్హుడు. పూజార్హుడు కూడాను. అర్ధశతాబ్దికాలం ఎన్నో పత్రికలలో పనిచేసినా ఆయన ఎప్పుడూ తనను తాను పెంచుకోలేదు. కాని రోజు రోజుకు మనసు పెంచుకున్నాడు. ఆయనంతటి పేదమనసును, పెద్దమనసునూ కూడా ఎవరిలోనూ చూడము. ఆ సారళ్యం, ఆ సాధు ప్రవర్తన, నిరాడంబరత, ఆ నిండుకుండతనం మరి కానరావడం కష్టం. "తరువు లతిభారఫలసమృద్ధి నమ్రత వహించు" అనే భర్తృహరి మహాశయుడి భావుకతకు తిరుమల రామచంద్రగారు మూర్తీభావం.

ఆయన 'త్రిదశుడు'. అంటే ఎప్పుడూ ముప్ఫయి ఏళ్లవాడిలాగానే జీవించారు. బాల్య, కౌమార, యౌవన, నిర్మల, నిర్భయ, నిరంతర, సమధికోత్సాహ మనస్వితతోనే ఆయన ఎనభై నాలుగేండ్ల జీవితాన్ని యదృచ్ఛాలాభసంతుష్టంగానే గడిపారు. గతానికీ ఆగతానికీ ఆయన ఒక అందమైన వారధి.

"హంపీ నుంచి హరప్పా దాకా" ఒక గొప్ప ఆధునిక కావ్యం. ఇతిహాసం. భారతీయ సంస్కృతిలోని మేలిమిని సాక్షాత్కరింపజేస్తున్న సుందరపురాణం. ఇందులోని అరవైఒక్క చిన్న చిన్న అధ్యాయాలలో (లేదా, ప్రకరణాలలో) ఆయన ఎన్నో అందమైన విషయాలు చెప్పారు. నవరసభరితమైన ఆధునిక వచన మహాకావ్యం ఈ రచన. ఈ రచయిత మహామనస్వితె అనన్యసదృశం. సాక్ష్యం కావాలా!

"లాహోర్‌లో ఉంటూ పశ్చిమాన ముల్తాన్ వరకూ తూర్పున ధరమ్‌శాలా వరకూ తిరిగాను. 'పన్నెండు కోసులకు భాష మారుతుంది' అన్న పంజాబీ భాషణానికి అనుగుణంగా మారుతున్న పంజాబీ మధురవాక్కులు ఆస్వాదిస్తూ వారిండ్ల ఆవకూర, యవలపిండి, రొట్టెలు తింటూ, తామరతూళ్ల ఊరగాయలు నంజుకుంటూ, మన మధ్యాక్కర వంటి వారి హీర్‌ఛందస్సులోని పాటలు వింటూ, నిలువెత్తు ఆవచేలలో, మొక్కజొన్న చేలలో, రహస్యంగా పెంచే నల్లమందు తోటలలో భంగ్ (భంగా) తోటలలో తిరిగాను. ప్రాప్రా (భ్రాతాభ్రాతా) అంటూ చుట్టూ చేరి నా జరీ ఖద్దరు పంచెలు, జరీ ఉత్తరీయాలు చుట్టుకొని ఆనందించే అమాయకులైన పల్లెపడుచుల ఆనందాన్ని చూచి మురిసిపోతూ, 'రబ్బా !' (భగవంతుడా!)నీవు భారత గ్రామ ప్రజల ఆనందంలో వున్నావు అనుకుని కళ్లుమూసుకొని మా అమ్మను తలచుకొని, ఆమె మాటలు మననం చేస్తూ సంతోషించాను' అంటారు రామచంద్ర. ఎంత మనస్విత!!!

"ఎంతటి దురదృష్టం! మాధవశాస్త్రి భండారీగారు పరమపదించారు. వారం కిందే ఆయన ఇంటికి వెళ్లి నా జాతకం చూపాను. ఆయన "మీకు ఆయుస్సు చాలా ఉంది. దానిని సద్వినియోగం చేసుకోండి. భగవాన్ మీకు అలాటి అవసరం అనుగ్రహిస్తాడు అన్నారు. నేను వారి ఇంటికి వెళ్లి చివరి నమస్కారం చేశాను. ఏదో మహావృక్షం కూలిపోయినట్టు ఒక పర్వత శిఖరం దొర్లిపోయినట్టు, మహానది ఇంకి పోయినట్టు అనిపించింది" అంటారు రామచంద్ర! "లావణ్యం ఒలికే లాహోర్" అనే నలభై మూడో అధ్యాయంలో. ఎంతటి మనస్విత!!

'గాథసప్తశతి'లోని ఒక హృద్యమైన భావాన్ని మహామహోపాధ్యాయ మాధవ శాస్త్రి భండారీ పరమ పదానికి అన్వయిస్తూ రామచంద్ర ఇట్లా చెప్పారు.

"సుజనుడు ఊళ్లో ఉన్నప్పుడు ఊరు నిండుగా ఉంటుంది. అతడు మరుగయిపోతే అంతా వెలితే. అది ఎలాటి వెలితి అంటే గ్రామ సమీపంలోని మర్రిమాను కూలిపోతే ఎలాటి వెలితో అలాటిది. ఆ వెలితిని పూడ్చడం కష్టం."

ఈ తరం తెలుగు వారి జీవితానికి కొత్త శతాబ్దం, కొత్త సహస్రాబ్దం పరిచితం కాబోతున్నప్రాతః సంధ్యారోచిస్సులు ఆగమిస్తున్న మహస్సులో రామచంద్ర మనకు లేకపోవడం కూడా పూరించలేని వెలితేకదా! ఒక పుస్తకం సమాజానికి చేకూర్చే అక్షయమైన సంపద ఎటువంటిదో ప్రాకృత మహాకవి, భావుకచక్రవర్తి ప్రవరసేనుడి మాటలు ఇట్లా విన్పించారు రామచంద్రగారు ఏభైనాలుగో అధ్యాయం ప్రారంభంలో.

"జ్ఞానం పెరుగుతుంది. కీర్తి కలుగుతుంది. గుణాలు సంపన్నమవుతాయి. సత్పురుషుల విమల చరితాలు తెలుసుకోవచ్చు. ఇలాటి కావ్యాలలో ఎవరి మనసును హరించే గుణాలు లేవూ?"

"హంపీ నుంచి హరప్పా దాకా" నిస్సందేహంగా ఇటువంటి గొప్ప కావ్యం. ఇందులో రామచంద్ర గారి మనస్విత మందాకినిలా పొంగులువారి విహరించింది. మహానుభావులైన డా. రఘువీరనుగూర్చి రామచంద్ర అంటారు. "రఘువీర ఒక గొప్ప వ్యక్తి, ఏకైక వ్యక్తికాదు. అనేకానేక విషయాల సమష్టి". ఈ మాటలు రామచంద్రగారికి కూడా అన్వయిస్తాయి.

లాహోర్ నగరంలోని అందమైన, ఆప్యాయమైన స్మృతులను తలచుకుంటూ 'లాహోర్ పాకిస్తాన్‌కు పోయినపుడు నా పిత్రార్జితం పోయినట్టు ఏడ్చాను' అంటారు రామచంద్ర. దేశాన్ని ప్రేమించమని దచ్చీలుకొట్టే అభ్యుదయ రచయితలు, ప్రగతికాముక రాజకీయ సిద్ధాంతులు జాతీయతకు, దేశభక్తికి చెప్పే అర్థం ఏమంటే ప్రగతి నిరోధక భూతకాలిక పునరుద్ధరణ భావదాస్య ఆసక్తి అని. అటువంటి కుహనా మేధావి కారు రామచంద్ర. తన సంస్కృతిపట్ల, తన వారసత్వంపట్ల, తన జాతి ఉత్తమ సంస్కారం పట్ల రామచంద్రగారికి అభిమానం.

"హంపీ నుంచి హరప్పా దాకా"లో అరవైఒక్క అధ్యాయాలు అరవైఒక్క కథలుగా చదివిస్తాయి. స్వవిషయాలను ఇంతటి సృజనాత్మక భావుకతతో, ప్రతిభతో ఆవిష్కరించడం రామచంద్రగారి వంటి ఉపజ్ఞాప్రాభవులకు మాత్రమే సాధ్యమేమో!

ఏభైఆరో అధ్యాయంలో భర్తృహరి శ్లోకాన్ని ఉటంకిస్తూ రామచంద్రగారు "మనస్వీ కార్యార్థీ నగణయతి దుఃఖం న చ సుఖమ్" అన్నారు. నిజానికి సమకాలీన తెలుగు సాహితీ లోకంలో రామచంద్ర తో సాటిరాగల మనస్వి కన్పించరు. ఆయన ఏనాడూ స్వీయకార్యార్థికారు. స్థితప్రజ్ఞుడు. సుఖదుఃఖాలను పట్టించుకోని ప్రజ్ఞాశాలి. భర్తృహరి చెప్పిన మనస్వి విషయంలో ఒక విశేషముంది. ఆ మనస్వి ఎప్పుడైనా మృదుపర్యంకశయన సుఖికావచ్చు. పట్టువస్త్రాలు కట్టవచ్చు. కాని రామచంద్రగారు యాదృచ్ఛికంగా అవి లభించినా వాటిపట్ల ఎటువంటి ఆసక్తి చూపని మనస్వి. అవసరమైతే పరుల కోసం వాటిని వదులుకోగల అచ్ఛ స్వచ్ఛ హృదయులాయన. భర్తృహరే సజ్జనజీవన సంపదను ఇట్లా వర్ణించాడు.

"వాంఛా సజ్జనసంగతౌ పరగుణే ప్రీతి ర్గురౌ నమ్రతా

విద్యాయా వ్యసనం స్వయోషితరతిః లోకాపవాదాద్భయమ్
భక్తిశ్శూలిని శక్తి రాత్మదమనే సంసర్గముక్తిః ఖలై
రేతే యత్ర వసంతి నిర్మలగుణాః తేభ్యో నమః కుర్మహే ”

ఇందులో చెప్పిన సర్వసద్గుణాలకూ మూర్తిమంతమైనది రామచంద్రగారి వ్యక్తిత్వం. తరుణ వయస్సులోనే ఆయన దేశం కోసం కారాగారవాసాన్ని వరించాడు. ఆయన దేశభక్తి నిరుపమానం. ఊహతెలిసినప్పటి నుంచీ వారు ఖద్దరు ఉడుపులనే ధరించారు. సంస్కృత కళాశాలలో చదువుతూ కూడా ఆధునిక భావాలతో నవీనాశయాలతో ఉత్తమాదర్శాలతో వారు తమ జీవితాన్ని దిద్ది తీర్చుకున్నారు. “కుటుంబంలోనూ సమాజంలోనూ గౌరవంగా ఉండడానికి మానవుడు న్యాయంగానూ, నీతితోనూ, వ్యవహరించాలి” (27వ అధ్యాయం) అనే ఆర్యవాక్యాన్ని ఆయన జీవితంలో ఏనాడూ మీరలేదు.

“సత్యం, తపస్సు, జ్ఞానం, అహింసాగుణం, విద్వాంసులను సేవించడం, ఉత్తమ శీలం” – ఈ గుణాలున్నవాడే విద్వాంసుడు. వట్టి చదువుతో విద్వాంసుడుకాడు” (28వ అధ్యాయం) అన్నారు రామచంద్ర. ఈ ప్రమాణాలు వర్తింపజేస్తే రామచంద్ర ఎంతటి గొప్ప విద్వాంసులో తెలుస్తుంది.

గురువులపట్ల రామచంద్రగారికున్న ఆదర గౌరవ ప్రేమాభిమానాలు ఆశ్చర్యం కలిగిస్తాయి. గౌతమ ధర్మసూత్రాలు, మనుస్మృతి వంటివి మా గురువులను చూసే సూత్రాలు రచించారేమో నన్నంత ఆత్మార్పణ, అభినివేశం చూపారు రామచంద్ర. ఆ ధర్మశాస్త్ర గ్రంథాలు చదువుతున్నప్పుడు నాకు, మా గురువుగార్ల వంటి వాళ్లను చూచే ధర్మశాస్త్రకారులు తమ సూత్రాలు రచించారా – అని అనిపించేది. “మా గురువుల వ్యక్తిగత జీవితాలు మాకు తెలియవు. మేము తెలుసుకుందామనే రంధ్రాన్వేషణకు ఎప్పుడూ పూనుకోలేదు. వారు మాతో ప్రవర్తించిన తీరు చాలు. వారి వైయక్తిక జీవితమూ పవిత్రంగా ఉంది అనడానికి. వారి వాత్సల్యం ఎంతటి దుష్టచిత్తుణ్ణయినా శిష్టుణ్ణిచేసేది. వారి బోధనా విధానం ఎంత మూర్ఖుణ్ణయినాప్రబుద్ధుణ్ణి చేసేది” అంటారు రామచంద్ర. వారి గురువులు నిజంగా గొప్పవారే, అయినా వారిని ఈ విధంగా ఆరాధించడం రామచంద్రగారి మనస్వితకు గొప్ప తార్కాణ. ఆ గురువుల దగ్గర చదువుకున్నవారు అందరూ రామచంద్రలు కాగలిగారా?

“హంపీ నుంచి హరప్పా దాకా” రచనలో రామచంద్రగారు చూపిన స్వస్థానవేష

భాషా ప్రలుబ్ధత అబ్బురం గొలుపుతుంది. తాము స్వయంగా చూసిన అద్భుతోదంతాలకు సంబంధించిన వివరాలు నమోదు చేసుకోవడంలో ఆనాడు తనకు శ్రద్ధ లేకపోయినందుకు రామచంద్ర ఎంతో బాధపడిపోవడం హృద్యంగా ప్రస్తావించారు. "ఇలాటి ఎందరి వివరాలో రాసుకోకపోవడంవల్ల చరిత్రకే ఎంతో ద్రోహం చేశానని ఇప్పుడనిపిస్తుంది." (33వ అధ్యాయం) అని వారన్నారు.

తమ జీవితకాలంలో ఎలాటి ప్రలోభాలకు, పేరు ప్రతిష్ఠల ఆశాపాశ బలహీనతలకు ఎన్నడూ లోనుగాలేదు రామచంద్ర.

"నిరక్షరే వీక్ష్య మహాధనత్వం
విద్యానవద్యా విదుషా న హేయా
రత్నావతంసాః కులటాః సమీక్ష్య
కిమార్య నార్యః కులటా భవన్తి"

అనే ఆర్య వాక్యానికే వారెప్పుడూ కట్టుబడి ఉన్నారు. ఈ శ్లోకానికి అర్థం ఇది. "విద్యలేనివారూ వినయదూరులైనవారూ మహాధనవంతులైపోవడం చూసి పండితులైన వారు విద్యను త్యజించరు. రత్నభూషణ భూషితలైన జారకాంతలను చూసి కులకాంతలు జారస్త్రీలు కారుకదా!"

హంపీ విజయనగర శిథిలవైభవాన్ని కూడా ఎంతో హృదయదఘ్నతతో, మమత్వంతో భావుకతతో స్మరించుకున్నారు రామచంద్ర ఈ గ్రంథంలో. ఇందులో పన్నెండో అధ్యాయంలో గొడుగుపాలుడి కథ ఎంతో ఉత్తేజకంగా వర్ణించారు కదా! అది ఈ కాలపు హేతువాదులు, నమ్ముతారా మెచ్చుతారా? అనిపిస్తుంది. కాని అందులో అసంభవం ఏమీ లేదనిపిస్తుంది. ఈ శతాబ్ది ఆధ్యాత్మిక దివ్య చరిత్రులలో అత్యంతాకర్షణీయులైన రామతీర్థస్వామి ఒకసారి ఎప్పుడో సైనిక శాఖవారు నిర్వహించిన పరుగు పందెంలో సైనికులతో పోటీపడి నలభైమైళ్లు పరుగెత్తి ఆ సైనికులకంటే కొన్ని గంటలు ముందుగా నిర్దిష్టస్థానాన్ని చేరారని స్వామి రామతీర్థ జీవితచరిత్రలో ప్రస్తావితమైంది. కాబట్టి రాయలవారి ఛత్రపాలుడైన గొడుగుపాలుడు రాయల వారి వేసవి విడిది అయిన పెనుగొండ నుంచి ఎనభై మైళ్ల దూరంలో ఉన్న విజయనగరానికి రాయలవారి గుర్రంతో పరుగెత్తడం అద్భుతం కావచ్చునేమోకాని అనూహ్యమనుకోవడానికి ఆస్కారం లేదు. కాకపోతే గొడుగుపాలుడి వృత్తాంతాన్ని విశ్వసించదగిన పరమసుందరమైన అతిశయోక్తి అని భావించవచ్చు.

ఇరవయ్యో అధ్యాయంలో రామచంద్రగారి సమాశ్రయణ వృత్తాంతం పరమ సుందరంగా, భావుకరణీయంగా ఉంది. గొప్ప సంస్కారంతోగాని, త్రికరణ పూర్వకమైన దాసభావం కలగదు అని తిరుమల నంబి, భగవద్రామానుజుల వారి వృత్తాంతాన్ని ప్రస్తావించారు రామచంద్ర. అటువంటి గొప్ప సంస్కారం, గాంధీగారిలో కన్పించే శ్రీవైష్ణవత, రామచంద్రగారిలో కూడా భాసించడం ఆయనను సన్నిహితంగా ఎరిగిన వారందరికీ తెలిసిందే. "ఎలాటి యోగ్యతలేని నాబోటివాడికి" అని వినయసుందరంగా తమను గూర్చి ప్రస్తావించుకుంటారు ఈ గ్రంథంలో రామచంద్ర.

ఈ గ్రంథంలో ఒక్కొక్క ప్రకరణం ఎంతో తమకంతో చదివిస్తుంది. మానవల్లి రామకృష్ణ కవి, వేటూరి ప్రభాకరశాస్త్రి, యల్లాప్రగడ సుబ్బారావు, రూపనగుడి నారాయణరావు, వావిలికొలను సుబ్బారావు వంటి మహనీయులను గూర్చి రామచంద్రగారు ప్రస్తావించిన వృత్తాంతాలు ఎంతో రోచకంగా ఉన్నాయి. గాంధీ మహాత్ముడితో కలిసి రామచంద్రగారు ఒకసారి చిత్తూరు నుంచి మద్రాసు వరకు కారులో ప్రయాణించారనీ, పిన్నయ్యగారితో కలిసి కాకినాడ కాంగ్రెసుకి హాజరైనారనీ ఈ గ్రంథం చదవకపోతే ఎందరికి తెలుస్తుంది? "తుంగభద్రలో మొసలి వేట", "మహాతపస్విని కొండమ్మవ్వ", "భవతి భిక్షాందేహి" వంటి వృత్తాంతాలు రామచంద్రగారు తప్ప ఎవరు వ్రాయగలరు? అంత అందంగా ఎవరు చెప్పగలరు?

రామచంద్రగారు గడిపినంత వైవిధ్య విలసితమైన జీవితాన్ని ఈ శతాబ్ది తెలుగు రచయితలలో మరి ఎవరు గడిపి ఉండరు. ఆయన చూసినంత విశాలమైన దేశాన్ని ఎవరూ చూసి ఉండరు. ఆ మహానుభావుడు చూపినంత విశాలోదారదృక్పథాన్ని ఎవరూ సాధించి ఉండరు.

కొంతమంది ధ్రువప్రాంతాలకు వెళ్లి ఖగోళ భూగోళ విశేషాలు అన్వేషిస్తారు. కొందరు మహోన్నత పర్వతాలను అధిగమించి ప్రకృతి రహస్యచ్ఛేదనోత్సుకు లవుతారు. మరి కొందరు సముద్రపు లోతులను, జలచర జీవితపు వింతలను శోధిస్తారు. అది వారికి పుట్టుకతో అబ్బే నైజప్రకృతి ఏమో? తిరుమల రామచంద్ర సమాజ జీవిత వైవిధ్యగవేషణపరుడు. మానవసంబంధాలను, లోతులను, ఎత్తులను, ఆయనవలె ఎరుకపరచుకున్నవారు, ఉత్తేజకరంగా అధ్యయనం చేసినవారూ మరి ఒకరు ఈ కాలంలో తెలుగు రచయితలలో కన్పించరు.

వారి మనస్తత్వ పరిశీలన, మానవ స్వభావచిత్రణ, మనస్తత్వ ప్రతిపాదన చాలా

అద్భుతమైనవి. లాహోర్‌లో అనార్కలి సమాధిని చూసి కన్నీరుకార్చే ఆర్ద్రహృదయుడాయన. "దుర్మార్గుడైన సలీముకు, అక్బరుకు శాశ్వత రౌరవాది నరకాలని నా విశ్వాసం" అని ఆయన నిట్టూరుస్తారు.

"మా ఇతిహాస్ పుస్తకాల్లో మద్రాసీలంతా ద్రావిడులనీ, రాక్షసులనీ, పరమ కురూపులని ఉందే; మీరు మా యు.పి. వారిలాగే ఉన్నారే. రాక్షసుల లాగలేరే!" అని గంగాతీరంలో ఒక చిన్నపిల్ల రామచంద్రగారిని అడిగిందట. అప్పుడు రామచంద్ర విషాదాశ్చర్యాలకు లోనైనారు. ఆయనిలా తలపోశారు: "బ్రిటీష్ చరిత్రకారులు ఈ ఆర్య ద్రావిడవాదంతో పసిపిల్లల మనస్సూ పాడయిపోయేంత గా ఎంత విషం వ్యాపింపజేశారో అని దుఃఖాశ్చర్యాలు కలిగేవి" (అరవైయవ అధ్యాయం) అన్నారు రామచంద్ర.

తెలుగులో స్వీయ చరిత్రలు, ఆత్మకథలు ఎన్నో వచ్చాయి. కాని ఇంత ఆత్మ నివేదన ప్రవణంగా ఏ రచనా రాలేదు అనడం సాహసం కాదేమో!!

"నేను అప్పుడప్పుడు అనుకునేవాడిని - హిందూ మతం కింది వర్గాల్లోనూ మహమ్మదీయ మతం పై వర్గాల్లోనూ బలంగా ఉందేమోనని" (అరవైయవ అధ్యాయం) వంటి పరిశీలనలు ఈ గ్రంథం నిండా ఎన్నో ఉన్నాయి.

కరుణం, శుచిరుజ్జ్వలమైన శృంగారం, సుకుమార హాస్యం, పరమ మనస్విత, ఈ గ్రంథం నిండా పాఠకులు పూలతోటలో విహరించేంత సంతోషాన్ని కలిగిస్తాయి.

'హంపీ నుంచి హరప్పా దాక' రామచంద్రాయణమైన 'మధురం, మధురాక్షరం'

హైదరాబాదు **అక్కిరాజు రమాపతిరావు**

**12-12-1997**

# అధ్యాయ సూచిక


| | | |
|---|---|---|
| 1. | గుండ్రాయి చెప్పిన గాథ | 1 |
| 2. | కమలాపురం | 5 |
| 3. | ఈశ్వరయ్య నవరు | 16 |
| 4. | పాడు పట్టణమైన విజయనగరం | 23 |
| 5. | బసివి నాగమ్మ | 31 |
| 6. | దారికి అడ్డంగా పడుకున్న పులి | 39 |
| 7. | పాపం పన్నారాజు! | 45 |
| 8. | నీటి ఎద్దడి | 50 |
| 9. | పాములతో సహవాసం | 57 |
| 10. | రైట్ ఆనరబుల్ కోలాచలం వెంకటరావుగారు | 64 |
| 11. | తెనాలిరామన మంటప | 71 |
| 12. | గొడుగుపాలుడు | 77 |
| 13. | అంజనంలో కనిపించిన పట్టణద ఎల్లమ్మ | 84 |
| 14. | బళ్ళారిలో గాంధీజీ | 90 |
| 15. | భయం భయంతో సంస్కృతాభ్యాసం | 96 |
| 16. | ఆనేగొంది చదువు | 105 |
| 17. | అనాచారం, దొంగతనం | 112 |
| 18. | పండుగలతో తలమునకలు | 119 |
| 19. | చిరుతపులుల చిత్రహింసతో శాడిస్టుల వినోదం | 126 |
| 20. | నిద్రలో నడక | 131 |
| 21. | మహాతపస్విని కొండమ్మవ్వ | 139 |
| 22. | తుంగభద్రలో మొసలివేట | 146 |

| | | |
|---|---|---|
| 23. | భవతీ భిక్షాందేహి! | 152 |
| 24. | రూపనగుడి నారాయణరావు | 160 |
| 25. | కృతఘ్నతామూర్తి | 167 |
| 26. | నత్తి - వావిలికొలను సుబ్బారావుగారి హితవు | 175 |
| 27. | కళాశాలలో దినచర్య | 182 |
| 28. | శిష్యవచ్ఛలురు మా గురువులు | 189 |
| 29. | హాథీరాంజీ నమిలిన అల్యాకు | 196 |
| 30. | ప్రిన్సిపాల్ సుబ్బారావుగారు | 202 |
| 31. | మానవల్లివారి కృపాకటాక్షం | 209 |
| 32. | మొద్దబ్బాయిలు మహామేధావులైన కథ | 216 |
| 33. | నేను చూచిన అద్భుతాలు | 223 |
| 34. | అమ్మమాట | 230 |
| 35. | చిత్తూరు జిల్లాలో కాంగ్రెస్ ప్రచారం | 238 |
| 36. | సహాధ్యాయులూ - సత్పురుషులూ | 246 |
| 37. | శాసనోల్లంఘనం - అరెస్టు | 256 |
| 38. | విచారణ - శిక్ష | 265 |
| 39. | తిరుచిరాపల్లి కారాగారంలో | 273 |
| 40. | డెటెన్యూలు చేసిన బ్రెయిన్‌వాష్ | 282 |
| 41. | నెల్లూరు వేద సంస్కృత కళాశాలలో | 291 |
| 42. | కొందరు నెల్లూరు పెద్దలు | 300 |
| 43. | చెట్టుకింద కరకబళం | 309 |
| 44. | ఆనాటి మా మద్రాసు కుట్రకేసు | 317 |
| 45. | కుట్రకేసు విచారణ - నాకు బహిష్కరణ | 326 |
| 46. | దయామయుడు డాక్టర్ దాసూరావ్ | 335 |
| 47. | కూటికోసం కోటి విద్యలు | 344 |
| 48. | ప్రభాకరుల ప్రభావం | 354 |
| 49. | మద్రాసులో సజ్జన సాంగత్యం | 362 |
| 50. | నాగేశ్వర సందర్శనం | 373 |

| | | |
|---|---|---|
| **51.** | తంజావూరు సరస్వతీమహల్ | **383** |
| **52.** | మద్రాసులో సుభాష్ చంద్రబోస్ | **393** |
| **53.** | లావణ్యం ఒలికే లాహోర్ | **403** |
| **54.** | కొందరు లాహోర్ రచయితలు | **414** |
| **55.** | మాయబంగారాలు - మాయ తాయెత్తులు | **424** |
| **56.** | డా॥ రఘువీర మాట వినక మిలటరీలో చేరిక | **433** |
| **57.** | చర్చిల్ సందర్శనం | **443** |
| **58.** | కోర్ట్‌మార్షల్ | **455** |
| **59.** | మొహంజోదడో - హరప్పా | **465** |
| **60.** | గంగాతీరంలో | **474** |
| **61.** | డెయిలీ టెలిగ్రాఫ్‌లో | **485** |

# మనవి మాటలు

తిరుమల రామచంద్రగారు ఏ పుస్తకానికైనా పరిచయ వాక్యాలు కూర్చేటప్పుడు ఆ పరిచయాన్ని 'మనవి మాటలు' అనేవారు. చివరన తనను 'భాషాసేవకుడు' అని మాత్రమే అభివర్ణించుకునేవారు. ఆ సౌజన్యం, సౌహార్ద్రం ఆయనకు సహజన్యం. అంతటి మృదుభాషి, పూర్వభాషి, సస్మిత భాషి చాలా అరుదుగానే సాహిత్యలోకంలో కనిపిస్తారు. అంతటి మహారచయిత కదా, వారినొకసారి దర్శించు కుందాము - అని అప్పుడే కలం పట్టిన ఉబలాటంతో వారి దగ్గరకు చేరినవారితో సైతం వారు అత్యంత సౌమనస్యంతో మాటలాడేవారు. ఏ మాత్రం ప్రతిభకన్పించినా ఎంతో మెచ్చుకొనేవారు. ప్రశంసించి ప్రోత్సహించేవారు. పరోక్షంలోనైనా ఎవరిని గురించీ అసహనంగా మాట్లాడేవారుకారు. అంతటి ఉదారవ్యక్తిత్వం రామచంద్రగారిది.

“హంపీ నుంచి హరప్పా దాక” వంటి తమ పరమోదాత్త గ్రంథానికైనా పరిచయవాక్యాలు వారు వ్రాసుకొని ఉంటే 'మనవి మాటలు' అనే శీర్షికనే ఉంచేవారు. తమ ఉదాత్తగాంభీర్య వాఙ్మయ ప్రవృత్తిని ఈ గ్రంథం ఆద్యంత హృదయావిష్కారంలో కూడా వారు పాటించడం చూడవచ్చు.

“హంపీ నుంచి హరప్పా దాక” వంటి మేలి గ్రంథంతో తులతూగ గలిగినవి ఏ నాగరిక సాంస్కృతిక విలసిత భాషాసాహిత్యాలలోనైనా ఒక శతాబ్దంలో పదిహేను ఇరవైగ్రంథాలు వెలువడితే అది చాలా గొప్ప సంగతి. ఆ సాహిత్యపు అన్ని ప్రక్రియలను కలిపి లెక్కించినా ఒక శతాబ్దిలో ఇటువంటి మహోత్తమ గ్రంథాలు ఇరవై ముప్పైకన్న ఎక్కువ పరిగణనలోకి రావు.

దురదృష్టవశాత్తు రామచంద్రగారు ఈ రచన పుస్తక రూపంలో చూసుకోకుండానే కాలవశులైనారు. తమ జీవితకాల చరమసన్నివేశంలో అంటే ఇంచుమించు మృత్యుశయ్యలో కూడా ఈ గ్రంథాన్ని గురించే వారు పలవరించారు. కలవరించారు. ఊహాచిత్ర పరికల్పనంతో, రేఖాచిత్ర సన్నివేశ అలంకరణతో ఈ గ్రంథాన్ని అందంగా అచ్చులో చూడాలని వారెంతో తహతహ చెందారు. ఎందుకో మరి! ఈ రచనకు చాలమంచి భావుక ప్రతిస్పందన లభించడం వారికెంతో ఆనందాన్ని కలిగించింది. 'ఈ పుస్తకం రావడానికి ఎవరు తోడ్పడతారా?' అని ఉత్సుకతతో ప్రతీక్షించారు.

ఇంతలో వారు దివంగతులైనారు. రేపు వారు చనిపోతారనగా సందర్భవశాత్తు

ప్రస్తావికంగా అప్పాజోస్యుల సత్యనారాయణగారు, న్యూజెర్సీ నుంచి నాకు ఫోన్‌చేయగా రామచంద్రగారి మానసిక వ్యగ్రతను, "హంపీ నుంచి హరప్పా దాక" ప్రచురణ గూర్చిన ఆత్రుతను వారితో ప్రసక్తం చేశాను. అప్పాజోస్యులవారు పరమార్ద్రతతో, ఆ మహానుభావుడి పట్ల ఉన్న ప్రేమాభిమాన గౌరవాదర తత్పరత్వం తో "మీరు నామాటగా అజో-విభొ - కం ప్రచురణగా వెంటనే "హంపీ నుంచి హరప్పా దాక" వెలువరించ నున్నట్లు వాగ్దానం, విన్నపం, లేదా హామీ లేదా భరోసా రూపంలో ఏదైనా సరే వారి ఆందోళన శమించేట్లు చూడండి" అని నన్ను హెచ్చరించారు. నేను ఆ మాటలు వారికి చెప్పినా వారికి అర్థమయినాయో లేదో! ఇహలోకపు వాసనలు సోకని అంతిమ ప్రయాణపు హడావుడిలో వారుండి పోయినట్లు కన్పించింది. ఆ మర్రోజే అది సంభవించింది.

ఏమైనా వారు లోకాంతరగతులైన రెండు నెలలోనే ఈ గ్రంథం యీ విధంగా సర్వాకర్షకంగా రూపుదిద్దుకోవడానికి శ్రీ అప్పాజోస్యుల సత్యనారాయణ, శ్రీ విష్ణుభొట్ల రామన్న, శ్రీ విష్ణుభొట్ల లక్ష్మన్న గారల మంచి మనస్సులే కారణం. రామచంద్రగారి గ్రంథాలన్నీ ఒక్కొక్కటిగా మళ్లీ వ్యాప్తిలోకి తేవాలనీ, పరిస్థితులు అనుకూలిస్తే వారి పేరిట ఒక సంస్మరణ నిధి వ్యవస్థను ఏర్పాటు చేయాలనీ వారు సంకల్పిస్తున్నారు.

తెలుగువారి సర్వతోముఖమైన వికాసాన్ని, సంస్కారాన్ని రామచంద్రగారు సర్వాత్మనాకాంక్షించారు కాబట్టి స్వరాష్ట్రంలో ఉన్నా విదేశాలలో ఉన్నా అప్పాజోస్యుల-విష్ణుభొట్ల ఫౌండేషన్ వారికి తెలుగువారు సహకరించాలని, వారిని ప్రోత్సహించాలని శ్రీరామచంద్రగారి స్మృతి కలకాలం వర్ధిల్లేట్లు చూడాలని అజో-విభొ తరపున తెలుగువారందరికీ విన్నవించుకుంటున్నాను.

డా॥ జి.బి.రామకృష్ణశాస్త్రి, రెంటాల కల్పనగారు అజో-విభొ కార్యక్రమాల పట్ల తమకుండే అంకితభావంతో ఈ పుస్తకం సమయానికి వెలువడడానికి ఎంతగానో శ్రమించారు. అన్నివిధాలా నాకు సహాయం చేశారు. వర్ధిష్ణు చిత్రకళాకోవిదుడు, రచయిత చిరంజీవి జి.వి.అమరేశ్వరరావు అందమైన రేఖాచిత్రాలు సంతరించడమేకాక, సుందరంగా ముఖచిత్రరూపకల్పన చేశాడు. ఈ ముగ్గురిపట్ల నేను ఎంతగానో కృతజ్ఞుణ్ణి. వారికి నా హృదయపూర్వక అభినందనలు.

హైదరాబాదు — అక్కిరాజు రమాపతిరావు

**12-12-1997**

# 1

# గుండ్రాయి చెప్పిన గాథ

"అహో! శిలే తే సౌభాగ్యం
య దహల్యా కృతేయుగే
సంస్కృతే రితిహాసస్య
సాక్షిభూతా సి సర్వదా "

(ఓ రాయీ! కృతయుగంలో నీవు అహల్యగా ఉన్నావు. ఎంత భాగ్యం నీది! సంస్కృతికి, ఇతిహాసానికీ కూడా ఎప్పుడూ సాక్షిగా ఉన్నావు.)



మా ఇంట్లో ఒక సగం విరిగిన ఇనుప గుండు ఉండేది. దానిని దేనినైనా పిండి కొట్టడానికి, నూరడానికి వాడేవారు. ఇనుప గుండు ఎగుడుదిగుడుగా సగం ఎలా విరుగుతుంది? ఇనుప గుండును గుండ్రాయిలాగు అందరూ వాడుతారా? ఇది మా ఇంట్లోనేనా? - అని నాకు ఎన్నో సందేహాలు. అమ్మను అడిగాను. ఏదో సమాధానం చెప్పిందిగాని, సరిగా అర్థం కాలేదు. ఆ సంగతి అంతే; "తాతగారిని అడుగు", అన్నది. తాతగారిని అడిగాను. నాకు -- నాకేమిటి, మా అందరికీని - నాన్నగారి దగ్గరకంటే తాతగారి దగ్గరే చనువెక్కువ కనుక అడిగాను.

"అదొక పెద్ద గాథ!" అన్నారు మా తాతగారు. మా పూర్వులు తిరుమల వాస్తవ్యులు. రామానుజుల మేనమామగారైన తిరుమల నంబి వంశం మాది. తిరుమల నంబి దినమూ శ్రీనివాసుని కైంకర్యానికి తిరుపతి నుంచి తిరుమలకు కాలి నడకన వెళ్లేవారు. తిరుమలలో కైంకర్యం ముగించి సూర్యాస్తమయ సమయానికల్లా తిరిగి దిగి వచ్చేవారు. ఈ రాకపోకలలో రామానుజులకు శాస్త్రపాఠం కొనసాగేది.

తెలుగునాట రామానుజమతం వ్యాపించిన తర్వాత మా వంశంవారు రెడ్డిరాజుల; విజయనగర సార్వభౌముల, ఇతర చిన్న, పెద్ద రాజుల మతగురువులయ్యారు. వారిలో తాతాచార్యులనేవారు ప్రముఖులు కావడం వల్ల తాతాచార్యవంశం అని మా వంశానికి పేరు వచ్చింది. పేర్ల చివర తాతాచార్యులు అనేది బిరుదమైంది. తిరుమల ఇంటి పేరైంది. తిరుమల ప్రాధాన్యాన్ని బట్టి తర్వాత రామానుజ మతవ్యాప్తికై వచ్చినవారు తిరుమల గృహనామంగా చేసుకున్నారు.

విజయనగర సామ్రాజ్యం విచ్ఛిన్నమయిన తర్వాత మా పూర్వులను విజయనగర సార్వభౌములకు సైనికులుగా ఒదిగించే తాడిమర్రి పాలకులు ఆదరించి, గురువులుగా గౌరవించారు. తాడిమర్రి అనంతపురం జిల్లాలో ఉన్న రాజ్యం. పాలకులు 'వ్యాధులు'. వ్యాధులు మహావీరులు. మౌర్య సామ్రాజ్యం మొదలు మొఘల్ సామ్రాజ్యం వరకు ఈ వ్యాధవీరుల దండ్లు తోడ్పడేవి. వ్యాధశబ్దం రెండు రూపాలు పొందింది. వ్యాధ - వామ - వాయ - బాయ - బోయ అయి, తెలుగులో బోయ అని స్థిరపడింది. బోయలు పూర్వం మౌర్యసామ్రాజ్యంలోను, తక్కిన రాజుల కాలంలోను సేనాపతులుగా, దళ నాయకులుగా, దుర్గరక్షకులుగా, నగరరక్షకులుగా, అంగరక్షకులుగా, తలవరులు (తలారులు)గా ఉన్నారు. వీరు మహావీరులు, విశ్వాసపాత్రులు, దేశాభిమానులు. వ్యాధ

శబ్దం వ్యాధ – వేధ – వేద – బేద అని మరొక రూపంతో తమిళ, కన్నడాలలో వేదర్ –బేడదు అని స్థిరపడింది. వీరి నివాసం తెలుగునాడులోని బళ్లారి, అనంతపురం, కర్నూలు, చిత్తూరు, కర్ణాటకలోని గుల్బర్గా, రాయచూరు, కోలారు, చిత్రదుర్గ, తుమ్‌కూరు, తమిళనాడులోని ఉత్తర ఆర్కాట్, చెంగల్పట్టు జిల్లాలు. రాజ్యాలు కనుమరుగై పోవడంవల్ల వీర జాతికి చెందినవారు చిన్న చిన్న పాళెగారులుగా మిగిలారు. వీరు ఎదురు తిరిగే స్వభావం గలవారు. కనుక బ్రిటిష్ ప్రభుత్వం భయపడి వీరిని సి.టి. ఆక్ట్ (క్రిమినల్ ట్రైబ్స్ చట్టం) కింద జమకట్టి ప్రభుత్వోద్యోగాలు ఈరాదని, దొంగలుగాను, నేరగాళ్లుగాను పరిగణించి జాగరూకతతో ఉండాలని నిర్ణయించింది. (భారతదేశం స్వతంత్రమైన తర్వాతగాని ఈలాటి చట్టాలు రద్దు కాలేదు). వ్యాధుల పరాక్రమాన్ని గురించిన గాథలు గాథాసప్తశతిలో కోకొల్లలు.

బ్రిటిష్ ప్రభుత్వం అనుమానించినట్టుగానే ఈ బోయలు సిపాయి పితూరీ అనబడే ప్రథమ భారత స్వాతంత్ర్య సమరానికి ముందే ఎదురు తిరిగారు. తాడిమర్రి సంస్థానం కూడా బ్రిటిష్ సైన్యాన్ని ఎదిరించింది. దానిని ఓడించి కొన్నినాళ్లు స్వాతంత్ర్యం ప్రకటించింది. కాని, బ్రిటిష్ వారి అదనపు ఆధునిక సైన్యం ధాటికి నిలువలేకపోయింది. బ్రిటిష్ సైనికులు తాడిమర్రి సంస్థానాన్ని నేలమట్టం చేశారు.

విజయనగర సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయలకు గొడుగుపట్టే గొడుగు పాలుడు, అంగరక్షకుడుగా ఉన్న దొణ్ణే నాయకుడు వ్యాధులే. గొడుగుపాలుడు ఒకమారు శ్రీకృష్ణదేవరాయలు వేసవి విడిది అయిన పెనుగొండ నుంచి విజయనగరానికి అడ్డదారిన (దాదాపు 80 మైళ్లు) గుర్రంతో పరుగుతో వచ్చాడట. రాయలు అతని సేవకు మెచ్చి ఒక రోజు రాజ్యం అతని పరం చేశాడట. ఆ రోజు పగలూ, రాత్రీ గొడుగుపాలుడు అనేక దానాలు చేశాడట. దీనికి నిదర్శనంగా బళ్లారి, అనంతపురం జిల్లాలలో పెక్కు పొలాలలో గొడుగుపట్టుకుని నిలుచున్న ఒక వ్యక్తి బొమ్మ ఉన్న నాటిన బండలు కనిపిస్తాయి. ఈ భూములకు గొడుగు పాలుని భూములని పేరు. ఈ భూముల కవుల్లకట్టలో 'గొడుగుపాలుని భూముల పత్రాలు' అనే కాయితాలు ఉండేవి. దొణ్ణె అంటే బాణా కట్టె. బాణా కట్టె ఎప్పుడూ ధరించి రాయలకు అంగరక్షకుడుగా ఉన్న ఇతని పేర నేటికీ ఒక ఊరుంది. ఈ దొణ్ణే నాయకునిపురం క్రమంగా దణాపురంగా మారింది.

తాడిమర్రి సంస్థానాధీశులు బ్రిటిష్‌వారిని ఎదిరించి జరిపిన పోరాటంలో వారి గురువులైన మా పూర్వులు అగ్రశ్రేణిలో ఉండి, మంత్రాలు చదువుతూ రాజులను ప్రోత్సహించారు. తాడిమర్రి సంస్థానం కూలిపోగానే మా ముత్తాతగారు - రామస్వామి తాతాచార్యులు తమ అత్తవారి ఊరైన బళ్లారి జిల్లా హోస్పేట తాలూకా కమలాపురానికి వలస వెళ్లారు. వారి అత్తవారి ఇంటి పేరు ప్రబంధం. వీరు విజయనగరంలోని కృష్ణస్వామి, కోదండరామ, పట్టాభిరామాది విష్ణుదేవాలయాలలో దివ్యప్రబంధపారాయణం కోసం తంజావూరు - బహుశా కుంభకోణం నుంచి విజయనగరానికి వలస వచ్చారు.

# ౨

# కమలాపురం

**మా కమలాపురానికి కామలాపురమని వ్యవహారం. కడప జిల్లాలో ఒక కమలాపురం ఉన్నందున కొంత వ్యత్యాసం చూపడం కోసం దీనిని కామలాపురం అన్నారని అంటారు. ఈ కమలాపురం ఒక పెద్ద చెరువుగట్టున ఉంది. ఈ చెరువు అర్ధవృత్తం ఐదారు మైళ్లు. విజయనగర సార్వభౌముల రాణులు తమ దేవతాపూజా పురస్కారాల కోసం ఈ చెరువులో కమలాలు పెంచేవారట. అందువల్ల దీనికి కమలాపురం అని వ్యవహారమైందట. ఇప్పటికీ ఆ చెరువు ఉంది. కమలాలు మాత్రం లేవు.**

మా ఇంట్లో తుప్పుపట్టిన కత్తులూ, బల్లేలూ, విరిగిపోయిన పాతకాలపు తుపాకులు; ఒక పాత వస్తువులున్న గదిలో ఉండేవి. విరిగిపోని ఇనుపగుండ్లూ ఉండేవి. అవి నాటు ఫిరంగులలో దట్టించి పేల్చేవారు. మా ఇంట్లో వాడుతున్న విరిగిన ఇనుపగుండు కూడా ఫిరంగి గుండే!

"ఇదీ విరిగిన ఇనుపగుండు గాథ!" అన్నారు మా తాతగారు. మా తాతగారిది పొడుగూ పొట్టీ కాని కాయవాటు శరీరం. స్ఫురద్రూపం. నాటకాంత సాహితి. మంత్రశాస్త్రంలో నిష్ణాతులు. వైద్యంలో మంచి ప్రవేశం గలవారు. మా ఇంట్లో మూడు కుప్పెలు ఉండేవి - ఒకటి ఎర్రది, మరొకటి నల్లనిది, ఇంకొకటి మెరిసే లేత పసుపు రంగుది. ఎర్రటిది సువర్ణ మందార రసం. జ్వరంతో ఎవరైనా వస్తే మా తాతగారు

నాడిచూచి అర్ధగ్లాసు అల్లం పొంగురసంలో ఆనందభైరవి కుప్పెను మూడు నాలుగుసార్లు అరగదీసి ఇచ్చేవారు – మూల మంత్రంతో – 'ఓం నమో నారాయణాయ' అంటూ. అరగ్లాసు అల్లంరసం గదా! జ్వరం ఆరిపోక ఛస్తుందా? వాత గజాంకుశం సూతికవాతాలకు, పిల్లల జబ్బులకూ వాడేవారు. సువర్ణ సిందూర రసాన్ని జ్వరాదులు ఆగిన తర్వాత బలం పుంజుకోడానికి వాడేవారు. 'గరళం' అనే హెచ్చరిక చీటీతో ఒక దంతపుబరిణె ఉండేది. అది నాగుబాము విషమని, సన్నిపాతాలలో, ప్రాణాంతకమైన సమయాలలో వాడాలని అనేవారు. వాడింది నేను చూడలేదు.

మాకు శిష్యసంచారం ఉండేది. సంవత్సరంలో ఒకప్పుడు శిష్యసంచారం చేసేవారు. ఆ సంచారం హడావుడి చాలా రంజకం. ఇంట్లో ఒక పెట్టెబండీ, ఒక సాధారణమైన రెండెడ్ల బండీ, ఒక ఒంటెద్దు బండీ, నాలుగు ఎడ్లూ, మూడు నాలుగు ఆవులూ ఉండేవి. "శ్రీమద్రాజాధిరాజ, రాజపరమేశ్వర విజయనగర సార్వభౌమ గురుస్వామిగళు" అనే వెండిబిళ్ల బంట్రోతు వెండి బెత్తంతో ముందు నడవగా, పెట్టెబండీలో సంచారానికి వెళ్లేవారు. వెంట మరొక నౌకరు. నా చిన్నతనంలో ఉన్న నౌకరు పేరు గిరియ. అతడు మా తాతగారి చిన్ననాటి నుంచి ఉన్నవాడు. అతనికి మూడుపూటల భోజనం, గోనెపట్టా, దుప్పటి, నెలకు రెండు రూపాయల జీతం. గిరియ మా తాతగారికి 60 ఏళ్ల ప్రాయం వరకూ ఉన్నాడు. పదవ ఏట మా ఇంట్లో కుదిరాడు. యాభై సంవత్సరాల జీతం పన్నెండు వందలూ, మరొక వందా పుచ్చుకొని వెళ్లిపోయి హరపనహళ్లి తాలూకాలోనో, మరెక్కడో వంద ఎకరాల మెట్టకొని, కొడుకులను పెద్దభూస్వాములను చేశాడు.

అతని కొడుకు హొళెయ యువకుడు. మా ఇంట్లో కుదిరాడు. మరొక వస్తాదు భీమ్‌సింగ్ ఉండేవాడు. అతని పని పైపై పనులు చేయడం. హొళెయ పని వ్యవసాయంపై తనిఖీ. మాకు కమలాపురం చెరువుకింద, బుక్కరాయల పేరుతో తవ్విన బుక్కసాగరం కింద, కొన్ని భూములు ఉండేవి. వాటిని మేము స్వయంగా సేద్యం చేసేవాళ్లం. కోలాచలం వెంకటరావుగారు వంటి బళ్లారి పెద్దల భూములూ గుత్తకు చేయించేవాళ్లం.

నాకు తెలివి వచ్చినప్పటి నుంచి మా వాళ్లంతా కాంగ్రెస్‌వాదులు. ఖద్దరే కట్టేవారు. ఇంట్లో నాలుగైదు రాట్నాలు ఉండేవి. మా తాతగారు జింక చర్మపు సంచులలో పట్టుగుడ్డలతో బెల్గాం కాంగ్రెస్ మహాసభలకు వెళ్లివచ్చారు. మా తాతగారు బాలగంగాధర





తిలక్ అనుయాయులు. ఇంతకూ తాతగారి పేరు చెప్పలేదుగదూ! తిరుమల తాడిమర్రి నరసింహాచార్యులు.

తాడిమర్రిలో ఇల్లు నేలమట్టమయిన పిదప రెండు శతాబ్దాల వరకూ దిబ్బగానే ఉంది. దాదాపు వంద గజాల పొడవు, యాభై గజాల వెడల్పు దిబ్బ. గురువులయ్య దిబ్బ అనేవారు. దానిని రెండు దశాబ్దాల క్రితం మా అమ్మ నామమాత్రపు ధరకు అమ్మివేసింది.

**సారాసార పరిచ్ఛేత్తా**
**స్వామీభృత్యస్య దుర్లభః!**
**అనుకూల శ్శుచి ర్దక్షః**
**ప్రభోః భృత్యో పి దుర్లభః!**

(భృత్యుని శక్తిని, దౌర్బల్యాన్ని గుర్తించే యజమాని ఉండడం కష్టం. అలాగే అనుకూలుడు, మనసా వాచా కర్మణా పరిశుద్ధుడు, సమర్థుడు అయిన సేవకుడు యజమానికి దొరకడమూ కష్టమే!)

**గురూన్ కుర్వంతి తే వంశ్యాన్**
**అన్వర్థా తై ర్వసుంధరా**
**యేషాం యశాంసి శుభ్రాణి**
**హ్రీపయంతీందు మండలమ్**

**(వారి తెల్లని, నిష్కళంకమైన కీర్తి చంద్ర మండలాన్ని సిగ్గిలజేస్తుంది. వారివల్ల ఈ వసుంధర సార్థకనామధేయ అయింది. వారెవరు? వంశాలను, వంశాలలో పుట్టిన వారిని గొప్పగా చేసేవారే వారు!)**

నేను మా మాతామహుల ఇంట్లో పుట్టాను. నేను పుట్టినప్పుడు దేవదుందుభులు మోగలేదు. పుష్పవర్షాలు కురియలేదు. ప్రసన్న సుగంధ గంధవాహాలు వీయలేదు. అట్లని భయంకరంగా పిడుగులు పడలేదు. భూమి కంపించలేదు. గిరులు దుల్లలేదు, ఉల్కలు రాలలేదు. తోకచుక్క అసలే కనిపించలేదు.

నేను పుట్టాను. కొన్ని వేల మంది పుట్టినట్టుగా, కొన్ని లక్షల మంది, కోటాను కోట్ల మంది పుట్టినట్లుగా పుట్టాను. అంతే... ఇంటిల్లిపాదీ సంతోషించారట. మా మాతామహుల ఇంటిపేరు ప్యారంగూర్‌వారు.

ఈ ప్యారంగూర్ (తమిళనాడు) దక్షిణ ఆర్కాటు జిల్లాలోనో, సేలం జిల్లాలోనో ఉన్న గ్రామం. అక్కడి నుంచి కొన్ని శ్రీవైష్ణవ కుటుంబాలవారు బెంగుళూరు మీదుగా తాడిమర్రి రాజ్యానికి వలసవచ్చారు. వారిలో గార్గ్యగోత్రం వారు ఒకరు. వారు సదాచార సంపన్నులు, విద్వాంసులు. వారిలో ఒక గృహిణి పేరు రాఘవమ్మ గారు. ఏభయ్యోపడి దాటినవారు. కుంకుమశోభితలు.

తాడిమర్రి పాలకుడు ఒకనాడు వేటకు వెళ్లాడు. సూర్యుడు నడినెత్తి నుంచి పడమటకు జారుకుంటున్నాడు. రాజు వేటలో అలసిపోయాడు. ఆకలి బాగా దంచి వేస్తోంది. సహచరులు, అనుచరులూ కూడా దూరమయ్యారు. చిన్న పల్లె సివారులో ఒక ఇల్లు

కనిపించింది. బ్రాహ్మణులదిగా అనిపించింది. ఆకలిగొన్న రాజు ఆ ఇంటిముందు ఆగి "అమ్మా! ఆకలిగొన్నాను" అన్నాడు. ఆ మాటలు విని ఇల్లాలు వెలుపలికి వచ్చింది. ముంగిట్లో నిలుచున్న అతనిని చూసింది. వేట దుస్తులలో ఉన్నాడు. ఎవరో గొప్ప ఇంటివాడనిపించింది. "నాయనా! ఇదిగో, ఈ పంచె కట్టుకొని ఆ దిగుడుబావిలో స్నానం చేసిరా, అన్నం వడ్డిస్తాను." అన్నది. రాజు బయలుదేరాడు.. కాని అన్నానికి ఆధరువు ఏదీ? మజ్జిగ మాత్రం కనిపించింది రాచిప్పలో. పెరడులోకి వెళ్ళింది. అక్కడ అల్లుకున్న అటిక మామిడాకు పోచలు కొన్ని లాగింది. శుభ్రంగా కడిగి, బాణలిలో వాడ్చి, చింతపండు, బెల్లం, పచ్చిమిరపకాయలు, ఉప్పు కలిపి రోట్లోవేసి నూరింది. నెయ్యి తిరగమోత పెట్టింది. పెరడులోని మోదుగాకులు తుంపి కడిగి, విస్తరి కుట్టింది. ఉన్న అన్నానికి తోడు మరి కొంత అన్నం ఎసరు నుంచి దింపి వార్చింది.

రాజు స్నానంచేసి వచ్చాడు. "నాయనా! పచ్చడీ, మజ్జిగా తప్ప మరేమీ లేదు. ఎలా ఉంటుందో ఏమో! ఏమీ అనుకోవద్దు!" అంటూ ముంగిట్లో స్థల శుద్ధిచేసి, విస్తరివేసి, అన్నం, అటిక మామిడాకు పచ్చడీ వడ్డించింది. రాజు భోజనానికి కూర్చున్నాడు. పచ్చడి అమృతంగా ఉంది. రెండుసార్లు కలుపుకొని తిన్నాడు. మజ్జిగ పోసుకున్నాడు. సంతృప్తిగా లేచి, ఎంగిలి విస్తరి తీసి బయటపారేసి, గోమయంతో శుద్ధిపెట్టాడు. చతికిలపడ్డాడు. 'పచ్చడి ఇంత అమృతప్రాయంగా ఉందే, ఏమిటిది' అని తనలో తనే అనుకుంటున్నాడు. రాఘవమ్మగారు ఎంతో సంకోచపడుతూ, "నాయనా! నీవెవరో నాకు తెలీదు. వేళగాని వేళ వచ్చావు. పచ్చడి మెతుకులు పెట్టినందుకు బాధపడుతున్నాను" అని అన్నారు. రాజు ఇక వెళదామని లేస్తూ, "అమ్మగారూ! అమృతం వంటి భోజనం పెట్టారు. పచ్చడితో ఇంకా తిందును. కాని కడుపులో చోటులేదు. వస్తానమ్మా, ఆశీర్వదించండి" అని సాగిలపడ్డాడు. రాఘవమ్మ గారు ఆనందబాష్పాలతో "శ్రియః పతి, రంగనాయకుడు, యదుగిరీశుడు నీకు సకలకల్యాణాలు అనుగ్రహించుగాక!" అని ఆశీర్వదించారు.

వారం గడిచింది. "రాఘవమ్మగారి ఇల్లు ఇదేనా?" అంటూ రాజభటులు వచ్చారు. రాజభటులను చూచి భయపడిపోయారు ఇంటిల్లిపాదీ. రాఘవమ్మగారి భర్త అపుడు పొరుగూరు వెళ్లారు. పిల్లలు గాభరాపడ్డారు. ఏదో వేదాధ్యయనం, దివ్యప్రబంధపాఠం చేసుకుంటూ ఉండే వైదిక వైష్ణవులకు రాజులతో పనేమీ? రాఘవమ్మగారు ముంగిట్లో

నిలబడిన రాజసేవకులను చూచారు. కొంచెం భయమే కలిగింది. ఇంట్లో పెద్దలు లేరు. ఏమి చేయడానికీ తోచకపోయినా వాళ్ళను గౌరవించాలిగదా.. పలకరించారు.

"అమ్మగారూ! తమరేనా రాఘవమ్మగారు? తాడిమఱ్రి దొరవారు తమను తమ పెద్దలతోపాటు ఆస్థానానికి రమ్మని సెలవిచ్చారు. మీ తీరికనుబట్టి రెండు మూడు రోజుల్లో దయచేయండి" అని సందేశం తెలిపారు రాజభటులు.

"మాతో రాజుగారికి ఏమిపని నాయనా? మేము ఏదో మా పనిపాటలలో ఉంటాము. రాజకార్యాలు మాకేముంటాయి నాయనా?" అని అన్నారు రాఘవమ్మగారు.

"అమ్మగారూ! మాకేం తెలుసునండీ, వార్త అందచేయడం బంట్లపని" అంటూ వారు నమస్కరించి వెళ్లిపోయారు.

రాఘవమ్మగారికి ఏమీ పాలుపోలేదు. భర్త వచ్చిన తర్వాత ఈ సంగతి చెప్పారు. ఆయన సీదాసాదా శ్రీవైష్ణవుడు. రాజాజ్ఞ పాటించక తప్పదు. మరుసటి రోజే బయలుదేరారు. తాడిమఱ్రికి; తిరుపగూడలో అవసరమైన వస్తువులు పెట్టుకొని. రాజు మొదట్లోనే అధికారులకు ఆనతి ఇచ్చి ఉంటారు. అధికారులు వారెవరో తెలియగానే లోపలికి పొమ్మన్నారు. రాజు తన ఆప్తులతో ముచ్చటిస్తున్నాడు. వారిని చూడగానే లేచి ఎదురువచ్చి గౌరవించి కూర్చోబెట్టాడు.

ఇద్దరికీ అయోమయగా ఉంది. రాజు దగ్గరికి వచ్చాడు మరింతగా. "అమ్మగారూ! గుర్తుపట్టలేదా నన్ను" అని రాఘవమ్మగారిని ప్రశ్నించాడు.

"నాయనా! ఎప్పుడూ చూచిన గుర్తులేదు. రాజుగారు రమ్మంటే వచ్చాము. ఏం అపరాధమో! రాజుగారిని కలుసుకోవడం ఎక్కడో?" అని అడిగారు రాఘవమ్మ గారు. "అమ్మగారూ! నేనూ వారం క్రితం మీ ఇంటికి వచ్చాను. భోజనం చేశాను. మీరు వడ్డించిన పచ్చడి చాలా బాగుంది. అప్పుడే నన్ను మరిచిపోయారా?" అంటూ నవ్వాడు రాజు. రాఘవమ్మగారికి ఆశ్చర్యమేసింది.

"చాలా సంతోషం నాయనా! తెలిసినవాడివి ఉన్నావు. రాజుగారు ఎందుకు పిలిచారో కనుక్కుని చెప్పు అని కోరారు.

రాజు వారిని కొంచెంసేపు ఆటపట్టిద్దామనుకుని, "అమ్మగారూ! దానికేమి లెండి. రాజు నేను ఎంత చెబితే అంత. భయపడకండి. అయినా ఎందుకు పిలిపించారబ్బా! నాతో అనను కూడా అనలేదు. ఏంపనో! ఏమిటేమిటి! భూముల శిస్తు గిస్తు బాకీ

వుందా? ఆస్తుల కోసం పోట్లాడారా? అన్నాడు భుజాలు ఎగరేస్తూ.

"రామ రామ! మాకు ఆస్తులా! పోట్లాడడమా? పంపకాలా! కొద్దిగా పొలం ఉంది. మేమిద్దరం. ఒక పిల్లవాడు. పెరుమాళ్లను ధ్యానిస్తూ కాలక్షేపం చేస్తున్నాం" అన్నారు రాఘవమ్మగారి భర్త. ఆమె మధ్యన కలుగజేసుకుని "నాయనా! మాకు అంతగా ఆస్తిపాస్తులుంటే నీకు ఆనాడు పచ్చడి మెతుకులు పెడతానా?" అన్నారు. "సరే. కొంచెంసేపు విశ్రాంతి తీసుకోండి. సాయంత్రం కొలువు తీరుస్తారు. అక్కడికి మిమ్ముల్ను పంపే ఏర్పాటు చేస్తాను. ఏం గాభరా పడకండి" అన్నాడు రాజు.

సాయంకాలం కావచ్చింది. "రాజుగారి దర్బారుకు దయచేయండి" అంటూ ఒక భటుడు వచ్చి రాఘవమ్మగారికి మనవి చేశాడు. వాళ్లు భయపడుతూ దర్బారులో ప్రవేశించి, తమను కూర్చోమన్న ఆసనాలపై కూర్చున్నారు. రాజు రాజలాంఛనాలతో ప్రవేశించాడు. రాఘవమ్మగారికి ఈ వ్యక్తిని ఎక్కడో చూచినట్లుందే అనే అనుమానం కలిగింది. ఆలోచిస్తున్నారు. అంతకుముందు తమతో మాట్లాడిన వ్యక్తే అనే ప్రత్యభిజ్ఞ రాలేదు. అంతలో దర్బారు అధికారి "సద్దు సద్దు" అని అంటూ కేకవేశాడు. రాజు ఆజ్ఞతో మరొక అధికారి రాఘవమ్మ దంపతులను రాజు దగ్గరికి పిలుచుకొని వెళ్లాడు. రాజులేచి, వారం క్రితం జరిగిన సంఘటన అందరికీ వినబడేట్లు చెప్పి, రాఘవమ్మగారి ఆతిథ్యానికి కృతజ్ఞతగా ఒక పల్లెను సర్వహక్కులతో దానమిస్తున్నట్టు ప్రకటించాడు. ఆస్థానంలో ఉన్నవారంతా సంతోషంతో జయజయధ్వనులు చేశారు. ఆనాడు పచ్చడి మెతుకులు తిన్నవాడే రాజని తెలిసి భయాశ్చర్యసంతోషాలు ముంచుకు రాగా స్థాణువయి పోయారు రాఘవమ్మగారు.

ఆ పల్లె శ్రోత్రియం. అంటే శ్రోత్రియులకు, వేదాధ్యయనపరులకు, యజ్ఞ యాగాదులు చేసేవారికి ఇచ్చే గ్రామం. అది తాడిమర్రికి పది పన్నెండు మైళ్ళ దూరంలో ఉంది. రాఘవమ్మగారి కుటుంబం ఆ గ్రామానికి మారారు. ఒక ఏడెనిమిది గదుల ఇల్లు కట్టించాడు రాజు. పక్కన వారి జ్ఞాతులు ఉండడానికి మరొక ఇల్లు ఏర్పాటయింది. ఆ ఊరికి 'రాఘవమ్మ పల్లె' అని పేరు పడింది. అది జనం నోటిలో నాని అరిగి 'రాగంపల్లె' అయింది.

ఈ రాగంపల్లి వారు మా మాతామహులు. ఆయనకు ఒక కుమారుడు, ఆరుగురు కుమార్తెలు. వారిలో మూడవ కుమార్తె మా అమ్మ జానకమ్మ. మా మేనమామ పేరు

తిరునారాయణాచార్యులు. మా మాతామహుని పేరు వెంకట రాఘవాచార్యులు. ఆయన శ్రోత్రియందారు. గ్రామాధికారం ఆయనదే. కనుక జమాబందీ కనీ, దానికనీ, దీనికనీ, వచ్చే అధికారులకు సామగ్రి సమకూరుస్తూ వ్యవసాయం చూసుకుంటూ, తమ నిత్యకర్మానుష్ఠానాలకు ఏ లోపము రాకుండా జీవితం గడిపారు. ఆయన పెద్ద కుమార్తె, మా పెద్దమ్మ, ఆంధ్ర నాటక పితామహులు ధర్మవరం రామకృష్ణమా చార్యుల వారి పెద్ద కోడలు. మా మాతామహుడు విద్వాంసులే. జ్యోతిషంలోను దిట్ట. అయినా రచన లేమీ చేయలేదు. మా మేనమామ తిరునారాయణాచార్యులు సంస్కృ తాంధ్ర ద్రావి డాలతోపాటు ఇంగ్లీషూ చదివారు.

మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణులై రెవెన్యూ శాఖలో కొంతకాలం ఉద్యోగం చేశారు. ఆ ఉద్యోగంలోనే ఉండి వుంటే శ్రీరాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులలాగ డిప్యూటీ కలెక్టరుగా రిటైరయ్యేవారు. కాని శ్రోత్రియందారు. అప్పటి బ్రిటిష్ అధికారుల అధికారం నచ్చక రాజీనామా యిచ్చి శ్రోత్రియం వ్యవహారాలు చూచుకొంటూ, పిల్లలకు ఇంట్లోనే హిందీ, ఇంగ్లీషు, సంస్కృతాలు బోధిస్తూ వారినందరినీ గొప్ప విద్యావంతులను చేశారు. ఆయనకు ఆరుగురు కుమార్తెలు, ఇద్దరు కుమారులు. పెద్ద కుమారుడు రంగాచార్యులు హైస్కూలు ప్రధానోపాధ్యాయులుగా పదవీ విరమణ చేశారు. రెండవ కుమారుడు కృష్ణమాచార్యులు భోపాలులో మౌలానా ఆజాద్ కాలేజ్ ఆఫ్ టెక్నాలజీ (ఎం.ఏ.సి.టి) ప్రాంశుపాలుడు (ప్రిన్సిపాల్).

నేను మా మాతామహుల ఇంట్లో ప్రమాదీచ నామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ చతుర్దశి మంగళవారం రాత్రి పదిగంటలకు పుట్టాను. మా మాతామహులు ఆకాశం చూస్తూ నక్షత్రాలు లెక్కపెడుతున్నారట. నక్షత్రాలు చూచి జాతకం కట్టారు. జ్యేష్ఠనక్షత్రం. ఇంత ఆసక్తి మాతామహునికి ఎందుకు కలిగిందంటే, ఇంటిలో పుట్టిన తొలి మగబిడ్డను నేను. కనుక నా పెద్దమ్మలకూ, పిన్నమ్మలకూ ఆసక్తి.

మా మాతామహుడు చాలా సాహసవంతుడు. ఆయనను గురించిన సాహస గాథలు ఎన్నో ఉన్నాయి. ఒక దానిని పేర్కొంటాను.

రాగంపల్లె చిన్నవూరు. మొత్తం ఆరేడు వీథులు. ఒకమారు, దోపిడీ దొంగలు పడ్డారు ఇంట్లో. చుట్టుపట్టు రైతులను పిలవాలి. బాహాటంగా పోవడానికి అవకాశం లేదు. అప్పుడు ఆయన కంబడి కప్పుకొని 'మే మే' అంటూ మేకలాగా కాళ్లు చేతులపై

పాకుతూ రైతుల ఇండ్లకు వెళ్ళి, వాళ్ళను లేపారు. అందరు ఒక్కుమ్మడిగా లేచి కర్రలు గొడ్డళ్లు పట్టుకొని రాగా, దోపిడి దొంగలు ఉడాయించారు. రైతులు తమ శ్రోత్రియందారు తెలివి తేటలను చాల మెచ్చుకున్నారు. ఇలాటివి ఎన్నో!

మా మాతామహుడు ఏదో జబ్బుతో ఉన్నట్టున్నారు. బయటి వసారాలో ఆయన పక్క. ఆయన లోపలికి రాబోయారట. నేను తుమ్మానట. నా వయస్సు ఆరు నెలలట. "తాడిమర్రి సంస్థాన గురువు తుమ్మాడు. నేనిక లోపలికి రాగూడదు" అని అలాగే వుండిపోయారట. జబ్బు ముదిరింది. ఆయన లోపలికి అడుగు పెట్టకనే పరమపదించారట. జ్యేష్ఠ నక్షత్రంలో జననం ఇంటి పెద్దను బలి తీసుకుంటుంది - అని మా అమ్మ అనేది. నేను త్రిజ్యేష్ఠం అందులోను. జ్యేష్ఠ పుత్రుణ్ణి, జ్యేష్ఠానక్షత్రం, జ్యేష్ఠమాసం.

నేను ఆరుగురు తల్లుల చేతుల్లో అల్లారు ముద్దుగా పెరిగాను. నాకు నా మూడేళ్లనాటి నుంచి జరిగిన సంఘటనలు చాలా వరకు జ్ఞాపకమున్నాయి. రాగం పల్లెలో వీధిబడి



పంతులు చల్లా సుబ్బారాయుడు. అతనికి ఒక కాలు అవుడు. కనుక కుంటి సుబ్బారాయుడు అనేవారు. కమ్మ కులస్థుడు. వైష్ణవ మతం. మూడో సంవత్సరంలో అక్షరాభ్యాసం మా మేనమామ చేశారు. ఆయన హస్తవాసి మంచిదనే అన్నారు. అక్షరాభ్యాసం లాంఛనమే. నేను వ్రాసిందేమీ లేదు. పలకా బలపం పట్టుకొని, చల్లా సుబ్బారాయుడు అమరం శ్లోకాలు, ఆంధ్రనామసంగ్రహ పద్యాలూ వినిపించేవారు. మా అమ్మ స్తోత్రశ్లోకాలు చెప్పేది. నేను వాళ్ల మాట విని అప్పుడు చిలకపలుకుల్లాగ పలికినా, జ్ఞాపకం పెట్టుకొనే ప్రయత్నం చేయలేదు. మా అమ్మకు మాత్రం నేను గొప్ప విద్వాంసుణ్ణయిపోవాలనే పేరాస ఉండేది. మా పెద్దమ్మలు పిన్నమ్మలు హాస్యం చేసేవారు అమ్మను. అప్పుడామె వయస్సు పదిహేడు సంవత్సరాలు. నేను ఆమెకు పధ్నాలుగవ ఏట పుట్టాను.

మాతామహుణ్ణి మింగివేశాడు - అని వచ్చేపోయే బంధువులు చెప్పినప్పుడు మా అమ్మకంట తడి పెట్టేది. నాకు బాగా జ్ఞాపకం. అప్పుడు ధర్మవరం వారి నాటకం ఒకటి ధర్మవరంలో ఆడారు. దానిలో పాత్ర "తల్లీ నీకు తల్లడ మేల తనయుడ నేనుండన్" అని తల్లిని ఓదార్చుతుంది. ఆనాడు నాటకం చూడడానికి మా అమ్మలందరూ వెళ్లారు. అప్పుడా పాట నన్ను ఆకర్షించి మా అమ్మ విచారంగా వున్నప్పుడల్లా వచ్చీరాని రాగంతో "తల్లి నీకు తల్లడమేల్, దనయుడు నేనుండన్" అని పాడేవాడిని. అందరూ నవ్వేవారు. నవ్వు ప్రశంసగా భావించి నేను పదే పదే పాడేవాడిని. మా అమ్మ నన్ను దగ్గరికి తీసుకొని నోరు మూసేది.

కారణమేమిటో చెప్పలేనుగాని, నాకు మూడో ఏడు పడేవరకూ రాగంపల్లె లోనే వున్నట్టు గుర్తు.

చెప్పడం మరిచాను. ధర్మవరం రాగంపల్లెకు ఏడెనిమిది మైళ్ల దూరంలో వుంది. మేము నాటకం చూచి చుట్టాలింట్లో పడుకుని, ఉదయం భోజనాదుల తర్వాత బండిలో తిరిగి వస్తున్నాము రాగంపల్లెకు. నాలుగు మైళ్లు దాటామో లేదో, బండి ఏదో రాయికి ఎదుపుకుని వాటుపడింది. బండిలో మా అమ్మలు నలుగురైదుగురు, పిల్లలు హాహాకారాలు చేశారు. బండి పూర్తిగా తలకిందులయింది. బండివాడు ఎద్ల మెదలు నొక్కుకుని పోకుండా వెంటనే నొగలు విప్పివేసి, కింద ఒకరి మీద ఒకరు పడి కూరుకుపోయిన పిల్లలను లేపుతూ పెద్దవారిని లేవమంటూ హడావుడి చేశాడు. కొందరికి మంచి గాయాలే

తగిలాయి. పక్కన పొలాలలోని నీళ్లు తెచ్చి, గాయాలు కడిగి తడిగుడ్డలు కట్టాడు. బండిని సరిచేసి నెమ్మదిగా తోలుతూ సాయంకాలానికి ఇల్లు చేర్చాడు. అక్కడ ముందుగా పల్లెవారి వల్ల వార్త విన్న మా అమ్మమ్మ, మేము చేరగానే దిష్టి తీసి పసుపు తడిపి పుళ్లకు రాచి కట్టుకట్టింది. దోక్కొని పోయినవారి అవయవాలకు ఆముదం రాచింది.

**'త్యాగ ఏకో గుణః శ్లాఘ్యః**
**కిమన్యైః గుణరాశిభిః**
**త్యాగ జ్జగతి పూజ్యంతే**
**పశుపాషాణ పాదపాః**

**(త్యాగ మొక్కటి చాలు - అదే పొగడదగిన గుణం. తక్కిన గుణాలు ఎందుకు? త్యాగం వల్లనే లోకంలో పశువులు, రాళ్లు, చెట్లు పూజలందుకుంటున్నాయి.)**

# 3

# ఈశ్వరయ్యనవరు

"విదుషాం వదనా ద్వాచః
సహసా యాంతి నో బహిః
యాతాశ్చే న్న పరాఞ్చంతి
ద్విరదానాం రదా ఇవ."

**(విద్వాంసుల ముఖం నుంచి త్వరగా మాటలు వెలుపలికి రావు. వెలుపలికి వచ్చాయా ఏనుగు దంతాలలాగ మళ్లీ వెనక్కిపోవు.)**

**నా**కు బాగా గుర్తుంది. నాకు ఏడుపడగానే నన్ను బడిలో వేశారు. అది వీధిబడి. కిండర్ గార్టన్లు, ప్రీ ప్రైమరీలు అప్పుడు లేవు. మా కమలాపురం ప్రాంతం వీరశైవ (లింగాయత) ప్రాబల్యం ఉన్న ప్రాంతం. దాదాపు వీధిబడుల పంతుళ్లందరూ లింగాయతులే. లింగాయతులు బ్రాహ్మణులతో పోటాపోటీతో సంస్కృతం చదువు కున్నవారు. శాస్త్రపాండిత్యం, వీరశైవాగమ సిద్ధాంత పాండిత్యం బాగా ఉన్నవారు.

మా ఇంట్లో తమిళ, తెలుగు భాషలు. మాట తమిళం, సంస్కృతి తెలుగు. ప్రాంతీయ భాష కన్నడం. వ్యవహారభాష గనుక అది అవసరం. లింగాయతుల, వీధిబళ్లలో చదువు 'యస్యజ్ఞానదయా సింధో'తో ప్రారంభించేవారు. వారి సంస్కార మంతా వైదిక సంస్కారమే. అవసరమైతే తెలుగూ చెప్పేవారు. కాని కన్నడానికే ప్రాధాన్యం.

నా చిన్నతంలో బళ్లారి జిల్లాలో చదువు తమాషాగా ఉండేది. బళ్లారి జిల్లాలోని ఎనిమిది తాలూకాలలో ఆలూరు, ఆదోవాని, రాయదుర్గం, బళ్లారి తాలూకాలు 95 శాతం తెలుగు. కాని బళ్లారి తాలూకా తెలుగే అయినా, వ్యాపారసాపారాలు కన్నడుల వశంలో ఉండేవి. తక్కిన తాలూకాలలో కూడ్లిగి, హరపనహళ్లి పూర్తిగా కన్నడ తాలూకాలు. హోస్పేట, కొడితిని తాలూకాలు సగం తెలుగు, సగం కన్నడం. ఒక

విధంగా కన్నడుల సంఖ్య కొద్దిగా ఎక్కువైనా, సంస్కృతి మాత్రం తెలుగు సంస్కృతే. మా ఊరు హోస్పేట తాలూకాలోది. కనుక తెలుగు కన్నడాలు దాదాపు సగం సగం వున్నా, లింగాయత ఉపాధ్యాయుల వీధి బడులలో కన్నడమే ముఖ్యం.

మా యింటి ఎదుటి వరుసలో వీరభద్రుని గుడి నాలుగో కట్టడం. ఆ గుడిలోనే బడి. దాదాపు 30, 40 మంది విద్యార్థులు ఉండేవారు. ఉపాధ్యాయులు ఈశ్వరయ్యనవరు. వారు మధ్యవయస్కుడు. అందమైనవాడే. ఎర్రటి ఫాలంపై మూడు విభూతి రేఖలు. మెడలో ఒంటి రుద్రాక్ష, లింగకాయ, పంచకట్టు, షర్టు, కన్నడుల కోర తలపాగ. మెడలోని లింగకాయ, షర్టులో రొమ్ముమీద, షర్టు జేబుల మధ్య కదలాడుతూ ఉండేది. స్వచ్ఛమైన వాక్కు. చేతిలోని పేముబెత్తం మెరుపుతీగ లాగ క్షణక్షణమూ మెరిసేది. ఈశ్వరయ్యనవరు సమర్థులయిన పంతులు, దయాళువు. కాని శిక్ష కఠినంగా ఉండేదని అనేవారు. ఆయన కూర్చొని పాఠం చెప్పడం నేను చూడలేదు. ఎప్పుడూ నిలబడి, బెత్తం జళిపిస్తూ ఉండేవారు.

మా ఊళ్లో బోర్డు మిడిల్ స్కూలు, ప్రైమరీ స్కూలు – ఎలిమెంటరీ స్కూళ్లు వుండేవి. వాటిలో చదువు తమాషాగా వుండేది. జిల్లా బోర్డు అధ్యక్షుడు తెలుగువాడు ఎన్నికయితే, జిల్లాలోని బోర్డు స్కూళ్లలో తెలుగులో బోధన జరిగేది. కన్నడంవారు ఎన్నికయితే కన్నడంలో జరిగేది. ఆ స్కూళ్లపైన పెద్దలకు విశ్వాసం లేదు. అక్కడ చదువు పునాది గట్టిగా వుండదని సందేహం. కనుక నన్ను వీరభద్రుని బడిలోనే వేశారు.

నన్ను బడిలో వేసిననాడు మా వీధంతా పెద్ద పండుగ కోలాహలంతో నిండి పోయింది. గురుస్వామిగళు మనుమడు బడికి వెళ్లడం కదా! నాకు తెల్లటి చల్లడం (నిక్కరు వంటిది), పొట్టి షర్టు తొడిగినట్టు గుర్తు. కాళ్లకు వెండి కడియాలు, చేతులకు బంగారు కడియాలు, శ్రీచూర్ణరేఖ నుదిటిపైన, మా అమ్మ నన్ను నడిపించుకొని రాగా, ముందు మా తాతగారు, నాన్నగారు నడిచారు. ఈశ్వరయ్యనవరు మా తాతగారికి ఎదురువచ్చి స్వాగతం చెప్పారు. మా అమ్మ నన్ను మా తాతగారి వద్దకు నడిపించింది. తాతగారు నాతోపాటు బడిలో ప్రవేశించి, ఈశ్వరయ్యనవరికి అప్ప గించారు నన్ను. అమ్మ నా పాఠశాలాప్రవేశోత్సవం కోసం చేసిన లడ్లు, చక్కిలాలు బడిలోని విద్యార్థులకు, మూగిన పిల్లలకు పంచింది. మా తాతగారు కొత్త పంచెలు చాపు, తాంబూలం, దక్షిణ, కొబ్బరికాయ పెట్టి బెత్తంతట్ట (పళ్లెం)ను ఈశ్వరయ్య నవరికి అందజేశారు. ఈశ్వరయ్యనవరు నన్ను కూర్చోబెట్టారు.

నాకు మునుపే వైష్ణవ సంప్రదాయ ప్రకారం మూలమంత్రంతో అక్షరాభ్యాసం అయిందని చెప్పాను.

బడి ప్రార్థనతో ప్రారంభమయింది. ఆ ప్రార్థన చాల గొప్పది. సకల మతాల వారికీ సరిపోయేది. దాని మొదటి చరణం మాత్రమే నాకు ఇప్పుడు గుర్తు వుంది.

**జగదీశా నీనె కాయబేకు బాలర**

**హగలిరళు దిన్న ధ్యాన మాడ్పు దీనర**

దీని తెలుగు అనువాదం ఈ విధంగా చేయవచ్చు.

**జగదీశా నీవె కావవలెను బాలుల**

**పగలు రేయి నీ ధ్యానమె చేయు దీనుల**

ఈశ్వరయ్యనవరు ఓం నమఃశివాయ సిద్ధంనమః యస్యజ్ఞాన దయాసింధోః అగాథ స్యానఘా గుణాః సేవ్యతా మక్షయో ధీరాః సశ్రియై చామృతాయచ

అనే అమరసింహుని నామలింగాను శాసనం ప్రార్థన శ్లోకంతో నా చదువు ప్రారంభించారు. అప్పుడు వ్రాత తక్కువ. మౌఖిక పాఠమే ఎక్కువ. లెక్కలు కూడా చాలా వరకు నోటితోనే. ఒక పాతిక పాతిక, రెండు పాతికలు అర, మూడు పాతికలు ముప్పాతిక, ఇలా సంకలన వ్యవకలనాలు సాగేవి. పెద్ద పెద్ద వడ్డీ లెక్కలు కూడా నోటితోనే చేసేవారు.

మూడు రోజులు ముచ్చటగా నా వీథిబడి చదువు సాగింది. నాలుగో రోజు నుంచి ప్రారంభమైంది సమస్య. ఎవడో విద్యార్థి లెక్కలు సరిగా చేయలేదు. ఎక్కాలు తప్పు చెప్పాడు. అంత సౌమ్యులయిన ఈశ్వరయ్యనవరు వీరభద్రు లయ్యారు. చేతిలోని పేముబెత్తంతో 'ఛడీ ఛడీ' అని కొట్టారు. నేను చూస్తూ వుండిపోయాను. మరొకడు తప్పుచేశాడు. వాడికి కోదండం వేయించారు. విద్యార్థి లోకప్పుకు బిగించిన ఇనప ఉయ్యాల కొండ్లను పట్టుకొని వేలాడుతున్నాడు. కింద కంప కూడా పెట్టేవారట. అప్పుడు పెట్టలేదు. నేను చూడలేదు. ఈశ్వరయ్యనవరు వాడిని బెత్తంతో బాదారు. ఏడ్వకూడదు. ఏడిస్తే మరొక దెబ్బ.

ఆ దృశ్యం చూచాను. మొదట ఆశ్చర్యమయింది. పిదప భయం. దాని ఫలితంగా ఏడుపు. చూడలేక ఇటు తిరిగాను. మరొక విద్యార్థి గోడకుర్చీ వేస్తున్నాడు. గోడకుర్చీ అంటే, గోడకు వీపు ఆనించి, కాళ్లు రెండు ముందుకు జరిపి కుర్చీలాగ నిలబడడం. వీపు, తల ముందుకు వంచినా, కాళ్లు కదిలించినా దెబ్బ. ఇక చూడలేకపోయాను. నా

చల్లడం తడిసిపోయింది. ఈశ్వరయ్యనవరు నన్ను పరిశీలిస్తున్నారు. నా చల్లడం తడవగానే కొంచెం గాభరాపడ్డారనుకుంటాను. వెంటనే ఒక విద్యార్థిని మా యింటికి పంపారు. మా అమ్మ మా పనిమనిషి గంగవ్వతో పాటు వచ్చి నన్ను ఎత్తుకొనిపోయి చల్లడం మార్చినట్టు గుర్తు. నా పరిస్థితికి బడిలో విద్యార్థులందరూ భయపడిపోయారు. ఏమైందో వారికి అర్థంకాలేదు.

మరుసటిరోజు బడికి యథాప్రకారం వెళ్లాను. ఈశ్వరయ్యనవరు నన్ను ప్రేమతో పక్కన కూర్చోబెట్టుకున్నారు. "ఒరే! పిల్లలూ గురుస్వామిగళ మనుమడు మన బడిలో చేరాడు. మీరు బాగా చదవండి. కోదండం, గోడకుర్చీలు ఇక వుండవు. వాటిని చూచి గురుస్వాముల మనుమడు భయపడిపోతాడు" అని ప్రకటన చేశారు. పిల్లలకు ఆశ్చర్యం! అంత భయంకరులయిన అయ్యనవరు ఇంతగా ఎలా మారిపోయారని! క్రూరమైన శిక్షలు తప్పినందుకు నా ప్రతిష్ఠ పెరిగింది వాళ్లలో. నా భయం ఈశ్వరయ్యనవరిలో గొప్ప మార్పు తెచ్చింది. ఇది నా గొప్పతనమేమీ కాదు. వారి సౌజన్యం. క్రూరమైన దండనకు అలవాటుపడని పిల్లల మనసు నొప్పించడం ఉదాత్తం కాదని వారు భావించారు. అంతే. బెత్తం దెబ్బలు కూడా పోయాయి. బెదిరింపులు, చిన్నగా తొడపాశాలు, చెంప దెబ్బలు మాత్రం వుండేవి. నాకు ఎప్పుడు అనుభవం కాలేదు. వీరభద్రుని గుడివీధి బడిలో సంవత్సరం చదివినట్టు గుర్తు. అమరం ఒక సర్గ. సోమేశ్వర శతకం (కన్నడం)లో కొన్ని పద్యాలు. ఎక్కాలు ఐదు కంఠపాఠమయినట్టు గుర్తు. వర్ణమాల వ్రాయగలిగాను.

ఇంతలో జిల్లా బోర్డు అధ్యక్షపదవి మారింది. గంగప్పో, మరెవరో తెలుగువారు అధ్యక్షులయ్యారు. బోర్డు పాఠశాలలో తెలుగు అవశ్యపఠనీయమయింది. నన్ను ఎలిమెంటరీ స్కూల్లో చేర్చారు. రెండో క్లాసని గుర్తు. మా ప్రధానోపాధ్యాయులు సాతాని లక్ష్మయ్యగారు. ఆరడుగుల నిలువు. తెల్లటి పంచపై లాంగ్‌కోటు, ఉత్తరీయం, మద్రాసు ఉద్యోగుల తలపాగ, ఊర్ధ్వత్రిపుండ్రాలు. నేనెప్పుడైనా అల్లరి చేస్తే "స్వామి, గురువుల వంశం మనది, అల్లరి చేయరాదు" అని దగ్గరికి వచ్చి చెవిలో చెప్పేవారు. హెడ్‌మాస్టర్‌గారు స్వయంగా వచ్చి రహస్యంగా మాట్లాడడం నా స్థాయిని పెంచింది. నేను ఇతర విద్యార్థుల దృష్టిలో గొప్పవాడినయ్యాను ఇక్కడా. అయినా జాగ్రత్తగా వుండేవాడిని. లోపల కొంత గర్వపడినా, పైకి తెలిపేవాడిని కాదు.

ఎలిమెంటరీ స్కూలులో తెలుగు, ఇంగ్లీషు, లెక్కలు, చరిత్ర, భూగోళం, సైన్స్ ప్రధాన

విషయాలు. ఇంగ్లీషులో 'డైరెక్ట్ మెథడ్ రీడర్స్' అనే వాచకాలు, తెలుగులో కూచి నరసింహంగారివో, రాయసం వెంకటశివుడిగారివో వాచకాలు ఉండేవి. తెలుగు వ్యాకరణం అచ్చయ్యనాయుడు వ్యాకరణం. పాఠశాల తరగతులు ఏదో ప్రార్థనతోపాటు, పంచమ జార్జి చక్రవర్తి ప్రశంస ప్రార్థనతోను ప్రారంభమయ్యేవి;

God save our gracious king
Long live our noble king
Send him victorious
God save our gracious king.

ఈ రీతిగా ఉన్నట్లు జ్ఞాపకం. అమరం, ఆంధ్రనామసంగ్రహం, వైష్ణవ సంప్రదాయ స్తోత్రాలు ఇంట్లో మా అమ్మే చెప్పేది.

ఇక్కడ మా ఇంటిని గురించి కొంత చెప్పాలి. మాది పూర్తిగా సనాతనాచారం అయినా; మా తాతగారు, నాన్నగారు, చిన్నాన్నగారు కాంగ్రెస్‌వాదులు. మా యింట్లో నాలుగైదు చరఖాలు ఆడేవి. మా కుటుంబంపై గౌరవానికి జాతీయభావాలు కూడా కారణం. మా తాతగారు మొదలయినవారు జింక చర్మం రైలు సంచులతో (ఇవి ఇప్పటికి లెదర్ బ్యాగ్‌ల పూర్వరూపం) నా చిన్నతనంలో బెల్గాం కాంగ్రెస్ సమావేశానికి వెళ్లినట్టు గుర్తు. మా వాళ్లంతా ఎక్కువగా తిలక్ అనుయాయులు. మా నాన్నగారికి పారమార్థిక చింత ఎక్కువ. ఆయన హృషీకేశ్ నుంచి కాలినడకన మూడు నాలుగుసార్లు బదరీనాథ్ యాత్ర చేసిన పుణ్యాత్ముడు అని ఊళ్లోవాళ్లు ప్రశంసించేవారు.

హంపీ విరూపాక్షస్వామి దేవాలయం మా వూరికి మూడు మైళ్లలో వుంది. విరూపాక్షస్వామి దేవాలయం రథోత్సవం చైత్రశుద్ధ పూర్ణిమనాడు జరిగేది. పాడ్యమి నుంచే బ్రహ్మోత్సవం ఆరంభమయ్యేది. ఆ దేవాలయానికి తూర్పున ఒక మైలులో తుంగభద్రాతీరంలో కోదండరామస్వామి దేవాలయం వుంది. రావణవధానంతరం రాముడు పుష్పక విమానంలో వెళ్లుతూ సుగ్రీవుని కోరికపై ఒక క్షణం కిష్కంధపై ఆగాడట. దానికి చిహ్నంగా కోదండరాముని దేవాలయం అక్కడ వెలిసినట్టు ఐతిహ్యం. తుంగభద్ర పారుతూ కోదండరామస్వామి గుడి ఎదుట ఫర్లాంగు దూరంలో వున్న ఋష్యమూక పర్వతాన్ని చుట్టి ముందుకు సాగి ఆనేగొంది వైపు మళ్లుతుంది. ఈ ప్రదక్షిణంలో సుళ్లు తిరగడం వల్ల 'చక్రతీర్థం' అని దీనికి పేరు. చక్రతీర్థ కోదండరామాలయం పక్కన ఎగువన దాదాపు వంద గజాలవరకు మండపాల వరుస.



రామాలయం నుంచి దాదాపు రెండు వందల మెట్లు దిగితే తుంగభద్ర నది కుడివైపు మెట్ల వరుసకు ఎదురుగా వెళ్లితే ఒణికే గండి సొరంగం. దానిని దాటి మూడు నాలుగు ఫర్లాంగులు వెళ్లితే విరూపాక్షస్వామి దేవాలయం. ఇది 75 సంవత్సరాల కిందటి నైసర్గిక స్వరూపం. ఇప్పుడు మారి వుండవచ్చు.

ఈ రామాలయంలో మా తాతగారు రామనవమి ఉత్సవాలు, విరూపాక్షస్వామి జాతర సమయంలో జరిపేవారు. ఒకరిద్దరు చైత్రశుద్ధ పాడ్యమి నుంచి శ్రీ వాల్మీకి రామాయణ పారాయణం చేసేవారు. నవమి నాడు జననంతోపాటు దశమి నాడు పట్టాభిషేకం. వేలాది జనానికి పిండివంటలతో సహభోజనం పెట్టేవారు. రామనవమి వస్తున్నదని తాతగారు శిష్యులతో అనగానే బస్తాలతో సకల పదార్థాలూ వచ్చేవి. ఊళ్లో మాకంటే గొప్ప శ్రీమంతులుండగా, మా తాతగారు గొప్ప సత్కార్యం చేయడం వల్ల కూడ మాకు ప్రతిష్ఠ. ఈ తదీయారాధనలో మా అమ్మ, బంధువులూ వంటావార్పూ చేసేవారు. అదొక పెండ్లి, పెద్దయజ్ఞం.

మా అమ్మ "హరిర్హరిరితి వ్యాహరేహరిరి వైష్ణవః పుమాన్" అని స్తోత్రం పఠిస్తూ ఉదయం నాలుగున్నరకే లేచి, కాలకృత్యాలు తీర్చుకొని, స్నానంచేసి మంచి నీళ్ల కోసం మూడు ఫర్లాంగుల దూరంలో వున్న చెరువుకు – ఇది పెద్ద చెరువు – చెరువు కట్ట పొడవు దాదాపు ఐదుమైళ్లు, బయలుదేరేది. తలమీద తపిలె, ఒక బిందె, చంకలో బిందె, చేతిలో ఒక బిందెతో వచ్చేది. మూడు బిందెలు ఒకతే మోసుకొని ఎలా వచ్చేదో భగవంతునికే ఎరుక! తర్వాత వంటలూ వార్పులూ, పూజాపురస్కారాలతో పన్నెండు

గంటలకు భోజనాలు ముగిసేవి. మూడు గంటల వరకు విశ్రాంతి. ఆ సమయంలో ఆమె సంప్రదాయ గ్రంథాలు, రామాయణం, కొత్త స్తోత్రాలు నేర్చుకోడం, తాటాకు బుట్టలు అల్లడం, తిరుపగూడలు తయారు చేయడం, ముంజగడ్డితో తట్టలు, బుట్టలు వంటివి అల్లడం, కాయితం రుబ్బి గుజ్జుచేసి, పాత్రలు, లక్ష్మీనారాయణాదుల బొమ్మలు చేసి, రంగులతో అలంకరించడం, మా చదువులు పర్యవేక్షించడం మొదలయిన పనులు చేసేది. మూడు గంటలకు మళ్లీ మడి కట్టుకొని ఫలహారాలు చేయడం, క్రమంగా వంట పనులు, ఎనిమిది ఎనిమిదిన్నరకు రాత్రి భోజనం, అంట్ల పనులు, తొమ్మిదిన్నరకు నిద్ర. సాయంకాలం ఆరున్నరకు దీపం పెట్టిన తర్వాత మా చదువుల తనిఖీ. మా తాతగారు మొదలయినవారు పగటివి రాత్రి తినేవారు కారు. మళ్లీ అంతా కొత్తగా వండవలసిందే. మా అమ్మ ఆధునిక సాహిత్యమూ చదివేది. శిష్యుల భార్యలు వచ్చినప్పుడు వారికి భారత, భాగవత, రామాయణ కథలు చెప్పేది. ఆమె మాటలలో భక్తి తప్ప కులాలప్రసక్తే వుండేది కాదు. ఇలా నేను నాలుగో క్లాసు వరకూ లాగాను. అప్పుడు నాకు ఎనిమిదో ఏడు.

"మహిష్యా హృష్టయా భావ్యం
గృహకార్యేషు దక్షయా
సుసంస్కృతోపస్కరయా
వ్యయే చాముక్త హస్తయా"

**(ఇంటి యజమానురాలు ఎప్పుడూ సంతోషంతో ఉండాలి. ఇంటి పనులలో సమర్థురాలుగా ఉండాలి. ఇంటికి కావలసిన వస్తువులన్నిటినీ చక్కజేసుకొని భద్రపరచుకోవాలి. డబ్బు పొదుపుగా వాడుకోవాలి. విచ్చలవిడిగా వ్యయం చేయగూడదు.)**

# 4

# పాడుపట్టణమైన విజయనగరం

దుర్గాణి రాజ్ఞా కార్యాణి
సజలాని దృఢాని చ
ద్రవ్య మన్నం తు తేష్వేవ
స్థాపనీయం ప్రయత్నతః

**( రాజు దృఢమైన, జలసమృద్ధిగల దుర్గాలను-కోటలను కట్టించాలి. వాటిలోనే ధనాన్ని, ఆహారపదార్థాలను భద్రపరచి ప్రయత్నంతో రక్షించుకోవాలి!)**

శ్రీకృష్ణదేవరాయలనాటి విజయనగరం ఇప్పటి లండన్ నగరంకన్నా విశాల మయిందని చరిత్రజ్ఞులన్నారు. ఇప్పటి దరోజీ అనే ఊరు ఆనాడు విజయనగరం ప్రథమ ప్రాకారం మహాద్వారమట. దర్వాజా అనే పదం జన వ్యవహారంలో దరోజీ అయింది. మా కామలాపురానికీ, దరోజీకి దాదాపు ఇరవై మైళ్ల దూరం. అక్కడి నుంచి తుంగభద్రాతీరం వరకు వ్యాపించిన విజయనగరం ఎంతటి మహానగరమో ఊహించవచ్చు.

కామలాపురం విజయనగరం సార్వభౌముల అంతఃపురాలకు దగ్గరగా ఉన్న ప్రాంతం. ఇప్పుడు పెద్ద నగరమే అయింది. నా చిన్నతనంలో పెద్ద ఊరు. పంచాయతీ ఉన్నట్టిది. ఎన్నో వీథిబడులు, ఒక బోర్డు మిడిల్ స్కూలు, కొన్ని ప్రైమరీ స్కూళ్లు ఉండేవి. విద్యా

దృష్టిలో చూస్తే పూర్వం గొప్ప విద్యాపీఠం. పురందరదాసు, కనకదాసు, వ్యాసరాయ తీర్థులు మొదలైన మహావాగ్గేయకారులు, విద్వద్వరులు ఉన్న ఊరు. పెద్దనాదులు కూడా మా ఊరిలోనే నివసించి వుంటారు. కాని ఆ గుర్తులేవీ మిగలలేదు. బహమనీ సుల్తానుల రెండు లక్షల సైన్యం ఓవర్‌టైం కూడా చేసి విజయనగరాన్ని ఆరు నెలలపాటు ధ్వంసం చేసినప్పుడు అంతటి మహానగరం నేడు హాళుపట్నం - పాడుపట్నమై శేషించినప్పుడు, కామలాపురం వంటి ఊళ్లు ఇప్పుడుండటమే గొప్ప!

ఇప్పుడు మా ఊరినుంచే విజయనగర శిథిలాలు ప్రారంభమవుతాయి. ఇప్పుడు మా ఊరి బైట ఒక మ్యూజియం కూడా వుంది. హంపీ విరూపాక్ష దేవాలయం మా ఊరికి మూడు నాలుగు మైళ్ల దూరంలో ఉంది. మా ఊరు మెట్ట మీద ఉంది. హంపీ, తుంగభద్ర తీరంలో లోయలో ఉంది. దానిని చేరడానికి ఒక కొండదారి దిగిపోవాలి. ఆ కొండ పేరు హేమకూటం. దీని శిఖరం మీద విఘ్నేశ్వరాలయం, కొండలోయలో విరూపాక్షాలయం. హంపీ, శిథిలాలలో నేటికీ పూజలందు కుంటున్న దేవాలయాలు నాలుగైదు. విరూపాక్ష ఆలయం, చక్రతీర్థం కోదండ రామాలయం, మా ఊరి శివారులోని మాల్యవంతం రామాలయం, హేమకూట శిఖరం మీద విఘ్నేశ్వరాలయం, బడివేలింగాలయం, ఊరి అమ్మవారైన పట్టణద యెల్లమ్మ ఆలయం. మాల్యవంత రామాలయంలో రామలక్ష్మణ విగ్రహాలు మాత్రమే ఉన్నాయి. ఇది రాముడు సీతాపహరణం తర్వాత కిష్కింధకు వచ్చిన దానికి సంకేతం.

పాడుపట్టణంలోని రెండు విఘ్నేశ్వరాలయాలలో ఒకటి చాలా పెద్దది. రెండవది కొంచెం పెద్దది. పెద్ద దేవాలయం హేమకూట శిఖరం మీదిది. ఈ విఘ్నేశ్వరుణ్ణి 'కడలేకాళ్ బెణకప్ప' అంటారు. అంటే సెనగగింజ వినాయకుడు. రెండవ విఘ్నేశ్వరుని పేరు 'సాస్వేరేళ్ బెణకప్ప' అంటే ఆవగింజ వినాయకుడు. సెనగగింజ వినాయకుని ఎత్తు దాదాపు ఇరవై అడుగులు. ఆవగింజ వినాయకుని యెత్తు దాదాపు పది అడుగులు. పురందరదాసు పాడిన పిళ్లారి గీతాలలోని లంబోదరుడు ఈ హేమకూటశిఖరం మీద వినాయకుడే. హేమకూట సింహాసనుడూ, శ్రీ విరూపాక్షస్వరూపుడు అయిన లంబోదరుడు ఈయనే!

'శ్రీకృష్ణదేవరాయలు తన విజయాల చిహ్నాలను విజయనగరంలో నిర్మించాడు. దక్షిణాన కన్యాకుమారి వరకు జయించిన తర్వాత మా ఊరికీ, హోసపేటకూ మధ్యన




- హోసపేటకు కొంచెం దగ్గరగా అనంతశయన ఆలయం కట్టించాడు. ఇది పూర్తిగా తిరువనంతపురం అనంత పద్మనాభస్వామి ఆలయానికి సరైన నమూనా. ఇప్పుడది

అనంతసేన్ గుడి అని పెద్ద ఊరే అయింది. కళింగ విజయం తర్వాత రాయలు ఏకఖండమైన ఉగ్రనరసింహ విగ్రహం సింహాచలం ప్రతిరూపం గాను, ముఖలింగానికి ప్రతిరూపంగా బడివేలింగను స్థాపించాడు. బడివే అంటే చాలా పెద్దది అని అర్థం. ఇది విజయనగరంలోని అన్ని శివలింగాలకన్నా పెద్దది. ఇక ఆనాటి 'భువనవిజయ సభాభవన పీఠం' మాత్రమే నేడు మిగిలింది. ఆనాడు ఆశ్వయుజమాస శుక్ల పాడ్యమి నుంచి విజయదశమి వరకు జరిగే ఉత్సవాల మహాసంరంభం, నేడు మహర్నవమి దిబ్బగా మిగిలిన దానిని చూసి ఊహించు కోవలిసిందే. ఆనాడు మహావైభవంగా పూజలందుకున్న కళానిలయాలయిన హజార రామస్వామి గుడి, రత్నాలరాసులు పోసి అమ్మే వీథిలో ఉన్న కృష్ణస్వామి గుడి నేడు చూపరులకు శిథిలావశేషాలై కన్నీరు కురిపిస్తాయి.

ఆనాటి విజయదశమి ఉత్సవాలను గురించి, దీపావళి వేడుకలను గురించి చరిత్ర గ్రంథాలు ఎంతగానో వర్ణించాయి. ఆకాశభైరవ కల్పం ఆనాటి బాణసంచా కాల్పులకు గొప్ప సాక్షి. ఒకమారు రాయలవారి వేటలో ఒక కారెనుబోతు – అడవి దున్నపోతు – చిక్కింది. దానిమెడ గజం వెడల్పు. దానిని దుర్గాష్టమినాడు బలి ఇవ్వాలని నిర్ణయించారు రాయలు. దాని మెడను ఒక్క దెబ్బతో నరకగలవారు ఎవరైనా ఉన్నారా? – అని రాయలు ప్రశ్నించగా కొలువులోని మహాదండ నాయకులు, వీరదుర్గాధిపతులు కిక్కురుమనలేదట! అప్పుడు యువకుడైన విశ్వనాథనాయకుడు లేచి సవినయంగా రాయలవారు అనుమతిస్తే తానా పనిచేయ గలనని విన్నవించు కొన్నాడట; ఆయన అంగీకారం మేరకు ఒక్క కత్తివేటుతో దాని మెడను తెగనరి కాడట. మహర్నవమి దిబ్బ శిల్పాలలోని కత్తి ఎత్తి నిలబడిన వీరుని విగ్రహం విశ్వనాథ నాయకునిదని మా నాయనగారు చెప్పేవారు.

హంపీ దేవాలయంలో మూలవిరాట్టు విరూపాక్షస్వామి. ఈ దైవాన్ని 'పంపావతి' అని కూడా అంటారు. పంప హంప అయింది. పంపవ్వ, పంపయ్య, హంపవ్వ, హంపణ్ణ అని పేర్లు సహజం. ఈ హంపీ విరూపాక్షస్వామి రథోత్సవం గురించి కూడా ఒక ఐతిహ్యం ఉంది. సామాన్యంగా దివ్యస్థలాలలో స్వామికి, అమ్మవారికీ రథం ఒకటే ఉంటుంది. రథోత్సవంనాడు దేవీసహితుడైన స్వామిని ఊరేగిస్తారు. హంపీ బ్రహ్మోత్సవాలలో మాత్రం విరూపాక్షుని, పార్వతిని; రథోత్సవం నాడు చెరి ఒక రథంలో ఉంచి ఊరేగిస్తారు. ఆ విశాలమైన హంపీ వీథిలో భక్తులు దాదాపు మైలు దూరంలో

కనిపించే కృష్ణస్వామి దేవాలయం వెనుకభాగం వరకు లాక్కుపోయి వెనుదిరుగుతారు. ఈ సంప్రదాయం కృష్ణరాయలు ఓఢ్రగజపతి విజయానంతరం జగన్నాథ రథయాత్రలో జగన్నాథ, బలభద్ర, సుభద్రలను విడిగా మూడు రథాలలో ఊరేగించడం చూచిన తర్వాత, హంపీ విరూపాక్షాలయంలో ఏర్పాటు చేశాడని మా తాతగారు చెప్పేవారు.

హంపీ కోట గోడలు శిథిలాలలో శేషించి కుంబి (చివరి) వరకు అక్కడక్కడ కనిపించే గోడలు - చూస్తే చాలా ఎత్తయినవనే తోస్తుంది. ముప్పై-ముప్పై అయిదు అడుగులపైమాట. కొలిచావా నీవు? అని అడగవచ్చు ఎవరైనా. మనిషి నిలువు దాదాపు ఐదున్నర అడుగులని భావిస్తే, ఆరేడు నిలువుల ఎత్తు ఉంటుందని అంచనా. పాతకాలపు గార కోటగోడ రాళ్లసందుల నుంచి పడిపోయి ఉంటుంది చాలచోట్ల. నేనూ, నా మిత్రులూ తరచు పాడుపట్టణం వెళ్లేవాళ్లం. ఆ సందులలో వేళ్లుదూర్చి కోటగోడల మీదికి ఉడుములలాగ పాకేవాళ్లం. పైకి పాకడం సులభం గాని, దిగడం సులభం కాదు. దూకితే కిందరాళ్లు. పాదాలు చితికిపోతాయి. పై నుంచి నెమ్మదిగా జారేవాళ్లం. చేతులు, రొమ్ము, మోకాళ్లు దోక్కుపోయేవి. ఒకమారు ఇది చూచి మా అమ్మ వారించింది, చాల ప్రమాదమని.

తుంగభద్రాతీరం ఇసక చాలా సన్ననిది. ముత్యాలు పొడిచేసి పరచినట్లు ఉంటుంది. ఒకమారు మా అమ్మ అటుకులు వేయించడానికి ఇసక తెమ్మంది ఊరిబైటి వంకగట్టునుంచి. మా పినతండ్రి శ్రీనివాస తాతాచార్యులు మద్రాసులో వివాహం చేసుకున్నారు. ఆయన వందా యాభై రూపాయలకు ఒక బి.ఎస్.ఏ. సైకిలు కొని తెచ్చారు. దానిమీద ఎక్కి ఏకంగా తుంగభద్ర ఇసకే తెద్దామని తుంగభద్రాతీరానికి వెళ్లాను. తుంగభద్ర ఆవలిగట్టున ఆనేగొంది. అది అప్పుడు నిజాం రాజ్యంలోది. నేను ఒక చిన్న గోనెసంచిలో ఇసుక నింపి మూతిబిగించి, సైకిల్ కేరియరుకు కట్టి, చాపల్యం కొద్దీ. ఆనేగొంది గట్టుకుపోయివద్దాం సరదాగా అని అనుకుని ఖాళీ హరిగోలు ఎక్కి తెడ్డువేసుకుంటూ అవతలి గట్టు చేరాను. అక్కడ నదీ ప్రవాహం వెడల్పు దాదాపు వంద గజాలు. గట్టు చేరానుగదా అనే సంతృప్తితో తిరిగి హరిగోలు ఎక్కి నదిప్రవాహానికి వచ్చాను. తెడ్డు అటూ ఇటూ వేస్తే హరిగోలు ముందుకు వెళ్ళుతుంది. ఒకవైపు వేస్తే గిరగిరా తిరుగుతుందేకాని, ముందుకుపోదు. అర్ధగంట గడిచింది. ఇక జలగండం తప్పదని భావించాను. మిట్టమధ్యాహ్నం. రెండు గట్ల మీదా ఎవరూ లేరు. చివరకు

ఇక చావు తప్పదు, అయినా తెడ్డు ఇటువేపు వేసి చూద్దాం అనుకొని తెడ్డును ఇటువైపు తిప్పాను. హరిగోలు ముందుకు జరిగింది. ఆశ్చర్యం కలిగింది. ఇరువైపులా వేస్తేగాని హరిగోలు ముందుకు జరగదు అనే సంగతి తెలిసీ ఎందుకు తోచలేదా అని మరొకమారు ఆశ్చర్యపడుతూ, గట్టు చేరాను. హరిగోలు దిగి గబగబా సైకిలెక్కి ఇల్లు చేరాను. “ఊరి బయటి వంక గట్టు ఇసుక తేవడానికి ఇంతసేపా?” అని అమ్మ అడిగింది. సంగతి చెప్పాను. ఆమె నా అవివేకానికి నవ్వి, “హరిగోలు వేయడం చిన్నప్పటి నుంచి చూశావుగదా? ఎలా మరచావు?” అని మందలించింది. హరిగోలు అంటే చెప్పలేదుగదూ! అంటే, తెప్ప. వెదురుబద్దలతో పది పన్నెండుగురు కూర్చునేటట్టు గట్టిగా, గుండ్రంగా కట్టి, దానిపైన దళసరితోలు కప్పుతారు. ఇది పెద్దకొప్పెరలాగ ఉంటుంది. అరుగు గోలు–నదిని దాటించే గోళం అని దీని అర్థం అయివుంటుంది. అప్పుడు నా వయస్సు ఎనిమిదేళ్లు.

మరొకమారూ ఇలాంటి చిలిపిచేష్టే చేశాను. మా పినతండ్రికి తెలీకుండా బి.ఎస్.ఏ. సైకిలెక్కి హంపీ వెళ్లాను, మరొక మిత్రునితోపాటు. హేమకూటం నుంచి ఏటవాలుగా ఫర్లాంగు దిగుడుదారి. ఏ బ్రేకూ పనిచేయదు. నేను పై నుంచి సైకిల్ తొక్కాను. శరవేగంతో సైకిలు పరుగెత్తింది. దానిని అదుపు చేయలేక పోయాను. అది మధ్యదారిలోనే తలక్రిందులైనా తల పగలలేదే? అదృష్టం బాగుంది. ఏదో రాయి తగిలి ఎగిరి సైకిలుతోపాటు దారిపక్కన లోయలోని నాగజముడు పొదలో పడ్డాను. నా మిత్రుడు కొంత జాగ్రత్తపడ్డాడు గనుక ఘాట్‌రోడ్డు పక్కన పిట్టగోడపట్టుకుని అపాయం తప్పించుకొన్నాడు. నేను నాగజముడు పొదలో బోర్లాపడ్డాను. ఒళ్లంతా నాగజముడు ముళ్లు గుచ్చుకున్నాయి. నా మిత్రుని సాయంతో సాధ్యమయినంతవరకు ముళ్లుతీసివేసుకొని, సైకిలును పొద నుంచి లాగాను. అదృష్టవశాత్తు ‘పంచర్’కాలేదు. ఎలాగో ఇంటికి తిరిగి వచ్చాను. మా పినతండ్రి సైకిలు కనిపించక పోయేసరికి కొంత అనుమానించారు. నేను గుట్టు చప్పుడు కాకుండా సైకిలు యథాస్థానంలో పెట్టి, అలసిపోయి పడుకున్నాను. సాయంత్రానికల్లా 104 డిగ్రీల జ్వరం. ఒళ్లంతా వాచిపోయింది నాగజముడు ముళ్లపుళ్లకు. వారానికిగాను కోలుకోలేకపోయాను. మా పినతండ్రికి బాగా కోపం వచ్చింది. కాని జ్వరంతో, ఒళ్లువాచి బాధపడుతున్నందున ఏమీ అనలేకపోయారు.

మా ఊరు సంపన్నమైన పెద్దఊరు గనుక హరికథకులు, గారడీవాళ్లు, విప్ర వినోదులు మొదలయినవాళ్లు చాలమంది వచ్చేవారు. సర్కారు జిల్లాల నుంచి లక్ష్మణాచార్యులు అనే హరికథకులొకరు వచ్చారు. ఆయన మా ఊళ్లో దాదాపు నలభైరోజులపాటు రామాయణం హరికథ చెప్పారు. మంచి విగ్రహం, మాటకారి, శ్రావ్యమైన కంఠం, పిట్టకథల పుట్ట. కుంభకర్ణుణ్ణి నిద్రలేపడం ఒక రోజంతా చెప్పాడు. అతనిని లేపే ప్రక్రియలు కొన్ని నాకింకా జ్ఞాపకం ఉన్నాయి.

మా ఊరి మధ్యన ఒక పెద్దమైదానం ఉంది. పెద్దపెద్ద జాతరలు, వారం వారం సంతలు, అమ్మవారి సంబరాలు ఆ మైదానంలో జరుగుతాయి. ఒకమారు ధార్వాడ నుంచి మోడీ వేసేవాళ్లు వచ్చారు. వారు ఎన్నో అపూర్వ వినోదాలు, విచిత్రాలు చేస్తారని ఖ్యాతి. నేను నా పక్కింటివారితోపాటు వెళ్లాను. రాత్రి భోజనానంతరం ఎనిమిది గంటలకు మోడీ ప్రదర్శనం ప్రారంభమయింది. ఏవేవో అద్భుతాలు చూపారు మోడీవాళ్లు. నాకు ఒక్కటి మాత్రం జ్ఞాపకం ఉంది. "ఇప్పుడొక అద్భుతం మీరు చూడబోతున్నారు. గాభరా పడకండి. ఉన్నచోటు నుంచి కదలకండి" అని మోడీవేసే వ్యక్తి హెచ్చరిస్తూ ప్రేక్షకులపై వేపాకు విసిరేశాడు. కొన్ని క్షణాలు గడిచాయి. ప్రేక్షకులలో కలకలం. కూర్చున్నవారు లేచి పరుగెత్త బోయారు. స్త్రీలు పైటలను, మగవారు తలపాగాలు, ధోవతులను దులుపుకో సాగారు. నేను యథాలాపంగా చూస్తున్నవాడిని ఉలిక్కిపడ్డాను. నా చొక్కాజేబులో పెద్ద మండ్రగబ్బ, నన్ను పిలుచుకొని వచ్చిన పక్కింటివారి అమ్మాయి రైకలో, మరొక అమ్మాయి పరికిణిలో మండ్రగబ్బ, జనంలో హాహాకారాలు! నా జేబు నుంచి ఎగబాకుతున్న మండ్రగబ్బను పట్టుకోబోయాను. అది ముందు కొండ్లతో నా వేలు చుట్టివేసింది. ఒక్క అరుపు అరిచాను. అందరిదీ అదే స్థితి. నా అరుపు వినే నాథుడేడీ? నిమిషం గడిచింది. మోడీ వ్యక్తి అరిచాడు - భయపడకండి... కూర్చోండి! అని. అత్యాశ్చర్యం...! నా వేలు చుట్టినది వేపాకు... మండ్రగబ్బ కాదు. పక్కావిడ రైకలోదీ వేపాకే. అరుపులూ కేకలతో గగ్గోలయిన మైదానం నవ్వులతో దద్దరిల్లింది. అలాగే మరికొన్ని వినోదాల తర్వాత మోడీ వ్యక్తి ఏమిటో విసిరాడు. పాములు, జెర్రులూ, మండ్రగబ్బల అనుభవంతో జనం లేచిపోలేదు గాని ముందున్నవారు కొంచెం కంగారుపడ్డారు. నిమిషం తర్వాత చూస్తే గడ్డిపోచలు! ఇలాటి అద్భుతాలు ఎన్నో చేశారు వారు. పాపం! అంతటి కళాకారులకు దక్కినవి వారం రోజుల తిండి గింజలు, పది పదిహేను రూపాయలు. ఇప్పటి

ఇంద్రజాలికులు పెద్ద ఆడంబరాలతో లక్షలు గడిస్తున్నారు. పి.సి.సర్కార్(సీనియర్, జూనియర్) వంటివాళ్లు, డాక్టర్ బి.వి.పట్టాభిరాం వంటివాళ్లు ఉచితంగా సమాజసేవ దృష్టితో ప్రదర్శనలిస్తున్నవారు ఎవరో వేళ్లపై లెక్కింప దగినవారు కొందరే!

స్థాణుః స్వయం మూల విహీన ఏవ
పుత్రో విశాఖో రమణీ త్వపర్ణా,
పరోపనీతైః కుసుమై రజస్రం
ఫల త్యభీష్టం కిమిదం విచిత్రం

(తాను స్థాణువు. మోడూ మొదలూ లేనివాడు! కొడుకా, విశాఖుడు – 'శాఖా హీనుడైన' కుమారస్వామి! ఇక భార్య చూద్దామా, అపర్ణ. పూలు పూచదు, ఇతరులు తెచ్చిన పూలను ఫలింపజేస్తుంది!... ఏమిటీ విచిత్రం!?)

# 5

# బసివి నాగమ్మ

"హసిఅం అదిట్ట దంతం
భమిఅ మణిక్కంత దేహలీదేసమ్,
దిట్టె మణిక్ఖిత్త ముహం
ఏసో మగ్గో కులవహూణమ్" (గా.స. 6-25)
(హసిత మదృష్టదంతం
భ్రమిత మనిస్క్రాంత దేహలీదేశమ్,
దృష్టి మనుక్షిక్షిప్త ముఖం
ఏషమార్గం: కుల వధూనామ్")

**(నవ్వితే పళ్లు కనపడవు, తిరగడమా గడపదాటదు. ఎవరినైనా చూడడమంటే, ముఖం ఎత్తకుండా తలవంచు కొనే చూడడం. ఇది కుల వధువుల - ఉత్తమస్త్రీల పద్ధతి.)**

**కా**మలాపురంలో మా యింటి ఎదుటి వరుసలో మూడో యిల్లు బసివి నాగమ్మది. నాగమ్మ ఐదున్నరడుగుల నిలువులో బంగారుపోతపోసిన సుందర మూర్తి. నిలువుకు తగ్గ అంగసౌష్ఠవంతో, నవ్వులు చిందే ముఖంతో మరొకసారి చూద్దామా అనిపించేది. ఆమె సాధారణంగా ఒకరింటికి వచ్చేది కాదు. ఆమె యింటికీ ఎవరూ అంతగా

పోయేవారు కారు.

నాకప్పుడు ఆరేడేండ్ల వయస్సు. నేను బడికి వెళ్లేటప్పుడూ, వచ్చేటప్పుడూ ప్రేమ ఒలికే చూపులతో చూచేది. పండుగ పర్వాలకు నాకు పళ్లు మాత్రమే ఇచ్చేది. కాని, ఎప్పుడూ ఇంట్లోకి రమ్మని పిలిచేది కాదు. సాయంకాలాలలో మాత్రమే మగమనిషి ఒకరు కనిపించేవారు. నాకు కుతూహలంగా ఉండేది – ఆమెతో మాట్లాడుదామని, ఆమె ఇంటికి పోదామనీ, సాయంకాలాలలో మాత్రమే వచ్చే మగమనిషి ఎవరో తెలుసుకుందామనీ. కాని, భయం!

ఇక నా కుతూహలాన్ని అణుచుకోలేక ఒనాడు మా అమ్మను అడిగాను. "అమ్మా! అమ్మా! మన ఎదురు వరుసలో వుండే నాగమ్మత్తకు ఎవరూ లేరా? దాదాపు ఎప్పుడూ ఒంటిగానే ఉంటుందే. అందరితోనూ ఎందుకు కలవదు?" అని. మా అమ్మ చాల మంచిది. నాకు అమరం, శబ్దాలు, స్తోత్రాలు చెప్పేది. మా ఇంట్లో ఆమె తప్ప మరెవరూ ఆడవాళ్లు లేరు గనుక ఎప్పుడూ ఏదో పనిలో వుండేది. తీరికవేళల్లో పెద్ద పెద్ద పుస్తకాలు చదివేది. మా అమ్మ అంటే నాకు ఎంతో గౌరవం. ఏ ప్రశ్న అడిగినా నాకు నమ్మకం కలిగించే సమాధానం చెప్పేది. కాని, నేను నాగమ్మ సంగతి అడగ్గానే కొంచెం అలోచనలో పడింది. ఎందుకో నాకు అర్థంకాలేదు. కాని, నేను మళ్లీ అడిగేంతలోపుననే ఆమె చిరునవ్వు నవ్వుతూ "ఆమె బసివిరా, అయినా ఉత్తమురాలు. మనవూరి రెడ్డి (గ్రామ మునసబు) గౌడ్ర హనుమంతరావు మామలేడూ, ఆయన దినమూ వస్తాడు" అన్నది. (కర్ణాటకలో గ్రామ మునసబులు బ్రాహ్మణులు. ఆనువంశికంగా చాలమంది వున్నారు, రాయలసీమలోను)

దానితో నాకు సంతృప్తి కలుగలేదు. "అదేమమ్మా! గౌడ్ర హనుమంతరావు నా బడిలోని గౌడ్ర శివు పిన్నయ్య కదా! వాళ్లు వేరే పెద్ద యింట్లో బజారు దగ్గర వున్నారే. నాగమ్మ ఇక్కడ ఒంటరిగా ఎందుకు? వాళ్ల ఇంట్లోనే వుండరాదూ?" అన్నాను. మా అమ్మ ఈ విషయం ఇంక పొడిగించరాదనుకుందేమో, ఏదో చెప్పబోయింది. అంతలోనే నేను కుతూహలం ఎక్కువై "నాగమ్మత్త బసివి అన్నావే. బసివి అంటే ఏమిటమ్మా?" అని మరొక ప్రశ్నవేశాను.

మా అమ్మకు నాతో మాట్లాడుతూ ఉండడానికి తీరిక ఏదీ? "అదంతా నీకు చెప్పినా అర్థంకాదులే. పెద్దవాడవయిన తర్వాత నీకే తెలుస్తుంది" అని తన పనిలో

నిమగ్నురాలయింది. ఆమెను విసిగించడం నాకు ఇష్టంలేదు కనుక, అప్పటికి ఊరుకుండిపోయాను. కాని, మనస్సులో నాగమ్మ సంగతే సుళ్లు తిరుగుతూంది. అకస్మాత్తుగా ఒక ఆలోచన తోచింది. నాగమ్మనే అడిగితే, తప్పేముంది? ఏమన్నా అనుకుంటుందేమో! అయినా అడిగి చూద్దాం అనుకున్నాను.

అలా అడగడానికి మంచి అవకాశం కలిగింది. నాగులచవితి పండుగ వచ్చింది. నాగులచవితి నాడు కొబ్బరి గిన్నెలపైన రకరకాల చిత్రాలు చాకుతో చెక్కి, అడుగున సరిగ్గా మధ్యన రంధ్రం చేసి దారాలు రెండు కట్టి పురి తిప్పుతారు. ఆ పురి తిప్పినప్పుడూ విడిపోయినప్పుడూ కలిగే ఒత్తిడికి కొబ్బరి గిన్నె వేగంగా తిరుగుతుంది. దానిని ఇంకొకరు ఇలాగే తిప్పే కొబ్బరి గిన్నెలకు తగిలించడం, చిక్కుపడజేయడం ఒక ఆట, పిల్లలకు. ఉదయం పాముపుట్టలో పాలు పోయడం, పత్తితో వస్త్రాలు చేసి, ధూపదీపాలతో పుట్టకు పూజ చేయడం, ఆవిరి కుడుములు మొదలయినవి నైవేద్యం పెట్టి ఆరగించడం, తర్వాత సాయంత్రం ఊరిబయటికి వెళ్లి చెట్ల కొమ్మలకు ఉయ్యాలలు కట్టి ఊగడం బలే బాగుంటుంది. మా యింట్లో నాగులచవితి చేయడం సంప్రదాయం కాదు. మరుసటి రోజు గరుడపంచమి అని చేస్తారు. తక్కినవారు నాగులచవితి, నాగపంచమి అనేవారు. పిల్లల కోసం మా యింట్లో నాగులచవితి చేసేవారు. ఊరంతా చేస్తున్నప్పుడు పిల్లలు ఊరుకోరు గదా!

నాగపంచమి సాయంకాలం ఊరి బయటకి ఉయ్యాలలూగడానికి ఊరంతా బయలుదేరింది. మా అమ్మవంటి పెద్దవాళ్లు వచ్చేవాళ్లుకాదు. మరి నేను పోవాలి. ఎలా? నాగమ్మ అన్నది "నా వెంటరా నీవు" అని. నేను ఈ సంగతి మా అమ్మతో చెప్పాను. "సరే వెళ్లు. ఆమె వెంటే వుండు. చీకటిలో తప్పిపోయేవు. జాగ్రత్త, ఆమెను వదలవద్దు" అని హెచ్చరికలు మరీ మరీ చెప్పి పంపింది. నేను చాల సంతోషించాను. నాగమ్మ మరీ సంతోషించింది.

మా ఊరి పొలిమేర నుంచే హంపీ శిథిలాలు ప్రారంభమవుతాయి. అంతా అడవి. ఊరంతా అడవిలోనే. మర్రిచెట్లకు, జువ్విచెట్లకు, చింతచెట్లకు ఉయ్యాలలు వేస్తున్నారు. కొందరు ముందుగానే వేసి ఊగుతున్నారు. నాగమ్మను అందరూ గౌరవించారు. రెడ్డిగారి ఇంటి మనిషి మరి! "నాతోపాటు ఊగుతావా? భయపడవు గదా!" అన్నది నన్నుచూచి నాగమ్మ. కొంతసేపు ఆమె పక్కన కూర్చుని ఊగాను. నన్ను దించి తను ఒకతే ఊగింది.

అమ్మో! ఎంతపైకి, చెట్టుకొమ్మను అందు కొనేంత వేగంగా ఊగేది. నాగపంచమి ఉయ్యాలనాడు ఆడా మగా భేదం ఉండదు. ఎవరైనా ఎవరినైనా ఊపవచ్చు. పాత స్నేహితులతో స్వేచ్ఛగా ఊగుతారు. కొత్త స్నేహాలు కూడా కలుస్తాయి. సరసాలు, వినోదాలు సరదాగా ఉంటాయి. కొంటె కోణంగులు ఉయ్యాలలను గట్టిగా ఊచడం, ఊగుతున్నవారు భయపడడం, ఇష్టమున్నవారు కావాలనే మీద పడడం - ఇలా ఎన్నో వినోదాలు! చీకటయింది. బండిలో తిరిగి వస్తున్నాము. నాగమ్మ బండిలో నేనూ, నాగమ్మత్త మరెవరూ లేరు. అప్పుడు అడిగాను నాగమ్మను "నాగమ్మత్తా! ఇందరు వచ్చారుగదా ఊగడానికి, మామ రాలేదేం! ఔను, చాలకాలంగా అడుగుదామనుకున్నాను. నీవు ఎప్పుడూ ఒంటరిగా వుంటావేం? బజారులో మీకు నగరేశ్వరుని దేవాలయమంత యిల్లుంది గదా, అక్కడే వుండరాదూ?" ఇలా ఎన్నో ప్రశ్నలు వేస్తూపోయాను. బండివాడు కూడ మాటలు వింటున్నాడు. నాగమ్మ ఏమి జవాబు చెబుతుందో అని నేను ఎంతో ఇదిగా వున్నాను. బండివాడు కూడ తిరిగి చూచాడు వినడానికి అన్నట్టు.

నాగమ్మకు నాకున్నంత కుతూహలం ఏదీ? నెమ్మదిగా అన్నది "ఇంటికి పోతాంగదా! అక్కడ చెబుతాను" అని. నాకు నిజంగా కోపమే వచ్చింది. అయినా ఆమెను ఏమి చేయగలను? బండివాడివైపు ఒకసారి చూచి నన్ను బుజ్జగించింది. నేను గ్రహించాను. బండివాడున్నాడు. వాడికెందుకు తెలియాలి నాకూ, నాగమ్మత్తకూ సంబంధించిన విషయం? గంటన్నరకు ఇల్లు చేరాము. బాగా చీకటి పడింది. నాగమ్మ నన్ను బండి నుంచి దింపింది. బండి వెళ్ళిపోయింది. నాగమ్మతో పాటు నేనూ వాళ్ల ఇంట్లో అడుగుపెట్టాను.

నాగమ్మ యింట్లో ఎప్పుడూ అదివరకు అడుగుపెట్టలేదు. పడసాల తర్వాత ఒక గదిలో వంట. మరొకటి పడకగది. పెద్ద పందిరిపట్టెమంచం. దానికి మెట్లు. గోడకు పెద్ద అద్దం. దానిలో దాదాపు మన ఒళ్లంతా చూచుకోవచ్చు. మంచం ఎదుట గోడకు ముక్కాలిపీట మీద ఏవో కొన్ని పుస్తకాలు. గోడకున్న అలమారాలో జీడిపప్పు, చీనా కలకండ, బాదంపప్పు, ఖర్జూరాలు విడి విడి గిన్నెలలో పెట్టిన పెద్ద పళ్లెం. గంధం గిన్నె, మంచం తలవైపు రవివర్మదో, మరొకరిదో రాధాకృష్ణుల పెద్దపటం. కృష్ణుడు అడవిలోనో, తోటలోనో ఒక దుంగమీద కూర్చొని వేణువు ఊదుతుంటే పరవశంగా

వింటున్న రాధ. నేను మార్చి మార్చి వాటిని చూస్తున్నాను. ఇంతలో నాగమ్మ గొంతు వినబడింది.

"అంతగా చూస్తున్నావు. వింతగా వుందా?" అన్నది నాగమ్మ. నేనేమీ సమాధానం చెప్పలేదు. నాగమ్మ వైపు తిరిగాను. ఏదో అడుగుదామని. ఆమె వెంటనే "బండిలో నన్ను అడిగావు గదా! మీ అమ్మ అవరన్ను (అమ్మగారిని) అడగలేదా?" అనడిగింది. "అడిగాను. ఆమె అన్నది: బసివి. పెద్దవాడయినాక తెలుస్తుందిలే అని అన్నది" అన్నాను. "ఇంకేం? మీ అమ్మగారు చెప్పారుగదా! నేను చెప్పడం ఎందుకూ, ఇంతకూ నాపై కోపం చూపలేదుగదా?" అన్నది నాగమ్మ. "మా అమ్మకు నీవంటే చాలా ఇష్టం. ఉత్తమురాలు. మంచిది అని ఎందుకంటుంది లేకపోతే?" అన్నాను.

నాగమ్మ ఆలోచనలోపడ్డది. ఐదారు నిమిషాలు గడిచాయి. నేను ఆత్రంగా ఎదురుచూస్తున్నాను. ఏం చెబుతుందో అని. ఇంతలో ఒక పెద్దమనిషి వచ్చారు. ఆయనే. ఆయనను నేను దూరం నుంచి చూడడమే తప్ప దగ్గిరి నుంచి చూడలేదు. నాగమ్మ కన్న కొంచెం పొడుగనిపించింది. అందమైనవాడు. కోరమీసాలు. పెద్ద పెద్ద కళ్లల్లో ఎర్రటి జీరలు. అధికారం ఉట్టిపడే ముఖం. నన్ను చూడగానే ఆయన "నాగమ్మతో నాగులచవితి ఊయాలలూగి వచ్చావా?" అని ప్రేమతో పలకరించారు. అక్కడ ఉండడం ఉచితం కాదనిపించి, నేను లేచి మా యింటికి వచ్చాను. ఇంతకూ బసివి అంటే ఏమిటో నాకు తెలీనే లేదు.

పెద్దవాణ్ణయిన పిదప బసివి అంటే ఏమిటో తెలుసుకొన్నాను. మన ఆచారాలు అన్నీ మంచి ఉద్దేశంతో ప్రారంభమై చెడ్డ పరిణామంలో ముగుస్తాయి. బసివి పద్ధతి మన దేశంలో వేల సంవత్సరాల నుంచి ఉంది. ఈ సంసార బంధంలో చిక్కుపడక తనను భగవంతుని సేవకు జీవితం అంతా అంకితం చేయడం దీని ఉద్దేశం. పూర్వం మగవారు ఇలాటి సేవచేసేవారు. వారిని ఏకాంగి, ఏకాంగి వీరుడు అనేవారు. దైవ సేవకోసమే కాదు, రాజసేవ కోసం, తన లక్ష్యసిద్ధి కోసం ఇలా అంకితమయ్యేవారు. అలాగే మహిళలు, అంకితమయ్యేవారు. దీనికి గొప్ప ఉదాహరణ గోదాదేవి. తనకు వివాహం భగవంతునితోనేనని రంగనాథునికి జీవితం అర్పించి ఆయనలో ఐక్యమయింది.

ఈ పాత సంప్రదాయం శైవ వైష్ణవ మతాలలోనే పాకింది. వీరశైవ మత ప్రవర్తకుడు బసవేశ్వరుడు. అతడు పరమేశ్వరుని వాహనమైన వృషభనంది అవతారమని

తదనుయాయుల విశ్వాసం. వృషభ శబ్దం ప్రాకృతంలో బసవ అయి కన్నడంలో చేరింది. బసవనిలాగే పరమేశ్వరునికి కింకరుడై జీవితాన్ని తదారాధనకు వినియోగించే వాడు బసవుడు. ఆ విధంగా వివాహాది సంసార జంజాటం మాని పరమశివ కైంకర్యానికి జీవితాన్ని అంకితం చేసిన మహిళ బసవి - బసివి. పిల్లలు కలగని వారు తమకు పిల్లలు పుడితే ఒక సంతానాన్ని బసివిగా భగవత్కైంకర్యానికి వదులుతామని. జబ్బుపడిన బిడ్డపడే తీరని బాధను చూచి ఓర్చుకోలేని తల్లిదండ్రులు జబ్బు కుదిరితే నీ సేవకే బసివిగా వదులుతామని మొక్కుకోడం కూడా కొన్ని కులాలలో చిన్నతనంలో వుండేది. ఆ విధంగా మహత్తర ఉద్దేశంతో ఆరంభమైనది దేవదాసీ - బసవి - బసివి పద్ధతి. కాని...

సంఘంలో స్వార్థపరులు ఊరికే ఉండరు. మంచిని పాడుచేస్తారు. ఆ విధంగానే దేవదాసి - బసివి పద్ధతి పాడయిపోయింది. బసవి-బసివి-దేవునికి చెందిన బసివి-దేవరదున్నపోతులాగే ఉమ్మడి ఆస్తి అయింది గ్రామానికి. క్రమంగా మోతుబరుల మనిషి అయింది. వ్యభిచారంతో జీవించే వ్యక్తి అయింది.

నేను సంస్కృతం చదువుకోసం ఆనేగొందికి, తిరుపతికి వెళ్లడం వల్ల తర్వాత పది పన్నెండేండ్లకుగాని మా ఊరికి వెళ్లలేదు. ఇంటికి వెళ్లగానే నాగమ్మ సంగతి అడిగాను మా అమ్మను. "పాపం! నాగమ్మ ఒంటరిదయిందిరా!" అన్నది మా అమ్మ. "నాగమ్మ ఎప్పుడూ ఒంటరిదే. కొత్తేముంది దానిలో!" అన్నాను. "కాదురా, హనుమంతరావుగారు పోయారు. నాగమ్మ మరీ ఒంటరిదయింది" అన్నది మా అమ్మ. నేను ఎగిరిపడ్డాను. నా యథాలాప ప్రలాపానికి నొచ్చుకున్నాను. నాగమ్మ ఇంటికిపోయాను.

నేను సామానుతో రావడం నాగమ్మ చూచిందట, తప్పకుండా వస్తాడు అనుకుందట. కాని వెంటనే రావడం ఆశ్చర్యం కలిగించింది. నాగమ్మ నాకు ఎదురు వచ్చింది. తేరిపార చూచాను. నాగమ్మలో చిన్ననాడు చూచిన పవిత్రత ఏమీ కొరవడలేదు. ఒక్క లోపం. నొసట కుంకుమ లేదు-అంతే. నన్ను కూర్చోమంది. నేను కూర్చుంటూ, "అమ్మ చెప్పింది. హనుమంతరావు పోయారటగా! ఏమీ తోచక వెంటనే వచ్చాను అన్నాను. నాగమ్మ నా కాళ్లదగ్గర కూర్చుని, నా మోకాళ్లపై తలపెట్టి గట్టిగా ఏడ్చేసింది. నేను ఏమని ఓదార్చాలో తెలీక, "నాగమ్మత్తా, ఏడవకు. నేను నిన్ను ఏడ్పించడానికి రాలేదు" అన్నాను.

అరగంటకు కాని, ఆమె కుదుటపడలేదు. "సింహంలాగ ఆయన వుండేవారు.

అప్పుడు నన్ను పల్లెత్తుమాట అనడానికైనా ఒక్కరికీ ధైర్యం వుండేది కాదు. ఇప్పుడు చాటుగా అందరూ అనేవారే-బసివిది, వాడుపోతే మరొకడు అని. మీ యింటి వాళ్లొకళ్లే నన్ను ఆదరంతో దుఃఖం అడిగినవారు. ఎంతైనా గురువులుగదా!

గొప్పతనం ఎక్కడపోతుంది?" అని ఏడుస్తూ అన్నది. నాగమ్మ ఇంకా ఏవేవో చెప్పింది. మా అమ్మ గొప్పదనాన్ని పొగిడింది.

గంట గడిచింది. "ఇప్పుడే వచ్చావు పాపం! అమ్మగారితో మాట్లాడాలి గదా! ఇక్కడే వుంటే ఎలా?" అన్నది నాగమ్మ. నేను తొందరపాటేమీ చూపకుండా "ఔను. నీవు ఒంటరిగా ఎలా వుండగలవు? మీ కులంలో మారు మనువు పద్ధతి వుందిగదా?" అన్నాను అనాలోచితంగా. నాగమ్మ నా నోరు మూసింది. "అలాంటి మాటలు మాట్లాడకు! అలాంటివారు పోయినాక నేనూ ఉండడం ఎందుకు? అయినా ఉంటాను. వారిని తలచుకుంటూ గడిపివేస్తాను. తిండికీ బట్టకూ ఇంత చేసిపోయారు గదా! బతకడమే గదా!"... అన్నది నాగమ్మ. నేను సిగ్గుపడ్డాను నోరు జారినందుకు.

తర్వాత కొన్నేళ్లకు నాగమ్మ మరణించింది. ఆమె విధవగా వుండక్కరలేదు. మారు మనువు చేసుకోవచ్చు. కాని వైధవ్యం కోరుకుని పవిత్రంగా, ఆదర్శంగా మనుగడ సాగించి వెళ్లిపోయింది. మా అమ్మ తర్వాత, స్త్రీల ఎడల నాకు గౌరవం చిన్ననాటి నుంచే కలిగించింది నాగమ్మ తన చేతలతో. ఆమెను తలచుకుంటే నాకు వేద, పురాణ మహిళలందరూ గుర్తుకు వస్తారు. ఆ మహాపతివ్రతకు, మహాతల్లికి ప్రణామాలు.

**"సోమః శౌచం దదౌ తాసాం**
**గంధర్వాశ్చ శుభాం గిరమ్,**
**అగ్ని స్సర్వాంగ కాంతిత్వం**
**తస్మా న్నిష్కసమాః స్త్రియః"**

**సోముడు మహిళలకు పవిత్రత ప్రసాదించాడు. గంధర్వులు మంగళకరమైన వాక్కు ఇచ్చారు. అగ్ని సర్వాంగాలకు కాంతి ఇచ్చాడు. కనుకవారు బంగారు నాణేలతో సమానం.**

## ౬

# దారికి అడ్డంగా పడుకున్న పులి

"చలంతి గిరయః కామం
యుగాంత పవనాహతాః
కృచ్ఛ్రే పి న చలత్యేవ
ధీరాణా నిశ్చలం మనః"

(ప్రళయకాలంలో పెనుగాలులు వీచినప్పుడు పర్వతాలు కూడా చలించి పోతాయి. కాని, ఎంతటి కష్టంలోనూ ధీరుల మనస్సు చలించనే చలించదు.)

**మా**కు బళ్లారి, అనంతపురం జిల్లాలలో శిష్య సంచారం వుండేది. మా నాయనగారు శిష్యసంచారం వెళ్లడం నేను చూడలేదు గాని, మా తాతగారు వెళ్లడం నాకు తెలుసు. ఒకటి రెండుసార్లు నేనూ ఆయన వెంట వెళ్లాను. ఆ సంచారం హడావుడి చాల వుండేది. శిష్యులు విశేష కార్యాలకు, ఏమైనా ఆస్తిపాస్తుల తగాదా పరిష్కారాలకు మా తాతగారిని పిలిపించేవారు. ఆయన అట్టహాసంతో బయలు దేరేవారు.

మాకు ఒక మామూలు వ్యవసాయపు ఎడ్లబండి, ఒక ఒంటెద్దు బండి, ఒక పెట్టెబండి ఉండేవి. దొడ్లో నాలుగు దుక్కి ఎడ్లు, నాలుగు ఆవులూ వుండేవి. పెట్టెబండికి కట్టే మైసూర్ ఎడ్లు, పొడుగాటి మోరలు ఒకదానివైపు మరొకటిగా వంపు దిరిగిన అందమైన కొమ్ములు, కొమ్ముల కొనకు ఇత్తడిపొన్నులు. ప్రయాణ సమయంలో మెడలో గజ్జెలు

గంటల పట్టెడ, తెల్లటి దేహంతో చాల అందంగా వుండేవి. మహావేగంగా వెళ్లేవి.

పెట్టెబండిలో ఇప్పటి జీపులోలాగ నాలుగు వైపులా కూర్చోడానికి బల్లల అమరిక, అడుగున గడ్డి, తౌడు, పొట్టు వేసే భోషాణం వంటి పెట్టె, అవసరమైతే పడుకోవడానికి బల్ల కూర్పు, గట్టికప్పు, ఎదుట రెండు లాంతర్లు పెట్టడానికి ఇత్తడి చట్రాలు, తోలేవాడికి కూర్చోవడానికి బల్ల. ఒక విధంగా గుర్రపుబగ్గీ లానే ఉండేది. ఆరేడుగురు తాపీగా కూర్చోవచ్చు. మధ్యన ఒకరిద్దరు పడుకోవచ్చు. బండికి రెండువైపులా తలుపులున్న రెండడుగుల కిటికీలు; ముందొక కిటికీ. వెనుక తలుపు మూసినా గాలి రావడానికి తలుపులకు పైభాగాన కిటికీలు. ఎంతో ముచ్చటగా వుండేది. ముందు వెండి డవాల్ (బిళ్ల) బంట్రోతు నడిచేవాడు. డవాల్(బిళ్ల)పై "శ్రీ మద్రాజాధి రాజ రాజపరమేశ్వర విజయనగర సార్వభౌమ గురుస్వామిగళు" అని కన్నడంలో బిరుదావళి మాకే. ఎక్కడికి వెళ్లినా, ఏ దేవాలయంలోనో – హనుమంతుని దేవాలయంలో విడిది ఏర్పాటయ్యేది. మా వెంట ఒకరు మా బంధువులలోని వారు సహాయంగా వచ్చేవారు. ఆయనే వంట, వడ్డన చేసేవారు. మా అమ్మ వెంట వెళ్లేట్లయితే ఆమే వంటావడ్డన చేసేది. మేము సంచారంలో ఉన్నన్నినాళ్లూ, దినమూ శిష్యులకు ప్రసాదంగా పిండివంటలు వండాలి – బొబ్బట్లు, పూర్ణంకుడుములు, వడలు, అతిరసాలు, పులిహోరా, చక్కెర పొంగలి, ఉప్పుపొంగలి, దధ్యోదనం మొదలయినవి. పచ్చళ్లు చిప్పలలో పెట్టి వాసెనకట్టి, పట్టు గుడ్డగాని, ధావళి వంటి నార గుడ్డగాని చుట్టి వెంట తీసుకొని వెళ్లేవారు, ఎక్కువ రోజులు ఉండవలసివస్తే.

ఒకమారు 'నారాయణదేవరకెరె' అనే గ్రామానికి మా తాతగారి వెంట సంచారం వెళ్లాను పెట్టెబండిలో. నాకు ఆరేళ్లుంటాయి. నారాయణదేవరకెరె కమలాపురానికి దాదాపు 25 మైళ్లు దూరంలో ఉందని జ్ఞాపకం. ఇలాంటి ప్రయాణాలకు రాత్రి భోజనం చేసి బయలుదేరడం, ఎద్లు ఎంత నెమ్మదిగా నడిచినా తెల్లవారుజాముకు గమ్యం చేరుకోవడం మామూలు. రాత్రి ప్రయాణం గనుక అయితే ఆరిపోయిన దివిటీలు కూడా దగ్గర ఉంచుకొనేవారు. క్రూరమృగాలు ఏమైనా వస్తే అంటించి బెదరగొట్టడానికి ఒకటి రెండు బల్లేలు, బండిలో అడుగునపడేసి పెట్టేవారు. ఆ పద్ధతిలోనే మా నారాయణదేవరకెరె ప్రయాణం ప్రారంభమైంది.

ఆ దారి ఆ కాలంలో దట్టమైన అడివి. మంచి కంకరబాట. తారు ఇంకా రాలేదు.



మేము భోజనం ముగించుకొని దాదాపు తొమ్మిది గంటలకు బయలుదేరి ఉంటాము. ఒంటి గంటకో, రెండు గంటలకో, దారిలో ఉన్నాము. రెండువైపులా కీకారణ్యం, మా బండి వెంట మరి రెండు మూడు బండ్లూ వస్తున్నాయి. నేను బండిలో నిద్రపోతున్నాను. అకస్మాత్తుగా నాకు మెలకువ వచ్చింది. మా తాతగారు నన్ను పట్టుకున్నారు. మా సహాయకులు కంగారుపడుతున్నారు. నాకు బాగా జ్ఞాపకం ఆ సంఘటన. పెద్దపులి దారికి అడ్డంగా పడుకుంది. మా అమ్మ పులి-గోవు, పులి-గొల్ల పిల్లవాడు కథలో చెప్పినట్లు అచ్చంగా అట్టే వుంది. దారి అంతా ఆక్రమించుకుంది. దానిని దాటిపోవడానికి వీలు లేదు. హాయిగా విశ్రాంతి తీసుకుంటూంది. తల ఎత్తి గంభీరంగా చూస్తున్నది. రెండుకళ్లూ మా బండి దీపాలకన్నా ఎర్రగా వెలిగిపోతున్నాయి. మాకూ దానికీ దూరం దాదాపు ఇరవై గజాలు. మా బండి మొదట్లో నడుస్తుంది గనుక మా బండి ఆగగానే

వెనుక వచ్చే మూడు నాలుగు బండ్లు తోలేవాళ్లు దిగి మా బండివైపు వచ్చారు. పులి కళ్లు జ్యోతుల్లాగ వెలుగుతున్నాయి. మా బండి దీపం వెలుతురులో దాని పచ్చని నల్లని చారల ఒళ్లు మసకమసకగా కనిపిస్తూంది. బళ్ల వాళ్లు అల్లరి చేయబోయేరు. అల్లరికి పులి ప్రాణభయంతో మనమీద పడితే...? ఒక దూకుతో మా బండిని అది అందుకోగలదు.

మా తాతగారు చాల తెలివిగలవారు. సమయస్ఫూర్తి మనస్థైర్యం గలవారు. అల్లరి చేయవద్దన్నారు. కాగడాలు వెలిగించమన్నారు. క్రూరమృగాలు నిప్పుచూస్తే భయపడతాయి. వాటిపైన దాడిచేస్తేగాని, సందేహం కలిగితేగాని అవి ఎదురు దాడి చేస్తాయి. అందులోనూ పులి, సింహం వంటివి ఎదుట పోట్లాడక వెనుకవాటుగా దెబ్బతీస్తాయి. ఎదుటి నుంచి ఎవరైనా వస్తే తప్ప మాకు రక్షణ లేదు. పులి ప్రశాంతంగా చూస్తూనే ఉంది. బండి వాళ్లు ఎడ్లను సర్దలేక సతమతమవుతున్నారు. మా తాతగారికి మరొక ఆలోచన కలిగింది. మా ఎడ్లు తక్కిన బండ్ల ఎడ్లు కూడా బలమైనవి. వాటి నొగలు విప్పి వేయమన్నారు. ఎడ్లనన్నిటిని మా బండి ముందుకు తోలుకొని రమ్మన్నారు. వాటికి కూడ ప్రాణభయమే! కాని, వాటిలో ఒక గుణం వుంది. సాధ్యమయినంత వరకు ఆత్మరక్షణకు ప్రయత్నిస్తాయి. ఎదిరిబలం ఎక్కువగా ఉన్నప్పుడు పారిపోవడమో, పోరాడుతూ చావడమో తప్పదు!

ఎనిమిది ఎడ్లూ మా బండి ముందుకు వచ్చాయి. ఆత్మరక్షణ కోసం సహజంగానే వ్యూహం పన్నాయి. అర్ధచంద్రాకారంగా నిలబడ్డాయి. తలలు కొద్దిగా వంచి బుసలు కొడుతూ కొమ్ములు చూపుతూ, చూస్తున్నాయి. పులి శరీరం కొద్దిగా కదిలింది. ఇంతలో కాగడాలు ముట్టించి జనం బండ్ల పక్కగా నిలబడ్డారు. కేకలు వేస్తే తక్కిన బళ్లలోని పిల్లలు, ఆడవాళ్లు భయపడతారని మా తాతగారు ఆజ్ఞాపించడం వల్ల మరణభయంతో అంతా ప్రశాంతంగా జరుగుతోంది. పులిని రెచ్చగొట్టే ఏ పని జరగడం లేదు.

ఎడ్లు తమపైకి పులి పాకితే పొడవడానికి సిద్ధం వున్నాయి. పులి లేచి నిలబడింది. కాని, రోడ్డుకు అడ్డంగానే ఉంది. తోకను భయంకరంగా ఆడిస్తూంది. దాని అశక్తత, దురదృష్టం ఆ తోక విసుర్లలోనే వ్యక్తమవుతూంది. ఎదుట అటూ ఇటూ కాగడాలు, మోహరించిన ఎడ్లు.

పులి ఇటే చూస్తూంది. కాగడాల వెలుగులో దాని ప్రతి చలనమూ కనిపిస్తూంది.

అటుపక్కకు గాని, ఎదురుగా గాని తలతిప్పనైనా తిప్పడం లేదు. చెవులను మాత్రం ఆడిస్తూంది. దాని కోపమంతా తోక కదలికలోనే కనిపిస్తున్నట్టు వుంది. తోకతోపాటు చూస్తే రోడ్డంతా అదే నిలబడినట్టు కనిపించింది. దాదాపు అరగంట గడిచింది. పులి ఇక ఊరక ఉండలేక ఒకసారి గాండ్రించింది. ఆ నిశ్శబ్ద నిశీథిలో ఆ గాండ్రింపు ప్రతిధ్వనించింది. నేను ఉలిక్కిపడ్డాను. మా తాతగారు, సహాయకులు నన్ను పట్టు కున్నారు. ఎద్దు మరింత చురుకుగా చూస్తూ ఏ మాత్రము సందు లేక నిలబడి బుసలు కొడుతున్నాయి. ఆ గాండ్రింపునకు ఒకటి రెండు ఎద్దు మూత్రవిసర్జన చేసినట్లు గుర్తు. అయినా కొమ్ముల అర్ధవలయం నుంచి వెనుకకు తగ్గలేదు.

ఒక గంట గడిచింది. ఎదుటి నుంచి ఒకటి రెండు బండ్లు వస్తున్నట్లు చప్పుడయింది. పులి నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ పక్కన అడవిలోకి వెళ్లి పోయింది. ఎద్దు మాత్రం చాలసేపు అట్లాగే నిలబడ్డాయి; పక్కనుంచి దెబ్బతీస్తుందే మోనని కొమ్ములు మారుస్తూ, పులివాసన దూరమయ్యే వరకూ అవి సహజ స్థితికి రాలేదు. రాత్రి రెండు దాటి వుంటుంది. అలజడి తగ్గింది.

మా తాతగారు బండి దిగి మా బండి ఎద్ల వీపులు నిమురుతూ మూపులు తట్టారు. అవి గోముగా మోరలు ఎత్తి మా తాతగారి వైపు జరిగాయి. ఆయన వాటి గంగడోళ్లను తడుముతూ ముద్దు చేశారు. ఎంత ముచ్చటయిన దృశ్యం! నా కోసం తాతగారు అంతవరకు బండి దిగలేదు. నేనూ దిగి వాటి ముందు నిలబడ్డాను. అవి నా చేతులు నాకుతూ వుంటే నేను భయంతో, ఆనందంతో ఏదో చెప్పరాని ఆవేశంతో ఉక్కిరిబిక్కిరి అయ్యాను.

ఎడ్లను మళ్లీ బండ్లకు కట్టారు. దివిటీలు మాత్రం ఆర్పలేదు. కొందరు దివిటీలతో కొంత దూరం బండ్ల వెంట నడిచారు. సూర్యోదయానికిగాని మేము నారాయణ దేవరకెరె చేరలేకపోయాము.

మా తాతగారి వ్యూహరచనా చతురత, మనస్సు నిబ్బరం శిష్యులు విన్నారు. ఆయనపై వారికి గౌరవం ఇనుమడించిందని వారి మాటలు, చేతల వల్ల నేను గ్రహించాను. అందరూ నన్ను "సణ్ణసామేరు (చిన్న స్వాములు) అదృష్టవంతులు". అన్నారు. విడ్డూరమేమిటంటే కష్టపడింది నేను తప్ప అందరూ. కాని నేను అదృష్టవంతుణ్ణి!!

"బహూనా మల్ప సారాణాం
సమవాయో దురత్యయః
తృణై ర్విధీయతే రజ్జుః
బధ్యతే తేన దంతినః"

(బలహీనులయినా చాల మంది ఐకమత్యంతో కలిసికట్టుగా వుంటే, వారిని జయించడం కష్టం. గడ్డిపోచలతో తాడు పేనుతారు. ఆ తాడుతోనే ఏనుగులను కట్టివేస్తారు.)

# 7

# పాపం పన్నారాజు!

కష్టం ఖలు మూర్ఖత్వం
కష్టం ఖలు యౌవనేషు దారిద్ర్యమ్,
కష్టాదపి కష్టతరం
పరగృహవాసః పరాన్నంచ

**(మూర్ఖత్వం చాల కష్టం కలిగించేది. యౌవనంలో దారిద్ర్యం సంభవించడం కష్టం కలిగించేది. యౌవనంలో ఎన్నో కోరికలు పొడమరిస్తాయి. వాటిని తీర్చుకోవాలంటే, డబ్బు కావాలి. అది లేకపోతే కోరికలు తీరవు. యౌవనం వ్యర్థం. అన్ని కష్టాలకన్నా కష్టమయింది పరులపంచన ఉండడం, పరులు పెట్టింది తినడం. అలాటి వాడికి స్వాతంత్ర్యం లేదు. ఏమి అనుభవిస్తాడు? అన్నిటికీ నిర్బంధమే. ఏమి చేయగలడు? అతడొక బందీ!)**

**ప**న్నా అనేది పూర్వం మధ్యపరగణాలలో (సెంట్రల్ ప్రావిన్సెస్‌లో) ఒక చిన్న స్వతంత్ర సంస్థానం. భారతదేశం స్వతంత్రమయిన తర్వాత ఇరుగుపొరుగు ప్రాంతాలతో కలిపి దీనిని ఒక జిల్లాగా చేసింది భారత ప్రభుత్వం.

పన్నా అంటే పచ్చ–మరకతం. పన్నా ప్రాంతంలో పచ్చల గనులు విస్తారంగా ఉండడం వల్ల ఈ సంస్థానానికి ఈ పేరు వచ్చింది. గనులు తవ్వితే పచ్చలు చట్లు చట్లుగా వెలువడుతాయి. జిల్లాగా ఏర్పడిన తర్వాత కూడా పన్నా మునుపటిలాగే ముఖ్యపట్టణమయింది. ఇప్పుడిది మధ్యప్రదేశ్ రాష్ట్రంలో ఉంది.

పచ్చలకు ఖనిగా ప్రసిద్ధి పొందిన ఈ పన్నా పూర్వం సామాన్యమైన పట్టణం. వానలకు వరదలకు వెలువడే పచ్చలు ప్రజలను ఆకర్షిస్తుండేవి. బుందేల్‌ఖండ్ రాజు



ఛత్రపాల్ ఈ పట్టణాన్ని క్రీస్తుశకం 1675లో తన రాజ్యానికి రాజధానిగా చేసుకొన్నాడు. అప్పటి నుంచీ దీనికి ప్రాముఖ్యం కలిగింది.

ఛత్రపాల్ మహారాజా కాలంనుంచి ఇది పారిశ్రామికంగాను, పంటల దృష్టితోను ఒక గొప్ప కేంద్రమయింది. ఇది గుడ్డలకు పెద్ద వ్యాపార స్థలం. చేనేత ఇక్కడ పెద్ద పరిశ్రమ. పరిసరాలు అరణ్యమయాలు గనుక మేలయిన కలపకు కూడా ఇది గొప్ప వ్యాపారస్థలం. పచ్చల సంగతి మరి చెప్పనక్కరలేదు.

ఈ పట్టణంలో చరిత్ర ప్రసిద్ధి పొందిన కట్టడాలు చాలా ఉన్నాయి. వాటిలో "ప్రాణనాథ్ ఆలయం", "బలదేవ్ మందిరం" ముఖ్యమయినవి. వీటి గోడలు, స్తంభాలే కాక గోపురాలు కూడా చలువరాతివే. ఇవి 18వ శతాబ్ది చివర నిర్మితమయ్యాయని అంటారు.

ఇక్కడ రెండు కళాశాలలున్నాయి. ఇవి అవధేశ్ ప్రతాప్‌సింగ్ విశ్వవిద్యాలయానికి అనుబంధంగా ఉన్నాయి.

పన్నా పట్టణం 1921లో మునిసిపాలిటీ అయింది. పన్నా జిల్లా విస్తీర్ణం దాదాపు మూడువేల చదరపు మైళ్లు. పాతపన్నా సంస్థానం, అజయ్‌గఢ్ అనే మరొక ప్రాంతం కలిసి 1948లో పన్నా జిల్లా ఏర్పరచారు. పన్నా ఉన్న ప్రాంతాన్ని పన్నా పర్వత పంక్తి అని అంటారు. ఇది వింధ్య పర్వత శ్రేణిలో భాగం.

ఇక్కడ ఉన్న పచ్చల గనులు ఛత్రఫాల్ మహారాజా పాలన నుంచి పనిచేస్తున్నాయి. ప్రస్తుతం భారతదేశంలో ఇంకా పనిచేస్తున్న పచ్చల గనులు పన్నా గనులే!

పన్నా జిల్లా జనాభా దాదాపు ఏడు లక్షలు. వరి, జొన్న, గోధుమ, నూనె గింజలు

ప్రధానమైన పంటలు. చేపల పరిశ్రమ కూడా ఉంది.

నాటి పన్నా సంస్థానం రాజకుమారుడు, పట్టానికి రావలసినవాడు, తన పినతండ్రితో తగువుపడ్డాడు. మాటా మాటా పెరిగింది. ఉడుకు రక్తం. పినతండ్రిని రివాల్వరుతో కాల్చాడు. పినతండ్రి మరణించాడు. ఇది నా చిన్ననాడు జరిగిన దుర్ఘటన!

అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం చట్టం ప్రకారం, స్వదేశ సంస్థానాధీశులుగాని, వారి వారసులుగాని చేసే తప్పులకు శిక్షలు సామాన్య జనులకు పడే శిక్షలకన్నా భిన్నంగా ఉండేవి. కనుక, పన్నా రాజకుమారుణ్ణి బళ్లారి జిల్లాలో నిర్బంధంలో ఉంచారు. ఆయన బళ్లారి జిల్లా దాటిపోరాదు. బళ్లారి జిల్లాలోను తన పర్యటన కార్యక్రమాన్ని ఎప్పటికప్పుడు జిల్లా కలెక్టరుకు తెలియజేయాలి. తెలియజేయకపోతే అతడు రాష్ట్ర గవర్నరుకు, ఆ గవర్నర్ ఢిల్లీలో ఉన్న రాజ ప్రతినిధికీ ఫిర్యాదు చేస్తారు. శిక్షాకాలంలో మరొక దండన ఉండవచ్చు. పట్టానికి అనర్హుడనే తీర్పు జరగవచ్చు. అందువల్ల అలాంటి శిక్షలు పొందుతున్నవారు తమ అవధులు దాటేవారు కారు.

ఈ పన్నా రాజకుమారుడు స్వతహాగా మంచివాడు. ఏదో క్షణికోద్రేకంలో తప్పు చేశాడని మా పెద్దలు అంటూండేవారు. ఆయన బాగా పొడగరి. పంట్లాం, హేటులతో మరీ పొడగరిగా కనిపించేవాడు. బంగారం లాంటి చాయ, రూపసి. ఆయన పాతఫోర్డు కారును నడుపుకుంటూ మా ఊరు వచ్చేవాడు. మా ఇంటిపక్కన ఉన్న ఆశ్వత్థం చెట్టు క్రింద ఆ కారు ఆపేవాడు. ఎప్పుడు వచ్చినా ఆకు పచ్చని వేట దుస్తులతో వచ్చేవాడు.

కారు దిగగానే నిలబడి చప్పట్లు కొట్టేవాడు. హారన్ మోగించేవాడు. మాకు ఆ కారు హారన్ మోత చిరపరిచితం. 'పన్నా రాజు వచ్చాడు! పన్నా రాజు వచ్చాడు!' అంటూ కేకలు వేస్తూ పిల్లలు అతని చుట్టూ మూగేవారు. నేనూ వాళ్లతోపాటే వెళ్లి మూగుదామనుకునేవాడిని. అప్పుడు నా వయస్సు ఆరేడేళ్ళు. కాని ఆభిజాత్యం అడ్డం వచ్చేది. ఆయన పిల్లలందరికీ పిప్పర్‌మెంట్లో, పళ్లో ఇచ్చేవాడు. కొందరిని అభినందించేవాడు. చేతులు పట్టుకుని కొందరిని బుజ్జగించేవాడు. గడ్డం పట్టుకొని నేను ఇంట తలవాకిట్లో నిలబడి చూచేవాడిని. రెండడుగులు ముందుకు వచ్చి నాకూ పళ్లు అందించేవాడు.

నాకు అతడిచ్చే వాటికంటే, అతని కారు లోపల, టాప్‌మీద ఉన్న వస్తువులు నన్ను ఆకర్షించేవి. వాటివైపే చూస్తుండేవాడిని. టాప్‌మీద గట్టి తాళ్లతో అల్లిన వలలు, చిన్న

చిన్న డేరా గుడ్డలు ఉండేవి. ఈయన వెంట ఒకరిద్దరికంటే ఎక్కువ మంది ఉండేవారు కారు. పాతకాలపు పెద్దకారు. మూడు సీట్లు వరసలు ఉన్నట్లు గుర్తు. వెనక సీట్లో తుపాకులు, పులి, జింక, ఎలుగుబంటి చర్మాలు – బాగా పదును చేసినవి ఉండేవి. ఆచారవంతులయిన వారికి ఆయన ఎంతో గౌరవంతో నమస్కారం చేసి జింక చర్మాలూ, చిరుతపులి, పులి చర్మాలూ ఇచ్చేవాడు. పులిగోళ్లు, అడవి పంది కోరలు కొందరు పిల్లలకు ఇచ్చినట్లు గుర్తు.

మా ఊరి నుంచి హంపీ విజయనగరం శిథిలాలూ, అడవీ, ప్రారంభమవుతాయి. అక్కడ చిరుతపులుల, అడవి పందుల, ఎలుగుబంట్ల బెడద ఎక్కువ. అడవి పందులు చెఱకు తోటలలో దూరి, చెఱకు గడలను పెళ్లగిస్తాయి. వేళ్లను నములుతాయి. ఎలుగుబంట్లను గురించి నేను చిన్నప్పుడు చాల కథలు విన్నాను. అవి, మనుష్యులను ముఖ్యంగా వయస్సులో ఉన్న ఆడవారిని ఎత్తుకొని పోయి గుహలలో కాపురం చేస్తాయని, అలా అపహృతలైన ఆడవారు రోమాలు పెరిగి ఎలుగుబంట్లలాగ మారిపోతారనీ అనేవారు. ఎలుగుబంట్లు మనిషిపైబడి పడవేసి, రక్కి, గొంతు పిసికి ప్రాణాపాయం కలిగించడం నేను హంపీలో ఒకమారు చూచాను. అలాంటి క్రూరమైన ఎలుగు బంట్లను వేటాడి జనానికి మేలుచేసే పన్నారాజంటే నాకు ఎంతో గౌరవం. ఎంతో అభిమానం. వాకిట్లో నిలబడి కళ్లు ఇంతింత చేసుకొని చూచేవాడిని. కారులోని ప్రతి వస్తువూ పరిశీలనగా చూచేవాడిని – చిన్న డేరా గుడ్డలు, పెద్ద పెద్ద గడ్డపారల వంటి ఇనుపమేకులు, వాటిని భూమిలో దిగగొట్టడానికి సమ్మెటలు, లావుపాటి నూలు పగ్గాలు, వాటిని బిగించడానికి ఇనుప కడియాలు, బల్లేలు, కత్తులూ, తుపాకులు రకరకాలవీ ఉండేవి. ఆయనను దగ్గరి నుంచి చూడాలని, ఆయనతో మాట్లాడాలనీ నాకు చాల ఆశగా ఉండేది. కాని, నేను అప్పుడు చదువుతున్నది బోర్డు ఎలిమెంటరీ స్కూలో రెండో క్లాసు. అప్పుడు ఇంగ్లీషూ చెప్పేవారు. కొన్ని పదాలు నాకువచ్చు. నా అభిప్రాయం మా పినతండ్రి శ్రీనివాస తాతాచార్యులకు తెలిపాను. ఆయన కూడా మంచి గురికాడే గాని వేటకాడు కాదు. రామనవమి సమయంలో రక్షణకు, పొలాలలో కాపలాకు అవసరమని లైసెన్స్ ఉన్న తుపాకీ ఒకటి మా యింట్లో ఉండేది.

"పన్నారాజుతో ఏం మాట్లాడతావ్?" అనడిగారు, మా పినతండ్రి నవ్వుతూ. నేను జవాబు చెప్పలేదు. తర్వాత పన్నారాజు వచ్చి కారుపక్కన నిలబడినప్పుడు మా పినతండ్రితోపాటు పన్నారాజును సమీపించాను. ఆయనకు మా పినతండ్రితో పరిచయం

ఉంది గనుక, వారిద్దరికీ వేట సమాన చర్చా విషయం గనుక కొంతసేపు సంభాషించారు. "మా వాడికి మీ వేట కథలు కావాలట!" అని మా పినతండ్రి ఆయనను అడిగారు. ఆయన పొడగరి గదా! కొంచెం వంగి నవ్వుతూ "నీకు ఇంగ్లీషు రాదు, హిందీ రాదు, నా వేట కథలు ఎలా వింటావ్?" అంటూ మా పినతండ్రి వేపు చూచాడు. "నీవు పెద్దవాడు అయిన పిదప చెబుతాలే. ఇంకా పది ఏళ్లన్నా మీ ప్రాంతంలో ఉంటానులే" అన్నారు. ఆయన మాటల భావాలను మా పినతండ్రి నాకు తెలిపారు.

నేను సంస్కృతాభ్యాసానికి వేరే ఊళ్లకు పోవడంవల్ల తర్వాత పన్నారాజును చూడలేదు. 1938లో రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వాలు ఏర్పడిన తర్వాత అలాంటి వారి నిర్బంధం తొలగిందని విన్నాను.

పాపం, క్షణికోద్రేకం వల్ల పన్నా రాజకుమారుడు దాదాపు రెండు దశాబ్దాలు రాజ్య బహిష్కార శిక్ష అనుభవించి ఉంటాడు! తను తొందరపాటులో చేసిన దుష్కార్యానికి ఆయన పశ్చాత్తాపపడేవాడని, అందువల్లనే అందరితో మర్యాదగాను, పిల్లలతో ప్రేమగాను ప్రవర్తించేవాడని మా పెద్దలు చెబుతుండేవారు. ఆయన ప్రవర్తనా దానిని చాటేది.

**"నరస్యాభరణం రూపం**
**రూపస్యాభరణం గుణః**
**గుణస్యాభరణం జ్ఞానం**
**జ్ఞానస్యాభరణం క్షమా"**

**(మానవునికి రూపం ఒక నగ. రూపానికి గుణం నగ. గుణానికి జ్ఞానం నగ. ఆ జ్ఞానానికి క్షమ-ఓరిమి నగ. కేవలం రూపం ఉపయోగపడదు. దానికి తగిన గుణం ఉండాలి. రూపం గుణం ఉన్నా బుద్ధిహీనుడు, అవివేకి అయితే ప్రయోజనమేమిటి? జ్ఞానం ఉండాలి. జ్ఞానమూ ఉంది, కాని ఓరిమి, క్షమ లేకపోతే ప్రయోజనం లేదు. కనుక ఓరిమి ముఖ్యం.)**

# 8

# నీటి ఎద్దడి

పత్రపుష్ప ఫలచ్ఛాయా
మూల వల్కల దారుభిః
గంధ నిర్యాస భస్మాస్థి
తోక్త్మైః కామన్వితన్వతే

**(చెట్ల జీవితం ఎంత ధన్యమైంది! వాటి ప్రతి భాగమూ ఉపయోగకరమైందే. ఆకులు, పూవులు, పండ్లు, నీడ, వేళ్లు, నార, కర్ర, గంధం, జిగురు, బూడిద, చేవ, చివరకు చిగుళ్లు కూడా మానవుల కోరికలను తీర్చుతాయి.)**

**నా** చిన్ననాటి జీవితం విచిత్రంగా ఉండేది. ఇంట్లో ఎప్పుడూ సందడే! పెళ్లిళ్లు పండుగలు – పబ్బాలు ఎప్పుడూ కోలాహలమే! పెళ్లి జరిగిందా ఐదు రోజులూ; తరువాత పదహారునాళ్ల పండుగ జరిగే వరకూ బంధువులు ఉండేవారు. అప్పుడూ "ఇంకా కొన్నాళ్లుండవచ్చుగా! ఏం ముంచుకుపోయింది?" అని బలవంతాలు.

ఒకసారి పేరంగూరు శ్రీనివాసాచార్యులనే చుట్టం సకుటుంబంగా ఒక వివాహానికి వచ్చారు. పదహారునాళ్ల పండుగా ముగిసింది. వ్యవసాయపు పనులున్నాయి. వెళ్లాలి అన్నారు. మా తాతగారు నవ్వి "ఇప్పుడేమిటి వ్యవసాయం? ఇంతకూ నీవు చేసేదేమిటి? ఉండు' అన్నారు. ఆయన దాదాపు ఆరు నెలలు ఉన్నాడు. "నేను ఊరికే ఉండడం మంచిది కాదు. ఏదన్నా పనిచేస్తాను అంటూ మంచి కలప తెప్పించ మన్నారు. మరి మూడు రోజులకే ఇంట్లో ఫర్నిచర్ కార్ఖానా వెలసింది. ఆయనకు వడ్రంగం వచ్చునని ఎవ్వరికీ తెలియదు. ఇంట్లో ఆపద్ధర్మంగా సుత్తి, బాడిస, ఉలి, రంపం ఉండేవి. వాటినే

వాడి ఆయన బల్లలు, కుర్చీలు, పీటలు, బెంచీలు, ముక్కాలి పీటలు తయారుచేసారు. ఈ వార్త వ్యాపించింది ఊరంతా, ఊర్లో పేరు పొందిన వడ్రంగులంతా వచ్చి ఆయన దగ్గర కొత్త కొత్త వస్తువులు తయారుచేసే మెలకువలు నేర్చుకొనేవారు. నేను చాల చిన్నవాణ్ణి. చిన్న చిన్న వస్తువులు ఆయనకు అందించే వాణ్ణి. ఆయన ఆ విధంగా ఆరు నెలల ఋణం తీర్చుకొన్నాడనే అనాలి. ఆయన చేసిన పీటలు, ముక్కాలి పీటలు ఇంకా మా ఇంట్లో ఉన్నాయి. అప్పటి వస్తువులు మన్నికకూ, పనితనానికీ తార్కాణంగా ఈ డెబ్బయి అయిదేళ్లుగా నిలిచి వున్నాయి.

కమలాపురంలో చెరువు వున్నా, మూడు మైళ్లు తుంగభద్ర నిండుగా పారుతున్నా; నీటి ఎద్దడి వుండేది. అందునా వేసవిలో పెళ్లిళ్లు, సమారాధనలు జరగడం వల్ల నీటి వాడకం విశేషం గనుక, తుంగభద్ర నుంచో, రాయలకాలం నాటి తురత కాలువ నుంచో నీళ్లు తేవలసివచ్చేది. ఈ తురత కాలువ దూరం దాదాపు మైలున్నర. మా నాన్నగారు, పిన్నయ్యగారు స్నానం చేసి పట్టుబట్టలు కట్టుకొని బండ్లు కట్టుకొని మనిషి నిలబడేంతటి రాగి హండాలు, జోడు తప్పెలలు, గంగాళాలు బండ్లతోటే తాళ్లతో బిగించి బండ్లు నడిపేవారు. బండితోలే పనివాళ్లు, ఎద్లు ఎప్పుడైనా మారాం చేస్తాయేమోనని పక్కన పది అడుగుల దూరంలో నడిచేవారు. చెర్నాకోలకు చివర తోలు ఉంటుంది, కనుక మైల. వారలు, తోలు లేని చెర్నాకోలతో ఎద్లను తోలేవారు. మాకు ఈ గంగసేవ పెద్ద పండుగ.

తురత కాలువ నుంచి నీళ్లు తెచ్చేవాళ్లు అని అన్నాను కదా, ఈ తురత కాలువకు ఒక కథ ఉంది.

హరిహరబుక్కరాయలు ఇద్దరూ కాకతీయ సేనాపతులు. ఖిల్జీకి పట్టుబడ్డారు. వారిని ఖిల్జీ ముస్లిములను చేసి వరంగల్లుకు పంపి తన తరఫున రాజ్యం చేయ మన్నాడు. వారు తెలంగాణా ప్రాంతానికి వచ్చి రాజ్యస్థాపనకు ప్రయత్నించారు. ప్రజలు తిరగబడ్డారు. హరిహరబుక్కలు హంపీకి పరుగెత్తివచ్చి, విద్యారణ్యులను శరణన్నారు. ఆయన వారికి అభయమిచ్చి, "మనఃపూర్వకంగా మన్నిస్తేనే మతం. మీరు బలవంతంగా మతాంతరం స్వీకరించారు కనుక అది చెల్లదు. మహావీరులయిన మీరు వైదిక మతావలంబులే" అని వారికి ధైర్యం చెప్పి, వారికి ప్రాయశ్చిత్తాది సంస్కారాలు చేసి, వేదమతోద్ధారానికి మీరు జన్మించారని ప్రకటించి, విద్యానగరానికి శంకుస్థాపన చేసి విజయనగర

సామ్రాజ్యానికి మూలపురుషులను చేశాడు.

విద్యానగరం విస్తరించింది. విజయనగరమని విఖ్యాతి పొందింది. దానికి నీటి వసతి కావాలి. కనుక హరిహర బుక్కలు ఆలోచించి బుక్కరాయల పేర ఒక పెద్ద చెరువు తవ్వించారు. దాని పేరు బుక్కసాగరం. దానికి నీరు పారించాలి. మల్లాపురం నుంచి కాలువ తవ్వితే విజయనగరం గుండా ప్రవహించి బుక్కసాగరానికి నీళ్లు రాగలవని వాస్తు నిపుణులు రాయలకు మనవి చేశారు. కాలువ తవ్వడం ఎలా అని ఆలోచిస్తున్న బుక్కరాయలకు నిద్రవచ్చి కల పడింది. దానిలో ఆదిశేషుడు ప్రత్యక్షమై "తుంగభద్ర మలుపు తిరిగే మల్లాపురం వద్ద ఆనకట్ట కట్టి కాలువ తవ్వించి నీరు మళ్లించు. నీవు శుచి అయి వరుణ దేవునికి పూజచేసి వెనక్కు తిరిగి చూడకుండా పరిగెత్తు, నేను నీ వెంట వస్తాను. నేను వచ్చినది వచ్చినట్టుగా పెద్ద గొయ్యి పడుతూ వస్తుంది తిరిగి చూడకు. తిరిగి చూశావా కాలువ ఆగిపోతుంది." అని అన్నాడు. బుక్కరాయలు ఈ విషయం హరిహరునికి, మంత్రి సామంతులకు, విద్యారణ్యులకు తెలియబరచాడు. ఆదిశేషుని ఆనతి. అందరూ ఈ విధంగా చేయడమే ఉచితమన్నారు.

బుక్కరాయలు ఒక శుభముహూర్తంలో స్నానాద్యనుష్ఠానాలు ముగించి, మల్లాపురం మలుపు వద్ద పూజలు చేసి అక్కడి నుంచి ఒంటరిగా పరుగెత్తడం ప్రారంభించాడు. బుక్కసాగరం దగ్గర వరకు వచ్చాడు. ఆదిశేషుడు తన వెంట వస్తున్నాడా లేదా అనే అనుమానం కలిగింది. తిరిగి చూశాడు. అంతవరకు పడగవిప్పి కాలువ పడేలా జరజరా వస్తున్న ఆదిశేషుడు అంతర్హితుడయ్యాడు. బుక్కరాయలు పశ్చాత్తాపం పొందాడు. తాను వెనుదిరిగి చూడకుండా వుంటే కాలువ మరి కొంత దూరం వరకు సాగేదేమో! మల్లాపురం నుంచి బుక్కసాగరం వరకు దాదాపు ముప్ఫై మైళ్ల కాలువ గండిని చూచి ఆశ్చర్యపడ్డాడు. పురజనులు అబ్బురపడ్డారు. తర్వాత ఒక చెరువు తవ్వించి, మల్లాపురం వద్ద ఆనకట్ట కట్టించి తుంగభద్ర నీరుకాలువకు మళ్లించారు. దీనికే 'రాయకాలువ' అని కూడా పేరు. ఎత్తు నుంచి పల్లానికి త్వరగా పారడాన్ని త్వరిత కాలువ, తురత కాలవ అని పేరు వచ్చిందని మా తాతగారు చెప్పేవారు.

నీళ్లు తేవడం ఒక సంబరమయితే, మర్రాకులు మోదుగాకులు తేవడం మరొక జాతర. భోజనం చేయడానికి, పూర్వం భోజన పాత్రలుండేవేమో! సామాన్య జనులు, వైదికాచారం పాటించేవారు విస్తరాకులలో భోజనం చేయడమే ఆచారం. కంచాలలో

తినడం ఇటీవల వ్యాపించింది. కాని, నా చిన్నతనంలో అనాచారం. వెండి కంచాలలో తినేవారు కూడా ఆ కంచాలను మరొకరికి పెట్టేవారు కాదు. సున్నంతో తోమి కడిగేవారు.

విస్తరాకుల కోసం మా పెద్దలు భోజనాలయిన తర్వాత అపరాహ్ణంలో బయలు దేరేవారు. నేను మా తాతగారి వెంట మా నాయనగారి వెంట చాలాసార్లు ఆకుల కోసం వెళ్లాను. పెద్దవారు ఆచారం గనుక ఏమీ తినేవారు కారు. మా కోసం పెద్ద గిన్నెల్లో పెరుగన్నం, ఊరగాయలు తెచ్చేవారు. ఒక్కొక్కప్పుడు మా అమ్మ కూడా వచ్చేది బండిలో. పనివాళ్లు చెట్టెక్కి కొమ్మలు నరికి కిందపడేసేవారు. మేమంతా ఆకులు విడిపించి కట్టలు కట్టేవాళ్లం. లేకపోతే తోరణాలుగా గుచ్చేవాళ్లం. ఆకులు ముదిరిపోయి వుంటే పెళుసయి విరిగిపోతాయి. లేతవైతే చినిగిపోతాయి. కనుక మధ్యరకంవి విడిపించాలి. ఆకుల మధ్యన ఆకుతేళ్లు, మిడినాగులూ ఉండేవి. అప్పుడు చేతిలోని కొమ్మలు విసిరేసి పరుగెత్తడం, పనివాళ్లు వాటిని వేటాడి చంపడం, అవి ప్రాణభయంతో పరుగులు తీస్తుంటే కాళిదాసు చెప్పినట్టు "సత్త్వానామిహ లక్ష్యతే వికృతి మచ్చిత్తం భయక్రోధయోః". భయకోపాల్లో వాటి చిత్తవృత్తి విచిత్రమైన అనుభవం.

ఆకులను ఇంటికి తెచ్చిన తర్వాత నీడలో ఎండించడం, కట్టలు కట్టి బరువు మోపడం, అవి అణిగి చదునుగా అయినప్పుడు తోరణాలుగా గుచ్చి ఉగ్రాణం గదిలో భద్రపరచడం సరదాగా ఉంటుంది. ఎండినవాటిని అవసరమయినప్పుడు తడిపి బరువుమోపి, నీళ్లు ఆరిపోయిన తర్వాత కుట్టుకునేవారు. గోకులాష్టమి గొప్ప పండుగ కదా: ఆ దినం కృష్ణుని ప్రీతికై ముప్పైరకాల పిండివంటలు చేసేవారు. అవి నివేదన తర్వాత బంధువులను ఆప్తులను పిలిచి పంచిపెట్టేవారు. వినియోగం చేసేవారు. ఆ ఫలహారాలు పెట్టి ఇవ్వడానికి విస్తరాకులు కావాలి. పోటాపోటీలలో ఆకులు కుట్టేవాళ్ళం. గంటకు వంద విస్తళ్లు కుట్టేవాళ్ళు పందెంలో నెగ్గినట్టు. చిన్న విస్తళ్లు కుట్టడం పిల్లలవంతు. ఐదారాకులు అతుకువేసి కుట్టేవాళ్లం. నేను అలా చిన్న విస్తళ్లు వంద వరకూ కుట్టాను. మావైపు మర్రాకులు, మోదుగాకులే వాడకం ఎక్కువ. అరిటాకులు సరేసరి. కాని, అవి మర్రి, మోదుగాకులలాగా యదృచ్ఛా లబ్ధాలు కావు. కొనాలి. వంద ఆకుల కట్ట రూపాయో, రూపాయిన్నరో. ఈ ఆకుల యాత్రలో మా తాతగారు మాకు స్తోత్రాలు సంత చెప్పేవారు. పాడుపట్నం కథలు చెప్పేవారు. మా తాతగారికి, నాయనగారికి, పిన్నయ్యగారికి పాడుపట్నంలోని ప్రతి రాయి పుట్టుపూర్వోత్తరాలు తెలుసు.



నా చిన్నతనంలో మా ప్రాంతంలో ప్లేగుబాధ, మలేరియా వరుస జ్వరాల బాధ ఉండేవి. ప్లేగు తగిలినప్పుడు జనం ఊరు విడిచి పాడుపట్నం అడవుల్లో కాపురం పెట్టవలసివచ్చేది. అవి మిలటరీ క్యాంపులలాగ ఉండేవి. హంపీ దారిలోని ఉద్దాన వీరభద్రప్ప గుడి ప్రాంతంలో మేము ఒక గుడారంలో రెణ్ణెళ్లపాటు ఉన్నట్టు నాకు గుర్తు. ఆ జీవితం పెద్దవాళ్లకు కష్టంగా వుండేదేమో గాని నావంటి పిల్లలకు మాత్రం తమాషాగా ఉండేది. చుట్టూ అడవులు. ఉదయం, సాయంకాలం పక్షుల కోలాహలం. రాత్రుళ్లు నక్కల గుడ్లగూబల ఊళలు, కూతలు. చిరుత పులులు, అడివి పందులు, కారెనుబోతులు పైబడతాయేమోనని తుపాకులు చేతబట్టుకుని అప్రమత్తంగా ఉండే యువకులు. మరో లోకంలో వున్నట్టు వుండేది. మా గుడారం చుట్టూ మా పిన్నయ్యగారు తుపాకి పట్టుకొని కాపలా కాచేవారు. ఆయన మంచి గురికాడు. మావైపు, నా చిన్ననాడు

వరి, చెరకు మార్చి మార్చి వేసేవారు. చెరకును అడవి పందులు పెళ్లగించేవి. ఎలుగ్గొడ్లు విరిచి తినేవి. వాటిని బెదిరించడం కోసం తుపాకులు అవసరమయ్యేవి. మాకు ఒక లైసెన్సు ఉన్న తుపాకి ఉండేది. ఒకసారి నేనొక చిలిపి పనిచేశాను. తుపాకిలో తూటా ఎక్కించి వున్నట్టు తెలీక, తుపాకి చేత్తోపట్టుకొని ఆడుతూ నొక్కాను. ధాం అని పేలి తూటా గది కప్పులో ఇరుక్కుంది. ప్రమాదం జరగలేదు. చప్పుడుకు జనం పోగయ్యారు. పోలీసు కేసు కావలసింది కాని, మా తాతగారు ఏదో సర్దిచెప్పారు. గడబిడ జరగలేదు.

తుంగభద్ర రాతి గుండ్లపై పారుతుంది. అలాంటి నీరు తాగడం వల్ల మలేరియా, కడుపులో బల్లలు, వరుస జ్వరాలు వచ్చేవి. జనం చాల బాధపడేవారు. వరుస జ్వరాల వల్ల పాటక జనానికి చాల నష్టం. అది వారిని నీరసింపచేసి పనులు పాడుచేసేది. రెక్కాడితేనే డొక్కాడే జనానికి ఎంత కష్టం! మా యింటికి వైద్యానికి వచ్చేవారు. మా అమ్మ వరుస జ్వరాలకు మందు కనిపెట్టింది. కుప్పింటాకులో మిరియాలు, దంతెలకు సాలీడుపెట్టిన గుడ్లు కలిపి నూరి తముల పాకులో పెట్టి ఎడమ మణికట్టుకు నాడి మండలంపైన కట్టేది. వరుస జ్వరాలు ఆగిపోయేవి. ఈ సాలీడు గుడ్లను బల్లిపౌర అంటారు. దంతెలకు దూలాలకు తెల్లతేపలు వేసినట్టు వుంటుంది. సాలీడు విషం కుప్పింటాకు కలిపి జ్వరహరౌషధం. మా అమ్మ నూరిన ముద్దను పెరుమాళ్లగదిలో మండపం ముందు మందహాసం (మందాసనం)పై వేంచేసిన విగ్రహాలు సాలగ్రామాల ఎదుట పెట్టి 'ఓం నమో నారాయణాయ' అనే మూల మంత్రం జపించి, భగవంతుడా నారాయణా అనుగ్రహించు అని ప్రార్థించి రోగి మణికట్టుకు కట్టేది. తాను మడిగా వుంటే నాతో కట్టించేది. మందులో ఏముందిరా? మూల మంత్ర మహిమ అంతా అనేది. బల్లిపౌర తీయడం పాపంకాదా, హింసకాదా? అని ఒకమారు అడిగాను. నీవు చిన్నవాడివి ధర్మసూక్ష్మం తెలీదు. పెద్ద ప్రాణిని రక్షించడానికి చిన్న ప్రాణిని వినియోగించవచ్చు. మనుష్య జన్మ సకల జీవులలో శ్రేష్ఠమైంది. మానవుడు ప్రపంచానికి మహోపకారం చేయగలడు. అతనిని రక్షించడం ముఖ్యం అనేది.

మా ఊరిలో మా బంధువర్గంలోనే కాక, రాయలసీమ గండికోట వైష్ణవులలోనే శ్రీమంతులు ఏటూరివారు. అలాంటివారు కూడా ప్లేగు తగిలినప్పుడు అరణ్యవాసం. ఈ ఏటూరి వారి గొప్పదనం కొంచెం వివరించాలి. వీరికి కృష్ణాపురం అనేది ఆనేగొంది రాజులిచ్చిన జాగీరు గ్రామం. వేయి ఎకరాల భూస్వాములు. పెద్ద హవేలీ. ఇంట్లో

దాదాపు యాభైమంది జనం. నాకు తెలిసి వెంకటతోళప్పాచార్యులు 95 సంవత్సరాలు మహావైభవంతో జీవించారు. ఆయన కుమారులు, మా నాయనగారి సమ వయస్కులు, శ్రీనివాస తోళప్పాచార్యులు 95 సంవత్సరాలు జీవించి ఇటీవలే పరమపదించారు. ఆయన కుమారుడు నాకన్నా నాలుగైదేళ్లు పెద్దవాడు. వేంకట దేశికాచార్యులు, అష్టైశ్వర్యాలతో ఉన్నాడు. ఈ శ్రీనివాసతోళప్పాచార్యుల అన్నదానం గొప్పది. వారికి హోసపేటలో ఒక బంగళా. దాని పేరు లక్ష్మీవిలాసం. ఆ కాలంలో గుంతకల్లు నుంచి, హుబ్లి నుంచి వచ్చే రైళ్లు రాత్రి దాదాపు పది గంటల వరకు నడిచేవి. ఆ బండ్లలో ఎవరైనా శ్రోత్రియులు, హోటళ్లలోను, సత్రాలలోను, భోజనం చేయని ఆచారవంతులు వస్తారేమోనని ఆ బండ్లు వచ్చేవరకు వేచి వుండి వారికి ఆతిథ్యమిచ్చే ఏర్పాటు చేశారు ఆయన. ఎంతటి దొడ్డ మనసు! ఆయన యువకులను ఎంతగానో ప్రోత్సహించేవారు. తర్వాత మా ఊళ్లో మా బంధువుల్లో చెప్పుకోదగ్గ శ్రీమంతులు బాణగిరివాళ్లు.

"పరోపకారః కర్తవ్యః
ప్రాణై రపి ధనై రపి,
పరోపకారజం పుణ్యం
న స్యాత్క్రతు శతై రపి!!"

**(కష్టపడి సంపాదించిన ధనమిచ్చి అయినా, చివరకు ప్రాణమిచ్చి అయినా పరోపకారం చేయాలి. నూరు యజ్ఞాలవల్ల కలిగే పుణ్యం పరోపకారంతో సమానం కాదు.)**

# 9

# పాములతో సహవాసం

"మౌలౌ సన్మణయో, గృహం గిరిగుహా,
త్యాగః కిలాత్మత్వచః
నిర్యత్నోపనతైశ్చ వృత్తి రనిలైః
ఏకత్ర చర్యే దృశీ,
అస్యత్రాన్నృజు వర్మతా, ద్విరసనా
వక్త్రేవిషం, వీక్షణం
సర్వా మంగళ సూచకం కథయ భో
భోగిన్ సఖే కిన్విదమ్"

(మిత్రుడా, భోగీ! నీ జీవితం విచిత్రంగా వుందయ్యా. ఒకవైపు చూద్దామా, తలమీద మేలైన మణుల వెలుగు, కొండ గుహలో నివాసం, సొంత చర్మాన్నే త్యాగం చేయడం, అప్రయత్నంగా దొరికే గాలులతో జీవనం (ఇది చూస్తే నిన్నొకయోగిగా భావించవలసి ఉంటుంది) మరొకవైపు చూద్దామా, కుటిలగతి, నోట్లో రెండు నాలుకలు, చూపంతా విషం. ఇలా సర్వ అమంగళ సూచకమైన జీవితం, చెప్పవూ? ఎందుకీ విచిత్ర జీవితం? (ఇది చూస్తే పరమదుర్మార్గుడివిగా కనబడతావు. ఏమిటీ ద్వంద్వవిధానం?)

**మా** ఊరు చుట్టూ అడవులు. విజయనగర శిథిలాలు కనుక పురుగుల (పాముల) బాధ ఎక్కువగానే ఉండేది. నెలకు ఒకటి రెండు పాములనైనా చంపేవారు. మా యింటి పరిసరాలలో పాములు రావడానికి కారణం ఉంది.

మా తాతగారు పెద్ద ఇల్లు కట్టిద్దామని కలప సామగ్రి చాలా చేర్చారు. దానిని వంట యింటికి ఆనుకుని వున్న పెద్ద గదిలో పెట్టారు. దూలాలు, దంతెలూ, కిటికీలు, వెంటిలేటర్లతో ఆ గది నిండిపోయింది. దానిలో ఎలుకలు, పాములూ చేరాయి. నెలకొక పాము పిల్లయినా కనిపించేది మాకు. తేలు విషం నాకు ఎక్కదు గనుక పామన్నా భయం ఉండేది కాదు.

ఒక మారు నాగుబాము పిల్ల ఆ గదిలోంచి వంటింట్లోకి వచ్చింది. అందరూ భోజనం చేస్తున్న సమయం. భోజనం నుంచి లేవకూడదు. పాము చిన్నదైనా కాటు వేస్తుందని భయం. ఏమి చేయడానికి తోచలేదు పెద్దలకు. మా పిన్నయ్య అనేవారు అప్పుడప్పుడు "నా చేతిలో గరుడరేఖ ఉంది. నేను చేయెత్తి అరచేయి చూపితే చాలు ఎంత పెద్ద పామయినా ఆగిపోవలసిందే!" అని. ఆ పామును చంపవచ్చు. కాని, నాగుబామును చంపకూడదని నియమం. ఒకవేళ చంపితే దాని నోట్లో బంగారునాణెం పెట్టి కాల్చాలి. బంగారం నాణెం వ్యయసాధ్యం గనుక రాగిలో బంగారం ఉంటుందని శాస్త్రం గనుక రాగి నాణెం పెట్టి కాల్చాలి.

నేను నా అజ్ఞానం కొద్దీ - పిన్నయ్యా, పిన్నయ్యా మీ చేతిలో గరుడరేఖ ఉందని చెబుతుంటారుగదా, ఈ పామును ఆపలేరా? అన్నాను. ఆయన వెంటనే ఎడమ చేయి ఎత్తి అరచేయి చాచి చిన్నపడగ విప్పుతూ ఆడుతున్న పామువైపు చాపాడు. ఆయన గరుడరేఖ మాహాత్మ్యమో, ప్రాణభయమో కాని, పాము పడగ దించి వెనక్కు వెళ్లి కలప సామగ్రి గదిలో దూరింది. అప్పుడైతే మా పిన్నయ్యగారి గరుడరేఖ మాహాత్మ్యానికి ముగ్ధుణ్ణయ్యాను గాని, 'ఆ పాము చిన్నది, ఇంత మంది మనుష్యుల మధ్య పడింది. ప్రాణభయంతో వెనక్కుపోయింది' అని ఇప్పటి నా హేతువాదం.

ఇంటిల్లిపాదికి సమస్య ఏర్పడింది. ఇంట్లో చిన్నపిల్లలు, పాములు ఎప్పుడుబడితే అప్పుడు వస్తే గతి ఏమిటి? అని. కలప సామగ్రి మరోచోటికి తరలిద్దామన్నా సమస్యే. తరలించేటప్పుడు ఎవరినైనా కాటువేస్తే? ఎన్ని పాములున్నాయో! సామగ్రిని తొలగించి ఎక్కడ పెట్టాలి? ఆ ఇల్లు కూల్చిగాని కొత్త ఇల్లు కట్టడానికి అవకాశం లేదు.

ఒకనాటి సంఘటన ఇప్పుడు తలచుకుంటే ఒళ్లు జలదరిస్తుంది. కాని, అప్పుడు అదో వినోదం. ఒకరోజు మా అమ్మ చెరువుకు నీళ్లకు వెళ్లింది. నాకు ఆరేళ్లు, నా తర్వాతి చెల్లెలికి మూడేళ్లు. తర్వాతి తమ్ముడికి సంవత్సరం. వాళ్లిద్దరినీ ఆడించే బాధ్యత





నాది. చెరువుకు వెళ్లి తిరిగి రావడానికి ముప్పావుగంటన్నా పడుతుంది. తమ్ముడు దోగాడుతూ వంట ఇంట్లోకి వెళ్లాడు. వాడి వెంట మూడేళ్ల చెల్లెలూ వెళ్లింది. నేను పడసాలలో ఉన్నాను. ఐదు నిముషాల తర్వాత చెల్లెలు వచ్చి, వచ్చీరాని మాటలతో "అన్నా అన్నా! పెద్దపిల్లీ చిన్నపిల్లీ ఆడుకుంటున్నాయి. తమ్ముడు దగ్గరికి పోతున్నాడు. కరుస్తాయేమో వచ్చి వాణ్ణి లాక్కురా" అంది నా చెయ్యి పట్టుకొని లాగుతూ.

నేను లోపలికి వెళ్లాను. చూతునుగదా, భయంకరమైన దృశ్యం. మా అమ్మ వంట ఇంటి తూముకు బిగించే రాతిని బిగించడం మరిచిపోయింది కాబోలు, ఆ తూములోంచి తెల్లటి పెద్ద నాగుబాము లోపలికి వచ్చింది. వంట ఇంటి వెనక పెద్ద పెరడు బయలు కనుక విషజంతువులు వంటింట్లోకి సులభంగా రావచ్చు. వచ్చిన పాము పెద్దపడగ విప్పి నిటారుగా నిలబడి ఉంది. దానికి మూడు నాలుగడుగుల దూరంలో పెద్ద పిల్లి

పంజా ఎత్తి చూస్తూంది. పడగతో కొట్టివేద్దామని పాము, పడగ ముందుకు వస్తే పంజాతో బరికివేద్దామని పిల్లీ పొంచి ఉన్నట్టు నాకు అనిపించింది. కేక కూడ వేసే ధైర్యం లేదు. ఈ రెండింటినీ చూస్తున్నాడు, సంవత్సరం తమ్ముడు, పాముకూ వాడికీ దూరం నాలుగైదడుగులు. పాముకూ వాడికీ మధ్యన కొంచెం ఏటవాలుగా పిల్లి ఉంది. వాడిని లాక్కువద్దామా అంటే పాము తరుముకుని వస్తే? పిల్లి పంజాకు పాము భయపడుతుందని నాకు అప్పుడు తెలియదు. పిల్లి పంజాతో పాము పడగ మీద కొడుతుందట. పడగకు దెబ్బ తగిలితే పాము సగం చచ్చినట్టే! ఈ విషయం తర్వాత తెలిసింది, అమ్మ చెప్పగా. పాము కదలదు, పడగ ఆడిస్తూ పిల్లిని చూస్తుంది. పిల్లి, పరిసర ప్రపంచాన్నే మరిచిపోయి పంజాతో పడగను గాయపరచదానికి అదను చూస్తున్నది. నాకు ఏడుపు వచ్చింది. భయం ముంచుకు వచ్చింది. పాముభయం కాదు. ఈ పరిస్థితిలో తమ్ముడిని పిల్లిగాని, పాముగాని ఏమైనా చేస్తే అమ్మ ఏమంటుంది? ఇంట్లో నాన్నగారుగాని, తాతగారుగాని లేరు. వారికి చెబుదామా అంటే పొద్దున స్నానసంధ్యాదులు ముగించుకొని వెళ్లితే వారికి ఎన్నో పనులు. పనివారు పొలానికో, మరెక్కడికో వెళ్లారు. ఇంటికి పెద్ద నేను. భయం కలిగినప్పుడు పఠించవలసిన 'పంచాయుధ స్తోత్రం' మా అమ్మ నాకు చెప్పింది. దానిలోని రెండు మూడు శ్లోకాలు నాకు అప్పటికే కంఠపాఠం. తక్కినవి ఎవరైనా అందిస్తే చెప్పగలను. కనుక, వెంటనే:

**"స్ఫురత్సహస్రార శిఖాధితీవ్రం**
**సుదర్శనం భాస్కరకోటి తుల్యమ్,**
**సురద్విషాం ప్రాణ వినాశి విష్ణో:**
**చక్రం సదాహం శరణం ప్రపద్యే".**

**(వేయి ఆకులతో, కొనలతో పదునుగా ఉంటూ కోటి సూర్యకాంతితో వెలిగిపోయే, రాక్షసుల ప్రాణాలను నశింపజేసే విష్ణువు చక్రాన్ని నేను నిరంతరమూ శరణు పొందుతున్నాను, అని దీని అర్థం.)**

తర్వాత శంఖాన్ని స్తుతించాను.

**"విష్ణోర్ముఖోత్థానిల పూరితస్య**
**యస్య ధ్వనిః దానవ దర్పహంతా,**

తం పాంచజన్యం శశికోటి శుభ్రం
శంఖం సదాహం శరణం ప్రపద్యే".

**(విష్ణువు ముఖం నుంచి వెలువడే గాలితో నిండి, తన ధ్వనితో దానవుల దర్పాన్ని అణచివేసే కోటి చంద్ర శ్వేతమైన విష్ణువు పాంచజన్య శంఖాన్ని నిరంతరమూ శరణు పొందుతున్నాను అని దీని అర్థం.)**

ఇక భయంతో తర్వాతి శ్లోకాలు నోరు పెగలలేదు. చివరిది మాత్రం ఫలశ్రుతి జ్ఞాపకం వచ్చి చదివాను.

"వనే రణే శత్రు జలాగ్ని మధ్యే
యదృచ్ఛయాపత్సు మహాభయేషు
ఇదం పఠన్ స్తోత్ర మనాకులాత్మా
సుఖీ భవేత్ తత్కృత సర్వ రక్షః"

**(అడవిలోగాని, యుద్ధంలోగాని, శత్రువుల మధ్య ఉన్నప్పుడుగాని, మంటల్లో పడినప్పుడుగాని, హఠాత్తుగా వచ్చిన ఆపదలలోగాని, మహాభయం కలిగినప్పుడు గాని, కలత చెందక ఈ స్తోత్రం చదివే మానవుణ్ణి పంచాయుధాలు అన్ని విధాలుగా రక్షిస్తాయి. అతడు సుఖంగా ఉంటాడు.)**

వీథిలోకిపోయి ఎవరినైనా పిలువవచ్చు. కాని, ఆచారం! వంటింట్లోకి ఎవరినైనా పిలువరాదు. పిలిస్తే అమ్మ కోప్పడితేనో? అయినా తమ్ముడ్ని వదిలి వెళ్లడానికి మనస్సు రాలేదు, ఉండీ ఏమి చేయలేకపోయినా. ఇలా దాదాపు అరగంట గడిచిందేమో! ఎలా గడిచిందో, ఎంత త్వరగా గడిచిందో చెప్పలేను.

ఇంతలో తలవాకిలి చప్పుడయింది. అయినా నేను కదలలేదు. అమ్మ వచ్చిందనే విషయమే మరిచాను. భయంతో నా చెల్లెలు తలవాకిలి వద్దే అమ్మను కలుసుకుని "అమ్మా! అమ్మా! రెండు పిల్లులు పోట్లాడుతున్నాయి. తమ్ముడు దగ్గరే ఉన్నాడు. అన్న అక్కడే నిలబడి ఏదో చదువుతున్నాడు" అని గబగబా చెప్పింది. తమ్ముణ్ణి పిల్లి ఏంచేస్తుందో అనే భయంతో లోపలికి వచ్చి తలమీది నీటి తప్పేలాలను గబుక్కున దింపి, చంకలోని బిందెనూ దింపి, చూచి, భయంతో స్థాణువై నిలబడింది అమ్మ. పాము దాదాపు తోకమీద లేచి పిల్లితో కలబడడానికి, పిల్లి వెనకటి కాళ్లమీద నిలబడి రెండు పంజాలతోను

పాము పడగను చింపి వేయడానికి సిద్ధంగా ఉన్నాయి. ఏమైతే అయింది కానీ అనే మొండి ధైర్యంతో అమ్మ నన్ను పక్కకు తోసి తమ్ముడి కాలుపట్టుకొని వెనక్కు లాగి గుండెలకు అదుముకుంది. మనుష్యులు ఎక్కువయ్యారనో పిల్లిని గెలవలేమనో, మరే కారణంతోనో పాము చప్పున పడగ దింపి, ముడుచుకొని తూము నుంచి వెనక్కు జారుకుంది. పాము హఠాత్తుగా వెనక్కు తగ్గేవేళకు పిల్లి మ్యావు అంటూ వెనక్కు తిరిగి మా అమ్మ కాళ్లను పెనవేసుకుంది. తమ్ముణ్ణి అదే కాపాడిందనే కృతజ్ఞతతో అమ్మ దాని ఒంటిని ఎడమచేత్తో నిమిరింది. "ఎంత పెద్ద గండం గడిచింది స్వామీ! అంటూ అమ్మ పెరుమాళ్ల అరుగువద్దకుపోయి సేవించింది (నమస్కారం జేసింది). ఎన్నిసార్లు సేవించిందో చెప్పలేను. నిజానికి ముగ్గురు పిల్లల ప్రాణాలు పోయేవిగదా! పిల్లి అడ్డుకుంది గాని లేకపోతే పాము ఎందరిని కాటేసేదో, ఏం ప్రమాదం జరిగేదో!

రెండు మూడు గంటలకల్లా ఈ సంగతి మా వాడకంతా తెలిసింది. అంతలోపల మా తాతగారూ తక్కినవారూ వచ్చారు. అందరూ సలహా ఇచ్చారు, కలప సామగ్రి గది ఖాళీ చేయండని, త్వరలో కొత్త ఇల్లు కట్టించండి అని. నాలుగైదు నెలలకు పాత ఇంటిని అంచెలవారీగా కూల్పించి కొత్త ఇల్లు కట్టించారు తాతగారు.

మరొకసారి కూడా పాము ఎదుర్కొనే భయంకర స్థితి ఏర్పడింది. నేను, మరి కొందరు పిల్లలు కలిసి మా పిన్నయ్యగారితోపాటు ఊరి వెలుపలి తోటకు వెళ్లుతున్నాము. దాదాపు రెండు మైళ్లు నడిచాము. దట్టమైన అడవి. రోడ్డుకు అడ్డంగా ఆ కొస నుంచి ఈ కొసవరకు పెద్ద నాగుబాము. గోధుమ రంగుతో మెరిసిపోతూ ఉంది. మేము యథాలాపంగా నడుస్తూ పామును చూడలేదు. ఇంకొక రెండడుగులు వేస్తే దానిమీద పడేవాళ్లమే. మా అలికిడికి అది చర్రున లేచి పడగ విప్పి బుసకొట్టింది. ఒక్క అడుగు వెనక్కు వేశాము. దాటిపోతే, ముందున్నవాడిని కాటు వేస్తుందని భయం. అప్పుడు మా పిన్నయ్యగారి గరుడరేఖ నిజమైన పరీక్ష! ఆయన ఏ మాత్రం నదురు బెదురు లేకుండా చేయి ఎత్తి, చేతిని బాగా విప్పి ఐదువేళ్లూ కనబడేట్టు దాని ఎదుటకి చాచారు. అది పడగతో కొడితే? చేతిని కాటువేస్తే? మేమంతా ఊపిరి బిగబట్టి చూస్తున్నాం. భయంతో కళ్లు మసకలు కమ్మాయి. కొన్ని క్షణాలు గడిచాయి. కాని ఆశ్చర్యం! పాము పడగ దింపి ముడుచుకొని అటు పక్కకు జరజర జారిపోయింది. ఆయన చేయిదింపి ఒక మందహాసం చేశారు. మేమంతా ఆయనను చుట్టుకొని, "ఏమైంది? ఏమైంది?"

అని ప్రశ్న పరంపర కురిపించాం. "ఏముంది? అయ్యేందుకు ఏముంది? పాము వెళ్లిపోయింది" అన్నారు ఆయన. పాము వెళ్లిపోయిందిగదా, ఎలాంటి ప్రమాదము కలిగించక! అప్పుడాయన మమ్మల్ని రోడ్డుపక్కన గుండ్లపై కూర్చోబెట్టి తమ గరుడరేఖను గురించి చాలసేపు చెప్పారు.

ఆయన ధైర్యం, ఆత్మస్థైర్యమే గరుడరేఖ అని నేను ఇప్పుడు భావిస్తున్నాను. ఆత్మబలంతో మానవుడు ఏమైనా చేయగలడు. కొండను పిండి కొట్టగలడు. సముద్రాలను ఇంకింపచేయగలడు. క్రూరమృగాలను మచ్చిక చేసుకోగలడు. ఆత్మబలం ఆత్మగుణాలతో వస్తుంది. బుద్ధుడు తన మీదికి వచ్చిన మదోన్మత్తమైన నలగిరి ఏనుగును అణచి వేయడం, ఎందరినో చంపి వారి బొటన ప్రేళ్లను మాలగా గుచ్చి మెడలో వేసుకొని అతి భీకరుడుగా, రాక్షసుడుగా ప్రవర్తించిన అంగుళీమాలుణ్ణి సాత్వికుణ్ని చేసి శిష్యుణ్ణి చేసుకొని అర్హంతుని చేయడం మనోబలంతోనే.

**"అసమత్థ మంత తంతాణ**
**కుల విముక్కాణ భోగహీనాణం,**
**దిట్టాణ కొణ వీహఇ**
**వింతర సప్పాణ వఖలాణం"**

**(పాములు మంత్రతంత్రాలకు కట్టుబడుతాయి. ఖలులు కట్టుబడరు. వారిని కట్టివేసే మంత్రాలేమీ లేవు. పాములకు కులాలు, తెగలు ఉన్నాయి. ఖలులకు లేవు. వారు మంచి కులాల వారు కారు. పాములకు భోగాలు, పడగలు ఉన్నాయి. ఖలులకు లేవు, కనుక ఖలులు పడగలు లేని వింత పాములు. ఇలాటి వారిని చూచి ఎవరు భయపడరూ?)**

# 10

# రైట్ ఆనరబుల్ కోలాచలం వెంకటరావుగారు

"భవంతి నమ్రాస్తరవః ఫలోద్గమైః
నవాంబుభిః దూరవిలంబినో ఘనాః
అనుద్ధతాః సత్పురుషాః సమృద్ధి భిః
స్వభావ ఏవైష పరోపకారిణామ్."

**(ఫలభారంతో చెట్లు కిందికి వంగుతాయి. నీరు నిండుగా ఉన్న మేఘాలు చాలదూరం వరకు అతి విశాలంగా వ్రేలాడుతుంటాయి. సత్పురుషులు సంపద ఎంత పెరిగినా గర్వపడరు. వినమ్రులుగా ఉంటారు. ఇది పరోపకారుల స్వభావం.)**

**మా** తాతగారు, నాయనగారు దేశభక్తులని, తిలక్ అనుయాయులైన కాంగ్రెస్ వాదులని ఇదివరకే తెలిపాను. కోలాచలం వెంకటారావుగారనే వారు అప్పుడు బళ్లారిలో ప్రముఖ న్యాయవాది. "లయన్ ఆఫ్ ది బార్" అని ఆయన బిరుదు. ఆయన ప్రముఖ నాటకకర్త కోలాచలం శ్రీనివాసరావుగారి జ్యేష్ఠభ్రాత. కోలాచలం వారికి మావూరి పొలిమేరలలోని వెంకటాపురం, బుక్కసాగరాలలో భూములు ఉండేవి. వాటిని మా తాతగారు సాగుచేయించేవారు. శిస్తు వసూలు కోసం వెంకటరావుగారు, ఆయన జ్ఞాతి కోలాచలం షణ్ముఖ శాస్త్రిగారు ఏటా పంట కాలంలో మా ఊరికి వచ్చేవారు. వెంకటరావుగారు చాల గొప్ప నాయకులు. ఆయనను బళ్లారితోపాటే తెలుగువారు విస్మరించారు గనుక వివరంగా చెప్పాలి.

వెంకటరావుగారు కాంగ్రెస్‌వాది. భారత జాతీయ కాంగ్రెస్ స్థాపక సభ్యులలో ఒకరు.

ఆయన 1850 ఫిబ్రవరి 28న బళ్లారిలో జన్మించారు. ఆయన దేశానికి, సంఘానికి చేసిన సేవ అపారం. ఆయన ప్రముఖ న్యాయవాది. సంఘ సంస్కర్త. మహాదాత, రాజనీతి దురంధరుడు.

కోలాచలం వంశం మహావ్యాఖ్యాత మల్లినాథసూరివంటి ఉద్దండ పండితులు జన్మించినట్టిది. వెంకటరావుగారి పితామహులు కోలాచలం సుబ్బాశాస్త్రిగారు ధార్వాడ జిల్లాలోని గజేంద్రగఢ అనే సంస్థానంలో ఉండేవారు. ఆయన మహారాష్ట్ర, కన్నడ భాషలలో పెక్కు హరికథలు వ్రాసి, చెప్పి జనసామాన్యాన్ని సేవించారు. వెంకటరావు గారి తండ్రిగారు రాయచూరు జిల్లా ఆనేగొంది సంస్థానంలో పెక్కేళ్ళు దివానుగా ఉన్నారు.

వెంకటరావుగారు బళ్లారిలోని వార్డ్‌లా విద్యాసంస్థలోని, గవర్నమెంట్ ప్రావిన్షియల్ స్కూలులో చదివి 1867లో ఎఫ్.ఏ.లో ఉత్తీర్ణులై మద్రాసులోని ప్రెసిడెన్సీ కాలేజీలో చదివారు. అప్పుడా కాలేజీ ప్రిన్సిపాలు మిస్టర్ థాంప్సన్. అప్పటి మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీ ఒకటే ఫస్ట్‌గ్రేడ్ కాలేజీ. వెంకటరావుగారు, 19వ ఏటనే పట్టభద్రులయ్యారు. ఆయన ఉపాధ్యాయుడుగా జీవితం ప్రారంభించి 1874 వరకు ఆ వృత్తిలో ఉన్నారు. పిదప జిల్లా మున్సిఫ్ ఆఫీస్‌లో హెడ్ గుమస్తాగా నియమితులై నాలుగేళ్లు పనిచేసి, తర్వాత రెండేళ్లు డిప్టీ తాసిల్దారుగాను, సబ్ మేజిస్ట్రేట్‌గాను వ్యవహరించారు. న్యాయవాదిగా వుండడం తన మనస్తత్వానికి అనుగుణమని భావించి ఆయన 1880లో న్యాయశాస్త్ర పట్టభద్రులై బళ్లారి న్యాయస్థానాలలో సివిల్, క్రిమినల్ కేసులలో వాదిస్తూ కక్షిదారులకు న్యాయం చేకూర్చేవారు. న్యాయమైన కేసులు తీసుకుంటారని, నీతిమంతులని ఆయనకు క్రమంగా పేరు వచ్చింది. 'లయన్ ఆఫ్ ది బార్' (న్యాయవాద కేసరి) అని పేరు వచ్చింది. కొన్ని సంవత్సరాల క్రితం బళ్లారి బార్ అసోసియేషన్‌లో న్యాయమూర్తి ఇ.ఇ.మెక్  వెంకటరావుగారి చిత్రపటాన్ని ఆవిష్కరిస్తూ ఆయనను ఎంతగానో ప్రశంసించారు. వృత్తిలో ఆయనను లక్ష్మీదేవి కటాక్షించింది. గొప్ప ఐశ్వర్యవంతులయ్యారు. ఆయన బొంబాయి, మద్రాసు హైకోర్టులలో వాదించే వారు, ఉభయత్రా గొప్ప పేరు పొందారు.

ఒకమారు ఆయన బొంబాయి హైకోర్టు ఫుల్‌బెంచ్ ముందు వాదిస్తున్నారట. ప్రధాన న్యాయమూర్తి సర్ బాసిల్ స్కాట్. ఇతడు చాలా చిరాకురాయుడు. వెంకటరావుగారు వాదించడం ప్రారంభించగానే, అతడు "మీరు చెప్పినదంతా ఫుల్ బెంచి ఇదివరకు

తీర్పులో తెలిపింది" అంటూ అడ్డు తగిలాడు. బెదిరిపోని వెంకటరావుగారు "మైలార్డ్, అది ఫుల్‌బెంచి తీర్పుకాదు, మీరు చేసిన నిర్ణయానికి తక్కినవారి తలూపు" అని ఒక విసురు విసిరారు.ప్రధాన న్యాయమూర్తి ఈ సంగతి ఒప్పుకోవలసి వచ్చింది. ఈ విషయం బొంబాయి హైకోర్టు శతజయంతి సంచికలో వుంది.

వెంకటరావుగారు, బళ్లారి జడ్జి, (తర్వాత మద్రాసు హైకోర్టు జడ్జి). ఆయన మిస్టర్ డబ్ల్యు.డబ్ల్యు.ఫిలిప్స్‌తో, ఒకమారు ఘర్షణ పడవలసి వచ్చింది. ఒక కేసు వాదిస్తున్నప్పుడు. "మిస్టర్ వెంకటరావ్, నీవు నా సమయం వృథా చేస్తున్నావు" అన్నాడట మిస్టర్ ఫిలిప్స్. వెంకటరావుగారు వెంటనే "మైలార్డ్, మీకు నెల జీతం, నాకు నిమిషాలకు గంటలకు జీతం. నా సమయం మీ సమయంకన్నా విలువైనది" అన్నారట.

వెంకటరావుగారు 1893లో థియొసాఫికల్ సొసైటీ సభ్యులై, క్రియాశీలంతో పనిచేస్తూ దేశప్రజల సంక్షేమానికి సంబంధించిన వివిధ విషయాలలో – మత, సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ రంగాలలో శ్రద్ధచూపారు. ఆయన బళ్లారి థియొసాఫికల్ సొసైటీ స్థాపక సభ్యులు. ఈ సొసైటీ భవన నిర్మాణానికి ఉదారంగా విరాళ మిచ్చారు. ఈ భవనం ఇప్పటికీ ఉంది.

ఆ కాలంలో వివాహాలలోను, దేవాలయోత్సవాలలోను భోగంమేళాలు ఏర్పాటు చేయడం రివాజు! దేవదాసీ పద్ధతికి బద్ధ విరోధి అయిన వెంకటరావుగారు, వారి మిత్రులైన రావ్ బహదూర్ ఏ. సంబంధ మొదలియార్‌గారితో పాటు ఈ పద్ధతిని బళ్లారి ప్రాంతంలో తుడిచిపెట్టివేశారు.

స్థానిక సంస్థల విస్తరణకు లార్డ్ రిప్పన్ సూచనలు పంపినప్పుడు వెంకటరావుగారు సభాపతి ముదలియార్ గారితో పాటు స్థానిక వర్తకులను స్థానిక సంస్థల ఎన్నికలలో నిలవడానికి ప్రోత్సహించి చాల మంది ఎన్నికయ్యేట్టు చేశారు. 1885లో బొంబాయిలో మార్క్విస్ రిప్పన్‌కు సన్మాన పత్రం అందజేయదానికి బళ్లారి ప్రముఖుల తరఫున వెళ్లారు. ఆ సమయంలో ఆయన భారత జాతీయ కాంగ్రెస్ ప్రథమ సమావేశాలలో పాల్గొని 72 మంది సంస్థాపక సభ్యులలో ఒకరయ్యారు. సోషల్ కాంగ్రెస్ మహాసభలలో పాల్గొన్నారు. ఆయన వరుసగా పెక్కేళ్లు ఈ సంస్థల వార్షిక సమావేశాలలో పాల్గొన్నారు.

వివిధ దేశాల ప్రజల వ్యవహారాదులు, దేవాలయాల, మసీదుల, చర్చిల, బౌద్ధ విహారాల – ప్రాచీన, నవీన వాస్తు శిల్పాదులు తెలుసుకొనదానికి ఆయన 1884లో



కోలాచలం వెంకటరావు

భారతదేశంలోని వివిధ ప్రాంతాలలోను, లంక, బర్మా, చైనా, తక్కిన ఆగ్నేయాసియా దేశాలలోను పర్యటించారు.

ఆయనకు 1884లో మద్రాసులో బ్రహ్మసమాజ ప్రచారకులు మన్నవ బుచ్చయ్య పంతులుగారితోను, మహా సంఘ సంస్కర్త వీరేశలింగంపంతులుగారితోను పరిచయం కలిగింది. తత్ఫలితంగా; బళ్లారిలో తన బంగళాలో, తన ఖర్చుతో మూడు విధవా వివాహాలు చేయించి సనాతనుల ఆగ్రహానికి గురి అయ్యారు. సముద్రయానం చేసినందుకు, విధవా వివాహాలు చేయించినందుకు ఆయనను సనాతనులు బహిష్కరించారు. ఆయన భయపడక వారి అనుగ్రహం సంపాదించడానికి మార్గాంతరం ఆలోచించి ఒక సవరను (బంగారు కాసు) దక్షిణతో సమారాధన ఏర్పాటు చేశారు. దక్షిణ ఆశకు బ్రాహ్మణులు వచ్చారని చెప్పడం అవసరం లేదు. ఆ వివాదంలో హంపీ విరూపాక్ష మఠం శంకరాచార్యులు తటస్థులుగా వున్నారు.

వెంకటరావుగారు 1902లో ఇంగ్లాండ్ వెళ్లి, అక్కడి నుంచి రష్యా, టర్కీ దేశాలు మినహాగా ఆరు నెలలపాటు యూరోప్ దేశాలన్నీ పర్యటించి అక్కడిప్రజల స్థితిగతులు తెలుసుకొని భారత స్థితిగతులు వారికి తెలియజేశారు. ఆయన ప్రభుత్వాహ్వానంపై 1902లో ఆగస్టు 9వ తేదీన లండన్‌లో జరిగిన సప్తమ ఎడ్వర్డ్ చక్రవర్తి పట్టాభిషేకోత్సవాన్ని తిలకించారు. తర్వాత బ్రిటిష్ ప్రభుత్వం ఆయన సేవలకు మెచ్చి 'రైట్ ఆనరబుల్' అనే బిరుదంతో సత్కరించింది. ఆయన పర్యటన నుంచి తిరిగి వచ్చినప్పుడు బళ్లారి పౌరులు కనివిని ఎరుగని స్వాగతం ఇచ్చారు.

బళ్లారి పట్టణంలో ప్లేగు తీవ్రంగా వ్యాపించిన 1902 ప్రారంభంలో, ఆయన బళ్లారి మునిసిపల్ ఛైర్మన్‌గా ఎన్నికయ్యారు. ఆయన మూడు నెలలపాటు పగలనక రాత్రనక

తన ఆరోగ్యం, ఆదాయం దెబ్బతిన్నా లెక్కచేయక ప్లేగును రూపుమాప డానికి కృషిచేసి, విజయం పొందారు. ఈ కృషిలో ఆయన స్వార్జితం వేల రూపాయలు ఖర్చుపెట్టారు. ప్రభుత్వం చేపట్టిన ప్లేగు నివారణ చర్యలకు సహకరించారు. బళ్లారిలో ఎప్పుడు ప్లేగువచ్చినా, ఆయన విశాలమైన బంగళా ఆవరణ కాందిశీకుల శిబిరంగా మారిపోయేది.

ఆయన మహాదాత! 1906 నుంచి తన నెలసరి రాబడిలో నాల్గవవంతును దానధర్మాలకు వినియోగించారు. వీరేశలింగం పంతులుగారు స్థాపించిన విధవాశ్రమానికి ఐదువేల రూపాయల విరాళమిచ్చారు. కాశీ విశ్వవిద్యాలయానికి పెద్ద మొత్తం దానం చేశారు. భారత జాతీయ కాంగ్రెస్‌కు సంబంధించిన బ్రిటిష్ సంఘానికి ఏటా 500 పౌనులు ఇచ్చేవారు. హిందూ, ముస్లిం, క్రైస్తవ సంస్థలకు నిరంతరం దానం చేసిన దాత. బళ్లారి కాస్మాపాలిటన్ క్లబ్బు భవన నిర్మాణానికి ఉదారంగా దానమిచ్చారు. తన బిలియర్డ్స్ టేబిల్‌ను కూడా ఆ క్లబ్‌కు దానమిచ్చారు. అది ఇప్పటికీ ఉంది.

తూర్పు ప్రాంతం మునిసిపాలిటీ వర్గం ఆయనను 1903 మద్రాస్ శాసనమండలికి ఎన్నుకుంది. ఈయనతో పోటీచేసిన ఏలూరు(కృత్తివెంటి) పేర్రాజు పంతులుగారు ఓడిపోయారు. వెంకటరావుగారు 1904 నుంచి 1907 వరకు ఇంగ్లాండులో న్యాయశాస్త్రం చదివి బార్-ఎట్-లా పట్టా పుచ్చుకుని తిరిగి వచ్చారు. ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశం గారు ఈయన సహాధ్యాయులు.

వెంకటరావుగారి ప్రముఖ మిత్రులు బాలగంగాధర తిలక్, పండిత మదన్‌మోహన్ మాలవ్య, టంగుటూరు ప్రకాశం, వీరేశలింగంపంతులు, దాదాభాయి నౌరోజీ, గోపాలకృష్ణ గోఖలే, అనీబీసెంట్ మున్నగువారు. బాలగంగాధర తిలక్‌ను 1916లో అరెస్టు చేసినందుకు నిరసనగా వెంకటరావుగారు తమ 'రైట్ ఆనరబుల్' బిరుదును పరిత్యజించారు.

ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారి 'నా జీవితయాత్ర'లో చాలాచోట్ల కోలాచలం వెంకటరావుగారి ప్రస్తావన ఉంది. ఒకటి ఉదాహరిస్తాను.

'ఇలా ఉండగా, అప్పట్లో లెజిస్లేటివ్ కౌన్సిల్‌కి తెలుగు జిల్లాకొక స్థానం ఖాళీ అయింది. ఆ స్థానానికి ఆ రోజుల్లోనే ఇంగ్లండు నుంచి తిరిగి వచ్చి బళ్లారిలో ప్లీడరీ చేస్తున్న కోలాచలం వెంకట్రావుగారు పోటీచేశారు. కాకినాడలో ప్లీడరీ చేస్తున్న కృత్తివెంటి పేర్రాజుగారు కూడా ఆ స్థానానికి నిలబడ్డారు. ఆయన సుబ్బారావు(న్యాపతి)

పంతులుగారి అభ్యర్థి. వెంకటరావుగారు అప్పుడే ఇంగ్లండ్ నుంచి తిరిగి వచ్చారని వ్రాశాను.

"ఆ కాలంలో అల్లాంటి మనుష్యుల మీద మోజు ఎక్కువగా ఉండడంచేత నేనాయనకు అనుకూలంగా పనిచేయడానికి నిశ్చయించాను. అంచేత సుబ్బారావు గారికి నా మీద విపరీతమయిన ఆగ్రహం కలిగింది. కృత్తివెంటి పేర్రాజుగారు నాకు కొద్దో గొప్పో బంధువర్గంలో వాడయినప్పటికీ, నేను రాజమహేంద్రవరంలోనే కాకుండా ఇతర గ్రామాలకు కూడా వెళ్లి వెంకట్రావుగారి తరపున ప్రచారం చేశాను. వెంకటరావుగారు గెలిచారు. కృత్తివెంటి పేర్రాజుగారు ఓడిపోవడంతోనే సుబ్బారావు పంతులుగారు నన్ను ఏ విధంగాను కూడా పైకిరానీయనని శపథం పట్టారు."

వెంకటరావుగారు 50 వేల రూపాయల వ్యయంతో బళ్లారిలో పురమందిరం (టౌన్‌హాల్) కట్టించారు. డెబ్బైవేల రూపాయలు వెచ్చించి 30 వేల గ్రంథాలున్న గ్రంథాలయం నెలకొల్పారు. ఉచిత వైద్యశాలను నిర్మించారు. తమ అనుజులు కోలాచలం శ్రీనివాసరావుగారి నాటకాల ప్రదర్శన కోసం 'సుమనోరమాసభ' అనే నాటకశాలను నిర్మించారు. బీద హిందూ బాలబాలికల కోసం20 వేల రూపాయలతో ఒక అనాథశరణాలయం కట్టించారు.

వెంకటరావుగారికి వ్యాపార దృష్టి కలిగింది. పరిశ్రమలు స్థాపించి బళ్లారిని పారిశ్రామికంగా సంపన్నం చేయదలిచారు. అందుకోసం లక్షరూపాయల పెట్టుబడితో నాలుగు జిన్నింగ్ అండ్ ప్రెస్సింగ్ ఫ్యాక్టరీలతో సభాపతి ప్రెస్ కంపెనీ లిమిటెడ్ అనే సంస్థను స్థాపించారు. 'రిప్పన్ ప్రెస్ అండ్ షుగర్ మిల్స్ కంపెనీ లిమిటెడ్'ను తన వాటా 50 వేల రూపాయలతో స్థాపించారు. ఈ రెండు సంస్థలకు ఈయనే ఛైర్మన్. రెండు లక్షల పెట్టుబడితో స్థాపించిన దక్కన్ ప్రెస్సింగ్ అండ్ జిన్నింగ్ కంపెనీకి ఆయన కార్యదర్శి. బ్రిటిషు, దక్షిణాఫ్రికా, రష్యా పెట్టుబడిదారులతో కలిసి తాను మేనేజింగ్ డైరెక్టరుగా వజ్రకరూర్ డైమండ్ ప్రోస్పెక్టింగ్ కంపెనీని స్థాపించారు. మరి కొన్ని కంపెనీలు ఆయనకు ఉండేవి. మరికొన్ని నూలు, నేత, చక్కెర కార్ఖానాలలోను, వాటాదారుగా ఉన్నారు.

దురదృష్టవశాత్తు ఈ సంస్థలేవీ అభివృద్ధికి రాలేదు. భారీ నష్టం వచ్చింది. అవసాన దశలో కుటుంబ వ్యాజ్యాలలో చిక్కుకున్నారు. ఆస్తి అంతా కోల్పోయారు. 1931 డిసెంబర్

25న దయనీయ దశలో కాలధర్మం చెందారు. ఆ కాలంలో నిజానికి వెంకటరావుగారు లేని బళ్లారే లేదు. ఇప్పటివారికి ఆయన పేరయినా తెలియదు.

తెల్లటి ఖద్దరు దుస్తులతో తలపాగాతో బంగారు రంగుతో మెరిసిపోయే ఆయన రూపు ఇంకా నాకు గుర్తుంది.

అప్పటికే డెబ్భైయవ పడిలో పడ్డారు. ఆయన అనర్గళంగా తమ అనుభవాలు చెప్తూ ఉంటే నాకు అర్థంకాకపోయినా వినేవాణ్ణి. జాతీయ భావాలు నాలో బాగా నాటుకోవడానికి ఆయన పరోక్ష ప్రోత్సాహం ఉంది. భారతదేశంలోనే బహుశా ఆయన మొదటి 'రైట్ ఆనరబుల్' బిరుదు విరాజితులు. దానిని తృణప్రాయంగా త్యజించారు. దేశానికి పేరు తెచ్చిన గొప్ప వ్యక్తి.

ఆయన ముని మనవడు అనంత ప్రసాద్ తాత గారి న్యాయవాద వృత్తిని బళ్లారిలో కొనసాగిస్తున్నారు.

**"ద్వావిమౌ పురుషౌ లోకే**
**స్వర్గ స్యోపరి తిష్ఠతః**
**ప్రభుశ్చ క్షమయా యుక్తః**
**దరిద్రశ్చ ప్రదానవాన్"**

**(ఇద్దరు వ్యక్తులు స్వర్గం దాటి అంతకుమీదున్న లోకాలలో ఉంటారు. వారెవరంటే ఓర్పుగల ప్రభువు. దానం చేసి దరిద్రుడైన వాడూను.)**

## 11

# తెనాలి రామన మంటప

"విద్వాంసః కవయో భట్టాః

గాయకాః పరిహాసకాః

ఇతిహాస పురాణజ్ఞాః

సభా సప్తాంగ సంయుతా"

**(విద్వాంసులు, కవులు, భట్టరాజులు, గాయకులు, పరిహాసకులు, ఇతిహాస వేత్తలు, పురాణజ్ఞులు - ఈ ఏడుగురు రాజాస్థానానికి ఏడు అంగాలు.)**

**హం**పీ శిథిలాలలో పాడుపడిపోయిన భువనవిజయ సభామంటపం ఎదుట దాదాపు అరమైలు దూరంలో ఒక గుట్టమీద నాలుగు స్తంభాల ఒక చిన్న మంటపం ఉంది. దీనిలో ఇద్దరు అనాయాసంగా కూర్చోవచ్చు. దీనికి తెనాలి రామన మంటప (తెనాలి రాముని మంటపం) అని పేరు. కుతూహలంతో మా తాతారిని అడిగాను ఆ పేరు ఎందుకు వచ్చిందని.

నా ప్రశ్నతో ఆయన ముఖంపై ఒక మందహాసం మెరిసింది. "దానికి ఆ పేరు రావడానికి రాజాంతఃపుర రహస్యం ఒకటి ఉందిలే. అది నగరమంతా గుప్పుమనడానికి కొంటె కోణంగి తెనాలి రామకృష్ణుడు కారణమయ్యాడు. ఆ మంటపంలో తిష్ఠవేశాడు. అదీ కారణం, ఆ పేరు రావడానికి" అన్నారు ఆయన. నేను బతిమాలగా ఇలా చెప్పారు కథనం అనుపూర్విగా.

తెనాలి రాముడు గొప్ప హాస్యగాడు. ఆ కాలంలో ఉత్తరాపథంలో బీర్‌బల్, దక్షిణా పథంలో తెనాలి రాముడు హాస్యగాళ్లుగా పేరు పొందారు. తెనాలి రాముడు కృష్ణరాయల ఆస్థాన విద్వాంసుడు కాదు గాని, పెద్దనగారి వెంట, తాతాచార్యుల వెంట తరచు ఆస్థానానికి రావడం; రాయలవారి చెవిలో పడేట్టు ధైర్యంగా హాస్యోక్తులు అనడం,

రాయలవారు ఓర చూపులతో ఆ యువకుణ్ణి చూసి మెచ్చుకోవడం జరిగేవి.

ఒక మారు రాయలవారు అంతఃపురంలో ఏకాంతంలో ఉన్నారు. రాణీ చిన్నాదేవి గారితో సంభాషిస్తున్నారు. ఆయన ఉత్సాహంతో ఆమెను ముద్దు పెట్టుకుందామని ముందుకు వంగినప్పుడు ఆమె 'ఛిచ్ఛిచ్ఛిచ్ఛో' అని పెద్దగా తుమ్మిందంట. రసాభాస మయినందుకు రాయలవారు మనస్సు విరిగి లేచి వెళ్లిపోయారట. తుమ్ము, దగ్గు మొదలయిన వాటిని ఆయుర్వేద శాస్త్రంలో వేగాలు అన్నారు. వాటిని ఆపలేము. బలవంతంగా ఆపితే లేని వ్యాధులు పుట్టుకువస్తాయి. రాణీగారు ఏంచేస్తుంది పాపం! తుమ్మేసింది. వేగనిరోధం ఆమె తరమా?!

ఈ గోరంతది కొండంత అవుతుందేమోనని రాణీగారు దాసీలకు హెచ్చరిక చేశారు. ఈ సంగతి; ముఖ్యంగా రాయలవారు వైరస్యంతో వెళ్లిపోవడం-బయటకు పొక్కగూడదని. కాని, దాసీల నోట్లో నూవుగింజ నానేనా? ఒక దాసీది తన కూతురికి ఈ సంగతి చెప్పిందట. ఈ కూతురు తెనాలి రాముని ఇంట్లో పనిచేసేదట. అది ఏదో రాజరహస్యం తెలిసినట్లు ఉత్సాహంగా ఉంటే, తెనాలి రాముడు దానినుంచి అసలు విషయం రాబట్టాడు. ఇకనేం? అందరినీ నవ్వించడానికి మంచి అవకాశం.

తెనాలి రాముడు సంపన్నుడైన గృహస్థుగదా! గుర్రం, బండీ, పల్లకీ - అట్టహాస మంతా ఉండేది. గుర్రం మూతిని ఎర్రటి గుడ్డతో గట్టిగా బిగించి చేత్తో పేము బెత్తం పట్టుకుని; ఇంటి నుంచి రాచవారూ, రాయలూ నివసించే ప్రాంతాలకు వెళ్లాడు. దాన్ని కొట్టుకుంటూ, తిట్టుకుంటూ, "ఏమిటి స్వామీ! గుర్రం మూతిని అంతగా బిగించారు? ఊపిరాడనివ్వండి" - అని ఎవరైనా అడిగితే 'బాగుంది, అంతఃపుర రహస్యాలు అది చెబుతుందేమోనని భయపడి దాని మూతి బిగించానండీ!" అని సమాధానమిస్తూ వెళ్ళాడు.

ఇలా నాలుగైదు గంటల్లో నగరంలోని ప్రధాన వీధులన్నీ తిరిగాడు తెనాలి రాముడు. అంతఃపురంలో ఏదో జరిగిపోయింది. ఏమి రహస్యమో ఏమో! అంటూ జనమంతా గుసగుసలు పోయారు. ఇక వేగులవారు తెనాలి రాముని వద్దకు విషయం తెలుసుకుందామని బయలుదేరారు. తెనాలి రాముడు వారు వేగులనీ, తన మాటలు రాయలవారికి కచ్చితంగా చేరుతాయని తెలిసి, భయం నటిస్తూ "మరేం లేదండీ, రాయలవారు నిన్న రాత్రి చిన్నాదేవిగారితో ఏకాంతంలో ఉండగా చిన్నాదేవిగారు తుమ్మారట. ఆ సంగతి ఈ గుర్రం - చాల చెడ్డది - ఎక్కడ సకిలిస్తుందో అని మూతి

బిగించాను. నాకెందుకండీ: ఏవో పద్యాలు చెప్పామో, పెద్దలకు వినిపించామో! అంతేగాని రాచనగరులోని రాణుల సంగతి నాకెందుకండీ! ఇది మా చెడ్డగొడ్డు, అనవసరంగా, గురువుగారికి కోపం రావడం ఆయన చీవాట్లు పెట్టడం..." అంటూ నీళ్లు నమిలాడు, వేగులవారు నవ్వుకుంటూ వెళ్లిపోయారు. తెనాలి రాముడు ఇంటికి మళ్లాడు.

వేగుల ద్వారా రాయలవారికి సంగతులు తెలిశాయి. రాత్రి అంతఃపురంలో ఏకాంతంలో జరిగినది తెల్లవారేసరికి తెనాలి రామునికి చేరడమేకాక, అతడు దానిని ఊరంతా ఈ విధంగా చాటడం రాయలవారికి కష్టం కలిగించినా, తెనాలి రాముడు గుర్రం మూతి బిగించినందుకు నవ్వుకున్నారు. అయినా, గట్టిగా మందలించాలనుకుని "తన ముఖం నాకు చూపవద్దని తెనాలి రామునికి చెప్పండి" అంటూ నగరపాలకునికి ఉత్తరవు చేశారు. తెనాలి రాముని చర్యలకు నవ్వుకున్నవాళ్లు నవ్వుకున్నారు. కిట్టని వాళ్లు మాత్రం తగిన శాస్తి అయిందని బుజాలు ఎగరేసుకున్నారు.

తెనాలి రామునికి రాయల ఉత్తరువు అందింది. పాటించక తప్పదుగదా! కానీ, దీనికి విరుగుడు ఆలోచించాడు. మెరుపులాంటి పథకం తోచింది. నవ్వుకున్నాడు. రెండు రోజులు గడిచాయి. రాయలవారు ఎప్పటిలాగే భువన విజయాస్థానానికి విచ్చేశారు. వందిమాగధులు కైవారాలు చేస్తుండగా రత్నసింహాసనాసీనులై తలెత్తారు. దూరంలో ఎదుట మూడు పెద్ద పెద్ద నామాలు కనిపించాయి. "నిన్న లేని ఈ పట్టె వర్ధనాలు ఈ రోజు ఎలా వచ్చాయి? అది కావలి మంటపం గదా! రాత్రిపూట రాజభటులు కాపలా ఉండడానికి అలాటి మంటపం. దానిలో నామాలు ఏమిటి?..." మూడోసారి శ్రద్ధగా చూచి, పక్కన నిలుచున్న అంగరక్షకుడు దొణ్ణే నాయకుడిపై దృష్టిసారించారు. రాయలవారి వైఖరిని ముందు నుంచే పరిశీలిస్తున్న దొణ్ణేనాయకుడు "చిత్తం! అదేదో కనుక్కొని విన్నవిస్తాను" అంటూ పక్కకు రెండడుగులు వేసి, ఇద్దరు సైనికులను పరుగెత్తించాడు అక్కడికి.

రాయలవారు, దొణ్ణేనాయకుడు అటు చూడడంతో సభాస్తారులంతా తలలెత్తి అటువైపు చూచారు. తిరుమణి తిరుచూర్ణాలతో మూడు పెద్ద పెద్ద చారలు! మంటపమంతా కప్పివేసిన నామాలు! అందరికీ వింతే. నగరమంతా ఎప్పటికప్పటికే వింతలు, విడ్డూరాలు ఎన్నో! అనుకుంటూ గుసగుసలాడుతున్నారు.

పదినిమిషాలలో భటులు తిరిగి వచ్చారు – అపూర్వమైన సమాచారంతో. రాయలవారు



తన ముఖం చూపవద్దని ఆజ్ఞాపించడం వల్ల తెనాలి రాముడు వీపు మీద పెద్ద పట్టె నామాలు పెట్టుకుని కూచున్నాడు. ఇదీ సంగతి. రాయలవారు నవ్వుకున్నారు. సభాస్తారులలోను నవ్వులు వెలిగాయి.

"పిలుచుకొని రండి ఆయనను!" అని ఆజ్ఞాపించారు రాయలవారు. భటులు వెళ్లి రాజాజ్ఞ వినిపించారు. "రాయలవారు నా ముఖం చూడనన్నారు గనుక వెనక్కు నడుస్తూ వీపు చూపుతూ వస్తాను. ఆలస్యమవుతుంది. నన్ను బలవంత పెట్టకండి" అని తెనాలి రాముడు నడిచాడు వాళ్ల వెంట. మూతి కట్టుతో గుఱ్ఱం కూడా వాళ్ల వెంట నడిచింది.

తెనాలి రాముడు వెనక్కు నడుస్తూనే భువనవిజయంలో ప్రవేశించాడు. దొణ్ణె నాయకుడు, మంత్రి సామంతులు మొదలయిన వారంతా నవ్వు ఆపుకోలేక నోటికి చేతులు అడ్డం పెట్టుకొన్నారు. రాయలవారు ముఖంలో మందహాసం వెలసినా, గాంభీర్యం పులుముకొని, నామాలు చాదుకున్న తెనాలి రాముని వీపు చూస్తూ "యువ కవిగారు! నాకు వీపు చూపనక్కరలేదు" అన్నారు. "సార్వభౌమా! మహాపరాక్రమ వంతులైన శత్రురాజులే తమకు వీపు చూపుతుండగా, నేనెంతటివాడిని!" అని తెనాలి రాముడు సముఖానికి తిరగకుండానే మనవి చేశాడు. "వెన్ను చూపడం ఓడిన శత్రువుల పని, ఓటమి ఎరుగని కవుల పనికాదు. కనుక వీపు వెనకకు తిప్పవచ్చు" అన్నారు రాయలవారు.

తెనాలి రాముడు రాయలవైపు తిరిగాడు. ద్వాదశోర్ధ్వ పుండ్రాలతో ఉన్నాడు. రాయలవారు ఇక నవ్వు ఆపుకోలేకపోయారు. రాయలవారితోపాటు సభలోని వారంతా నవ్వారు.

'ఇదీ తెనాలి రాముని మంటపం కథ!" అని అన్నారు మా తాతగారు.

"తాతా! తాతా! నేను ఆ మంటపం దగ్గర్లోను, హజారరామస్వామి గుడి సమీపం లోను విరిగిన కొన్ని పొడుగాటి రాతి తొట్లు, వాటి ముక్కలూ చూచాను. అవి ఏమిటో?" అనడిగాను. తాతగారు చెప్పారు ఇలా.

"పూర్వం విజయనగర సార్వభౌముల సైన్యంలో గజదళాలు పదాతిదళాలే ఎక్కువ. బహమనీ సుల్తానులకు ఆశ్విక బలం ఎక్కువ. అందువల్లనే వారు యుద్ధాలలో సులభంగా విజయం పొందేవారు. ఈ రహస్యం గుర్తించిన రాయలవారు, పశ్చిమ సముద్ర తీరంలోని గోవాను పట్టుకొని, విదేశాల నుంచి మంచి జాతి గుర్రాలను దిగుమతి చేయించుకుని ఆశ్విక దళాల బలం పెంచుకొన్నారు. గుర్రప్పిల్లలను దిగుమతి చేయించుకొనేవారు. వాటికి పాలు తాపడానికి రెండడుగుల వెడల్పు రెండడుగుల ఎత్తు, పది పదిహేనడుగుల పొడవు రాతి తొట్లు మలిపించారు. విరిగిపడి ఉన్న ముక్కలు వాటివే. ఒక్క తొట్టి మాత్రం భద్రంగా మిగిలింది. దానిని పురాతత్వ శాఖవారు హజారరామస్వామి గుడి సమీపంలో భద్రపరచారు. గుర్రాల దండుతో తర్వాత రాయలవారికి అపజయమనేదే లేదు."

మా తాతగారికీ, మా నాయనగారికీ, మా పినతండ్రిగారికీ హంపీ శిథిలాలలోని ప్రతి రాతిముక్క పుట్టుపూర్వోత్తరాలూ తెలుసు. చరిత్రకెక్కని ఎన్నో విషయాలు వారు చెప్పగలిగేవారు.

నేను ఆంధ్రప్రభ దినపత్రికలో పనిచేస్తున్నప్పుడు, సంపాదకులు నార్లగారు హంపీ వెళ్లివచ్చి "హంపీ చూచివచ్చాను. ఫతేపూర్ శిక్రీ నన్ను ఇంప్రెస్ చేసినంతగా హంపీ ఇంప్రెస్ చేయలేదు" అని నాతో అన్నప్పుడు, నాకు చాల కష్టం కలిగింది. "దానికి దీనికీ పోలిక ఏమిటండీ? ఫతేపూర్ శిక్రీ చెక్కు చెదరకుండా ఉంది. అక్కడిప్రజలు సహృదయులు గనుక, పరరాజుల దాడి ఎంత మాత్రమూ లేదు గనుక. ఒక రాజు తన శత్రువును జయించిన తర్వాత, తన వాంఛితం తీరింది గనుక జయించిన ప్రాంతం ప్రజలను, కట్టడాలను తక్కిన కళాఖండాలను తనవేననే భావనతో రక్షించు కోవడం సంప్రదాయం. కాని, బహమనీ సుల్తానులు విజయనగరం అంటేనే భయపడే వారు

గనుక, జనం మళ్లీ ఎదురు తిరుగుతారనే సంశయంతో, నగరాన్ని ముక్కలు ముక్కలు చేశారు. జనాన్ని చావగొట్టారు. పాడుపట్నం చేశారు. ఎలాగో కొన్ని ఆ దాడి నుంచి మిగిలాయి. జపాపా ఎన్‌క్లోజర్‌లోని గజశాల, కమలాపురం పొలిమేరలోని లోటస్‌మహల్, ఉగ్రనరసింహ, శిల్పమయమయిన హజార రామస్వామి గుడి, హేమకూట వినాయక విగ్రహం, విఠ్ఠలస్వామి గుడి, అప్పటి శిల్పవాస్తు సౌందర్యానికి తార్కాణాలుగా నిలిచాయి. చాలదా?" అన్నాను.

విజయనగరం వేదాలకు వ్యాఖ్యలు వెలిసిన విద్యానగరం కూడా గదా! తెలుగు సాహిత్యానికి స్వర్ణయుగమైన సరస్వతీ పీఠం కదా! అష్టదిగ్గజ కవుల, వేదవేదాంగ పారంగతుల, వైద్యవతంసుల, రాజనీతి కోవిదుల గ్రంథాలయాలు ఏమయాయి? శత్రురాజుల క్రోధాగ్నికి ఆహుతి అయాయి.

మానవల్లి రామకృష్ణ కవిగారు నాతో తరచు అనేవారు "విజయనగర సామ్రాజ్య పతనానంతరం అక్కడి పండితులంతా అనంతపురం, కడప జిల్లాలకు కాందిశీకులై వచ్చారయ్యా! మీ అనంతపురం జిల్లాలో తాడిమర్రి, చిగుళ్లరేవు, దంపెట్ట, దాడితోట, కొండాపురం, కుంటిమద్ది, పెనుకొండ, మర్రిమాకులపల్లి మొదలయిన ప్రాంతాలను బాగా గాలించాలయ్యా. అపూర్వమైన శాస్త్ర సంబంధ గ్రంథాలు దొరుకుతాయి" అని.

ప్రముఖ పురాతత్త్వ శాస్త్రజ్ఞులు రంగస్వామి సరస్వతిగారూ ఇదేమాట అనేవారు. ఏమైతేనేం! అంతా పాడుపడిపోయింది. గుర్రాలు కూలిపోయాయి. గుర్రప్పిల్లలు పాలు తాగే తొట్లు విరిగిపోయాయి.

**"అశ్వా యస్య జయస్తస్య,**
**యస్యాశ్వా స్తస్య మేదినీ,**
**అశ్వాయస్య యశస్తస్య**
**యస్యాశ్వాః తస్య కాంచనమ్!!"**

**(గుర్రాలున్న వానిదే విజయం, గుర్రాలున్న వాడిదే భూమి, గుర్రాలున్న వాడిదే కీర్తి, గుర్రాలున్నవానికే బంగారం.)**

# 12

# గొడుగుపాలుడు

**"రాజ్ఞి ధర్మిణి ధర్మిష్ఠా :**
**పాపేపాపాః సమే సమా :**
**లోకాస్త మనువర్తంతే**
**యథారాజా తథా ప్రజాః"**

**(రాజు ధర్మాత్ముడయితే, ప్రజలు ధర్మిష్ఠులవుతారు. రాజు పాపి అయితే, ప్రజలూ పాపిష్ఠులవుతారు. రాజు రెండింటా సమానుడుగా ఉంటే, ప్రజలూ సమానులుగా ఉంటారు. రాజు ఎట్లా ఉంటే ప్రజలూ అట్లాగే ఉంటారు.)**

**రా**జు అంటే ప్రస్తుతం పాలకులు.

ఇంతకుముందు మా తాతగారు ప్రస్తావించిన గొడుగుపాలుని గురించి చాల కథలున్నాయి. చెప్పమని మరీ మరీ కోరాను తాతగారిని, ఆయన "గొడుగుపాలుడిని గురించి ఏం చెప్పను? అన్నీ సాహసగాథలే. నీకు అర్థమయ్యేది ఒకటి చెబుతాను" అంటూ ఇలా ప్రారంభించారు:

కాలం చాల కఠోరమైనది. ఎంత వారినైనా తన పొట్టలో పెట్టుకుంటుంది. అదృష్టవంతుల పేర్లు పైకి వస్తాయి. దురదృష్టవంతులవి అట్టడుగున పడిపోతాయి.

మన దేశంలో ఎందరో పండితులు, కవులు, వీరులు ఉదయించారు. వారిలో అజ్ఞాతంగా కాలగర్భంలో మరుగైపోయినవారు పెక్కుమంది. పేరు ప్రఖ్యాతులు పొందినవారు వేళ్లపై లెక్కించదగినవారు మాత్రమే. ఇలాటి వారినైనా చరిత్రకారులు గుర్తిస్తారా, లేదు. వారికి లోకం నాలుకపై ఉన్నవి కేవలం వదంతులు, అప్రామాణికాలు, రాయో రప్పో ప్రమాణం కావాలి. ఊరూరా కనిపించే వీరగల్లులు కొండగుర్తులు

మాత్రమే. కవుల పుణ్యమా అని ఏ చాటువో, లోకం పుణ్యమా అని ఏ కట్టుకథో ప్రచారంలో ఉంది కాబట్టి అలాటి వారిని ఇంత మాత్రమైనా స్మరిస్తున్నాము. అలాటి అజ్ఞాత వీరులలో ఒకడు గొడుగుపాలుడు.

గొడుగుపాలుడనే పేరే విచిత్రంగా ఉంది, కదూ! గొడుగును ఎప్పుడూ పట్టుకొని ఉండేవాడు అని ఆ పేరుకు అర్థం. గొడుగుపాలుని అసలు పేరు ఏమిటో తెలీదు. అతని కొలువు పేరే అతని పేరయిపోయింది. గొడుగుపాలుడు కృష్ణరాయల వద్ద రాజలాంఛన మైన శ్వేతఛత్రం పట్టే బంటు. అంగరక్షకులు, గొడుగుపట్టేవారు, చామరధారులు, అడపం (తాంబూలం కరండం) పట్టుకొని పక్కన నిలబడేవారు. రాజులకు చాల ఆంతరంగికులు. అలాటి అడపం వంశం వారే ఆచార్య అడపా రామకృష్ణరావు. రాయల కాలపు వంశం వారిది.

రాజసభాభవనం వాకిటి కావలి తిమ్మన్నను గురించి కూడా ఇలాటి కథలున్నాయి. అతని అనుమతి లేకుండా రాజుగారి దగ్గరికి ఎవరూ వెళ్లడానికి వీలులేదు. కనుక కవి పండితులు అతనిని పద్యాలతో మెప్పించి, ఖుశామద్ చేసి త్వరగా రాజదర్శనం పొందేవారు. ఒకమారు కవులు చాలమంది వచ్చారు రాజ దర్శనార్థం. పెద్దనో, మరొకరో "వాకిలి కావలి తిమ్మా" అని కంద పద్యం పాదం చెప్పారట. పక్కన ఉన్న ముక్కు తిమ్మన్నో, మరొకరో "ప్రాకటముగ సుకవివరుల పాలిటి సొమ్మా" అని రెండో పాదం చెప్పారట. మరొక కవి "నీకీ పద్యము కొమ్మా" అని మూడోపాదం చెప్పాడట. వాకిలి కావలి తిమ్మన్న రాజు దగ్గర ఉండేవాడు గదా! కనుక పట్టు పీతాంబరం కట్టి పట్టుదుప్పటి కప్పుకొనేవాడు. తెనాలి రామకృష్ణుడు "నాకీ పచ్చడమె చాలు నయముగ నిమ్మా!" అని నాలుగో పాదం ముగించాడట.

అట్టి ఆంతరంగికుడే గొడుగుపాలుడూను. రాయలు గుర్రంమీద స్వారీ చేస్తున్నప్పుడు కూడా మనిషి మోసేంత బరువున్న ఆ శ్వేతచ్ఛత్రం పట్టుకొని గుర్రం వెంట నడవడం, అవసరమైతే పరుగెత్తడం గొడుగుపాలుని ముఖ్యమైన పని. రాయలకు నీడవలె ఎప్పుడూ వెంట ఉండేవాడు.

రాయల వేసవి రాజధాని ప్రస్తుతం అనంతపురం జిల్లాలోని పెనుకొండ. హంపీ విజయనగరం నుంచి పెనుకొండ దాదాపు 120 మైళ్లు దూరం. కాని, హంపీ నుంచి పెనుకొండకు సొరంగ మార్గం ఒకటి పూర్వం ఉండేది. దానిగుండా పయనిస్తే 80



మైళ్లకు మించదు. ఆ మార్గం ఇప్పటి ఏనుగుశాల నుంచి వుండేదట. పూడిపోయింది. రాయలు ప్రతి త్రయోదశి ప్రదోష సమయంలోను విరూపాక్షుని దర్శించుకొనే వాడు. ఒక వేసవిలో ఆయన పెనుకొండలో ఉన్నాడు. అప్పటి కింకా ఎనిమిది గడియల పొద్దుంది. అంటే ఇప్పటి ప్రకారం దాదాపు మూడుంబావు గంటలు. రాయలు హంపీ దిక్కు మొగమై ఆలోచించే లోపుగానే రాజావారి మనస్తత్వాన్ని గ్రహించడం వెన్నతో పెట్టిన విద్య అయిన గొడుగుపాలుడు ఊహించి ముదల వినడానికి సిద్ధంగా ఉన్నాడు. రాయలు వెనుదిరిగి గొడుగుపాలుని వంక ప్రశ్నార్థకంగా చూచాడు. "సిద్ధంగా ఉన్నాను" అన్నట్టు గొడుగుపాలుడు ఛత్రాన్ని పైకెత్తాడు. ఒక్క మాటా పలుకూ లేకుండా హంపీ ప్రయాణ సన్నాహం క్షణాలలో జరిగింది. రాయలు తమగము నుంచి (వేసవిలో విశ్రమించే చంద్రశాల నుంచి) కిందికి దిగాడు.

పంచకళ్యాణి గుర్రం, జీను కదిలిస్తూ హంపీ పరుగుకు సిద్ధంగా ఉంది. రాయలను చూడగానే సంతోషంతో సకిలించింది.

పొద్దు ఏడు గడియలే ఉంది. ప్రదోష సమయానికి రాయలు పంపా విరూపాక్షుని సన్నిధిలో ఉండాలి. రాయలు గుర్రమెక్కి కళ్లెం ఒక్కసారి లాగడమే తడవుగా అది వాయువేగ మనోవేగాలతో దౌడుతీసింది. అలా గంటకు ముప్ఫై మైళ్ల వేగంతో రాజ

లాంఛనమైన శ్వేతఛత్రం కూడా తప్పదు గదా రాయల వెంట! గొడుగుపాలుడు గుర్రంమీది రాయలకు సాయంకాలపు ఎండగూడ తగలకుండా ఛత్రం ధరించి వెంట పరుగెడుతున్నాడు. గుర్రం కూడా రాయల మనస్సు ఎరిగినట్టిది. ప్రదోష సమయానికి రాయలను హంపీ చేర్చకపోతే దాని పరువేమికాను? గొడుగుపాలునికీ గుర్రానికి పరుగుపందెమా అని అనిపించింది. గొడుగుపాలుడే రెండడుగులు ముందున్నాడేమో!

హంపీ కనిపిస్తున్నది. విరూపాక్ష దేవాలయం ఘంటలు మోగిపోతున్నాయి. హేమకూటం దగ్గరికి చేరేసరికి గుర్రం ఇక నిలువలేకపోయింది. రాయలు వెంటనే గుర్రం మీది నుంచి దూకి హేమకూటం పక్క నుంచి దేవాలయంవైపు నడిచాడు. గొడుగుపాలుడు గుర్రాన్ని అక్కడి భటులకు అప్పగించాడు. అది ఎన్నిసార్లు పొర్లి అలసట తీర్చుకుందో!

గొడుగుపాలుడు ఛత్రంతో పాటు దేవాలయంలో ప్రవేశించాడు. చెమట సెలయేళ్లయి పారుతున్నా గొడుగు పట్టిన పిడికిలి వజ్రబంధంగా ఉంది. రాయలు కూడా అలసిపోయాడు. దైవదర్శనం చేసుకొని గొడుగుపాలునికి సెలవిచ్చాడు. మరుసటి దినం ఉదయం వరకు ఇక కొలువు ఉండదు.

గొడుగుపాలుడు కర్తవ్యనిష్ఠతో అంతవరకు ఉన్నాడేగాని, రాయల అప్పణ అయిన పిదప ఒళ్లూ పై తెలియలేదు. అంత దిమ్ముగా ఉంది. ఎక్కడికి వెళ్లుతున్నాడో కూడ తెలీదు. తాగినవాడిలా తూలిపోతున్నాడు. అలా మైకంతో మైలు మైలున్నర నడిచాడు. ఆకలి, అలసట. ఉగ్రనరసింహ విగ్రహం పక్కన ఉండే బడివేలింగ దేవాలయంలో దూరాడు. అక్కడ కూడా ప్రదోషపూజ జరిగింది. వడపప్పు, పానకం ఉన్నాయి. అంతులేని ఆకలితో ఉన్నదంతా తిని, పానకం తాగాడు. తూలిపడ్డాడు. పడడంలో లింగానికి తల తగిలింది. రక్తం వరద కట్టింది. స్పృహ తప్పింది.

గుర్రంమీద వచ్చినా రాయలు కూడా బాగా అలసే ఉన్నాడు. నిద్రపట్టింది. ఒక్క నిద్ర తీసిన తర్వాత అర్ధరాత్రి గడిచిన పిదప మెలుకువ వచ్చింది. చప్పున గొడుగుపాలుని సంగతి గుర్తుకు వచ్చి "ఏమయ్యాడో పాపం! గుర్రంమీద వచ్చిన నాకే ఇంత ఇదిగా వుంటే, గుర్రంకంటే చురుకుగా పరుగెత్తిన ఆ బోయబంటుకు ఎలా ఉందో" అని దయ మనసులో తొంగిచూచింది. వెంటనే బయలుదేరాడు. గొడుగుపాలుడిని వెదకడానికి.

రాయలే కదలగా రాణివాసం వారూ తక్కినవారూ తరలడం ఘనమా? ఏం ముంచుకు వచ్చిందో! ఎవరికో?... ఏమీ ఆలోచించకుండానే రాయల వెంట బయలు దేరారు. దివిటీలతో. రాచరికం, ఊడిగం అంటే మాటలా మరి?

రాజధానంతా గాలించేశాడు రాయలు. "ఇదిగో! ఇక్కడ చూచాను. అక్కడ మలుపు తిరిగాడు" అని నగరంలో ప్రతివాడూ రాయల ఇచ్చకం కోసం, గొడుగుపాలుని సంగతి తెలియచేసేవారే.

వెతగ్గా వెతగ్గా గొడుగుపాలుడు బడివేలింగ గుడిలో స్పృహతప్పి పడివున్నట్టు తెలిసింది. రాయలు పరుగుతో వెళ్లి చూచాడు. గుడిలోని పెద్దలింగం ముందు ముడుచుకొని పడివున్నాడు గొడుగుపాలుడు. తలచుట్టూ రక్తం అట్టకట్టి ఉంది. వైద్యులు రోగి నిదానం ప్రారంభించారు. "ఈతనికి ఉష్ణాధిక్యం వల్ల రక్తం తలకెక్కింది. ఏదో అత్యంత శ్రమ సాధ్యమైన పనిచేశాడు. శక్తికి మించిన పనికావడం వల్ల రక్తనాళాలకు ఉద్రేకం హెచ్చింది. కనుక జలగల ద్వారా చెడు రక్తం తీయించి శైత్యోపచారం చేస్తే స్పృహ వస్తుంది అన్నారు కొందరు వైద్యులు. "జలూకా ప్రయోగం ప్రసక్తిలేక ఈతని తలలోని చెడురక్తం, దెబ్బతగలడం వల్ల కారిపోయింది. వడపప్పు తిని, పానకం తాగినట్టున్నాడు. కనుక శైత్యోపచారం సహజంగానే జరిగింది. ఒక అరగడియలో స్పృహ వస్తుంది" అన్నాడు రాజవైద్యుడు. ఆయన మాటకిక తిరుగులేదు. మూగిన జనమంతా పెదవి కదపక వేచి ఉన్నారు.

రాజవైద్యుని మాట ప్రకారమే అరగడియ కంతా గొడుగుపాలుడు కనులు విప్పాడు. ఆతురతతో వేచివున్న అందరి ముఖాలు విప్పారినవి. ఆ అర్ధసుషుప్త్యవస్థ లోను గొడుగు కోసం చేయి చాపాడు గొడుగుపాలుడు. రాయలు చాల ప్రసన్ను దయ్యాడు. గొడుగుపాలుని సాహసగాథను అందరికీ వినిపించాడు. వారంతా తెల్లబోయారు. రెండు నాళ్లలో గొడుగుపాలుడు కోలుకొని మళ్లీ కొలువుకు సిద్ధమయ్యాడు. రెండు నాళ్లు గడిచాయి. రాయలు నిండు కొలువులో గొడుగుపాలునికి కర్పూర తాంబూలం, ఉడుగరలు ఇచ్చి గౌరవించాడు. "గొడుగు పాలా! నీ యిష్టం వచ్చింది కోరుకో" అని అన్నాడు. గొడుగుపాలునికి చాలా కాలంగా చేతి నిండా దానాలు చేయాలనే ఆశ ఉంది. అది ఎలా తీరుతుంది. ఆస్తీ, అధికారమూ లేనిదే? ఇప్పుడా సమయం వచ్చింది. రాయలు స్వయంగా కోరినది ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాడు. అవకాశం జారవిడువడం

ఎందుకూ? ఏలిన దొరా! ఒక్క రోజు రాజ్యం ఇప్పించండి" అని మనవి చేశాడు గోపాలుడు.

సభవారు వెలవెలపోయారు. "ఇదేమి కోరిక? రాయలవారికే ఎసరా" అని అనుకున్నారు.

'ఒకనాటి రాజ్యంతో ఏమిచేస్తావు?" అని ప్రశ్నించాడు రాయలు నవ్వుతూ. "చేతి నిండా దానాలు చేస్తాను. నా పేరు శాశ్వతం చేసుకుంటాను మీ గొడుగు నీడన" అన్నాడు వినయంతో గొడుగుపాలుడు. "సరే ఇచ్చాను రేపే తీసుకో" అన్నాడు రాయలు. గొడుగుపాలుని సంతోషానికి మేరలేదు.

కాని, ఆ రేపే ఏకదిన రాజ్యదానం జరగలేదు. మరొక మంచి ముహూర్తం చూచి రాయలు గొడుగుపాలునికి రాజ్యం ధారాదత్తం చేశాడు. సూర్యోదయం నుంచి మరుసటి సూర్యోదయం వరకు గొడుగుపాలుని ఇష్టం. అడ్డేవారెవరూ ఉండరు.

గొడుగుపాలుడు తన ఇద్దరు భార్యలతో పంచపంచ ఉషఃకాలంలోనే స్నానాదికం ముగించి సింహాసనానికి నమస్కారం చేసి అధిష్ఠించాడు. ఇరుపక్కలా భార్యలు కూర్చున్నారు. ఏడు కొప్పెరల కరక్కాయ, లక్కమసి (సిరా) చేయించాడు. దానాలు ధారపోస్తూ, దానపత్రాలపై ఆ సిరా అద్ది మొహర్లు వేయడం ప్రారంభించాడు. భార్యలిద్దరూ దానపత్రాలు సర్దుతున్నారు. నగరంలోని బీదాబిక్కీ రాజనగరు మహాద్వారం వద్ద బారులు తీరి నిలబడ్డారు. వాకిలి కావలి తిమ్మన్న వంటి వారికి చేతినిండా పని. ఆ పగలూ, రాత్రీ తిండీ తిప్పలూ లేక దానేష్టి కొనసాగింది. తొలి కోడి కూసింది. గొడుగుపాలునికి ఆతురత ఎక్కువయింది. వేగుచుక్క పొడిచి పై కెక్కుతున్నకొద్దీ ఉద్వేగం ఎక్కువయింది. దానికి తోడు ఏడుకొప్పెరల మసి (సిరా) అయిపోయింది. కొత్తగా సిరా చేయించే వ్యవధిలేదు. అరుణోదయ మయింది. గొడుగుపాలుడు భార్యలిద్దరినీ నోరుతెరచి నిలబడమన్నాడు. వారి వక్కాకు తమ్మలపై మొహరు గుద్ది దానపత్రాలపై వేయసాగినాడు. ఆ వక్కాకు తమ్మా అయిపోయింది. ఇంతలో సూర్యుడు 'గొడుగుపాలుడు ఏం చేస్తున్నాడో' చూద్దామన్నట్టు క్షితిజం నుంచి తొంగిచూచాడు. గొడుగుపాలుడు జన్మ తరించిందని సంతోషించాడు. సింహాసనం దిగి భార్యలతోపాటు దానికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి, తిరిగి గొడుగు పట్టుకుని కొలువుకు సిద్ధమయ్యాడు. అప్పుడే రాయలు సపరివారంగా ప్రవేశించాడు.

ఇదీ గొడుగుపాలుని కథ. గొడుగుపాలుని నిలుచున్న రాతి విగ్రహమున్న భూములు బళ్లారి, అనంతపురం జిల్లాలో అక్కడక్కడ ఉన్నాయని, వాటికి "గొడుగు పాలుని భూములు" అని పేరని ఇదివరకే చెప్పానుగదా! కథలో కొంత అతిశయోక్తి ఉన్నా నిజం చాలఉంది. రాజులు, రాజసేవకులు ఎలాఉండాలో చెప్పే ఒకశ్లోకం విను.

**"అరై స్సందార్యతే నాభిః**
**నాభౌ చ ఆరాః ప్రతిష్ఠితాః**
**స్వామి సేవకయో రేవం**
**వృత్తి చక్రం ప్రవర్తతే"**

"మనింట్లో పెట్టెబండి, ఒంటెద్దుబండి, రెండెడ్ల బండి ఉన్నాయి గద! వాటి చక్రాలు దినమూ చూస్తున్నావు. ఎలా ఉన్నాయి. చక్రాలు? చక్రం గుండ్రంగా ఉంది. దాని మధ్యన లావుపాటి తూము ఉంది. ఆ తూమును బండికంటితూము అని, కుంభీ అని: అంటారు. దానిచుట్టూ కర్రలు బిగించి ఉంటాయి. వీటిని ఆకులు అంటారు. సంస్కృతంలో వీటికి అర అని పేరు. చక్రం కుంభీకి ఆకులు బిగిస్తారు. ఆ ఆకులతో కుంభీ నిలబడుతుంది అని శ్లోకం అర్థం" అన్నారు మా తాతగారు. ప్రపంచంలో ప్రతీదీ అన్యోన్యాశ్రితం. జీవయాత్ర సవ్యంగా జరగాలంటే ప్రతివ్యక్తి ఇతరులతో సామరస్యంతో మెలగాలి. ఒక్క కొలువేకాదు. ప్రతి పనీ పరస్పరాశ్రితమే. ఇది లోకసహజం. ఇది తెలీక అహంకరిస్తే పరిణామం సవ్యంగా ఉండదు." – అని అన్నారు. మా తాతగారు కొంతసేపాగి.

**"వర్షానిల రజో ఘర్మ**
**హిమాదీనం నివారణమ్**
**రాజలక్ష్మ్యాః గృహం ధన్యం**
**చక్షుష్యః ఛత్రధారణమ్"**

**(వాన, గాలి, దుమ్ము, ఎండ, మంచు: మొదలయినవి మనమీద పడకుండా గొడుగు అడ్డగిస్తుంది. కంటికి మంచిది. రాజలక్ష్మికి నివాసం – అంటే రాచరిక చిహ్నం. కనుక ధన్యమైంది. అందువల్ల గొడుగు వాడాలి.)**

# 13

# అంజనంలో కనిపించిన పట్టణద ఎల్లమ్మ

"అపరా కాళికాదేవీ
విద్యానగర రక్షకా,
విరాజతే ఎల్లమాంబా
కృష్ణరాయ సుపూజిత"

**(విద్యానగర రక్షకురాలయిన యెల్లమ్మ రెండవ కాళికాదేవి వంటిది. ఆమె విజయనగర సార్వభౌముడైన కృష్ణదేవరాయల పూజలనూ స్వీకరించింది. విజయ నగరానికి విద్యానగరమని కూడా మరొక పేరు. విద్యారణ్యులు స్థాపించినట్టిదని, విద్యలకు ఆటపట్టనీ ఈ పేరు వచ్చింది.)**

**మా** ఊరు పొలిమేర నుంచి ఎడమవైపు ఒక దారిపోతుంది. అది హంపీకి. రెండవది సరాసరి మైలు పోగానే రెండుగా చీలుతుంది. ఎడమవైపుది ఆనేగొందికి పోతుంది. కుడివైపుది హంపీకి పోతుంది.

ఈదారి చీలేచోట కుడిపక్కన వంద అడుగుల ఎత్తయిన పెద్ద పెద్ద రాతిగుండ్లు ఉన్నాయి. ఆ గుండ్ల ఎదుట పాతకోట గోడలు. రాళ్లతో కట్టిన నలుచదరం అరుగు నాలుగైదడుగుల ఎత్తు ఉంటుంది. అరుగు మధ్యన రెండు మూడడుగుల హోమగుండం లాంటి కుండం. ఇక్కడ విజయనగర సార్వభౌముల కాలంలో కల్లు అమ్మేవారు. కల్లును కన్నడంలో హెండ అంటారు. ఇది హెండ (కల్లు) అమ్మే గుండు గనుక హెండమారోగుండు. అంతటి విశాలమయిన విజయనగరంలో కల్లు అమ్మే స్థలం ఇదొక్కటే. మన రాజధానిలో వీధికి నాలుగు సారా దుకాణాలుండేవి. మద్య నిషేధం సమయంలో అవి మూతపడ్డాయి.

ఈ "హెండమారోగుండు"కు ఉత్తరంగా అరమైలు వెళ్లితే 'పట్టణద ఎల్లమ్మ' గుడి. పట్టణద ఎల్లమ్మ అంటే - పట్టణపు ఎల్లమ్మ. ఈమె విజయనగర రక్షణ దేవత. విజయనగరం మహానగరం గదా! శత్రువుల ఆక్రమణ సమయంలో ప్రాణ భయంతో అందరూ కట్టుబట్టలతో పారిపోయారు. వారు భూమిలోనో, విశాలమైన గోడల మధ్యనో దాచుకున్న డబ్బు నా చిన్నతనంలో చాలమందికి దొరికినట్లు పుకార్లు వ్యాపిస్తూండేవి. ఎల్లమ్మ రాత్రంతా అదృశ్యంగా శిథిలనగరమంతా తిరుగు తూంటుందని, ఆ నిధులను రక్షిస్తూంటుందని మా పెద్దలు అనేవారు. అప్పుడు హుండీ పద్ధతి ఉన్నా బ్యాంకింగు పద్ధతి విస్తరించలేదు. గనుక నగరవాసులు తమ ధనాన్ని పాతిపెట్టడం సర్వసాధారణం. అప్పుడప్పుడు అలాటి నిధులు, పిడతలలోనో, వాడలలోనో దాచినవి కొందరికి దొరికేవి.

నాకు ఇలాటి ఘటనలు రెండు మూడు గుర్తున్నాయి. హేమకూట వినాయక మందిరానికి అరమైలు ఈవలగా ఉన్న ఒక చెక్కను ఒక ఉప్పర కర్షకుడు దున్నుతున్నాడు. విజయనగరం నాశనమయిన తర్వాత అడవి అయింది. దానిని ఆక్రమించుకొని చాలా మంది దున్నుకోవడం సాగించారు. శిథిలాలున్న ప్రాంతాలను మాత్రం పురావస్తుశాఖవారు రక్షిస్తుంటారు. దున్నుతున్న ఉప్పరివాని నాగలి హఠాత్తుగా ఆగిపోయింది. కర్రు కదలడం లేదు. ఎద్లులాగి అలసిపోయాయి. చీకటి పడింది. ఇరుక్కుపోయిన నాగలిని తీయాలి గదా! ఎద్లను విప్పి, భార్యాభర్తలిద్దరూ కష్టపడి కర్రు ఇరుక్కున్న ప్రాంతాన్ని గునపాలతో తవ్వి కర్రును విడిపించారు. కర్రు ఇరుక్కున్నది ఒకవాడ కొనకు, మట్టివాడయినా, రెండంగుళాల మందంతో ఇనుపవాడలా ఉంది. గునపాలతో పగులగొట్టి మూట పైకిలాగారు. అడుగున గుడ్డలతో చుట్టిన మూట. వాడ నాలుగడుగుల ఎత్తున ఉంది. చుట్టుకొలత రెండు మూడడుగులు. కష్టపడి అడుగు అందుకుని మూటపైకి లేపారు. బరువుకు పైకి లేవలేదు. ఎలాగో ఇద్దరూ కష్టపడి లేపి నేలమీదికి తోశారు. ముళ్లు విప్పారు. మెరిసిపోతున్న బంగారు రామటెంకి నాణాలు. రామపట్టాభిషేకం బొమ్మలు ఒక పక్కన ఉన్న నాణేలను రామటెంకిలంటారు. ఇద్దరూ ఆశ్చర్యపడిపోయారు. అంతకన్నా ఎక్కువగా సంతోషపడిపోయారు.

కాని వారి సంతోషం కొంతసేపటికి భయంగా పరిణమించింది. కొన్ని వేల రూకలు! ఎలా దాచటం? ఎలా కరిగించడం? భూముల్లో దొరికిన నిధి నిక్షేపాలను పోలీసులకు అప్పగించాలి. అప్పగించకపోతే నేరం. ఈనగాచి నక్కలపాలయిందన్నట్లు ఇన్నివేల



నాణేలు మంది పాలవుతాయి. కొన్ని దాచుకున్నా, కొన్నయినా మారకం కోసం కరిగించక తప్పదు. కరిగించాలంటే స్వర్ణకారుణ్ణి ఆశ్రయించాలి. అతడు దానిలో తనకు సగం అనవచ్చు. ఇద్దరికీ ఏమీ పాలుపోలేదు. దానిలో సగం విడిగా పూడ్చిపెట్టి తక్కిన సగం పోలీసులకూ గ్రామాధికారులకూ తెలియచేయాలని నిశ్చయించుకున్నారు. అలాగే చేశారు. పోలీసులకు తెలిపిన దానిలోనూ గుప్పెడు నాణేలు తమవద్ద ఉంచుకున్నారు. ఒక్కొక్క నాణెం కనీసం తులమన్నా తూగేది. అప్పుడు బంగారు ధర తులం పదిహేను రూపాయలు. పిడతలలోనూ, వాడల్లోను మట్టితొట్లలోనూ, కుండలలోను దాచినవి దొరికేవని అనుకునేవారు.

బొంబాయి నుంచి ఒక యోగి వచ్చి హేమకూటంపైన ఉన్న అక్కాతంగి గుండును పరిశీలించాడు. దాదాపు వంద అడుగులు ఎత్తున్న రెండు పెద్ద గుండ్లు పై చివర ఒకదానిపై ఒకటి ఒరుసుకుని, గుసగుసలాడుతున్నట్లు కనిపిస్తుంది. కనుక జనం ఈ గుండ్లకు అక్కాతంగి గుండు (అక్కాచెల్లెలు గుండు) అని పేరు పెట్టారు. ఈ గుండు

పైన నిధులున్నాయని ఆ యోగి అన్నాడట. ఇకనేం? వెంటనే బొంబాయి నుంచి ఒక ఇంజనీరింగ్ కంపెనీ ఇనపనిచ్చెనలు, పగ్గాలు, ఫ్లడ్‌లైట్లు, డేరాలతో ఒక పటాలాన్ని దింపింది. కేంద్ర ప్రభుత్వం భూగర్భశాఖ అనుమతితోనే వారు వచ్చారన్నారు. నిచ్చెనలతో గుండు ఎక్కారు. తవ్వారు. పరిశీలించారు. ఏదో దొరికిందన్నారు. అనుకున్నంత దొరకలేదన్నారు. ఇలా ఎన్నో సంఘటనలు!

ఆ సమయంలోనే మార్కాపురం నుంచి ఒక మంత్రశాస్త్రవేత్త మా ఇంటికి అప్పుడప్పుడు వచ్చేవారు. ఆయన పేరు సీతానగరం రామాచార్యులు. పొడుగాటి గడ్డం. ఊర్ధ్వత్రిపుండ్రాలు, గంభీరమయిన వ్యక్తిత్వం.

"చుట్టుపక్కల ఇంత సందడిగా ఉందిగదా. మనమూ అంజనం వేసి చూద్దాం; ఎక్కడ ఏ నిధులున్నాయో" అని అన్నారు. ఇకనేముంది? ఆ మంత్రశాస్త్రవేత్త మా తాతగారు నరసింహతాతాచార్యులగారితో అంజనం వేయడానికి ఒక రాత్రి ఎన్నుకున్నారు. మా ఇంటి పడసాలలో జంబుఖానాలు పరిచారు. మాంత్రికులు ఒక పీటపై కూర్చున్నారు. ఎదుట ప్రమిదలో నూనె దీపం. అంజనం కొందరికే పారుతుందట. కనుక ఆయన అక్కడ ఉన్నవారిలో ఒకరిని ఎన్నుకున్నారు. అతని కంటికి ఏదో రాచారు. ఒక తమలపాకులో ఒక చుక్క అంజనం వంచారు. ఏవో మంత్రాలు చదివారు. అంజనం రాచుకున్న వాడికి ఆ అంజనం చుక్కలో నిధులు కనిపిస్తాయట. ఏవేవో దృశ్యాలూ కనిపిస్తాయట.

అందరూ వాళ్లిద్దరికీ మూడు నాలుగడుగుల దూరంలో ఉన్నారు. ఎవరికైనా ఆవేశం వస్తే భయపడతానేమోనని నన్ను మా అమ్మ జానకమ్మ ఒళ్లో కూచోబెట్టు కుంది. అంజనం రాచుకున్న వ్యక్తికి పూనకం వచ్చినట్టనిపించింది. మాంత్రికులు ప్రారంభించారు. ప్రశ్నలు అడగడం. ఆయన సమాధానం చెబుతున్నాడు. అదొక నాటకఫక్కీలో జరిగింది.

"ఏం చూస్తున్నావు?"

"వెళుతున్నాను. ఇంకా ఏమీ కనిపించడం లేదు. ముందుకు వెళ్ళడానికి భయంగా ఉంది."

"పెద్దభవనం"

"ద్వారాలు తెరిచి లోపలికి వెళ్లు"

"తెరిచాను. చీకటి. దూరంగా ఏదో మెరుస్తోంది"

"అదే. అక్కడికి వెళ్లు, వెళ్లావా?"

"వెళ్లాను. నాగుబాములు తిరుగుతున్నాయి"

"భయపడకు. అవి నిధికి కాపలా కాస్తున్నాయి. వాటిని చూడకుండా ముందుకు వెళ్లు"

"వెళ్లుతున్నాను. స్థలం మారింది. పట్టణద ఎల్లమ్మ గుడి పరిసరాలకు వచ్చాను."

"భయంలేదు. ముందుకుపో. ఎల్లమ్మ ఎదురుపడితే చేతులు జోడించు."

"అమ్మో! గర్జన హూంకారం వినిపిస్తున్నాయి. నిధులు దూరంగా కనిపిస్తున్నాయి."

"ఎలా ఉన్నాయి?"

"గంగాళాలలో బంగారు నాణేలు మెరిసిపోతున్నాయి."

"దగ్గరికి వెళ్లు, కుడికాలు ముందు పెట్టి కుడిచేయి ఒక గంగాళంలో పెట్టి గుప్పెడు నాణాలు పట్టుకో."

"గంగాళంలో చేయి పెట్టాను. వెనుక నుంచి ఎవరో లాగుతున్నట్టున్నారు."

"ఎవరూ లేరు. నీ భ్రమ!"

"కాదు, ఎవరో లాగుతున్నారు. ఏదో శూలం లాటిది భుజానికి తగులుతూంది."

"నేను మంత్రం జపిస్తున్నాను. నాణేలు పట్టుకుని ఒళ్లో వేసుకో."

"వెనుక నుంచి గర్జన వినిపిస్తూంది. పట్టణద ఎల్లమ్మలాగ ఉంది. అదిగో వచ్చేసింది! భయంకర రూపం! చూడలేను. అమ్మో! అమ్మో!"

"నమస్కారం చేయి"

"చేయి ఆడడం లేదు. మొద్దుబారిపోయింది."

'అదంతా నీ భయం, భ్రాంతి. చేయి గట్టిగా విదిల్చి ఎత్తు"

"ఉహూ! వచ్చేసింది ఎల్లమ్మ. ఉరిమి చూస్తూంది ఆ! ఆ! ఆ!"

అంజనం చూస్తున్న వ్యక్తి ముచ్చెమటలు పోస్తుండగా ముందుకు పడిపోయాడు. మాంత్రికులు తక్కిన మంత్రాలతోపాటు వైష్ణవ సంప్రదాయపు 'అభీతిస్తవం' పఠించాడు.

"పిల్లవాడు భయపడ్డాడు. భయపడకుండా ఉంటే మరికొన్ని విషయాలు తెలిసేవి." అన్నారు మాంత్రికులు.

అందరూ కొంత సంతోషించారు. కొంత నిరాశపడ్డారు. నేను నిద్రముంచుకొని

వస్తుండగా అమ్మ ఒడిలోనే నిద్రపోయాను.

ఈ సీతానగరం రామాచార్యులుగారు తమాషా గారడీలు చేసేవారు. కర్రలను పాములలాగ నడిపించడం, గుడ్డపేలికలను పక్షుల్లాగ ఎగిరించడం, మంచినీళ్లు, ఉప్పునీళ్లు చేయడం, పాలను గడ్డకట్టించడం, బెల్లం పానకాన్ని చేదుగా చేయడం లాంటివి.

ఈ తర్వాత కొంత కాలానికి పట్టణద ఎల్లమ్మ గుడి పరిసరాలలో పురాతత్వ శాఖవారే తవ్వకాలు కొనసాగించారని, అపూర్వమైన వస్తువులు, వజ్రవైఢూర్యాలూ దొరికాయని విన్నాను.

**"అంజనేన వినా విద్వాన్**<br>
**జ్ఞానీ సర్వం సమీక్షతే,**<br>
**అంజనాలిప్త నేత్రోః**<br>
**మూర్ఖః కిమసినేక్షతే"**

**(అంజనం మొదలయినవి లేకపోయినా విద్వాంసుడయిన జ్ఞాని అంతా చూడగలుగుతాడు. అంజనం కళ్లకు రాచుకున్నా మూర్ఖుడు ఏమీ చూడలేడు.)**

# 14

# బళ్లారిలో గాంధీజీ

"న్యగ్రోధే ఫలశాలినీ స్ఫుటతరం
కించిత్ఫలం పచ్యతే
బీజాన్యంకుర గోచరాణి కతిచిత్
సిధ్యంతి తస్మిన్నపి,
ఏకస్త్వేష్వపి కశ్చిదంకురవరః
ప్రాప్నోతి తామున్నతిమ్
యా మాసాద్య నిదాఘ పీడిత తమః
గ్లానిచ్ఛిదే ధావతి."

(మర్రిచెట్టుకు ఎన్నో కాయలు కాస్తాయి. వాటిలో కొన్నే పండుతాయి. ఆ పండిన వాటిలోను కొన్ని పండ్ల విత్తులే మొలకెత్తుతాయి. అలాటి మొలకలలో కొన్నే ఎదుగుతాయి. అలాటి వాటిలోను కొన్నే బాగా ఎత్తుగా పెరుగుతాయి. వేసవిలో ఎండలకు బాధపడేవారు తమ తాపం పోగొట్టుకొనడానికి ఎత్తుగా పెరిగిన చెట్లు చూచి నీడ కోసం వాటివైపు పరుగులు తీస్తారు.)

"ఏదో ఒకనాడు మనకు స్వరాజ్యం లభిస్తుంది. స్వరాజ్యం మనకు ఎన్నటికీ దానంగా లభించదు. బ్రిటిష్‌వారు ఎంతో స్వాతంత్ర్యప్రియులైనప్పటికీ, స్వాతంత్ర్యానికై స్వయంకృషి చేయని వారికి స్వాతంత్ర్యాన్ని ఎన్నటికీ దానంగా ఇవ్వరు. ఈ విషయంలో మనం బోయరు యుద్ధం నుంచి కొంత గుణపాఠం నేర్చుకోవాలి. కొన్ని సంవత్సరాల క్రితం బ్రిటిష్ సామ్రాజ్యానికి శత్రువులుగా ఉన్న బోయర్లు ఇప్పుడు దానికి మిత్రులు."

దక్షిణాఫ్రికా నుంచి వచ్చిన తర్వాత 1916లో కాశీ విశ్వవిద్యాలయానికి వైస్రాయి హార్డింజ్ ప్రారంభోత్సవం చేసినపుడు గాంధీజీ చేసిన ప్రసంగంలోని భాగమిది. ఇప్పుడది

మనకు సాధారణ వార్తగా కనిపిస్తుందేగాని, అంతవరకు ఈ విధంగా ప్రసంగించిన భారతీయుడు లేడు. ఈ విధంగా ప్రసంగించడం నా చిన్నతనంలో మహాసాహసం.

మా తాతగారు వాళ్లంతా తిలక్ అనుయాయులుగదా! గాంధీజీని గురించి మొదట్లో అంతగా మాట్లాడేవారు కాదట. కాని, నాకు ఆరేడేళ్లు వచ్చేవేళకు గాంధీజీని గురించి చాలా వినేవాడిని. అప్పుడు తెలుగువాళ్లకు ఉన్న ఏకైక పత్రిక ఆంధ్రపత్రిక – గాంధీజీని గురించి గొప్పగా వ్రాసేది. నాకు అవన్నీ అర్థమయ్యేవి కాదుగాని, బొమ్మలు చూచి సంతోషించేవాడిని. అప్పుడు గాంధీజీ వేషం మా ఊరిలో ఉన్న మార్వాడీ గుజరాతీ సేఠ్‌ల వేషంలాగ ఉండేది. తలమీద కోర తలపాగ, గుండె కిందుగా బొందులతో ముడివేసిన చొక్కా, ధోవతి, ఆకు చెప్పులు. కోలాచలం వెంకటరావుగారు మా ఇంటికి వచ్చినపుడు, అప్పుడప్పుడు ఆయన సంభాషణలో గాంధీజీ ప్రస్తావన వచ్చేది. ఆయన దక్షిణాఫ్రికా అనే దేశంలో బ్రిటిష్‌వారిని ఎదిరించడం, కోర్టులలో తానే తన సంగతి వాదించుకోడం, అక్కడ సంపాదించిందీ, బహుమతులుగా వచ్చిందీ అంతా ఒక ధర్మనిధికి అప్పగించి దానిమీద వచ్చే వడ్డీని ప్రజా సంక్షేమ కార్యక్రమాలకు వినియోగించే ఏర్పాటు చేయడం; ఇంకా ఇలా ఎన్నో చెప్పుకొనేవారు.

గాంధీజీ దేశపరిస్థితులను తెలుసుకొని సహాయ నిరాకరణోద్యమం ప్రారంభిద్దామనే దృష్టితో యావద్భారత పర్యటన చేస్తూ, 1921లో కాబోలు, బళ్ళారి వస్తారని జనం చెప్పుకుంటున్నారు. ఆంధ్రపత్రికలో ఆయన పర్యటన కార్యక్రమం చదివాను. మనజిల్లా ప్రధాన పట్టణానికి వస్తున్నారు గదా, తప్పక వెళ్లి చూడాలనే వాంఛ కలిగింది. మా అమ్మకు ఈ సంగతి చెప్పాను. "తాతగారిని అడుగు, పిలుచు కొని వెళ్లితే వెళ్లు" అన్నది. తాతగారు వెళ్లుతున్నట్లు ఆమె మాటలవల్ల తెలిసింది. నా కోసం ప్రత్యేకంగా ప్రయాణం చేయనక్కరలేదు కనుక తాతగారిని బ్రతిమాలితే కాదనరు అనే అభిప్రాయం కలిగింది. మా వూరి నుంచి దాదాపు వంద మంది వెళుతున్నట్లు తర్వాత తెలిసింది. తాతగారిని అడిగాను. "వేలమంది జనం వస్తారు. ఐతే, బస చేయడానికి మన బంధువులు ఉన్నారు. కాని, ఆ గుంపులో నీవు తప్పిపోతే నేను వెదగ్గలనా?" అంటూ మొదట్లో అనుకున్నారు. కాని, తక్కిన పెద్దలంతా నన్ను కనికరించి ఇబ్బంది ఏమీ ఉండదని అనడం వల్ల అంగీకరించారు.

గాంధీజీ రాకకు ఒక రోజు ముందు మేము బళ్లారి రైలు స్టేషనులో దిగాము. నేను

అంతకుముందు బళ్లారి మీదుగా రెండు మూడుసారులు రైల్లో ప్రయాణం చేశాను. గాని, ఆనాటి గోల ఉండేదికాదు. రైలు స్టేషను ద్వారాలకన్నింటికి బంతిపూల దండలు, ఒక్కొక్క చోట నిచ్చుమల్లి దండలు! గాంధీజీ స్వాగతం చెబుతూ నినాదాలతో పతాకాలు!

మా తాతగారు కోర్టు వ్యవహారాలకో, తక్కిన పనులకో బళ్లారికి వెళ్లినప్పుడెల్లా కృష్ణమాచార్యుల బంగాళాలోనే దిగేవారు. అందువల్ల కృష్ణమాచార్యుల బంగళాకు బయలుదేరాము. దారిపొడుగునా తోరణాలు. బంగళా చేరాము. కృష్ణమాచార్యుల బంగళా అంటే ఆంధ్ర నాటక పితామహ బిరుదాంకితులు ధర్మవరం రామకృష్ణమా చార్యుల నివాసం. అదొక పెద్ద హవేలీ. బహిరంగసభలు, నాటకాలు, మొదలైనవి, ఆ బంగ్లా చుట్టూ ఉన్న మైదానంలో జరిగేవి. ఈ మైదానం పేరు బంగ్లా కాంపౌండు. కొన్ని వేల మంది కూర్చునేటంత విశాలమైన మైదానం. (అది ఇప్పుడు ఊరు అయిపోయింది) గాంధీజీకి ఘనస్వాగతమివ్వడానికి ఆ కాంపౌండులోనే ఏర్పాట్లు చేశారు. గాంధీజీని దగ్గరగా చూసే అవకాశం కలగడం అదృష్టం.

బంగ్లా కాంపౌండులో ఒకచోట పెద్దవేదిక అమర్చారు. బల్లలు వేసి తెల్లటి ఖద్దరు గౌనులు, పలుచని పరుపులు పరిచి, దిండ్లు పెట్టారు. మైదానం అంతటా వెదుళ్లు నాటి తోరణాలు, పూలమాలలు అలంకరించారు. ప్రవేశ ద్వారానికి రాట్నాల తోరణం ఎంతో బాగుంది. మైకులు ఉన్నట్టులేదు. నాకు ఊరంతా చూద్దామని ఉంది. కాని తప్పిపోతానన్న భయం. తాతగారు ఏమంటారోనని బెరుకు. కాని, బంగ్లాలో నా వయస్సు పిల్లవాడొకడు మిత్రుడయ్యాడు. అతనితో వెళ్లి ఊరంతా మధ్యాహ్నం నుంచి సాయంత్రం వరకు తిరిగాను. ఊరంతా పెండ్లి సంబరంలాగ ఉంది. ఎక్కడ చూచినా రాట్నాల తోరణాలు. చాలచోట్ల వీథుల మొదలు, చివర, అరటిస్తంభాలు, రంగు కాయితాల తోరణాలు, ఝండాలు. ఎక్కడ చూచినా ఏదో ఆనందం.

మరుసటి అపరాహ్ణానికి గాంధీజీ బళ్లారి ప్రవేశించారని వార్త వచ్చింది. ఆయన ధార్వాడ నుంచి ఫోర్డ్ కారులో వచ్చారట. అప్పుడు ఫోర్డ్‌కారులు చాలా ప్రఖ్యాతమైనవి. బంగ్లా కాంపౌండులో హడావుడి ఎక్కువయింది. ఆంధ్ర నాటకపితామహుని చివరి కుమారుడు భోగీంద్రనాథ్ ఏర్పాట్లను పర్యవేక్షిస్తున్నారు. ఆయన కాశీవిశ్వవిద్యాలయం లో ఇంజనీరింగ్ చదివి వచ్చారు. హిందీ కూడా బాగా మాట్లాడేవారు. మైదానం జనంతో కిటకిటలాడసాగింది. చుట్టుప్రక్కల గ్రామాల నుంచి కూడా జనం వచ్చారు. "గాంధీజీకి

జయ్" అనే నినాదాలు మిన్నుమిట్టాయి. ఆయన వెంట చాలమంది ప్రముఖులే వచ్చారు. కాని నాకెవరూ గుర్తులేదు. బంగళా వాళ్లందరికీ వేదిక దగ్గరగా ఒక స్థలం కేటాయించారు. కనుక మాకు జనసమ్మర్దం బాధేమీ కలుగలేదు.

గాంధీజీ హిందీలో మాట్లాడారు. అదీ ఐదు నిమిషాలసేపే. దానిని భోగీంద్రనాథ్ తెలుగులోకి అనువదించాడని గుర్తు. త్వరలో సహాయ నిరాకరణం, శాసనోల్లంఘనం ఉద్యమాలు ప్రారంభమవుతాయి. ప్రజలు యథాశక్తి ఆర్థిక సహాయం చేయాలి. స్వచ్ఛంద సేవకులను పంపాలి. దేశంలోని స్త్రీపురుషులు అంతా ఖద్దరు కడితే నెల రోజులలో స్వరాజ్యం వస్తుంది. స్వరాజ్యం వచ్చేవరకు స్త్రీలు నగలు ధరించరాదు, పురుషులు విలాస వస్తువులు వాడరాదు. సోదరీమణులు, తల్లులు ఉద్యమానికి నగల దానం చేయాలి, అవసరమైతే ఎలాటి త్యాగానికైనా సిద్ధపడాలి – ఇదీ ఆయన ప్రసంగం సారాంశం.

"మహిళలు త్యాగం చేయాలి. విరాళమివ్వాలి" అని గాంధీజీ అన్నారో లేదో, ప్రేక్షకుల నుంచి వందల కొలది స్త్రీలు వేదిక వద్దకు పరుగున వచ్చారు. చేతులలోని బంగారు గాజులను దూసి ఇచ్చేశారు. చెవిలోని కమ్మలను ఒలిచి ఇచ్చేశారు. మెడల లోని బంగారు గొలుసులను తలమీదుగా తీసి ఇచ్చేశారు. ముక్కుల నత్తులను, ముక్కుపుడకలను తిప్పి ఇచ్చేశారు, జడబిళ్లలను తీసి ఇచ్చేశారు, ఇలా అత్యాశ్చర్య కరమైన దృశ్యం చూచి నేను విస్తుపోయాను. అలా నగలు ఒలిచి ఇచ్చిన వారిలో మా బంధువులు ఉన్నారు. ఎర్రగుడి



శ్రీనివాసాచార్యులనే న్యాయవాది మా బంధువు. గాంధీజీని దర్శించడానికి పత్నీసమేతంగా వచ్చారు. ఆమె పేరు కమలమ్మ. ఆవిడ బాగా పొడుగరి, అందమైనది. మడిశారు చీర కొంగును నడుములో దోపుకొని సవినయ సంభ్రమాలతో వేదిక వద్దకు వెళ్లి, తన రెండు చేతుల బంగారు గాజులను దూసి గాంధీజీ చేతులలో పోసింది. ఆయన ఆమె వ్యక్తిత్వాన్ని పొగుడుతూ, తక్కిన వారూ ఆమెను ఆదర్శంగా స్వీకరించాలని ప్రసంగించారు. ఆమె భర్త కూడ దేశభక్తుడే... నిలుచుని నగలు డబ్బులు అందుకుంటున్న గాంధీజీ పక్కనే మరొక వ్యక్తి నిలబడి విరాళంగా మాత్రమే వచ్చిన వాటి వివరాలు వ్రాసుకొనేవాడు. వందల మంది విరాళాలు గనుక, విరాళాలు గుర్తు వేసుకొనేవాడేగాని, దాతల పేర్లు వ్రాసుకోవడం కష్టం గనుక, వ్రాసుకోలేదనే అనుకుంటాను. ఈ విరాళాలు రెండు మూడు గంటలసేపు జరిగాయి. ఒక పల్లా బియ్యం పట్టే సంచి నగలతో నిండి పోయింది. అని నా జ్ఞాపకం.

గాంధీజీ ఎంత గొప్పవారు! ఆయన ఎవరో తెలియదు. పత్రికలో పడిన వార్తలు చదవడం తప్ప. జనానికి ఎంత విశ్వాసం ఆయనంటే! ఆ విశ్వాసం చూస్తే ఆ సంవత్సరమే స్వరాజ్యం, గాంధీజీ చెప్పే రామరాజ్యం; వస్తుందనే నమ్మకం ప్రజలకు కలిగింది. మా తాతగారు ఆ భావంతోనే ఉన్నట్లు తోచింది.

బళ్లారి మధురస్మృతులతో మా ఊరికి తిరిగి వచ్చాను. గాంధీజీ గొప్పతనాన్ని బేరీజు వేసే శక్తి నాకు అప్పుడూ లేదు, ఇప్పుడూ లేదు గాని, ఆ జనం ఉత్సాహం, విశ్వాసం, సంరంభం, విద్యావంతులు, శ్రీమంతులు చూపే ఆసక్తి నా మనస్సులో బాగా హత్తుకొనిపోయి –ప్రజల విశ్వాసం చూరగొనాలంటే ఏమి పనిచేయాలి? అంతటి విశ్వాసం ఎలా కలుగుతుంది? ఆ విశ్వాసంతో అనుకున్న పనులు సాధించ గలుగుతామా? ఆ విశ్వాసం ఎలా స్థిరంగా ఉంటుందా? అనే ప్రశ్నలు, ఆ రూపంలో కాకపోయినా అస్పష్టంగా మనస్సులో తారట్లాడాయి.

తర్వాత పదిపన్నెండేళ్లకు హరిజనోద్యమంలో గాంధీజీతో ఒక రాత్రి ఒకే కారులో పయనించడం తటస్థించింది. అప్పటికి దేశంలో ఎన్నో మార్పులు వచ్చాయి. మద్రాసుకు ప్రయాణం. గాంధీజీ ప్రశ్నించారు. "మద్రాసు ఇంకా ఎన్ని మైళ్లు?" అని. దాదాపు నలభై మైళ్లన్నారు – మాలో పెద్దలు. తెల్లవారే వరకు చేరగలం అన్నారు. "అయితే నేను కునుకు తీస్తాను. మద్రాసు పొలిమేరల్లో లేపండి" అన్నారు గాంధీజీ. కారు వేగంగా

పోగలిగేదే కాని, ఎదురుగాను, వెనుకనుంచీ వస్తున్న లారీల నుంచి ప్రమాదం జరుగకుండా నెమ్మదిగా నడుస్తున్నది. గంటంబావుకు మద్రాసు పొలిమేర చేరగానే దిగ్గున మేల్కొని "మద్రాసు చేరామా?" అన్నారు. మాకంతా ఆశ్చర్యం కలిగింది గాంధీజీ స్థితప్రజ్ఞులు, మనస్సు స్వాధీనంలో ఉన్నవారు, నియమపాలనం గొప్పగా ఆచరిస్తున్నవారు; కనుక ఆ విధంగా మేల్కొనగలిగారని భావించాను.

గాంధీజీ 1932–33లో మద్రాసులో దాదాపు ఒక నెలపాటు మకాం వేశారు. నేను ఆ నెలనాళ్లూ అక్కడ ఉండి గాంధీజీ వాక్కులు విన్నాను. ఆయన చిడిముడి పాటు చూచాను. ప్రజల విశ్వాసానికి కారణమేమిటనే చిన్ననాటి ప్రశ్నకు, ఒక విధంగా సమాధానం దొరికినట్లనిపించింది. ఏ వ్యక్తి అయినా, తాను నమ్మినదానిని అధీతి బోధాచరణాలతో ప్రజలకు చూపగలిగినప్పుడే వారి విశ్వాసం చూరగొంటాడు – అని నిశ్చయజ్ఞానం కలిగింది.

సత్కార్యసాధనకు సత్సాధనాలు ఉండాలనే గాంధీజీ సిద్ధాంతానికి ఆయన వ్రాసి పెట్టిన వీలునామా గొప్ప దృష్టాంతం. వీలునామాయే కాదు. ఆయన జీవితమంతా దృష్టాంతమే. గాంధీజీ జీవిత చరిత్రను 'బాపూజీ కథ'గా రచించిన హరిభావూ ఉపాధ్యాయ అన్నట్లు "ఈ వీలునామా ఎప్పుడు ఆచరణలోకి వస్తుందో చెప్పలేము".

గడ్డిపోచలను గండు మగలుగా మలచిన గాంధీజీ అకస్మాత్తుగానో, కాకతాళీయం గానో మహానాయకుడుగా రూపొందలేదనీ, బాల్యం నుంచి క్రమశిక్షణతో, సత్యనిష్ఠతో, సేవాదృష్టితో, భగవదర్పణ భావంతో గడిపిన జీవితమే ఆయనను మహాయోద్ధగా, మహాసేనానిగా జాతిపితగా తీర్చిదిద్దిందని పెద్దవాడనయిన తర్వాత గ్రహించాను. ఆయన అడుగడుగునా చేసిన సత్యశోధన, ఆయన జీవితానికి ఎప్పటికప్పుడు మెరుగులు పెట్టి, దానిని సహస్రకిరణ సదృశం చేసింది.

"సూనృతం సర్వశాస్త్రార్థ
నిశ్చిత జ్ఞాన శోభితమ్
భూషణం సర్వవచసాం
లజ్జేవ కులయోషితామ్"

**(సకల శాస్త్ర చర్చలలో నిగ్గుదేలిన జ్ఞానశోభగల సత్యం; సకల వాక్కులకు, కుల స్త్రీలకు సిగ్గరితనంలాగా భూషణమైనది.)**

# 15

# భయం భయంతో సంస్కృతాభ్యాసం

"సత్యం తపో జ్ఞాన మహింసతా చ
విద్వత్ప్రణామం చ సుశీలతా చ,
ఏతాని యో ధారయతే స విద్వాన్
న కేవలం యః పఠతే స విద్వాన్"

(వట్టి చదువు చదివినవాడు విద్వాంసుడు కాదు. సత్యం, తపస్సు, జ్ఞానం, అహింస, విద్వాంసుల ఎడల వినయంతో ప్రవర్తిస్తూ, వారికి నమస్కరించి గౌరవించడం, ఉత్తమ శీలం - ఈ గుణాలు ఉన్నవాడే విద్వాంసుడు. కేవలం చదువు చాలదు, చదువుతోపాటు ఆత్మగుణాలు అలవరుచుకోవాలి. విద్యగల దుర్జనుడిని దూరంగా ఉంచాలన్నారు. ధగధగ మెరిసే మణి పడగమీద ఉంది. ఎంతో అందంగా ఉంది. అంతమాత్రాన నాగుబాము కాటువేయక ఉంటుందా? కనుక ఆత్మగుణాలతో ఉన్న విద్యే విద్య.)

నేను నా ఎనిమిదో యేట నాలుగో క్లాసు ముగించాను. తర్వాత నన్ను ఇంగ్లీషు చదివించడమా, సంస్కృతం చదివించడమా అని వాదవివాదాలు పుట్టాయి. మా నాయనగారు, పిన్నయ్యగారు ఇంగ్లీషు పక్షం. తాత్కాలికంగా ఇంగ్లీషు పక్షమే నెగ్గింది.

నన్ను మా ఊరి పోస్టుమాస్టరు, కృష్ణాపురం జాగీర్దారు; శ్రీనివాస తోళాప్పాచార్యుల బావమరిది అయిన రాజగోపాలాచార్యుల వద్ద ఇంగ్లీషు చదవడానికి వదిలారు. అతని

దగ్గర ఇంగ్లీషు చదివించి మిడిల్ (థర్డ్‌ఫారం) పరీక్షకు స్కూలు ప్రసక్తి లేకుండా కట్టించాలని మా వాళ్ల సంకల్పం. నెల రోజులు ఆయన వద్ద చదివాను. డైరెక్ట్ మెథడ్ సెకెండ్ రీడరు.

అప్పుడు లోకల్‌ఫండ్ అలోపతి ధర్మాసుపత్రికి భాస్కరరావుగారు అనే తెలుగు క్రీస్టియన్ డాక్టర్ వచ్చారు. చాలా మంచివారు. ఆయన భార్య కన్నడ ప్రాంతం లింగాయత క్రిస్టియన్. పేరు బసమ్మ. వారిది మంచి దాంపత్యం. ఆయన, మా నాయనగారితో; నన్ను సంవత్సరంలోగా మిడిల్ పరీక్షకు తయారు చేస్తానని అన్నాడు. మా నాయనగారు నన్ను రాజగోపాలాచార్యుల వద్ద నుంచి విడిపించి భాస్కరరావుగారి వద్దకు పంపారు.

భాస్కరరావుగారికి వచ్చీపోయే రోగులు. నాతోపాటు మరికొందరు విద్యార్థులకూ ఆయన చదువు చెప్పేవాడు. (ఆయన పాతకాలపు కలకత్తా ఎల్.ఎం. అండ్ ఎస్). చదువు బాగానే చెప్పేవారుగాని, తప్పులు చేస్తే ఆస్పత్రి వరండా కడప బండలపై విద్యార్థులను నిలబెట్టేవాడు. బసమ్మగారు "అయ్యో! పిల్లలకు అంత శిక్ష ఎందుకండీ! కాళ్లు చుర్రుమంటాయి పాపం!" అనేది. తర్వాత మాకు లడ్లు మొదలయిన మిఠాయిలు పంచేది, ఇస్తూ "ఇంట్లో చెప్పకండి మా ఇంట్లో మిఠాయిలు తిన్నట్లు. మీ ఇంట్లో వాళ్లు తిడతారు" అనేది.

ఈ చదువు మూడు నాలుగు నెలలు సాగింది. బళ్లారిలో లాలాకమాన్ అనే ప్రాంతం ఉంది. అక్కడ మా బంధువు పెద్దకోట్ల నరసింహాచార్యులు అనే టీచర్ ఉండేవాడు. ఆయన సొంతంగా ఒక బడిపెట్టి, విద్యార్థులను మిడిల్ పరీక్షలకు, మెట్రిక్ పరీక్షలకు సిద్ధం చేసేవాడు. ఆయన వద్ద నన్ను వదులుదామని నిర్ణయించు కున్నారు నా పెద్దలు. ఆయన వద్ద రెండు వారాలు ఉన్నాను. ఆయనది 'దండం దశ గుణం భవేత్' అనే నీతి. చీటికి మాటికి కొట్టేవాడు. మా తాతగారు కోర్టుపని మీద బళ్లారికి వచ్చినప్పుడు, ఆయనను రహస్యంగా కలుసుకుని నా బాధ తెలిపాను. నా ఇంగ్లీషు చదువుకు మొదటి నుంచి వ్యతిరేకి అయిన మా తాతగారు వెంటనే నన్ను కమలాపురం పిలుచుకుపోయారు, ఇక ఇంగ్లీషు వద్దని. సంస్కృతమే గెలిచింది.

మా జ్ఞాతి ఒకరు కొన్ని గృహచ్ఛిద్రాల వల్ల మా ఊరు వచ్చి, హంపి కోదండ రామాలయంలో మనశ్శాంతి కోసం కొంత కాలం ఉన్నారు. ఎలాగూ ఉన్నారు గదా

అని ఆలయంలో పూజ చేయమన్నారు మా తాతగారు. ఆయన ఘనాంతస్వాధ్యాయి, సంస్కృత విద్వాంసుడూను. మైసూరు మహారాజావారికి యోగాచార్యులయిన ముచ్చుకుంట కృష్ణమాచార్యుల జ్యేష్ఠ సోదరుడు. కృష్ణమాచార్యులు కాశీ విశ్వవిద్యా లయంలో నాలుగైదు ఆచార్య పరీక్షలలో ఉత్తీర్ణులయిన శాస్త్రవిద్వాంసులు. యోగంలో గొప్పవారు. కొన్ని సిద్ధులను సంపాదించారు. ఆయన అరగంట ధ్యానంచేసి, ఎదుట తెరగా కట్టిన శాలువాను కళ్లువిప్పి చూచేవారు ఆయన చూచిన మేర తెర కాలి, రెండు చిల్లులు పడేవి. వెయ్యి కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ప్రసరించిన కమ్ములను పట్టుకొనే వారు. నాడిని నిలిపేవారు. నలభై రోజులు నేలమాళిగలో, సమాధిలో ఉండేవారు. వందల ఆసనాలు వేసేవారు. మైసూరు మహారాజావారు ఒక యోగవ్యాయామ కళాశాల స్థాపించి, ఆయనను డైరెక్టరుగా నియమించారు. ఆయన దేశమంతా తిరిగి యోగవ్యాయామ ప్రదర్శనలిచ్చి ప్రచారం చేశారు. యోగంపై ఎన్నో పుస్తకాలు వ్రాశారు. విదేశాలలో ముఖ్యంగా రష్యాలో ఆయనకు చాల మంది శిష్యులు ఉండేవారు. ఇంటి పేరు ముచ్చుకుంట. తాడిమర్రి నుంచి మైసూరు సరిహద్దులోని ఈ ముచ్చుకుంట గ్రామానికి వలస వెళ్లడం వల్ల ఆ ఇంటి పేరు వచ్చింది. ఆయన చివరి దశలో మద్రాసులో మకాంపెట్టి న్యాయమూర్తి పతంజలిశాస్త్రి – వెంకటరామశాస్త్రి మొదలైన పెద్దలకు ఆరోగ్యరక్షణకూ, రోగ నిరోధ నివారణలకూ అవసరమైన యోగాసనాలు నేర్పేవారు. ఆంధ్రపత్రిక సంపాదకులు శివలెంక శంభుప్రసాద్‌గారి బంగళాలో ఉండి ఆయనకూ యోగాసనాలు నేర్పారు. న్యాయ, వేదాంత, మీమాంసా, వ్యాకరణ, యోగ శాస్త్రాలలో ఆచార్యులు. ఆయన ఆహారం ఉదయం ఉపాహారం నేతిలో వేయించిన గారెలు కాగా, నలభై తేనెలో నానినవి, రెండు మూడు సేర్ల పాలు; మధ్యాహ్న, రాత్రి భోజనాలు, దీనినిబట్టి అంచనా వేసుకోవచ్చు. ఇంతయినా సింహమధ్యములు, వ్యూఢోరస్కులు, వర్చస్వులు, సుందరులు. ఆయనలాగే వుండేవారు శేషాచార్యులు కూడా! కండలు తిరిగిన దండి నిండు మనిషి. ఆయన వద్ద సంస్కృతకావ్య పాఠానికి నన్ను వదిలారు.

అక్కడి నైసర్గిక స్థితిని కొంత వివరించాలి. హంపీ విరూపాక్షాలయం పూర్వాభి ముఖంగా ఉంది. దానికి ఎదురుగా అరమైలు దూరంలో కృష్ణస్వామి దేవాలయం పశ్చాద్భాగం. దానికి ఎడమ వైపు నుంచి తూర్పుకు కొంత పారి, తుంగభద్ర – పంపానది ఈశాన్యానికి మళ్లుతుంది. తుంగభద్ర కుడిగట్టున కొండమెట్ట. దాని నుంచి ఫర్లాంగు

తూర్పుగా నడిస్తే ఒణికేగండి. అంటే రోకలి గండి. రోకలితో వాలి కుమ్మగా ఏర్పడిన గండి. అది ఋష్యమూకం కదా, వాలిసుగ్రీవుల రాజ్యం. అది చీకటిమయం. దానిని దాటి మళ్లీ కలుసుకుని, ఈశాన్యానికి ప్రవహిస్తుంది. కుడివైపు పాయ ఋష్యమూకాన్ని దాటి ఎడమవైపు పాయతో కలుసుకోవడంలో ప్రవాహం వేగంవల్ల సుళ్లు తిరుగుతుంది. కనుక దీనిని 'చక్రతీర్థం' అని వ్యవహరిస్తారు. కుడి పాయ గట్టున దాదాపు వంద గజాల ఎత్తున ఉంది కోదండరామాలయం. వర్షాకాలం లో వరదలు వచ్చి కోదండరామాలయం కూడా మునిగిపోయేది. తుంగభద్ర ప్రాజెక్టు నిర్మాణం తర్వాత ఆ వరదల ఉద్ధృతం తగ్గింది.

ఋష్యమూకానికి దక్షిణంగా రెండు మైళ్లలో మతంగాపర్వతం ఉంది. ఇక్కడ మతంగఋషి తపస్సు చేశాడట.

చక్రతీర్థం రామాలయంలో విగ్రహాలు విమానంలో నిలుచున్నట్లు చెక్కారు. రావణ వధానంతరం సుగ్రీవుడు శ్రీరాముణ్ణి కిష్కింధలో బసచేయమని కోరాడట. కానీ, పుష్పకవిమానం క్షణంపాటు ఆగిందట. దాని ప్రతీకే ఆ దేవాలయం.

రామాయణంలోని కిష్కింధే ఇది - అనే విశ్వాసం ఉండడం వల్ల, ఉత్తరాపథ యాత్రికులు నిరంతరం హంపీ ప్రాంతాలకు వస్తూనే ఉంటారు.

తుంగభద్ర ఆవలి గట్టున ఆనేగొంది రాజ్యం. ఇదీ, కంప్లీ (కాంపిల్య) రాజ్యం విజయనగర సార్వభౌముల కాలంలో ఉన్నవే.

తుంగభద్ర ఆనేగొందిని సగం చుట్టి ముందుకుపోతుంది. తూర్పున కుడిగట్టున చింతామణి అనే ఒక క్షేత్రం ఉంది. దాని పక్కనే వాలికాష్ఠం. ఇది దాదాపు ముప్ఫై నలభై అడుగుల వెడల్పు, వంద అడుగుల పొడవు ఉన్న గడ్డకట్టిన బూడిద ప్రాంతం. వాలిని అక్కడ దహనం చేశారని, ఆ బూడిదే ఇదని ఐతిహ్యం.

ఆనేగొందికి పడమర రెండు మైళ్లలో అంజనాద్రి అనే కొండ ఉంది. తుంగభద్ర దానిని ఒరుసుకొని పారుతుంది. ఆ సమీపంలోనే పంపాసరస్సు. నేటికీ దానిలోని తెల్లతామరలు శతపత్ర సహస్రపత్రాలే. ఇదంతా రామాయణ కాలానిదనే అక్కడి వారి సంపూర్ణ విశ్వాసం.

వాలికాష్ఠం ఒక భూగర్భ శాస్త్రపు వింత అని నా భావం. ఇలాటిదే బళ్లారి జిల్లాలోని సొండూరు కుమారస్వామి దేవాలయ పరిసరాలలోను ఉంది. సొండూరు కుమార

స్వామి దేవాలయానికి స్త్రీలు రాకూడదనే నియమం ఉంది. అక్కడ జాతర సమయంలో ఒక ప్రాంతంలో గుండాలు తవ్వుతారు. కట్టె, కంప దానిలో పడేసి మట్టితో మూసివేస్తారు. మరుసటి సంవత్సరానికి అది విభూతి గడ్డలయి ఉంటుంది. భక్తులు దానిని తీసుకొని వెళతారు.

శేషాచార్యులుగారు కండలు తిరిగిన సింహసంహననుడు అని ఇదివరకే చెప్పానే. ముష్టియుద్ధవీరుడిలాగ ఉండేవారు. 'శాపాదపి శరాదపి' అనేది ఆయన నీతి. కోదండ



రామస్వామి దేవాలయంలో నా సంస్కృత కావ్యపాఠం ప్రారంభమైంది. ఆయనగారు ఏమి చెప్పారో నేను ఏమి చదివానో గుర్తులేదు గాని, క్రమశిక్షణ మాత్రం పూర్తిగా అలవడింది. తెల్లవారు జామున నాలుగు గంటలకు లేవడం, కాలకృత్యాల తర్వాత స్నానం కోసం రెండు వందల మెట్లు దిగి తుంగభద్రకు వెళ్లి నీళ్ళు తేవడం, నీళ్ళు కాచడం గురువుగారి స్నానానంతరం నేను స్నానం చేయడం, ఆయన అనుష్ఠానానంతరం కోదండ రామాలయంలో ఆరాధనం చేసిన పిదప, పన్నెండు గంటలకు భోజనం చేయడం. ఆరాధన సమయంలో వెనుకటి దినపాఠం. స్తోత్రాలు వల్లెవేయడం, భోజనానంతరం గురువుగారి విశ్రాంతి తర్వాత రెండు గంటల నుంచి నాలుగు గంటల వరకు కొత్త పాఠం, ఆయన శుశ్రూషకు అవసరమైన పనులు, ఆరుగంటలకు దీపం వెలిగించిన వెంటనే పంచాయుధ స్తోత్రాది స్తోత్రాలు చెప్పడం, ఎనిమిది గంటలకు భోజనం; తొమ్మిదికి పడుకోవడం – ఇది నిత్యకృత్యం. ఆయన ఆరాధనకు ముందు వంట చేసేవారు. కోదండరామస్వామికి నివేదన కోసం మరొక పాత్రలో ప్రసాదం (అన్నం) వండేవారు. పూర్తిగా ఆశ్రమజీవనం.

ఒకనాటి ఉదయం మెట్లుదిగి నది గట్టుకు పోయి బిందెను ముంతునుగదా, పెద్ద బండలాగ కనిపిస్తే దానిమీద నీళ్లు ముంచిన బిందె పెట్టాను. అది నెమ్మదిగా నీటిలోకి జారుకోసాగింది. అర్థంకాక బిందెను గభాలున పట్టుకున్నాను. అదొక పెద్ద తాబేలు. భయం వేసింది. కొండలు, అడవుల ప్రాంతం గనుక ఐదు గంటలకూ చీకటి ఉండేది. గుడికి ఫర్లాంగు దూరంలో ఉన్న ఒణికేగండి నుంచి వచ్చే గాలి విసురుగానూ ఎవరో రాక్షసుడు ఊదినట్టుగా బలంగానూ వీచేది. మంటపాల వరస ఉన్న గుట్టల మీద, మానుల మీద ఉన్న కోతులు, కొండముచ్చులు అరిచేవి. కిచకిచలాడేవి. ఎలుగుబంట్లూ ఉండేవి. మరొక రోజు నీళ్లు ముంచుకోవడానికి వెళ్లితే బారెడు పొడవు బల్లిలాంటిది అడ్డంగా పడి ఉంది. అది మొసలి. నేను మొసలిని వాచకాలలో చదవడమే తప్ప చూడలేదు. అలాగే బిందెతో పాటు నిలబడిపోయాను. నా అదృష్టం బాగుంది గనుక అది నదిలోకి పెద్దగా ప్రాకుతూ వెళ్లిపోయిందిగాని, నా మీదికి వచ్చి ఉంటే నూరేండ్లాయుస్సు నిండేది. గట్టుమీద మొసలికి బలం ఉండదంటారు గాని, నా బోటి పిల్లలను లాక్కుపోవచ్చునేమో! నీళ్లు ముంచుకుంటే అక్కడికి అదివచ్చి లాక్కుంటుందేమోననే భయంతో వట్టి బిందెతోనే తిరిగి వెళ్లాను. గురువుగారితో

"పెద్దయ్యా, మొన్న పెద్ద తాబేలు కనిపించింది. భయమయింది. ఈ వేళ మొసలి. భయపడి వచ్చేశాను. కోతులు, కొండముచ్చుల అరుపులు భయంకరంగా ఉన్నాయి" అన్నాను.

ఆయన విరగబడి నవ్వి, 'ఒరే! మనం బ్రిటిష్‌వారిని ఎదిరించిన వంశం వాళ్లంరా! కోతుల అరుపులకు భయపడుతారురా? గట్టు మీద మొసలేం చేస్తుందిరా, అదిలిస్తే బల్లిలాగా పరుగుతీస్తుంది! మనకు భయం అనేది లేదు. అంతగా భయమైతే, నన్ను పిలు!" అని మందలించారు. అర ఫర్లాంగు దూరంలో ఉన్న వాణ్ణి నేను అరిస్తే ఆయన రావడం, నన్ను రక్షించడమూనా? నేను మౌనం వహించాను. నెల తర్వాత ఒకమారు అమ్మను చూసి వస్తానన్నాను. "ఒరే! పాలు తాగేపిల్లవాడివిరా నీవు? ఎనిమిదేళ్ళ వాడివి. నేను ఎనిమిదో ఏటకే సంహితలో కొంత అధ్యయనం చేశాను. అమరం మూడు కాండలూ వచ్చేది. రామాయణ శ్లోకాలు అన్వయించుకొనేవాడిని. నేను ఎప్పుడు వెళ్లితే అప్పుడు నా వెంట రా. నన్ను విసిగించవద్దు. కోప్పడేట్టు చేయవద్దు" అని శాసించారు. నేను బిక్కమొగం వేసుకోక ఏమిచేయను? జ్వరం వస్తే బాగుండును. నీళ్లు మోసేటప్పుడు పడి కాలు విరిగితే బాగుండును. ఈ భయం తప్పుతుంది – అని అనుకునేవాడిని.

రెండు నెలలు గడిచాయి. ఈ కఠినశిక్ష పూర్తయ్యేట్లు కనిపించలేదు. అదృష్టం! గురువుగారు కమలాపురం వెళ్లవలసి వచ్చింది. ఉదయం ఆరాధన ముగించుకొని కమలాపురం వెళ్లి, రాత్రి ఆలస్యమైనా ఆరాధనకు తిరిగిరావాలి. నాతో – "చూడు, నా వెంట కమలాపురం. వచ్చి మీ వాళ్లను చూచి, సాయంత్రం నా వెంట తిరిగి రావాలి. రాకపోతే పాఠాలు పోతాయి" అన్నారు. నేను తల ఊపాను.

ఆయన వెంట నడుస్తున్నంతసేపూ, తిరిగి రాకుండా ఉండడానికి ఉపాయాలు ఆలోచిస్తూనే ఉన్నాను. అనారోగ్యం అని చెప్పడానికి అవకాశం లేదు. భయమంటే మా వాళ్లు నమ్మరు. అంత చిన్నవాణ్ణి తెల్లవారు జామున చీకట్లో ఆయన పంపుతారా? అబద్ధం. – అని కొట్టిపారేస్తారు. తిండి బాగా లేదందామా అంటే, రెండు నెలల్లో నేనేమీ చిక్కిపోకపోగా మిసిమితేరాను. మరిచిపోయాను, ఒక రాత్రి కోతులు పెద్దగా ప్రాణభయంతో అరుస్తున్నాయి. మెలకువ వచ్చింది. గురువుగారు లేచారు. దేవాలయం ముందు విశాలమైన ప్రదక్షిణ మార్గమంతా కటకటాలతో బిగించారు, కోతులూ మొదలయినవి దేవాలయంలోకి రాకుండా. గురువుగారు ఆ కటకటాల దగ్గరికి వచ్చి

చూచారు. చిరుతపులి! చిరుతపులికి కోతిమాంసం చాలా ఇష్టమట. అది అరిచే అరుపులకు కోతులు భయపడి చెట్లమీద నుంచి కిందపడ్డాయా, కృష్ణార్పణం.

ఉపాయాన్వేషణ ఆలోచనతోనే ఇల్లు చేరాను. మా అమ్మకు నా స్థితి చెప్పాను. గురువుగారు మంచివారేగాని, పిల్లల మనస్తత్త్వం తెలిసినవారు కారు అని అంది ఆమె. తాతగారు, తక్కినవారు నా చదువు గురించి సంతృప్తిపడ్డారు. తాతగారికి నా భయం సంగతి చెప్పలేకపోయాను. అమ్మ కొంగు పట్టుకునే తిరిగాను. సాయం కాలానికి తిరిగి వెళ్లాలి. త్వరలో నిర్ణయాలు జరగాలి. గురువుగారు తిరుగు ప్రయాణానికి సిద్ధమై మా ఇంటికి వచ్చారు. "బావగారు! రెండు మూడు నెలలుగా పిల్లవాడు ఇంట్లో లేడు. ఏమీ తోచడం లేదు. రెండు రోజులు ఉండనీండి. పనివాడితో పంపుతాను" అని సంకోచిస్తూనే అన్నది అమ్మ. ఆయన మొదట ఒప్పుకోలేదు. అతిగా ముద్దుచేస్తే పిల్లలు చేతికి రారు. మొక్కలోనే వంచాలి, అని ఏమేమో అన్నారు. చివరకు ఒప్పుకొని, నావైపు తిరిగి 'చూడు, నాలుగు రోజులుండు. నేను మళ్లీ ఒక పనిమీద రావాలి. అప్పుడు పిలుచుకొని పోతాను" అన్నారు. బ్రతుకుజీవుడా' అని అనుకున్నాను.

మూడు రోజులు గడిచాయి. నాలుగోరోజు ఊరి బయట పిల్లలతో చిల్లా కట్టె ఆడుతున్నాను. గురువుగారు రావడం నేను చూడలేదు. ఆయన నిలబడి నన్ను చూస్తున్నారు. నేను ఆటలో యథాలాపంగా తలయెత్తి చూస్తే గురువుగారు!... భయపడి పోయాను. మృత్యువు తరుముకొని వచ్చినట్టనిపించింది. ఒక్క పరుగుతో ఇంట్లో పడ్డాను. మంచం మీద వాలిపోయాను. భయంతో ఒళ్లు బరువై, జ్వరం వచ్చింది. వణికిపోతున్నాను. మా అమ్మ రెండు బళ్లారి దుద్దుగంబళ్లు కప్పింది. గురువుగారు తమ పని ముగించుకొని రెండు గంటల తర్వాత వచ్చారు. నా ఒళ్లు మసిలిపోతున్నది. ఆయన వచ్చీ రావడంతోనే "ఏడీ! రమ్మనండి. గంటన్నర నడక కదా! చీకటి పడుతుంది" అన్నారు. మా అమ్మ నాకు జ్వరమని మంచంపై పడుకున్నానని అన్నది. ఆయన నమ్మలేదు. "గంట కిందట ఊరిబైట కేరింతలు కొడుతూ చిల్లాకట్టె ఆడుతున్నాడు. అంతలోపలే జ్వరమా?" అంటూ నా వద్దకు వచ్చి నాడి చూచారు చేయి కంబడిలోనే పోనిచ్చి. నేను జ్వరవేగంలో పలవరించానట "పెద్దయ్యా! భయం. మొసలి! భయం! చిరుతల అరుపు! భయం!" అని. పాపం, అంత క్రమశిక్షణ వ్యగ్రునికి కళ్లు చెమ్మగిల్లాయట! "జ్వరం కష్టమే, గుడి అడవిలో ఉంది. క్రూరజంతువులు తప్పవు.

భద్రతకు లోపంలేదు. తెల్లవారు జామున నీళ్లు తేవడం పిల్లవాడికి కష్టమే. జ్వరం తగ్గిన తర్వాత ఆలోచిస్తాను" అంటూ వెళ్లిపోయారట.

నేను మరుసటి రోజు ఉదయానికి గాని కళ్లు విప్పలేదు. భయంతో కలవరింతలు, కలవరింతలు!

**"రోగ భయం, మృత్యుభయం**
**చోర భయం, రాజ శాసనా ద్భీతిః**
**ఇత్థం భీత్యావిష్టః**
**పరితపతే సర్వదా లోకః"**

**(మానవుడు రోగభయంతో, మృత్యుభయంతో, దొంగల భయంతో, ప్రభుత్వ శాసనాల భయంతో - ఇలా నిరంతర భయంతో పరితపిస్తూ ఉంటాడు.)**

# 16

# ఆనేగొంది చదువు

"అజ్ఞాన తిమిరాంధస్య
జ్ఞానాంజన శలాకయా,
చక్షురున్మీలితం యేన
తస్మై శ్రీ గురవే నమః"

**(అజ్ఞానమనే చీకటిలో కొట్టుమిట్టాడుతున్నవానికి జ్ఞానమనే కాటుక కడ్డీతో కళ్లు తెరిపించి వెలుగును ప్రసాదించిన గురువుకు నమస్కారం.)**

**గు** అనే వర్ణం అంధకారమని, **రు** అనే వర్ణం ఆ అంధకారాన్ని అడ్డుకొని జ్ఞాన మార్గం సుగమం చేస్తుందని, అట్టి - అంధకార నిరోధం వల్ల గురువు అని అంటున్నామని మరొక శ్లోకం గురుశబ్దాన్ని నిర్వచించింది.

జ్వరం తగ్గింది. కొన్నాళ్లకు కోలుకున్నాను. గురువుగారి దగ్గరికి వెళ్లమన్నారు తాతగారు. అక్కడ నాకు భయం; వెళ్లనంటే వెళ్లను - అన్నాను. మరో మార్గం ఆలోచించారు ఆయన.

బ్రిటిష్ ప్రాంతమైన బళ్లారి జిల్లాకు తుంగభద్రానది సరిహద్దు. నదికి ఆవల ఉన్న ప్రాంతం రాయచూరు జిల్లా, నిజాం ప్రాంతం. రాయచూరు జిల్లాలోని ఆనేగొంది, కమలాపురం ఎదుట మూడు నాలుగు మైళ్ల దూరంలో తుంగభద్రకు ఆవల ఉంది. ఆనేగొంది రాజు రంగదేవరాయలుగారు చిన్నతనంలో మరణించారు. మరణించిన నక్షత్రం మంచిది కాదని రాజకుటుంబం వారు కమలాపురంలో మా ఇంటి వెనుక

వున్న దణాపురం వెంకటరావు అనే శ్రీమంతుని ఇంట్లో ఆరు నెలల పాటు ఉన్నారు. అప్పుడు రంగదేవరాయల కుమారులు శ్రీకృష్ణదేవరాయలు, అతని తమ్ములు ఇద్దరు, సోదరి తిరుమలాంబ నాకు పరిచితులే. నా వయసువారే గనుక కొంత స్నేహం కూడా ఉండేది.

ఆనేగొందిలో అంబాళం వెంబారు రామాచార్యులుగారు ఆస్థాన విద్వాంసులు, వ్యాకరణ శాస్త్రజ్ఞులు, చంపూభారత వ్యాఖ్యాతలు. ఆయన తమ్ముని భార్య కొండమ్మ గారు మా తాతగారి మరదలు – మా నాన్నమ్మ చెల్లెలు. భర్తలేదు. కాని అత్తవారింట్లోనే ఉండేది. ఆమె విడిపోతే ఆస్తుల పంపకం, మనోవర్తి గొడవలు ఎందుకని ఆమెను ఒప్పించి, మర్యాదగా చూచేవారు. ఆమెకు సంతానం లేదు. కనుక, బావగారి కుమారుణ్ణి, అతని సంతానాన్ని తన సంతానంగా చూచుకొనేవారు. ఎప్పుడైనా కమలాపురానికి వచ్చినప్పుడు మా తాతగారితో "బావా, రాముణ్ణి ఆనేగొందికి పంపు, బావగారు సంస్కృతం చెబుతారు. ఊళ్లో స్కూలు కూడా ఉంది. సంస్కృతం, ఇంగ్లీషు, ఉరుదూ అన్నీ నేర్చుకుంటాడు. నేనున్నాను గదా, ఆలనాపాలనకు" అని అనేవారు. "చూద్దాంలేమ్మా! ఇంకా చిన్నవాడుగదా!" అనేవారు మా తాతగారు.

మా తాతగారికి కొండమ్మవ్వగారి మాట జ్ఞప్తికి వచ్చింది. ఒకనాడు ఆనేగొందికి వెళ్లి రామాచార్యులు గారితో మాట్లాడి వచ్చారు. నన్ను ఆనేగొందికి పంపడానికి నిర్ణయమైంది. స్కూలులో ఇంగ్లీషు చదువు కూడా ఉంటున్నందున మా నాయనగారు, పిన్నయ్యగారు అంగీకరించారు. నాకు కృష్ణదేవరాయల గుర్తే ఉంది. పరిచితులు ఉన్నారు గదా అనే ఉద్దేశంతో ఆనేగొంది పోవడానికి సంతోషోత్సాహాలతో అంగీకరిం చాను. కొండమ్మగారికి మా అమ్మపైన చాలా ప్రేమ కనుక అమ్మ సంతోషంతో, నేనొక గొప్ప విద్వాంసుణ్ణవుతానని కలలుగంటూ ఆనందంతో అంగీకరించింది. ఈలోగా నాకు ఉపనయనం చేశారు.

ఆనేగొందిలో నా సంస్కృతాభ్యాస జీవితం, స్కూలు జీవితం ప్రారంభమయ్యాయి. గురువుగారు రామాచార్యులుగారు శిష్యవత్సలులు, ఆయన ఏకైక పుత్రులు, వేంకటా చార్యులుగారు ప్రేమమయులు. ఆయన సతీమణి అలమేలమ్మ మాతృప్రేమ కురిపించేవారు. ఇక కొండమ్మవ్వ సరేసరి, మా నాన్నమ్మ చెల్లెలే గనుక నాకు సంరక్షకురాలు.

గురువుగారి కుమార్తె తిరువేంగళమ్మగారు ప్రేమమయి. అప్పటికి ఆమెకు పిల్లలు లేరు. మమ్మల్నందర్నీ పుత్రనిర్విశేషంగా చూచేది. గురువుగారి మనుమలు: పెద్దవాడు రంగస్వామి, రెండవవాడు కోదండపాణి. అప్పుడప్పుడు నాతో వాదులాడినా చాల స్నేహంతో ఉండేవారు. ఇంట్లో పెద్దవాళ్లంతా ప్రేమవాత్సల్యాలతో చూస్తున్నప్పుడు వాళ్లూ స్నేహంతో ఉండడం సహజం.

ఈ ప్రేమ ప్రవాహంలో ఆనేగొందిలో నా విద్యార్థి జీవితనౌక హాయిగా సాగిపోయింది. గురువుగారు మమ్మల్ను ఉదయం ఐదు గంటలకు లేపేవారు. దంతధావనానంతరం ఆయన మమ్మల్ను ఊరిబయట ఉన్న తమ పూలతోటకు తీసుకొని వెళ్లేవారు. అక్కడ ఆనాటి పూజకు అవసరమైన పూవులు కోసుకొని బుట్ట నింపేవాళ్లం. తోటకు వెళ్లేటప్పుడు, తోటలోను, తిరిగి వచ్చేటప్పుడు స్తోత్రాల సంత. ఇంటికి రాగానే స్నానసంధ్యాదులు, భోజనం మధ్యాహ్నం పన్నెండుకుగాని కాదు గనుక, గురువుగారు మైలతోనే చిన్న గుండీలో బొగ్గుల పొయ్యి మీద అన్నం వండేవారు. ఏడున్నరకు స్కూలు. స్కూలులో పాఠాలు. రెండు వరకు సంస్కృత పాఠం, రెండు నుంచి నాలుగువరకు స్కూలు, నాలుగు నుంచి ఐదు వరకు స్కూలు పాఠాలు. ఐదు నుంచి దీపం పెట్టేవరకు ఆటవిడుపు. దీపం పెట్టగానే దీపాన్ని

**"దీపం జ్యోతిః పరంబ్రహ్మ**
**దీపం సర్వత మోపహమ్**
**దీ పేన సాధ్యతే సర్వం**
**సంధ్యా దీపం నమో స్తుతే"**

అని దీప నమస్కారం చేసి, విద్యాధి దేవతయైన హయగ్రీవుణ్ణి

**"జ్ఞానానందమయం దేవం**
**నిర్మల స్ఫటికాకృతిమ్,**
**ఆధారం సర్వవిద్యానాం**
**హయగ్రీవ ముపాస్మహే."**

అని ధ్యానించి సంస్కృత పాఠం ప్రారంభించేవారు గురువుగారు. ఎనిమిది వరకు పాఠం. ఎనిమిది తర్వాత తొమ్మిది లోపు భోజనం. పది గంటలకు వరకు గురువుగాని,

ఆయన కుమారులుగాని పురాణపురుషుల, దేశవీరుల కథలు చెప్పేవారు. అష్టమి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య, పాడ్యమి మినహా సంస్కృత పాఠాలు బాగా జరిగేవి.

గురువుగారి పాఠం గొప్పగా ఉండేది. బాలుర మనస్తత్వాన్ని బాగా గ్రహించిన వారాయన. రఘువంశం నాల్గవ సర్గ ప్రారంభించారు. నాకు చిన్నప్పుడు కొంచెం నత్తివుండేది.

నత్తి వచ్చినప్పుడు ఆయనెంతో సానుభూతి చూపేవారు. పాఠం ప్రాచీన పద్ధతిలో. శ్లోకపఠనం, పదచ్ఛేదం, దండాన్వయం, అర్థం, ఆకాంక్ష, తాత్పర్యం, అలంకారాది విశేషాలు - ఇలా సాగేది. "సరాజ్యం గురుణాదత్తం" అన్నప్పుడు, సః తచ్ఛబ్దం ప్రథమా విభక్తి అని చెప్పి, ఆ శబ్దమంతా పూర్తిగా వల్లింపజేసేవారు. రాజ్యం అకారాంత నపుంసక లింగ ద్వితీయా విభక్తి ఏకవచనమని చెప్పడంతో పాటు రాజ్యశబ్దమంతా వల్లించాలి. ఆ శ్లోకంలో బభౌ క్రియా పదం భాధాతువు లిట్ ప్రథమ పురుష ఏకవచనమని చెప్పడంతో పాటు అన్ని లకారాలూ వల్లింపజేసేవారు. ఈ పద్ధతిలో చదవడం వల్ల ఒక కావ్యంలోని ఏ ఒక సర్గ చదివినా, దాదాపు అన్ని విషయాలూ తెలిసి సంస్కృత వాక్య రచనాపాటవం కలిగేది.

గురువుగారి కుమారులు వేంకటాచార్యులు "నాటకాంత సాహితి' మాత్రమే కాక లోక వ్యవహారాలు బాగా తెలిసివారు. గణితం బాగా వచ్చు. వర్ణచిత్రాలు గీచేవారు. మాకు వృత్తరత్నాకరం, చంద్రాలోకం, అష్టాధ్యాయి సంత చెప్పేవారు. దీనివల్ల ఉత్తరోత్తరా ఛందః పరిజ్ఞానం, అలంకార జ్ఞానం, పాణిని వ్యాకరణం చదవడంలో సులువు ఏర్పడుతుందని గురువుగారి అభిప్రాయం. ఇలా రెండేళ్లలో రఘువంశం చతుర్థ, పంచమ- రెండు సర్గలు ముగించాను. శబ్దరత్నావళి, దానిలోని ధాతువులే కాక పై మూడు సర్గలలోని ధాతువులు అన్ని లకారాలూ కంఠపాఠ మయ్యాయి. నిద్రలో అడిగినా ధాతువులు ఏ లకారం అడిగినా చెప్పగలిగేవాడిని. చంద్రాలోకం, వృత్తరత్నాకరం పూర్తిగాను, అష్టాధ్యాయిలో నాలుగధ్యాయాలు కంఠస్థ మయ్యాయి.

మా తాతగారుగాని, మా నాయనగారు గాని అప్పుడప్పుడు వచ్చి గురువుగారిని అడిగేవారు, నా చదువు సందెలను గురించి. 'తెలివి అంతగా లేదు. శ్రద్ధ వుంది. పైకి వస్తాడు' అనేవారు గురువుగారు. ఎందుకంటే ఆయన మనుమలు మహామేధావులు. నేను అరగంట వల్లించేదాన్ని వాళ్లు ఐదు నిమిషాల్లో కంఠస్థం చేసేవారు. మాతోపాటు

నా బంధువులు, గోత్రదాయాదులు అయిన చెన్నంపల్లి శామణ్ణ (కృష్ణమాచార్యులు), చిత్రదుర్గం కిట్టు (కృష్ణమాచార్యులు) నాకన్నా ఒకటి రెండేళ్లు పెద్దవారు ఇద్దరుండేవాళ్లు. వాళ్లూ నాకన్నా తెలివిగలవాళ్లే. మా వాళ్లకు గురువుగారి మాటల్లో "శ్రద్ధ వుంది పైకి వస్తాడు" అనేవి నచ్చేవి. "తెలివి అంతగా లేదు' అనేది అంతగా నచ్చేదికాదు. కాని ఏమి చేస్తారు పాపం! ఉన్నసంగతి అది. గురువుగారు; అంత ప్రేమతో చూచే గురువుగారు – అబద్ధం ఆడరుగదా, అంతకే సంతోషించేవారు. ఏమైనా రామాచార్యులు వారు నాకు సంస్కృత భాషా ప్రవేశానికి వెలుగుదారి చూపారు. రచనకు, వ్యాఖ్యానించే పద్ధతికీ గట్టి మూలబంధం వేశారు.

ఇక ఆనేగొంది మిడిల్ స్కూలు ఉపాధ్యాయులూ చాలా మంచివారే. హెడ్‌మాస్టర్ గారు ముస్లిం. (పేరు మరిచాను.) సజ్జనుడు. ఆయన తెలుగు, ఇంగ్లీషు చెప్పేవారు. డైరెక్ట్ మెథడ్ థర్డ్‌రీడరు పాఠ్యం, వాక్యరచన రెండు భాషల్లోను చేయడానికి ప్రోత్సహించేవారు. చరిత్ర, భూగోళ, విజ్ఞాన శాస్త్రాలకు ఒక ఉపాధ్యాయుడు, ఉరుదూకు ఒక హజరత్, ఆయన, "అరే, రామ్యాచారి! హిందుస్తానీ! బడీ జబాన్ హోగీ, దిల్ లగాకర్ సీఖో!" అనేవారు. ఆయన రామాచారీ అనడానికి రామ్యాచారి అని, శామణ్ణను శామ్యాచారి అని కృష్ణమాచారీ అనడానికి కిషన్‌చారీ అనీ అనేవారు. మంచి మనసు. శ్రద్ధగా చెప్పేవారు. నా చిన్నతనంలో ఉరుదూను హిందుస్తానీ అనే వ్యవహరించేవారు. ఆయన 'అలీఫ్ జబర్ అ, అలీఫ్‌జేర్ ఇ, అలీఫ్ పేష్ ఉ' అని ఉరుదూ వర్ణమాలను వల్లింపచేసి వ్రాయించేవారు. నాకప్పుడు ఉరుదూపై అంత శ్రద్ధ ఉండేది కాదు. లెక్కలయితే, పెద్ద పెద్ద వడ్డీ లెక్కలూ నోటితోనే. అప్పుడు ఇప్పటిలాగ పుస్తకాల మోత లేదు. నాలుగైదు పుస్తకాలతో బడికి వెళ్లేవాళ్లం.

మా హెడ్‌మాస్టర్ గురించి శృంగార పురుషుడని వదంతి బలంగా ఉండేది. ఆస్థానమల్లుడి భార్యతో ఆయనకు సంబంధం ఉండేదని, ఆమె చీకటి రాత్రులు మా బడి ఉన్న గగన్‌మహల్ వెనుక ఉన్న పెద్దతోటలో ఆయనతోపాటు విహరించేదని అనేవారు. మొదట చీకట్లో ఆమెను చూచినవారు మోహినీ పిశాచమనేవారు. నిజం తెలిసిన తర్వాత కిక్కురమనేవారు కారు. అటు హెడ్‌మాస్టర్, ఇటు ఆస్థానమల్లు భార్య! బాహాటంగా ఏదన్నా అంటే కాయకల్పం అయ్యేది. కనుక బహిరంగ రహస్యం. రాచనగరు మొదలు, రచ్చబండ వరకు ఇలాటి వదంతులు ఉండేవి. ఎవరూ ఎవరినీ అడిగేవారు

కారు. జీవయాత్ర యథారీతిగా జరిగేది.

మా గురువుగారి కుమారులు వెంకటాచార్యులు గారికి ఎన్నో వ్యాపకాలు. ఆయన ఊరిలోని రంగనాయకుల కోవెల ధర్మకర్త, మరొక గ్రామానికి కరణం. ఇలా ఎన్నో! నేను వారి ఇంట ఉచితంగా భోజనం చేస్తున్నాననే దూరు లేకుండా నాకు రంగనాయకుల కోవెలలో 'పడి' ఏర్పాటు చేశారు. పడి అంటే వేదపఠనం గానీ ప్రబంధ పఠనం గాని, ఏదోసేవగాని చేసేవారికి ఇచ్చే ప్రసాదం. ఇది ఒకరికి కడుపు నిండైన భోజనం. అది నేను ఇంటికి తెచ్చి భుజిస్తున్నట్లు, తమ ఇంట్లో ఊరికే తింటున్నట్టు అపవాదం



ఉండదన్నట్టు గుడిలో ఏర్పాటు. నా ఆత్మగౌరవానికి భంగం కలుగదు. 'గుడిలో సేవ చేస్తూ ప్రసాదం తెచ్చుకుంటూ, గురువుగారింట్లో చదువు తున్నాడులే!' అని ఊరివాళ్లు అనుకోవాలి.

ఆనేగొందికి వచ్చి రాజకుమారుడు శ్రీకృష్ణదేవరాయలను చూద్దామనుకున్నాను. ఒకటి రెండుసార్లు రాచనగరులో జరిగిన పూజలలో చూచాను. అతడు పలకరించాడు. గాని అతని అంతస్తు వేరు. రాజకుమారుడు. జాగీర్దార్ కాలేజీలో చదవడానికి హైదరాబాద్ వెళ్లిపోయాడు. తర్వాత దారులు వేరయ్యాయి.

రంగదేవరాయలవారికి – ఆనేగొంది రాజులకు – మద్రాసులోను ఒక ప్రాసాదం ఉండేది. రంగదేవరాయలు తరచు మద్రాసు వెళ్లేవారు. ఆయనకు తెలుగు సాహిత్యం పై చాలా మక్కువ. ఆనేగొందిలో గొప్ప గ్రంథాలయం ఉండేది. మద్రాసులో ఆయనకు పానుగంటి నరసింహారావుగారితో పరిచయమైంది. నరసింహారావుగారు ఆనేగొందిలో కొంతకాలం ఉన్నారు. నాకు ఆరేడేండ్లు ఉన్నప్పుడు బహుశా కృష్ణదేవరాయలు కమలాపురంలో ఉన్నప్పుడు నరసింహారావుగారు వచ్చారు. అప్పటికే ఆయన గొప్ప రచయిత గనుక ఊరిలోని సాహిత్యాభిమానులు మా ఊరి రీడింగ్ రూములో ఆయనను కలుసుకున్నట్టు, సన్మానించినట్టు గుర్తు. పెద్ద పెద్ద మీసాలతో యౌవనంలో ఉన్న ఆ ఆకారం ఇంకా నాకు జ్ఞాపకం. రంగరాయలు కీర్తిశేషులు కాగానే ఆయన వదిలివెళ్లిపోయారనుకుంటాను. పానుగంటి వారు మా ఊరివారికి చాలా ఇష్టులు.

"గురూక్తం పరుషం వాక్యం
ఆశిషం చింతయే త్సదా,
తేన సంతాడితో నాసి
ప్రసాద మితి సంస్మరేత్!!"

(గురువు ఒక వేళ పరుషవాక్యం పలికినా, దానిని శిష్యుడు ఆశీర్వాదంగా భావించాలి. గురువు ఒకవేళ కొట్టినా ప్రసాదమని – అనుగ్రహమనే భావించాలి.)

# 17

# అనాచారం, దొంగతనం

**"కర్పూర ధూళీ కలితాలవాలః**

**కస్తూరికా కల్పిత దోహదశ్రీః**

**హిమాంబు పూరైః పరిషిచ్యమానః**

**ప్రాంచం గుణం ముంచతి కిం పలాండుః?"**

**(కర్పూర ధూళితో పాదులు కట్టి, కస్తూరి ఎరువు చేసి,** గొజ్జగి నీరు పోసి పెంచినా నీరుల్లి తన మునుపటి గుణం వదులుతుందా?)

**దు**ర్మార్గుడు కూడా అంతే. ఎంత మంచితనంతో చూచినా, మంచివారితో మెలిగినా తన స్వభావాన్ని మార్చుకోలేదు. దీనినే సుమతి శతకకారుడు:

**'కనకపు సింహాసనమున**

**శునకము గూర్చుండబెట్టి శుభలగ్నమునం**

**దొనరగ బట్టము గట్టిన**

**వెనుకటి గుణమేల మాను వినరా సుమతీ'**

అని వ్యంగ్యంగా అన్నాడు.

మా తాతగారు, నాన్నగారు, తక్కినవారు, జాతీయవాదులూ, సర్వసమత్వ వాదులూ, అయినా, ఆచార వ్యవహారాలలో చాల కరుకుగానే ఉండేవారు. ఉల్లి, వెల్లుల్లి, మునగ, ముల్లంగి మొదలైన కూరగాయలు తామసాహారాలని నిషిద్ధం. నా చిన్నప్పుడు క్యాబేజి, కాలీఫ్లవర్ కూడా తినేవారు కారు. కేరట్ (గాజర్) కూడా పెద్దలు తినేవారు కారు. ఆకుకూరలలో గోంగూర (పుంటికూర) పూర్తిగా నిషిద్ధం. మునగకాయలు నాకు చాల ఇష్టం. మేము 1938లో అనంతపురంలో ఇల్లు కట్టిన తర్వాత మా అమ్మ దొడ్లో మునగచెట్టు నాటింది. "కొడుకు పెద్దవాడయ్యాడని గర్వమా, అనాచారానికి దిగావు?" అని మా నాన్నగారు ఆమెను మందలించారుకూడా.

మా ప్రాంతం లింగాయతుల ప్రాంతం. లింగాయతులు శాకాహారులు. నీరుల్లిని, వెల్లుల్లిని విరివిగా వాడుతారు. మా ఊరి నిండా లింగాయతుల మిఠాయి దుకాణాలు ఉండేవి. అక్కడ పచ్చిమిరపకాయ బజ్జీలు, ఉల్లిపాయ బజ్జీలు – వేగుతున్నప్పుడు చూస్తూ



గుటకలు మింగేవాడిని,. ఉల్లిపాయ బజ్జీలను అత్తీకాయ్ అంటారు కన్నడంలో.

ఈ అత్తీకాయలు తిందామనే వాంఛ బలమయింది ఒకనాడు. అప్పుడు నా వయస్సు ఎనిమిదేళ్లు. ఎలా తినడం? తెలిసిన లింగాయతుల దుకాణానికి వెళ్లి అడిగితే ఇస్తారు గాని, ఆ సంగతి ఇంట్లో చెబుతారు. కొంప మునిగిపోతుంది. అమ్మను గాని, మరెవరినైనా గాని డబ్బులు అడిగితే, ఎందుకు? ఏంచేస్తావు? అనే ప్రశ్న పరంపర. అబద్ధం సాధ్యంకాదు. ఒకవేళ చెప్పినా దాగదు. కనుక దొంగతనం చేయడానికి నిశ్చయించుకొన్నాను.

అప్పుడు రూపాయకు 64 కానులు. అణాకు నాలుగు. కానీకి మూడు దమ్మిడీలు. ఒక కానీ సంపాదిస్తే మూడు పెద్ద అత్తీకాయలు వస్తాయి. కానీ, సంపాదించడం గగనమయింది. దొంగతనం తప్ప గత్యంతరం తోచలేదు. మా అమ్మ చిల్లరను దేవుని అరుగు కొసన పెట్టడం పరిపాటి. ఆమె చిల్లర ఎంచవచ్చిందా? ఒక కానీ కొట్టివేస్తే సరి! కనుక్కున్నప్పుడు ఏదో అబద్ధం చెప్పలేకపోతామా? మనస్సు పెడదారి పట్టినప్పుడు ఇలాటి పెడ ఆలోచనలే. దొంగతనం, అబద్ధం రెండు నేరాలయాయి. అనుకున్నట్టే చేశాను. లింగాయతుల దుకాణానికి వెళ్లి మూడు అత్తీకాయలు కొన్నాను. గప్‌చిప్పుగ తిన్నాను. తిననైతే తిన్నానుగాని, ఉల్లిపాయ వాసనను అరికట్టగలిగానా?

ఎక్కడో ఎలాగో దొంగచాటుగా తిని గండూషం చేసి (నోరు పుక్కిలించి) ఇల్లు చేరాను. వాసన వస్తుందని నోరు బిగించుకున్నాను. మా అమ్మ ఏవేవో చెబుతూంది. వింటున్నానేగాని, నోరు కదపలేదు. కంపుకొడితేనో? ఆమె అంతగా పట్టించుకోలేదు. ఇంతలో మా నాన్నగారు వచ్చారు. ఏదో ప్రశ్నించారు. జవాబివ్వలేదు నేను. ఏదో! పిల్లవాడు జవాబు చెప్పకపోతే ఏం పోయింది? అని వెళ్లిపోయారు. మరి కొంత సేపటికి ఏదో పనిబడి మళ్లీ వచ్చి ఏదో ప్రశ్నించారు. నేను మాట్లాడకపోయేటప్పటికి దగ్గరికి వచ్చి భుజాలు పట్టుకుని కదిపారు. నేను నోరు తెరవక తప్పలేదు. గుప్పుమని కంపు! ఆయనకు ఆశ్చర్యమయింది. "నీరుల్లి తిన్నావా? ఎక్కడా? ఎవరింట్లో?" ఇలా ప్రశ్నల వర్షం. చివరకు నేను లింగాయతు దుకాణంలో 'అత్తీకాయలు' తిన్నానని చెప్పక తప్పలేదు.

అన్నిటిలోను అనాసక్తంగా ఉండే నాన్నగారికి నిజంగానే కోపం వచ్చింది. నేను చేసింది తప్పుల పరంపర. మొదటిది దొంగతనం. రెండవది నిషిద్ధవస్తుసేవనం. మూడవది ఇంటిలో పరిశుభ్రంగా చేసిన వస్తువు ఉండగా బజారు వస్తువులు,

అనారోగ్యకరమైనవి తినడం. నాల్గవది - పెద్దలు అడిగినప్పుడు నిర్లక్ష్యంగా ఉండి, బలవంతం మీద సమాధానం చెప్పడం. ఇంకా ఎన్నో! మా నాన్నగారు లింగాయతుల దుకాణం, కులం గురించి అంతగా బాధపడలేదు గాని, దొంగతనం గురించి చాలా బాధపడ్డారు. ఈ దొంగ బుద్ధి పెరిగితే జీవితం ఉత్తరోత్తరా ఏమౌతుంది? వంశానికి అప్రతిష్ఠ. అలా వుండగా జీవితం పాడైపోదా? ఆ రోజు నాకు దెబ్బలు ఎక్కువగా పడలేదు కాని, నన్నొక భ్రష్టుడుగా చూచారు అంతా. దాని ప్రభావం కొంతపడినా పశ్చాత్తాపపడేంత పరిపాకం గల వయస్సు కాదు మరి!

నా చిన్నతనంలో కాఫీ తాగడమూ అనాచారమే. ఆనేగొందిలో నాకూ, నాతోపాటు సంస్కృతం చదువుతున్న నలుగురికీ కాఫీ తాగాలనే బుద్ధి కలిగింది. మా బంధువు లయిన యువకులు కాఫీ తాగేవారు. వారికి మైసూరు, బెంగుళూరులతో సంబంధా లున్నాయి. అలా తాగేవారు. పెద్దల ఎదుటకాక చాటుమాటుగా తాగేవారు, స్నాన సంధ్యాద్యమ స్థానం తర్వాత. మాకు దక్షిణగా వచ్చే డబ్బులో కొంత చిల్లర దగ్గర ఉండేది. ఏదో పనిమీద మా గురువుగారి కుమారులు, తక్కినవారూ ఎక్కడికో వెళ్లారు. ఆ వెళ్లడం ముందే నిశ్చయమైంది. కనుక ఆనాడు కాఫీపానగోష్ఠికి ముహూర్తం నిర్ణయించాము. నేను అణాపెట్టి కాఫీపొడి దుకాణం నుంచి కొని తెచ్చాను. తక్కినవారు చక్కెర, పాలూ తెచ్చారు. ఒక మిత్రుని ఇంటి పెరడులో కాచాము. మేము మూర్ఖాగ్రేసురులము. కాఫీ కాచిన తర్వాత వాసనకొడుతుందని ఆ వాసన వల్ల మా దొంగతనం పసిగడతారని ఆలోచించలేదు. కాఫీ వడబోశాము. ఇప్పటివలె కల్తీ వస్తువు కాదు గదా! వాసన గుమ్మని పక్కిల్లు పొరుగిండ్లకు వ్యాపించింది. వాళ్లు ముఖ్యంగా స్త్రీలు ఆ ఇంటి ఇల్లాలి పేరుతో "ఏమే లక్ష్మిదేవీ! ఎవరైనా పట్ణం (మైసూరు, బెంగుళూరు) చుట్టాలెవరైన వచ్చారేమే? కాఫీ వాసన గుమాయిస్తుంది. అంటూ తలుపు తట్టారు. మేము సరకుతో పాటు పట్టుబడ్డ దొంగలమయ్యాము. "వెధవల్లారా! ఇదేం పనిరా? ఇంటి పెద్దలు లేనప్పుడు కాఫీ బట్టీ పెట్టడం?" అని మెత్తగా మందలించారు.

ఇంతకన్నా ఘోరమైన పనిచేశాను నేను ఆనేగొందిలో గురువుగారింట్లో. గురువు గారికి రెండు కళ్లూలేవు. అలవాటును బట్టి అల్పాచమానానికి, బహిర్భూమికి, స్నానానికి, సాపాటుకు పోయేవారు. ఏదో జబ్బువల్ల కళ్లుపోయాయి. అయినా ఇంటి పెత్తనమంతా ఆయనే చేసేవారు. ఆయనకు తెలియకుండా ఏమీ జరిగేది కాదు ఇంట్లో. ఆయనకు

అతి మూత్రవ్యాధి కూడ. గంట గంటకూ గుడ్డలు మార్చేవారు. నేను గురువుగారి గుడ్డలు ఉతికేవాడిని, స్నానానికి వేడినీళ్లు తోడేవాడిని. కొండమ్మవ్వ చెప్పేవారు" గురువుగారు చాలా గొప్పవారురా, నీ అదృష్టం కొద్దీ ఇక్కడ పడ్డావు. శుశ్రూషచేయి, చదువు బాగా వస్తుంది" అని. నేను చాలా శ్రద్ధతో చేసేవాడిని. ఆమెను సంతోషపెట్టడం నా ఉద్దేశం. ఎందుకంటే ఆమె నా నాయనమ్మ చెల్లెలు. గురువుగారి దిండు కింద చిల్లర డబ్బులు ఉండేవి. వాటిని చూచినప్పుడల్లా నాలో దొంగబుద్ధి, కెలికేసేది. కాని, వివేకం హెచ్చరించింది – అలాటి పనిచేసి చెడ్డపేరు తేవద్దు అందరికీ – అని.

ఒకమారు కమలాపురంలో పెళ్లి జరిగింది మా బంధువుల ఇంట్లో. ఆనేగొందిలోని ప్రముఖులంతా వెళ్లదలచారు. నన్నూ పిలుచుకొని పోతామన్నారు. పెండ్లికి వెళ్లడానికి వారం ముందే దొంగతనానికి పన్నుగడ పన్నాను. నా దక్షిణ డబ్బులన్నీ కొండమ్మవ్వ చేతికి ఇచ్చేవాడిని. కనుకే దొంగబుద్ధి. ఆనేగొందిలో ఎప్పుడూ పండగలే. అయినా నాకు ఒక మార్వాడీ బ్రాహ్మణుని దుకాణంలో పాలఖోవా తిందామనిపించింది. అప్పుడు రూపాయకు ఎనిమిది సేర్లపాలు, నాలుగణాలకు బోలెడు ఖోవా వచ్చేది. గురువుగారి తలగడ క్రింద చిల్లరలో పావలా కొట్టివేయాలి. పెండ్లికి కమలాపురానికి పోయేటప్పుడు దారిలో ఖోవా తినాలి. గుట్టు ఎవరికీ తెలియదు. అలాగే వారం ముందే పావలా నాణెం కొట్టివేశాను. గురువుగారు చిల్లరడబ్బులు కూడా ఎంచి పెడతారని నేను గ్రహించలేకపోయాను. ఆయన ఎవరికో చిల్లర డబ్బులు చెల్లించ వలసి వచ్చింది. నాలుగణాలు తక్కువయ్యాయి. మంచం కిందంతా చేతులు పోనిచ్చి వెదికారు. నన్నూ వెదకమన్నారు. నేనూ ఆయన కన్నా శ్రద్ధగా వెదికాను. దొరకలేదు. నాలుగణాలు ముఖ్యం కాదు. ఎంచిపెట్టి ఎవరికో ఇవ్వదలచిన డబ్బులు ఎలా తక్కువయ్యాయన్నదే ప్రశ్న. ఆయన ఏదో సర్దుకుపోయారు. సమస్య పరిష్కారం కాకున్నా ఊరుకున్నారు. చిన్న నాణెం. ఎక్కడో పడిపోయి వుంటుందని నిర్ణయించు కొని సంతృప్తిపడ్డారు.

పెండ్లికి బయలుదేరాను. అందరితో పాటు పాలఖోవా కొన్నాను. కమలాపురంలో రెండు రోజులు పాటు ఉండాలి. గనుక ఒక జత బట్టలు తీసుకొని మూటకట్టి ఖోవా దానిలో పెట్టాను. ఎవరూ అనుమానించే అవకాశమేలేదు. హరిగోలులో తుంగభద్ర దాటి గట్టు ఎక్కి దారిపట్టాము. కొంచెం ముందుగా నడిచాను. అలవాటయిన బాటే. భయమేమీ లేదు. నేను ముందు పోతున్నందుకు పెద్దలేమీ ఆక్షేపణలు, హెచ్చరికలు

చేయలేదు. నా వెంట నా సంస్కృత సహాధ్యాయుడొక డున్నాడు. వాడు ఉంటే ఏమిటి – వాడికీ రెండు ముక్కలు ఇద్దాము అనుకున్నాను గాని; వాడు నా ఆరాలు తీసి కొంప ముంచుతాడనుకోలేదు. గుడ్డల మూట విప్పి ఖోవా పొట్లం తీశాను. నా మిత్రునికి ఒక ఉండ ఇచ్చి, నేనొకటి నోట్లో వేసుకున్నాను. నేటిలాగ మైదాపిండి, మార్వోమొదలయినవి కలుపకుండా కల్తీలేని పాలతో చేసిన అచ్చమైనా ఖోవా. ఎంతో రుచిగా ఉంది. "ఎంతకు కొన్నావు?" అని అడిగాడు నా సహాధ్యాయుడు. పొరపాటున 'నాలుగు అణాలకు' అన్నాను. "ఎక్కడిది నీకు పావలా? దక్షిణ డబ్బులన్నీ కొండమ్మవ్వకు ఇచ్చానన్నావే!" అన్నాడు. వాడికి ఏదేదో చెప్పాను. వాడు నమ్మలేదు. వాడికి గురువుగారు పావలా కోసం వెదుకులాడిందంతా జ్ఞప్తికి వచ్చి, "ఇది గురువుగారి పావలా కదూ?" అన్నాడు. వాడి క్రాసు పరీక్షలో పడిపో యాను. వాడు నన్ను దోషిగా బోనులో నిలబెట్టాడు. గురువుగారికి, అందరికీ నేను దొంగనని చెబుతానని బెదిరించాడు. నేను అబద్ధాలు జోడించలేక తప్పు ఒప్పుకొని, మరికొంత ఖోవా ఇస్తానని, ఎవరికీ చెప్పవద్దని బ్రతిమాలాను. వాడు గొప్ప విజేతగా భావించుకొంటూ నేనిచ్చింది తిని, మళ్లీ బెదిరించి లాక్కున్నాడు, ఖోవా. కమలాపురం పొలిమేర వచ్చేవరకు వాడు నన్ను బెదిరిస్తూ చాలవరకు ఖోవా అంతా కరగదిన్నాడు. నాకు రెండు ముక్కలు మిగిలాయి. నాకు వ్రతము చెడ్డది, ఫలమూ దక్కలేదు. అటు తర్వాత కూడా ఆ సహాధ్యాయుడు నన్ను బెదిరిస్తూనే ఉండేవాడు.

ఒక తుచ్ఛమయిన జిహ్వాచాపల్యం కోసం దొంగతనం, దానిని కప్పిపుచ్చుకోడానికి అబద్ధాలు, అబద్ధాల పరంపర – అబ్బా! ఎంత దిగజారిపోయాను! పశ్చాత్తాప పడ్డాను. నేను పెద్దవాడనయిన పిదప ఆ దొంగబుద్ధితోనే కాబోలు, మద్రాసు కుట్రకేసులో చేరా ననిపిస్తుంది. ఇప్పటికీ నాకు చిన్ననాటి దొంగబుద్ధి పూర్తిగా పోలేదు. నా సహధర్మచారిణి అనంతలక్ష్మి పుస్తకాలలోనో, తలగడ కిందనో, పెరుమాళ్లు సన్నిధానంలోనో పెట్టుకున్న చిల్లర డబ్బులు అడక్కుండా తీసుకుంటుంటాను. లెక్కగా పెట్టుకుంటుంటాను. అడిగి తీసుకోవచ్చు కదా! అంటూ ఉంటుంది ఆవిడ. అడిగి తీసుకోవచ్చు, ఇవ్వననేవారు లేరు. మరి నా దొంగబుద్ధి? మరీ విచిత్ర మేమిటంటే, ఏ చారులోకో పులుసులోకో వేయదలచి వంట ఇంటి అరుగుపై పెట్టిన బెల్లం ముక్కలను నోట్లో వేసుకుంటుంటాను, ఆవిడకు తెలీకుండా (చారు, పులుసులో కొద్దిగా బెల్లం వేస్తే రుచి మారుతుంది. మేము

ఇలా చేస్తాము). ఆవిడ వెతుక్కునేది. పిల్లలు తినేశారేమో అని వారిని కేకలు వేయబోయేది. నేను అడ్డుపడి నేనే తిన్నాననే వాణ్ణి. ఆవిడ కోపంతో చురచుర చూస్తూ "పిల్లచేష్టలు, దొంగచేష్టలు" అంటూ వెళ్లేది.

**ఆచారాల్లభతే హ్యాయుః**
**ఆచారాదీప్సితాః ప్రజాః**
**ఆచారా ద్ధన మక్షయ్యం**
**ఆచారో హన్త్యలక్షణమ్**

**(సదాచారం పాటించడం వల్ల మానవుడు దీర్ఘాయుస్సు పొందుతున్నాడు. సదాచారం వల్ల కోరిన కోరికలన్నీ పొందుతున్నాడు. సదాచారం వల్ల క్షయం కాని ధనసంపత్తిని పొందుతున్నాడు. ఆచారం అన్ని అవలక్షణాలను దోషాలను పోగొడుతుంది.)**

# 18

# పండుగలతో తలమునకలు

"హర్తుం కుంభే వినిహితకరః స్వాదు హైయంగవీనం
దృష్ట్వా దామగ్రహణచటులాం మాతరం జాతరోషామ్
సాయా దీషత్ప్రచలితపదో నాపగచ్ఛన్న తిష్ఠన్
మిథ్యాగోప స్సపది నయనే మీలయన్ విశ్వగోప్తా"

**(మిథ్యాగోపుడైన విశ్వగోప్త అప్పుడే తీసిన తియ్యని వెన్నను దొంగిలిద్దామని వెన్నకుండలో చేయిపెట్టాడు. తల్లి యశోద అది చూచింది. కోపంతో రెచ్చిపోయింది. పగ్గంతో కృష్ణుణ్ణి కట్టి వేద్దామని పగ్గం కోసం అటూ ఇటూ తిరుగుతూంది. ఆమెను చూచాడు కృష్ణుడు. అక్కడి నుంచి తప్పించుకొని పోదామని కాళ్లు కదిపాడు. కాని, అక్కడ ఉండనూలేదు, వెళ్లనూ లేదు. ఏమీ తోచనట్లు కళ్లు మూసుకున్నాడు. అలాటి కృష్ణుడు అందరినీ రక్షించుగాక!)**

**ఆ**నేగొంది సంస్థానానికి ప్రధాన పట్టణమైనా అంత పెద్దదేమీ కాదు. మా కమలా పురం కన్నా చిన్నదే. రంగనాథస్వామి రథోత్సవం జరిగే వీధులు మాత్రం చాలా విశాలమైనవి. రథం దేవాలయం నుంచి బయలుదేరి, విశాలమైన నాలుగు వీధులూ తిరిగి స్వస్థానం చేరేది. తక్కిన వీధులలో పెద్దది రాచనగరున్న వీధి. ఆ వీధిలోనే న్యాయస్థానం. రాచనగరు మొగసాలలో గంటలుకొట్టే పెద్దజేగంట వేలాడుతుండేది.

దానిమీద ఒక్క దెబ్బపడితే చాలు, మైళ్ల తరబడి వినిపించేది. అది రాయలకాలందని చెప్పేవారు.

ఊరిలో రంగనాథస్వామి ఆలయం పెద్దది. అది వైఖానస సంప్రదాయం ప్రకారం పూజలు జరిగే ఆలయం. అదిగాక ఊర్లో దాదాపు 40 వైష్ణవ దేవాలయాలు ఉండేవి. వాటికి నిత్యపూజల సంగతి తెలీదుగాని, ఆశ్వయుజ మాసంలో మాత్రం ముప్పై రోజులూ పూజలు జరిగేవి. ఆనేగొంది పరిసరాలంతా పెద్ద అడవులు, కొండలు. పంపా సరస్సు పదిమైళ్లు దూరంలో. కొండలలో దొనలు స్వచ్ఛమైన తియ్యని నీటితో ఆశ్చర్యం కలిగించేవి. దగ్గరలోనే అంజన పర్వతం. దానిపై నుంచి చూస్తే కనుచూపుమేరలో హంపి, కమలాపురం, హోసపేట వరకు కొండలు, చేలు, వంపులు తిరిగిన తుంగభద్ర. వాగులు, వంకలు, పడిపోయిన లెక్కలేనన్ని కోటగోడలు. గవనులు, రాణివాసం, శిథిలాలు కనిపించి ఆనందాశ్చర్య విషాదాలు కలిగేవి. ఎంత గొప్ప నగరమని; ఎంత వైభవమని ఆనందాశ్చర్యాలు; ఎంతగా నాశనమైపోయింది. ద్రోహానికి, అహంకారానికి గురి అయి అని విషాదం.

ఆనేగొందిలో శ్రీవైష్ణవుల ఇళ్లు మాత్రమే పదిహేను దాక ఉండేవి. హవ్యకవ్యాలు ఏమి జరిగినా ఈ పదిహేను ఇళ్లవాళ్లు పాల్గొనవలసిందే. శ్రీవైష్ణవులందరూ వడగల సంప్రదాయం వారే గనుక కంచికి వెళ్లి తీర్థ పరిగ్రహంతో వేదాంత దేశికుల విగ్రహం తెచ్చి స్థాపించి కోవెల నిర్మించారు. అక్కడ తిరునక్షత్రాలు,శాత్తుమొరలు జరిగేవి.

ఆనేగొందిలో అప్పటి పాలకురాలు శ్రీమతి కుప్పమ్మారాణి సాహిబా. ఆమె అప్పటి వృద్ధాప్యంలోను పోతపోసిన బంగారు విగ్రహంలాగ, ఓడికలై పారుతున్న రాజఠీవితో విరాజిల్లేది. విద్యార్థులము, గురువుల, ఆస్థాన విద్వాంసుల వారి ఇంటి వారమైన మాకు; నా మిత్రుడు రాజకుమారుడు కనుక రాచనగరులోని అరమనె రాణివాసంలో ప్రవేశం ఉండేది. కృష్ణదేవరాయల సోదరి తిరుమలాంబ బంగారు గొలుసులు, కడియాలు, అందెలతో పూచిన తంగేడులాగ ఒళ్లంతా ఆభరణాలతో తిరుగుతున్నప్పుడు దేహకాంతితో లీనమైపోయిన నగల ధాళధళ్యం నున్ననిపాల గచ్చుపై ప్రసరించినప్పుడు చూస్తూ నిలబడి పోయేవాడిని. "ఏం స్వాములు! ఏమైనా పోగొట్టుకుపోయిందా? వెదుకుతున్నారు?" అనేది ఆమె. రాణి వాసం. ఏం మాట్లాడితే ఏం బెడదో! మౌనంతో ఉండేవాడిని. బంగారు, వెండి, రత్నాలు, తప్ప మరొకటి కనిపించేది కాదు. హా! కత్తులు,

బల్లేలు, డాలులు మాత్రం ఇనపవి. రాణివాసం పూజలకూ వెళ్లేవాళ్లం.

ఆనేగొంది శ్రీవైష్ణవుల ఇండ్లలో ప్రతి రోజు విందే. తిరునక్షత్రమని, పండుగ అని, పారణ అని, పూర్ణిమ అని, అమావాస్య అని, ఇవికాక పుట్టిన రోజు పండుగలు, వివాహాలు, సమర్తలు, శోభనాలు, నామకరణాలు, పిండివంటలు తినలేక చచ్చేవాడిని. గోకులాష్టమి, కృష్ణజయంతి వస్తే మరీ విడ్డూరం. గుంజాలడ్డు, సుర్మాలడ్డు, బూందీ లడ్డు, రవ్వలడ్డు, లడ్డూలే డజను రకాల వుండేవి. కృష్ణునికి ఇష్టమని పాలతో పెరుగుతో చేసే పదార్థాలు ఎన్నో. ఇక గోధుమ, సెనగపిండ్లతో, బియ్యప్పిండితో చేసేవి చక్కిలాలు, చేగోడిలు, (కోల్‌బడ అని దీనిపేరు). ముచ్చోర, ఫేణీ రకరకాల పదార్థాలు, పెరుగటుకులు, బెల్లమటుకులు, పాలటుకులు, మీగడటుకులు, వేయించిన అటుకుల ఉండలు, అటుకులుదంచి పాకం పట్టిన ఉండలు, తేనె తొనలు (తేంగుళల్ జాంగ్రీ, జిలేబీ వంటివి), పాలతో చేసినవి, పాలకోవా, మీగడ తరగలు (రబడ్డీ), బర్ఫీ, పాలు విరిచి జున్ను ఇత్యాదిగా, గోకులాష్టమి నాడు ప్రతి ఇంటికీ వెళ్లి కృష్ణ ప్రసాదం స్వీకరించాలి. అలా పోనివాడు శత్రువు. శత్రువు కూడా ఆనాడు పగను మరుస్తాడు కృష్ణసన్నిధిలో.

గోకులాష్టమి నాడు రంగనాథాలయంలో పెద్దసంబరం. రంగనాథుని ఉత్సవ బేరానికి (మూర్తి లేదా విగ్రహానికి) కృష్ణవేషం వేసేవారు. నాల్గు తిరువీథులలోను ఊరేగింపు తర్వాత యథాస్థానంలో వేంచేపు చేసిన మీద ఉట్లు కొట్టడం పెద్ద సంబరంతో ప్రారంభమయ్యేది. దాదాపు 30 అడుగుల ఎత్తు, ఎనిమిదడుగుల నిలువు గల కర్ర స్తంభానికి నెల ముందునుంచే తుమ్మబంక, వేపబంక తక్కిన జిగుర్లూ దట్టంగా పూసి ఎండబెడతారు. ఆ లేపనం దాదాపు రెండు మూడంగుళాల మందం, మర్రిపాలు, తక్కిన చెట్లపాలు కూడా పూస్తారు. దానిని దేవాలయం ముందున్న విశాలమైన మైదానంలో పాతుతారు. దానిమీద వృత్తాకారంలో ముఖమల్ బట్టతో గుమ్మటం కట్టి అలంకరిస్తారు. దానిలో ఇద్దరు ముగ్గురు కూచుని మూడు నాలుగు గంగాళాల నీళ్లు, పాలు, పెరుగు, రంగునీళ్లు, పానకం పెట్టుకొనే ఏర్పాటు ఉంటుంది. గుమ్మటం అంచులకు రకరకాల పిండివంటలు, ఒకమూటలో ఐదు వెండి రూపాయలు కడతారు. గుమ్మటాన్ని తిప్పుతారు. కింది నుంచి స్తంభం ఎక్కి తిరుగుతున్న గుమ్మటానికి కట్టిన రూపాయల మూటను పట్టుకోవాలి. స్తంభం ఎక్కేవాళ్లపై గుమ్మటంపై నుంచి పాలు,

పెరుగు, నీళ్లు పోస్తారు. ఎక్కేవాళ్లు పై నుంచి పడే వాటిని లెక్కచేయకుండా ఎక్కాలి. స్తంభానికి బంక పూయడం వల్ల జారి జారి పడుతుంటారు. ఎంతో కష్టపడి ఒకళ్లపై ఒకరు ఎక్కి గంటలు తరబడి ప్రయత్నించి చివరకు ఒకడు రూపాయల మూట చేజిక్కించుకుంటాడు. పెద్ద కోలాహలం.

ఆశ్వయుజ మాసంలో ఊళ్లో ఉన్న గుడులన్నిటికీ పూజ జరుగుతుంది. బళ్లకు కూడా సెలవులు. పూజలు చేయండని మమ్మల్ను పంపేవారు. మేము ఊరి శివారులోని తోటలకు పోయి పూవులు, తులసి; కోసుకొని వచ్చేవాళ్లం. తెలిసిన మంత్రాలతో అభిషేకించి పూజచేసి, పళ్లు నైవేద్యం పెట్టేవాళ్లం. ప్రతిఫలం నెలకు రెండు రూపాయలు, నివేదించిన కొబ్బరి చిప్పలు, పళ్లు. నాకు ఇదొక కొత్త అనుభవం. ఏదో మొక్కుబడిగా కాక, శ్రద్ధగా భయభక్తులతో ఈ పూజలు చేసేవాణ్ణి.

నవరాత్రానికి మా గురువు గారి కుమార్తె తిరువేంగళమ్మ వచ్చేవారు. అదొక పండుగ, నవరాత్రం కొలువు పెద్దపవి, ఆమె రంగు కాగితాల ముక్కలు కత్తిరించి కాగే తేనె మైనంలో ముంచి ద్రాక్షగుత్తులు చేసేవారు. నేను చెట్టెక్కడంలో చురుకైన వాడిని. పున్నాగం చెట్లు, పొగడ చెట్లు ఎక్కి దులిపేవాడిని. పూవుల వర్షం కురిసేది. పున్నాగం పూవులతో ఆమె జడలల్లి బొమ్మలకు అలంకరించేవారు.

అప్పుడు ఆనేగొంది సమీపంలోని గంగావతి తాలూకా కనిగిరి (కనకగిరి) బచ్చన బొమ్మలకు ప్రసిద్ధి. బొమ్మలవారు ఆనేగొందికి రకరకాల బొమ్మలు తెచ్చేవారు. నవరాత్రంలో పది దినాలూ వాటికి దశావతారాల వేషాలు వేసేవారు. దశమినాడు ఊరంతా తిరిగి జమ్మి ఇచ్చి, పెద్దలకు నమస్కరించేవాళ్లం.

**"శమీ శమయతే పాపం**<br>
**శమీ శత్రు వినాశనీ**<br>
**అర్జునస్య ధనుర్ధారీ,**<br>
**రామస్య ప్రియదర్శినీ"**

**(అనే శ్లోకం చెప్పి ఇతర వర్ణాలవారు దక్షిణ ఇచ్చేవారు. ఆ విధంగా పన్నెండు రూపాయలు లభించేవి. దేవాలయంలో విజయదశమినాడు రంగనాథుడు పారువేటకు బయలుదేరేవాడు. ఊరి బయట ఒక పందిరి వేసేవారు. పారువేట అంటే పరుగెత్తే**



**మృగాన్ని బాణంతో కొట్టడం. దీనిని కాళిదాసు శాకుంతలంలో గొప్పగా చెప్పాడు.)**

ఉత్సర్గః సచ ధన్వినాం యధిషవః సిద్ధ్యంతి లక్ష్యేచలే అని. స్థిరంగా ఉండే గురిని కొట్టడం విశేషం కాదు. కదులుతున్న పరుగెడుతున్న లక్ష్యాలను కొట్టడం విలుకాండ్రకు గొప్పవిందట. పారువేట తర్వాత రంగనాథులు యథాస్థానానికి చేరుకున్న పిదపే శమీపత్రదానం.

నవరాత్రోత్సవాలలో పూవులకు, తలసికి వెళ్లేప్పుడు వన్యస్థితిలో పెరిగిన సీతాఫలం చెట్లలో కండ్లువిచ్చి చూచే సీతాఫలాలు మమ్ముల్ని నోరూరించేవి. ఇంట్లో సీతాఫలాలు తినడం నిషిద్ధం; జలుబు చేస్తుందనీ అజీర్ణం చేస్తుందనీ. కనుక తులసి కోసం వెళ్లినప్పుడు, గుట్టలలో గోతులు తవ్వి కండ్లు బాగా విచ్చినకాయలు కోసి వాటిలో వేసి, కట్టె, కంపా వేసి మూసివేసేవాళ్లం. మూడు నాలుగు రోజులకు మాగి వుండేవి. కడుపు నిండా తినేవాళ్లం. గుళ్లలో పూజలకు తిరిగేవాళ్లం గనుక అజీర్ణం గాని, పడిసెం గాని ఏమీ అయ్యేదికాదు.

నవరాత్రంలో నగరులో జరిగిన ఒక సంఘటన మాత్రం నాకు ఇప్పుడూ గుర్తుకు

వచ్చి కడుపులో దేవినట్టవుతుంది. మహానవమి నాడు పూజకోసం అంతఃపురం ప్రవేశించాము. పూజ ముగియవచ్చింది. కొబ్బరికాయ కొట్టి నైవేద్యం చేశాము. మహానైవేద్యం అన్నారు. ఏవో పిండివంటలు అనుకున్నాము. కుప్పమ్మ రాణీ సాహెబాగారి అల్లుడు రామరాజుగారు, "స్వాములూ మీరంతా ఈ మూలకు వెళ్లండి; మీ పూజ అయిపోయింది. ఇప్పుడు మేం నైవేద్యం చేస్తాం" అని పదడుగులలో వున్న ఒక మూల చూపారు. మేము వెళ్లాము. దున్నపోతుతో సమానంగా వున్న గొర్రె పొట్టేలు తెచ్చారు. దాని మోరకు పసుపు, కుంకుమ పూసి, మెడకు పూలహారం చుట్టారు. ఇద్దరు బలవంతులైన యువకులు దాని కొమ్ములు పట్టుకున్నారు. ఒకడు గండ్రగొడ్డలితో దాని మెడ తెగ నరికాడు. రక్తం మా వరకు చిమ్మింది. గొర్రె పొట్టేలు తల తెగిపడింది. మిడిగుడ్ల దాని చూపు ఇంకా నాకు గుర్తు వుంది. పాపం! అది అరవనైనా అరవలేదు. అరిచే అవకాశమేది? "అలంకృత్య శిరచ్ఛేదః" అనే సంస్కృతం సామెత ఇదే కాబోలు ననుకున్నాను. గురువుగారి మనుమలు ఈ సంగతిని ఇంట్లో చెప్పారు. "పూజ కాగానే మీరు రావలసింది. తామసపూజలు జరిగే చోట మనం ఉండరాదు" అన్నారు గురువుగారు.

గ్రహణ సమయంలో ఏదైనా మంత్రజపం చేస్తే సిద్ధిస్తుందనేది పూర్వుల నమ్మకం. నేను ఆనేగొందిలో ఉన్నప్పుడు రెండు మూడు చంద్రగ్రహణాలు వచ్చినట్టు గుర్తు. ఆ సమయంలో అందరితోపాటు తుంగభద్రకు వెళ్లి శిరస్స్నానం చేసి గ్రహణం పట్టుస్నానం చేసి, గ్రహణం విడిచే వరకు గురువుగారు ఉపదేశించిన హయగ్రీవ మంత్రం జపించాను. తేలు మంత్రమూ జపించాను. తర్వాత విడుపు స్నానం చేసి ఇంటికి తిరిగి వచ్చాను అందరితోపాటు. నేను తేలు మంత్రం ప్రభావం పరిశీలిద్దామని ఒక తేలును పట్టుకున్నాను తర్వాత కొన్నాళ్లకు. అది కుట్టింది. నాకు కుట్టినచోట ఒక కొరివి చీమకుట్టినట్లయిందే తప్ప విషం ఎక్కి సలుపేమీ కలుగలేదు. తర్వాత ఒక మారు గోడకు ఆనుకున్నాను. చీకటి. వీపు మీద ఏదో కుట్టినట్టయి చేతితో తడిమితే తేలు. అప్పుడూ సలుపు లేదు. తర్వాత మద్రాసులో కొత్తగా కాపురం పెట్టినప్పుడు ఒక అర్థరాత్రి ఏవో కండ చీమలు కుట్టినట్టయి పొర్లాను. ఉదయం నా భార్య పక్క దులిపి చూచింది గదా, ఒక పెద్ద తేలు, ఐదారు పిల్ల తేళ్లూ చచ్చిపడి ఉన్నాయి. నాకు చూపింది. విస్తుపోయాను. తర్వాత భయంతో వైద్య పరీక్ష చేయించుకొన్నాను. నాకు తేలు విషం వంటి చిన్న విషాలు

ఎక్కవని, ఇది వింతయిన శరీరతత్త్వమని తెలిసింది.

నా భార్య అనంతలక్ష్మి:-

**"తలనుండు విషము ఫణికిని**
**వెలయంగా తోకనుండు వృశ్చికమునకున్**
**తల తోక యనక యుండును**
**ఖలునకు నిలు వెల్ల విషము? గదరా సుమతీ"**

అనే సుమతిశతక పద్యం చదివి "మీ ఒంటి విషంలో తేలు విషం లీనమయిం దండీ" అని ఛలోక్తి విసిరింది. కాని ఎవరినీ ఆపద వీడదు. పాతకవి ఇలా అన్నాడు. పాము భయం వర్ణిస్తూ

"భీతో బాడబ వాసతో జలనిధౌ
శంభో శిరః స్వీకృతం
తత్ర త్ర్యంబక మౌళి వాసుకి విష
జ్వాలావలీ త్రాసితః
తస్మాల్లోక మగాద్దినం నిపతితః
తత్రైవ రాహోర్ముఖం
ప్రాయోగచ్ఛతి యత్ర భాగ్యరహితః
తత్రైవ యాన్త్యాపదః"

(సముద్రంలో పుట్టిన చంద్రుడు చల్లగా అక్కడే ఉండవచ్చుగదా. అక్కడ బడబానలానికి భయపడి శివుని తలకు ఎక్కి కూర్చున్నాడు. అక్కడ వాసుకి విష జ్వాలలకు భయపడి అక్కడి నుంచి స్వర్గానికి వెళ్లాడు. అక్కడ రాహువు నోట్లో పడ్డాడు. తరచు భాగ్యహీనుడు ఎక్కడికి పోయినా ఆపదలూ వెన్నంటే ఉంటాయి.)

# 19

## చిరుతపులుల చిత్రహింసతో శాడిస్టుల వినోదం

"మేదచ్ఛేద కృశోదరం లఘు భవ
త్యుత్థానయోగ్యం వపుః
సత్వానా మపి లక్ష్యతే వికృతిమత్
చిత్తం భయక్రోధయోః
ఉత్కర్షః స చ ధన్వినాం యదిషవః
సిధ్యంతి లక్ష్యే చలే
మిథ్యైవ వ్యసనం వదంతి మృగయాం
ఈదృగ్వినోద కుతః"

(వేట: వ్యసనం, వ్యసనం అని అంటారు, ఊరికేనే. ఇలాటి వినోదం ఎక్కడయినా ఉందా? వేట వల్ల ఒంట్లో కొవ్వు కరిగి, పొట్టపలచబడుతుంది. శరీరం చులకనై లేవడానికీ, కూర్చోడానికీ అనుకూలంగా ఉంటుంది. మృగాల మనస్తత్వం భయంతో కోపగించుకున్నప్పుడు ఎలా ఉంటుందో, యే యే వికారాలు పొందుతుందో తెలుసుకొనడానికి వీలవుతుంది. కదులుతున్న, పరుగెదుతున్న; మృగాలను బాణాలతో కొట్టడమనేది విలుకాండ్రకు పెద్ద పండుగ వంటిది. ఇంత మంచిని చేసే వేటను ఊరికేనే వ్యసనమంటారు - అంటాడు కాళిదాసు శాకుంతలంలో దుష్యంతుని మృగయాత్రా సందర్భంలో.)

కాని, వేట ఏ విధంగా చూచినా ఘోరమనే అనిపిస్తుంది. మృగాలు ప్రాణాలు

కాపాడుకోడం కోసం పరువులెత్తుతుంటే, మనకు వినోదమేమిటి? ఇది ఒక రకం శాడిజమే. ప్రేమవేట చేతకాని శాడిస్టులు పిల్లలను చీటికి మాటికీ కొడతారు. భార్యలను హింసించి సంతోషిస్తారు. తూనీగలను, జీరంగులను పట్టుకొని తోకకూ, మెడకూ దారాలు కట్టి ఎగిరిస్తూ చివరకు నలిపి చంపే పిల్లలను ఎంతో మందిని చూచాను.

ఒక ఉపాధ్యాయుడు ఈగలను పట్టుకొని రెక్కలు, కాళ్లు తల ఒక్కటొక్కటిగా విడదీసి చంపుతుండేవాడు. అతడు ఇతరత్రా చాలా మంచివాడే. బాగా పాఠాలు చెప్పేవాడు. పిల్లలను దయగా చూసేవాడు. కోపం లేదు. వ్యసనాలు లేవు. అంతా బాగుందికాని, ఈగలను చిత్రవధ చేసేవాడు. చివరకు పక్షవాతంతో పడ్డాడు. అవసాన కాలంలో నేను చూడబోయాను. “నా జీవితమంతా మీకు తెలుసుగదా! ఎందుకు నాకీ గతి?” అన్నాడు. నేను చెప్పాను జంకుతూ, “ఔను నిజమే కొన్నివేల ఈగలను చిత్రవధ చేసి ఉంటారు దాని ఫలమే ఇది” అన్నాను. “మన శరణాగతి సంప్రదాయాను సారం మనకు పునర్జన్మ లేదు కనుక చేసిన పాపాలన్నిటినీ ఇక్కడే, ఈ జన్మలోనే అనుభవించాలి. కనుక ధైర్యంతో భగవద్ధ్యానం చేయండి.” అన్నాను. సంవత్సరం పాటు బాధలు పడిపడి, పోయాడు.

శాడిజం (పరబాధాకరణ) అనేది వివిధ రూపాలలో ఉంటుంది. వేట కూడా అలాంటిదే. నేను ఆనేగొందిలో ఉన్నప్పుడు ఆనేగొంది రాజకుమారులు శ్రీకృష్ణ దేవరాయలు, శ్రీరంగదేవరాయలు నాకు మిత్రులు, నా వయసువాళ్లే, తొమ్మిది పదేళ్ల వాళ్లు. “అయ్యవారా, మూలుగు తింటావా?” అని హాస్యం చేసేవాళ్లు. నాకు అర్థమయ్యేదికాదు. మూలుగంటే ఎముకలలో ఉండే ద్రవం మజ్జి అని తర్వాత తెలిసింది. వాళ్ల వెంట ఒకటి రెండుమార్లు వేటకు కూడా వెళ్లాను.

వాళ్లు చిరుతపులులను ఎలుగ్గొడ్లను పట్టుకోడం, అడవి పందులను చంపడం, మహాసాహసోపేతంగా ఉండేవి. వేటాడిన జంతువులను కర్రలతో చిన్న పిరమిడ్‌వలె గొడరీతి దేవాలయం శిఖరాలలా; లంబాడీ ఆడవాళ్లు అమ్మే కట్టెల మోపులాంటి బోనున వేటాడిన జంతువులను కట్టేవారు. దాని ఒకవైపు – ఎడమ కొన అందాం– సన్నగాను కుడికొన వెడల్పుగాను ఉండేది. ఇది దాదాపు పది పదిహేను అడుగుల పొడవు ఉండేది. దీనిలో రెండు అరలు. ఎడమ వైపు కొనలో చివరి నుండి రెండు మూడుగడలకు




ఈవలగా ఒక అర. దీనిలో మేకను కట్టి పెట్టేవారు. తక్కిన పెద్ద అర ముఖాన్ని సగం మూసేవారు. దాని వెడల్పు (వ్యాసం) మూడడుగులుండేది. చిరుతపులి దానిలో దూరి అరుస్తున్న మేక పిల్లను పట్టుకుంటుంది. లాగుతుంది. మేక పిల్లను పూర్తిగా లాగకుండా కఱ్ఱలు అడ్డంగా ఉంటాయి. చిరుతపులి లోపలికి వచ్చి మేకను లాగగానే అది ప్రవేశించిన బోను ద్వారానికి కఱ్ఱలు అడ్డంగా పడుతాయి. చిరుత గింజుకుంటుంది. కదలడానికి ఇక ఉండదు. మనిషి అయితే అట్లాంటి గూడు లోనికి వెళ్లి, తనకు కావలసిన దానిని తీసుకొని, అలాగే వెనుకకు తిరగకుండా బయటపడగలడు. పిల్లి అలా చేయగలదు. కాని, దాని జాతివే అయినా చిరుతలు, పులులు అలా రాలేవు. అవి తిరగడానికి చోటుకావాలి. ఈ బోనుమీద మృగాలకు సందేహం రాకుండా ఆకూ అలమూ కప్పేవారు. బోనును చుట్టుపక్కల చెట్టుకు గట్టిగా కట్టేవారు.

మరొక రకం బోనులు బండలతో కట్టేవారు. పూర్తిగా ఎలుక బోనులాంటిదే. పులి లోపలకు ప్రవేశించి మేకను లాగగానే దానిని కట్టిన తాడు దానితో సంబంధం ఉన్న బోను మూత, బండకిందకి "ధం" అని పడుతుంది. చిరుతో, మరొకటో బిత్తరపోతుంది. తర్వాతే చిత్రహింస ప్రారంభమవుతుంది.

కర్రల బోనులో చిరుతపులిని అలాగే ఊళ్లోకి మోసుకొని వచ్చేవారు బండిమీద. రాతి బండల బోనులో పడినా దానిని మరొక కర్ర బోనులోకి తోలి తెచ్చేవారు. చిరుతపులి ముందు కాళ్లలో ఒక దానిని బలవంతాన వెలుపలికి లాగి మడమ దగ్గర కత్తితో గాట్లుచేసి గట్టినూలు పగ్గం - ఇరవై మంది లాగినా తెగనట్టి దానిని ఆకాలికి చుట్టి గట్టిగా ముడివేసేవారు. అది నొప్పితో, బొబ్బరిస్తూ ఉంటుంది. తర్వాత రాచనగరు ఎదుట ఉన్న కూడలిలో పెద్ద స్తంభం నాటి, దండోరా వేసేవారు. "చిరుత పులిని ఆడిస్తాము. చూడరండహో!" అని.

జనం తండోపతండాలుగా వచ్చేవారు. బోనును మోసుకొని వచ్చి చిరుత కాలికి కట్టిన నూలుపగ్గం మరొక కొనను నాటిన స్తంభానికి కట్టి, దూరం నుంచి తలుపునకు అడ్డంగా ఉన్న కర్రలను తొలగించేవారు. చిరుతపులి బాధతో బయటికి వచ్చి తప్పించుకు పోదామనుకుంటుంది. కుంటుతూ నడుస్తుంది. ఒక్కసారిగా చుట్టూ మూగిన జనంపై దూకి పగ్గంతో కింద పడుతుంది. పగ్గం పొడవు సుమారు 20 గజాలు. ఇలా కంబం చుట్టూ తిరుగుతుంది. అది బాధతో అరిచినప్పుడల్లా జనం చప్పట్లు; హర్షనాదాలు. పులి మరింత రెచ్చిపోతుంది. అప్పుడు నాలుగువైపుల నుంచి నలుగురు బల్లేలతో దాన్ని పొడవడానికి వస్తారు. కట్టివేసిన మృగాన్ని బల్లెంతో పొడవడం ఏమి పరాక్రమం? చిరుత గింజుకుంటుంది. వాళ్లపైన పడడానికి దూకుతుంది. పగ్గం మూలంగా కిందపడుతుంది. ఇకచాలు అని దొరగారో ఆయన ప్రతినిధో ఆజ్ఞాపిస్తారు. నలుగురూ బల్లేలు విసురుతారు. చిరుతపులి రక్త ప్రవాహంతో కూలిపోతుంది.

ఎంతటి అమానుషమైన వినోదం! చిత్రవధ చేయడంలో శాడిస్టుకు ఎంత సంతోషం! అది అడవిలో స్వతంత్రంగా ఉంటే మనిషి నిరాయుధుడై ఎదుట నిలబడేవాడే? ప్రాచీనకవి ఎవరో అడవిలో చిరుతపులి పరాక్రమాన్ని వర్ణించిన శ్లోకం ఇక్కడ ఉదహరిస్తాను.

"లాంగూలే నాభిహత్య క్షితితల మసకృత్
ధారయ న్నగ్రపద్భ్యామ్
ఆత్మన్యే నావలేయ ద్రుతసుధ గమనం
ప్రోత్సతన్ విక్రమేణ
స్ఫూర్ణద్దుంకార ఘోషః ప్రతిది శ మఖిలాన్
ద్రావయన్నేష జంతూన్
కోపావిష్టః ప్రవిష్టః ప్రతి వనమరుణో
చ్ఛూన చక్షుః తరక్షుః!!"

(తోకను నేలకేసి తరచు గట్టిగా కొడుతూ, పరిగెత్తే వేగంలో కాళ్లను కడుపులోకి నొక్కుకుంటూ, పరాక్రమావేశంతో ఎగురుతూ, పెడబొబ్బల ధ్వనితో సకల దిక్కుల జంతువులను భయపెడుతూ, కోపంతో ఉబికిన ఎర్రటి కళ్లతో నిప్పులు కురిపిస్తూ చిరుతపులి అరణ్యంలో ప్రవేశించింది.)

# ౨౦

# నిద్రలో నడక

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితో పి జంతుః
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావ స్థిరాణి జననాంతర సౌహృదాని"

**(మానవుడు సుఖంగా ఉన్నా ఒక్కొక్కప్పుడు రమ్యమైన వస్తువులను చూచి, శ్రావ్యమైన ధ్వనులను విని ఆరాటపడతాడు. ఎందుకో? సుఖంగా ఉన్నాడు. ఆరాటం ఎందుకు? ఏవో చూస్తాడు. ఏవో వింటాడు. గతస్మృతులు జ్ఞాపకం వస్తాయి. మనస్సు ఆకుల మౌతుంది. ఎందుకు? తనకు తెలియకుండానే మనస్సులో** నిలిచిపోయిన పూర్వజన్మ పరంపరల ప్రేమలను తలచుకుంటాడేమో!)

**అం**దుకేనేమో ఈ ఆరాటం. లేకుంటే సుఖంగా జీవిస్తున్నాడు గదా! అసంతృప్తికి గాని, దుఃఖానికిగాని కారణాలు ప్రత్యక్షంగా తెలిసినంత వరకు లేవుగదా! కనుక అది ఈ నిర్వేదం, ఈ అసంతృప్తి, ఈ విషాదం, ఈ ఆరాటం, ఈ జన్మది కాదేమో! ఎన్నో జన్మలుగా మనసులో నిలిచిపోయిన, పోయిన, స్థిరపడిపోయిన, నాటుకుపోయిన సౌహృదాలేమో!

మానవుడు స్వప్నావస్థలో విచిత్రమైన పనులు చేస్తాడు. ఈ అర్ధచేతనావస్థలో చేసిన

పనులు అతనికి జ్ఞాపకం ఉండవు. అందువలననే స్వప్నశాస్త్రజ్ఞులు (హిప్నాటిస్టులు) మానవుని స్వప్నావస్థకు తీసుకొని వెళ్లి, అతనితో అత్యపూర్వమైన సాహస కార్యాలు చేయిస్తుంటారు. వాటిని మనం చూచి ఆశ్చర్యపడి ఆనందిస్తుం టాము. "హిప్న" అనేది గ్రీకు ద్వారా వెళ్లిన స్వప్న శబ్దమే.

నాకు స్వప్నావస్థలో ఏవేవో పిచ్చి పనులు చేసే అలవాటు ఉండేది. నాకు తెలియదుగాని, నా పరిసరాలలో ఉన్నవారు చెప్పగా విని విస్తుపోయేవాడిని. ఒక్కొక్కప్పుడు అవి ప్రమాదకరంగానూ పరిణమించేవి. ఇతరులకు హానికరాలుగాను కావచ్చు. నా తల్లిదండ్రులు చెప్పగా విన్నది చెబుతున్నాను.

ఒక నడిరేయి నేను వీథి తలుపు తెరుచుకొని వెళ్లిపోయాను. వెళ్లుతున్నాను. ఊరి పొలిమేర దాటాను. జనాన ఎన్‌క్లోషర్స్ - విజయనగర రాజుల రాణివాసం - శిథిలాలు దాటాను. దాని తర్వాత ఉన్న గవని దాటాను. విజయనగర సార్వభౌముల కాలంలో ఊరికంతా ప్రధాన శౌండాపణమైన హెండామారోగుండు - కల్లమ్మే గుండు దాటాను. అక్కడ దారి చీలుతుంది. ఒకటి ఆనేగొందికి వెళుతుంది. రెండవది కంప్లీకి వెళుతుంది. నేను కంప్లీదారి పట్టాను. ఈ కంప్లీయే అలనాటి కాంపిల్య నగరం. ఒకటి రెండు ఫర్లాంగులు నడిచానో లేదో, కిర్రు కిర్రుమనే ధ్వని వినిపించింది. కళ్లు తెరిచాను. చిమ్మచీకటి. కొంత దూరంలో చెఱకుగానుగ ఆడిస్తున్న కిర్రు కిర్రు శబ్దమే నన్ను మేల్కొల్పింది. ముచ్చెమటలు పోశాయి. ఏదో క్రూర వన్య మృగం తరుముకొని వస్తున్నట్లయి గానుగాడుతున్న చోటికి పరుగెత్తాను. అదృష్టవశాత్తు, అది మా చెఱకుతోటే. నన్ను చూడగానే అక్కడివారు "ఏను స్వామారే ఈగ ఇల్లిగి?" (ఏమిటి స్వామివారూ, ఇప్పుడు ఇక్కడ?) అన్నారు. ఆశ్చర్యంతో నేను ఏమి చెప్పగలను?

ఐదు నిమిషాలు అయిందో; లేదో మా పిన్నయ్యగారు సైకిలుపై వచ్చారు. నేను మరింత ఆశ్చర్యపడ్డాను. నేను ఈ అర్థరాత్రి అడివికి రావడమేమిటి? నా వెంట మా పిన్నయ్యగారు రావడమేమిటి? అగోచర పరిస్థితి. ఆయన గానుగాడించే వారితో ఏదో మాట్లాడి నన్ను సైకిలుబారు మీద కూర్చోపెట్టుకొని ఇంటికి వచ్చారు.

జరిగిన సంగతి ఏమిటంటే.. నేను తలవాకిలి తలుపు తెరుచుకొని వచ్చిన తర్వాత కొంతసేపటికి మా పిన్నయ్యగారికి మెలకువ వచ్చింది. అటు ఇటు చూడగా నా పక్క వెక్కిరించింది. తిరిగి చూచారు. తలవాకిలి తలుపులు తెరిచి ఉన్నాయి. ఆయన ఏ

దొంగలు పడ్డారో అని తుపాకి తీసుకొని వీధిలోకి వచ్చారు. పరిసరాలు ప్రశాంతం గా ఉన్నాయి. నేను ఏమయిపోయానో అని ఇంటి చుట్టూ చూచారు. నా కలలో నడక జబ్బు సంగతి తెలుసు ఆయనకు. కనుక ఇరుగు పొరుగు ఇళ్లముంగిళ్లు చూచారు. కనిపించలేదని; నేను ఏ దారి పట్టుకుని వెళ్లానోనని ఆలోచించారు. సైకిలెక్కి బయల్దేరారు. హంపీ దారి చూచారు. ఆనెగొంది చూచారు. ఒకవేళ నేను పొరపాటున మా చెఱకు తోటలకు వెళ్లి ఉంటానేమో అనే ఊహతో వచ్చారు. నేనా రాత్రి దాదాపు రెండు గంటలు నడిచి ఉంటాను. చిన్నపిల్లవాడివి. ఎంత లేదన్నా మూడు మైళ్లు మేర.

ఈ నిద్రలో నడకను పోగొట్టడానికి నా పెద్దలు బ్రాహ్మీఘృతం వంటి మందులు ఇప్పించారు. బ్రాహ్మీని మా ప్రాంతంలో ఒందెలగ అంటారు. అంటే ఒకే ఆకు గలది అని అర్థం. దీనివల్ల కొంత నయమైనప్పటికీ, నిశ్శేషంగా పోలేదు. ఆనెగొందిలో మళ్లీ కెలక వేసింది.

ఆనెగొందిలో మా గురువుగారిది పెద్ద భవంతి ఇల్లు. హవేలీ. తలవాకిలి దాటగానే రెండు వైపులా గదులు వరసగా రెండు, నాలుగు మెట్లెక్కగానే పెద్ద పడసాల. దాని మధ్యన గుమ్మం. అది దాటగానే పెద్ద భవంతి పడసాల. మధ్యన వివాహాది శుభకార్యాలు జరగడానికి నాలుగు స్తంభాల అరుగు. ఎడమవైపు కుడివైపు వరుసగా రెండు గదులు. ఒక గది గురువుగారిది. దానిపక్కన ఉన్నది ఉగ్రాణం గది. నాలుగు స్తంభాల వేదిక వెనుకగా పొడుగాటి అరుగు. అక్కడ మడిబట్టలు ఆరవేయడానికి వరుసగా పది పన్నెండు దండాలు. పడసాలకు మూలగా తలుపు. అది పెరడుకు దారి. గుమ్మం దాటగానే కుడిప్రక్క నీళ్ల ఇల్లు (స్నానాల గది). ఎడమపక్కన ఇతర వర్ణాలవారు పడుకొనడానికి, ఉండడానికి పొడుగాటి వసారా. దాదాపు అర్ధ ఎకరం పెరడు. నిండా పూలచెట్లు, పండ్లచెట్లు, నడుమ తులసి బృందావనం. కార్తీకశుద్ధ ద్వాదశినాడు తులసీకళ్యాణం పండుగకు పెరడు శోభ అపూర్వం. కుడివైపు మిద్దెకు మెట్లు.

నేను ఒక రాత్రి నాలుగు స్తంభాల భవంతి చుట్టూ తిరుగుతూ భజన చేస్తున్నానట. అందరూ మేల్కొని చూస్తున్నారు. కళ్లు మూసుకొనే ఉన్నాను. కాని ఎక్కడా ఏ స్తంభానికీ ఢీకొట్టకుండా తిరుగుతున్నాను. సాధారణంగా సౌమ్యంగా ఉన్నవాడిని, ఇంతటి విచిత్రమైన పని చేస్తున్నానంటే ఏదో ఉన్మాదమైనా అయి ఉండాలి, వ్యాధి అయినా అయివుండాలి - అని గురువుగారు గ్రహించారు. నాకు మెలకువ కలిగించ దానికి

ప్రయత్నించారు, ఫలించలేదు. నాకు మెలకువ వచ్చేవరకు నారాయణ స్మరణ చేస్తూ కూర్చున్నారు. రెండు మూడు గంటలకు నేను మేల్కొన్నాను. అందరూ చిత్రంలోని బొమ్మలలాగ కూర్చుని ఉండడం చూచాను. నన్ను చూచుకున్నాను. భూతావిష్టుడి లాగ ఒక్క పరుగుతో నా పక్క మీదికి దూకి పడుకున్నాను. అంతే నాకు జ్ఞాపకం. మరుసటి ఉదయం చాలా పొద్దుపోయి లేచాను. గురువుగారు అడ్డుపెట్టలేదు.

గురువుగారు ఆలోచించారు. కనికరించారు. మంచి మందు సిద్ధపరచడానికి నిశ్చయించారు. అప్పుడు శ్రీనివాస రాఘవాచార్యులు యాదృచ్ఛగా ఆనెగొందికి వేంచేశారు. ఆయన పరకాల మఠం పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ కృష్ణబ్రహ్మ తంత్ర పరకాల మహాదేశికుల జ్యేష్ఠపుత్రులు. వారు శతాధిక గ్రంథకర్తలు. కవి గండభేరుండే త్యాది బిరుదాంకితులు. శ్రీనివాసరాఘవాచార్యులవారు తమ తండ్రిగారంత గొప్ప విద్వాంసులైనా, గ్రంథరచన ఏమీ చేయలేదు. ఆయన మా గురువుగారి వియ్యంకులు; అనగా అలవేలమ్మత్త తండ్రి, ఆయన ఆయుర్వేద శాస్త్రంలో నిష్ణాతులు. నన్ను పరీక్షించారు.

అప్పుడు నేను చెవిపోటుతో బాధపడుతున్నాను. కుడి అరచేతిలో పుండు లేచింది. భరించరాని కంపు. మోచేతి వరకు వాపు. శ్రీనివాస రాఘవాచార్యులుగారు మూడు ఔషధాలు సిద్ధపరచారు. చెవిపోటుకు నిర్గుండ్యాది తైలం. నిర్గుండ అంటే వావిలి. అరచేతికి గంధకాది లేపం, సద్యోఘృతం. నిద్రలో నడకకు నారికేళాంజనం. ఆ కాలంలో రెండు కానుల కొక టెంకాయ. నూరు టెంకాయలు తెప్పించి నీరు ఒక కళాయి ఉన్న గంగాళంలో పోసి, కాచి, ముద్దచేసి, పచ్చకర్పూరం, కుంకుమపూవు, గోరోచనం, కొద్దిగా లవంగాలు నున్నగా నూరి, దానిలో చేర్చి మరోమారు నూరారు. దాదాపు పది ఔన్సుల నారికేళాంజన మయింది. ఈ మూడు చికిత్సలూ ఏక కాలంలోనే. పొన్నగంటి కూర, అవిసెకూర, చిర్రికూర, అవిసెపూవులు, ఉస్తికాయలు, కాకరకాయలు – పథ్యం. ఐదారు నెలలు సేవించినట్టు గుర్తు. గురువుగారు సకలోపచారాలూ చేశారు. చేయించారు.

ఈ చికిత్స తర్వాత నిద్రలో నడక ఆగిపోయింది. మరి రాలేదు. ఈ సమయంలో గురువుగారు నా అనారోగ్య విషయం కమలాపురానికి తెలియజేశారేగాని ఎవరినీ రావద్దన్నారు. ఇవి బాధించే వ్యాధులేగాని, ప్రాణాంతకమైనవేమీ కాదుగదా! ఇంతకూ గురువుగారి ఇంటిల్లిపాదీ నా విషయంలో శ్రద్ధచూపిస్తున్నప్పుడు, తమ పనులు

పాడుచేసుకొని వాళ్లెందుకు?

నాకు ఆరోగ్యం కలిగిన తర్వాత గురువుగారు నాకు సమాశ్రయణం చేయించాలని నిశ్చయించారు. సమాశ్రయణం అనే పదం సమ్+ఆశ్రయణం అని శ్రయ ధాతువు నుంచి పుట్టింది. ఆ భగవంతుని ఆశ్రయించడం అన్నమాట. అవి వైష్ణవుడు కావడానికి. వాటిని పంచసంస్కారాలంటారు. ఈ సంస్కారాలు లేనిదే వైష్ణవుడు కాదు. అవి

**తాపః పుండ్రం తథా నామ**

**మంత్రో యాగశ్చ పంచమః**

తప్త చక్రాంకనం, నొసట ఊర్ధ్వపుండ్రం, పేరు మార్పు, మంత్రజపం, యజనం - అంటే దేవపూజనం - ఇవి పంచ సంస్కారాలు. ఈ సంస్కారాలతో ఈ దేహం, నేను, ఇది నాది అనే భ్రాంతి తొలగుతుంది.

"ఏ వ్యక్తి అయినా తన వస్తువును గుర్తించడానికి దానిపై తన పేరు లేక పొడి అక్షరాలు చెక్కుతాడు. అలాగే ఈ శరీరం నాది కాదు. పరమాత్మది. స్వామి సొమ్ము. సంసారం దాటడానికి తెప్పగా భగవంతుడు నాకు అప్పగించాడు. దీనిని అతని సేవకే వినియోగించాలి, దేహాత్మభ్రాంతిలో అనుచితమైన పనులు చేస్తే భగవంతుని సొమ్ము దుర్వ్యయం కావడమేకాక ఆత్మకూ అధఃపతనం తప్పదు. అందువలన సంసారతరణ సాధనంగా ఆయన కైంకర్యానికి వినియోగించాలి" - అనే భావంతో గుర్తుగా భగవంతుని శంఖచక్రాల గుర్తులను భుజాలపై వేసుకోవాలి. ఇది తాపసంస్కారం.

నొసట పుండ్రం ధరించడం అనాదిగా భారతీయాచారం. శూన్యలలాటంతో ఏ పనీ చేయరాదు. అంతేకాక ఈ వ్యక్తి వైష్ణవుడు అని తెలియడానికి తిరుమణి తిరుచూర్ణాలతో ఆయాస్థానాలలో ఊర్ధ్వపుండ్రాలు ధరించాలి. ఇవి కేవలం అలంకారం కోసం కాదు. శ్రీమన్నారాయణుడు ఆయా స్థానాలలో ఉన్నాడన్న దృష్టితో కేశవాది నామాలతో అనుసంధించాలి.

ప్రతి వ్యక్తికి ఏదో పేరు వ్యవహారంలో ఉంటుంది. కులం పేరు, వంశం పేరు తగిలించుకోడం మన దేశంలో అలవాటు. కాని వైష్ణవుడైన వాడు భగవద్భాగవతుల యెడ పూజ్యభావంతో ఉండాలి గనుక కుల విద్యా ధన మదాలు వదులుకొని తాను అందరికన్నా చిన్నవాడినని చెప్పడానికి వర్ణసంబంధమైన శర్మ వర్మ గుప్తాది ఉపాధులు మాని దాస అనే బిరుదం చేర్చుకోవాలి. ఈ దాసత్వాన్ని త్రికరణ శుద్ధిగా ఆచరణలో




పెట్టాలి. ఇది నామ సంస్కారం.

ఈ దాసభావానికి మా తాతగారొక కథ చెప్పారు. పెరియ తిరుమలనంబి (శ్రీశైలపూర్ణులు) మా వంశం మూలపురుషులు. మా శఠమర్షణ గోత్రం వారే అయిన ఆళవందార్ల - యామునాచార్యుల శిష్యులు, పెరియ తిరుమల నంబి తిరుమలలో కైంకర్యం చేసేవారు. ఒకమారు ఆయన తమ మేనల్లుడు తమ వద్ద శుశ్రూష చేసి చదువుకొంటున్నవాడు అయిన రామానుజులకు పెరుమాళ్ల తీర్థం ఇచ్చారట. రామానుజులు వారిని సేవించి (నమస్కరించి) "పెద్దలు మీరు దీని కోసం రావాలా? ఏ పిల్లవాడితోనైనా పంపించలేకపోయారా?"అని అన్నారట. "ఔను, నేనూ చూచాను. నా కంటే పిల్లవాడెవ్వడూ కనపడలేదు. నేను తీర్థంతో వచ్చాను-" అన్నారట తిరుమల నంబి. ఇది త్రికరణ పూర్వకమైన దాసభావం. ఇది గొప్ప సంస్కారంతోగాని కలుగదు.

మంత్రజపం నాల్గవ సంస్కారం, వైష్ణవుడైనవాడు అష్టాక్షరిద్వయం, చరమ శ్లోకం అనే మూడు మంత్రాలు నిత్యం జపించాలి. 'ఓం నమో నారాయణాయ' అనేది అష్టాక్షరి.

అంటే ఎనిమిదక్షరాలు గలది. దీన్ని మూల మంత్రమన్నారు. ఇది పరమాత్మ జీవాత్మ స్వరూప స్థితి ప్రవృత్తులు తెలియజేస్తుందని శ్రీవైష్ణవుల విశ్వాసం. ఓం పదం జీవాత్మ, లక్ష్మీవిశిష్ట పరమాత్మలకు నమః పదం. సేవకు నారాయణాయ పదం. జీవునికి నారాయణుడు తప్ప మరొకరు బంధువు కాదనడాన్ని తెలుపుతాయి. దీనికి తారకమంత్రమని మరొక పేరు. 'శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే.' 'శ్రీమతే నారాయణాయనమః' అనేది, ద్వయ మంత్రం. ఈ మంత్రం పూర్వార్ధంలో ఉపాయ ప్రతిపాదనం, (ఎలా భగవంతుని చేరాలి అనే మార్గం తెలపడమూ) ఉత్తరార్ధంలో ఉపేయ ప్రతిపాదనమూ – (పొందదగిన నారాయణుని తెలుపడమూ) ఉండడం వల్ల దీనికీ పేరు వచ్చింది. దీనికి మంత్రరత్నమని పేరు.

**"సర్వధర్మాన్ పరిత్యజ్య**
**మామేకం శరణం వ్రజ**
**అహం త్వాం సర్వపాపేభ్యో**
**మోక్షయిష్యామి మా శుచః"**

అనేది చరమ శ్లోకం "అన్ని ధర్మాలు వదిలి నన్నే శరణుపొందు, నేను నిన్ను సకల పాపాల నుంచి విముక్తుణ్ణి చేస్తాను. శోకించకు" – అని శ్రీకృష్ణభగవానుడు అర్జునునికి ఉపదేశించినదిది. నీవు దీనిని ఇలా అనుష్ఠించు, దీని కది ఫలం – అని, ఇది ఫలవిధానం బోధిస్తుంది. ముక్త్యుపాయాలలో కట్టకడపట ఈ యోగం ఉపదిష్ట మైంది. గనుక ఇది చరమ మంత్రమైంది. ఈ మూడు మంత్రాలకు మంత్రత్రయమని పేరు.

యాగం అంటే పూజ (దైవపూజ) అని అర్థం. ముముక్షువు భగవత్పూజ తప్పక ఆచరించాలి. చేసే ప్రతి పనినీ భగవంతునికి అర్పించాలి. ఏమి తినదలచినా మొదట భగవంతునికి అర్పించాలి. ఏమి తినదలచినా, మొదట భగవంతునికి నివేదించి, తీర్థపూర్వకంగా పరిగ్రహించాలి. ఈ దైవపూజే యజ్ఞం. ఇదే ఐదవదైన యాగ సంస్కారం.

ఈ 'పంచసంస్కారం' వల్లనే వైష్ణవునికి నిత్యనైమిత్తిక క్రియార్హత కలుగుతుంది. పంచసంస్కార సంస్కృతుడైన పిదన శ్రీమన్నారాయణుని పొందే ఉపాయాలు అనుష్ఠించి దానికి విఘ్నాలు కలిగించే విరోధి పంచకాన్ని పరిహరించి పునరావృత్తి రహితమైన మోక్షం పొందాలి.

నేను శ్రీశ్రీనివాసరాఘవాచార్యుల ద్వారా పంచసంస్కారాలు పొంది శ్రీవైష్ణవుడినై,

రామచంద్ర దాసుణ్ణయ్యాను. కమలాపురం నుంచి మా వాళ్లంతా వచ్చారు.

**"క్రతూ యంతి క్రతవో హృత్సుధీతయో**
**వేసంతి వేనాః పతయంత్యాదిశః**
**నమర్ధితా విద్యతే అన్య ఏభ్యో**
**దేవేషు మే అధికా మా అయంస."**

**(మా హృదయాలలో వివిధ భావోద్వేగాలు తీవ్రమవుతున్నాయి. ప్రేమకాంక్షలు ఉదయించి సకల దిక్కులు వ్యాపిస్తున్నాయి. ఈ భావాలకంటే ఉపశాంతి కారణాలు వేరేలేవు. నా అధికామాలు, ఉదాత్తాశలు దేవతలపైన - భగవంతునిపైన ఉన్నాయి.)**

# 21

# మహాతపస్విని కొండమ్మవ్వ

**తుంగోచ్ఛిఅ హోఇ మణో**
**మణంఖణో అంతిమాసు విదసాసు,**
**అత్థను అమ్మి విరిణో**
**కిరణా ఉద్ధంచిఅ పురం తి**

**(గొప్పవారి మనస్సు తుది దశలో కూడా తన గొప్పదనాన్ని కోల్పోదు. ఉన్నతంగానే ఉంటుంది. సూర్యుడు అస్తమిస్తున్నప్పుడు కూడా అతని కిరణాలు వాలిపోవు, పైకి ప్రసరిస్తాయి.)**

**ఆ**మె గొప్ప మనస్విని. కాపురానికి వచ్చి కాంక్షలు తీరీ తీరని వయస్సులోనే వైధవ్యం పైన పడింది విధివంచనతో. పిల్లలు లేరు. విడిపోతే ఆస్తులలో చీలికలు వస్తాయని అత్తింటివారు – మా గురువుగారి పెద్దలు ఆమెను పుట్టింటికి పంపలేదు. అత్తింటిలోనే ఎనిమిది పదుల ఆయుస్సు గడిపింది. తన బావగారి (మా గురువుగారి) కుమారుణ్ణి తన కుమారుడుగా భావిస్తూ, అతని పిల్లలను తన మనమలుగా భావిస్తూ, ఒక బొమముడిపాటు లేక, ఒక్క చీదరింపు లేక, అసంతృప్తి అంతకన్నా లేక, సంతోషం తో ఎప్పుడూ నవ్వుతూ, అందరినీ వాత్సల్య గౌరవాలతో చూస్తూ జీవయాత్ర గడిపింది, ఆ మనస్విని తపస్వినిలాగ. ఆమె కొండమ్మవ్వ. గురువుగారి తమ్ముని భార్య అని, మా

తాతగారి మరదలని ఇదివరకే చెప్పాను.

కొండమ్మవ్వ మనసున్న మరమనిషి. ఆమె లేకపోతే గురువుగారి ఇల్లే ఉండదేమో ననిపించేది నాకు. ఏ పనీ ఆమెది కాదు. కాని అన్ని పనులు ఆమెవే. నేను ఆనెగొందిలో ఉన్నప్పుడు ఆమె వయస్సు నలభై అయిదూ, యాభైల మధ్య. కాయవాటు శరీరం. బంగారు పోత పోసిన ఐదడుగుల నాలుగంగుళాలకు పైనే నిలువు. క్రమశిక్షణలో ఆమె ఒక సైనికురాలు. సమయపాలనలో సూర్యచంద్రులకు దీటు.

ఆమె తెల్లవారు జామున నాలుగు కొట్టగానే మేల్కొనేది. 'హరిర్హరి' అని అనుకుంటూ లేచేది. కాలకృత్యాల తర్వాత స్తోత్రాల పారాయణం చేస్తూ అంట్లన్నీ తోమేది. ఐదు గంటలకు రెండు పెద్ద బిందెలతో ఫర్లాంగు దూరంలో ఉన్న తుంగభద్రకు వెళ్లేది. స్నానం చేసి చీర ఉతుక్కుని రెండు బిందెల మంచి నీళ్లతో ఇంటికి వచ్చేది. పెరుమాళ్ల పాత్రలు శుద్ధిచేసి, వంట సామాగ్రి సమకూర్చుకొని వంటకు ఉపక్రమించేది. ఇంట్లో అతిథి అభ్యాగతులతో సహా దాదాపు పదిమంది ఉండేవారు. పరుప్పూమదు (పప్పు), నళహరి (పులుసు), కరమదు (కూర), శాత్తమదు (చారు), తొహియల్ (పచ్చడి), ఊరగాయ, పెరుగు - ఇవి రెండుపూటలా ఉండవలసినవి. పండగలైతే, పిండివంటలూ, తద్దినాలైతే నాలుగు కూరలూ, నాలుగు పచ్చళ్లు, నళహారి, నాలుగు తీపి పదార్థాలు, నాలుగు తక్కిన పిండి వంటలూ ఉండాలి. గండికోట వైష్ణవులు తమిళభాషను చాలావరకు మరచిపోయినా భోజన పూజాదుల పరిభాష మాత్రం తమిళే. నళహుకరి-జారేకూర. ఇది పప్పు పులుసుకు వైష్ణవులు వాడేమాట. ఇది మా వ్యవహారంలో నళహారి అయింది. కరమదు - కరి+అమదు= కూర. కరి అంటే తమిళంలో కూర. వైష్ణవులు ప్రతి భోజ్యపదార్థానికీ మొదట్లో ఉపసర్గగా తిరు, చివర ప్రత్యయంగా అమదు-అమృతం చేర్చుతారు. కరమదు=అమృతం=పరమాన్నం. దానికి మొదట 'తిరు'చేరి తిక్కణ్ణమదు అయింది. తొహియల్=పచ్చడి, తొక్కు. భోజనానంతరం ఒంటి గంట నుండి నాలుగు గంటల వరకు విశ్రాంతి. ఈ సమయంలో ఆమె కొత్త స్తోత్రాలు నేర్చుకొనేది. "రాముడూ, ఈ స్తోత్రం సంత చెప్పరా!" అని ఏదో స్తోత్రం సంత చెప్పించుకొనేది. "నీకు వందల స్తోత్రాలు, తమిళ, కన్నడ, తెలుగు సంస్కృతగీతాలు వచ్చుగదా! ఈ స్తోత్రం ఎందుకవ్వా నీకు?" అనేవాడిని. "ఎన్ని స్తోత్రాలు వస్తే అంత పుణ్యం" అని ఆమె సమాధానం. ఆ విరామ సమయంలోనే మైలపనులు - దంచడం, జల్లించడం, చక్కజేయడం, విసరడం,



చెరగడం వంటివి. నాలుగు తర్వాత లాంతర్లను తుడవడం, కిరసనాయలు పోయడం మొదలయిన పనులు. ఆరు గంటలకు మళ్లీ మడి కట్టుకుని వంటపని. తొమ్మిది లోపు భోజనాలు అయిపోతే, పడుకోడం. పడుకునేటప్పుడు ముకుందమాల లోని శ్లోకం చదివి నిద్రకు ఉపక్రమణ.

**"క్షీర సాగర తరంగ శీకరా**
**సార తారకిత చారుమూర్తయే,**
**భోగిభోగ శయనీయ శాయినే**
**మాధవాయ మధువిద్విషే నమః!!"**

**"శ్రీ మహావిష్ణువు పాలకడలిలో ఆదిశేషుని పాన్పుపై పవ్వళించి ఉన్నాడు. పాలకడలి తరగల తుంపరలు ఆయన శరీరంపై పడి నక్షత్రాలలాగ మెరుస్తున్నాయి. అలాంటి**

**మహావిష్ణువుకు నమస్కారం"** అని ఈ శ్లోకం తాత్పర్యం.

అటు సూర్యుడు ఇటు పొడిచినా ఆమె కార్యక్రమం. దినచర్య మారవు.

కొండమ్మవ్వ సంభాషణ చతురురాలు. హాస్యప్రియురాలు. ఆమె సంభాషణలలో పురందరదాసు కీర్తనలు, శ్రీకృష్ణబ్రహ్మపరకాల మహాదేశికులు పూర్వాశ్రమంలో రచించిన సంస్కృత గేయాలు దొర్లేవి. పురందరదాసు ఆ ప్రాంతంవాడు, కమలాపురం వాడు. కనుక ఆ కీర్తనలు రానివారు ఆ ప్రాంతంలో అరుదు. శ్రీకృష్ణబ్రహ్మతంత్ర పరకాల స్వామి షోడశ సంస్కారాలకూ అవసరమైన సంస్కృత గీతాలు రచించారు మహిళల కోసం. అవి మైసూరు ప్రాంతం వైష్ణవులలోను, రాయలసీమ వైష్ణవులలోను మహిళలు తప్పనిసరిగా నేర్చుకుంటారు. కొండమ్మవ్వకు ఈ పాటలు అసంఖ్యాకంగా వచ్చు. పెళ్లిళ్లు, శోభనాలలో ఆమె మరుగున ఉండి ముత్తైదువులకు ఇలాంటి పాటలు అందించేది. ఆమె పాడే వాకిలి తీసే పాటలో ఒకటి రెండు చరణాలు నాకింకా జ్ఞాపకం.

**"జఘన తలవిజిత పులినే లలనే**
**విఘటయారరం బాలే**
**సఖి, బాలచంద్ర సమ ఫాలే**
**కిమయే సమయే నిశీధసమయే**
**కోనుని శాంతద్వారే...**
**ఝటితి మూఢగచ్ఛారే..."**

**(జఘనతలంతో ఏటి ఇసుకదిబ్బను జయించిన ఓ సుందరీ, బాలా, గడియ మానుతీసి వాకిలి తెరువు అని భర్త అడుగగా, ఎవరోయి, ఈ వేళగాని వేళ, రాత్రివేళ ప్రాసాదం ముంగిట ఎవరోయి? మూర్ఖుడా వెంటనే వెళ్లిపో - అని భార్య సమాధానం.)**

కొండమ్మవ్వ దయామయి. ఇన్ని పనులలోను ఆర్తులను ఆదుకొనేది. జబ్బు పడిన పిల్లలకు, మహిళలకు సేవచేసి, సేదతీర్చే చల్లని మాటలు మాట్లాడేది. ఇతరుల హితమే కోరేది. నేను రెండేళ్లు చూచాను. ఒక్క పరుష వాక్కయినా ఆమె నోటి నుండి వెలువడడం ఎరుగను. పండుగలు, పబ్బాలలో సంబరమంతా తెరమరుగు నుంచే. బొమ్మలకు నవరాత్రంలో వేషాలు వేయడాలు, పాటలు పాడడాలు, వ్యంగ్యోక్తులు, ఛలోక్తులు. నా

కొకమారు పూలతోటలో భూమిపై గడ్డి మరుగున ఉన్న దోటీ తగిలి, ఎడమ మడమ తెగిపోయింది. నాకు చేసిన సేవకు ఎన్ని జన్మల కైనా కొండమ్మవ్వకు ఋణం తీర్చుకోలేననిపిస్తుంది. ఆమె ఒక హారతి కర్పూరం కొండ. ఆమె ఒక కొవ్వొత్తి. చందనం చెక్క. ఆమె జబ్బు పడింది నే చూడలేదు. భగవంతుడు ఆమెకు అలాటి ఆరోగ్యం ఎలా ప్రసాదించాడో?

గురువుగారు పరమపదించిన తర్వాత ఆమె గురువుగారి కుమారులు వేంకటాచార్యుల వద్ద, అనంతరం ఆమె చిన్న మనుమడు కోదండపాణి వద్ద ఉంది. ఆమెకు అతనిపై చాలా మక్కువ. నేను 1944లో హైదరాబాద్‌లో మీజాన్ పత్రికలో ఉన్నప్పుడు నన్ను చూడడానికి ఒకమారు వచ్చింది. అప్పటికి రెండు దశాబ్దాలు గడిచినా ఆమెలో మార్పులేదు. అరవై యేళ్లు పల్లెటూరిలో గడిపిన ఆమెకు పట్టణవాసం అంతగా గిట్టేది కాదు. నిత్య నదీ స్నానం లేదు. పదిమందికీ వండివార్చే పనిలేదు. చేతినిండా పని ఉంటూ తీరిక లేక ఉన్నవారు హఠాత్తుగా పని కరువైతే, గట్టుమీదికి విసరిన చేపపిల్లలాగ విలవిలలాడుతారు. అలాటి పరిస్థితే కొండమ్మవ్వది అప్పుడు. అయినా ఆమెలో మునుపటి ఉత్సాహం, చైతన్యం, హాస్యప్రీతి ఏ శాతమూ తగ్గలేదు. ఆమె మనసెరిగిన మనుమడు, ఎంతో ప్రేమగౌరవాలతో సేవ చేసేవాడు. చివరివరకు దైన్యంలేని జీవితం గడిపిన ఆ తపస్విని ఎనిమిది దశాబ్దాల తర్వాతే అనాయాసంగా కన్ను మూసింది.

నా చిన్నతనంలో దాదాపు ప్రతి బ్రాహ్మణ కుటుంబంలోను అలాంటివారు ఉంటూనే ఉండేవారు. సేవ చేస్తూనే ఉండేవారు. చందనం చెక్కలాగ అరిగిపోతూనే ఉండేవారు. ఏమీ దుఃఖపడడం ఎరుగరు. ఇతరుల సుఖమే వారి సుఖం. ఇతరుల సంతోషమే వారి సంతోషం.

బుద్ధుణ్ణి ఆరడి పెట్టడానికి, ఒక వేశ్య కడుపుపై బొంతలు చుట్టుకొని బుద్ధుని వల్ల కడుపయిందని ప్రచారం చేసి నవ్వులపాలయింది. ఆనేగొందిలో ఒక ఇల్లాలు పిల్లల కోసం ఇలాటి పనేచేసి భంగపడింది. ఆమెకు పిల్లలు లేరు. ఇంటి పనికత్తె గర్భిణి అయింది. ఆమెకు అదివరకే ఇద్దరు ముగ్గురు పిల్లలున్నారు. ఆ ఇల్లాలు దానితో ఒక ఒప్పందం చేసుకొంది. పుట్టబోయే బిడ్డను తనకు ఇచ్చేట్టు.

ఇక నాటకం ప్రారంభమయింది. ఆ ఇల్లాలు పాత గుడ్డలను రోజుకొక పొరగా కడుపుకు చుట్టుకుంటూ గర్భం నటించింది. ఏడో నెల వచ్చింది. సీమంతం చేశారు.

ఎత్తుగడ కట్టుదిట్టంగా సాగింది. అందరూ హర్షించారు; ఇన్నాళ్లకు కడుపు పండుతూందని. పాపం! అప్పుడు కలిగింది, అవాంతరం.

ఎవరింటికో విందు భోజనానికి వెళ్లింది. ఒకనాడు గుడ్డపేలికలు బిగించి కట్టిన దారం కొన ఆమె చేసిన పొరపాటువల్ల నడుమ దగ్గర వేలాడింది. భోజనాలు అయాయి. అందరూ లేస్తున్నారు. ఆ ఇల్లాలు లేచింది. పక్కన ఉన్న ఒక చిన్న పిల్ల కంటబడింది, ఆ వేలాడుతున్న దారం కొన. "అత్తా! అత్తా! ఇదేమిటి దారం కొన?" అంటూ గట్టిగా లాగింది పట్టుకుని. లాగిన వేగానికి ఇన్ని నెలలుగా పేర్చి కట్టుకున్న పాత పేలికల బొత్తుజారి కింద ఉన్న ఎంగిలి విస్తరిలో పడింది. వచ్చిన ఆడవాళ్లంతా గుమిగూడారు. లేచారు. ఆశ్చర్యపడ్డారు. ఆ ఇల్లాలు తల ఎత్తుకోలేకపోయింది. ఎంగిలి చేతితోనే ఇంటికి పరుగుతీసింది. ఆరు నెలల వరకు వీధి మొగం చూడలేదు.

సంతానవాంఛ అంత బలమైనది. ఈషణత్రయంలో ఒకటికదా 'సంతానం'! సంతానం కోసం కవులూ చాలమంది పరితపించారు. కాళిదాసుకు కూడా పిల్లలు లేరేమో! దుష్యంతుని ద్వారా పిల్లలున్న వారి భాగ్యాన్ని శ్లాఘించాడు.

**"అలక్ష్యదంత ముకుళాననిమిత్త హాసైః**
**అవ్యక్తకవర్ణరమణీయ వచఃప్రవృత్తీన్**
**అంకాశ్రయ ప్రణయినః తనయాన్ వహన్తో**
**ధన్యాః తదంగరజసా మలినీ భవంతి"**

**పసిమొగ్గలు కనిపించేట్టు అకారణంగానే నవ్వులు చిందిస్తూ, వచ్చీరాని, స్పష్టం కాని – తొక్కుపలుకులు అందంగా పలుకుతూ; ఎప్పుడూ ఒడిలో కూర్చునే ఉండాలని కోరుకునే పిల్లలను ఎత్తుకున్న భాగ్యశాలురు ఆ శిశువు ఒంటి దుమ్ముతో ధన్యులవుతారు –**

పుత్రేషణ అంతటి శక్తిమంతమైనది. ఆ ఇల్లాలి తప్పేమీలేదు. సంతానవాంఛ అలా చేయించింది. పెడదారి పట్టకుండా ఉన్నందుకు ఆమెను మెచ్చుకోవాలి. నా చిన్నతనంలో ఈ సంగతిని కథగా చెప్పుకునేవారు.

కొండమ్మవ్వకూ, ఈమెకూ ఎంత వ్యత్యాసం? కొండమ్మవ్వకు సంతానం లేదు.

భర్తలేదు. అయినా ఆమె ఇలాంటి కుట్రకు అప్పుడూ, ఎప్పుడూ పూనుకోలేదు. తన ప్రవృత్తిని మానవత్వం వైపు, జగత్కుటుంబ భావనవైపు మళ్లించింది. ధన్యురాలయింది.

**"కర్మణ్యేవాధికారస్తే**
**మా ఫలేషు కదాచన,**
**మా కర్మఫల హేతుర్భూః**
**మా తే సంగోస్త్వ కర్మణిః"**

**(పనిచేయడమే మన కర్తవ్యం. అంతవరకే మనకు అధికారం. ఫలాన్ని గురించి ఆలోచించే అధికారం మనకు లేదు. ఫలచింత వదలి పనిచేయడమే మన ధర్మం. మనం చెడుపనుల పరిణామానికి కారణం కారాదు. మనవల్ల ఏ పనీ దుష్పరిణామాలకు దారితీయరాదు. మనకు చెడు పనులతో సంబంధం ఉండరాదు.)**

## 22

# తుంగభద్రలో మొసలి వేట

"పదాసురక్త ప్రకృతిః
ప్రజాపాలన తత్పరః
వినీతాత్మా హి నృపతిః
భూయసీం శ్రియ మశ్నుతే."

**(ప్రజల అనురాగం పొంది, ప్రజాపాలన తత్పరుడై వినయగుణం కలిగిన రాజు గొప్ప సంపదను పొందుతాడు.)**

**ఆ**నేగొంది రాజులు చాలా గొప్పవారు. శ్రీరంగదేవరాయలుగారు నా చిన్నతనంలోనే పోవడంవల్ల ఆయన కుమారులు, నా వయసువారు కమలాపురంలో మా ఇంటి వెనుక డణాపురం వెంకట్రావుగారి యింట్లో అద్దెకు ఉండేవారని ఇదివరకే సూచించాను. శ్రీరంగదేవరాయలుగారు చాలా గొప్ప రాజు. సాహిత్యప్రీతిగలవారు. సంగీతమంటేనూ అభిమానమే. ఆయనకు మద్రాసులో ఒక బంగళా ఉండేది. 19వ శతాబ్ది చివర ఆంధ్ర, కన్నడ, సంస్కృతాలలో సాహిత్యవేత్తలందరూ ఆయనకు పరిచితులు, సంస్థానంలో ఒక తెలుగు గ్రంథాలయాన్ని కూడా ఆయన స్థాపించారు. దాని పేరు శ్రీరంగదేవరాయల గ్రంథాలయమో, ఏదో, అంతగా గుర్తులేదు. మద్రాసు పరిచయంతోనే శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు ఆనేగొందికి రావడం, కొంతకాలం అక్కడ సాహిత్య వినోదాలు జరపడం సంభవించింది. సుప్రసిద్ధ సంగీత విద్వాంసులూ కమలాపురం, ఆనేగొందులకు

వచ్చేవారు. అలాటివారిలో వీణ సుబ్బణ్ణ గారు నాకు గుర్తు. ఆయన వీణ శేషణ్ణగారి శిష్యుడని, గురువంతటి విద్వాంసుడని అనేవారు.

శ్రీరంగదేవరాయలకు ప్రజానురాగం ఎక్కువ. ఆయన కీర్తిశేషుడైన పిదప ఆయన తల్లి కుప్పమ్మా రాణీసాహెబా, మనమల మైనారిటీ తీరేవరకు పరిపాలన సాగించారు. ఆమె కూడ చాలా ఉదారురాలు. సంస్థానంలో మంచి ప్రజారంజకమైన పద్ధతులు ఉండేవి. రాజుగారికి మధువనం అనే పెద్దమామిడి తోట ఉండేది. అది కొన్ని వందల ఎకరాల తోట. ఆ కాలంలో మల్‌గోవా, జహాంగీర్ మున్నగు మామిడి జాతులు ఇప్పటి బంగనపల్లిలాగ చాల ప్రసిద్ధాలు. రాజుగారు, తర్వాత కుప్పమ్మారాణీ సాహెబా గారు మొదటి మామిడి కాపును ఊరందరికి ఇంటింటికీ బుట్టలలో పెట్టి పంపేవారు. దీనివల్ల బీదలకు మల్‌గోవా మామిడి పండ్లు తిన్న సంతృప్తి, రాజుగారిపై ప్రీతి కలుగుతాయి. రాజనీతే ఇది అని అనుకున్నా, ఇది గొప్ప విషయమే. అలాగే చెరుకు గానుగ ఆడినప్పుడూ మొదటి బెల్లం వంటను ఏలక్కులూ, శొంఠి, లవంగాలు, ముంత మామిడిపప్పుతో వండి ఊళ్లో ప్రతి యింటికీ పంపేవారు రాజాగారు.

ఆనేగొందిలో అన్ని పళ్లూ అగ్గువే (చౌకే). పెద్దగంప మల్‌గోవాలు ఐదారు రూపాయలు. ఐదారు రూపాయలంటే బస్తా వడ్లు గదా! వనభోజనాలకు రంగనాయక స్వామి మూలస్థానమైన గోవిందరంగనాయకాలయానికి, చుట్టుపట్ల కొండలకు, పంపాసరోవరానికి వెళ్లేవాళ్లం. అలాటి వనభోజనాలకూ రాచనగరు నుండి సామాగ్రి అందేది. రంగనాయకస్వామి రథోత్సవం గొప్పగా, అన్నదానాలతో, నాటకాది వినోదాలతో మహా ఆడంబరంగా జరిగేది. ఆనేగొంది, హంపీ పరిసరాలల్లో చాలా కొండలున్నాయి. ఒకదాని పేరు మాతంగ పర్వతం, మరొక దాని పేరు అంజనేయ పర్వతం. కోదండ రామాలయం ఎదుట తుంగభద్రా ప్రవాహానికి అడ్డుగా ఉన్న కొండ పేరు ఋష్యమూకం. కమలాపురానికి రెండు మైళ్లలో ఉన్న మరొక కొండ మాల్యవంతం. సీతాపహరణ దుః ఖితులైన రామలక్ష్మణులు కిష్కింధకు వచ్చినప్పుడు మొదట ఈ మాల్యవంతంలో బసచేశారని ఐతిహ్యం. తదనుగుణంగా సీతారహితులై విచారపడుతున్నట్టున్న రామలక్ష్మణ విగ్రహాలు మాత్రమే పూజలందుకుంటున్నాయి ఇక్కడ. కమలాపురంవైపు తుంగభద్ర గట్టుమీద ఆనేగొందికి ఆగ్నేయాన వాలికాష్ఠం అనేది ఒక ప్రాంతం. ఇక్కడ బూడిదగడ్డ కట్టినట్టు ఉంటుంది కొంత ప్రాంతం. ఆ బూడిదను రక్షగా వాడుతారు. భూత పిశాచాల

ఉచ్చాటనకూ వాడుతారు. అక్కడ బైరాగులు కొందరు ఉంటూ చింతామణి అన్న పేరుతో ఆశ్రమం స్థాపించి, వచ్చేపోయే యాత్రికులకు ఆ వాలికాష్ఠం మట్టి బూడిదను ప్రసాదంగా ఇస్తుంటారు.

నేను ఆనేగొందిలో ఉన్నప్పుడు ఒక అవాంతరం వచ్చిపడింది. తుంగభద్ర ఆ ప్రాంతంలో కొండలు, బండ్లమీద పారుతుంది, గనుక మొసళ్లు ఎక్కువే, కాని అవి జనసంచారం ఎక్కువగా ఉన్న ప్రాంతంలో ఉండవు. ఎక్కడి నుంచి వచ్చిందో ఒక పెద్ద మొసలి, దాదాపు ఆరేడడుగుల పొడవైనది ఆ ప్రాంతానికి వచ్చింది. హంపీ కోదండరామాలయం వద్ద నుంచి ఆనేగొందికి కిందుగా నవబృందావనం వరకు దాదాపు ఆరేడు మైళ్ల మేర తిరుగుతూ పశునష్టం కలిగించేది. నవబృందావనాన్ని వ్యవహారంలో నవరిందావన అంటారు. అది ఆనేగొందికి దిగువ మైలులోపు తుంగ భద్రలో ఉన్న మధ్వసంప్రదాయం వ్యాసరాయలమఠం. పీఠాధిపతులైన సన్యాసుల సమాధుల గుంపు అది. తొమ్మిది మంది సమాధులు, కనుక నవరిందావన, - నవబృందావనం అని పేరుపడింది. ఒక రోజు నవరిందావనం ప్రాంతంలో ఆ మొసలి ఒక యువకుణ్ణి పొట్టబెట్టుకుంది. అప్పుడు గాని ఊరివారికి వేడి పుట్టలేదు.

కుప్పమ్మా రాణీసాహేబాగారికి ఫిర్యాదు చేశారు పురప్రముఖులు. ఆమె దానిని ఎలాగయినా పట్టి ప్రజల బాధలు తొలగించాలని అధికారులకు ఉత్తర్వు చేశారు. వేటగాళ్లు - రాజవంశ్యుల సన్నిహితులైన గురికాళ్లు తుపాకులతో, బల్లేలతో, బరిసెలతో బయలుదేరారు. చాలచోట్ల మాటువేశారు. అది గుండ్ల మధ్యన విశ్రాంతిగా పడుకొని కన్నీళ్లు కురిపిస్తున్నప్పుడు కాల్పులు కూడా జరిపారు. ఏమి ఫలం? గుండ్లు దాని కఠినాతి కఠినమైన చర్మంలో ఇరుక్కుపోయాయేగాని ప్రయోజనమేమీ లేకపోయింది. మొసలి వీపు మీద చర్మం తాబేలు డిప్పలాగ కఠినం. అది కళ్లు మూసి తెరుస్తూ ఉంటుంది. కళ్ల నుంచి నీరు ధారలుగా కారుస్తూ ఉంటుంది. దాన్నిచూచి ఎవరైనా అది ఏడుస్తున్నదని భ్రాంతి పడవచ్చు. ఇలా చాల రోజులు జరిగింది. పశువుల నష్టం ఎక్కువయింది. మేకపోయిందనేవారు, ఆవుదూడ మాయమయిందనే వారు, ఆవుకాలు నమిలి వేసిందనేవారు ఎక్కువైపోయారు. ఏరు దాటడానికే భయపడు తున్నారు జనం. అది నదిలో ఈదులాడడం కూడా మిట్టమధ్యాహ్నం కొందరు చూచారు. నదిగట్టు పొడుగునా హడావుడి మితిమీరిపోయింది. హరిగోలులో (పుట్టి) తుంగభద్ర దాటడం

కూడా ఆపివేశారు.

ఈ ఆందోళనంతా ఒక తొంభయ్యేళ్ల ముసలమ్మ చెవిన బడింది. ఆవిడ ఒక్క నవ్వు నవ్వింది – "ఇదేమిటి? ఒక మొసలిని చంపడానికి ఇంతకాలం, ఇంత మంది, ఇన్ని ఆయుధాలా?" – అని ఆమె భుజాలు ఎగరవేసింది. ఆ మాటలు విన్నవారికి చాలా కోపం వచ్చింది. "అరమనె (రాచనగరు) వాళ్లంతా ఇంతగా శ్రమపడుతుంటే నీవు నవ్వుతావా ఎగతాళిగా?" అని గదమాయించారు ఆమెను. "నవ్వుతున్నావే. నీవు చంపు చూద్దాం. మంచం నుంచి కదలలేవు, మాటలు!" – అడిగారు కొందరు. ఆమె మరీ విరగబడి నవ్వుతూ "వెర్రివాళ్లు, ఉపాయం ఉండాలి. ఉపాయం లేనివాణ్ణి ఊరి నుంచి తరమండి – అన్నారు. పెద్దలు" అని సమాధానమిచ్చింది. "ఏమిటా ఉపాయం?" అని ప్రశ్నించారు మరొకరు. "మీ కెందుకు చెబుతాను? ఆ చంపే రాజుగారి సిపాయిలు రానీ చెబుతాను" అన్నది ఆమె.

ఈ మాట రాచనగరు చేరింది. ఆ నోటా ఈ నోటా కుప్పమ్మా రాణీసాహెబా గారి నుంచి దూతలు వచ్చారు ఆ ముసలమ్మ వద్దకు. వారు రాగానే ఆమె లేచి కుశల ప్రశ్నలు వేసింది. వాళ్లు ఆమెను "అవ్వగారూ, మేము రాణీసాహేబాగారు పంపగా వస్తున్నాము. ఊరందరినీ భయపెడుతున్న మొండి మొసలిని చంపడానికి మీరు ఏదో ఉపాయం చెబుతానన్నారట. రాణీసాహెబాగారు పంపారు. ఆ ఉపాయం వల్ల నిజంగా ప్రయోజనం ఉంటే, మీకు రాణీసాహెబాగారు బహుమానం ఇస్తారు. ప్రయోజనం లేకపోతే.." అని అంటుండగా ఆమె మధ్యలోనే అడ్డు తగిలి, "ప్రయోజనం లేకపోవడం ఏమిటి? ఈ ఎల్లమ్మ చెప్పింది ఎప్పుడూ తప్పలేదు" అన్నది.

"అయితే చెప్పండి" అన్నారు.

"ఏం లేదు నాయనా! వడ్లగింజలో బియ్యపుగింజ. ఒక మేకపిల్లను తీసుకువచ్చి, చంపి; లోపలి భాగాలన్నీ తీసివేయండి. పచ్చితోలు మాత్రం ఉండనివ్వండి. దాని నిండా గవ్వ సున్నం కూరండి. బాగా కుట్టండి. పచ్చివాసన ఉండేట్టు లోపలి నుంచి తీసిన దాన్ని మేకతోలుపై పూయండి. తల అలాగే ఉండాలి. ఆ మొసలి తరచుగా తిరిగే చోట నీటికి దగ్గరగా కట్టివేయండి. పచ్చివాసన పోకూడదు సుమా! మొసలి వస్తుంది. దానిని లాక్కుపోతుంది. కబళిస్తుంది. తర్వాత తమాషా చూడండి. పచ్చి వాసన లేకపోతే దాన్ని మొసలి చూడదు జాగ్రత్త!" అని పదే పదే హెచ్చరిస్తూ అన్నది



ముసలమ్మ.

వారు ముసలమ్మ ఉపాయం విన్నారు. చేసి చూద్దాం. తూటాల ఖర్చు మిగిలించు కుందాం – అని అనుకుని ముసలమ్మ చెప్పినట్లే చేశారు. సాయంకాలం ఈ ఉపాయం జరిగింది. కొంత దూరంలో చాటుగా పొంచి ఉన్నారు. రాత్రి – అర్ధరాత్రి మొసలి ఎప్పుడు వచ్చిందో! గుల్ల సున్నం ఉన్న మేకపిల్లను ఎప్పుడు లాక్కుపోయిందో!

మర్నాటి మధ్యాహ్నం పదకొండు – పన్నెండు అయి ఉంటుంది. నదిలో పెద్దగా పొర్లాడుతూంది ఏదో. రామస్వామి గుడి మలుపు నుంచి నవరిందావన వరకు నదిలో అల్లకల్లోలం! శరవేగంగా ఏదో తిరుగుతూంది. నల్లని తుమ్మ మొద్దులు మూడు నాలుగు గుది గుచ్చి కట్టిన తెప్పలాంటిది. కదిలిపోతూంది. రెండు తాటి దుంగలు కట్టకట్టినట్లున్న వస్తువు ఏదో ఈదుకుపోతున్నది. ఆ దుంగలు ఒక్కొక్కప్పుడు ప్రవాహ వేగానికి పొర్లి తెల్లని గుడ్డ, పొడుగాటిది పరిచినట్టు కనిపిస్తూంది. ఏమైనా సాయంకాలం నాలుగైదు గంటలకు నదంతా అల్లకల్లోలం! జనానికి అదేమిటో ఆశ్చర్యంగా ఉంది. కొత్త

జలజంతువు ఏద్దైనా నదిలో ప్రవేశిం చిందా? చిన్న తిమింగలం పిల్ల సముద్రం నుంచి తప్పించుకువచ్చి తుంగభద్రలో పడిందా? నీటి గుర్రాలు - విదేశాల నుంచి వచ్చి ఈదులాడుతున్నాయా? - అని పరిపరివిధాల ఆలోచిస్తున్నారు ప్రజలు. జనం నదిగట్టు వెంబడిని బారులు తీరి, గుంపులు కట్టి చూస్తున్నారు. పొద్దు మునగబోతూంది. నదిలో కల్లోలం తగ్గింది. నదిలో హఠాత్తుగా తెల్లటి చారలు కనిపించాయి. మొసలి ఆనేగొంది హరిగోలుఘాట్ ఎక్కి ఒడ్డున ఇసుకలో పొర్లుతూ, తోకను ఇసుక దిబ్బలకు కొడుతూ, తెల్లటి నురగలు కక్కుతూ వెల్లకిలా పడింది. కొట్టుకుంటూ ప్రాణాలు వదిలింది. ప్రాణాలు పోయి, కడుపుబ్బిన మొసలి భయంకరంగా కనిపించింది.

మొసలి కడుపులోకి పోయిన సున్నం కరిగింది. మొసలి కడుపులో మంటలు ప్రారంభమయ్యాయి. వాటిని భరించలేక మొసలి ఐదారు మైళ్ళ మేరా నదిలో అటూ ఇటూ ఈదులాడింది. చివరకు పేగులు తెగి ప్రాణాలు వదిలింది. ముసలమ్మను కుప్పమ్మా రాణీసాహెబాగారు సన్మానించారనడం చెప్పనక్కరలేదు.

**"అహో విచిత్రం! యద్గ్రాహః**
**జలస్థాః కర్షతి ద్విపమ్,**
**స ఏవ తీరస్థలేనః**
**శునకేన నిహన్యతే."**

**(ఎంత ఆశ్చర్యం! నీటిలో ఉన్నప్పుడు మొసలి ఏనుగును కూడా లాక్కుపోతుంది. ఆ మొసలి గట్టుమీద ఉంటే, దానిని కుక్క కూడా కరిచి చంపుతుంది.)**

# 23

# భవతీ భిక్షాందేహి!

**"దూరతయా స్థూలతయా**
**నీలతయా దానలోలుపైః మధుపైః**
**భ్రామిత మిభరాజధియా**
**హంతా భూ దంతతో మహిషః!!"**

**(దూరంగా ఉండడం వల్ల మసక మసకగా కనిపిస్తూంది. లావుగా ఉంది. నల్లగా ఉంది. ఇది తప్పక ఏనుగే, మనకిక కావలసినంత దానం (మదజలం-దానం) అని ఏనుగనే భ్రాంతితో, తెగ తిరిగాయట చుట్టూ మధుకరాలు. తీరా దగ్గరికి వెళ్లిచూస్తే పాపం! చివరకు అది దున్నపోతని తేలింది.)**

మధుకరాలంటే తేనెను తయారుచేసే ఈగలు. ఇవి పాపం ప్రతి పూవు వెంటా చుట్టాడుతూ ఏ కొంచెం తేనె దొరికినా పీలుస్తూ తర్వాత దానిని కూడబెడతాయి. చివరకది ఎవరో అనుభవిస్తారు. ఈ విధంగా మధుకరాల లాగ ఇల్లిల్లూ తిరిగి అన్నం సంపాదించే పనిని మాధుకరం, మధుకర వృత్తి అంటారు. ఇలా ఇంటింటికి తిరిగి తిరిపెమెత్తే ప్రతి పనినీ మాధుకరం అనరు. చదువుకోసం పరదేశానికి వెళ్లి, ఏ ఉపాధీ లేక ఇలా బిచ్చమెత్తడాన్నే మాధుకరం అంటారు. మాధుకరం పవిత్రమైన పని. చదువు కోసం గనుక మాధుకర విద్యార్థులను ఇల్లాళ్లు ఎంతో ఆదరించి శుచిగా వండిన పదార్థాలను ఇచ్చేవారు.

మాధుకరం అన్నప్పుడు నాకు భారతంలోని ఒక ఉపాఖ్యానం జ్ఞాపకం వస్తుంది. ఒక గ్రామానికి ఒక బ్రాహ్మణుడు వచ్చాడు. స్ఫురద్రూపి. పూర్తిగా ప్రవరాఖ్యుడు. దినానికి

నాలుగైదిళ్లకు వెళ్లి 'భవతీ భిక్షాం దేహి" అని ముమ్మారు పలికేవాడు – మధ్యాహ్నం భోజనవేళకు. ఏ ఇల్లాలయినా, ఆ మూడుసార్లు పిలుపు లోపల భిక్షపెట్టాలి. అంతలోగా రాకపోతే వెళ్లిపోయేవాడు మరొక గడపకు. చివరకు తను బసచేసిన గుడికి తిరిగి వెళ్లేవాడు.

ఒక దినం ఒక ఇంటికి వెళ్లాడు. రెండు మార్లు పిలిచాడు. ఇంటి ఇల్లాలు స్నానాగారంలో ఉంది. రెండో పిలుపు వినగానే ఎక్కడ అతిథి వెళ్లిపోతాడో అనే ఆదుర్దాతో తడిగుడ్డ అలాగే పిడుచుకొని, తలకట్టు చుట్టుకొని, కుంకుమ రేఖ దిద్దుకొని, పళ్ళెంలో అన్నం పెట్టుకుని అతని జోలెలో వేయబోయింది వచ్చి. పై నుంచి నీటి చుక్కలు అతని చేతిమీద పడ్డాయి. అతడు భయపడి తలయెత్తి చూశాడు. తడిగుడ్డ ఒంటికి అంటుకుని ఉన్నందున ఆమె అంగసౌష్ఠవం కొట్టవచ్చినట్టు కనిపించింది. అతడు ఆశ్చర్యంతో తేరిపార జూచాడు. అతని దృష్టి పాలిండ్లపై పడింది. అతడు మరీ వింతతో "అవేమిటి?" అని అడిగాడు.

ఆమె ఒక్కక్షణం అవాక్కయింది. మరొక మూర్ఖురాలయితే అతడు దుర్మార్గుడని, పోకిరి అని గోలచేసి, ఊరినంతా ఒక కొలిక్కి తెచ్చేది. కాని, ఆమె వివేకవతి. ఇంతకాలమూ అతని ప్రవర్తనను చూస్తున్నది గనుక అపోహపడక "పుట్టబోయే బిడ్డకు భగవంతుడు పెట్టిన పాల గిన్నెలు" అని సమాధానం చెప్పింది.

అతడు మరీ విస్తుపోయాడు. "పుట్టబోయే బిడ్డ కోసం ఇప్పటి నుంచే పాల ఏర్పాటా? మరి పుట్టిన, పుట్టి మనుగడ సాగిస్తున్నవాని కోసమో?" అని ప్రశ్నించాడు. ఆమె ఏమి సమాధానం చెబుతుంది? పాపం! బ్రాహ్మణుడు మరొక గడప తొక్కడం మాని, తన బసకు తిరిగి వెళ్లాడు.

మరుసటి రోజు నుంచి అతడు భిక్షకు రాలేదు. ఊరివారు మూడు నాలుగు రోజులు చూచారు. ఒక ఇంటి ఇల్లాలు చెప్పింది. ఫలానా ఇంటికి నాలుగు నాళ్ల క్రితం భిక్షకు వచ్చాడు, విసురుగా తిరిగి వెళ్లాడు – అని. కొందరు ఆమె ఇంటికి వెళ్లారు సంగతి కనుగొనడానికి. "నీ ఇంటికి వచ్చి, మరే ఇంటికీ పోకుండా తిరిగి పోయాడట ఆ బ్రాహ్మణుడు, ఏం చేశాడు? ఏమన్నావు?" అని నిలదీశారు. ఆమె గాభరాపడి జరిగిన సంగతి చెప్పింది. "అలా అడిగాడా? ఎంత దుర్మార్గుడు!" అని కొందరు వ్యాఖ్యానించారు. "మనం ఒక పక్షమే విన్నాం. అతన్ని అడుగుదాం. తర్వాత గాని ఎవరి తప్పో తెలియదు"

అని కొందరు నిబ్బరం చూపారు.

అందరూ గుడికి వెళ్లారు. అతనిని కలుసుకొన్నారు. "స్వామీ! ఆ అమ్మాయి వల్ల తప్పయింది. మళ్లీ భిక్షకు రండి" అని ఆమెదే తప్పయినట్టుగా అన్నారు. ఆ బ్రాహ్మణుడు చెవులు మూసుకొని "హరి హరీ! ఆమెదేమీ తప్పులేదు. ఆమె నాకు గురువు. నేను అహంకారంతో భగవంతుని శక్తి తెలుసుకోలేక ప్రవర్తించాను. ఆమె నా కళ్లు తెరిపించింది. పుట్టబోయే బిడ్డకు ముందుగానే ఆహారం సమకూర్చే భగవంతుడు, పుట్టినవారికి ఆహారం సమకూర్చడా అని జ్ఞానోదయం అయింది. కనుక భగవంతుని మీదే భారం వేసి ఊరుకున్నాను. ఆమెనేమీ అనకండి. ఆమె జ్ఞానాంజనశలాకతో నా కళ్లు తెరిపించిన మహితాత్మురాలు" అని అన్నాడు.

ఆయనను ప్రశ్నించినవారికందరికీ తల కొట్టివేసినట్టయింది. "మహాత్మా! మీ గొప్పతనం, నిశ్చలభక్తి తెలుసుకోలేకపోయాం. అపోహపడి పాపాలోచన చేశాం. ఇకమీద మీరు భిక్ష కోసం శ్రమపడనక్కరలేదు. రోజుకొక ఇంటివారుగా వంతులు వేసుకొని, మీకు భోజనం పంపుతాం. అనుగ్రహించండి." అని వేడుకున్నారు. ఇదొక వివేకవతి ఉత్తమ చర్య.

నా చిన్నతనంలో వారాల పద్ధతి ఎక్కువగా ఉండేది. మాధుకరం సకృత్తుగా ఉండేది. వారం విద్యార్థులు ఒకపూట ముందుగా పోయి, "రేపు నేను మీ ఇంటికి భోజనానికి వస్తున్నాను" అని ఇంటి ఇల్లాలికి తెలియపరిచే పద్ధతి ఉండేది. ఎక్కువ మంది ఉండే ఇల్లయితే ముందుగా తెలియపరచనక్కరలేదు. అంతమందిలో ఒక్క విద్యార్థికి ఇంత అన్నం పుట్టదా? ఈ 'వారం పద్ధతి' అన్ని కులాలవారిలోనూ ఉండేది. ఇతర కులాలవారు వారాల పద్ధతికి, మాధుకర పద్ధతికి జంకేవారు. అహంకారం అడ్డు వచ్చేది. బ్రాహ్మణ విద్యార్థులు 'భవతీ భిక్షాం దేహి' అని వడుగునాడే బిచ్చం ఎత్తుతారు. గనుక, భిక్షాన్నంతో దేహరక్షణ చేసుకొని చదువుకోవాలి గనుక జంకేవారు కారు.

తిరుపతిలో నేను చదివేటప్పుడు కొందరు విద్యార్థులకు దేవస్థానం వారు అందరికీ ఇచ్చే విద్యార్థివేతనం ఇవ్వలేదు. కళాశాలలో ప్రవేశం మాత్రం లభించింది. తిరుపతి క్షేత్రంలో దేవాలయ ప్రసాదాలతోనే పొట్ట నింపుకొని చదువుకోవచ్చు. కాని, ప్రసాదాలు అనియతమైనవి. వాటికోసం గుళ్లచుట్టూ తిరుగుతూంటే, చదువు ఏమి కాను? కనుక నా మిత్రుడు కప్పగంతుల లక్ష్మణశాస్త్రి మొదలయినవారు మాధుకరం ఎత్తడానికి

పూనుకున్నారు. ఇలా ఐదారు నెలలు గడిపారు.

పాఠశాల తరగతుల సమయాలు అప్పుడు ఉదయం 7.30 నుంచి 11.00 వరకు, తర్వాత 2.00 నుంచి 5.00 వరకు. 11.00 గంటలకు బుజానికి జోలే వేసుకొని బయలుదేరేవారు. పంచ, ఉత్తరీయం. కళాశాలలో పాఠం సమయంలో చొక్కా వేసుకోవడం ఆ కాలంలో నిషిద్ధం, ఏ కులం వారికయినా సరే. మాతోపాటు అన్ని కులాల వారూ చదివేవారు. రామరెడ్డి, లక్ష్మణ్‌రెడ్డి అనే ఇద్దరు కవలలు, రుద్రపిళ్లే, సుబ్బరామపిళ్లే అనే ఇద్దరు మొదలియార్లు మాకు సహాధ్యాయులు. లక్ష్మణశాస్త్రి నాకన్నా రెండు సంవత్సరాలు వయస్సులోను, చదువులోను వరిష్ఠుడు. జోలె వేసుకొని ఏడెనిమిది ఇండ్లు తిరిగేవాడు. జోలె నిండిపోయేది. ఎప్పటికప్పటికే కదా! నిలువ అవసరం లేదు. 'భవతీ భిక్షాం దేహి' అని కేక పెట్టేవారు. గృహిణులు ప్రేమతో, గౌరవంతో పాత్రలలోనో, పళ్లెళ్లోనో, అన్నం, పప్పు, కూర మొదలయినవి తెచ్చి జోలెలలో వేసేవారు. పండుగ నాడయితే రకరకాల పిండివంటలు. పరమాన్నం వంటి ద్రవ పదార్థాలకు మరొక పాత్ర తీసుకొని వెళ్లవలసి వచ్చేది. తిండి ప్రధానం కాదు కదా! జోలెలో వేసినవి చాలు అనుకొని తిరిగి వచ్చేవారు. నరసింహతీర్థమనే మంచినీటి కొలను దారిలో సుబ్బమ్మగారు అని ఒకావిడ ఉండేది. ఆవిడ బీదరాలు. ఆమె ఆస్తి ఒక ఇల్లు. దానికి ముంగిట్లో పెద్ద అరుగులు రెండు. ఆవిడకు ఎవరూ లేరు. ఆవిడ ఈ మాధుకరం విద్యార్థులు తన ఇంటి అరుగుల మీద ఉండడానికి, లోగిల్లో భోజనం చేయడానికి అనుమతించింది. ఈ మాధుకర విద్యార్థులు తాము తెచ్చిన పదార్థాలనే విడదీసి విస్తర్లలో ఉంచేవారు. అందరూ సమానంగా పంచుకునేవారు. చాల రుచిగా ఉండేవి. గృహిణులు ఎంతో ప్రేమగా పెట్టినవి బాగుండవూ మరి? ఇంతకూ పన్నెండు గంటల మిడి మిడి మధ్యాహ్నం. ఆకలి రుచి ఎరుగదు గదా! ఆ వేళకు ఏదయినా బాగుంటుంది. మరి రుచిగా వండినది మరీ బాగుంటుంది.

విద్యార్థులు, 10-11 ఏళ్లవాళ్ళు; సాంప్రదాయికమైన వేషంతో భిక్షానికి వస్తే వేయని వారుంటారా? ఆ సమయానికి, విద్యార్థులు ఎప్పుడూ వస్తారా అని కాచుక్కూచునే వారు. అన్నీ కలిసి ఏకమైపోతాయని, కూరలు మొదలయినవి విడివిడిగా దొప్పలలో పెట్టి జోలెలో పడేసేవారు. కొందరయితే అన్నంలో అభిఘరించి వేసేవారు.

మా లక్ష్మణశాస్త్రి చాలా చతురుడు. చిన్నప్పటి నుంచే చాల భాషలు మాట్లాడేవాడు.

కన్నడం ఇల్లాలయితే "అమ్మనవరే" అనేవాడు. మరాఠీ వారయితే మరాఠీ, తమిళు వాళ్లయితే తమిళు ఇలా అందరినీ రంజింపజేసేవాడు. ప్రతి ఇల్లాలూ పిడికెడు అన్నం. పది పిడికెండ్లు ఒక విద్యార్థికి ఎక్కి తక్కి. ఆ తల్లుల చేతి చలవవల్లనో ఏమో వారం విద్యార్థులు, మాధుకరం విద్యార్థులు మహావిద్వాంసులు, మహాపురుషులు అయ్యారనుకుంటాను. ఇలా ఐదారు నెలలు గడిచిన తర్వాత లక్ష్మణశాస్త్రి మొదలయిన ఆ విద్యార్థులకు విద్యార్థి వేతనం మంజూరయింది. ఈ సంగతి లక్ష్మణ శాస్త్రి, వారి ఇండ్లకు వెళ్లి చెప్పాడు. వాళ్లు సంతోషపడినా ఒకందుకు కష్టపడ్డారు – "మాకిక ఆ పుణ్యం ఉండదన్నమాట" అని. "అబ్బాయ్! పండగలకు, పర్వాలకు వస్తూండు. మీ హాస్టలులో పండుగల నాడు ఏమంత బాగా చేస్తారు?" అనేవారు.

లక్ష్మణశాస్త్రికి నిజంగా ఆ తల్లుల ఆశీర్వాదం ఉంది. లేకపోతే అంత గొప్ప విద్వాంసుడయేవాడా? పండిత ప్రకాండులకు పట్టుగొమ్మయిన మా తిరుపతి శ్రీ వేంకటేశ్వర సంస్కృత కళాశాలలో పదేండ్లపాటు అలంకార వ్యాకరణ శాస్త్రాలు చదివి శిరోమణి పట్టా పుచ్చుకున్నాడు. చెన్నపురి మైలాపూర్ సంస్కృత కళాశాలలో మహామహోపాధ్యాయ కరుంగుళం కృష్ణశాస్త్రిగారి వద్ద అద్వైతంలో భాష్యశాంతి చేశాడు. దానికి ఉపాంగంగా న్యాయ, పూర్వ మీమాంసలు అధ్యయనం చేశాడు. వివిధ శాస్త్రపారంగతుల వాక్యార్థాలకు, ప్రవచనాలకు, ఆంధ్ర సంస్కృత కవితా కల్లోలినులకు కూడలి అయిన వనపర్తి సంస్థానం ఆస్థానపండితుడై కవితా హృదయాఖ్యమైన సరస్వతీ తత్త్వానికి పాత్రమయ్యాడు. వివిధ భాషలు పుక్కిటబట్టాడు. చిన్ననాటి నుంచి ఉపాసించిన గైర్వాణి, తల్లి బాస అయిన తెలుగు, తోబుట్టువు అయిన మహారాష్ట్రి పూర్వపు అధికార భాష అయిన ఉరుదూ, ఇప్పటి అధికార భాష అయిన హిందీలలో గద్గదనదద్గోదావరిలాగ, కాన్పూరు వద్ద ప్రవహించే గంగానదిలాగ; సుందర గంభీరంగా ఉపన్యసించే మహావక్త అయ్యాడు. ప్రతి పదాన్ని పలవింతలతోను, పుట్టుపూర్వాలతో ప్రత్యక్షం చేసుకొని పాణినీయ ప్రమాణాలతో వ్యాకరించగల విపశ్చిదగ్రేసరుడయ్యాడు. పాండురంగసుకవి తన కవితను గురించి చెప్పినట్టు నన్నయ్య – తిక్కన – శ్రీనాథుల ఫణితులలో కవితను కదం తొక్కించగల కవితల్లజుడయ్యాడు. గంటల తరబడి ప్రసంగాలతో తనియింపజేసే సంభాషణ చతురుడయ్యాడు. అతనిని తలచుకొన్నప్పుడు నాకు కాశీవాసి, సార్వభౌమ సంస్కృత ప్రచార సభాస్థాపక నిర్వాహకులు, సాహిత్య వేదాచార్యులు మిత్రులు వాసుదేవ

ద్వివేది అతనిపై చెప్పిన శ్లోకం గుర్తుకు వస్తుంది. దానిలో ద్వివేదిగారూ నా మిత్రుని మధుర గంభీరంగా చిత్రించారు.

**"మూర్తి ర్మత్త గజేంద్ర దర్పరళనీ**
**వాణీ వినోదప్రియా**
**వ్యాఖ్యాలేఖ కవిత్వ కౌశల కళా**
**పారంగతా శేముషీ**
**శక్తి సంస్కృత భాషణేష్యనుపమా**
**విద్వజ్జనేష్వాదరః**
**శ్రీమల్లక్ష్మణ శాస్త్రిణాం గుణగణాః**
**కేషాం న తోషా సహః!!"**

**(మత్తగజేంద్రుని గర్వాన్ని ఖర్వం చేసే ఆకారం, వినోదప్రియమైన వాక్కు, ఉపన్యసించడంలోను, వ్యాసరచనలోను, కవితాకౌశలకళలోను పారంగతమైన బుద్ధి, సంస్కృత భాషలో ఉపన్యసించడంలో సాటిలేని శక్తి, విద్వాంసుల ఎడల ఆదరం - శ్రీలక్ష్మణశాస్త్రిగారిలో ఉన్న ఈ గుణాలు ఎవరికి సంతోషం కలిగించవు?)**

పూర్వం చాల మంది విఖ్యాతులయిన పండితులు, హైకోర్టు న్యాయమూర్తులయిన పలువురు వీధిదీపాల కింద చదువుకొని, మాధుకరమెత్తి చదువుకొని గొప్పవాళ్ల యారు. ఇప్పుడు పాశ్చాత్యదేశాలలో చదువుకొనసాగించడానికి వెళ్లిన విద్యార్థులు అక్కడి వ్యాపార సంస్థలలో, కార్యాలయాలలో కొన్ని గంటలపాటు పనిచేసి డబ్బు సంపాదించి అదనపు ఖర్చులకు వినియోగించుకొంటున్నారు. అలాటి పద్ధతి మన దేశంలో పూర్వం లేదు, ఇప్పుడూ అంతగా లేదు.

ఇంతకూ పది రూపాయలకు కిలో బియ్యం అయిన ఈ కరువు కాలంలో ఒక పూట ఎవరికయినా భోజనం పెడదామన్నా భయపడవలసి వస్తున్నప్పుడు వారాలు, మధూకరాలూ ఎక్కడ, సద్బుద్ధి ఎక్కడ? ఇచ్చకాలకు, చెవులు కొరకడాలకు ఖర్చు చేయడానికి వెనుదీయరు. అలాటి వారిని అన్ని విధాల సంతృప్తిపరచి తమ పనులు సాధించుకొనే బిచ్చగాళ్లకూ కొరత లేదు. ప్రాచీన కవి అలాటి బిచ్చగాళ్లకు ఉండవలసి లక్షణాలను ఎంతో చక్కగా చెప్పాడు ఒక శ్లోకంలో:

**"ఉచ్చైరధ్యయనం, పురాతన కథాః**
**స్త్రీభి స్సహాలాపనం**
**తాసా మర్భకలాలనం, పతినుతిః**
**తత్పాకమిత్యాస్థుతిః**
**ఆదేశస్య కరావలంబన విధిః**
**పాండిత్య లేఖ క్రియా,**
**హోరా గారుడ మంత్రతంత్రక విధిః**
**భిక్షు ర్గుణాః ద్వాదశ!!"**

**(తెలిసింది గట్టిగా పఠించడం, పాత కథలు చెప్పడం, ఏ ఇంటికి వెళ్లితే ఆ ఇంటి స్త్రీలతో సంభాషించడం, వారి పిల్లలను లాలించడం, వాళ్ల భర్తలను కొనియాడడం, అబ్బ, మీ వంట ఎంత బాగుందండీ: అని బాగలేకున్నా పొగడడం, ఏదైనా చెబితే' వెంటనే చేయడానికి పూనుకున్నట్టు నటించడం, పాండిత్యం తెలుపుతూ రాయడానికి పూనుకోడం, జాతకం చెప్పడం, గారడీ చేయడం, మంత్రతంత్రాలు చేయడం ఈ పన్నెండూ భిక్షుకుని గుణాలు.)**

ఈ కాలంలో ఉద్యోగం చేసేవాళ్లూ పైవారి అనుగ్రహం కోసం తమ విద్యుక్త ధర్మాల నిర్వహణకన్నా ఎక్కువగా ఈ పనులు చేస్తుంటారు. వాళ్లను మనం ఉద్యోగం బిచ్చగాళ్లని అందామా?

# 24

# రూపనగుడి నారాయణరావు

"యజ్జీవతి క్షణ మపి ప్రథితం మనుష్యైః
విజ్ఞాన విక్రమ యశోభిః అభజ్య నూనమ్
తన్నాను జీవిత మిహ ప్రనదంతి తద్ జ్ఞాః
కాకో పి జీవతి చిరాయ బలిం చ భుంక్తే."

**(విజ్ఞానం, పరాక్రమం, యశస్సులతో విడదీయరాని ఒక క్షణం జీవించినా చాలు. దానినే వివేకవంతులు జీవితం అంటారు. కాకి కూడా చాలకాలం జీవిస్తుంది. ఏమిటి ప్రయోజనం? బలిపిండాలు తింటూ బతుకుతుంది. మానవుడు ఎంతకాలం జీవించాడు, వేదోక్తాయుస్సుతో జీవించాడా, జ్యోతిర్వేత్తలు చెప్పే వింశోత్తరీ దశల ప్రకారం నూట ఇరవయ్యేళ్లు జీవించాడా, అన్నది ముఖ్యం కాదు. ఒక్క క్షణం జీవించినా, కీర్తితో, పరాక్రమంతో, విజ్ఞానంతో జీవించాలి. అప్పుడు జీవితానికి సార్థకత. గొప్ప యోగులు, నూతన ప్రస్థానాచార్యులు, దేశోద్ధారకులు నూరేళ్లు సార్థకంగా జీవించారు. అది అరుదయిన విషయం.)**

**నా** చిన్నతనంలో బళ్లారి, గుంటూరు, నెల్లూరు, మద్రాసు ప్రధాన సాంస్కృతిక రంగాలు. ఆంధ్రనాటక పితామహులు ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారు నేను పుట్టడానికి ఏడు నెలల ముందే 1912 నవంబరులో పరమపదించారు గనుక వారిని నేను దర్శించుకోలేకపోయానుగాని, అప్పటి ప్రముఖ నటులలో, నాటకకర్తలలో పలువురు నాకు బాగా గుర్తు. ఆంధ్ర నాటక పితామహులు స్థాపించిన సరసవినోదినీ సభ-నాటక సమాజం ఆంధ్ర దేశమంతటా ప్రసిద్ధమయింది. నటులు వృత్తి నటులు కాదు,

ఉత్సాహనటులు. దాదాపు నటులందరూ న్యాయవాదులో, ఉపాధ్యాయులో.

రామకృష్ణమాచార్యులకు నటనలోను, న్యాయవాద వృత్తిలోను సహకారులుగా ఉన్నవారు దొడ్డి గోవిందరావుగారు మున్నగు వారు చాలమంది. రామకృష్ణమాచార్యులు గారు పాదుకాపట్టాభిషేకంలో దశరథ పాత్ర వహిస్తే, గోవిందరావుగారు భరత పాత్ర వహించేవారట. కప్పగల్లు సంజీవరావు గారు, రూపనగుడి నారాయణరావుగారు, ఆయన బావమరిది హోసూరు నంజుండరావుగారు నాటకకర్తలు. ఈయన శ్రీసాధన పత్రిక సంపాదకులు, ప్రముఖ జాతీయ నాయకులు పప్పూరు రామాచార్యులకు ఉన్నత పాఠశాల నుంచి సహపాఠులు. ఈయన కుబేరపతనము అనే నాటకం రచించారు.



నా చిన్ననాటి సంస్కృత పండితులలో సాహిత్య చక్రవర్తి కుంటిమద్ది శ్రీనివాసాచార్యులు చాల విఖ్యాతులు. అప్పుడు ఉన్నత పాఠశాలలోను, మాధ్యమిక పాఠశాలలోను ఆంగ్లంలోనే బోధన జరిగేది గనుక సంస్కృతాన్ని ఆంగ్లంలో బోధించేవారు. శ్రీనివాసాచార్యులు వారు అప్పుడే వెలువడిన భండార్కర్ రీడర్లను విద్యార్థులతో కంఠపాఠం చేయించేవారు. ఆయన పుత్రులలో ఒకరు తిరుపతిలో నా సహాధ్యాయుడు కుంటిమద్ది శేషశర్మగారు. వ్యాకరణాలంకార వేదాంత శాస్త్రాలలో గొప్ప విద్వాంసుడు, మనుచరిత్ర, ఆముక్తమాల్యద మున్నగు తెలుగు కావ్యాలను సంస్కృతీకరించి, ఇతర రాష్ట్రాల సంస్కృత విద్వాంసులకు చుబ్బన చూరలిచ్చిన కవివతంసుడు. మైసూరు పరకాల మఠం ఆస్థానపండితుడు.

శ్రీనివాసాచార్యులుగారు వ్రాసిన గ్రంథాలలో శ్రీస్తుతి అనే కావ్యం ఒక్కటే లభిస్తున్నది. ఇది శేషశర్మ వద్ద ఉంది. ఆయన ఇటీవలే పరమపదించాడు. ఈ "శ్రీస్తుతి" విశిష్టాద్వైత విజ్ఞాన సర్వస్యం.

శ్రీనివాసాచార్యుల అనుజులు కుంటిమద్ది రామాచార్యులుగారు. ఆయన అవధాన ప్రక్రియను స్వాయత్తం చేసుకొన్నవారు. భాగవత, భగవద్గీతాదులలో ఏ పదం, ఏ అక్షరం ఎన్నిసార్లు ప్రయుక్తమైంది – ఈయనకు కరతలామలకం, ఒకమారు బళ్లారి –

అనంతపురం జిల్లా కలెక్టర్ ఈయనను అవధానం కేవలం మీ సాహిత్యం లోనేనా? ఇతరత్రా కూడానా?" అని ప్రశ్నించారట. "ఏ విషయమైనా సరే, అన్యభాష అయినా సరే" అన్నారట ఈయన. అప్పుడు కలెక్టర్ ఈయనను పరీక్షింపగోరి, వంద యూరోపియన్ జంటలను సమావేశపరచి, రామాచార్యులుగారికి వారిని (ఇతడు ఫలానా, ఈమె ఇతని భార్య అని) పరిచయం చేయించి, మూడు నాలుగు గంటల పాటు విందులు, వినోదాలు, నాట్యాలు జరిగిన పిదప మరల సమావేశపరచి, చెల్లాచెదురుగా వారిని కూర్చోబెట్టి. రామాచార్యులుగారిని పిలిచి, "స్వామీ! మీకు మూడు గంటల క్రితం పరిచయం చేసిన దంపతులను పేరు పేరున పిలిచి, వారు ఎక్కడ ఉన్నారో కనుక్కొని ఆహ్వానించండి" అని కోరాడట. అవధానిగారికి తెలుగు, సంస్కృత, తమిళు, కన్నడం తప్ప మరే భాషారాదు. ఆయన "స్టోన్‌గారూ, దయచేయండి, శ్రీమతి ఎలిజెబెత్‌స్టోన్‌గారూ, అమ్మా, తమరు విచ్చేసి మీ భర్త పక్కన నిలుచుకోండి" అంటూ రెండు వందల మందినీ పేరు పేరునా పిలిచి గుర్తించి నిర్దిష్ట స్థలంలో సమావేశపరిచారట. కలెక్టర్ ఆశ్చర్యపడి, ఆయనపై ప్రశంసల వర్షం కురిపించడమే కాక, తక్కినవారు కూడా ఆయన ధారణాపాటవాన్ని కొనియాడారట.

కప్పగల్లు సంజీవమూర్తిరావుగారు కవి. నాటక కర్త. బళ్లారి మునిసిపల్ హైస్కూల్‌లో తెలుగు పండితులు. నేను 'పరిశోధన' ద్విమాసపత్రికను నడుపుతూ, ఆంధ్ర నాటక పితామహ సంస్కరణ సంచికను ప్రచురించినప్పుడు, ఆచార్యుల ఆదర్శ జీవితం అనే గొప్ప వ్యాసం వ్రాసి నన్ను అనుగ్రహించారు.

పులమతి శ్యామారావుగారు, వారి తండ్రి పులమతి శివరావుగారు సుప్రసిద్ధ క్రిమినల్ న్యాయవాదులు. శివరావుగారు భారత ప్రభుత్వ గవర్నర్ జనరల్, మహానాయకుడు; మహారాజనీతిజ్ఞుడయిన శ్రీమాన్ చక్రవర్తుల రాజగోపాలాచారిగారి సహాధ్యాయులు. సుప్రసిద్ధ స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ టేకూరు సుబ్రహ్మణ్యంగారు రాజగోపాలాచారి (రాజాజీ)గారి అనుంగుశిష్యులు.

మహానటుడు బళ్లారి రాఘవ జగత్ప్రసిద్ధులు. రామదాసు నాటకంతో విఖ్యాతులయిన, ఆంధ్ర నాటక పితామహుని సోదరులైన ధర్మవరం గోపాలాచార్యులు గారిని నేను దర్శించాను. కోలాచలం శ్రీనివాసరావుగారినీ దర్శించాను.

అప్పుడు బళ్లారిలో గొప్ప సంస్కృత పండితులు ఉండేవారు. లింగాయతులలోనూ

ఇతర పై వర్గాల పండితులలోను ఢీకొని వాక్యార్థాలుచేయగల పండితులూ ఉండేవారు.

అప్పటి సంస్కృతాంధ్ర పండితులలో రావాడ వేంకటరామశాస్త్రిగారు, కొరటమద్ది వెంకటరామశాస్త్రిగారూ ముఖ్యులు. వీరిని నల్ల వెంకటరామశాస్త్రి, తెల్ల వెంకటరామశాస్త్రి అనేవారు వారి శరీరచ్ఛాయను బట్టి. కొరటిమద్దివారు సాహిత్య శిరోమణి, విద్వాన్ పరీక్షలలో ఉత్తీర్ణులై ప్రొఫిషియంట్ ఇన్ ఓరియంటల్ లాంగ్వేజ్ పరీక్షలో తేరి, మాస్టర్ ఇన్ ఓరియంటల్ లాంగ్వేజ్ (ఎం.ఓ.ఎల్) అన్న పరీక్షలు నెగ్గినవారిలో ప్రప్రథములని చెప్పేవారు.

నా చిన్నతనంలో పండితులుగా, రచయితలుగా, మహనీయులుగా విఖ్యాతు లయిన విశిష్ట వ్యక్తులు రూపనగుడి నారాయణరావుగారు. ఆయన వ్యక్తిత్వాన్ని గురించి, పాండిత్యాన్ని గురించి, శిష్యప్రీతిని గురించి అన్నిటికన్నా మించి, సౌజన్యాది ఆత్మగుణాలను గురించి చాల కీర్తించేవారు. ఆయన సాహిత్యంలో ప్రతి ప్రక్రియలోను రచనలు చేశారు. మనస్తత్వశాస్త్రంలో, యోగంలో ఎన్నో సాధనలు చేసి గ్రంథాలు వ్రాశారు. వాటిలో తమ అనుభవాలను ఉపదేశామృతంగా అందించారు.

రూపనగుడి నారాయణరావుగారు 1880 అక్టోబర్ 28వ తేదీన జన్మించారు. తండ్రి నరసింగరావుగారు. ఈయన ప్రొద్దుటూరులో శిరస్తాదారు - మేజిస్ట్రేటు. తల్లి సీతమ్మగారు. నారాయణరావుగారి మేనమామ హోసూరు సుబ్బరావుగారు. ఆయన కడపలో డిప్యూటీ కలెక్టరుగా ఉన్నప్పుడు గీర్వాణాంధ్ర పండితులను సమావేశ పరచి గౌరవించారు. ఈయన 'హెర్బర్ట్ స్పెన్సర్ ఆన్ ఎడ్యుకేషన్' అనే గ్రంథాన్ని 'విద్యాభ్యాస పద్ధతిః' అనే పేర గీర్వాణ భాషలోకి అనువదించారు. అది నా చిన్ననాడు దేశమంతా వ్యాపించింది. అలాగే జె.ఎస్.మిల్ రచించిన 'పొలిటికల్ ఎకానమీ' అనే గ్రంథాన్ని 'అర్థశాస్త్రం' అనే పేరుతో సంస్కృతీకరించారు. కనుక నారాయణరావు గారికి ఉభయవంశాల విజ్ఞానసంస్కారం అబ్బింది. నారాయణరావుగారి సతీమణి పేరు గౌరమ్మ. అక్షరాల గౌరీదేవి.

నారాయణరావుగారు బళ్లారిలోని వార్డ్‌లా కాలేజీలో చదివారు. కాలేజి ప్రిన్సిపాలు జె.పి.కోటిలింగం గారు క్రమశిక్షాదక్షులు. కనుక నారాయణరావుగారికి క్రమశిక్షణ పూర్తిగా ఒంటబట్టింది. దురదృష్టవశాత్తు తండ్రి నరసింగరావుగారి మరణం వల్ల పట్టభద్రులు కాకముందే కళాశాల విద్యాభ్యాసానికి స్వస్తి చెప్పవలసి వచ్చింది. కాని

గ్రంథ పఠనాసక్తిని విడనాడలేదు. ఆయన 'కావ్యనిదానము' అనే గ్రంథం పీఠికలో ఇలా వ్రాసుకొన్నారు. "విద్యార్థి దశ నుండియు నాకు కావ్యమన్నను, కావ్య విమర్శ మన్నను ఆదృతి యెక్కువ. అట్లగుట నేననేకాంధ్ర గ్రంథములనే కాక కళాశాల యందు పాఠ్యములుగా నుంచబడు ఆంగ్ల పాఠ్యభాగములను, దృశ్య శ్రవ్య కావ్యములను బహుశ్రద్ధతో చదువుచుంటిని. ఉపాధ్యాయ వృత్తియందు నే జేరిన తర్వాత నాకు కావ్యపఠనోత్సాహమతిశయింపగా, ఆంగ్లమునందలి ప్రసిద్ధ కావ్యములను సవ్యాఖ్యాన ములుగా పఠించితిని. చదివితిని. విషయ వస్తువులలో నాకభిరుచి జనకములైన వానిని మననము చేసి లక్ష్యములుగా నెత్తి వ్రాసికొంటిని. ఈ ఆసక్తి నాకిప్పుడును మిగిలి యున్నది" ఈ ఆసక్తితోనే ఆయన వివిధ గ్రంథాలు రచించారు. అనువాదాలు చేశారు.

నారాయణరావుగారు రాజమండ్రి ట్రెయినింగ్ కళాశాలలో శిక్షణ పొంది, ఉపాధ్యాయ వృత్తిలో పెక్కు జిల్లా ప్రధాన పట్టణాలలో పనిచేసి, మద్రాసులో సైదాపేట లోని ట్రెయినింగ్ కాలేజీలోను మొత్తం ముప్పదేళ్లు పనిచేసి, 1940లో ఉద్యోగం విరమించి బళ్లారిలో స్థిరపడ్డారు. తర్వాత 1963 ఆగస్టు 30వ తేదీన కుమారుడు డాక్టర్ వెంకటసుబ్బారావు ఇంట బొంబాయిలో కీర్తిశేషులయ్యారు. వెంకటసుబ్బారావు మద్రాసులో మెడికల్ కాలేజీలో చదువుతున్నప్పుడు నాకు ఎగ్మూరులో సహవాసి, ఒకే గదిలో ఉండేవాళ్లం.

నారాయణరావుగారు ఉపాధ్యాయులు గనుక, విద్యార్థుల మనస్తత్వాన్ని చక్కగా ఎరిగినవారు గనుక విద్యార్థులకు ఉపయోగపడే వాచకాలు, కథాపుస్తకాలు మొదలు కావ్యాలు, శాస్త్రగ్రంథాలు, నాటకాలు, అరవింద సిద్ధాంత గ్రంథాలు రచించారు. మానవుడు కళాస్వాదంతో సౌందర్య రసజ్ఞతను, సుష్ఠుతను, సహృదయతను పొందు తాడని, ఈ గుణాలవలన తనకు తెలియకుండానే హృదయ సామరస్యం పొంది, సౌశీల్యం సంపాదించి, జీవితంపై ఆసక్తి పెరిగి సకల వ్యాపారాలలోను చొచ్చుకొని పోతాడని ఈయన సిద్ధాంతం. ఉత్తమ కళానుభూతి ఐహికసుఖాన్నే కాక దివ్య జ్ఞానాన్ని, అఖండ ప్రేమను, అఖండానందాన్ని ఒదిగిస్తుందనీ ఈయన సిద్ధాంతం.

నారాయణరావుగారు ఎన్నో కావ్యనాటకాదులు రచించారు. అవన్నీ చాలవరకు ఆధ్యాత్మిక సువాసనలు గుబాళిస్తుంటాయి. వారి మొదటి కావ్యం కవితానీరాజన మనే పద్యసంపుటి. దీనిలోని పదహారు ఖండికలలో నా చిన్ననాడు సంభవించిన 'క్వెట్టా' భూకంపానికి స్పందించి రచించిన 'అశ్రుతర్పణము' అనే ఖండిక మనస్సును

కలిచివేస్తుంది. "కృష్ణరాయసాగరకావేరి" అనే ఖండిక సమకాలీన కృష్ణరాయసాగరమనే జలాశయ నిర్మాణం వస్తువయినట్టిది. ఆయన రెండవ రచన 'ఆర్యాసుభాషితము.' ఇది భర్తృహరి సుభాషితం వంటి స్వతంత్ర రచన.

ఈ విధంగా ఆయన పరిణయ కథామంజరి, కథామణి ప్రవాళముక్తావళి, ఆంధ్ర వ్యాకరణ దర్పణము, నారాయణ తెలుగు వాచకములు, మాతృభాషాబోధిని, నారాయణ తెలుగు ఉపవాచకములు, విప్రనారాయణ నాటకము, గౌతమ బుద్ధ నాటకము, సౌందరనంద నాటకము, పంపాపురీ శతకము, కావ్యనిదానము, ఆధ్యాత్మికోపాసనలు, ఉన్మత్తరాఘవము (అనువాదము): కాళిదాసు, శ్రీ అరవిందుని జీవితసంగ్రహము, మాత ప్రార్థనలు, కాకతీయ రుద్రమాంబ నాటకము, విషాద విజయనగర నాటకము, క్షమావతీ విజయనాటకము, శిశుమానసికశాస్త్రము, మానవ విజయము, రూపన్న కుమారభారతము మొదలయినవి రచించారు. ఈయన తెలుగు వచనం సరళగ్రాంథికంలో ముచ్చటగా ఉంటుంది.

ఈయన అరవిందుని గ్రంథాలు చాల అనువదించారు. వాటిలో కొన్ని: జాతీయ విద్యావిధానము, భారతీయప్రజ్ఞ, జాతీయతావశ్యకత, జాతీయకళాప్రయోజనము, యోగభూమికలు, మాతృశ్రీ జీవిత సమస్యలు, ప్రాతఃకాలమునాటి పలుకులు, శ్రీ అరవిందుల యోగము, రవీంద్ర కవి గ్రంథాల అనువాదాలలో మాలిని, యజ్ఞము, గీతాంజలి ముఖ్యమైనవి. టాల్‌స్టాయ్ రచనల అనువాదాలలో మొదటి సారాయిబట్టీ, త్రాగుబోతు ముఖ్యమైనవి. హెర్బర్ట్ స్పెన్సర్ రచించిన 'విద్య' అనే గ్రంథాన్ని అనువదించారు.

ఇంత కృషిచేసినా ఆయన ఎలాటి సన్మానాలూ కోరలేదు. కాని, ఆయన పద్దెనిమిది పర్వాల కుమారభారత మహాకావ్యాన్ని విని హిందూపురంలోని శారదాపీఠంవారు 'సాహితీ శిల్పి' అనే బిరుదుతో గౌరవించారు. ఆయన తన జీవిత చరిత్రనూ వ్రాసుకొన్నారు.

ఆయన పుస్తకాలు కొన్ని ఇంకా అముద్రితాలుగానే ఉన్నాయి. వాటిని శ్రీకైప నాగరాజుగారు (ప్రకాశం రోడ్డు, అనంతపురం) ముద్రించడానికి ప్రయత్నిస్తున్నారు. నాగరాజుగారి కృషి ఎంతగానో మెచ్చదగింది. సుప్రసిద్ధ పత్రికా రచయిత శ్రీ ఏ.ఎస్. రామన్‌గారి మొదటి భార్య రూపనగుడి నారాయణరావుగారి కుమార్తె.

మా ఊళ్లో వివాహాది శుభకార్యాలు జరిగినప్పుడూ, ఉత్సవాదులలోను, మా బంధు

వర్గంలోనే కాక, గండికోట శ్రీవైష్ణవులలోనే శ్రీమంతులయిన ఏటూరి శ్రీనివాస తోళప్పాచార్యుల భవంతిలో పండితుల గోష్ఠులు జరిగేవి. రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ గారు మైసూరు నుంచి; సొండూరు నుంచి సంస్థానం ఆస్థాన విద్వాంసులు, తార్కి కులు బుచ్చయాచార్యులుగారు, పునహా రాఘవాచార్యులనే తార్కిక వైయాకరణులు, మహాపౌరాణికులు, పెరుమాళ్ల వెంకటాచార్యులుగారు సురపురం (గుల్బర్గా జిల్లా) నుంచి; తర్కవేదాంత విద్వచ్ఛేఖరులు, మహానైష్ఠికులు దాసాచార్యులుగారు కడప నుంచి; వచ్చి, గోష్ఠులలో పాల్గొనేవారు. రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారి తొలి ఖండకావ్యం మా కమలాపురంలోనే ఆవిర్భవించిందని విన్నాను.

ఇతర వర్గాల ప్రముఖ విద్వాంసులూ బళ్లారి మండలంలో ఉండేవారు. వారితో నాకు పరిచయం అంతగా లేదు. రూపనగుడి నారాయణరావుగారి వంటి సజ్జనులు కొందరు మాత్రమే గుర్తున్నారు.

**"యస్య జీవంతి ధర్మేణ**
**పుత్రా మిత్రాణి బాంధవాః**
**సఫలం జీవితం తస్య**
**వాత్మర్దే కో హి జీవతి"**

**(ఎవని కొడుకులు, మిత్రులు, బంధువులు ధర్మమార్గంలో జీవిస్తారో వాడి జీవితమే సఫలమైనట్టిది. తనకోసం బతకని వాడెవడు? ఒకని జీవితం నిజంగా సఫలమని ఎప్పుడు అనగలమంటే, అతడేకాక, అతని కొడుకులు, స్నేహితులూ, చుట్టాలూవి కూడా న్యాయంగా బతికినప్పుడే!)**

# 25

# కృతఘ్నతామూర్తి

"అమర్యాదః క్షుద్రః జడమతి రసూయా ప్రసవభూః
కృతఘ్నో దుర్మానీ వినయ రహితో వంచన పరః
నృశంశః పాపిష్ఠః కథ మహ మితో దుఃఖ జలధేః
అపారా దుత్తీర్ణః తవ పరిచరేయం చరణయోః"

**(ఓ ప్రభూ! నేను మర్యాద తెలిసినవాడిని కాను, తుచ్ఛుడిని, మూర్ఖుడిని, అసూయకు – ఓర్వలేమికి పుట్టినిల్లును, చేసిన ఉపకారం మరచినవాడిని, దురభిమానం కలవాడిని, వినయం లేనివాడిని, మోసం చేసేవాడిని, క్రూరుడిని, పాపాత్ముడిని. ఇలాటి నేను పారం లేని దుఃఖసాగరాన్ని ఇక్కడి నుంచి ఎలా దాటగలను; దాటి నీ పాదపద్మాల పరిచర్య ఎలా చేయగలను?)**

ఇది యామునాచార్యులు భగవత్సన్నిధిలో తన వేదనను వెళ్లబోసుకొన్న శ్లోకం. నా ఆవేదనను భగవంతుడు కూడ వినడని నా విశ్వాసం. ఎందుకంటే అంతటి కృతఘ్నుడిని నేను!

రెండేళ్లు ఆనేగొందిలో గడిచాయి. గురువుగారి వాత్సల్యం, తక్కినవాళ్ల ప్రేమాదరాలు మితిమీరిపోయాయి. కాళిదాసు చెప్పినట్టు మధురపదార్థాలే తినేవాడికి మొగంమొత్తి పులుపు వస్తువులపై మనసు పోయినట్టు ఏదో ఘర్షణ, ఉద్వేగం కోరసాగింది మనస్సు. ఎవడితోనైనా పోట్లాడదామన్నా, అవకాశం లేదు. అంతా ప్రేమ, స్నేహం, ఆదరం, ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నాను. ఆనేగొంది నుంచి గురువుగారి ఇంటి నుంచి

తప్పించుకొనిపోదామని బుద్ధి పుట్టింది. ఎక్కడికి పోను? కమలాపురానికా? వాళ్లు నన్ను పిచ్చివాడుగా, మూర్ఖుడుగా భావించరూ? అంత ప్రేమగా అందరూ చూస్తున్నప్పుడు, పుత్రనిర్విశేషంగా, పుత్రాధికంగా చూస్తున్నప్పుడు, ఎంతో అనుసరించి ఉండక తెంచుకొని వస్తానేవాడు పిచ్చివాడయినా అయి ఉండాలి, మూర్ఖుడు, అవివేకి అయినా అయిఉండాలి. విసుగు ఎక్కువయింది. ఆ విసుగును గురువుగారి మనుషులపైన చూపించడం ప్రారంభించాను. వాళ్లకు నాలోని మార్పు ఆశ్చర్యం కలిగించింది. ఎంతో వినయంగా నా పని నేను చేసుకుంటూ, గురువుగారికి శుశ్రూష చేస్తూ ప్రశాంతంగా ఉన్న నాలో ఏమిటి మార్పు? గురువుగారి వరకు వెళ్లింది ఈ సంగతి.

ఆయన మనస్తత్త్వవేత్త. ఆలోచించాడు. పాఠాలు బాగా చదువుతున్నాను. బయట స్కూల్లో ఏడవ క్లాసు. ఇంట్లో సంస్కృతం రఘువంశంలో కొన్ని సర్గలు, మాఘంలో కొన్ని సర్గలు, వృత్తరత్నాకరం, చంద్రాలోకం, అష్టాధ్యాయిలో నాలుగధ్యాయాలు కంఠ పాఠం; ధాతురత్నావళి, శబ్దరత్నావళి పూర్తి చేశాను. బాల రామాయణం, రామోదంతం ఎప్పుడో పూర్తయాయి. వేదాంత దేశికుల స్తోత్రాలు ఏడెనిమిది – హయగ్రీవం స్తోత్రం, శ్రీస్తుతి, వైరాగ్యపంచకం, భగవద్ధ్యాన సోపానం, న్యాసదశకం, వరదరాజస్తుతి, దయాశతకం, గోదాస్తుతి మొదలయినవి అర్థసహితంగా కంఠపాఠం. సంస్కృత భాషలో వాక్యరచన చేసే శక్తి ఇంతయినప్పుడు ఎందుకీ అసంతృప్తి? గురువుగారు నన్ను పిలిచి నా అసంతృప్తికి కారణం అడిగారు. నాడి చూచారు. కొండమ్మవ్వతోను అడిగించారు. ఆమె నన్ను ఏకాంతంగా పిలిచి "రాముడూ! నీవు ఎంతో బాగా చదువు తున్నావు. ఇంక రెండేళ్ళున్నావంటే మైసూరుకు వెళ్లి మహారాజా సంస్కృత కళాశాలలో పరీక్షకు వెళ్లే స్థాయికి అందుకుంటావు. విసుగుపడకు. మేమేమైనా నిన్ను అన్నామా? చెప్పు" అని బ్రతిమాలింది. గురువుగారు నన్ను మరొకమారు బుజ్జగించి త్వరలో సిద్ధాంతకౌముది ప్రారంభిస్తానని తెలిపారు.

నాకు మనసు మరీ మండిపోయింది. నేను విసుక్కుంటే, "వెధవా! ఏమిటిరా నీ విసుగు? పాపం! పరాయి పిల్లవాడు అని అందరం ప్రేమగా చూస్తుంటే, నీకింత ధిమాకా? జాగ్రత్త! మీ తాతగారికి కబురుపంపుతాను" అని బెదిరించక, బుజ్జగిస్తా రేమిటి వీళ్లు? వీళ్ల ప్రేమ మండిపోను! తాతగారికి కబురంపినా బాగుండును. ఆయన వచ్చి రెండు చీవాట్లు పెట్టినా, విసుగు తగ్గిపోయేదేమో!

ఆ సమయంలో వచ్చాడు ఆనేగొందికి మా బంధువైన యువకుడొకడు. నాకన్నా ఆరేడేళ్ళు పెద్దవాడు. తిరుపతి శ్రీ వేంకటేశ్వర సంస్కృత కళాశాలలో చదువుతున్నాడు. పేరు తిరుమల వెంకటరంగాచార్యులు. నాకు ఎక్కడలేని ఉత్సాహం కలిగింది అతన్ని చూచి. ఆయన మా చదువు పద్ధతి చూచాడు. బాగుందనే అన్నాడు. మా గురువు గారు అతణ్ణి పరీక్షించారు యథాలాపంగా. అతడు తెలివైన విద్యార్థే. చక్కని దస్తూరీ. ఇంగ్లీషు కూడా వచ్చు. అతడు నాతో మాట్లాడుతున్నప్పుడు తమ కళాశాల గొప్పదనాన్ని గూర్చి, హాస్టలు భోజనాన్ని గురించి ఉత్సవ సమయాలలో తిరుమలకు గుంపులుగా వెళ్ళి వేంకటేశ్వరుని సేవించుకొని రావడాన్ని గురించి చెప్పేవాడు. అతడున్న నాలుగు రోజులూ ఈ సంగతే. "ఇక్కడేమిటి? గురువుగారు, ఆయన కుమారులే కదా పాఠాలు చెప్పేవాళ్లు. తిరుపతిలో మా కళాశాలలో యాభై మంది ఉపాధ్యాయులు, గంటగంటకూ ఉపాధ్యాయులు మారుతుంటారు. ఇష్టం వచ్చిన శాస్త్రం చదువవచ్చు. మీ తాతగారిని, నాన్నగారిని ఒప్పించి వచ్చేయి. అక్కడ నీకు తప్పక విద్యార్థివేతనం దొరుకుతుంది. పెద్ద పెద్ద గదులు. ఒక్కొక గదిలో నలుగు రైదుగురు ఉంటారు. పై తరగతి వాళ్లు కూడా ఎప్పుడైనా చింతన చెబుతారు" అని ప్రోత్సహించాడు.

వెంకటరంగాచార్యులున్న నాలుగు రోజులూ నా బ్రెయిన్ వాష్ చేయడం గురువు గారు గ్రహించారు. నా మనస్సు చంచలం కావడం గ్రహించారు. నన్ను మరొకసారి బుజ్జగించి పెద్ద సంస్కృత కళాశాలలో విద్యార్థుల గుంపు తప్ప మరేమీ ఉండదని, నాకు కొంత సంస్కృత భాషాజ్ఞానం కలిగింది గనుక వ్యాకరణం ప్రారంభించి, నాలుగైదేళ్లలో మైసూరు విద్వత్పరీక్షకు తయారుచేస్తానని అన్నారు.

కాని, నా మనసు ఒప్పుకోలేదు. అన్నీ అరకొరగా! ఏదీ పూర్తిచేయని విధి బలీయం. వెంకటరంగాచార్యులు నా మనస్సులో ఆనేగొంది పరిత్యాగబీజం నాటాడు. అది నిమిషాల మీద మానయి మనసు నిండిపోయింది. గురువుగారికి చెప్పడం దేనికి? ఆయనకు చెప్పే ఆనేగొంది వచ్చానా? మా తాతగారు పిలుచుకొని వచ్చి వదిలారు. ఆయన ద్వారానే వెళ్లిపోతాను. - ఇలా కృతఘ్నుతతో సాగింది మనసులో తర్కం. ఆనేగొంది వదలాలి. ఈ ప్రేమను ఇక భరించలేను. ప్రేమ వల్ల భవిష్యత్తు పాడయి పోతుంది. పెద్ద కళాశాలలో రెండు వందల మంది విద్యార్థుల మధ్య చక్కగా చదువు కోడం ఎంత హాయి? ఇక్కడ బిక్కు బిక్కుమంటూ నలుగురు విద్యార్థులు. గురువుగారు ఎంత

గొప్పవారయితే మాత్రం ఎంతని చెప్పగలరు? రెండు ముఖాలు తప్ప ఇంకో మొగమేదీ? మెదడు, మనస్సు వేడెక్కాయి నిద్రపోయాను.

ఒకటి రెండు నెలలు గడిచాయి. ఆనేగొందిలో నిత్యకృత్యం యథావిధిగా సాగుతూంది. ఇప్పుడు నా లక్ష్యం తిరుపతి పయనం గనుక విసుగు తగ్గింది. ఏదో విధంగా ప్రశాంతంగా ఉంటూ ఆనేగొంది నుంచి బయటపడి తిరుపతికి వెళ్లాలి. సమయం కోసం ఎదురు చూస్తున్నాను. కమలాపురంలో మా ఇంట్లో ఏదో శుభకార్యం జరిగింది. గురువుగారి ఇంటివాళ్లతోపాటు నేనూ కమలాపురం బయలుదేరాను. కమలాపురంలో శుభకార్యం ముగిసిన తర్వాత గురువుగారి ఇంటివాళ్లతోపాటు నేనూ ఆనేగొందికి తిరిగిపోవలసింది. పోలేదు. నేను పోనన్నాను. మా తాతగారికి అర్థంకాక "రెండు రోజులు ఉండనీండి. తర్వాత పంపుతాను" అని వారికి చెప్పారు. వారు వెళ్లిపోయారు.

మొదట అమ్మతో చెప్పాను. నేను తిరుపతికి పోయి చదువుకుంటానని. అంత దూరాభారం, పంపడం ఎలాగు - అని అంటారేమోనని, నాకన్నా చిన్నవాళ్లు అక్కడ ఉన్నారని; వెంకటరంగాచార్యులు చెప్పారని, నన్ను పంపవచ్చుననీ వాదించాను. ఈ వార్త మా తాతగారికి చేరింది. నన్ను పిలిచి అడిగారు, ఆనేగొంది ఇబ్బంది ఏమిటని. "ఇబ్బంది ఏమీలేదు. అంతా ప్రేమతో చూస్తున్నారు. కాని, తిరుపతిలో పెద్ద పాఠశాల, చాలమంది ఉపాధ్యాయులు, విద్యార్థులు. త్వరగా పైకి రావచ్చు" అని ఏమిటేమిటో పెద్ద ఆరితేరినవాడిలాగ వెంకటరంగాచార్యుల మాటలు చిలక పలుకులలాగ అప్పగించాను. మా అమ్మ కూడా "తిరుపతిలో మన బంధువులు కూడా ఉన్నారు. భయమేమీ ఉండదు. హాస్టల్ ఉందట. అక్కడ విసుగుపుడితే వాళ్ల ఇంటికి వెళ్లి ఒక పూట ఉండవచ్చు. వారు వీడి చదువూ చట్టబండలూ చూస్తుంటారు" అని తళిగ ఇంటి తలుపు చాటు నుంచే సిఫారసు చేసింది తాతగారికి. తాతగారు సరేనని అనక తప్పలేదు.

నన్ను తిరుపతికి పంపడం ఆలస్యమైంది. ఈలోగా ఆనేగొంది నుంచి పిలుపుపై పిలుపులు. నేను 'ససేమిరా' వెళ్లనన్నాను ఆనేగొందికి. తిరుపతి సంస్కృత కళాశాలలో అష్టమి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య, పాడ్యమి, సెలవులు; శని, ఆదివారాలు కాదు. ఆ కాలంలో సాధారణమైన స్కూళ్లకు శని, ఆదివారాలు సెలవులు. సంస్కృత పాఠశాలలన్నిటిలోను పైన చెప్పిన తిథులే అనధ్యాయ దినాలు. ముఖ్యంగా పాడ్యమి నాడు చదివితే చదువు అబ్బదని నమ్మకం. వాల్మీకి సుందరకాండలో అశోకవనంలో

ఉన్న సీతను వర్ణిస్తూ "ప్రతిపత్పారశీలస్య విద్యేవతనుతాం గతా" – (పాడ్యమి నాడు చదివే వాడి చదువులాగ చిక్కిపోయింది) అన్నాడు. ఆనేగొందిలోనూ ఈ పద్ధతే పాటించేవారు గురువుగారు. కాని సంస్కృత కళాశాలలో ఎండకాలం, చలికాలం సెలవులు మాత్రం ఇంగ్లీషు బళ్లలాగే. మా తాతగారు ఒక నిర్ణయానికి రావడానికి రెండు నెలలు పట్టింది.

ఎట్టకేలకు తిరుపతికి వెళ్లడం నిశ్చయమయింది. మా తాతగారు నా వెంట వచ్చారు. పాఠశాలలో చేరడానికి తిరుపతి వచ్చింది 1924 డిసెంబర్ 24 అని జ్ఞాపకం. అప్పటికే సంస్కృత కళాశాల తెరచి రెండు నెలలూ దాటింది. విద్యార్థులు ప్రవేశించే గడువు ఎప్పుడో ముగిసింది. మా తాతగారికి తిరుమల తిరుపతి దేవస్థానం మహంతు ప్రయాగ్‌దాస్‌జీ పరిచయం ఉండడం వల్ల, సంస్కృత పాఠశాలలో కింది తరగతులలో చేరడానికి మహంతు సిఫార్సు కోసం ఆయనను చూడవలసి వచ్చింది. తాతగారూ నేనూ మహంతు దర్శనానికి వెళ్లాము. ఆయన ఆదరంతో ఆహ్వానించి నన్ను పరీక్షించారు. "మీ మనుమడికేమిటి? తప్పక ప్రవేశం లభిస్తుంది. నిశ్చింతగా ఉండండి. ప్రిన్సిపాలుగారికి ఉత్తరం వ్రాసి ఇస్తాను" అని అంటూ ఉత్తరం తమ కార్యాలయంలో టైప్ చేయించి ఇచ్చారు.

మరునటి దినం సంస్కృత కళాశాలకు వెళ్లాము. అప్పటి ప్రిన్సిపాలు సేలం సుబ్బారావుగారు. మా తాతగారిని చూడగానే "తాము ఎప్పుడు దయచేశారు? అని కుశల ప్రశ్నలు వేశారు. ఆయన మొదటి వివాహం మా ఊరిలో జరిగింది. ఆయన మామగారు తాతగారి మిత్రుడు. తాతగారు కూడ ఆశ్చర్యపడ్డారు. సుబ్బారావుగారు ప్రిన్సిపాలని తెలిస్తే మహంతును చూచేవాళ్లమే కాదుగదాఅని అనుకున్నారు.ఆధికస్య అధికం ఫలం – అని తర్వాత సంతృప్తిపడ్డారు. "ఈ మాత్రానికి నేను లేనా? మహంతు గారి వద్దకు వెళ్లాల్నా?" అన్నారు సుబ్బారావుగారు. "మీరు ప్రిన్సిపాలని నాకు తెలియదు. మీరు ఇక్కడ ఉంటారని తెలియదు. పాఠశాల ప్రవేశం గడువు దాటింది. మహంతుగారి పరిచయం ఉందిగదా అని వెళ్లాను. ఇప్పుడేమయింది గనుక! మీ మనుమడే వీడు" అన్నారు తాతగారు.

లాంఛనంగా నా పరీక్ష జరిగింది పాఠశాల ప్రవేశానికి. "రఘువంశం చదివావుగదా! చతుర్థసర్గ మొదటి శ్లోకం చదివి అర్థం చెప్పు బాబూ!" అన్నారు సుబ్బారావుగారు. ఆ

శ్లోకం ఇది.

**"స రాజ్యం గురుణా దత్తం ప్రతిపద్యాధికం బభౌ,**
**దినాంతే నిహితం తేజః పవిత్రేవ హుతాశనః!!"**

తండ్రి అయిన దిలీప మహారాజు ఇచ్చిన రాజ్యాన్ని రఘు మహారాజు పొంది, సాయంకాలం సూర్యుడిచ్చిన కాంతిని స్వీకరించిన అగ్నిలాగ మిక్కిలి ప్రకాశించాడు- అని అర్థం చెప్పాను. సుబ్బారావుగారు హాస్యప్రియులు, వ్యంగ్యప్రియులని తర్వాత తెలుసుకున్నాను. "సూర్యుడు అగ్నికి కాంతి ఇవ్వడమేమిటి బాబూ" అని ప్రశ్నించారు. "ఈ విధంగా వేదంలో ఉందని మా గురువుగారు చెప్పారండి. ఆ మంత్రం నాకు జ్ఞప్తిలో లేదండీ" అన్నాను "ఫరవాలేదు. గురువుగారి మాట దక్కించావు" అంటూ గుమాస్తాను పిలిచి రిజిస్టరులో నా పేరు ఏడో క్లాసులో వ్రాయించి, మా తాతగారి వైపు తిరిగి, "కళాశాల తెరిచి మూడు నెలలకుపైగా అయింది. మూడు నెలల పరీక్ష కూడా అయిపోయింది. కనుక మీ మనవడికి ఈ సంవత్సరం స్కాలర్‌షిప్ - విద్యార్థి వేతనం రాదు. ఈ ఆర్నెల్లు మీ బంధువుల ఇంట్లో ఉండనివ్వండి. వచ్చే విద్యా సంవత్సరం నుంచి విద్యార్థివేతనం వస్తుంది" అన్నారు. తాతగారు సరేనన్నారు. "కొండకు వెళ్లి స్వామి దర్శనం చేసుకొని వస్తాము. తర్వాత మా వాడు తరగతిలో చేరుతాడు. అనుమతి ఇవ్వండి" అని మా తాతగారు ప్రిన్సిపాలును కోరారు.

మేము కొండమీదికి వెళ్లి మహంతుగారి మఠంలో దిగాము. వేంకటేశ్వరుణ్ణి సేవించుకొని మరుసటి ఉదయం దిగాము. దిగుతున్నప్పుడు ఘోరమైన ప్రమాదం జరిగింది. భగవదనుగ్రహం వల్ల మృత్యువు తప్పింది. నేను దిగుతున్నప్పుడు మొదటి కొండ వరకు తాతగారితో కలిసే దిగాను. తర్వాత గాలిగోపురం మెట్లు నిటారుగా ఉన్నాయి. సగం కొండ దిగిన పిదప ఒక మలుపులో దిగే వేగంలో అడుగు రెండో మెట్టుపై పడింది. తూలిపడి దొర్లి దాదాపు కిందికి వచ్చి, ఒక పెద్ద గుండు తగిలి ఆగాను. స్మృతి లేదు. యాత్రికులు హాహాకారాలు చేస్తూ త్వరగా నన్ను పట్టుకోడానికి ప్రయత్నించారు. కాని, నేను దొర్లే వేగం వారికి ఆ అవకాశం ఇచ్చింది కాదు. నేను గుండుకు తల తగిలి మూర్ఛిల్లినప్పటికి త్వరగా దిగి దగ్గరకు వచ్చారు. అప్పటికి నాకు తెలివి వచ్చింది. పై పలు వరసలో ఎదుటి పన్నొకటి విరిగింది. నేను దులుపు కొని లేచి మా తాతగారి కోసం నిరీక్షిస్తున్నాను. నన్ను రక్షించడానికి ప్రయత్నించిన వారు

ఆనందంతో గోవింద నినాదాలతో వేంకటేశ్వర సంకీర్తనం చేశారు. మా తాతగారు నెమ్మదిగా దిగి రావడానికి అరగంటయింది. నేను ఇక ఉండనని, కొండ పక్కని అగాధంలో లోయలో పడిపోయి ఉంటానని, ఈ వయస్సులో ఇలాటి ఘాతుకంతో ఇంటికి వెళ్లి ఏమి జవాబు చెప్పాలో తోచక నారాయణ స్మరణ చేస్తూ దిగి, నేను సురక్షితంగా ఉండడం చూచి, కన్నీళ్లు కురుస్తుండగా వేంకటేశ్వరునికి మనసులోనే కోటి దండాలు పెట్టారు.

**"శోకం మా కురు కుక్కుర**
**సర్వేస్వహ మధను ఇతి ముధాసాధో,**
**కష్టాదపి కష్టతరం**
**దృష్ట్వాశ్వానం కృతఘ్న నామానమ్!!"**

**(ఓ సాధువైన శునకమా! అతినిందితుడైన కృతఘ్నుడనే కుక్కను చూచిన మీదట, అన్ని ప్రాణులలోకి నేను అధముడిని అని బాధపడకు. అలా బాధపడడం దండగ. కృతఘ్నుడు కుక్కకన్న నీచుడు!)**

# 26

# నత్తి-వావిలికొలను సుబ్బరావుగారి హితవు

"అవిరతం పరకార్యకృతాం సతాం
మధురిమాతిశయేన వచోమృతమ్
అపి చ మానస మంబునిధి ర్యశో:
విమల శారద పార్వణ చంద్రికా."

**(నిరంతరం ఇతరుల పనులే చేస్తున్న సజ్జనుల పలుకు మాధుర్యాతిశయంతో అద్భుతంగా ఉంటుంది. మనస్సు సముద్రం వంటిది. కీర్తి శరత్కాల పూర్ణిమా చంద్రుని వెన్నెలే మరి!))**

**నా**లో ఒక విచిత్రమైన లోపం ఉండేది. ఆందోళన కలిగినప్పుడుగాని, తొందర ఎక్కువయినప్పుడుగాని, భావోద్వేగం పెల్లుబికినప్పుడుగాని; మాటలు తడబడి నత్తి ముంచుకు వచ్చేది. మా ఊరిలో ముక్కుతో మాట్లాడే నరసింహాచారి అనే మాధ్వ బ్రాహ్మణుని వెక్కిరించడం వల్ల నత్తి వచ్చిందని నా మిత్రులు నన్ను ఎత్తిపొడిచేవారు. ఆయనను మేము 'అనునాసికాచారి' అని ఎగతాళి చేసేవాళ్లం. ఆ పాపఫలమో, మరొకటో నాకు మాత్రం మంచి సమయాల్లో - అంటే నాలోని వివిధ భావ సముదాయాన్ని, భావశబలతను తెలుపదలచినప్పుడు నత్తి నోటిని మూసివేసేది. నాలుక గడియారంలోని లోలకం లాగ కొట్టుకొనేది. నా సంబరమంతా సంభ్రమమయి భయంకరమయ్యేది. నా చెవిపోటు, నిద్రలో నడకలను పోగొట్టిన శ్రీనివాస రాఘవాచార్యులవారికి, మా గురువుగారు ఈ సంగతి ఎందుకు చెప్పలేదో! దానంతట అదే పోతుందనుకున్నారేమో! ఈ నత్తి తిరుపతి సంస్కృత కళాశాలలో ప్రవేశంలో నన్ను నవ్వులపాలు చేసింది.

మా తాతగారు నన్ను తిరుపతి కళాశాలకు పిలుచుకొని వెళ్లారు. ప్రవేశం కోసం వచ్చిన విద్యార్థుల సంఖ్య గణనీయంగానే ఉంది. ఆ అభ్యర్థులతో మాటలు కలుపగా, నేను భయపడవలసిన పనేమీ లేదనిపించింది. మౌఖిక పరీక్షలు జరుగుతున్నాయి. నా వంతు వచ్చింది. నా అర్హతలు పరీక్షకులకు తెలియపరిచాను. ఆ పరీక్షకులలో ప్రిన్సిపాలు సేలం సుబ్బారావుగారూ ఒకరు. ఆయన మా ఊరి అల్లుడే అని ఇదివరకే ప్రస్తావించాను.

"రఘువంశంలో కొన్ని సర్గలు చదివానన్నావు గదా! నాలుగో సర్గ మొదటి శ్లోకం చెప్పి, అర్థతాత్పర్యాలు వివరించు" అన్నారు ఒక పరీక్షకులు. నాకు కొట్టిన పిండి అంతా. కొన్ని నెలలుగా కలలు గంటున్న తిరుపతి సంస్కృత కళాశాల ప్రవేశభాగ్యం లభిస్తున్నదన్న భావావేశంవల్లనో, మరే కారణం వల్లనో నత్తి ముంచుకొని వచ్చింది. అలాగే చదివాను. అర్థతాత్పర్యాలు సరిగా చెప్పినా, నత్తివల్ల తగినంత రాణింపు లేకపోయింది. నేను శ్లోకం చదివిన తీరు తలచుకుంటే ఎందుకు ఇంత కష్టపడ్డానా అని అనిపిస్తుంది. అప్పటి దుర్విధి అది! ఆ శ్లోకం ఇది.

**"స రాజ్యం గురుణాదత్తం / ప్రతిపద్యాధికం బభౌ**
**దినాంతే నిహతం తేజః / సవిత్రేవ హుతాశనః"**

దిలీప మహారాజు రఘుకుమారుణ్ణి యువరాజును చేశాడు. దిలీప మహారాజు ఇచ్చిన రాజ్యంతో, సాయంకాల సమయంలో సూర్యుడిచ్చిన కాంతితో అగ్ని ప్రకాశించినట్టు ప్రకాశించాడు అని దీని తాత్పర్యం. పద విభాగం. దండాన్వయం, అర్థం, ఆకాంక్ష, తాత్పర్యం సక్రమంగా చెప్పాను; మా ఆనేగొంది గురువుగారు నేర్పిన పద్ధతిలో. కాని, నత్తివల్ల ఈ శ్లోక వివరణకు అరగంట పట్టింది. స్సస్సస్స, ర్రర్రర్ర, గ్గ, గ్గ,గ్గ, ప్రప్రప్ర, న్నిన్నిన్ని, ద్దిద్దిద్ది – అని సరిగమలు పాడాను. ప్రిన్సిపాలు గారు "జంట స్వరాలు బాగా చెప్పావులే సంగీతం నేర్చుకొంటే బాగుండును" అన్నారు.

"శ్లోశ్లోశ్లోకంలోని ఆఆఆఅలంకారం చెచెప్పలేదండి. త్తుత్తుత్తుత్తుల్యయోగిత అలంకారమండి. ద్దీద్దీద్దీప్పప్ప దీపకంకక్కూడా చెప్పవ్వావ్వావ్వచ్చునండి." అని అన్నాను. నా నత్తికి కళాశాలాప్రవేశం దొరుకుతుందో లేదో అని సందేహించాను. కాని, "నాయనా! నీ సంగీతం చాలు. అడ్మిషన్ ఇస్తున్నాము. మమ్మల్ను చంపక." అని ప్రిన్సిపాలు గారు అనడంతో నా నోటికీ, సందేహాలకూ పూర్ణ విరామం లభించింది.

ఆంగ్ల పాఠశాలలోలాగ కొత్త విద్యార్థులను పాత విద్యార్థులు ర్యాగింగు చేసినట్టు

తిరుపతి సంస్కృత కళాశాలలో విద్యార్థులు చేయకపోయినా మానవునిలో అంగ వైకల్యాన్ని అలుసుగా తీసుకొని గేలిచేయడం లఘుబుద్ధుల స్వభావం గనుక "ఒరే నత్తోడో! నత్త్వాచార్య, నత్తిస్వామీ" అని కొందరు సంబోధించడం కష్టంగానే ఉండేది నాకు. కాని లోపం ఉన్నప్పుడు గింజుకోడం ఎందుకు? భరించక తప్పదు. ఇంతకూ, వాళ్లతో కలసి సంవత్సరం ఉండాలి. కోప్పడితే సంవత్సరాంతం వరకు ద్వేషంతో మనగలనా? నా వివేకం వికసించింది. సమాధానం ఏమీ చెప్పకుండా నవ్వుతూ దాటవేసేవాణ్ణి. ఈ-నవ్వు-మందహాసం నాకు జీవితంలోను బాగా బాసట అయింది. పత్రికలలో పనిచేసినప్పుడు పైవాళ్లు



అధికారం చెలాయిస్తే ఒక్క నవ్వు నవ్వేవాణ్ణి. వాళ్లకు ఒళ్లుమండేది. "ఎందుకానవ్వు?" అనేవారు. "చేయని తప్పు ఆక్షేపార్హమైనప్పుడు నవ్వకుండా ఏడుస్తాననుకోండి. మీకు మరీ ఇదవుతుంది." అనేవాణ్ణి. 'నవ్వు నాలుగిందాల చేటు' అని అన్నారుగాని, నాకు నవ్వు నలభయ్యందాల మేలే చేసింది.

ఆనేగొందిలో పడిన మూలబంధం (బునాది) గట్టిది గనుక నేను రెండు మూడు నెలల్లోనే తరగతిలో మిన్న అని నిరూపించుకొన్నాను. నేను చిన్ననాడు రామభక్తుణ్ణి, మా తాతగారు రామనవమి తదీయారాధనలు చేసేవారు. మా తండ్రిగారు, హనుమదుపాసకులు. మరి నాలో రామభక్తి ఎలా లేకపోతుంది? నిజం చెప్పేవాడినని, మాట తప్పనని, పరోపకారి అని పేరు వచ్చింది. తరగతిలో మొదటివాణ్ణి. దేశభక్తుణ్ణి, ఖద్దరు కట్టేవాణ్ణి. ఖద్దరు కట్టడమే మహాపరాధమయిన కాలమది. ఇవన్నీ నాకు ప్లస్ పాయింట్లు. నత్తోడా అనడం అణగిపోయింది. రామచంద్రాచారి, రామచంద్ర, మా ప్రాంతాన్ని కిష్కింధ అంటారు గనుక కొంచెం హాస్యంగా కిష్కింధావాసీ అని సంబోధించడం వినబడసాగింది.

అయినా, ఈ నత్తి పిశాచం నన్ను పట్టి పీడిస్తూంది. ఏమి చేయాలా అని ఆలోచనలో పడ్డాను. ఏట్లో కొట్టుకుపోయే వాడికి గడ్డిపోచ దొరికినా పట్టుకుందా మనుకున్నప్పుడు గడ్డివామే కొట్టుకొనివస్తే ఎంతో సంతోషం కలిగినట్టు - గడ్డివామిని పట్టుకొని తేలుతూ గట్టు చేరవచ్చు. నదీ తీర గ్రామాలలో ఇది నిత్య దృశ్యం - వాసుదాసుగారు -

వావిలికొలను సుబ్బరావుగారు తిరుపతికి విచ్చేశారు. ఆయన అప్పుడు 'టెంకాయ చిప్ప శతకం' అనే శతకం రచించారు. దానిని భజన కూటాలలో వినిపించారు.

నేను వావిలికొలను సుబ్బరావుగారి భక్తుణ్ణి. ఆయన వాల్మీకి రామాయణాన్ని మూలానుసారిగా అనువదించి, విశిష్టాద్వైత పరంగా మందరమనే పేరుతో వ్రాసిన వ్యాఖ్య మా ఇంట్లో ఉండేది. ఆయన పిల్లలకోసం వ్రాసిన ఆర్య కథానిధి అనే పిల్లల కథల పుస్తకాలు చదివాను. అవి జేబులో ఇమడదగిన కొలతలో ముచ్చటయిన అట్టతో ఆకర్షణీయంగా ఉండేవి. ఆయన అభినవాంధ్ర వాల్మీకి బిరుదాంకితులు, ఆర్య కథానిధి మాత్రమేకాక, కుమార హిత చర్య, కుమారీ హిత చర్య, పిల్లలకు ఉపయోగపడే వ్యాకరణాది పుస్తకాలు; వ్రాసి బాల సాహిత్యాన్ని ఎంతగానో పెంచారు. తెలుగులో అభిరుచి కలిగించడానికి ప్రథమ, మధ్యమ, ఉత్తమ అనే పరీక్షలు పెట్టి ఉత్తీర్ణులయినవారికి బహుమతులు ఏర్పాటు చేశారు. కడప జిల్లా ఒంటిమిట్ట ఆయన నివాస స్థలం. భాగవత రచయిత బమ్మెర పోతన్న ఈ ఒంటిమిట్టలో కొంత కాలం ఉన్నట్టు జనశ్రుతి ప్రబలంగా ఉంది. ఒంటిమిట్ట గొప్ప రామక్షేత్రం గనుక పోతన అక్కడ కొంతకాలం ఉండి కోదండరాముణ్ణి సేవించి ఉంటాడనడంలో అసత్యమేమి ఉండదు. ఆయన ఈ జనశ్రుతిని నమ్మారు.

నేను ఆయనను దర్శించుకొని నా గోడు వినిపిద్దామనుకొని ప్రయత్నించాను. ఆయనను పరివేష్టించిన శిష్యబృందం నా నత్తిమాటలు వినిపించుకోక ఎవడో పిచ్చి కుర్రాడని తోసివేశారు. నేను హతాశుణ్ణయి తిరిగివచ్చినా, ఆశ చావక ఉత్తరం వ్రాద్దామనుకొన్నాను. రెణ్నాళ్ళ తర్వాత నేను ఆయన భక్తుణ్ణని, ఆర్యకథానిధి వరుస చదివానని జాబు ప్రారంభించి, నత్తితో బాధపడుతున్నానని, దీనిని తొలగించి పుణ్యం కట్టుకోండని ముగించాను. ఆ కాలంలో కవరు అర్ధణా. నా దస్తూరీ అప్పుడు బాగుండేది. శ్రద్ధగా పట్టిపట్టి వ్రాశాను. శ్రీమదిత్యాది అని శ్రీవైష్ణవ సంప్రదాయంతో సంబోధించడం మరువలేదు. ఆయన చాలా గొప్పవారు. నా లేఖకు జవాబు ఇవ్వవలసిన అవసరం లేదు. ఇస్తే ఆయనకు ఒరిగేదేమీ లేదు. కనుక జవాబు వస్తుందని ఆశించలేదు.

ఆశ్చర్యం! రెండు రావుల జవాబు ఆయన స్వదస్తూరీతో నాకు అంది, నన్ను ఆశ్చర్యపరచింది. తపాలా బంట్రోతు కాళహస్తి అనే అతను, అతడు కూడా వాసుదాసుగారి భక్తుడట. ఆ ఉత్తరం శ్రద్ధగా నా చేతికి అందించాడు. తపాలా పెట్టెలో పడవేయకుండా.

సంస్కృత కళాశాల అప్పుడు చాలాకాలం వరకు తిరుపతిలో శ్రీ గోవిందరాజ స్వామి ఉత్తర మాడవీథిలో మహంతు మఠం ధర్మశాలకు సమీపంలో, నమ్మాళ్వారు సన్నిధి ఆవరణలో ఉండేది. సన్నిధి చుట్టూ గదులు. సన్నిధి, వెనుకవైపు బావి. దక్షిణాభిముఖంగా ఉన్న పెద్దగేటులో ప్రవేశించగానే ఎడమవైపు కళాశాల కార్యాలయం, ప్రిన్సిపాలు గది. తర్వాత వరుసగా ఐదు గదులు. కుడివైపున కూడ కొన్ని గదులు, భోజనశాల, వంటగదులు. సన్నిధి వెనుక ఎడమ మూలలో రెండు మూడు గదులు. కుడిమూలలో మరుగుదొడ్లు, వెనుక మహంతు మఠం వీథి. సన్నిధి ఈ చివర నుంచి ఆ చివర వరకు దాదాపు అరవై గజాల పొడవు, అంతే వెడల్పుతో; పాఠశాలను ఆనుకొని జియ్యంగార్ల మఠం, దానికి ప్రక్కగా జగద్గురు అనంతాచార్యులవారనే మహావిద్వాంసుని భవనం, జియ్యంగారు మఠానికి అటువైపున ఆనుకొని మహామహోపాధ్యాయ కపిస్థలం దేశికాచార్యుల వారి ఇల్లు. ఆయన మా కళాశాల ప్రిన్సిపాలుగా ఉన్నవారు. నేను వెళ్లిన తర్వాత మహాద్వారానికి కుడిపక్కన ఒక పెద్ద హాలు కట్టారు. అక్కడ ఉదయం ఏడున్నరకు విద్యార్థుల హాజరీ తీసుకొనే వారు. ఆఫీసు గుమాస్తా పేరు పిలవగానే హాజరయిన విద్యార్థి 'ఏషోస్మి' (ఇదిగో ఉన్నాను) అని సమాధానం చెప్పాలి.

ఆ గదులలో మా నివాసం. ఒకవైపు పాఠ ప్రవచనాలు. పెద్దగదులు గనుక ఏడెనిమిది మంది ఉండేవారు. వావిలికొలను వారి సుదీర్ఘ లేఖను చదవడానికి అవకాశమే చిక్కేదికాదు. ఆ లేఖలోని విషయాలు విని నవ్వుతారేమోనని భయం. సమీపంలోనే ఉన్న గోవిందరాజస్వామి కోవెలకు వెళ్లి చదువుకున్నాను. మళ్లీ చదివాను. మరొకమారు చదివాను. అదొక గొప్పలేఖ. సాహిత్య వైద్య చరిత్రాది మూల్యాలున్న లేఖ. దానిని చాలాకాలం కాపాడుకున్నాను. నేను సత్యాగ్రహంలో కారాగారానికి వెళ్లినప్పుడు అది పోలీసులకు చిక్కి కానరాకుండా పోయింది. వలవల ఏడ్చాను. అంతకంటే ఏమి చేయగలను?

దాని సారాంశమిది. నాయనా, నీ ఆవేదన అర్థమైంది. శారీరకమయిన లోపానికి నీవేమీ బాధపడవద్దు. కొన్ని లోపాలను మనం సవరించుకోవచ్చు. ప్రపంచ చరిత్రలో నత్తివాళ్లు చాలా మంది ఉన్నారు. వారు తమ జీవితంలో గొప్పవాళ్లుగా పేరు పొందారు. గ్రీస్ దేశంలోని గొప్ప వక్తలలో ఒకరికి విపరీతమయిన నత్తి (అతని పేరు ఆయన వ్రాశారు గాని నేను మరచినాను). మహామేధావి. ఏమి చెబుదామన్నా నోరు పెగలదు. అందరూ పిచ్చివాడని, మూర్ఖుడని హేళన చేసేవారు. అతడు లోలోపలే కుమిలి

పోయేవాడు. ఒకనాడు సముద్రానికి అభిముఖుడై నిలిచి గొంతెత్తి "భగవంతుడా, నా బతుకు ఇంతేనా? నేను జీవితమంతా అవమాన పడవలసిందేనా?" అంటూ ఆవేదనతో అరవసాగినాడు. ఎంతసేపు అట్లా అరిచాడో తెలీదు. కళ్లు మూసుకొనే అరుస్తున్నాడు. అరుస్తూ అరుస్తూ వెనక్కి వెనక్కి తిరిగాడు. అనర్గళంగా భగవంతుని స్తుతులు ఆ అరుపులలో వెలువడ్డాయి. రెండు మూడు రోజులు గడిచాయి. కళ్లు తెరిచాడు. ఎదుట పెద్ద గుంపు. కనుచూపుమేర వరకూ గుంపు. భయపడిపోయాడు. తనను వెక్కిరించడమేకాక, చంపడానికి వచ్చారేమో వీళ్లంతా తన అరుపులు విని - అని అనుమానించాడు. పరుగెత్తిపోవడానికి ప్రయత్నించాడు. పరుగెత్తాడు. జనం వెంటబడి పట్టుకున్నారు. నన్ను హింసించకండి. నేను భగవంతునికి నా ఆవేదన నివేదించాను. మిమ్మల్ని పల్లెత్తుమాట అనలేదు - అని గింజులాడాడు. జనం ఆయనను సమాధానపెట్టి - మహానుభావ! నీ వింత గొప్ప వక్తవని అమూల్యమైన సూక్తులు కురిపిస్తావని మేం అనుకోలేదు. నీవు నిజమయిన తత్త్వవేత్తవు. మహావక్తవు. క్షమించు - అని కాళ్లావేళ్లా పడ్డారు. కంఠంలోని ధ్వనిక్రియకు సంబంధించిన కండరాలలోని లోపాల వల్ల కూడా నత్తి వస్తుంది. అవి ఉప్పుగాలి తగిలినా, నీటి వాలుగాలి తగిలినా బాగుపడే అవకాశం ఉంది. కనుక నీవు ఏ చెరువు గట్టు మీద నదీతీరం లోనో నీటికి అభిముఖంగా నిలబడి, నీవు చదివే పుస్తకాలలోని పాఠాలో శ్లోకాలో నోరు తెరిచి గట్టిగా చదువు. చిన్న కణికరాళ్ల ముక్కలను నోట్లో పెట్టుకొని గట్టిగా చదివితే ఆ రాళ్ల కదలిక వల్ల కండరాలలో మార్పు వస్తుంది. దీనితోపాటు సరస్వతీ ఘృతం, సరస్వతీ లేహ్యాం సేవించు, జానకీ వల్లభుడున్నూ, మహావ్యాకరణ వేత్త, బహుభాషా కోవిదుడు అయిన వాతాత్మజుడూ నీకు రక్షకులగుదురుగాక!

వావిలికొలను వారి ఉపదేశాన్ని నేను వెంటనే ఆచరణలో పెట్టాను. తిరుపతికి రేణిగుంట రైలు స్టేషనుల మధ్య ఉన్న తిరుచానూరు స్టేషను సమీపంలో ఒక పెద్ద పుష్కరిణి ఉండేది. దాని సమీపంలో ఒక మంటపం. దానిని 'పారువేట మటపం' అనేవారు. విజయదశమి నాడు గోవిందరాజస్వామి సీమోల్లంఘనం కోసం ఈ మండపంలో వేంచేసి పారువేటసేవ పొందుతాడు. నేను మెరిసే తెల్లటి కణిక రాళ్ల ముక్కలు నోటిలో గుచ్చుకోకుండా బాగా నూరి బుగ్గన పెట్టుకొని రైలు పట్టాల మీదుగా ప్రతి సాయంకాలమూ ఆ పుష్కరిణికి వెళ్లి గట్టుమీద నిలబడి, నాకు వచ్చిన స్తోత్రాలను,

ఆనాటి పాఠాలను గట్టిగా పఠించేవాడిని. ఇలా కొన్ని నెలలు చేశాను. ఆత్మవిశ్వాసం కలిగింది. మాటలలో స్పష్టత కలిగింది. నత్తి తగ్గింది. సముద్రం, ఏరు; లేనందున ఈ పుష్కరిణే దిక్కయింది.

నేను ప్రతి సాయంకాలమూ ఒంటరిగా ఎక్కడికి పోతున్నానో అని కొందరు ఆరాతీసి రహస్యంగా నా వెంట వచ్చి నా అరుపులు విన్నారు. నాలో కలిగిన మార్పు గమనించారు. వాళ్ల నోళ్లు మూతపడ్డాయి.

నత్తి చాలవరకు పోయిందికాని, 1990లో నాంపల్లి స్టేషను వద్ద ఒక ప్రమాదానికి గురి అయి, బోళ్లపడ్డాను. పళ్లు రాలిపోయాయి. మళ్లీ అప్పుడప్పుడు నత్తి రావడం ప్రారంభించింది. దీనిని నేను లెక్కపెట్టటం మానుకున్నాను.

"ప్రకృతి ప్రత్యయోపేతః సద్వృత్తః సాధుసమ్మతః
అర్థార్పణ సమర్థశ్చ సుశ్లోక ఇవ సజ్జనః"

**(మంచి శ్లోకం శ్లేషార్థంతో ప్రకృతి ప్రత్యయాలతో ఉంటుంది. మంచి వృత్తంతోనూ ఉంటూ అందరి ఆదరమూ పొందుతుంది. మంచి అర్థం ఇస్తుంది. సజ్జనుడు సహజంగానే విశ్వాసం కలిగిస్తాడు. మంచి వంశంలో పుట్టి మంచి వారందరి మన్ననా పొంది అవసరమయితే ధనాది సాహాయ్యం చేయగలిగి ఉంటాడు.**

# 27

# కళాశాలలో దినచర్య

"న కస్యచిత్ కశ్చి దిహ స్వభావాత్
భవ త్యుదారః అభిమతః ఖలోవా
లోకే గురుత్వం విపరీతతా వా
స్వచేష్టితాన్యేవ నరం నయంతి."

**(ఈ లోకంలో స్వభావంతోనే - పుట్టుకతోనే ఎవడూ ఎవరికీ ఇష్టుడో, దుష్టుడో, ఉదారుడో కాడు. మానవుడు తను చేసే పనుల వల్లనే గౌరవమో, అవమానమో, పొందుతున్నాడు. అందువలన కుటుంబంలోనూ సమాజంలోనూ గౌరవంగా ఉండదానికి మానవుడు న్యాయంగాను, నీతితోను వ్యవహరించాలి.)**

**తి**రుపతి సంస్కృత కళాశాల విద్యార్థి వసతి గృహంలో దాదాపు రెండు వందల మంది విద్యార్థులు ఉండేవారు. వీరిలో దాక్షిణాత్యులయిన తెలుగు, కన్నడ, తమిళ, మలయాళుల సంఖ్యే ఎక్కువయినా, అందులోను తెలుగువారి సంఖ్య పెద్దదయినా, మహారాష్ట్ర, గుజరాత, వంగ, బిహార, రాజస్థానాది రాష్ట్రాలవారూ ఉండేవారు. ఇతర రాష్ట్రాలవారితో వ్యవహారం మొదట్లో సైగలతోను, తర్వాత వచ్చీరాని సంస్కృతంతోనూ జరిగేది. వివిధ భాషల విద్యార్థులతో సహవాసం వల్ల సహపఠనం వల్ల కలిగిన లాభం నాకు ఉత్తర జీవితంలో ఉపయోగకరమయింది. ఆ సంస్కృత కళాశాల చిన్న భారతదేశమే. పాఠప్రవచనాలు ప్రధానంగా సంస్కృతంలోనే గనుక ఎలాటి ఇబ్బందీ లేదు, భాషలు వేరైనా.

నేను అక్కడ ప్రవేశించేటప్పటికి నా వయస్సు పదకొండేళ్లు. శిరోమణి తరగతిలో చదివే వాళ్లు ఇరవై, ఇరవై రెండేళ్ళ వాళ్ళు ఉండేవాళ్లు. ఇంత పెద్దవాళ్లు, చదువేమిటి? – అని ఆశ్చర్యపడేవాణ్ణి – ప్రపంచం తెలియక. క్షీరాబ్ధినాథశర్మ అనే విద్యార్థి ఉండేవాడు. అతడు బదరీనారాయణ క్షేత్రంలో స్థానాచార్యుడు. తమిళభాషలోని దివ్య ప్రబంధ పారాయణం ఆనువంశికవృత్తి. భగవద్రామానుజులు భక్తియోగప్రధానమయిన, హరి సర్వోత్తమత్వ ప్రతిపాదకమైన విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని ప్రచారం చేయడానికి దేశమంతటా పర్యటించినప్పుడు, వారు దర్శించి ఆరాధించిన క్షేత్రాలలో దివ్య ప్రబంధపారాయణం కూడా నియతంగా జరిగే ఏర్పాటు చేశారు. దానికోసం కొన్ని తమిళ శ్రీవైష్ణవ కుటుంబాలు అక్కడక్కడ స్థిరపడిపోయాయి. అలాటి కుటుంబాలలో ఒకటి క్షీరాబ్ధినాథశర్మ కుటుంబం. అలాటి కుటుంబాలు అయోధ్య, మధుర, కాశీ, గుజరాత్‌లోని దభోయి మున్నగు క్షేత్రాలలో ఉన్నాయి. దాదాపు వేయి సంవత్సరాలుగా అక్కడే ఉండడం వల్ల ఆ కుటుంబాల వారు మాతృభాష అయిన తమిళును మరిచారు. కాని దివ్యప్రబంధం వారి వృత్తికి సంబంధించింది గనుక వేదంలాగ దానిని వల్లె వేస్తారు.

క్షీరాబ్ధినాథశర్మకు అప్పటికే ఇరవైయేళ్ల వయస్సు. సంస్కృత, హిందీ విద్వాంసుడు. దివ్యప్రబంధాధ్యయనం కోసం తిరుపతి వచ్చాడు. తిరుపతి కళాశాలలో దివ్య ప్రబంధం నాలుగేళ్లకోర్సు. అప్పుడు చాలమందే చదివేవారు. జాతకర్మ, నామకరణాది, షోడశకర్మలకు వేదమంత్రాలు ఉన్నట్టు దివ్యప్రబంధంలోను ఉన్నాయి. చాల వర్గాలలో దివ్యప్రబంధం పాశురాలతో సకలకర్మలూ నిర్వర్తించడం నేటికీ ఉంది. బ్రాహ్మణ వైష్ణవులు కూడా పితృమేధంలో శుభస్వీకారం నాడు, వివాహాదులలోను తమిళ పాశురాలతో కొన్ని క్రియలు చేయిస్తారు. దీనివల్ల తమిళ సంప్రదాయాన్ని పాటించామని సంతృప్తి.

క్షీరాబ్ధినాథుడు నిర్ణయసాగర ప్రెస్ (బొంబాయి) వారు దేవనాగరి లిపిలో ముద్రించిన తిరువాయిమొళి మొదలయిన దివ్యప్రబంధ గ్రంథాలు ముందు పెట్టుకొని తిరుప్పావైనో, తిరుప్పళ్లి యెళుచ్చినో, తులసీదాస్ రామాయణం చదివినట్టు చదువుతుంటే ముచ్చటగా ఉండేది. అతడు నాలుగేళ్లూ ఆ విధంగా ప్రబంధాధ్య యనం చేసి, ఉత్తీర్ణుడై వెళ్లిపోయాడు. అటు తర్వాత ఎప్పుడో పదేళ్లకు కనిపించాడు యాత్రార్థిగా వచ్చి. నా హృదయంలో గాంధీజీ సిద్ధాంతానుసరణతో మొలకెత్తిన సమతాభావం, తిరుపతి కళాశాలతో వివిధ రాష్ట్రాల, వివిధ భాషల విద్యార్థులతోపాటు నివసించడం వల్ల బాగా విస్తరించింది.

అప్పుడు రాష్ట్రాలు పదిలోపే. తమిళ, తెలుగు కన్నడ, ఒరియా, మలయాళ ప్రాంతాలతో మద్రాసు రాష్ట్రం. మహారాష్ట్ర, కన్నడ, గుజరాత, సింధు హిందీ ప్రాంతాలతో బొంబాయి రాష్ట్రం. ఒరియా, అస్సాం, వంగ, బిహార్ ప్రాంతాలతో కలకత్తా రాష్ట్రం, యు.పి., సి.పి., పంజాబ్ సరిహద్దు రాష్ట్రాలు, తక్కిన ప్రాంతాలన్నీ, స్వదేశ సంస్థానాలు. తెలుగుప్రాంతంలో చాల భాగం, తమిళనాడు పూర్తిగా, కన్నడ మలయాళాలు సగం, మద్రాసు రాష్ట్రంలో ఉన్నందున ఈ భాషల వారికి సహజీవనం అనివార్యంగా ఉండేది.

'సమాన శీల వ్యసనేషు సఖ్యం' – అనే ఆర్యోక్తికి లక్ష్యంగా సమాన శీలస్వభావాలు గల కొందరం కలిసి ఉండేవాళ్లం. వయోభేదంగాని, తరగతి భేదంగాని అడ్డు వచ్చేవి గావు. నేను చాలమట్టుకు పై తరగతుల వారి సావాసంతోనే ఉండేవాడిని.

అప్పుడు తిరుపతి రైలు స్టేషనుకు ఫర్లాంగు కైవారంలో ఎలాంటి కట్టడాలూ లేవు. వరి, రాగి చేలు, వాటిలో దిగుడు బావులు. పంట కపిల నీళ్లతో జరిగేది, మేము తెల్లవారు జామున నాలుగు గంటలకు లేచి, గంటసేపు చదువుకొని, ఐదు గంటలకు జట్టుగా బయలుదేరి, పొలాల్లో కాలకృత్యాలు తీర్చుకొని బావులలో స్నానసంధ్యలు ముగించి కట్టుకున్న బట్టలు ఉదుకుకొని, ఆ తడిగుడ్డలతోనే మా గదులకు తిరిగి వచ్చేవాళ్లం – పోయేటప్పుడు, తిరిగి వచ్చేటప్పుడు, వెనుకటి దినం జరిగిన పాఠాలను ఆవృత్తి చేసుకొనేవాళ్లం. అప్పటికి దాదాపు 6.30 అయ్యేది.

ఉదయం ఏడు గంటలకు ప్రార్థన, హాజరీ. ఇదంతా అరగంట. ప్రార్థనలో వేంకటేశ్వర స్తోత్రం. అనంతరం తరగతులు మొదలయి పదిన్నర., పదకొండున్నర వరకు సాగేవి. పదకొండున్నర నుంచి ఒకటిన్నర వరకు భోజనకాలం. మళ్లీ రెండు గంటల నుంచి సాయంకాలం ఐదు గంటల వరకు పాఠాలు.

తక్కిన ఆంగ్ల పాఠశాలలకు ఆ కాలంలో వారంలో శని ఆదివారాలు సెలవు దినాలు. ఆ పద్ధతిలో సంస్కృత కళాశాలలకూ పక్షానికి నాలుగు దినాలు – పాడ్యమి, అష్టమి, చతుర్దశి, పూర్ణిమ. అమావాస్య, పాడ్యమినాడు మాత్రం పుస్తకం తాకే వాళ్లం కాదు. వాల్మీకి అశోకవనంలో సీతమ్మను "ప్రతిపద్ పాఠశీలస్య విద్యేవ తనుతాంగతా" అని వర్ణించాడు. పాడ్యమినాడు పాఠాలు చదివేవాడి చదువులాగ చిక్కిపోయిందట సీతమ్మ. కనుక పాడ్యమినాడు చదువుగాని, చింతనం గాని ససేమిరా ఉండేవి కావు. చింతనమంటే జరిగిన పాఠాన్ని మరొకరితో పాటు చదువుతూ పరిశీలించడం.

మా కళాశాలకు ఆటస్థలం ఏదీ ఉండేది కాదు. కనుక ఊరిబయటున్న నక్కలేరు ఇసుకలోనో, రౌండ్‌రోడ్ అనే మహంతు తోటలోనో, ఊరి బయట తిరుచానూరు రోడ్డులోనో పొలాలలోనో, ఆడుకొనేవాళ్లం,. ఆటలలో ప్రధానమైనవి బలిగుడ్ – కబడ్డీ, పరుగుపందేలు, పగ్గం లాగుడు, కాలిబంతి. నేను స్కూలులో చేరిన తర్వాత ఎప్పుడయినా ఇతర ఉన్నత పాఠశాలల విద్యార్థులతోపాటు బ్యాట్‌మింటన్ ఆడేవాడిని. కొన్నాళ్ల తర్వాత ఉదయం స్నానానికి పోకముందు, సాయంకాలాల్లోను దండీలు, బస్కీలు తీయడం, దేవస్థానం హైస్కూలు ఆవరణలోని పేర్లల్ బార్‌మీద పులప్స్ తీయడం అలవాటయింది.

వావిలికొలను సుబ్బరావుగారి బంధువొకరు కాశీ విశ్వవిద్యాలయంలో వ్యాయామ శిక్షకులుగా ఉండి స్కౌట్ మాస్టరుగా తిరుపతికి వచ్చారు. ఆయన పేరు నరసింగరావు గారు. మహోత్సాహి, కండలు తిరిగిన దండాలతో బంగారు మైచాయతో సమున్నత శరీరంతో, సుందరంగా, మరికొన్నిసార్లు చూద్దామా అని అనిపించేవారు. ఆయన మమ్ములను స్కౌట్ సంఘంలో చేర్చారు. దానితో సంస్కృత పాఠశాలవాళ్లు ఛాందసులు కారని, లోకానికి కూడా ఉపయోగపడతారని పేరు వచ్చింది. ఉత్సవాలు జరిగినప్పుడు గుంపులను సర్దడం, అగ్నిప్రమాదాలు జరిగినప్పుడు, ఇతర ప్రమాదాలు జరిగినప్పుడు సహాయపడడం వంటిపనులకు ముందుండేవాళ్లం. నా జట్టు నాయకుడు, నా సహాధ్యాయుడు గురుమూర్తి. ఇతను ఫోర్త్‌ఫారం వరకు చదివి పాఠశాలలో చేరాడు. తిరుమల దేవస్థానం పారుపత్తేదారు వేంకటశాస్త్రిగారికుమారుడు. తర్వాత నెల్లూరి ప్రముఖ న్యాయవాది, స్వాతంత్ర్య సమరయోధుడు ఓరుగంటి వెంకటసుబ్బయ్య గారి జామాత అయ్యాడు.

స్కౌట్‌గా నేను చాల మంచి పనులే చేశాను. తగలబడుతున్న హరిజనవాడలలో మంటలు ఆర్పడానికి నీళ్లు మోశాను. వాళ్ల పిల్లలను సురక్షిత ప్రాంతాలకు చేర్చాను. వాటుపడిన బండ్లను ఎత్తి, చిక్కుకుపోయిన వారిని ఆస్పత్రులకు చేర్చాను. రథోత్సవాల సమయంలో రథచక్రాల కింద పిల్లలు పడిపోకుండా శ్రద్ధతీసుకున్నాను. అన్నదానాలు జరుగుతున్నప్పుడు దొమ్మీలు జరగకుండా జాగరూకతతో ప్రవర్తించాను. గంగజాతర వంటి జాతరలలో తప్పిపోయిన పిల్లలను తల్లిదండ్రుల వద్దకు చేర్చాను. ఇవన్నీ తర్వాత నేను కాంగ్రెస్ కార్యక్రమంలో పాల్గొనడానికి దోహదం చేసే పరిచయాలకు తోడ్పడ్డాయి.

సాయంకాలం ఆటల తర్వాత సంధ్యావందనానంతరం ఉత్సవాల సమయంలో

విష్ణు సహస్రనామ పారాయణం చేసేవాళ్లం. రాత్రి ఎనిమిది గంటలకు భోజనం. పది పదకొండు వరకు చదువు. అప్పటికింకా విద్యుద్దీపాలు రాలేదు గనుక ఒక హరికేను లాంతరు చుట్టూ మూగి గోలగా చదివేవాళ్లం. మేము రాత్రులు గదిలో వున్నామో లేదో అని తనిఖీ చేయడానికి వంతులవారీగా ఉపాధ్యాయులూ, ప్రాంశు పాలుడూ (ప్రిన్సిపాలు) వచ్చేవాళ్లు.

కాని, మానవునికి సహజంగానే న్యాయబుద్ధి ఉండాలిగాని, తనిఖీలతో తెల్లవారు తుందా? రాత్రి సినిమాలకు వెళ్లేవాళ్లు దొంగచాటుగా వెళ్లనే వెళ్లేవాళ్లు. అప్పటికి టాకీలు ప్రాచుర్యం పొందలేదు. మూగసినిమాలే. సినిమా హాలులో కథకులు ఉండే వాళ్లు. వాళ్లు చెప్పిందే కథ. మాస్టర్ విఠల్, మాస్టర్ బచ్చూ, మాస్టర్ దాతార్ జనాదరం పొందిన నటులు. కమలాదేవి చట్టోపాధ్యాయ, సులోచన: విఖ్యాత నటీమణులు. నేను వారానికి రెండు మూడు సినిమాలయినా చూచేవాడిని. అణాకు నేల, రెండణాలకు బెంచీ, నాలుగణాలకు దర్జాగా కుర్చీ, మూక సినిమాల పిచ్చి నాకు బాగానే ఉండేది. తనిఖీలు, అనుమతుల బాధలేకుండా సెలవుల్లో రెండు మూడు చూచేవాడిని. సెలవుల్లోనూ తనిఖీ ఉండేదికాని, అంత తీవ్రంగా కాదు.

ధనుర్మాసంలో విద్యార్థుల దొక మహాసాహసం. అప్పుడు తిరుమలకు బస్సులు, రోడ్డూ లేవు. నడక లేక డోలి. ముసలివగ్గులయితే డోలీ. సామాన్యంగా యాత్రికు లందరూ నడిచే వెళ్లేవాళ్లు. మొదటి కొండ, మోకాళ్లపర్వతం ఎక్కడానికి కష్టపడవలసి వచ్చేది. ధనుర్మాసంలో ఊరంతా రంగరంగవైభవం. తిరుమలలోనైతే ప్రసాదాల కోసమయినా వెళ్లాలి. తెల్లవారు జామున చక్కెర పొంగలి, ఉక్కెర (హల్వా), ఉప్పు పొంగలి గుమగుమలాడే నేయి ఓడికలై పారుతుండగా దోసిలినిండా పెట్టేవారు. తినలేక ఇదయిపోయేవాళ్లం.

మేము పందేలతో కొండ ఎక్కేవాళ్లం. అడివారం (కొండ కింద ప్రాంతం) నుంచి కొండమీద శ్రీనివాసుని సన్నిధి వరకు దూరం ఐదున్నర, ఆరుమైళ్లు మెట్ల మీదుగా. కళాశాల నుంచి అడివారం వరకు దాదాపు మైలు. కొండ ఎక్కడానికి గంటన్నర, దిగడానికి గంట. స్నానాదులు ముగించుకొని నాలుగుకు బయలుదేరిన వాళ్లం, శ్రీనివాసుని దర్శించుకొని ప్రసాదం తిని, ప్రార్థన ముగిసి పేరు పిలిచేవేళకు "ఏషో స్మి" అంటూ చేరేవాళ్లం. పోటాపోటీలతో, పరుగులతో రెండున్నర గంటలలోపే తిరిగి



వచ్చి పందేలు కూడా గెలిచాను. దిగేటప్పుడు తూలిపడతామనే భయం ఉన్నా ఎక్కేటప్పుడు యమవేగంతో వెళ్లేవారం. మొదటి గాలిగోపురం దాటిన పిదప మోకాలి పర్వతం వరకూ దాదాపు సమతలమే కనుక పరుగులే. ఉపాధ్యాయులు అప్పుడప్పుడు మందలించేవారు, అలాటి సాహసాలు చేయవద్దని.

కొన్నాళ్ల తర్వాత, ఏవో కారణాల వల్ల భోజనశాల మూసివేసి, నెలకు పన్నెండు రూపాయలు విద్యార్థి వేతనం ఇచ్చేవారు. హోటలులో భోజనానికి ఎనిమిది రూపాయలు. అదీ ఎక్కువ అనుకుని ఐదున్నర, ఆరు రూపాయలకు భోజనాలు పెట్టే పూటకూళ్ల ఇళ్లలో భోజనం చేసేవాళ్లం. ముప్పూటలా భోజనం. భోజనశాల మూసివేసినందున మా తరగతుల సమయం కూడా తొమ్మిది నుంచి పన్నెండు. రెండు నుంచి ఐదుకు మారింది. కనుక ముప్పొద్దులా ఉదయం 8.30కు, మధ్యాహ్నం ఒంటి గంటకు, రాత్రి

7.30, 8.00కి సుష్టుగా తినేవాళ్లం. పూటకూటిల్లు నడిపేవారు మధ్వ బ్రాహ్మణ దంపతులు. ఎప్పుడూ పండుగలూ, పబ్బాలే!

కొంతకాలం తర్వాత నాకు మేనమామ వరస అయిన మా బంధువొకరు విద్యార్థిగా చేరాడు. ఆయన తనతోపాటు ఉండమన్నాడు. ఆయన ఇంటి ఖర్చంతా అందరికీ పంచేవాడు. నెలకు ఐదు రూపాయలు ఎక్కితక్కి. ఎండాకాలం సెలవులకు వెళ్లేముందు ఎనభై - డెభ్బై రూపాయలు చేతికి ఇచ్చేవాడు. ఆశ్చర్యపడేవాణ్ని. మా ప్రాంతాలలో దొరకని నూవుల నూనె మొదలయినవి, నారాయణవరం చీరలు, చెల్లెండ్లకు ఎర్రచందనం బొమ్మలు తీసుకొని వెళ్లేవాడిని. ఊరికంతా నేను మంచి కుమారుణ్ణి. తిరుపతి చుట్టుపట్ల కరివేపాకు చెట్లు, దూది నిమ్మచెట్లు, కలిమిచెట్లు (వాక్కాయచెట్లు) అడవుల్లాగా పెరిగేవి. నేను బస్తాలలో కరివేపాకు, కలిమికాయలూ, దూదినిమ్మకాయలూ తీసుకువెళ్లేవాడిని. ఇవన్నీ కొన్నవి కావు. అడవి. కోసుకోనివాడు పాపాత్ముడు. మా అమ్మ 'మావాడు తెచ్చింది' అంటూ బంధువులకంతా పంచేది. నూవులనూనె వీశ (ఐదు సేర్లు) నాలుగణాలు. నెయ్యి వీశ రూపాయిన్నర.

నన్ను చూచిన మా అమ్మ, నాన్న, తాత, పినతండ్రులు 'పిల్లవాడు పరాయిచోట ఉన్నా మిసమిసలాడుతూ నిండుగా ఉన్నాడు' అని అనుకొనేవారు. నేను ఇతరులతో బాగా ప్రవర్తించేవాడిని కనుకనూ ఆరోగ్యంగా ఉండేవాడిని.

**"హితాహితం మనుష్యాణాం**<br>
**కేవలం వచసి స్థితమ్**<br>
**తస్మాత్ సంయోజయే ద్వాచం**<br>
**అప్రమత్తః నిరీక్ష్య చ"**

**(మానవుల మేలు, కీడు వారి మాటలపై ఆధారపడి ఉంది కనుక ఎలాటి పొరపాటు లేకుండా ఎంతో ఆలోచించి మాట్లాడాలి.)**

# 28

# శిష్యవత్సలులు మా గురువులు

"సత్యం తపో జ్ఞాన మహింసతా చ
విద్వత్ప్రణామం చ సుశీలతా చ,
ఏతాని యో ధారయతే స విద్వాన్
న కేవలం యః పఠతే స విద్వాన్"

**(సత్యం, తపస్సు, జ్ఞానం, అహింసాగుణం, విద్వాంసులను సేవించడం, ఉత్తమ శీలం - ఈ గుణాలున్నవాడే విద్వాంసుడు. వట్టి చదువుతో విద్వాంసుడు కాడు.)**

**మా**కు పాఠ్య విషయంగా ఉన్న మనుస్మృతి, గౌతమ ధర్మసూత్రాలలో గురువులు శిష్యులను ఎలా చూచుకోవాలో చాల చెప్పారు. అలాగే శిష్యుల ప్రవర్తనను గురించీని. ఆంధ్రుడయిన ఆపస్తంభుడు "పుత్రమివైన మనుకాంక్షన్ సర్వధర్మేష్వ నవచ్ఛాయా మానః సుయుక్తో విద్యాం గ్రాహయేత్-" శిష్యుణ్ణి తన పుత్రునివలె చూస్తూ ఏ విషయాన్నీ కప్పిపెట్టకుండా శ్రద్ధతో విద్యనేర్పాలి అంటాడు. "నచైన మధ్యయన విఘ్నేన ఆత్మార్థేషు ఉపరుంధ్యాత్ అనాపత్సు" శిష్యుణ్ణి అతని చదువుకు విఘ్నం కలిగించేట్టు తన పనులకు ఉపయోగించరాదు. ఆపత్సమయంలో మట్టుకు పరవాలేదు అనికూడా అన్నాడు, ఆపస్తంభుడు.

గౌతమ ధర్మసూత్రకారుడయితే 'శిష్యశిష్టిః అవధేన అశక్తౌ? రజ్జు? వేణు? విదాలాభ్యాం తనుభ్యాం.' గురువు శిష్యుణ్ణి కొట్టరాదు. బెదరింపులతోనే శిక్షించాలి. బెదరింపులతో వాడు బాగుపడకపోతే, సన్నని పగ్గంతోగాని, పలచని వెదురుబద్దతోగాని

నెమ్మదిగా కొట్టాలి – అంటాడు.

అవి చదువుతున్నప్పుడు నాకు మా గురువుగార్ల వంటివాళ్లను చూచే ధర్మశాస్త్ర కారులు తమ సూత్రాలు రచించారా – అని అనిపించేది. మా గురువుల వ్యక్తిగత జీవితాలు మాకు తెలియవు. మేము తెలుసుకుందామనే రంధ్రాన్వేషణకు ఎప్పుడూ పూనుకోలేదు. వారు మాతో ప్రవర్తించిన తీరు చాలు – వారి వైయక్తిక జీవితమూ పవిత్రంగా ఉంది – అనడానికి. వారి వాత్సల్యం ఎంతటి దుష్టచిత్తుణ్ణయినా శిష్టుణ్ణి చేసేది. వారి బోధన విధానం ఎంత మూర్ఖుణ్ణయినా, ప్రబుద్ధుణ్ణి చేసేది.

మొదట్లో తరగతులలో గురువుగారికి మాత్రం ఎత్తయిన పీఠం, విద్యార్థులకు పొడుగాటి ఏకఖండమయిన పీటలు ఉండేవి. క్రమంగా గురువులకు కుర్చీలు, విద్యార్థులకు పీటలతోపాటు పాతకాలపు సందూకు బల్లలు వచ్చాయి. ఆయుర్వేదం తరగతులు పెట్టిన తర్వాత విద్యార్థులకూ బెంచీలు వచ్చాయి.

ధర్మపురి కృష్ణమాచార్యులు, రఘువీరదాస్, వరదాచార్యులు, ఆడయపళం రామనాథశాస్త్రులు, చక్రాల లక్ష్మీనరసింహశాస్త్రులు, గిరిధరాచార్యులు, కపిస్థలం కృష్ణమాచార్యులుగార్లు, మరికొందరు కావ్యనాటకాలు చెప్పేవారు. కపిస్థలం కృష్ణమాచార్యులుగారు మహామహోపాధ్యాయ కపిస్థలం దేశికాచార్యులవాకి అన్న కుమారులు. జాతీయవాది. ముతక ఖద్దరు ధరించేవారు. బి.ఏ.ఎల్.టి. అయి దేవస్థానం హైస్కూలులో హెడ్మాస్టరుగా ఉండి సంస్కృత కళాశాలకు వచ్చినవారు. శాకుంతలాది నాటకాలు చెప్పేవారు. గిరిధరాచార్యులవారు కువలయానందం, ధ్వన్యాలోకం, ప్రతాప రుద్రీయం మొదలయిన అలంకార గ్రంథాలు చెప్పేవారు.

చక్రవర్తి భట్టాచార్యులు, వేంకటేశదీక్షితులు, పురిశై కృష్ణమాచార్యులు, మహా మహోపాధ్యాయ సేతుమాధవాచార్యులుగార్లు పై తరగతులకు రసగంగాధరం, కావ్య ప్రకాశం, చిత్రమీమాంస, న్యాయ, వ్యాకరణ, వేదాంత, మీమాంసాది శాస్త్ర గ్రంథాలూ చెప్పేవారు.

మాకు తెలుగు–సంస్కృత అనువాదం ఒక పీరియడ్. దీనికి శఠగోపాలాచార్యులు గారనే వారు ఉపాధ్యాయులు. ఆయనకు ప్రిన్సిపాలు సేలం సుబ్బారావుగారిపై కోపం వచ్చింది. "ఒరేయ్! వ్రాయండిరా, ఈ ప్రిన్సిపాలు సేలం సుబ్బారావు. సెలవు అడిగితే ఇవ్వడు – సంస్కృతంలో అనువాదం చేయండి" అనేవారు. మేము గురువుగారి మాట

ధిక్కరించలేక; అనువాదం చేస్తే ఏం ముంచుకు వస్తుందోనన్న భయం చేత; తటపటాయించాము. గురువుగారికి కోపం చల్లారినతర్వాత, "నా కోపం మీకెందుకు? అని వ్రాయకండి" అన్నారు. నమ్మయ్య గారని వారి మారు పేరు. నిష్కపట హృదయులు.

పురిశై కృష్ణమాచార్యులవారు న్యాయవేదాంతాలంకార శాస్త్రాల్లో గొప్ప విద్వాంసులు. ఉత్తర భారతం నుంచి రామానుజుల శ్రీభాష్యం సేవించడానికి (అధ్యయనం చేయడానికి) ఎందరో ఏటా వచ్చేవారు. భాష్యశాంతి అయినప్పుడెల్లా విద్యార్థులకు విందు. ఆయన తర్క ప్రకరణ గ్రంథం ముక్తావళి చెప్పారు మాకు. తేజో భావ ఏవ తమ:- చీకటి అనేది ఒక పదార్థం కాదు, వెలుతురు లేకపోవడమే చీకటి - అంటూ ఉపన్యసిస్తూంటే, ఆశ్చర్యకరంగా ఉండేది. వాటిని నేను శ్లోకరూపంలో రాస్తున్నాను. "అబ్బాయి! ఏమి వ్రాస్తున్నావు? అనడిగారు. చూపాను. ఇది తర్కం తరగతి. కవిత్వం తరగతి కాదు - అని నవ్వేరు. - ఏషా న్యాయశాస్త్ర కక్ష్యా, న కవితాయా.

"రసో వైసః" అనే ఉపనిషద్వాక్యం కావ్యరసానికి అన్వయించడం న్యాయం కాదండీ, అభినవగుప్తుల మతంలో రసచర్వణాత్మకమైన సుఖం లౌకికసుఖం కన్నా ఒక మెట్టు ఎక్కువే కాని, పరమేశ్వర విశ్రాంత్యానందం ఎంత మాత్రం కాదని స్పష్టంగా ఉండగా జగన్నాథుడు అభినవగుప్తుల వాక్యాన్ని అపార్థం చేసుకున్నట్టు తోస్తుందండీ" అని ఒకమారు వాదించాను. నా వాదం ఆయన ప్రేమతో శ్రద్ధగా విని, "జగన్నాథుని వాదం జగన్నాథుని స్థాయిని తెలుపుతుంది. అంతే. అంత మాత్రాన లౌకికవిషయ సుఖానందం కన్నా కొంచెం పై స్థాయి అయిన కావ్యానందం బ్రహ్మానంద సదృశం కాదు గదా! దానికి గింజుకోడం ఎందుకు? రసాలంకారాలలోను, వేదాంత విషయాలలోను ఎన్ని వాదాలు లేవు? ద్వైతవిశిష్టాద్వైత ప్రస్థానాలు రాగానే అద్వైత ప్రస్థానం మాయమైపోయిందా? అన్నారు. అదీ వారి విచక్షణా, ఔదార్యమూను!

నాకు - నాకేమిటీ, అందరికీని - గిరిధరాచార్యుల వారి వద్ద చాల చనువు. నైషధం వంటి విద్వదౌషధాన్ని, చిత్రమీమాంస వంటి విచిత్ర శాస్త్ర గ్రంథాన్ని వారు కథలాగ, నవలలాగ చెప్పేవారు. ఆయన మంచి పౌరాణికులు. హనుమంతుడు సీతమ్మకు అందజేసిన రాముని అంగుళీయకంపైన ఉన్న రామ అనే అక్షరాలు రెండింటిపై ఇరవై రోజులు పురాణం చెప్పారు. ఒకమారు ఆయన ఏదో సందర్భంలో "తెల్లవారు జామున మెలకువ రావడం లేదు" అని అన్నారు. మేము ఇరవై మందిమి పావలా పావలా

చందా వేసుకొని ఐదు రూపాయలకు ఒక బిగ్‌బెన్ అలారం గడియారం కొని బహూకరించాము బలవంతంగా ఆయన వద్దంటున్నా. ఆయన ఉద్యోగ విరమణ చేసి మద్రాసులో ఉన్నప్పుడు, 1960 ప్రాంతంలో నేను దర్శించగా, “మీరు బహూకరించిన గడియారం ఇదిగో! అని గూటిలోని గడియారం చూపారు, అదీ వారి సౌజన్యం!

చక్రాల లక్ష్మీనరసింహశాస్త్రి గారు మాకు సిద్ధాంత కౌముది ప్రారంభించారు. ఇదొక రగడతో ప్రారంభమయింది. మా తరగతిలో రామరెడ్డి, లక్ష్మణరెడ్డి, రుద్రపిళ్లే, సుబ్బరామపిళ్లే అనే బ్రాహ్మణేతర విద్యార్థులు, రాఘవయ్య అనే చాత్తాద వైష్ణవుడు ఉండేవారు. వ్యాకరణం వేదాంగం గనుక శూద్రులకు నేను పాఠం చెప్పనని భీష్మించుకొని కొన్ని నెలలు పాఠం చెప్పలేదు శాస్త్రిగారు. అదొక ఉద్యమం అయింది. ‘జ్ఞానం అందరి హక్కు’ అని ఆ విద్యార్థులు, వారి వెంట స్థానిక ప్రముఖులూ పట్టుబట్టారు. కౌముది చెప్పకపోతే, ఉద్యోగం పోయే పరిస్థితి ఏర్పడింది. చక్రాల వారు దానికి కూడ సిద్ధమయ్యారు. ప్రిన్సిపాల్ సుబ్బారావుగారూ తిరుమల తిరుపతి దేవస్థానం పేష్కారూ జోక్యం చేసుకొని, శాస్త్రిగారికి నచ్చజెప్పి, ఆ విద్యార్థులు చిట్టవరకు కూర్చునేట్టు, వారిని చూడనవసరం లేకే పాఠం జరిగేట్టు; రాజీ కుదిర్చారు. ఆ విద్యార్థులు శ్రద్ధాళువులు. నిజంగా గురుభక్తులు. గనుక క్రమంగా చక్రాలవారి మనస్సు మారి, జ్ఞానం భగవత్స్వరూపం, భగవంతుడే ఇలా సంకల్పించినప్పుడు నే నెంతవాడిని? అని సర్దుకుపోయారు. ఆయన మాకు ప్రతాపరుద్రీయం చెప్పారు. ఎప్పటికప్పుడు అన్నీ వల్లించాల్సిందే. నాకు జ్ఞాపకశక్తి బాగానే ఉన్నా బద్ధకించేవాడిని. ఐదోవాడుగానో, ఆరోవాడుగానో కూర్చుని, ఆరుసార్లు విని అప్పజెప్పేవాడిని. ఇది గ్రహించారు గురువుగారు. మందహాసం చేసేవారు. అదీ వారి లౌక్యం!

కపిస్థలం కృష్ణమాచార్యులుగారు మాకు నాటకాలే కాక సంస్కృత సాహిత్య చరిత్ర, తులనాత్మక భాషాచరిత్ర (కంపేరిటివ్ ఫైలాలజీ) చెప్పేవారు. ఆయన కవి. గోవిందరాజస్వామి రథోత్సవం వస్తువుగా ఒక సంస్కృతభాణం కూడ రచించారు. నాలాగే ఆయనకూ అప్పుడప్పుడు నత్తి. నత్తి వచ్చినపుడు, దానిని కప్పిపుచ్చుకొన డానికి పదాలను నొక్కేవారు – య్యాస్యత్యద్య శకుంత్తలేతి హృదయం సంస్పృష్ట ముత్కంఠయా – ఇలా ఉండేది. ఇతర భాషల నాటకాల విషయాలను తులనాత్మకంగా పరామర్శించేవారు. ఆయన కుమారుడు కపిస్థలం శ్రీరంగాచార్యులు, తిరుపతి నవ కవులలో ఒకరు. గొప్ప

వ్యుత్పన్నుడు. అకాలంలో మరణించాడు.

మాకు ఒక పీరియడ్ ఇంగ్లీషు, ఒక పీరియడ్ ఆయుర్వేదం, ఒక పీరియడ్ వేదపాఠం, కొంతకాలం జ్యోతిషం కూడా ఉండేది. ఇంగ్లీషు ఉపాధ్యాయులు వెంకాస్వామిగారు. ఆయన గొప్ప దేశభక్తుడు. రవీంద్రాభిమాని, ఈ పీరియడ్‌లోను తెలుగు వ్యాసరచన ఉండేది. ఆయన రవీంద్రుని గీతాంజలి ఉదాహరిస్తూ తిలక్, గాంధీల వాక్యాలు వివరిస్తూ పరోక్షంగా దేశభక్తి ప్రబోధించేవారు. వ్యాసం వ్రాస్తే, దాని విషయానికి ఆకరాలు అధస్సూచికలలో సూచించాలనేవారు. వ్యాసరచనా విధానానికి ఆంగ్ల రచయితల రచనలు చెప్పేవారు. ఒకమారు సౌందర్యం అంటే ఏమిటి? అనే విషయంపై మూడు పుటల వ్యాసం వ్రాయమన్నారు ఆయన. అందరి వ్యాసాలు పరిశీలిస్తూ, నాది చేత్తో పుచ్చుకొని 'ఇది చాలా బాగుంది, కాని మార్కులు తక్కువ. ఎందుకంటే, తనకు తెలియని విషయాలు ఎక్కడి నుంచైనా గ్రహించి నప్పుడు అధస్సూచికలలోగాని, చివరగాని ఆ ఆకరాలను సూచించలేదు కాబట్టి'. అంటూ చెప్పి, "ఇలా చేయకు, జీవితమంతా ఈ విషయం పాటించాలి. ఎవరూ పుట్టుకతోనే సర్వజ్ఞుడు కాడు. ఇతరుల నుంచి నేర్చుకోవలసిందే. కాని విశిష్టమయిన విషయం గ్రహించినప్పుడు ఆకరం తెలుపడం రచయిత కనిష్ఠ ధర్మం, దీనివల్ల మన ప్రామాణికత, నిజాయితీ పెరుగుతాయి. నీదే ఫస్ట్ మార్కు, బాగా వ్రాశావు గనుక" అన్నారు. అదీ ఆయన నాకు ప్రసాదించిన యావజ్జీవపాథేయామృతం. ఆయన తర్వాత కృష్ణరావనే వారు వచ్చారు.

చక్రవర్తి భట్టాచార్యులుగారు షట్‌శాస్త్ర పండితులు, వ్యాకరణంలో శబ్దేందుశేఖరం, పరిభాషేందుశేఖరం, మహాభాష్యం, తర్కశాస్త్రంలో న్యాయకుసుమాంజలి గదాధరీయం మొదలుకొని కింది తరగతుల వరకూ పాఠం చెప్పేవారు. మంచి వాక్కు. జ్యోతిషంలో ఉద్దండులు. నా జాతకం ఇమ్మన్నారు. ఒకమారు ఇచ్చాను. "నీది చంచలంరా స్వభావం. మూడు గ్రహాలు స్వస్థానం. షష్ఠాష్టమ ద్వాదశాధిపతులు పరస్పరదృష్టి కల విపరీత రాజయోగం, గొప్ప కవివో, పండితుడివో కావాలి. కాని చంద్ర నీచ, శని దృష్టి. అంశలో శుక్రనీచ, మనస్సును స్థిరంగా ఉండనీయదు. దేశ దిమ్మరి బతుకు. బుధునికి నవమషష్ఠాధిపత్యం, డబ్బూ అంతంతే. మకరలగ్నానికి గురువు యోగిస్తాడంటారు. ఎప్పుడో ముసలితనంలో మంచి కలిగే అవకాశం. మంచి వయస్సంతా శుక్రుడు పాడుచేశాడు. ఛ్ఛ!ఛ్ఛ!" అన్నారు. వైఖానసాగమంలోను ఆయన పారంగతుడు. మా



కళాశాలలో వైఖానస విద్యార్థులు చదివేవారు. తిరుమల తిరుపతి దేవాలయాలలో ఆరాధన వైఖానసాగమానుసారి.

నిజానికి వైఖానసులు అతి ప్రాచీన వైష్ణవులు. ఈ ఆగమానుయాయులు వంగ దేశంలోను ఉన్నారు. నాకు లాహోర్‌లో భట్టాచార్య అనే పండితుడు పరిచయ మయ్యాడు. సంస్కృత పరీక్షలెన్నో కడతేరాడు. కాని, ఉద్యోగంలేక లాహోర్‌లో పెద్ద సంఖ్యలో ఉన్న వంగీయుల ఇళ్లలో పౌరోహిత్యం చేసేవాడు. అతనిని వాళ్లు కులీనాతి కులీన బ్రాహ్మణుడంటూ చాల గౌరవించేవారు. తను వైఖానస సూత్రం వాడినని, తమ పూర్వులు ఆంధ్రదేశం నుంచి వంగదేశానికి వలస వచ్చారనీ ఆయన అనేవాడు.

ఇంతటి గురువుల సన్నిధిలో ఉన్న నాకు మనస్సు ఎంతో పరిపక్వం కావలసింది కాని; గురువులు ఆశించినంతగా కాలేదు.ప్రతి గురువూ నేను అన్నిటా పరాకాష్ఠకు చేరుతాననే ఆశించారు. కాని, చక్రవర్తి భట్టాచార్యులు ఒక్కరే సరిగ్గా అంచనా వేశారనిపిస్తుంది. మూర్ఖత్వం అలాటిది!

**"మూర్ఖ చిహ్నాని షడితి**
**గర్వో దుర్వచనం ముఖే**
**విరోధి విషవాదీ చ**
**కృత్యాకృత్యం న మన్యతే."**

**(మూర్ఖుని లక్షణాలు ఆరు: గర్వం, పరుషమైన పలుకు, విరోధం, చెడ్డగా వాదించడం, చేయదగిందేది, చేయదగందేది అనే పరిజ్ఞానం లేకపోవడం.)**

# 29

# హాఫీరాంజీ నమిలిన అల్యాకు

"గురో రధీతాఖిల వైద్య విద్యః
పీయూషపాణిః కుశలః క్రియాసుః
గత స్పృహో ధైర్యధరః కృపాళుః
శుద్ధో ధికారీ భిషగీదృశః స్యాత్"

**(పూర్వులు వైద్యునికి ఉండవలసిన లక్షణాలను గురించి చాల చాల చెప్పారు. వైద్యశాస్త్రాన్ని గురుముఖంగా అధ్యయనం చేసినవాడయి ఉండాలి. అంత మాత్రం చాలదు. చికిత్సాక్రియలలో సమర్థుడుగా ఉండాలి. ధనాశలేని వాడయి ఉండాలి. మందు కోసం ఎవడన్నా వచ్చాడా, వాణ్ణి పీల్చి పిప్పి చేద్దామనే ఆశాపాతకుడయి ఉండరాదు. ఎలాటి జబ్బయినా మాన్పగలననే ధైర్యం గలవాడయి ఉండాలి. పరిశుద్ధచరిత్రుడుగా ఉండాలి. అన్నిటిని మించి అమృతహస్తుడయి ఉండాలి. అంటే చెయి వాసి బాగుండాలి. ఇలాటి వాడే వైద్యం చేయడానికి అర్హుడు.)**

ఇలాటి సర్వలక్షణాలు గలవారు మా ఆయుర్వేదాచార్యులు చింతపల్లి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ఆయన సుప్రసిద్ధ భిషగ్వరులు. పండితదీవి గోపాలాచార్యుల వారి ప్రథమశిష్య బృందంలో ప్రథములు. ఆయుర్వేదమంటే పిచ్చివాళ్ల పంచాయితీ అని, దానిని నిషేధించాలి అని బ్రిటిష్ ప్రభుత్వం తలపోసి, అది అశాస్త్రీయమని నిరూపించడానికి ఒక సంఘాన్ని నియమించి, దానితో అశ్వగంధ, బలాతిబల వంటి

మహామూలికలు నిరుపయోగమయిన మొక్కలని నిర్ణయింపజేసి, సహస్రాబ్దాలుగా భరతభూమిలో ఉన్న ఆయుర్వేదశాస్త్రాన్ని మూలమట్టంగా పాతిపెట్టడానికి ప్రయత్నించినప్పుడు, భారత వైద్యప్రతినిధిగా ఏకాంగవీరుడుగా ఎదిరించి నిలిచి, ఆయుర్వేద కాంగ్రెస్ అనే మహాసంస్థను స్థాపించి, ఆసేతుశీతనగం, ఆరంగూన్ కాబూలం పర్యటించి, మహాపండితులను ఏకంచేసి, సంస్కృతంలో ప్రచారం చేసి, తమ మహోద్యమానికి బాసటగా మద్రాసులో ఆయుర్వేద కళాశాలను స్థాపించి, పెక్కు ఆయుర్వేద గ్రంథాలకు వ్యాఖ్యలు రాసి ప్రచురించి, ఆయుర్వేదం మహోన్నత మయిన వైద్యవిధానమని ప్రపంచానికి చాటిన మహనీయులు గోపాలాచార్యులు.

ఆయన మద్రాసు కన్యకాపరమేశ్వరి ఆయుర్వేద వైద్యశాలలో వైద్యులు. గుర్రబ్బగ్గీలో తప్ప పయనించేవారు కారు. అప్పుడు సివిల్ సర్జనయిన ఆంగ్లేయుడు ఐదు రూపాయల ఫీజు తీసుకొనేవాడట. గోపాలాచార్యులు అలాగే తీసుకొనేవారట. ఆయన స్థాపించిన ఆయుర్వేద కళాశాలలో భారతదేశంలోని అన్ని ప్రాంతాలవారూ విద్యార్థులు. బోధనం సంస్కృతంలో. నా పినతండ్రిగారి ప్రథమ కళత్రం పుట్టినిల్లు మద్రాసు కావడం వల్ల గోపాలాచార్యులు గారిని, వారు పరమపదించే ముందు దర్శించుకొన్నాను. తలపాగా, ఊర్ధ్వపుండ్రాలతో వెలిగిపోతున్న ఫాలం. వర్చస్సు, గాంభీర్యం, కరుణ ఉట్టిపడే ముఖం. ఆయన వైద్యాన్ని గురించి, ఔదార్యాన్ని గురించి ఎన్నో కథలు వినేవాణ్ణి.

ఆ కళాశాలలో చదివిన మొదటి జట్టువారు మా ఆయుర్వేదాచార్యులు. గురువు లంతటివారు. నాలుగేళ్లు చదివి 'ఆయుర్వేద భూషణ' అనే బిరుదు పొందినవారు. తమకు వచ్చిందంతా నూరిపోయాలని ఆయన తృష్ణ. అష్టాంగహృదయం సూత్ర స్థానం సర్వాంగ సుందర వ్యాఖ్యతో కంఠపాఠం చేయించారు. అలాగే చరక సంహిత చికిత్సాస్థానం, మాధవనిదానం, కౌమారభృత్యం, సుశ్రుత సంహిత శారీరస్థానం, అగదతంత్రం – ఒకటేమిటి, అన్నీ కంఠస్థం.

అప్పటికే ఆయన వయస్సు ఏభయికిపైనే. మాకు మూలికా విజ్ఞానం కోసం కపిలతీర్థం, జాబాలి తీర్థం, పాపనాశం, ఆకాశగంగ ప్రాంతాల అడవులకు జట్లు జట్లుగా పిలుచుకొని వెళ్లి, ఇది అశ్వగంధ, ఇది గోక్షురం, ఇది నేలతాడి అంటూ వివిధ మూలికలు చూపి వాటి గుణాలు ఉపన్యసించేవారు.

ఇక ఓషధీ విజ్ఞాన యాత్ర సంగతి. పది పదహైదు మంది ఆయనతోపాటు కపిలతీర్థం

వెళ్లాము. ఆయన నిక్కరు ధరించి, హాఫ్ ఆరం వేసుకొని, చేతిలో ఒక బాణాకర్ర పట్టుకొని బయలుదేరారు. కపిలతీర్థం కొండ ఎక్కి జలపాతం సమీపంలోని మూలికలను పరిశీలిస్తూ ఉన్నాం. "అబ్బాయిలూ! ఆగండి!" అన్నారు గురువుగారు. ఏ పామో, పుట్రో అని భయపడి ఎక్కడివారక్కడ నిలబడిపోయాము. ఆయన చేతిలోని బాణాకర్ర ఎత్తిచూపుతూ "అదిగో చూడండి. పొదలాగ పెరిగి ఉందే, చిన్న పొన్నగంటి ఆకుల లాగ దళసరిగా, దానిని చూడండి. పరుగెత్తండి" అన్నారు. మేము ఆజ్ఞపాటించాం. "తలా ఒక ఆకు తెంపుకొని నోట్లోవేసుకొని నమలండి" అని రెండవ ఆజ్ఞ. "ఎలా ఉంది?" మేము నమిలాము. వెర్రితీపి. అతి మధురంకన్నా తీపి. రసం మింగగానే ఏదో కొత్తబలం వచ్చినట్లనిపించింది. "ఎలా ఉందో చెప్పండి" – అంటున్న గురువుగారికి మా మా అనుభవాలు చెప్పాము.

"కూచోండి. దీనికొక పెద్ద కథ ఉంది" అంటూ ప్రారంభించారు. మేము సావధానులమై విన్నాము. "దీని పేరు అల్లి ఆకు, అల్యాకు అనీ అంటారు. తిరుపతిలో మన కళాశాల పక్కనే ఉన్న మహంత్ మఠం ఉందే, ఆ మఠంలో హాథీరాంజీ అనే మహంతుగారు నా చిన్నతనంలో ఉండేవారు. ఆయన మహాసుందరుడు, బలాఢ్యుడు, తిరుపతికి పడమరగా రెండు మైళ్ల దూరంలో రింగ్‌రోడ్ తోట ఉందే, అక్కడ పెద్ద పెద్ద రాతి గుండ్లు మీరు చూచే ఉంటారు. వాటిని బంతిలాగ ఎగురవేస్తూ వ్యాయామం చేసేవాడు. ఆయన ఈ అల్యాకు గుప్పెడు నోట్లో వేసుకొని నమిలి రసం మింగి నెల రోజులు ఆహారమేమీ లేకుండా తపస్సు చేసేవాడు. అలాగే మరో గుప్పెడు నమిలి రసం మింగి యోగసమాధిలో నెలల తరబడి ఉండేవాడు. అదంతా ఈ అల్యాకు మహిమే. ఇది నాలుగైదాకులు తింటే ఆకలి ఉండదు. మరికొన్ని ఆకులు కోసుకొని జేబులు నింపుకోండి. మీ మిత్రులకు చూపండి. గొప్ప ఓషధి" అని ముగించారు.

మేము ఆయన మాటలన్నీ విని, మరి రెండాకులు నమిలి, మరికొన్ని ఓషధులను తెలుసుకోడానికి బయలుదేరాము. కాని, నా మనస్సులో హాథీరాంజీ చివరకు ఏమయ్యాడో తెలుసుకుందామనే ఆశ కెలకవేసింది, "సార్! హాథీరాంజీ సంగతి పూర్తిగా చెప్పలేదే?" అన్నాను. "పాపం, అంతటివాడూ మోసపోయాడు. ఒక యోగిని తిరుపతికి వచ్చింది. అతనితో యోగవిద్యలో వాదానికి దిగింది. ఆయనను గెలవలేక పోయింది. నన్ను పురుషశక్తితో ఓడించు. అప్పుడు నేను ఓడిపోయినట్టు – అని సవాలు చేసింది.



అమాయకుడు ఆ మోసం గ్రహించలేకపోయాడు. ఓడిపోయాడు. యోగిని అతన్ని పాడుచేసి వెళ్లిపోయింది. అతడు యోగభ్రష్టుడై కొంతకాలం స్త్రీ వ్యామోహంలో పడ్డాడు. అది మీకు అర్థం కాదులే. తర్వాత పశ్చాత్తాపపడి దారికి వచ్చాడు" అన్నారు గురువుగారు, ఇలా ప్రతి పర్యటనలోను కొత్త మూలికలు తెలుపుతూ మమ్ముల్ని విజ్ఞానవంతుల్ని చేశారు.

అప్పుడు ఆయుర్వేద కళాశాలకు అనుబంధంగా ఔషధ నిర్మాణశాల, ఔట్ పేషెంట్ మందులశాల ఉండేవి. ఔట్‌పేషంటు శాలలో సురభి అప్పయ్యగారనే మహా వైద్యులు ఉండేవారు. మంచి మంచి లేహ్యాలు ఉండేవి. మేము అజీర్ణమని, కడుపు నొప్పి అని చెబుతూ, శొంఠి పాకం వంటి తియ్యటి మందులు వ్రాయించుకొని తినేవాళ్లం, మా ఎత్తు కనిపెట్టి ఆయన పంచతిక్త కషాయమో, వాసాది చూర్ణమో ఇచ్చేవారు. మింగలేక బాధపడేవాళ్లం. గురువుగారు ఔషధ నిర్మాణ పద్ధతిని కూడ మాకు ఆచరణాత్మకంగా

చూపేవారు.

ఆయుర్వేద కళాశాలలో తెలుగులో నాలుగేళ్లు చదువుకొన్నవారికి విద్వాన్ అనే బిరుదు ఇచ్చేవారు. మెంబర్ ఆఫ్ శ్రీ వేంకటేశ్వర ఆయుర్వేద కాలేజ్ - ఉత్తీర్ణులైనట్టి వారు. ఎం.ఎస్.వి.ఎ.సి. అని పుటాక్షరాలు తగిలించుకొనేవారు. ఆధునిక శరీరం - అనాటమీ - చెప్పడానికి నారాయణరావు గారనే ప్రఖ్యాతవైద్యులు ఉండేవారు.

కొంతకాలానికి ఆయుర్వేద కళాశాల, వైద్యశాల మూసివేశారు. మా గురువుగారు ఉద్యోగం నుంచి విరమించారు. పదిహేను ఇరవయేళ్ల తర్వాత అనంతపురంలో తమ బంధువుల ఇంట కనిపించారు. శుల్కం పుచ్చుకోకుండా దయతో ఉచితంగా వైద్యం చేయడంవల్ల వెనుక వేసుకొన్నదేమీ లేక కష్టాల్లోనే కీర్తిశేషులయ్యారు. నేను ఆయన ప్రసాదించిన జ్ఞానంతోనే 1933 అలిగఢ్ ఆయుర్వేద విద్యాపీఠం వారు నిర్వహించే పరీక్షలలో ఆయుర్వేదాచార్యకు సమానాంతర పరీక్ష 'ఆయుర్వేద భూషణ'లో ప్రథముడుగా **ఉత్తీర్ణుడ**నయ్యాను. ఎనిమిది ప్రశ్నపత్రాలు, సంస్కృతంలో ప్రత్యుత్తరాలు.

గోపాలాచార్యుల వారి శిష్యులకు ఆయన ఆయుర్వేదాన్ని ఉద్ధరించడానికి అవతరించిన ధన్వంతరే. నిజానికి ఇది చాలవరకు సహేతుకమే. ఆయన ఉద్యమించక పోయి ఉంటే ఆయుర్వేదం బ్రిటిష్‌వారి కాలంలో అంతరించిపోయేదే. శిష్యులు ఆయనను ఎంతగా గౌరవించేవారో తలచుకుంటేనే ఆశ్చర్యం కలుగుతుంది.

నేను 1939లో లాహోరు వెళ్లాను. ఒకనాడు ఊరు చూస్తూ దయానంద్ ఆయుర్వేదిక్ కాలేజ్ అనే నామఫలకం చూచి ఆగాను. ఆవరణ ద్వారం మీద "ఫౌండేషన్ స్టోన్ లెయిడ్ బై వైద్యరత్న పండిట్ డి.గోపాలాచార్య" అని చెక్కిన చలువరాతి బండ ఉంది. దానిని చూస్తూ ఒక తెలుగువాడు, నేను చిన్ననాడు దర్శించిన తెలుగువాడు ఇంత దూరాన ఉన్న ఆయుర్వేద కళాశాల భవనానికి శంకుస్థాపన చేయడమా - అని ఆశ్చర్యానందాలతో అల్లాగే నిలుచున్నాను.

భవనంలోపలి నుంచి ఒక సమున్నత శరీరుడయిన స్ఫురద్రూపి పంజాబీ తలపాగాతో పైజామా అచ్‌కన్‌లతో వచ్చి, నన్ను చూచి "క్యాదేఖ్ రహే హైం" అని ప్రశ్నించారు. "ఈ శంకుస్థాపన చేసిన మహనీయుడు నా ప్రాంతంవాడు. ఆనందంతో ఆయన పవిత్ర నామధేయం చూస్తున్నాను" అన్నాను వినయంతో.

"ఓహ్! అయితే తమరు మా గురువుగారి ప్రాంతంవారు. లోపలికి దయచేయండి" అంటూ తలపాగా తీసి నా ముందు పెట్టి, వంగి నమస్కరించారు. ఆయన మద్రాసు ఆయుర్వేద కళాశాల చివరి బృందంవారు. పేరు డాక్టర్ మెహతా. వేటూరి శంకర శాస్త్రిగారి సహాధ్యాయులు. అంతటిది వాళ్ల గురుభక్తి! కువైద్యులకూ దేశంలో కొదువ లేదు. అలాటివారిని ఒక కవి ఇలా ఎత్తి పొడిచాడు.

**"న ధాతో ర్విజ్ఞానం న చ పరిచయో వైద్యకనయే**
**న రోగాణం తత్త్వావగతి రపి నో వస్తు గుణధీః**
**తథాప్యేతే వైద్యా ఇతి తరలయంతో జడజనాన్**
**అసూన్ మృత్యోర్భృత్యా ఇవవసు హరంతే గదజుషామ్"**

**(ధాతువులు ఎన్ని ఉన్నాయో తెలియదు. వైద్యశాస్త్ర పరిచయమూ లేదు. రోగతత్త్వ మేమిటో తెలియదు. వస్తుగుణపరిజ్ఞానమూ లేదు. అయినా వీళ్లు, తాము వైద్యులమని జనాన్ని మోసగిస్తూ మృత్యుసేవకులలాగ రోగుల ప్రాణాలనూ, ధనాన్నీ అపహరిస్తున్నారు.)**

# 30

# ప్రిన్సిపాల్ సుబ్బారావుగారు

"కదర్థితస్యాపి హి ధీరవృత్తేః
న శక్యతే ధైర్యగుణః ప్రమార్ష్టుమ్,
అధోముఖస్యాపి కృతస్య వహ్నేః
నాథో శిఖాః యాంతి కదాచిదేవ"

**(ధీరుడయినవాడు ఎన్ని కష్టాలు వచ్చినా, దారిద్ర్యంతో బాధపడుతున్నా, అతని ధైర్యగుణాన్ని తుడిచి పెట్టడం సాధ్యం కాదు. నిప్పును తలకిందులుగా వంచినా మంటలు ఎన్నటికీ కిందికి పోవుగదా!)**

నేను తిరుపతి సంస్కృత కళాశాలలో చేరినప్పుడు ప్రాంశుపాలుడు (ప్రిన్సిపాల్) సేలం సుబ్బారావుగారు. అంతకుముందు మహామహోపాధ్యాయ కపిస్థలం దేశికా చార్యులు ప్రిన్సిపాలుగా ఉండేవారట. ఆయన సంస్కృతం ఏం.ఏ, కాదని సుబ్బారావుగారిని నియమించారట. ఆయన శిష్యుడూ, (తర్వాత ఉపాధ్యాయుడూ) అయిన వట్టిపల్లి నరకంఠీరవ శాస్త్రిగారు మహామేధావి, మహాకవి. ఆయనను గురించి కథలు కథలుగా చెప్పేవారు. ఆయన రచంచిన అశ్వధాటివృత్తాలు ప్రసిద్ధంగా ఉండేవి. ఆయన కుమారుడు కాశీనాథ్‌గారు తండ్రిగారిని పోలలేదు. మెట్రిక్యులేషన్ చదివి మా కళాశాల లైబ్రేరియన్‌గా ఉండేవారు. నాకు చాల మిత్రులు.

ప్రిన్సిపాల్ సుబ్బారావుగారు వివిధశాస్త్రాలలో విద్వాంసులు. ప్రెసిడెన్సీ (మద్రాసు)

కళాశాలలో సంస్కృతం ఎం.ఏ. చదివి, అక్కడే ఉపాధ్యాయులుగాను, మద్రాసు రాష్ట్రంలో సంస్కృత పాఠశాల, కళాశాలల ఇన్‌స్పెక్టర్‌గాను పనిచేసి, ఏ కారణం వల్లనో ఆ ఉద్యోగం మానుకొని మా కళాశాలకు ప్రిన్సిపాలుగా వచ్చారు. అప్పటికే ఆయన వయస్సు యాభైయేళ్లపై చిలుకు. పొట్టిగా ఉండేవారు. వంగి నడిచేవారు. నీర్కావి ధోవతి, ఉత్తరీయం, నిరాడంబరమైన ప్రవర్తన. సంభాషణచతురులు. అవసరమయితే వ్యంగ్యబాణాలతో పెరవారి హృదయాలను చీల్చేవారు.

ఆయన ఆ కాలపు యావద్భారత విద్యాధికులలో ఎన్నదగినవారు. ప్రిన్సిపాలుగా జీతం 150 రూపాయలు. బహుభాషాకోవిదులు. పరిపాలనదక్షులు. ఆయన మిట్ట వీధిలో 'వ్యాసాప్రెస్' అనే ఒక ముద్రణాలయం పెట్టి, తాము రచించిన సంస్కృ తాంగ్ల గ్రంథాలను తన ఇద్దరు కుమారుల సాయంతో ముద్రించేవారు. ఆయన రచనలలో ఎక్కువ విఖ్యాతమయినవి బ్రహ్మసూత్రాలకు ద్వైతపరమయిన ఆంగ్ల వ్యాఖ్యానం. శ్రీమద్భాగవతానికి త్రిమతపరమైన ఆంగ్ల వ్యాఖ్యానమునూ, బ్రహ్మ సూత్రాలకు ఆంగ్లంలో వ్యాఖ్యను వ్రాసి, దానిని అపవిత్రం చేశాడని ఉత్తరాది మఠం స్వాములవారు ఆయనను బహిష్కరించారు. దానికి తిరుపతిలోని మాధ్వబ్రాహ్మణ్య మంతా ఎదురు తిరిగింది. దానితో స్వాములవారు బహిష్కరణను ఉపసంహరించు కొని, ఆయనను ఆహ్వానించి గౌరవించారు. తిరుపతి వారికి ఆయనపై ఉన్న గౌరవం అలాటిది.

ఆయనకు తెలుగుదేశంలోని అన్ని ప్రాంతాల వ్యవహారమూ తెలుసు. వ్యంగ్య ప్రియులు కావడం వల్ల ఒక్కొక్కప్పుడు మాటలలోను, శ్లోకాలలోను పెడర్థాలు లాగేవారు. వట్టిపల్లి నరకంఠీరవ శాస్త్రిగారు పాఠాలు కూడా కవితలోనే చెప్పేవారని ప్రతీతి. ఆయనకు గురువులయిన కపిస్థలం దేశికాచార్యులపై అపారమైన అచంచల మైన భక్తి. ఆయన గ్రంథాలలో గురుస్తుతి.

**"ప్రణమామి దేశికార్యన్**
**కౌశిక వంశ్యాన్ అశేష తంత్రజ్ఞాన్**

అని చెప్పేవారు. సుబ్బారావుగారు 'చూచారా, మీ శిష్యుడు మీరు తర్కవేదాంత పండితులే కాని, వ్యాకరణ శాస్త్ర పండితులు కారని చెప్పాడు' అని ఒకమారు దేశికాచార్యులతో అన్నారు. "అశేష తంత్రజ్ఞాన్" అంటే సకల శాస్త్రాలూ తెలిసినవారని అర్థం. కాని సుబ్బారావుగారు దానిని "శేషతంత్రంన జనాతీత అశేష తంత్రజ్ఞః–"

వ్యాకరణం రానివారు అని విరిచి చెప్పారు. అందరూ తెల్లబోయారు. మద్రాసులోని మహామహోపాధ్యాయ కుప్పుస్వామిశాస్త్రిగారికీ, సుబ్బారావుగారికీ కొంత స్పర్థ ఉండేది. కుప్పుస్వామిశాస్త్రిగారు అభినవగుప్తుని ధ్వన్యాలోకవ్యాఖ్యలోచనానికి ఉపలో చనమనే వ్యాఖ్య వ్రాశారు. దాని ప్రారంభంలో "వినోపలోచనేవాలం న వివేక్తుం హి లోచనం" అని చెప్పుకున్నారు. దానిని చూచి సుబ్బారావుగారు "అయితే ఈ ఉపలోచనం చదివేవాడు గుడ్డివాడేనా? ఉపలోచనం – సులోచనం, కళ్లజోడు – పెట్టుకొనేవాడు, గుడ్డివాడేకదా? శాస్త్రిగారు తమ వివేచన శక్తికి తగినట్లే వ్రాశారు." అని ఎత్తిపొడిచారు.

ఒకమారు ఆయన మా అనువాదం తరగతికి వచ్చారు. "రామః కోసలదేశం శశాస" అనే దాన్ని తెలుగు చేయమన్నారు. పాలించెను. రక్షించెను. పరిపాలించెను అని నేను లేచి చెప్పాను. "నేను అడిగింది తెలుగు అనువాదం, పాలించు, రక్షించు, పరిపాలించు అనేవి తత్సమపదాలు. తెలుగు పదాలు కావు" అన్నారు. అందరం ఊరుకున్నాం. ఆయన "ఏలెను, ఇది సరైన తెలుగుపదం" అని చెప్పిపోయారు. ఎవరు ఉలక లేదు. "దీనికి పర్యాయపదం తెలుగులో లేదు" అని ఆయనే తర్వాత చెప్పారు.

ఆయన మా ఊరి అల్లుడని ఇదివరకే చెప్పాను. నాపైన ప్రత్యేకంగా అభిమానం ఉండేది. అంతేకాదు, ఆయనకు తెలుగువారంటే చాలా ఇష్టం. మా అనువాదం పరీక్షలో తెలుగు నుంచి సంస్కృతానికి అనువాదం చేసే ప్రశ్న ఒకటి ఉండేది. నా సహాధ్యాయుడు టీ.కె.రామచంద్రన్ అనే తమిళ విద్యార్థి ప్రశ్నపత్రంలో తెలుగు భాగం చూచి, ప్రిన్సిపాల్ వద్దకు వెళ్లి "నాకు తెలుగు రాదు, తమిళ భాగం ఇవ్వమనండి" అని ఫిర్యాదు చేశాడు. సుబ్బారావుగారు "నాయనా! ఇది తెలుగుదేశం. నీవు తెలుగుదేశంలో ఉన్నావు. తెలుగు నేర్చుకోవాలి. లేకపోతే మార్కులు తగ్గిపోతాయి" అన్నారు విస్పష్టంగా.

అప్పుడు అమృతానందస్వామి అనే యోగీంద్రులు కొత్త వీధిలో ఉండేవారు. దంటు సుబ్బావధానిగారు, కాంచనపల్లి కనకమ్మగారు మొదలయినవారు ఆయనకి శిష్యులు. ఆ యోగిని గురించి మంచివీ, చెడ్డవీ, ఎన్నో కథలు ప్రచారంలో ఉండేవి. కాంచనపల్లి కనకమ్మగారి బంధువు బాలకృష్ణరావనే విద్యార్థి మమ్మల్ను అప్పుడప్పుడు అక్కడికి పిలుచుకొని వెళ్లేవాడు. అక్కడ పూజలు భజనలు జరిగేవి. స్వామివారికి కోపం వచ్చినప్పుడు అందరినీ చేతిలో ఏది ఉంటే దానితో కొట్టేవారని అనేవారు. నేను అక్కడకి పోవడం సుబ్బారావుగారు చూచారు. మరుసటి రోజు నన్ను ఒంటరిగా పిలిపించింది.

“రామచంద్రాచారీ, నీవు అక్కడికి పోవద్దు. ఇక ఎప్పుడయినా చూచానా, ఊరికి మూటకట్టవలసిందే” అన్నారు. నేను తలవంచుకొని వచ్చాను. విద్య కోసం వచ్చి, పరదేశంలో ఉన్న విద్యార్థులు అలాటి సమావేశాలవల్ల చదువుపై శ్రద్ధ పోగొట్టు కుంటారని ఆయన విశ్వాసం. ఇలా అప్పుడప్పుడు నన్ను హెచ్చరించేవారు.

సుబ్బారావుగారు పదవి నుంచి విరమించిన తర్వాత కపిస్థలం కృష్ణమాచార్యులు



గారు కొన్ని నెలలు ప్రిన్సిపాలుగా ఉన్నారు. ఇంతలో దేవస్థానం పరిపాలన వ్యవస్థలో కల్లోలం ఏర్పడింది. మహంత్ ప్రయాగ్‌దాస్‌జీ అస్వస్థులయ్యారు. ఆ కాలంలో ధర్మకర్త (మహంత్) తర్వాతి ప్రధానాధికారి పేష్కారు. ఈ అధికారిని మద్రాసు ప్రభుత్వం నియమించేది. సాధారణంగా రిటైరైన కలెక్టర్‌గాని, డిప్యూటీ కలెక్టర్‌గాని ఈ పదవికి అభ్యర్థనతో శేషజీవితాన్ని భగవత్సేవలో గడుపుదామనే ఉద్దేశంతో వచ్చేవారు. రెండవ పదవి పారుపత్తేదారు. దీనికి కూడా డిప్టీకలెక్టరుకు కింద హోదావారు నియమితులయ్యేవారు. అప్పటి పేష్కారు దొరస్వామయ్యగారు. ఆయన చాలా సమర్థులు. ప్రయాగ్‌దాస్‌జీ అనారోగ్య కారణంగా ఆయన శిష్యుడు రామచంద్రదాస్ 'మహంత్' అయ్యారు. ఆయన మిత్రుడయిన రఘువరదాస్‌గారు మాకు ప్రిన్సిపాల్ అయ్యారు. ఆయన పెద్ద పండితుడు కాదు. పరిపాలనాదక్షుడు అంతకన్నా కాదు. నిభాయించుకోలేకపోయాడు. ఆయన కాలంలోనే, ఆయన ఇష్టులూ, నేను తిరుపతికి రావడానికి కారణమయిన వారూ అయిన తిరుమల వేంకటరంగాచార్యులుగారు మాకు కావ్య పాఠాలు చెప్పే ఉపాధ్యాయులయ్యారు సాహిత్య శిరోమణి పూర్తికాకముందే. రఘువరదాస్‌ను అసమర్థుడని తొలగించారు. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు గారికి, మహంతులకు ఇచ్చి పుచ్చుకోడాలు ఉండేవి. ఆ సందర్భంగా నాగేశ్వరరావు గారు మద్రాసు నుంచి తిరుపతికి వచ్చారు. రామచంద్రదాస్ సిఫార్సువల్లను, స్వయంగా ప్రతిభావంతుడు కావడం చేతను వేంకటరంగాచార్యులను 'భారతి' మాసపత్రికలో పనిచేయడానికి పిలుచుకొనిపోయారు. రఘువరదాస్ తర్వాత అమరవాది హనుమచ్ఛాస్త్రిగారనే సంస్కృత ఎం.ఏ. ప్రిన్సిపాలుగా వచ్చారు. ఆయన సరసులు, ప్రతిభాశాలులు. కాని, మేము సుబ్బారావుగారితో పోల్చేవాళ్లం గనుక మా చూపులకు ఆనలేకపోయారు. తర్వాత ఉత్తమూరు వీరరాఘవాచార్యులనే షట్ శాస్త్ర పండితుణ్ణి ప్రిన్సిపాల్‌గా నియమించారు. ఆయనకు నిర్వహణలో అంత అనుభవం లేనందున మేము (ముఖ్యంగా నేను) చాల అల్లరి చేశాము. ఆయన పేరుతో హాస్టలు మార్పులు, ఉపాధ్యాయుల బదిలీలు, కొత్త నియమాలు వంటి ఉత్తర్వులు సృష్టించి నోటీసు బోర్డులో అతికించేవాళ్లం. నేను ఆయన సంతకంలాగే సంతకం చేసేవాడిని. ఆయన ఆ ఉత్తర్వులు చూచి ఆశ్చర్యపడేవారు. మేమంతా కలిసికట్టుగా ఉన్నందున గుట్టుబయటికి పొక్కేది కాదు. సందేహమున్నా ఆధారాలుండేవి కావు. ఇది గ్రహించిన ప్రిన్సిపాల్ మమ్ములను

మచ్చిక చేసుకొనడం ప్రారంభించారు. ఆయన పాండిత్యానికి ముగ్ధులమయిన మేము క్రమంగా విధేయులమయ్యాము.

ఇంతచేసినా నేను మంచివాణ్ణి, న్యాయమార్గగామిని. ఎందుకంటే పాఠశాలలో ఎంతో అనుభవం, పాండిత్యం, సమర్థత ఉన్న ఉపాధ్యాయులను కాదని, బయటి వారిని ప్రిన్సిపాలుగా నియమించడం అందరికీ కంటకంగా ఉండేది. మా అల్లరి వారంతా మనసారా సమ్మతించారు. బహిరంగంగా సమర్థించకపోయినా, మా ఉద్యమంలో వారి ఎడల గౌరవభావం ఉండేది. ఎప్పుడూ వారి మాటలను జవదాట లేదు. పాత ఉపాధ్యాయులకు న్యాయం జరగాలని కూడా బాహాటంగా అనేవాళ్లమే కాని, పై వారివద్దకు వెళ్లే పద్ధతిగాని, ఉపాయంగానీ తెలియదు. అందువల్ల ఉపాధ్యాయుల సానుభూతి ఉండేది.

తిరుమల తిరుపతి దేవస్థానం పరిపాలనలో అప్పుడు కచ్చివాడ అనేది ఒక ప్రాంతం. అసమర్థులను, తలబిరుసు వారిని అక్కడికి మార్చేవారు. అది ఒక విధంగా ద్వీపాంతరవాస శిక్షవంటిది. ప్రిన్సిపాలును కచ్చివాడ తాలూకాకు మార్చినట్టుగా ఒక ఉత్తరువు పుట్టించి దేవస్థానం కార్యాలయం ముద్ర సంపాదించి దానిపై గుద్ది నోటీసు బోర్డుకు అతికించాము. ఇది రాత్రి జరిగింది. తెల్లవారే వేళకు గోల! ప్రిన్సిపాల్ పై వారి వద్దకు పరుగులు తీయడం, కచ్చివాడ తాలూకాకు పరిపాలన శాఖలోని వారిని మార్చడం ఉంటుందేగాని, ఉపాధ్యాయులనూ, ప్రిన్సిపాలు వంటి వారినీ మార్చడం ఉండదనీ వారు సమాశ్వాస పరచడం – గొప్పనాటకం!

ప్రిన్సిపాల్ ఉత్తమూరు వీరరాఘవాచార్యుల వారు క్రమంగా సరళులై అందరినీ కూడగట్టుకున్నారు. మహాపండితుడినని విర్రవీగితే ప్రయోజనం లేదని గ్రహించారు. పాతగురువులు కూడా మాకు హితవు చెప్పారు. ఉత్తమూరు వారు పదవీ విరమణ చేసిన పిదప మద్రాసులో వేదాంత ప్రవచనాలు చేసేవారు. మీమాంస వేదాంత గ్రంథాలు, వ్యాఖ్యానాలు చాల రచించారు. 'అభినవ వేదాంతదేశిక' అనే బిరుదం పొందారు. ఆయన 1979లో ఏదో ప్రసంగం కోసం సికిందరాబాద్‌కు విచ్చేసినప్పుడు నేను, మిత్రుడు కప్పగంతుల లక్ష్మణశాస్త్రి ఆయనను దర్శించి గోత్రప్రవరలు చెప్పుకొని నమస్కరించాము. ఆయన పాత విద్యార్థులు కనిపించినందుకు చాలా సంతోషించారు. అనుభవంతో, జ్ఞానంతో పరిపక్వమైన ఆయన ధీరత్వం చూచి ఆనందించాము. ఒక కవి ఇలా అన్నాడు.

"అంగణవేదీ వసుధా
కుల్యా జలధిః స్థలే చ పాతాళమ్,
వల్మీకస్య సుమేరుః
కృత ప్రతిజ్ఞస్య ధీరస్య॥"

(ఈ పనిచేద్దాము - అని నిశ్చయించుకొన్న ధీరునికి ఈ ప్రపంచం ఇంటి ముంగిట అరుగు, సముద్రం పిల్ల కాలువ, పాతాళం పైకి లేచిన భూమి, మేరు పర్వతం సులభంగా ఎక్కగలిగే పుట్ట. అన్నీ సుకరం, సులభప్రాప్యం.)

# 31

# మానవల్లివారి కృపాకటాక్షం

"కుసుమ స్తబక స్యేవ
ద్వయీ వృత్తిః మనస్వినామ్,
మూర్ధ్ని వా సర్వలోకస్య
శీర్యతే వన ఏవ వా॥"

**(ఉత్తమాశయాలు గల మనస్సు కలవాడు మనస్వి. అలాటివాడు పూలగుత్తి వంటివాడు. పూలగుత్తికి రెండేస్థానాలు. అందరి తలలను అలంకరించడం, లేక అడవిలోనే రాలిపోవడం. మనస్వి మనుగడా అంతే, అందరి మెప్పు పొందుతాడు, లేక అజ్ఞాతంగానైనా ఉండిపోతాడు.)**

సాటి రాష్ట్రంవారు పొరుగు రాష్ట్రంలోనో, పొరుగు దేశంలోనో కన్న వన్నె, వాసీ, మనకు మన్నన తెచ్చినపుడు, మన ఒళ్లు పొంగిపోతుంది. అమ్మయ్య! మనమూ ఈ ప్రపంచంలో ఉన్నాం సుమా! అని అనిపిస్తుంది. ఈ స్థితిని అలంకారికుల పరిభాషలో "విగళిత వేద్యాంతర, బ్రహ్మానంద సబ్రహ్మాచారిణి అని అనవచ్చు. యోగ పరిభాషలో" అమృతబిందు సంయోగమంటే అసమంజసం కాదు. అలాటి అనిర్వచనీయ స్థితి అందరి జీవితాలలోనూ సంభవమే. నాకు అలాటిస్థితి చాలసార్లు కలిగింది. కాని అలాటి పారవశ్యం పరాకాష్ఠను పొందింది కాన్పూరులో.

అర్ధశతాబ్ది క్రితం కాన్పూర్‌లో జరిగిన ఒక విద్వద్గోష్ఠికి మహాపండిత రాహుల్ సాంకృత్యాయన్, లాహోర్ ఓరియంటల్ కాలేజీ వైస్ ప్రిన్సిపాల్ డాక్టర్ లక్ష్మణ స్వరూప్ మున్నగు విద్వద్వరేణ్యులు విచ్చేశారు. నేను ఇద్దరికీ పరిచితుణ్ణే. ప్రసంగవశాత్తు "రామకృష్ణ

కవిగారిని ఎరుగుదురా?" అని ప్రశ్నించారు రాహుల్‌జీ, "ఎందుకు?" అన్నాను. "ఏమీలేదు. ఆయన ఎంత ధన్యజీవి! ఆయన జీవిత సార్థక్యానికి ఒక్క కుందమాల నాటకం చాలు. ఎంత మంచి నాటకం వెలుగుకు తెచ్చారు?" అన్నారు రాహుల్‌జీ. "మరి నాట్యశాస్త్రం సంగతో?" అన్నారు డాక్టర్ లక్ష్మణ్ స్వరూప్‌జీ, "ఆయన జీవితాన్ని ధన్యం చేయడానికి!" అన్నారు మరొకరు.

నాకు మాట పెగలలేదు. గుండె గొంతుకలో కొట్టుకులాడింది. నేనప్పుడు అనుభవించింది మానుషానందం కాదు. ఉపనిషత్తులు ఉద్ఘోషించిన అతిమానుషా నందానుభూతి అది! అతి కష్టంతో గద్గదకంఠంతో అన్నాను. "కవిగారు నాకు చాల పరిచితులు. ఆయన దగ్గర పనిచేసే భాగ్యం నాకు కలిగింది" అని. అక్కడి వారందరి చూపుల్లో కవిగారిని దర్శించినంత సంతోషం తెలిపే రాగరేఖ ఒక్కసారిగా మెరిసింది. నా మనసు నాలుగు దశాబ్దాల వెనక్కు పరుగిడి కవిగారి తొలి దర్శనం నాటి మాటలు గుర్తుకు వచ్చి నవ్వుకున్నాను.

నాకప్పుడు పదమూడేళ్ల వయసు. 1927 అనుకుంటాను. మానవల్లి రామకృష్ణ కవిగారు తిరుమల తిరుపతి దేవస్థానం విద్యాశాఖాధికారిగా ఉండేవారు. ఆయనకు తాళపత్ర గ్రంథాలు చూచి రాయడానికి ఒక లేఖకుడు - నకల్ నవీస్ - కావాలని ఎవరో చెప్పగా ఒకరోజు ఆయన ఇంటికి వెళ్లాను. ఆయన "తాళీదళ సంపుట ప్రకరకాంతారం"లో ఉన్నారు. పొడుగాటి శరీరం, కోలముఖం, నొసట గంధాక్షతలు, ఊర్ధ్వకాయం కొంచెం వంచి నడిచే అలవాటు. అప్పటికే షష్టిపూర్తి అయింది. నివురు గప్పిన నిప్పువంటి వ్యక్తిసుమా అనే భావం కలిగించే సౌమ్యగంభీరమూర్తి.

నన్నుచూడగానే ఆయన "ఎవరయ్యా మీరు?" అని ప్రశ్నించారు. వయస్సు తారతమ్యం లేకుండా అందరినీ 'అయ్యా' 'మీరు' అనడం ఆయన అలవాటని తర్వాత తెలుసుకున్నాను. "మీకు వ్రాయసకాడొకడు కావాలని విని వచ్చాను" అని సవినయంగా అన్నాను. "కూర్చోండి" అంటూ ఆయన తాళపత్రాలను ఒకవైపు తోసి "ఏదీ, మీ చేతి వ్రాత చూపండి" అన్నారు. నేను నా చేతిలో ఉన్న నోటు పుస్తకం వారికి అందించాను. దానిని వారు తెరిచి, దానిలో వ్రాసిన శ్లోకాలు చూచి "ఎవరివీ శ్లోకాలు?" అని ప్రశ్నించారు. "నావేనండీ" - అన్నాను సంకోచపడుతూ, "ఏదీ? చదవండి" అన్నారు. చదివాను.

**"మంజుల నూపుర శింజిత**
**పుంజీకృత రసికలోక హృత్కంజా**
**కుంజర గమనా గచ్ఛతి**
**భంజంతీ మదన మంజులతామ్."**

**'ఇంపయిన అందెల రవళిలో రసికుల హృదయ కమలాలను లాక్కుపోతూ, మదనుని సౌందర్యాన్ని కూడ విరిచివేస్తూ మదగజయాన వెళ్లుతున్నది"** అని అర్థం చెప్పాను.

"మరొక శ్లోకం చదవండి" అన్నారు.

**"రచయంతీ రంగలతాం**
**మంగల గాత్రీ సలీల మంగణకే.**
**విటజన హృదయాం గణకే**
**అనంగజ బాధాం విశాలయతి నూనమ్"**

**(ముంగిట్లో ముగ్గు పెడుతున్న మంగళగాత్రి ముగ్గుల సాకుతో విటజనుల హృదయాలలో మన్మథబాధను విస్తరింపజేస్తున్నది.** – అని అర్థం చెప్పాను.)

ఆయన శ్రద్ధగా విన్నారు. "ఆర్యాచ్ఛందస్సును బాగానే నడిపారు కాని, మదన మంజులతాం అని స్త్రీ సౌందర్యాన్ని పురుష సౌందర్యంతో పోల్చారేం? సంస్కృత సాహిత్యంలో, ఇలాటిది ఒకచోట ఉందనుకోండి. రతి సౌందర్యం మీకూ నచ్చలేదా?" అన్నారు. సమాధానం చెప్పలేక నీళ్లు నమిలాను. ఆయనే అందుకున్నారు. "మదనః అంటే ఒక రకం దేశి తాళం.. ఆ తాళమాధుర్యాన్ని మించిన మంజుల గతితో నడిచింది, అని అర్థం చెప్పుకొందామా?" అన్నారు. నేను ఏమీ మాట్లాడలేదు. ఏమని మాట్లాడగలను? కొంచెంసేపు ఆగి "ఇంతకూ మీ వయస్సెంత?" అని ప్రశ్నించారు. "పధ్నాలుగో ఏడండీ" అన్నాను. "ఇంత పసివయసులో ఎందుకయ్యా ఈ శృంగారం?" అన్నారు. నేను సిగ్గుతో కుంచించుకుపోయాను.

అది నా ప్రథమ పరిచయం, అప్పటి నుంచి తీరిక వేళల్లో ఆయన వద్దకు వెళ్లే వాణ్ణి. ఆయనకు నకలు చేసి పెట్టింది కొద్దే. కాని, ఉన్నంతసేపూ సంస్కృత సాహిత్య మధురప్రపంచంలో విహరింపచేసేవారు. అడుగడుక్కు ఆయన కోహలుడని, శారఙ్గ దేవుడని, సింగభూపాలుడనీ, అప్పటికి నాకు పూర్తిగా కొత్తవయిన పేర్లు చెబుతూ,

వారి శ్లోకాలు ఉదాహరిస్తూ నూతన ప్రపంచాన్నే ముందు నిలిపేవారు. వేణీ సంహారనాటకం చర్చ వచ్చినప్పుడు, "అంతకంటే ముందుదయ్యా భట్టానారాయ ణుడు రాసిన కృత్యారావణ నాటకం" అంటూ కొన్ని ఘట్టాలు ఉదాహరించారు.

ఆయన ధారణశక్తి, శక్తిస్వరూపిణి. ఆయన మెదడొక పావురాల గూడు. అవసరమయిన శ్లోకాలు ఆ అరల నుంచి కర్బురకాంతుల కపోతాల లాగ వెలుపలికి వచ్చేవి. ఆయన "ఊ ఊ ఊ" అని ప్రారంభించి ఒక రకం యేసతో పద్యాలు, శ్లోకాలు చదువుతుంటే పావురాల గునుపులాగే వినిపించేది కమ్మగా.

తిరుపతిలో ఉన్నన్నినాళ్లూ ఆయన సన్నిధిని వదలలేదు. తర్వాత కొన్ని సంవత్సరాలకు మద్రాసులో ఆయనకు సహాయకుడుగా పనిచేసే అవకాశం 1936లో కలిగింది కొన్ని నెలలపాటు. ఆర్.అనంతకృష్ణశాస్త్రి అనేవారు మద్రాసు విశ్వవిద్యాలయానికి కొన్ని తాళపత్ర గ్రంథాలు సేకరించి ఇచ్చారు. వాటి సూచీ నిర్మాణ కార్యక్రమం కవిగారి పాలపడింది. నేను వారికి సహాయకుణ్ణి. ఆయన మహాప్రతిభ నాకప్పుడు పూర్తిగా ఆకళింపు అయింది.

ఆ రోజుల్లో నేనడిగాను. "మీ పుట్టుపూర్వాలు సెలవియ్యండి. ఒక వ్యాసం రాస్తాను" అని. ఆయన వెడనవ్వు నవ్వి, "వ్రాసేదేదో నేను పోయిన తర్వాత వ్రాయండి" అన్నారు. నిరాడంబరంగా, నిరీహగా. తన పుస్తకాలలోనూ ఆయన తను గురించి చెప్పుకొన్నది చాల తక్కువ. భరతకోశపీఠికలో రామశాస్త్రి కుమారుణ్ణని మాత్రం చెప్పుకున్నారు. తొట్టతొలుత రచించిన మృగావతి కావ్యం పీఠికలో

**"చెన్నపురి చూళ నివసించుచున్న వాడ**
**వైదిక బ్రాహ్మణుడ మానవల్లికులుడ**
**రామ దైవజ్ఞ పుత్రుడ రాజ నుతుని**
**త్యాగరాయ పండితుని ప్రియానుజుండ"**

ఇది మాత్రమే చెప్పుకున్నారు. ఆయన 1866లో మద్రాసులో నుంగంబాకంలో జన్మించారు. పేరు మోసిన పండిత వంశం. తండ్రి రామశాస్త్రిగారు అష్టాదశ భాషా పండితులు. కవిగారు క్రిస్టియన్ కళాశాలలో చదువుతున్నప్పుడే 'ఆంధ్ర భాషను గూర్చిన ఉపన్యాసము' అనే వ్యాసం వైజయంతీ పత్రికలో రాసి విద్వాంసుల మన్ననను పొందారు. వైజయంతీ పత్రిక సంపాదకులు 1891 నాగపూర్ కాంగ్రెసుకి అధ్యక్షత వహించిన

పనప్పాకం అనంతాచార్యులుగారు. ఆనాడు కవిగారు రాసిన ఈ వ్యాసం లో నేటికీ కొత్త విషయాలు కనిపిస్తాయి.

పట్టభద్రులయిన తర్వాత వనపర్తి సంస్థానంలో ఆయన విద్యాధికారిగా జీవితం ప్రారంభించారు. 1901 వరకు అక్కడ ఉన్నారు. అభిప్రాయ భేదాలతో వనపర్తి వదిలారు. తిరిగి వెళ్లలేదు. నేను ఎన్నిసార్లు ప్రయత్నించినా ఆయన వనపర్తి నివాసం వివరాలు తెలుపలేదు. వనపర్తిలోబ్రహ్మవిద్యా విలాస ముద్రాక్షరశాలలో 'విస్మృత కవుల గ్రంథమాల' ప్రారంభించారు. ఈ గ్రంథమాలలో వారు ప్రచురించిన తొలి గ్రంథం వల్లభరాయుని 'క్రీడాభిరామం'. తర్వాతిది నన్నెచోడుని 'కుమారసంభవం.' నన్నెచోడుడు నన్నయ్యకంటే ముందువాడని ఈయన అనడంతో ఆంధ్ర సారస్వత లోకంలో పెద్ద ఝంఝూమారుతం బయలుదేరింది. ఆయనను తెలుగు పండితులు ఘోర శత్రువుగా భావించారు. ఇంత గాలి దుమారం లేచినా మీరు సమాధానం చెప్పరేమండీ?" అని నేను ఒకమారు మద్రాసులో ప్రశ్నించాను. "నేను చెప్పేదేదో గ్రంథ పీఠికలో చెప్పాను. మళ్లీ మళ్లీ చెప్పడం దేనికి?" అన్నారు ఆ స్థితప్రజ్ఞులు.

కవిగారు ఆంధ్రావళికి బహూకరించిన మరొక రచన 'ప్రబంధమణిభూషణం' ఇదొక సంచిత కృతి. నానా కావ్యాల నుంచి వివిధ భాగాలు గ్రహించి కథగా కూర్చిన కృతిని సంచిత కృతి అంటారు. త్రిపురాంతకోదాహరణ, నీతిముక్తావళి, ఆంధ్ర తిరువాయి మొళి, శ్రీరంగమహాత్మ్యం, సకల నీతిసమ్మతం అనే గ్రంథాలు ప్రచురించారు. విద్వత్తాపూర్ణమయిన పీఠికలతో తెలంగాణమంతా పర్యటించి "లిథిక్ రికార్డ్స్ ఆఫ్ హైదరాబాద్ స్టేట్" అనే పేర శాసనాలు ప్రతిబింబాలతో సహా ప్రకటించారు.

ఈ ప్రచురణ పరిశోధనలు చేస్తూనే ఎం.ఏ. తెలుగు సంస్కృతాలలో ఉత్తీర్ణు లయ్యారు. నలభయ్యవ ఏట మద్రాసు లా కాలేజీలో చేరి ఎఫ్.ఎల్. ముగించి, బి.ఎల్. చదివారు, పరీక్షకు వెళ్లలేదు.

ఆయన ఏ పుస్తకం ప్రచురించినా తీవ్ర విమర్శ చెలరేగడంతో ఆంధ్ర సాహిత్యం ఎందుకు అనుకున్నారేమో, దానిని వదలి సంస్కృతవాఙ్మయంలో ప్రవేశించి, పచ్చయప్ప కళాశాలలో మూడు సంవత్సరాలు సంస్కృతాధ్యాపకులుగా పనిచేశారు. ఇంతలో మద్రాసు విద్యాశాఖ వారు తాళపత్ర గ్రంథ సేకరణకు కొందరు పండితులను నియమించదలచినప్పుడు రామకృష్ణ కవిగారి వంటి అనుభవశాలులకు అది లభించడం

సహజం. ఆయనకు తోడుగా పాలక్కాడు వాస్తవ్యులు, ఉభయ మీమాంసాలంకార శాస్త్రాల్లో పారంగతులు అయిన ఎన్.కె.రామనాథశాస్త్రిగారిని నియమించారు. వీరిద్దరూ విశాల మద్రాసు రాష్ట్రమంతటా పర్యటించి అపూర్వమైన పుస్తకాలను సేకరించారు.

రామనాథశాస్త్రిగారు తాళపత్ర సేకరణానుభవాలు కథలు కథలుగా చెప్పేవారు. కవిగారి ధారణశక్తికి ఎన్నో సంఘటనలు తెలిపేవారు. ఒక ఊళ్లో పండితులు పుస్తకాలు ఇవ్వడానికి నిరాకరించారట. కవిగారు ఊరికే చూసి ఇస్తామని చెప్పి, గంటసేపు పుస్తకాలను తిరగేసి, ప్రధాన ఘట్టాలు మనస్సులో గుర్తుచేసుకొని, బసకు వచ్చి ఆనుపూర్విగా విషయాలు రాసుకొనేవారట. ఒకసారి చదివితే చాలు, పుస్తకమంతా హత్తుకుపోయేది ఆయన మెదడులో.

కవిగారు 'కుందమాల, చతుర్భాణి, నాట్యశాస్త్రం' మొదలయిన అపూర్వ సంస్కృత గ్రంథాలను సంస్కరించి పరిశోధనాత్మక పీఠికలతో ప్రచురించారు. భరతకోశం, భరతశాస్త్ర సర్వస్వ మనదగినది. వారు గొప్ప కవి. డాక్టర్ వి.రాఘవన్ మొదలయిన వారు పక్షపాతంతో విమర్శించినా అది గొప్ప పుస్తకమే.

ఆయనకు ఎవరో చెప్పారు. లాహోర్‌లో కుమార సంభవం నన్నెచోడునిది ఉందని, నేను లాహోర్ యూనివర్శిటీ లైబ్రరీలో పనిచేస్తున్నప్పుడు నాకు జాబు రాశారు. నేను పరిశీలించగా, కుమారసంభవం అని తెలుగు శీర్షికలో ఉన్న తాటాకుల కట్ట దొరికిందికాని, అది కాళిదాస కుమారసంభవంలోని కొన్ని ఆకులు మాత్రమే.

చివరి దశలో కవిగారు చాలా బాధపడ్డారు. రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు కొంత నెలసరి గౌరవ భృతి ఇచ్చాయి. అవి ఆయన కొన్ని నెలలు పొందారేమో! ఆ ప్రయత్నాలప్పుడే మిత్రులు డాక్టర్ పి.ఎస్.ఆర్.అప్పారావుగారి సూచనపై వారికి నెల రోజులపాటు ఆతిథ్యమిచ్చి సేవచేసే భాగ్యం నాకూ, నా అర్ధాంగి సౌభాగ్యవతి అనంత లక్ష్మికీ కలిగింది. ఆయన నాతో ఒకమారు వినోదంగా అన్నట్టు సెంచరీ కొట్టలేకపోయారు. 91వ ఏట 1957 సెప్టెంబరు 21న పరమపదం చెందారు.

మూడు దశాబ్దాల నా పరిచయంలో భర్తృహరి అన్నట్టు అభిభవగంధం ఎంత మాత్రమూ లేని పరకథలతో ఉదాత్తంగా ప్రవర్తించిన విద్వాంసుడు కవిగారు వినా, నాకెవరూ కనిపించలేదు. పరదూషణ, పరతిరస్కారం ఆయన కలలోను చేయలేదని నా విశ్వాసం. ఆయన హృదయం, మనస్సు మహోన్నతాలు. కవిగారి వంటి వారిని

గురించే 'మాఉరాయడ'నే ప్రాకృత కవి ఇలా అన్నాడు.

**"తుంగోచ్చిఅ హోఇ మణో**

**మణం సిణో అంతిమాసు విదుసాసు,**

**అత్థమణమ్మివి రఇణో**

**కిరదా ఉద్ధంచిఅ పురంతి"**

**(మనస్వి మనస్సు అంతిమదశలోనూ ఉన్నతంగానే ఉంటుంది. అస్తమిస్తున్నప్పుడు కూడ సూర్యుని కిరణాలు పైకే ప్రసర్తిస్తాయి.)**

## 32

# మొద్దబ్బాయిలు మహామేధావులయిన కథ

"తం మిత్తం కాదవ్వం
జం కిర నసణమ్మి దేస కాలమ్మి,
ఆలిహిఅ భిత్తివా ఉల్లఅం వ
ణ సరమ్ముహం హోఇ"

**(దేశకాలాలు మారినా, ఆపదలు విరుచుకొని మీద పడినా, గోడ మీద గీచిన బొమ్మలాగ పెడమొగం పెట్టనివాణ్ణి స్నేహితుణ్ణిగా చేసుకోవాలి - అంటాడొక ప్రాకృతకవి.)**

**అ**దనులో విత్తిన విత్తనంలాగ మంచి సమయంలో ఆడిన మంచి మాట ఎంత మంచిని పెంచుతుందో ఇతరుల అనుభవంతోనేకాక, నా అనుభవంతోను గ్రహించాను.

మా కళాశాలలో ముగ్గురు మహామూఢులు ఉండేవారు. వాళ్లు ఒక్కొక్క తరగతిలో రెండు మూడు సంవత్సరాలు ఉంటూ దేకుతూ వెళ్లేవాళ్లు. వారికి మట్టిబసవడు, రాతి బసవడు, చెక్క బసవడు అని పేరు పెట్టారు తద్జ్ఞులు. మట్టిబసవడు ఎన్నో దండయాత్రలు చేసి చివరకు వ్యాకరణశిరోమణి పట్టాపుచ్చుకొని దేశం మీద పడ్డాడు ఉద్యోగం కోసం. రాతి బసవడు నా సహాధ్యాయుడయ్యాడు.

పాపం అతని తప్పేమీలేదు. రాత్రంతా చదివేవాడు. తెల్లవారి స్నానంతోపాటు చదువంతా నీరుగారి పోయేది. ఆరోగ్యంతో అందంగా ఉండేవాడు. పరీక్షలలో మార్కులు ఒక్క అంకెను దాటేవి కావు. ఎందుకితడు ఇంత మొద్దు - అని అనుకునే వాడిని. ఇతరులు హాస్యం చేసినా నేను ఏమీ అనేవాడిని కాదు. అతణ్ణి సానుభూతితో చూసేవాడిని. అతని లోపం ఏమీలేదు. దుర్విధి, దుర్విలాసం.

ఆరు నెలల పరీక్షలు జరిగాయి. అతని మార్కులు దేనిలోను 10, 12ను దాటలేదు. చాల చింతాక్రాంతుడై నా వద్దకు వచ్చాడు. నా స్వభావంలో ఒక మంచి ఉంది. ఎవరేమి చెప్పినా శ్రద్ధగా వింటాను. సాధ్యమయితే ఒక మంచి మాట, కాకపోతే మౌనం. ఇది మా నాన్నగారి గుణం, వారసత్వం. నాతో తన బాధ చెప్పుకొని ఏడ్చాడు. నా మనస్సు కరిగింది చెప్పాను. "చూడు రామన్నా! (పేరు రామాచార్లు) సంస్కృతం చదివారు? సంస్కృతం ముక్కలు నోట కరచిన మాత్రాన మేధావా? నీకు ఇది రాలేదు. మరొకటి ప్రయత్నం చేయి. నేను నా అమ్మా, తాతల బలవంతాన చదువు తున్నాను. గాని... నీవు ప్రైవేటుగా మూడవ ఫారం ప్యాసుకా, టీచర్స్ ట్రైనింగ్ చేయి, బడిపంతులు ఉద్యోగం దొరుకుతుంది. హాయిగా జీవితం గడుపు. బతుకు ముఖ్యం. సంస్కృతం కాదు. తర్వాత ఇష్టం ఉంటే చదువుకో" అని సలహా ఇచ్చాను.

నా మాట అతనికి సూటిగా తాకింది. మరుసటి దినం నా వద్దకు వచ్చాడు. "రాముడూ, ఒక రహస్యం. నేను వెళ్లిపోతున్నాను. ఎవరికీ చెప్పక. ఎలాగయినా థర్డ్‌ఫారమన్నా పాసవుతాను. సవ్యంగా అంతా జరిగితే నీకు వ్రాస్తాను." అన్నాడు. నేను, అతను తన విషయం చెప్పేవరకు రహస్యం దాచుతానని మాట ఇచ్చాను.

అతను వెళ్లిపోయాడు. నేను ఇంటిల్లిపాదికీ సన్నిహితుడిని. అతని అక్కగారు నర్సమ్మక్క భర్తకు జాబులు వ్రాయడానికి మంచి భాషకు నేనుండాలి. "రాముడూ బావగారిని రమ్మని రాయరా. చాల బాధపడుతున్నానని వ్రాయరా" అనేది. నేను రఘువంశం, కుమారసంభవాలలోని విరహ వర్ణనలు జోడించి వ్రాసేవాడిని. భర్త తాసీల్దారు. ఎక్కడ వస్తాడు త్వరగా? వాళ్లంతా అడిగారు. తమ కుమారుని ఆచూకీ తెలుపమని. నాకేం తెలుసు?

మా పెద్దమ్మాయి 1954లో పుట్టింది. బారసాలకు అత్తవారి ఊరు వెళ్లాను. మద్రాసు బొంబాయి రైలు మార్గంలో రాయచూరు తర్వాత యాద్‌గిరి స్టేషనులో దిగి బస్సులో ముప్పైమైళ్లు పయనిస్తే సురపురం-అత్తవారి ఊరు. యాద్‌గిరి స్టేషన్‌లో దిగాను. తెల్లవారుజాము. టికెట్ టికెట్ అంటూ స్టేషను మాస్టర్ దగ్గరికి వచ్చాడు. గొంతు ఎక్కడో విన్నట్టుందే అనుకొని "తమ గొంతు ఎక్కడో విన్నాను" అన్నాను. "మొదట టిక్కెట్ ఇవ్వండి. బండి వెళ్లిన తర్వాత మాట్లాడుకుందాం" అన్నాడు అతను. నేను అక్కడ నిలబడి ఆలోచిస్తున్నాను టికెట్ అందజేసి.

గొంతు పోల్చుకున్నాను. ఒరె ఒరె ఒరె! రాతి బసవన్న కదూ! అనుకున్నాను. "ఇప్పుడు చెప్పండి" అంటూ వచ్చాడు. ఇరవై ఏడేళ్లకాలం... దాదాపు ఒక తరం గడిచింది. ఆజానుబాహువుగా పెరిగాడు. మీరు నా సహాధ్యాయుడు రామాచార్ల... గొంతు... అంటూ నీళ్లు నమిలాను. చేతిలో ఉన్నలైటు కింద పడేసి "ఒరే ఒరె! రాముడు కదూ! నిన్ను తలచుకోని గడియలేదనుకో" అంటూ నన్ను పైకెత్తి కావలించుకున్నాడు. "ఇక్కడ నేను స్టేషను మాస్టరును. అసిస్టెంట్ సెలవు మీద ఉన్నాడు. డ్యూటీకి రావలసి వచ్చింది. క్వార్టర్సుకు వెళ్లదాం. నీవు దారి చూపిన కథ చాల ఉంది. సురపురానికి బస్సా? గంటకు ఒకటి. బారసాల ముహూర్తం దాటకుండా పంపే ఏర్పాటు చేస్తా" అంటూ పోర్టర్‌ను పిలిచి నా చేతి సంచీ అతని చేతికిచ్చి, "అమ్మగారికి చెప్పు, తెల్లవారుతోంది. అయ్యగారి ఫ్రెండ్ వచ్చారట. కాఫీ, టిఫిన్ రెడీగా ఉండాలట –" అని హుకుములపై హుకుములు ఇస్తూ పోయాడు. అతని ఆనందం, సంరంభం చూడముచ్చటగా ఉన్నాయి.

క్వార్టర్స్ చేరి ఏకంగా స్నానాదులు ముగించుకొని ఫలహారం ముందు పెట్టుకొని కూచున్నాము. కథ చెప్పాడు.

టికెట్ లేకుండా బండి ఎక్కాడు కట్టుగుడ్డలతో, ధర్మవరం జంక్షన్‌లో దింపేశారు. ఊళ్లోకి వెళ్లాడు. ఒక ఉపాధ్యాయుని ఇంటికి వెళ్లాడు. తన సంగతి చెప్పాడు. ధర్మవరంలో నీటికి కటకట ఆ కాలంలో. చెరువుకు మైలు దూరం. "అబ్బాయ్! నేను నీకు ఒక వారం ఇస్తాను. తక్కిన ఆరువారాల భోజనం ఏర్పాటుకు ప్రయత్నిద్దాం. నాకు చెరువు నుంచి పూటకొక బిందె మంచి నీళ్లు తెచ్చి పెట్టాలి. అరుగుమీద గదిలో పడుకోవచ్చు" అన్నాడు ఆ ఉపాధ్యాయుడు. ఒప్పుకున్నాడు ఇతడు.

వారాలు దొరికాయి. బుద్ధి వికసించింది. సంస్కృతం పాఠాలు వల్లెవేసిన పద్ధతి అంతా కంఠపాఠం. ఆరు నెలల శిక్షణతో థర్డ్‌ఫారంలో చేర్పించాడు ఆయన. బుద్ధి చురుకుదేరింది. శంకరనారాయణ డిక్షనరీ, నెస్‌ఫీల్డ్ గ్రామర్ కంఠపాఠం, స్కూల్లో అతనికి శంకరనారాయణ ముద్దుపేరు. ఆరోఫారానికి వచ్చాడు. అంతవరకు అజ్ఞాతవాసమే.

అప్పుడు దిగాడు. ఒక ఎం.ఎస్.ఎమ్. రైల్వే అధికారి. శ్రీవైష్ణవుడు, అల్లుళ్ల వేట కోసం, ఉపాధ్యాయులందరూ ఇతనిని సిఫార్సు చేశారు. అయితే ఒక షరతు. రైల్వేలో

ఉద్యోగం ఇప్పించిన తర్వాతే వివాహం. ఇది హెడ్‌మాస్టారు విధించిన షరతు. ఆరవ ఫారం ప్యాసయ్యాడు. రైల్వే గుమాస్తా ఉద్యోగం దొరికింది. ఎంత అదృష్టం అన్నారు. స్కూలు సిబ్బంది, తల్లిదండ్రులను పిలిపించి నిశ్చితార్థం, వివాహం జరిపించారు. అతడు రైల్వే అత్యవసర పరీక్షలు ప్యాసయి స్టేషన్ మాస్టరయ్యాడు. ప్రస్తుతం షోలాపూర్ డివిజన్ ఇన్‌స్పెక్టర్ పదవికి సెలెక్టయ్యాడు. ఇంకా పదహైదు సంవత్సరాల సర్వీసులో రెండు మూడు పై పదవులు లభించవచ్చు.

"ఒరేయ్! నీవు సకాలంలో మంచి సలహా ఇచ్చావురా, సంస్కృతం వల్లింపు ఇంగ్లీషుకు తగిలించాను. సంస్కృతం రానందిగాని, ఇంగ్లీషు రాక ఛస్తుందా?" అని నవ్వాడు. "మీ గొప్పతనం కాదండీ, మంచి నీళ్ల బిందెలు మోసిన మహాత్యం! మెడ, మెదడులోని కండరాలు, కణాలు కదిలి తెలివి బయటపడింది" అన్నది భార్య. ఆమె మెట్రిక్ ప్యాసయింది. అందరం విరగబడి నవ్వాము.

"అంతా నీ అదృష్టం, స్వయంకృషి. నా సలహా లేకపోయినా నీవు పాఠశాల వదిలే వాడివే. కాలం, తోసుకుపోతుంది" అన్నాను. "అది కాదు అన్నగారూ, మీ మంచి మాట అమృత గుళికలాగ పనిచేసింది కదా!" అన్నది అతని భార్య.

మరొక తుమ్మమొద్దు ఏ.వి.సుబ్రహ్మణ్యం. రాయవెల్లూరు వాడు. తెలుగు కూడ వచ్చు. ఆజానుబాహువు. నాకన్నా రెండు మూడేళ్ళు పెద్దవాడు. రాతిబసవన్నకన్నా నల్లరాయి. ధూమశకట ముద్దిశ్య లేఖో లిఖ్యతామ్-రైలును గురించి వ్యాసం వ్రాయండి- అని ప్రశ్న ఇచ్చారు. నేను సంస్కృత వ్యాసరచనలో కాలేజీకే మొనగాడినని పేరు, అప్పటికే సాక్షి, వదరు బోతు, ఇతర వ్యాసాలు చదివి విషయం సేకరించి దాదాపు వంద వ్యాసాలు మంచి శైలిలో వ్రాశాను. మూడు పుటలు వ్రాయడమంటేనే తలప్రాణం తోకకు వచ్చేది. సుబ్రహ్మణ్యం పత్తు పక్కం - పదిపుటలు వ్రాశానన్నాడు. నాకు ఆశ్చర్యమయింది. "ధూమశకటం గిడ్ గిడ్ ఇతి గచ్ఛతి" అని వ్రాశాడు. గిడ్ గిడ్ పది పుటలు. మొదటిది, చివరిది మాత్రం పదాలు. ఉపాధ్యాయులు క్లాసులో నిలబెట్టి తిట్టారు. సిగ్గులేదా? గాడిదలాగా పెరిగావు. రాకపోతే ఊరికే ఉండు. అంతేకాని గిడ్‌గిడ్ అని పది పుటలు పాడుచేస్తావా? ఇలా అరగంట వషట్కారాలు.

సాయంత్రం ఏకాంతంగా నా సలహా అడిగాడు "నీకు కాశీ విశ్వవిద్యాలయంలో మహామహోపాధ్యాయ చిన్నస్వామి శాస్త్రివారు బంధువన్నావు గదా! పోయి ఆయన




కాళ్లమీద పడు, గంగాజలాలు నీ అవివేకాన్ని పోగొడుతాయి. విశ్వేశ్వరుడు కరుణిస్తాడు" అన్నాను. స్వయంగా కొని తెచ్చుకున్న అవమానం మరి. ఉండలేక పోయాడు. మరుసటిదినం నుంచి కనిపించలేదు.

రెండు దశాబ్దాల పైచిలుకే గడిచింది. నేను నా మిత్రులు వడ్లమూడి సత్య నారాయణగారు, ఆయన కుమార్తె సంబంధం కోసం గుంతకల్లు దగ్గరి ఉరవకొండకు బయలుదేరాము. మద్రాసు–బొంబాయి మెయిలు ఎక్కాము. అంతకుముందే బండి ఎక్కి సామాను సర్దుకుంటున్న ఒక వ్యక్తి మాటలు వినిపిస్తున్నాయి. వేషం పండిత వేషం.

"మాకీ కాశీకి పోవాల ఉంది. బొంబాయి నుండి వేరే గాడీ పట్టుకుంటాం. మాదీ ఇక్కడే వేలూరు. మగర్ (కాని) చాలాకాలం కాశీలో ఉన్నాం. తెలుగులో గల్తీలు ఉంటయ్..." అని మాట్లాడేస్తున్నాడు. బండి కదిలింది. అతడు సామాను సర్ది ఇటు తిరిగాడు.

"మీరు సుబ్రహ్మణ్యం కదూ?" అన్నాను మనిషిని చూడగానే. "అడడా! రామ చెంద్రా ఎంగె వందే. ఎంగె పోరే?" (ఎక్కడికి వచ్చావ్? ఎక్కడికి వెళ్తున్నావ్?) అన్నాడు. నాకు మాట్లాడే అవకాశమే ఇవ్వకుండా కలగాపులగపు తెలుగులో "నేనిప్పుడు పాత గిడ్‌గిడ్ ఇతి గచ్ఛతి సుబ్రహ్మణ్యం కాదు. బెనారెస్ విశ్వవిద్యాలయంలో సంస్కృత రీడర్‌ను తెలుసా? మీమాంసావ్యాకరణ, తర్కవేదాంత శాస్త్రాల్లో ఆచార్య పరీక్షలలో ప్రథముణ్ణి సుమా! నాలుగైదు శాస్త్రవ్యాఖ్యాన గ్రంథాలు వ్రాశాను. అదృష్ట ముంటే ప్రొఫెసర్ అవుతాను" అంటున్నాడు.

నేను మధ్యన అడ్డుకొని "సుబ్రహ్మణ్యం! అంతా గంగాజలప్రభావం" అన్నాను.

"నిజమే సుమా– అంటూ తన కథ చెప్పాడు. ఊరికే పోతే తిడతారని బండెక్కాడట. పది రూపాయలకన్న ఎక్కువ డబ్బు లేదు. జాలార్‌పేటలో దిగాడు. అక్కడి నుంచి కాశీకి పోయే ఒక వృద్ధదంపతుల పరిచయమయింది. సుబ్రహ్మణ్యం బ్రాహ్మణవటువు కదా! స్వచ్ఛంగా ఉన్నాడు. వృద్ధురాలు అడిగింది. "నాయనా ఎక్కడికి వెళ్లుతున్నావు?" అని. "కాశీకి వెళ్లుదామనుకుంటున్నాను" అన్నాడు ఇతడు. "అయితే మాకు సహాయకుడుగా ఉండు, రైలు ఛార్జీలు మేము పెడతాము. యాత్ర పుణ్యం దక్కుతుంది." అంటూ, "కాశీలో ఏం పని?" అని అడిగింది ముసలమ్మ. "సంస్కృతం చదవడానికి, చిన్నస్వామి శాస్త్రిగారి సన్నిధికి" అన్నాడు ఇతడు. వృద్ధుడు శాస్త్రిగారి పేరు విన్నాడు గనుక సుబ్రహ్మణ్యాన్ని విశ్వసించాడు. అదృష్టం తోసుకొని వచ్చింది. కాశీ చేరిన పిదప వాళ్ల అవసరం తీరే వరకు వెంట ఉండి, చిన్నస్వామి శాస్త్రిగారి ఇంటికి వెళ్లి ఆయనకు సాగిలపడి ప్రవర చెప్పుకున్నాడు సంప్రదాయాను సారం. అప్పుడు చలికాలం ప్రారంభం. "దినమూ తెల్లవారూ జామున గంగాస్నానం చేసిరా. మా ఇంట్లో మా పిల్లలతోపాటు ఉండు. ఇది నీకు నెల రోజుల పరీక్ష. నీవు నెగ్గినట్టు నాకు విశ్వాసం కలిగితే చదువు చెప్పడం తర్వాత" అన్నారు శాస్త్రిగారు. సుబ్రహ్మణ్యం ఆ పరీక్షలో నెగ్గాడనీ, విద్యాసంవత్సరం ప్రారంభం కాగానే సంస్కృత కళాశాలలో చేరి మహావిద్వాంసుడయ్యాడని

చెప్పనక్కరలేదు. అక్కడే అధ్యాప కోద్యోగమూ ఇప్పించారు గురువుగారు.

అంతటి చింత మొద్దులూ, తుమ్మ మొద్దులూ మంచి దారుశిల్పి చేతిలో పడి దేవతామూర్తులయిన కథ ఇది.

సుబ్రహ్మణ్యం తన కథ వినిపిస్తుండగా గుంతకల్లు సంధి వచ్చింది. "రామచంద్రా! దీనికంతా మూలకారణం నీ మంచి మాట" అంటూ కన్నీటితో వీడ్కోలిచ్చాడు.

మరొక మంచి మాట నాకు ఎప్పుడూ ఆనందం కలిగిస్తుంటుంది. ఈయూణ్ణి జగన్నాథాచార్యులు నెల్లూరులో నా మిత్రునికి బావమరిది. మంచి సంపన్నుడు, మద్రాసులో ఎం.ఏ., ఎం.లిట్., మొదలయిన పరీక్షలు ఇచ్చి పరిశోధన చేశాడు. ప్రతిభావంతుడు. నేను నెల్లూరు పాఠశాలలో విద్యార్థిగా ఉండగా పరిచితుడు. అమ్మవారు పోసింది. చావుబతుకుల్లో ఉన్నాడు. అప్పుడు నాతో మొర పెట్టుకుంది నా మిత్రుని చెల్లెలు, అతని భార్య నేను ఉద్ధరిస్తానని. "అమ్మా! ఆయన్ను బదికించుకోడం నీ చేతుల్లోనే ఉంది. ఉదయం స్నానం చేసి శుచిగా లక్ష్మీసహస్ర నామస్తోత్రం పదినాళ్లు పారాయణంచేయి. లక్ష్మీపిరాట్టి అనుగ్రహిస్తుంది" అన్నాను.

ఇవన్నీ మా అమ్మకు చెప్పాను అలవాటుకొద్దీ. ఆమె మందహాసం చిందిస్తూ "నీ మాటలో ఏముందిరా? నీ పెద్దలు చేసిన పుణ్యం నీనోట్లో నుంచి మాటలు పలికిస్తుంది" అన్నది.

"పుణ్యంతో పాటు ఈ విషయాల్లో మానవయత్నమూ ఉందిగదా" అన్నాను. ఆమె వెంటనే ఈ శ్లోకం చదివింది.

**"ఉద్యమం సాహసం ధైర్యం**
**బుద్ధిః శక్తిః పరాక్రమః!**
**షడేతే యత్ర వర్తంతే**
**తత్ర దేవః సహాయకృత్!!"**

**(పరిశ్రమ, తెగువ, ధైర్యం, బుద్ధి, బలం, పరాక్రమం - ఈ ఆరూ ఉన్నచోట దైవం తోడ్పడుతుంది.)**

## 33

# నేను చూచిన అద్భుతాలు

"యం సంతి గుణాః పుంసాం
వికసంత్యేన తే స్వయమ్।
న హి కస్తూరికామోదః
శపథేన నివార్యతే॥"

**(ఎవరికైనా గుణాలు, యోగ్యతలు ఉన్నప్పుడు, అవి వాటంతట అవే బయట పడి ఇతరులను ఆకట్టుకుంటాయి. కస్తూరి గుమగుమలు ఎవరైనా ఒట్టుపెట్టిన మాత్రాన ఆగవు.)**

ప్రతి వ్యక్తీ ఏవో అద్భుతాలను తన జీవితంలో చూచే ఉంటాడు. ఆ అనుభూతితో పరవశుడయ్యే ఉంటాడు. నాకూ అలాటి పారవశ్యం చిన్నతనంలో కలిగింది చాలా సార్లు. చిన్నప్పుడు అంతా ఆశ్చర్యమే కదా!

నా చిన్నతనంలో ఇద్దరు జపాన్ పిల్లలు మా ఊరికి వచ్చారు. పిల్లవాడికి పన్నెండేళ్లు, పిల్లకు సుమారు ఆ వయస్సే ఉండవచ్చు. జపాన్ వారు చౌకబారు మనుష్యులని, వారి సరుకు నాసిరకం అని బ్రిటిష్ ప్రభుత్వం ప్రచారం చేస్తున్న కాలమది. పార్కరు కలం

మూడు రూపాయలున్నప్పుడు జపాను గాజుపాలీ కలం అణాకు వచ్చేది. దమ్మిడీకి ఒక నిప్పుపెట్టె. వారు దేశదిమ్మరులు, చవకగా బతికేవారు, మనుష్యులను మినహాయించి అన్నీ తినేస్తారు అని ప్రచారం. ఎందుకంటే, రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యంలో జపాన్ వారే బ్రిటిష్ వారికి అన్ని విధాల పోటీదారులు.

ఆ జపాన్ పిల్లల వద్ద ఒక జోలెలో రెండు జతలు గుడ్డలు, వినోదాలు చేసే రెండు మూడు పరికరాలు ఉండేవి. కాళ్లు ఊడదీయడానికి వీలయిన ఒక కుర్చీ, చిన్నది అందులో ఒకటి. వాళ్లు రకరకాల మొగ్గలు వేసి, ఎగిరి గంతులు వేసి ఆడేవారు. భాషరాదు. అంతా సైగలతోనే, మొదట కుర్చీ ఒక కాలు ఊడదీసి నిలబెట్టి, ఇద్దరూ బ్యాలెన్స్ చేసేవారు. తర్వాత రెండు కాళ్లు తీసి తర్వాత మూడు కాళ్లు తీసి, ఆ అమ్మాయి ఒంటి కాలి కుర్చీపై మొగ్గలు వేస్తుండగా, ఆ పిల్లవాడు ఆ పిల్లపడిపోతుందని భయం నటిస్తూ తక్కిన మూడు కాళ్ల స్థానంలో గడ్డిపోచలు పెట్టి, ఇక భయంలేదు అన్నట్టు



నవ్వేవాడు. మరీ ఆశ్చర్యకరమైన విషయం. ఆ ఒంటికాలి కుర్చీని అరచేతిలో పెట్టుకొని, మహావీరుడిలాగ, రెండు కాళ్లూ పంగచాచి నిలబడేవాడు. ఆ అమ్మాయి కుర్చీ వెనుక పట్టీపై నిలబడే రకరాల ఫీట్లు చేసేది. అరచేతిలోని ఒంటి కాలి కుర్చీ ఎలా నిలిచేదో ఆ అమ్మాయి బ్యాలెన్సుతో ఆ సాహసాలు ఎలా చేసేదో ఇప్పటికీ ఆశ్చర్యమే! ఆ కుర్రవాడు ఎడమ అరచేతిలో ఒంటికాలి కుర్చీ నిలుపుకొని, భయం నటిస్తూ కుడి చేతిని తక్కిన మూడు కాళ్లు ఉన్నచోట కిందికి పైకి ఆడించేవాడు. – అక్కడ కాళ్లు పెట్టాననే నటనతో, తర్వాత నవ్వేవాడు. భాష రాకపోయినా, సైగలతో, కళ్లవంకరలతో, వెక్కిరింతలతో, నవ్వులతో వివిధ భావాలు ప్రదర్శిస్తూ ప్రేక్షకులను వినోదింపజేసేవాడు. దాదాపు ఈ రెండు గంటల ప్రదర్శనకు వాళ్లకు గిట్టుబాటయ్యేది తలాకానీ వేస్తే, ఒక రూపాయి.

దొమ్మర్లలో మగవాళ్లు సాహసాలకు పేరు, స్త్రీలు సాహసాలకే కాక సౌందర్యానికి పెట్టింది పేరు. దేశ దిమ్మర్లయిన ఈ దొమ్మర్లు ప్రపంచమంతా తిరుగుతుంటారు. గాథాసప్తశతిలో దొమ్మరాటను పోలిన మల్లుల వీధి ఆటలు, మల్ల స్త్రీల నాట్యాది విన్యాసాలు వర్ణితాలు. ఈ దొమ్మర్లు పూర్వపు సోవియట్ యూనియన్‌లో రోమనీలనే పేరుతో ఉన్నారనీ, ఈ పదం డోమ్ అనే హిందీ పదం వికృతి అని రాహుల్‌జీ సాంకృత్యాయన్ "మేరీ సోవియట్ యాత్రా" అనే గ్రంథంలో రాశారు. ఈ దొమ్మర్లు అనాది అయిన తెలుగు జాతి అని నా విశ్వాసం.

నా చిన్నతనంలో ఒక దొమ్మరాట చూచాను. దానిలో ఒక పదహారేళ్ల దొమ్మరి బాల చేతులు కట్టుకుని వెనక్కు మొగ్గవాలి వెనుక ఒ పళ్లెంలో పెట్టిన ముక్కను నోటితో అందుకుంటుంది. అప్పుడు ఆమె పొట్టపై ఒకడు ఎక్కి మొగ్గలు వేస్తాడు. ప్రేక్షకులు గుండెలు తీవ్రంగా కొట్టుకొని ఆగిపోయేంతటి సాహసకృత్యం (ఫీట్)అది.

నేను కొన్నేళ్ల తర్వాత వల్లభరాయని క్రీడాభిరామం చదువుతున్నప్పుడు, ఓరుగంటి లో మైలారభటులు ఇలాటి సాహసాలు చేస్తున్న ఘట్టంలో

**వెనుకకు మొగ్గ వ్రాలి కడు విన్ననువొప్పగ దొట్టె నీటిలో**
**మునిగి తదంతరస్థమగు ముంగర ముక్కున గ్రుచ్చుకొంచు లే**
**చెను రసనా ప్రవాలమును శీఘ్రము గ్రుచ్చెను నల్లపూస పే**
**రనుపమలీల నిప్పుడుచపాయము లిట్టివి యెట్టు నేర్చెనో**

అనే పద్యాన్ని చదువుతూ, ఎగిరి గంతువేశాను. నేను చూచిన దొమ్మరిసాని పళ్లెంలో

బెల్లం ముక్కను అందుకుంది నోటితో, శ్రీనాథుని మైలారభటుల పడుచు చేతులు కట్టుకోక నీటిలోని ముంగర ముక్కుకు గుచ్చుకుని, నాలుకతో నల్లపూసల పేరు గుచ్చింది. అంతే వ్యత్యాసం! శ్రీనాథుడంతటివాడు వర్ణించిన విద్యను నేను చిన్నతనంలోనే చూచాను గదా అనే సంతోషం సహస్రమాస పూర్తి అయినా నన్ను వీడడం లేదు.

తిరుపతిలో 1926–27 ప్రాంతాలలో మరొక అద్భుతం చూచాను. విద్యార్థులం కొందరం ఒక సాయంకాలం నక్కలేరుకు పోదామనుకుంటుండగా, ఒక ఆజాను బాహుడయిన వ్యక్తి మా దగ్గరికి వచ్చాడు. తను తెనాలివాడినని, ఇప్పుడే బండి నుంచి దిగి వచ్చానని అన్నాడు. ప్రతి దినమూ యాత్రికులను ఇలాటి వాళ్లను నూర్లార్లను చూస్తుంటాము కనుక ఈయన మాటలను అంతగా పట్టించుకోలేదు. అతడు మా పరాకు చూచి, మా దృష్టి తనవైపు తిప్పుకోడానికి, నా ముందుకు వచ్చి "నాయనా! ఒక అర్ధణా ఉంటే ఇవ్వు" అన్నాడు. అర్ధణాకు వీసె (ఆరుసేర్లు) వంకాయల కాలమయినా, అర్ధణాయే కదా; పెద్ద నష్టమేమీ లేదులే, అని అనుకుని అర్ధణా అతని చేతిలో పెట్టాను. దానిని అతడు చిటికెలో పట్టుకొని నొక్కి, మళ్లీ నా చేతికి అందించాడు.

ఆశ్చర్యం! నా అర్ధణా తన స్వరూపంలో లేదు. రెండు ఉద్ధరిణుల నీళ్లు పట్టె చిన్న గిన్నెలాగ అయింది. నేను బిత్తరపోయి నాపక్కన ఉన్న మిత్రులందరికీ చూపాను. వారు కూడా నాలాగే ఆశ్చర్యపోయారు. ఆయన మా ముఖకవళికలను, భావాలను, పరిశీలిస్తున్నాడు. నేను ఆ అర్ధణా ఆయనకు తిరిగి ఇస్తూ, "మీ బల ప్రదర్శన చల్లగుండా! నా అర్ధణా పాడు చేశారు. మాకూ ఉపయోగపడదు. మీకూ ఉపయోగపడదు" అన్నాను.

ఆయన ఒక నవ్వు నవ్వి అరచేతిలో గిన్నెలా ఉన్న అర్ధణాను బోల్లించి పెట్టుకొని, రెండో చేత్తో నొక్కాడు. నన్ను చేయి చాపుమని, నా చేతిలో పెట్టాడు. మరొక ఆశ్చర్యం! అర్ధణా ఎప్పటి స్వరూపం దాల్చింది. అందరూ దాన్ని విరగబడి చూచారు. మేము నక్కలేరుకు వెళ్లడం మానివేసి అతని చుట్టూ మూగాము. అప్పుడు ప్రారంభించాడు అతడు స్వీయచరిత్రను.

ఊరు తెనాలి అని ఇదివరకే చెప్పాను. పేరు రంగయ్యో రామయ్యో, అన్నయ్యో సరిగా గుర్తులేదు. వెలనాటి వైదిక బ్రాహ్మణుడు. హనుమదుపాసకుడు. పెద్ద పెద్ద సాహసాలు చేయగలడు. వంద సేర్ల బియ్యం బస్తాను పైన రెండు కొనలూ పట్టుకుని ముఖం వరకు ఎత్తగలడు. ఆరంగుళాల చుట్టుకొలత గల గునపాలను రెండు చేతులతో

పట్టుకొని ఉండేలు బద్దలాగ వంచగలడు. కాళ్లకు మణుగు తూకం ఇనుప రాళ్లు కట్టుకుని పది గజాలు నడవగలడు. చాచిన చేతులకు చెరి పదిమందిని వేలాడదీసుకోగలడు. తలతో డీకొట్టి రెండడుగుల మందం గచ్చు గోడను పడగొట్ట గలడు. పిడికిటితో గుద్ది పీచుతో ఉన్న టెంకాయలను పగులగొట్టగలడు. కాని ప్రస్తుతం భోజనం లేక బాధపడుతున్నాడు. భోజనమంటే సరైన భోజనం. పూటకు సేరు బియ్యం, అర్ధసేరు కందిపప్పు, సేరు నెయ్యి, సేరుపాలు, సేరు పెరుగు, ఇంత మాత్రం చాలు. కూరగాయలు లేకపోయినా పరవాలేదు. తను శాకాహారి గనుక, ఉంటే ఒక గుమ్మడికాయ, వీశ వంకాయ, అర వీశ బంగాళదుంప, ఇదీ సాధారణమైన దినసరి భోజనం.

మేము అంతా విన్నాము. ఆశ్చర్యమేమిటంటే అతడు మాతో తన గోడు చెప్పుకోడం, మేమూ పెద్ద మనుషులవలె వినడమూను.

ఆయన సాహసగాథ వినసొంపుగా ఉందిగాని, భోజనపరాక్రమం విని హతాశులయ్యాము. ఆ గజరాజును ఎలా మేపగలము? నేను ఆయనతో అన్నాను.

"స్వామీ, మీరు చాలా గొప్పవారు. అర్ధణాయే మీ గొప్పదనానికి సాక్షి. అర్ధణా బిళ్ల సాక్షిగా మీరు గొప్పవారు. కాని మేము పాఠశాల విద్యార్థులం, కష్టపడి ఒక పూట మీకు ఆతిథ్యమియ్యగల మేమోగాని, తక్కిన దినాల భోజనం సంగతి ఏమిటి? ఎవరినైనా పెద్దవాళ్లయిన దాతలను చూడండి.

ఆయన నవ్వి "మీ దగ్గర చెప్పుకున్నట్టుగా, పెద్దవాళ్ల దగ్గర చెప్పుకోలేను. కొంత ఆత్మాభిమానం అడ్డువస్తుంది. మీ పాఠశాలలో ఒకసారి నా బలం చూపుతాను. అది ప్రచారమయి కొంత మేలు చేస్తుంది" అన్నాడు.

"ఈ రాత్రి భోజనమో!" అనడిగాను. "రాత్రికి సర్దుకుంటాను. ఉన్న రూపాయిపెట్టి గెల అరటిపళ్లు కొన్నాను. కొంత చిల్లర ఉంది. ఏదో ఫలాహారంతో గడుపుతాను. రేపటి సాయంత్రమే ఏర్పాటు చేయండి ప్రదర్శనం" అన్నాడు

అతని మాటలలో ఇతరుల దగ్గరికి సరాసరిపోవడం అవమానకరమని ధ్వనించి సరేనన్నాము. నేనూ, కలచవీడు శ్రీనివాసాచార్యులనే నా వరిష్ఠ సతీర్థ్యుడు పూనుకుని, ప్రిన్సిపాలు దగ్గరికి పోయే ధైర్యం లేక సహృదయులయిన గిరిధరాచార్యులు మొదలయిన ఉపాధ్యాయులను బతిమాలి ప్రదర్శనం ఏర్పాటు చేశాము. ప్రక్కన ఉన్న ధర్మశాలలో ఉన్నవారికి, మహంతు మఠంలో ఉన్నవారికి తెలియచేశాము. త్వరలో ఊరంతా ఈ

వార్త వ్యాపించింది. ఊరిలోని పహల్వానులు, మహంతు మఠంలోని పహల్వానులు, అల్లరి చేద్దామనుకొన్న దుండగులూ వచ్చారు. దాదాపు రెండు మూడు వందల మంది గుమిగూడారు. మా పాఠశాలలోని నమ్మాళ్వారు సన్నిధి ముంగిట బయలు నిండిపోయింది.

తెనాలి వైదిక పహల్వాను సవినయంగా తన సంగతి విన్నవించుకున్నాడు. ఈనాడు ప్రిన్సిపాలుగారు లేరు గనుక ఎవరో ముఖ్యాచార్యులున్నారు. అనుమతించారు. బలపరాక్రమాలలో పూర్వం భారతీయులు పొందిన విఖ్యాతిని, మల్ల యుద్ధ విశేషాలను గురించి రెండు మాటలు చెప్పారు. పహల్వాను తన సాహసకృత్యాలు చూపాడు. ఏ వ్యాపారస్థుణ్ణో అడిగి మణుగురాళ్లు తెచ్చాడు. ఆ వ్యాపారి మొదట ఒప్పుకోలేదు, తూనిక రాళ్లు లక్ష్మి, తొక్కగూడదు అని. అతనికి ఏదో ఆశచూపి తెచ్చుకోగలిగాడు. గునపమూ ఏ వడ్డివారినో అడిగి తెచ్చాడు. వాళ్లూ వచ్చారు. నిజంగా వంచగలడా, లేదా అని చూడడానికి.

అన్నయ్య (ఈ పేరు ప్రస్తుతానికి) గారి ప్రదర్శన దాదాపు మూడుగంటలు సాగింది. మధ్య మధ్య పిట్టకథలు. ప్రేక్షకులు ముగ్ధులయిపోయారు. చేతులకు వ్రేలాడండి అని అతడు కోరినప్పుడు పెద్ద పెద్ద వస్తాదులే ముందుకు వచ్చారు. ఆయన తన చేతులకు వేలాడుతున్నవారితోపాటు రథోత్సవాలలోని బుట్టబొమ్మలాగ గిరగిర తిరిగాడు. ఇకనేమిటి? అల్లరి చేద్దామని వచ్చినవారి నోళ్లూ చేతులూ కట్టుబడి పోయాయి. మహంతు మఠంలోని బ్రాహ్మణ మల్లులు ఆయనను పైకి ఎత్తుకొని గంతులు వేశారు.

ఆయన మనోభీష్టం నెరవేరింది. లౌక్యం ఫలించింది. ఆయన తన భోజన పరాక్రమం గురించి అక్కడ ఉపన్యసించాడు. అందరూ నోరు తెరచుకునీ కళ్లు వెడల్పాచేసీ విన్నారు. మహంతు మఠంవారు "మాతో జన్మ పర్యంతం ఉండండి. మాకు కిటుకులు నేర్పండి" అంటూ కేకలు వేశారు. ఆయన నెలకుపైగా తిరుపతిలో ఉన్నాడు.

నా మూర్ఖత్వ మేమిటో నాకు తర్వాత తెలిసింది. ఆయన పేరు ఊరు, రాసుకో లేకపోయాను. ఇలాటి ఎందరి వివరాలో రాసుకోకపోవడం వల్ల చరిత్రకే, ఎంతో ద్రోహం చేశానని ఇప్పుడనిపిస్తుంది.

మరొక సంఘటన: కడప జిల్లా రాజంపేట తాలూకా వాస్తవ్యుడయిన ఒక శ్యాండో మోటార్లను ఆపడం. మోటారు ఎదుట నిలబడి, దానిని స్టార్ట్‌చేసిన తర్వాత చేతులు

బాయొనెట్ మీద పెట్టి ఆపడం ఒక పద్ధతి. మోటారు వెనుక భాగానికి నూలు కట్టి, దాని రెండవ కొసను నడుముకు కట్టుకొని నిలబడి స్టార్ట్‌కాగానే దానిని కదలనీయకుండా చేయడం రెండవ పద్ధతి. ఈ రెండింటిలోనూ మోటారు చక్రాలు గిరగిర తిరిగి భూమిలో అడుగు లోతు గుంతలు పడ్డాయి.

కోడి రామమూర్తిగారి సర్కసు సాహసాలు నేను చూడలేదుగాని, మా నాన్న గారు చెప్పగా విన్నాను. ఆయన అంతటి ఆచారవంతుడూ కోడి రామమూర్తిగారి వద్ద కొన్నాళ్లు శిష్యరికం చేశానని చెప్పినప్పుడు విస్తుపోయాను. వారిద్దరినీ కలిపిన బంధం ఆంజనేయోపాసన. మా నాన్నగారిలోని మరొక వైచిత్రి, మద్రాసులోని, ఆనాటి శ్రీరామ మోటారు స్కూల్లో కారు డ్రయివింగ్ నేర్చుకోడం. కోడి రామమూర్తిగారు కాశీ విశ్వవిద్యాలయం నుంచి స్వస్థలానికి వచ్చిన తర్వాత ఒక మారు దర్శించాను. ఆయన చివరినాళ్లు అతి దీనంగా గడిచాయి. ఒక కవి దారిద్ర్యం గురించి, ఆకలి గురించి చెప్పిన శ్లోకం నాకు గుర్తు వచ్చింది.

"కిం కరోమి క్వ గచ్ఛామి
క ముపైమి దురాత్మనా
దుర్భరే ణోదరే ణాహం
ప్రాణై రపి విడంబితః"

**(ఈ భరించరాని పాడు పొట్ట (ఆకలి) నా ప్రాణాలను తోడి వేస్తూంది. ఏమి చేయను? ఎక్కడికి వెళ్లను? ఎవరి వద్దకు వెళ్లను?)**

# 34

# అమ్మమాట

**"లాలయేత్ పంచ వర్షాణి**
**దశ వర్షాణి తాడయేత్**
**ప్రాప్తేతు షోడశే వర్షే**
**పుత్రం మిత్ర వదాచరేత్"**

**(పిల్లలను ఐదేళ్ల వరకు ముద్దు చేయాలి. పదవ సంవత్సరం వరకు పిల్లలను అవసరమయితే కొట్టడం కూడ తప్పదు. పదహారు సంవత్సరాల ప్రాయం రాగానే, పిల్లలను స్నేహితులను చూచినట్టు చూడాలి. ప్రీతితో ప్రవర్తించాలి.)**

నేను తిరుపతిలో చేరిన ఏడు, వేసవి సెలవులకు ఊరికి బయలుదేరాను. గుంతకల్లు బండి రాత్రి తొమ్మిది గంటలకు హోసపేటలో ఆగేది. అక్కడి నుంచి ఊళ్లోకి దాదాపు రెండు మైళ్లు. ఊళ్లోకి వెళ్లి తోళప్పాచార్యులుగారి లక్ష్మీనివాస్‌లో రాత్రి ఉండి, మరుసటి రోజు ఉదయం బస్సులో రమ్మని మా పెద్దలు రాయడం వల్ల అలాగే చేద్దామనుకున్నాను. రైలు దిగి ఒక చిన్న పెట్టి, చిన్న హోల్డాలే గనుక జట్కా ఎందుకని నడక ప్రారంభించాను. స్టేషను నుంచి ఫర్లాంగు వెళ్లిన తర్వాత దారి రెండుగా చీలుతుంది. ఒకటి హోసపేట ఊళ్లోకి, రెండవది వారం వారం పెద్ద సంత జరిగే చిత్తవాడిగి అనే ప్రాంతానికి. అది కూడ కొంత దూరం పోయిన పిదప చీలి ఒకటి శ్మశానానికి పోతుంది.

నేను హోసపేట దారి విడిచి చిత్తవాడిగి దారి పట్టాను చీకటిలో తెలియక. అది చీలినదీ తెలియక శ్మశానం దారి పట్టాను. గంటసేపు నడిచాను. ఊరు రాలేదు. సాధారణంగా రెండు మైళ్లు నడవడానికి అరగంట – ముప్పావు గంటకన్నా ఎక్కువసేపు

పట్టదు. గంటకుపైగా నడిచాను. దూరంగా కొన్ని దీపాలు ఇళ్ళలాంటివి కనిపించాయి. అలసిపోయాను. ఆకలిగాను ఉంది. కానీ, రైలుమైల. స్నానం చేసిగానీ ఏమీ తినకూడదు. రెండు గంటలకుపైగానే నడిచి ఉంటాను. ఒక ఇల్లులాంటిది కనిపించింది. తలుపుమూసి ఉంది. తాళం ఉండడం చీకట్లో కనిపించలేదు. ఒక అడుగు వేయలేక వాకిటి మీదే ఒరిగిపోయాను. బాగా నిద్ర పట్టింది.

తెల్లవారుతూంది. చీకట్లో మంటలు కనిపించాయి. నక్కల కూతలు వినిపించాయి. చుట్టుపట్ల చూచాను. ఎక్కడికి చేరానో తెలీలేదు. ఇంతలో కోరమీసాల ఒకతను చేతిలో పొడుగాటి కర్రతో వచ్చాడు. నేను లేచి దిక్కులు చూస్తుండడం పరికించాడు. ఆశ్చర్యపడ్డాడు. దూరంగా నిలబడి “ఎవరయ్యా మీరు? ఇక్కడికి ఎట్లా ఊడిపడ్డారు. నాకు తెలియకుండా? నేను కాటికాపరిని, ఇది కాడు. వెళ్లండి” అని కన్నడంలో అన్నాడు. నేను దారి తప్పిన సంగతి చెప్పాను. మంచివాడు. కనికరించి హోసపేట దారి తెలిపి “పగలే కదా! భయమేమీ లేదు” అన్నాడు నవ్వుతూ. రాత్రి శ్మశానంలో భయపడలేదని వ్యంగ్యం.

నేను అతనితో శ్మశానంలో సంగతులూ అతని రాబడీ పనుల వివరాలూ తెలుసుకున్నాను. నా వేషం అతనికి ‘పాపం మంచి బ్రాహ్మణ బాలుడు’ అనే భావం కలిగించి ఉంటుంది. విసుక్కోకుండా అన్నీ వివరించి నన్ను సాగనంపాడు. “నేను కాటికాపరిని. మీకు ఏమీ ఇవ్వలేను. ఇచ్చినా మీరు తినరుగదా!” అన్నాడు. నేను అతని సానుభూతికి సంతోషించి, అక్కడి నుంచి బయలుదేరి రెండు గంటలు నడిచి హోసపేట బస్టాండ్ చేరాను. లక్ష్మీవిలాస్‌కు వెళ్లడానికి మనస్సు ఒప్పలేదు.

నేను ఆకలితో బస్సు దిగి రావడం మా ఇంట్లో అందరికీ ఆశ్చర్యం కలిగింది. నేను చెప్పిన పిదప, మా అమ్మ నాకు దిష్టితీసి పంచాయుధ స్తోత్రం పఠించింది. నా కాలకృత్యాల పిదప ఆమె అన్నది. “అరక్షితం తిష్ఠతి దైవరక్షితం” – ఏ రక్షణా లేనివాడిని భగవంతుడైన నారాయణుడు రక్షిస్తాడని పూర్వోక్తి. నిన్ను శ్మశానంలో అతడే రక్షించాడు. దీనితో నీ పీడ విరుగడయింది. నీవు చిరంజీవిగా అంటే చాలా కాలం బతుకుతావు. భగవంతుని దయగలవారిని యముడేమీ చేయలేడు. ఇంతకూ, మృత్యువనేది అందరికీ సమానం కనుకనే యమునికి సమవర్తి అని పేరు. సన్మార్గంలో ఉంటూ, సత్కార్యాలు చేసేవాడికి మృత్యుభయం ఉండదు. మనం ఎప్పుడూ మృత్యువుకు సిద్ధంగా ఉండాలి” అని చాలాసేపు

ఓదార్చింది. ఆమె మాటలు నాకు ఇంకా శిలాశాసనాలే! మరణానికి ఎప్పుడూ భయపడలేదు. భయపడను.

మరొక వేసవి సెలవుల్లో నేను హగరి స్టేషనుకు పోయాను. అక్కడ మా పెద్దమ్మ గారి భర్త పెద్దయ్య స్టేషను మాస్టరు. స్టేషను, దాని పరిసరాలు వేపచెట్లతో హాయిగా ఉండేవి. మా బంధువుల అమ్మాయి – పేరు అమ్మణ్ణి అని జ్ఞాపకం. మరి కొందరు కూడా విశ్రాంతి కోసం అక్కడికి వచ్చారు. ఆ అమ్మాయికి పన్నెండేళ్లు ఉంటాయి. మేము అచ్చనకాయలు ఆడేవాళ్లం. ఆ అమ్మాయి సంగీతం నేర్చుకునేది. సంగీతో పాధ్యాయిని ఆమెను పెడుతున్న బాధకు నాకు ఏడుపు వచ్చేది. నేను సానుభూతి చూపేవాడిని. దానితో మా ఇద్దరికీ కొంత స్నేహం ఏర్పడింది.

ఒక సాయంకాలం హగరి రైలు వంతెన ఆవలివైపు వెళ్లి రావాలనుకున్నాము. వంతెన నాలుగు ఫర్లాంగుల పొడవు ఉంటుంది. నలుగురైదుగురం. అందరూ ముందుకు వెళ్లారు. అవతలి కొస చేరారు. నేను నెమ్మదిగా నడుస్తుండగా హఠాత్తుగా గూడ్సుబండి కూత వినిపించింది. రైలు వంతెనకు ఇరుపక్కల అత్యవసర పరిస్థితులలో కార్మికులు నిలుచుకోడానికి కొన్ని గజాలకు ఒకటిగా గుండ్రటి స్థలం ఉంటుంది. నేను పరిగెత్తి దానిని చేరడానికి కూడా సమయంలేదు. గూడ్సు ఐదారు గజాలలో ఉంది. ఏమీ తోచక వెంటనే స్లీపరు కొస పట్టుకుని కిందికి వేలాడాను. గూడ్సు వెళ్లిపోయింది, మోతతో. స్లీపరు నుంచి ఎక్కి పైకి వెళ్లడం ఎలా? చేతులు సోలిపోతున్నాయి. దాదాపు ముప్పై అడుగుల కింద ఇసుక దిబ్బలు, ముళ్లూ కంపా. నా వెంట వచ్చిన పిల్లలు నా బాధ చూస్తున్నారు. నన్ను రక్షించలేరు. ఇంటికిపోయినా తిట్లు తప్పవు. రైలు పట్టాల పక్కన కూర్చుని ఉన్నారు. బిక్కమొగాలతో.

నేను అయ్యేది కానీ అని కిందికి దూకాను, గత్యంతరమే లేక. అదృష్టవశాత్తు ముళ్లూ కంపాలేని చోటపడ్డాను. పడిన అదురుకు ఎంత మెత్తని ఇసుక అయినా – కాళ్లు, అడుగుల రక్తస్రావం లేక తిమ్మిరెక్కినట్లయి కూలబడ్డాను. అరగంటకు కానీ తేరుకోలేకపోయాను. నెమ్మదిగా ఎక్కి వంతెన చివర కూర్చున్న సహచరులను చేరాను. అందరి ముఖాలు అంతయ్యాయి. అమ్మణ్ణి అయితే "నీ ఆశ వదులు కున్నాము. ఇంటికిపోతే ఏం ప్రమాదమో అని ఇక్కడే కూలబడ్డాము. అదృష్టం, నీవు వచ్చావు!" అన్నది.

మేము చీకటిపడినా రాకపోవడం చూచి మా పెద్దయ్యగారు రైల్వే లాంతరుతో పాటు ఒక పోర్టర్ను పంపారు. అతడు మాకు ఎదురుపడ్డాడు.

మా పెద్దయ్యగారు నా దుస్సాహస గాథ విన్నారు. కోపంతో ముఖం ఎర్రబడింది. కాని లౌక్యం ఎరిగినవారు. కనుక కోపం దిగమింగుకుని "ఇలాటి పనులు ఎప్పుడూ చేయకు, కింద ఏ ముళ్లకంపో, మరొకటో ఉంటే ఏమయ్యేది? అందరికి ఎంత అప్రతిష్ఠ! నా వాళ్లేకాక, తక్కిన పిల్లల తల్లిదండ్రులూ నా మీద విరుచుకుపడరా? అన్నారు. నిందితుడిని, ఏమనగలరు?

తర్వాత రెండు మూడు రోజులున్నాను. స్టేషన్ వేపచెట్ల కింద అచ్చనకాయలు, కోతికొమ్మచ్చులు. చిల్లాకట్టెలూ అనుకుంటూ! మేమందరం వెళ్లే రోజు సమీపించింది. నాది బళ్లారి బండి. వాళ్లది గుంతకల్లు మీదుగా పోయే పెనుకొండ బండి. అమ్మణ్ణిని సాగనంపడానికి రైలు పెట్టి వాకిలి దగ్గరి కింద నిలుచున్నాను. బండికి సిగ్నల్ ఇచ్చారు. అమ్మణ్ణి తొందర తొందరగా అచ్చనకాయలు ఒక చిన్న జేబురుమాలులో కట్టి నాకు అందిస్తూ "రాముడూ, సాహసానికి ప్రజెంట్" అన్నది. దానిని నేను చాల ఏళ్లు భద్రపరచుకున్నాను నా పెట్టెలో. కాని, ఆ అచ్చనకాయల మాట మరిచిపోయాను.

ఒకసారి పెట్టెను సర్దడంతో అది మా అమ్మచేతిలో పడింది ఇల్లు ఊడ్చేటప్పుడు. "ఏమిటిరా ఇదీ?" అనడిగింది. చెప్పాను.

చీపురు కట్ట అక్కడ పెట్టి, కూర్చోమన్నది. 'ఇప్పుడు నీ వయస్సెంత, పదహైదేండ్లు. నీ వయస్సు ఆడపిల్లలు మన దేశంలో పెండ్లయి ఒక బిడ్డ తల్లులు కూడా అవుతారు. ఈ అమ్మాయికి సంబంధం కుదిరిందని విన్నాను. నీవు చిన్ననాటి ఆటల విషయం అమాయకమైన వయసులో తెలిపే ప్రేమలు మరచిపోవాలి. ఎదుటివారి జీవితానికి సంబంధించినవి కదా ఇలాటి సంగతులు! మరెవరన్నా ఇలాటి ఆరాలు తీస్తే కొన మొదలు (పరిణామం) ఏమవుతుందా? సందేహాలూ, మనస్తాపాలు, రగడలు! మనం నిజంగా పవిత్రంగా ప్రేమించిన వారికి మన వల్ల ఎలాటి బాధలూ, నిందలూ కలుగకూడదు. వీటిని మన అశ్వత్థం చెట్టు కింద బావిలో పడేయి. కర్చీపు ఇక్కడతే. పాప ఉపయోగించుకొంటుంది.

"అపరాధ సహస్ర భాజనం / పతిత భీమ వార్ణవోదరే / అగతిం శరణగతం హరే / కృపయా కేవల మాత్మ సాత్కురు" అని మూడుసార్లు అనుకొని పెరుమాళ్ల గదిలోకి

వెళ్లి దండం సమర్పించు అన్నది అనునయంగా. నేను ఆమె చెప్పినట్లు చేశాను. అంతేకాదు. మరొకసారి, మా అమ్మ నన్నొక ఘోరపాప చింతనం నుంచి కాపాడింది.

నేను మద్రాసులో ఉన్నప్పటి మాట - 1935-36 కాబోలు, ఎం.ఎస్.ఎం. రైల్వే వారు జోనల్ టికెట్టు పదిరూపాయలని జారీ చేశారు. ఆ రైల్వే జోనులలో ఆ పది రూపాయల టికెట్టుతో నెలనాళ్లు ఎన్నిసార్లయినా పయనించవచ్చు. నేను ఒక టికెట్టు కొన్నాను. దానిని బైరాగి టికెట్టు అనేవారు. దానితో బెంగుళూరు సమీపంలోని ఒక బంధువుల ఊరికి వెళ్లాను. అక్కడ చెల్లిలి వరస అయిన అమ్మాయి పరిచయ మయింది. నా వయస్సు ఇరవై రెండు, ఆ అమ్మాయి మంచిదే. చాల సరళహృదయ. నేను అన్నవరసవాడిని కదా! కొంత చనువుగా ఉంది. అంతే నా హృదయంలో మాత్రం పాపాత్ముడు విజృంభించాడు. ఒళ్లు వేడెక్కిపోయింది. నేను శరీరాన్ని అదుపులో పెట్టుకోడానికి మానసికంగా ఘోర తపస్సే చేశాను. అక్కడ ఉంటే ఆమె జీవితం - ఆమె వివాహిత - పాడు చేస్తాననే భయంతో వాళ్లు ప్రాథేయపడుతున్నా వినక తిరిగి వచ్చాను మద్రాసుకు.

దారిలోనే మనస్సు వేడెక్కి జ్వరం పట్టుకుంది. మద్రాసు చేరి ఇండియన్ మెడికల్ కాలేజీ ఆస్పత్రిలో చేరాను. అక్కడ నా మిత్రులున్నారు. కనుక శ్రద్ధగా ఔషధోపచారాలు చూస్తారని. జ్వరం 106, 107 డిగ్రీలు దాటుతూంది. థర్మామీటరు లో పాదరసం చివర గుర్తును అందుకుంది. జ్వరం తగ్గించడానికి డాక్టర్లు, నర్సులు, విశ్వప్రయత్నాలు చేస్తున్నారు. తలను దాదాపు మంచు గుడ్డలతో నింపి వేశారు. నన్ను పరిశీలించే డాక్టర్లు "ఏమిటిది? ఇంత వేడికి నీవు ఎలా బతికి ఉన్నావు? మెదడులో రక్తనాళాలు తెగి చావవలసిందే! ఏమాశ్చర్యం?" అంటూ చుట్టూ మూగేవారు. ఒళ్లు కంపిస్తున్నది. నాడి ఎగిరెగిరి పడడం అందరికి వినిపిస్తున్నది. గుండె దబడబలు గట్టిగా వినిపిస్తున్నాయి. నేను మాట్లాడ్తున్నాను.

వాళ్లతో అన్నాను. "అయ్యా! ఇది శారీరకమైన జ్వరం కాదు. మానసికం. మనస్సు చల్లబడితే జ్వరం తగ్గుతుంది. ఆ విధంగా ఆలోచించండి" అని.

నాకు దుష్టచింతన కలిగినందుకు పశ్చాత్తాప తాపం పొందాను. పదహైదునాళ్లకు జ్వరం తగ్గింది. ఆస్పత్రి నుంచి ఇంటికి వచ్చిన తర్వాత, మా అమ్మకు వివరంగా ఉత్తరం రాశాను. వారానికి నాకు ఆమె నుంచి ఒక అరఠావు ఉత్తరం అందింది.



దానిని చాలాకాలం అప్పటి ఫెడరల్ కోర్టు తీర్పులాగ భద్రపరచుకొన్నాను. కాని, ఎప్పుడో చేయిజారిపోయింది. దాని తీవ్రత చెప్పలేను. అపశబ్దాలు లేవు. అంతా ధర్మశాస్త్ర చర్చే. కాని పదికోట్ల సూర్యుల వేడి అంటారే అలాటిది. దాని సారాంశమిది:- ఇంతటి

పాపచింత నీకు ఎలా కలిగింది? పాపచింతలో కలిగిన వేడి నిన్ను ఎలా బతక నిచ్చింది. అంత జ్వరంలో నీబోటివాడు పోకపోవడం ఆశ్చర్యమే! శ్రీమన్నారాయణుడు నీకు సద్బుద్ధి కలిగించుగాక! మన వంశంలో తలచుకోడానికి కూడా వీలులేని పాపచింత నీకు కలుగడం ఆశ్చర్యమే. ఇంతకూ ఎవరి కర్మకు ఎవరు కారకులు! శ్రీయఃపతి కృప! నీవు శారీరకంగా ఏమీ చేయలేదు. నీవు మన బంధువులలో పెద్దస్థానంలో ఉన్నావు. పండితుడివి, స్వాతంత్ర్యం కోసం కారాగార శిక్ష పొందినవాడివి. హింస మాకు నచ్చకపోయినా, కుట్ర కేసులో నిందితుడివి. ఇన్ని కారణాలతో ప్రశంసాభావంతో నీ దగ్గరికి చాలమంది వస్తారు. స్త్రీలకు సాహసు లంటే ఆకర్షణ ఎక్కువ. నీవు దుర్మార్గంగా ప్రవర్తించావా నీ జీవితమేకాక, ఇతరుల జీవితమూ నరకమవుతుంది. పౌరబాధ్యతతోపాటు నీ బోటి ప్రజల మనిషి బాధ్యత గొప్పది. దానిని సవ్యంగా నిర్వహించడానికి, కరుణామయుడయిన జానకీపతి – మన కోదండరాముడు బాసటగా ఉండుగాక!

**"అగ్రతః పృష్ఠతః చైవ<br>పార్శ్వతశ్చ మహా బలౌ<br>ఆకర్ణ పూర్ణ ధన్వానౌ<br>రక్షేతాం రామలక్ష్మణౌ"**

**(ముందూ, వెనుకా, పక్కలలోను, చెవివరకు అల్లెతాడు లాగిన ధనుస్సులతో ఉన్న రామలక్ష్మణులు నిన్ను దారి తప్పకుండా రక్షింతురు గాక!)**

ఇవి మా అమ్మమాటలు. కొన్నేళ్లు సిగ్గుతో ఆమెను చూడలేకపోయాను.

మరొక వేసవి సెలవుల్లో నేను కమలాపురం వెళ్లాను. ఊరంతా ఖాళీ, కాశీమజిలీ కథలలోని దయ్యాల కొంపలాగ ఉంది. ఇదేమిటి? ఊరి వాళ్లంతా ఎక్కడికి వెళ్లారు? ఎవరిని అడుగుదామన్నా బాధ్యతగల వారెవరూ కనిపించలేదు. ఎండ ఎక్కిపోతూంది. ఇంతలో మా ఇంటి నౌకరు భీంసింగ్ కనిపించాడు. ఊళ్లో ప్లేగు పడిందని (ప్లేగు తగిలిన ఎలుకలు పై నుంచి పడతాయి గనుక ప్లేగు పడిందని వ్యవహారం) హంపీ దారిలోని ఉద్దాన వీరభద్రుని గుడి ప్రాంతంలో కొందరూ, అక్కడక్కడి అడవులలో కొందరూ గుడారాలు వేసుకొని ఉన్నారనీ, రాత్రులు కొందరు వచ్చి కాపలా ఉంటారని తెలిపాడు. నేను తిరుపతి నుంచి వచ్చి బాధపడుతానేమోనని దినమూ ఒకటి రెండు సార్లు తను వచ్చిపోతున్నానని అన్నాడు. పెట్టెబేడా అతని తలమీద మోపి కాలి నడకన

బయలుదేరాను. ఉద్దాన వీరభద్ర గుడిచేరాను. ఉద్దాన వీరభద్ర అంటే పొడుగాటి వీరభద్రుడని. వీరభద్రుని విగ్రహం ఇరవై, ఇరవయ్యయిదడుగుల ఎత్తు ఉంటుంది. కనుక ఈ పేరు. దక్షయజ్ఞంలో అవమానం సహించని పరమశివుడు, వీరభద్రుణ్ణి సృష్టించి దక్షాధ్వరధ్వంసం చేసిన గాథ అందరూ ఎరిగిందే.

ప్లేగు భయంతో అడవుల్లో గుడారాలలో నివసిస్తున్న మా ఊరి శ్రీమంతులను, వారి భార్యలను పిల్లలను చూచి చాల బాధపడ్డాను. ప్రాణభయం అందరినీ మిత్రులను చేస్తుంది. అప్పుడు వర్ణభేదం, వర్గభేదం మటుమాయమవుతాయి. అందరూ ప్లేగు వ్యాధి నిరోధక పద్ధతులు అవలంబించి వ్రతనిష్ఠలలాగ పథ్యపానాలు చేస్తున్నారు. పరిమితమైన వంట సామాగ్రి, ఎప్పటికప్పుడు ప్రభుత్వం వారిచ్చే దినవెచ్చాలు. మందూ మాకూ, ఉన్నవాటిని కోతులు ఎత్తుకొని పోతాయేమోనని నిర్నిద్రంగా కాపలా, ఇంత మంది జనం ఉన్నప్పుడు క్రూరమృగాలు దగ్గరికి రావు గనుక వాటి భయంలేదు. నెల నెలన్నర ఈ విధంగా అరణ్యక జీవితం గడిపారు ఊరంతా.

మానవుని మనసు కష్టాలు వచ్చినప్పుడు కాని నీతి ప్రవణం కాదనిపించింది. ఆ జీవితం చూస్తుంటే మా అమ్మతో ఆ మాటే అన్నాను. ఆమె అరగంట సేపు ఆపద్ధర్మాలను గురించి నాకు వివరించింది. ఆపత్కాలంలో మానవుని ధర్మబుద్ధి వికసించి వివేకం జాగృతమవుతుందని, అది ఆపద గడిచిన తర్వాత గూడ కొనసాగితే మనస్సు నిజంగా పరిపక్వం అయినట్టని అన్నది.

**"మాతుః పితుః గురూణాం చ**
**కార్యమేవానుశాసనమ్**
**హితం వాప్యహితం వాపి**
**న విచార్యం కదాచన"**

**(తల్లి, తండ్రి, గురువుల ఆజ్ఞను తప్పక పాటించాలి. ఆజ్ఞ హితమా, కాదా అని ఎన్నడూ ఆలోచించరాదు. పెద్దల ఆజ్ఞ ఎప్పుడూ హితకరమే గనుక.)**

# 35

# చిత్తూరు జిల్లాలో కాంగ్రెస్ ప్రచారం

"అకృతా పర సంతాపం
అగత్వా ఖలనమ్రతామ్,
అనుత్సృజ్య సతాం వర్త్మ
యత్స్వల్ప మపి తద్బహు"

(ఇతరులకు సంతాపం కలిగించకుండా, దుర్మార్గులకు తలవంచకుండా, ఉత్తముల మార్గాన్ని వదలకుండా ఏ కొంచెం మంచి పనిచేసినా గొప్పే.)

**అ**ఖిల భారత కాంగ్రెస్ మహాసభ 1923లో కాకినాడలో జరిగింది. మౌలానా మహమ్మదలీ అధ్యక్షత వహించారు. సహాయ నిరాకరణోద్యమం ముమ్మరంగా కొనసాగించాలని తీర్మానించారు. కాకినాడ సభకు మా పినతండ్రిగారు, మా ఊరివారు మరికొందరూ వెళ్లారు. మా పినతండ్రిగారి వెంట నేనూ వెళ్లాను గురువుగారి అనుమతితో. ఆనాటి సహాయ నిరాకరణ నిర్ణయం నా మనస్సుకు హత్తుకుపోయింది. అది 1926-27కు మహావటవృక్షమయింది.

విదేశ వస్త్ర దహనం మొదలయిన పనులు నా భావాలు కలవారితో కలిసి నిర్వహించాను. నేను ఎలాగూ ఖద్దరు కట్టేవాడిని. ఖద్దరు అమ్మడం కూడా మా కార్యక్రమంలో ఒక భాగం, నా మిత్రులను, ఊరిలోని వారిని కూడా ఖద్దరు కట్టండని ప్రోత్సహించడమేకాక, చనువు వుంటే, వారి మల్లు పంచెల వంటి విదేశీ వస్త్రాలను బలవంతంగా లాక్కుని కాల్చివేసేవాడిని. ఈ పనుల వల్ల పట్టణంలో సమానభావాలు

గలవారు కొందరు పరిచయమయ్యారు. వారిలో నాకు జ్ఞప్తిలో వున్నవారు అంగడి వీథిలోని పుల్లయ్య, అలీగడ్ తాళాలు మొదలయినవి అమ్మే శంకరయ్య, కోనేరు వీథిలోని వెంకటసుబ్బారెడ్డి, బండి మునిస్వామి.

ఈ కార్యక్రమంలోనే ఒక సమావేశం జరిపాము. అప్పుడు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు చిత్తూరులో ఉన్న పార్థసారథి అయ్యంగారు. తాలూకా కాంగ్రెస్ అధ్యక్షులు టి.కె.నరసింహాచార్యులుగారు. ఆయన మా కళాశాల వీథిలోనే ఉండేవారు. కాని, అంతా భయం భయంగానే ఉండేది. మా సమావేశంలో పట్టణ కాంగ్రెస్ సంఘం ఏర్పాటు చేయాలని నిర్ణయించుకున్నాము. రైలు స్టేషన్ ఎదుట వున్న కరణాల వీథిలో ఉన్న ఆదిమూర్తి ఆచారి అనే నగల వర్తకుని పరిచయం కలిగింది. ఆయనది స్వతంత్ర వ్యాపారం. దేశం కోసం ఏదో చేయాలనే తపన గలవాడు. నా మిత్రులందరూ నాకంటే నాలుగైదేళ్లయినా పెద్దవారు. ఆదిమూర్తి ఆచారిగారు నాకన్నా పదిహేనేళ్లు పెద్ద. ఆయన అధ్యక్షుడుగా పట్టణ కాంగ్రెస్ సంఘం ఏర్పాటు చేశాము. నన్ను కార్యదర్శిగా ఎన్నుకొన్నారు. "నేను చాలా చిన్నవాణ్ణి. అందునా లోకం తెలియని సంస్కృత కళాశాల విద్యార్థిని. సమర్థుడిని ధనవంతుడిని ఎన్నుకోండి" అని వాదించాను. "అన్నిటికన్న ఉత్సాహం ముఖ్యం కనుక ఆ యోగ్యత ఒకటి చాలు. ముందుకు ఉరికేవాళ్లుంటే మేము అనుసరిస్తాం" అన్నారు. అంతా. ఆ విధంగా నా 14వ ఏట తిరుపతి టౌన్ కాంగ్రెస్ కమిటీ కార్యదర్శినయ్యాను. విదేశ వస్త్ర దహనం, ఖద్దరు ప్రచారం, అభ్యంతరం కాని చిన్న చిన్న సమావేశాలు జరిపేవాళ్లం. హరిజను లను కూడగట్టుకోవడం కోసం మద్యనిషేధం ప్రచారం జరిపేవాళ్లం.

ఒకటి రెండుసార్లు కల్లు దుకాణాల ముందు ప్రచారం చేశాము. గూడకట్టు పంచ, ఉత్తరీయం, భుజాలపై వేలాడే జుట్టు, త్రిపుండ్రాలతో కల్లు దుకాణాల ముందు నా వేషం విచిత్రంగానే ఉండేది.

అప్పుడొక ఒడ్డూ పొడుగూ ఉన్న వ్యక్తి బీహార్ నుంచి వచ్చాడు. ఆయన పేరు పురుషోత్తమ ఆర్య. పట్టభద్రుడు. మాటకారి, ఏదో కుట్రకేసులో ఇరుక్కుని పోలీసుల కన్నుగప్పి తిరుగుతూ తిరుపతి చేరాడు. అతడు మాకు గొప్ప స్ఫూర్తిదాత. అతడు ఏ ప్రాంతానికి వెళ్లితే ఆ ప్రాంతం భాషను నేర్చుకొనడానికి ప్రయత్నించేవాడు గనుక అత్యవసరమైన తెలుగు పదాలు వంద నేర్చుకొని, ఉపన్యసించేవాడు, విదేశీ వాడు.

గుడ్డలు కట్టవద్దు, బంగారం అమ్మవద్దు, ఇంగ్లీషు స్కూళ్లకు పిల్లలను పంపవద్దు. కల్లు, సారాయి తాగవద్దు, ఖద్దరు ధరించండి. ఇదీ ఉపన్యాసం. ఈ ఐదారు వాక్యాలు తెలుగులో మాట్లాడి, హిందీలోనో, ఇంగ్లీషులోనో అనర్గళంగా ప్రసంగించేవాడు.



ఆయనతోపాటు నేను సెలవులలో చిత్తూరు జిల్లాలో అంతా తిరిగి ప్రచారం చేశాను.

కాంగ్రెస్ కార్యక్రమ ప్రచారానికీ, సమావేశాల్లో ప్రోత్సహించడానికీ పాటలు కావలసి వచ్చాయి. నేను తెలుగులో పద్యాలు చెప్పేవాడినే కాని, ఎక్కువ మొగ్గు సంస్కృతం పైనే. అదివరకే నా సహాధ్యాయుడు తిరువీధి రాఘవయ్య అనే అతనితో చాల శ్లోకాలు వ్రాశాను. ఇప్పుడు ఉద్యమానికి అవసరం గనుక సంస్కృత గేయాలు వ్రాశాను. మొదటి గేయం ఒకటి రెండు చరణాలు మాత్రమే గుర్తున్నాయి.

**స॥ ప్రేమపూతా మాతా సుచరిత**

**చ॥ సకల చరాచర నికరాకారే**
**వికసిత సురుచిత ఘనవనవారే**
**అకలంకే విమలోదకపూరే - ప్రేమ**

**చ॥ కోమల కమల కదంబక కాంతే**
**సోమసుమాన్విత కుంతల కాంతే**
**రమణీయోజ్జ్వల రత్నస్వాంతే - ప్రేమ.**

ఇలా సాగింది రచన. మా సమావేశాల్లో ఇది పాడేవారు కొందరు. దాస్ అనే కాళహస్తి యువకుడు అప్పుడప్పుడు వచ్చేవాడు. అతడు ఈ గీతాలకు మట్లు కట్టేవాడు. మరొకసారి ఒక హిందూస్థాన్ సేవాదళ్ పరిక్రమానికి పాట కావలసి వచ్చింది. స్కౌట్ మార్చింగ్ సాంగ్ పరిచయం గలవాడిని గనుక

**"భింది భింది భారతీయ**
**మాతృదాస్య శృంఖలం**
**మందహసన విధుర మద్య**
**కలయమాతురాననమ్**

**--------------**

**మనసికలయ భారతీయ**
**ఆంగ్లచోర మారణమ్**
**కనకరత్న విభవ సుభగ**
**మాతృభూమి తారణమ్"**

అనే మార్చింగ్ సాంగ్ వ్రాశాను. హిందూస్థాన్ స్వయంసేవకుల పరిక్రమలలో ఇది అడుగులకు అనుగుణమైన తాళంలో చాల ఆదరం పొందింది.

గోవింద రాజస్వామి మహాద్వార గోపురంపై కాంగ్రెస్ పతాకను ఎగురవేయాలనే బుద్ధి పుట్టింది మా జట్టువారికి. ఇది రహస్యంగా జరగాలి. నేను, కలచవీడు శ్రీనివాసాచార్యులనే నా సతీర్థ్యుడు ఒక ఎత్తు వేశాము. ఇతడు కలచవీడు వేంకట రమణాచార్యులనే కాంగ్రెస్ నాయకుని తమ్ముడు. తాడిపత్రిలో దేశబంధు ప్రెస్ అనే ముద్రణాలయ ముండేది. అప్పటికింకా విద్యుచ్ఛక్తి దేవాలయానికి రాలేదు. గోపురం అంతస్తుల ద్వారాలకు ఇరవైపులా దీపాలే వెలిగించేవారు. దానికొక ఉద్యోగి, అతనిని నేనూ, శ్రీనివాసాచార్యులు అప్పుడప్పుడూ కలుస్తూ, చిన్న చిన్న సహాయాలు చేస్తూ లోబరుచుకున్నాము. గోపురం అంతస్తులు పన్నెండు, చివరి వరకు ఎక్కి త్రివర్ణపతాకం కట్టకపోయినా, నాలుగైదు అంతస్తుల వరకు కట్టినా గొప్పే.

దీపాలు వెలిగించే వ్యక్తితో ఒక రోజు, గోపురం అంతస్తులు చూడాలని ఉంది అని అన్నాము. "పైకి ఎక్కడానికి పైవాళ్లు ఒప్పుకోరు. పడిపోతే ప్రమాదం. నాలుగైదంత స్తుల వరకు నాతో రండి" అని అతడన్నాడు. మేము త్రివర్ణ పతాకాలు చెరి ఒకటి నడుముకు చుట్టుకొని బయలుదేరాము. అతడు ఐదో అంతస్తు వరకు మమ్ములను రానిచ్చి, "నేను పైకి వెళ్లి దీపాలు వెలిగించి వచ్చేవరకు ఇక్కడే ఉండండి" అని పైకి వెళ్లిపోయాడు. మేము పతాకాలను ఐదవ అంతస్తు ద్వారా బొమ్మలకు కట్టి, ఏమీ ఎరగనట్టు, అతనితోనే దిగిపోయాము.

దీనిని ఆ వీధి – సన్నిధి వీధిలోని ప్రముఖ న్యాయవాది దొరస్వామయ్యంగార్ చూచాడు, తెల్లవారుజామున. వీధిలో అందరికీ ఏమి ప్రమాదం వస్తుందో అని భయపడి, వెంటనే పోలీసు స్టేషన్‌కు కబురు పంపాడు. సబ్ ఇన్‌స్పెక్టర్ కన్నయ్య నాయుడు హుటాహుటిగా వచ్చి ఆరా తీసి, దీపాలు వెలిగించేవాడి ద్వారా మా ఆచూకీ కనుక్కొని మొగ్గలోనే తుంచివేద్దామనుకొని నన్ను రహస్యంగా పిలిపించి "అయ్యోరా! నువ్వు కాంగ్రెస్ సెక్రటరీ అని నాకు తెలుసు. నీపై నిఘావేసి వుంచాను. నీ చదువేమో, నీపాటేమో, ఎక్కువ పనికి పోతావూ బొక్కలో తోసేస్తా. మీ ప్రిన్సిపాలుకు చెప్పి, ఊరికి పంపిస్తా" అని బెదిరించాడు. నేను భయపడలేదు గాని, పాఠశాల బహిష్కరణకు సిద్ధంగా లేను.

ఇంత జరిగినా నేను చదువులో ఎంత మాత్రమూ వెనుకబడలేదు సరికదా,

ప్రథముడుగా ఉన్నాను. గ్రంథాలయాధికారి కాశీనాథ శాస్త్రిగారితో చనువుగా ఉంటూ, నిషిద్ధమయిన కామశాస్త్ర గ్రంథాలను చదివేవాడిని. ఆయుర్వేదం కూడా చదువు తున్నాను గనుక, అవి చదివితే తప్పులేదని నచ్చజెప్పేవాడిని, కామశాస్త్ర గ్రంథాలలోని ఔషధాధ్యాయంలో వాజీకరణౌషధాలను ప్రత్యేకంగా వ్రాసుకొని పరిశీలించాను. కొన్ని మందులు సిద్ధపరచాను కూడా. వాటి ప్రయోగానికి అవకాశమేది? ఇలా ఉండగా ఒక సదవకాశం దొరికింది.

తిప్పావఝ్ఝల రామశర్మగారు మహంతు మఠం జోస్యులు. ఆయన జ్యేష్ఠపుత్రుడు గౌరీనాథశర్మ మహామేధావి. పదకొండేళ్లకే మూడవ ఫారం ముగించి ఏ కారణం వల్లనో మా కళాశాలలోని వేదశాఖలో చేరాడు. వేదం పది సంవత్సరాల కోర్సు. పది సంవత్సరాల లోపు ఘనపాఠి అవుతాడు విద్యార్థి. కొంత సాహిత్య జ్ఞానం వేదలక్షణ జ్ఞానం కలుగుతాయి.

గౌరీనాథశర్మ పొరపాటుగా సంస్కృత వేదాల్లో పడ్డాడనిపించింది, నాకు. ఇంజనీర్ కావలసినవాడు. నాలుగేళ్లు వేదాధ్యయనం చేసి, యజుర్వేద సంహిత చాలవరకు ముగించి సంస్కృతంలో చేరాడు. నాకు సహాధ్యాయుడయ్యాడు. అతనితో పరిచయ మయిన తర్వాత అతని మేధ నాకు మరింత ఆశ్చర్యం కలిగించింది. అతడు విరిగిన గడియారాలను తెచ్చి, ముళ్లకు మారు అగ్గిపుల్లలు పెట్టి నడిపించేవాడు. తుక్కుపట్టి పారవేసిన కుట్టుమిషన్లు తెచ్చి మరమ్మత్తుచేసి నడిపించేవాడు. దసరా బొమ్మల కొలువులకు విద్యుచ్ఛక్తి సృష్టించి చిన్న బల్బులను వెలిగించి తోరణాలే కట్టేవాడు. నవాసారం, మైలుతుత్తం, రాగిముక్కలు తెచ్చి విద్యుచ్ఛక్తి పుట్టించేవాడు. తుక్కు మిషన్లన్నీ ఆయన చేతి స్పర్శతో ప్రాణం పోసుకొనేవి. "ఇంజనీరు కావలసిన వాడివి. యోగ భ్రష్టుడివై మాలో పడ్డావు పాపం"! అనేవాడిని, "ప్రాప్తమనేది ఉంది. మనకు తెలీంది" అనేవాడు. ఈ లోగా పెళ్లయింది. ఈమె సంవత్సరంన్నర చిన్నది అతని కంటే. అనురూపమయిన దాంపత్యం. కాపురానికి వచ్చింది. అప్పటికి అతనికి పదిహేడు నిండాయి. కాపురం ప్రారంభించినప్పటి నుంచి కొంత నలిగిపోయినట్టు కనిపించేవాడు. నాకు సంగతి తెలుసుకొందామని కుతూహలంగానే ఉండేది. మంచి నెచ్చెలికదా! అతని నుంచేరానీ, అని ఊరుకున్నాను.

"రామచంద్రా! నీతో ఒక విషయం మాట్లాడాలి" అన్నాడు ఒకనాడు. కుతూహలం

కనపడనీక నిబ్బరంగా "ఏమిటి? పాఠాల చింతన గురించా?" అనడిగాను. "కాదు. సొంత విషయం" అన్నాడు. ఏవో సమిష్టి కుటుంబంలోని ప్రతివారికీ ఉన్న చిక్కులేమోనని అనుకున్నానే తప్ప, స్త్రీ పురుష సంబంధమని ఊహించలేదు. అతడు చెప్పడం ప్రారంభించాడు. "నా భార్య కాపురానికి వచ్చిందని తెలుసుగదా నీకు. ఆమెను రాత్రి చూస్తే ఏదో భయం నాలో. ఏదో కంపరం. అది తెలిస్తే మరీ అలుసయిపోతానేమోనని మేకపోతు గాంభీర్యం వహిస్తున్నాను. మరెవరికైనా చెబితే నవ్వుతారని, నీవు ఆప్తుడివని చెబుతున్నాను. ఏదైనా ఉపాయం ఆలోచించాలి" అన్నాడు.

నేను ఇది ఊహించలేదు. ఊహించినా ఏమి చేయగలను? మిత్రునికి ధైర్యం చెప్పాలి. కొత్తగా వచ్చిన వధువుకు నమ్మకం కలగాలి. భగవంతుడు నన్ను మెరుపు లాగ ఆలోచింపజేశాడు. నేను ఏదో గొప్ప వైద్యుడిలాగ, మనస్తత్వవేత్తలా అతన్ని అరగంట సేపు ప్రశ్నలు వేసి, "అబ్బే! ఏమీలేదు. నీకు ఒట్టి బెరుకు. నీవు ఆమె పక్కన ఉన్నప్పుడు ధైర్యంగా ఉండు. పావురాలు, పిచ్చుకలు, జింకల గురించి ఆలోచించమన్నారు. కామశాస్త్రజ్ఞులు. కనుక మంచి విషయాలు ప్రశాంతంగా ఆమెతో చర్చించు. ఆమె కూడ కొంత చదువుకొన్నదనే అన్నావుగదా! ఒక చిన్న చిట్కా చెబుతాను. వాత్స్యాయన రతి రహస్యాలలోది. చేయడమూ సులభమే. "మధుసైంధవ కలరవముల మిలితం వా లింగలేపనని" అలదుకొంటే, ఎలాటి భయమూ ఉండ దన్నారు. బాహ్యలేపమేగాని, అభ్యంతరం కాదు. కనుక హానికరం కాదు – అని వ్యాఖ్యాతలు వ్రాశారు" అన్నాను. అన్నానేగాని "అంధేనేవ నియమానా యథాంధాః" అనే ఉపనిషద్వాక్యం గుర్తుకు వచ్చింది. నా అహంకారానికి నవ్వుకున్నాను.

గౌరీనాథుడు నేను చేయమన్నది చేశాడు. ఘన విజయం. మళ్లీ ఆ సమస్య రాలేదు. ఆమెకు ఈ చిట్కా సంగతి చెప్పాడేమో! ఒకటి రెండుసార్లు కనిపించి నప్పుడు నన్ను చూచి నవ్వుతూ భర్తను పిలిచేది. గౌరీనాథుడు శిరోమణి తర్వాత మద్రాసులోని కేసరి హైస్కూలులో తెలుగు పండితుడుగా పనిచేశాడు. ఎనభై మూడేళ్ళు బతికాడు. పవిత్రంగా ఆరుదశాబ్దాలకు పైగా కాపురం చేశాడు. 1995లో కీర్తిశేషు డయ్యాడు.

మేము గోవిందరాజస్వామి మహాద్వారం గోపుర శిఖరంపై పతాకాస్థాపన యత్నం విఫలమయిన తర్వాత కొంచెం నిరాశ చెందాము.

**"ఉద్యోగినం పురషసింహ ముపైతి లక్ష్మీః**

దైవేన దేయ మితి కాపురుషా వదంతి.
దైవం నిహత్య కురు పౌరుషమాత్మశక్త్యా
యత్నేకృతే యది న సిధ్యతి కో(త్ర దోష!!ః"

(ప్రయత్నించే పురుష శ్రేష్ఠుడినే సంపద వరిస్తుంది. అసమర్థులు దైవ మివ్వాలిగా మనదేముంది? అని అంటారు, కాని, దైవం అనే దాన్ని లెక్కచేయకుండా మానవ ప్రయత్నం చేయాలి. యత్నం చేసినా పని అనుకూలించలేదా, మన తప్పేమీ లేదు. ప్రయత్నం మన పని.)

## 36

# సహాధ్యాయులూ - సత్పురుషులూ...

**"అపూర్వః కో పి కోశో యం**
**విద్యతే తవ భారతి!**
**వ్యయంతో వృద్ధి మాయాతి**
**క్షయమా యాతి సంచయాత్!!"**

**(శ్రీ భారతీదేవీ! నీ ధనాగారం విచిత్రమైంది. వెచ్చించిన కొద్దీ పెరుగుతూ ఉంటుంది. చేరుస్తున్న కొద్దీ తరగిపోతూ ఉంటుంది.)**

నేను కాంగ్రెస్ కార్యక్రమాల్లో పాల్గొంటున్నా, చదువు విషయంలో ఏమరుపాటుతో ఉండేవాణ్ణి కాదు. దాదాపు అన్ని పాఠాలలోనూ ప్రథముడనుగానే ఉండేవాడిని. సంస్కృత కవితను బాగా చెప్పేవాడిని. ఒకమారు - 1927లో కంచి కామకోటి పీఠ పరమాచార్యులు చిత్తూరులో విడిశారు. సంస్కృత శ్లోకాలు వ్రాసుకొని వారి దర్శనానికి వెళ్లాను. వారు సంతోషించి, నాకు రైలు ఛార్జీలు రానుపోను ఇచ్చి పంపారు.

ఏర్పేడు ఆశ్రయం అంతగా పెరగలేదప్పుడు. నేను మలయాళ స్వాములను కూడా దర్శించి శ్లోకాలు చదివాను. సన్యాసికదా అని "కాషాయాంబర భూషితః" అని

వర్ణించాను. ఆయన తెల్లని ఖద్దరు గూడకట్టు. ఉత్తరీయం ధరించేవారు. ఆయన నా శ్లోకాలు విని నవ్వి "నీ వర్ణన వృథా అయింది" అన్నారు. ఏర్పేడు సంస్కృత పాఠశాలలో ఏర్పేడు గ్రామంలో నివసించే పత్తంగి రాఘవాచార్యులు అనే విద్వాంసులు పనిచేసేవారు. ఆయన కపిస్థలం దేశికాచార్యుల వద్ద 'బాధాంతం తర్కం' చదువు కున్నవారు. ఆయన ఇంటికి ఒకటి రెండుసార్లు శ్రాద్ధానికి నిమంత్రిత బ్రాహ్మణుడు గాను వెళ్లాను. ఆయన నన్ను చాలాసార్లు "అబ్బాయి! నా చదువంతా కావ్య పాఠాలు చెప్పడంలో ఖిలమయిపోతుంది. తర్కానికి అవకాశమేలేదు. నిన్ను గొప్ప తర్క విద్వాంసుణ్ణి చేస్తాను. నా ఇంట్లో పుత్రవత్తుగా ఉండు – అన్నారు. నేను వినలేదు. తర్క విద్వాంసుణ్ణయ్యే భాగ్యం ఉండవద్దూ నాకు?

ఉడిపిలో ఉత్తరాది మఠం అనేది మధ్వ సంప్రదాయానుయాయుల గొప్ప మఠం. అప్పటి స్వామి సత్యధ్యాన యతీంద్రులు. పొట్టిగా, బంగారు మైచాయతో వెలిగిపోయేవారు. సకల శాస్త్రాలలోను దిగ్దంతి. ఆయన ఏటా తిరుచానూరులో పండిత సభ జరిపేవారు. దానిలో దేశం నాలుగంచుల నుంచీ పండిత తల్లజులు వచ్చి పాల్గొనేవారు. నెలనాళ్లు హోరాహోరిగా వాక్యార్థాలూ, ప్రసంగాలూ జరిగేవి. విద్యార్థుల మంతా వాటిని చూడడానికి వెళ్లేవారం. విద్యార్థులకు పరీక్షలూ, స్వామివారి ఇష్టానిష్టాలను బట్టి బహుమతులూ ఉండేవి. స్వామివారు డబ్బుల సంచుల నుంచి గుప్పిళ్లతో డబ్బు ఇచ్చేవారు.

నేను తర్క సంగ్రహం చదువుతున్నాను. తక్కిన వాటితోపాటు ఆ విద్వత్సభలో పరీక్షకు వెళ్లాను. విద్యార్థులను సత్యధ్యానతీర్థులవారే పరీక్షించేవారు. నేను బళ్లారి వాడినని చెప్పడానికి కన్నడంలోనూ, సంస్కృతంలోనే మాట్లాడాను. "చెప్పూ! పృథ్వీ లక్షణం చెప్పూ" అన్నారు. ఏముంది? అంతా కంఠపాఠమే "గంధవతీ పృథీవీ, గంధనిష్ఠ ఆదేయతా నిరూపిత అధికరణ తావత్యం.." అంటూ కొట్టుకుపోయాను. స్వామివారు సంతోషంలో "సూళే మగనే. హోషారిద్దీయో! (లంజకొడకా! చురుగ్గా ఉన్నావురా!) అన్నారు. ఆయనకు సంతోషం మితిమీరినప్పుడు 'సూళే మగనే' ఊతపదం. ఆయన సంతోషం గమనించి నేను సంస్కృత పద్యాలు కూడ అల్లుతానని విన్నవించాను. "హేళో! మగనే" (చెప్పరా కొడకా) అని అన్నారు. నేను ఆయనపై వ్రాసుకొని పోయిన శార్దూలాలు ఝుమాయించి చదివాను. వాటిలో ఒకటి మాత్రం గుర్తుంది.

**"సత్యధ్యానయతీంద్ర భాసురతరాంకీర్తిం త్వదీయా మిమాం**
**జహ్నుర్వీక్ష్య కుతూహలాకుల మనాః పాతుం శనై రీహతే,**
**చింతా సంతతి తంతు జాల జటిలః స్వీయాం జటావాగురామ్**
**ఈశానః స్పృశతి ప్రసారిత కరః పాతోనిధి ర్నందతి."**

**"ఓ సత్యధ్యాన యతీంద్రా! వెలిగిపోతున్న నీ కీర్తిని చూచి జహ్ను మహర్షి (మరొక గంగ వచ్చిందనే భ్రాంతితో) తాగడానికి ప్రయత్నిస్తున్నాడు. తన తలమీద జటల నుంచి గంగ వెళ్లిపోయిందేమో)నని శంకరుడు తన జటాజూటమనే పొదను చేతులతో తడుముకుంటున్నాడు. మరొక గంగ వచ్చి పడుతున్నదనే సంతోషంతో సముద్రుడు కరాలు చాచి ఆహ్వానిస్తున్నాడు"** అని దీని భావం. స్వాములవారు "అరె! అరె! అరె!" అనుకుంటూ సంతోషిస్తూ ఏడెనిమిది పద్యాలూ విన్నారు. చివరి పద్యం:-

**"అవనీ తనయా మృదు బాహులతా**
**సరివేష్టిత నీలతమాల తరుః**
**కమనీయ యతీశ్వర కీర్తిలతాం**
**పరివర్ధయతాత్ ఉదయత్ప్రసరమ్"**

**(జానకీదేవి మెత్తని చేతులు చుట్టిన చీకటి కానుగ చెట్టు (వల్లీయుత తమాల వసుమతీజము భంగి; రాముడు) యతీశ్వరుల కమనీయ కీర్తిలతను మోసులెత్తింప చేస్తూ పెంచునుగాక!) అన్నాను. స్వాములవారు రూపాయల సంచిలో చేయిపెట్టి "పట్టూ" అన్నారు. మూడు గుప్పిళ్లు, (ముప్పై) అప్పటమైన వెండి రూపాయలు నా ఉత్తరీయంలో పడ్డాయి. ప్రశంసలతోపాటు ఒక పండితునికిచ్చే సంభావన. విద్యార్థులకు ఆశ్చర్యం!)**

ఇంతటి ఉదారులయిన సత్యధ్యాన తీర్థులయినవారు ద్వైత సిద్ధాంతం విషయంలో మాత్రం చాలా పట్టింపు గలవారు. ఆ ఉత్సవాలలో చివరినాడు, సంతర్పణ తర్వాత ఒక రూపాయి దక్షిణ ఇచ్చేవారు. రూపాయంటే నేటి వందరూపాయల విలువగదా! ఆశతో విద్యార్థులం వెళ్లాము. నేను సంతర్పణలకు వెళ్లేవాడిని కాదు - సంఘ భోజనం అంతగా నచ్చదు గనుక. వారితో వెళ్లి ఊరికే చూస్తున్నాను నిలబడి. పంక్తి ప్రారంభమయింది. మొదట్లోనే స్వామివారు స్వయంగా దక్షిణ ఇవ్వడానికి వచ్చారు.

పంక్తిలో ఒక శ్రీవైష్ణవ విద్యార్థి ఊర్ధ్వ త్రిపుండ్రాలతో కనిపించాడు. ఆయనకు విశిష్టాద్వైతం నచ్చదు. వాడి దగ్గరికి వెళ్లి – లేవరా! అని లేపారు. "ఎవఁడ్రా నువ్వు? మొదట మాతోపాటు నడుస్తావు. భక్తి ప్రధానమంటావు. తీరా చివర్లో విశిష్టాద్వైతమనే సాకుతో అద్వైతుల్లో దూరుతావు. అద్వైతులు మాకు ప్రత్యక్ష శత్రువులు. నీవు అనుకూల శత్రువు. నిన్ను నమ్మేదెలా?" అని విరుచుకుపడ్డారు. అతడు సవినయంగా "స్వామీ! నిన్న మొన్న విశిష్టాద్వైతులను గొప్ప బహుమానాలతో గౌరవించారే, ఇవాళ ఇంత కోపమెందుకు?" అని అడిగాడు. కోపంతోనే "అది పాండిత్యానికి మర్యాద; ఇది పంక్తి వ్యవహారం" అంటూ వెళ్లారు.

ఇలాటి పట్టుదల గలవాడే తిరుపతి వణిక్ప్రముఖులు గురునాథంసెట్టిగారు. మహాదాత. రెండు చేతులకూ ఎముకలు లేవనేవారు ఊరి వారంతా. గోవిందరాజ స్వామి, బ్రహ్మోత్సవ సమయంలోనో, మరెప్పుడో కూపుచంద్రవేట అనే ఊరికి వేంచేస్తారు. ఆనాటి ఉత్సవం ఖర్చంతా గురునాథంసెట్టిగారిదే. మోకాళ్లు దాటని బెంగాలీ పంచెకట్టి, నడుముకు ఉత్తరీయం బిగించి, మూర్తీభవించిన భక్తిలాగ ఉత్సవులవద్ద నిలుచుని ఉండేవాడు. ఎన్నో దరిద్ర కుటుంబాలను పోషించేవాడు. విద్యార్థుల కెందరికో ఉపకార వేతనాలు ఇచ్చేవాడు. ఆయన బట్టల దుకాణానికి ఒక దినం నేనూ, మిత్రుడు కప్పగంతుల లక్ష్మణశాస్త్రి వెళ్లాము గుడ్డలు కొనడానికి. డబ్బు చెల్లించేప్పుడు అణా తక్కువ పడింది. నేను సంస్కృత పాఠశాల విద్యార్థిని, ఒక అణా తక్కువ.. ముజరా ఇవ్వండి" అన్నాడు లక్ష్మణశాస్త్రి. అతడు నవ్వి "అదంతా కుదరదు, సరుకు ఇక్కడ పెట్టండి. డబ్బు పూర్తిగా చెల్లించి తీసుకొని వెళ్లండి" అని కరుకుగా చెప్పాడు. లక్ష్మణశాస్త్రి ఎంత బతిమాలినా ససేమిరా అన్నాడు అతడు. పాఠశాల హాస్టలుకు వెళ్లి అణా తెచ్చి, బట్టల బంగీ తీసుకొన్నాడు. నేనడిగాను ఆయనను: "సెట్టిగారూ! మీరంత ఉదారులు, విశ్రాణన విశారదులు, ఒక్క అణా కోసం ఇంత పేచీ తగునా?" అని. ఆయన మందహాసం చిందిస్తూ "ఇక్కడ ఇట్టాలేకపోతే, అక్కడ అట్టా ఎట్టవుతుంది? ఇది వ్యాపారం, అది సేవ. తెలిసిందా?" అన్నారు.

ఆ మధ్య నేను ఒంటిమిట్టకు వెళ్లివచ్చాను. నా మిత్రులకూ సహాధ్యాయులకూ సతీర్థ్యులకూ ఒంటిమిట్ట మాహాత్మ్యం గురించి చెప్పేవాడిని. అప్పటి నా సహాధ్యాయులలో తర్వాత గొప్ప విద్వాంసుడయినవాడు కుంటిమద్ది శేషశర్మ. పాణినీయాన్ని



పిడిపట్టాడు. సంస్కృతాంధ్రాలలో గొప్ప కవి అయ్యాడు. 'రామిరెడ్డి' అనే గొప్ప కావ్యం వ్రాశాడు. ఇది విశ్వం 'పెన్నేటి పాట'కు పది పన్నెండేండ్ల ముందే వెలసింది. వస్తువు దాదాపు సమానమే. మా ఇద్దరికీ మంచిపోటీ ఉండేది. విద్యానాథుని ప్రతాపరుద్ర యశోభూషణాన్ని, కువలయానందాన్ని, మరి కొన్నింటిని ఉదయం స్నానానికి ఊరు వెలుపలి దిగుడు బావులకు వెళ్లి తిరిగి వచ్చేటప్పటికి చెరి ఒక పుస్తకం చొప్పున ఆవృత్తి కావాలి. ఇదీ షరతు. నాకు మంచి ధారణ ఉండేది. కొన్నేళ్ల తర్వాత స్కూళ్లలో పండితులకున్న నికృష్టజీతాలపై కోపం వచ్చి నెలకు 30 రూపాయలు - 75 వరకూ స్కేలు - ఈ సంస్కృతాంధ్ర సాహిత్యాలెందుకని మరిచిపోవడానికి ప్రయత్నించాను. దానితో ధారణ అడుగంటి పోయింది. శేషశర్మ వేదాంతంలోనూ నిష్ణాతుడై అష్టాదశోపనిషత్తులను తెలుగు పద్యాలలో అనువదించాడు. వేదాంత దేశికుల తత్త్వత్రయ సారానికి వేయి పుటల విపులవ్యాఖ్య రచించాడు. ముఖ్యంగా మనుచరిత్ర,

ఆముక్తమాల్యదలను సంస్కృతీకరించి ఆంధ్రేతర సంస్కృత విద్వాంసు లకు చుబ్బనచూరలిచ్చాడు. అతని అగ్రజుడు రాఘవాచార్యులూ నా సహాధ్యాయే. అతడు అనంతపురం మునిసిపల్ హైస్కూలులో తెలుగు పండితుడై గొప్ప ఖ్యాతి పొందాడు. శేషశర్మ ఈ సంవత్సరం మొదట్లో పరమపదించాడు.

నా సతీర్థ్యులలో చాలా గొప్పవారు అన్ని రాష్ట్రాలలోను ఉన్నారు. చెలమచర్ల రంగాచార్యులు, లక్ష్మణశాస్త్రి మొదలయినవారు నాకన్నా రెండేళ్లు జ్యేష్ఠులు - వయస్సు లోను, తరగతులలోను, లక్ష్మణశాస్త్రిని గురించి ఇదివరకే ప్రస్తావించాను. అతడు బిల్హణుని రచనలనన్నిటినీ పద్యంలో ఆంధ్రీకరించాడు. మహాపండితుడుగా, వక్తగా పేరు పొందాడు. చెలమచర్ల రంగాచార్యులు ప్రతాపరుద్ర యశోభూషణమనే అలంకార శాస్త్ర గ్రంథాన్ని యథామూలంగాను - నైషధాన్ని సుదర్శనశర్మతో పాటున్నూ చంపువుగా ఆంధ్రీకరించాడు. ఆంధ్ర శబ్దరత్నాకరం అనే బృహన్నిఘంటువును వెంకట్రామా అండ్ కో వారి కోసం సంకలనం చేశాడు. హాలికుడు మొదలయిన నాటకాలు, కావ్యాలు వ్రాశాడు.

దమ్మాలపాటి శేషగిరిరావు - దమ్మాలపాటి రామారావు అనే మాజీ ఎం.ఎల్.ఎ. సోదరుడు. నరసరావుపేట వాస్తవ్యుడు. నాకు అనుంగు మిత్రుడు. అలంకార వేదాంత శాస్త్రాల్లో నిష్ణాతుడు. ఉపనిషత్తులను తెలుగు పద్యాలలో అనువదించాడు. సంస్కృత కళాశాలలో ఉపన్యాసకుడుగా పనిచేసి, ఉద్యోగ విరమణ తర్వాత సన్యసించి గన్నవరం సమీపంలో చిదానందాశ్రమంలోని భువనేశ్వరీ పీఠాధిపతి అయి, తత్త్వప్రవచనాలు చేస్తున్నాడు.

కాశీభట్ట రామనాథదత్త అనంతపురం జిల్లా పామిడివాడు. తిరుపతిలో ఎంట్రెన్స్ తర్వాత మద్రాసులోని వెంకటరమణ ఆయుర్వేద కళాశాలలో ఆయుర్వేద శిరోమణి చదివి గొప్ప వైద్యుడై, తాను చదివిన కలాశాలకే ప్రిన్సిపాలు అయి, వెంకటరమణ ఆయుర్వేద వైద్యశాలలో ప్రధాన వైద్యుడుగా పనిచేసి కీర్తిమంతుడయ్యాడు. మద్రాసు, తిరువాన్కూరు, కొచ్చిన్ విశ్వవిద్యాలయాలలో ఆయుర్వేద నిపుణ సభ్యుడుగా ఉంటూ తన గురువులయిన చింతలపల్లి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, వైద్యరత్న వారియర్, నటేశశాస్త్రి మున్నగువారికి కీర్తి తెచ్చాడు.

టి.కె.వి.ఎన్. సుదర్శనాచార్యుడు తర్క వేదాంతాలలో గొప్ప పండితుడై, తాను చదివిన శ్రీ వేంకటేశ్వర సంస్కృత కళాశాలకే ప్రిన్సిపాల్ అయ్యాడు. గొప్ప శాస్త్రజ్ఞుడు గా

పేరుపొందాడు.

కలచవీడు శ్రీనివాసాచార్యుడు నాకు కాంగ్రెస్ కార్యకలాపాలలో చేదోడుగా ఉండేవాడు. ఫిఫ్త్‌ఫారం వరకు ఇంగ్లీషు చదివి వచ్చాడు. బాగా ఇంగ్లీషు మాట్లాడ గలవాడు, వ్రాయగలవాడు. రాయలసీమ కాంగ్రెస్ నాయకులలో ఒకరయిన కలచవీడు వెంకటరమణాచార్యుల అనుజుడు కనుక దేశభక్తిగలవాడు. వ్యాకరణ శిరోమణి పిదప అనంతపురం జిల్లాలో పెక్కు పాఠశాలల్లో పనిచేసి, చివరకు (అనంతపురం) సాయిబాబా మహిళా కళాశాలలో సంస్కృతోపన్యాసకుడయ్యాడు. కాళిదాసు సర్వస్వం మొదలయిన ఉద్గ్రంథాలు రచించాడు.

పుట్టపర్తి నారాయణాచార్యులను గురించి చెప్పనక్కరలేదు. గొప్ప కవి. ఈ యుగ కవి అని నా విశ్వాసం. వాసిలోను, రాశిలోను, అతని కావ్యాలు మిన్న. 'శివ తాండవం' దేశమంతా మారు మోగినట్టిది. అతని 'జనప్రియ రామాయణం' ఆధ్యాత్మ రామాయణంలాగ కొత్త ఛందస్సులో నడుస్తుంది. మేఘదూత ఆధునిక ఆంధ్ర చారిత్రక గీత. పండరి భాగవతం ప్రాచీన ద్విపద కావ్యాలకు ఏ మాత్రం తీసిపోని 20 వేల ద్విపదల మహాకావ్యం. అతడు నటుడు, గాయకుడు, సంగీత నాట్య శాస్త్రజ్ఞుడు. గొప్ప ధారణశక్తి గలవాడు. సంస్కృత కాదంబరిలోని నాలుగైదు పుటలు ఏకధాటిగా అప్పగించేవాడు. ఒకసారి రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి ఆంధ్ర నాటకోపన్యాసములు అనే రెండు వందల పుటల పుస్తకాన్ని ఒక రాత్రి చదివి మరసటి దినం సభలో అప్పగించాడు. అతని ధారణకు అంతా భయపడేవారు. దేశమంతటా ఎన్నో సన్మానాలు పొందాడు. భారత ప్రభుత్వం నుంచి పద్మశ్రీ బిరుదు పొందాడు. నాకంటే కళాశాలలో రెండేళ్లు కనిష్ఠుడు.

పంగనామాల బాలకృష్ణశర్మ ఎస్.ఎస్.ఎల్.సి. చదివి సంస్కృతం చదవడానికి వచ్చాడు. ఎస్.ఎస్.ఎల్.సి. చదివిన వాడికి ఆ కాలంలో మంచి ఉద్యోగాలే దొరికేవి. వెర్రివాడు, ఈ సంస్కృతం ఊబిలో పడ్డాడు – అని నవ్వుకొనేవారు అందరూ. అతడు సాహిత్య శిరోమణి, పి.ఒ.ఎల్., ఎం.ఏ.లలో ఉత్తీర్ణుడై ఆ కళాశాలలో (వెంకటేశ్వర ఆర్ట్స్ కళాశాలలో) ఉపన్యాసకుడై పెక్కు గ్రంథాలు వ్రాశాడు. ఆయన కాంచనపల్లి కనకమ్మగారి అక్కగారిక కుమారుడు, మంచి స్నేహశీలుడు.

ఆయన తమ్ముడు గోపాలరావు. సంస్కృతం అంతగా అబ్బలేదు. కాని, గొప్ప లోకజ్ఞుడు

కావడంవల్ల ఆయుర్వేదం చదివి రాజకీయాలలో ప్రవేశించి స్థానికంగా గొప్ప నాయకుని హోదాకు పెరిగాడు.

ఒక విచిత్ర వ్యక్తిని గురించి చెప్పాలి. అతని పేరు దక్షిణామూర్తి. వీరింటి పేరు కొంపెల్లివారు. తూర్పుగోదావరి జిల్లావాడు. తర్కం బాగా చదువుకుని వచ్చాడు. కాని, కళాశాల నియమాల ప్రకారం ఎంట్రెన్సులో చేరి ఉత్తీర్ణుడై వేదాంత శిరోమణి ముగించి తిరుపతిలోనే ఆర్ట్స్ కాలేజీలో కాబోలు, సంస్కృతాధ్యాపకుడుగా చేరాడు. కొందరు ధూర్తులు అతనిని "సార్! మీకు ఇంగ్లీషు రాదని కొందరు గేలిచేస్తున్నారు. సార్!" అని రెచ్చగొట్టారు. "బాధాంతం తర్కం చదువుకున్న ముండాకొడుకును, నాకు ఇంగ్లీషు రాకపోవడమేమిటి. చూడండి నాలుగేళ్లలో సంస్కృతం ఎం.ఏ. చేస్తాను" అని శపథం చేశాడు.

అప్పట్లో పి.ఓ.ఎల్ (ప్రొఫిషియంట్ ఇన్ ఓరియంటల్ లాంగ్వేజ్) అనే పరీక్ష ఉండేది. విద్వాన్, శిరోమణి, విద్యాప్రవీణ, ఉభయభాషా ప్రవీణ, సరస్వతీ కంఠాభరణ (అణ్ణామలై విశ్వవిద్యాలయం) అనే ప్రాచ్య పరీక్షలలో ఉత్తీర్ణులయినవారు పి.ఓ.ఎల్.లో కడతేరితే సరాసరి ఆయా భాషల ఎం.ఏ.కు వెళ్లవచ్చు.

దక్షిణామూర్తి కష్టపడి పి.ఓ.ఎల్. గట్టెక్కి ఎం.ఏ.కు వెళ్లాడు. అప్పుడు ఎం.ఏ. ఇంగ్లీషు మాధ్యమంలో వ్రాయాలి. కనుక ప్రిలిమినరీ, ఫైనల్ మొత్తం ఎనిమిది ప్రశ్న పత్రాలకు చెరి పది ప్రశ్నల ప్రకారం 80 ప్రశ్నలు కంఠపాఠం చేశాడు. అదృష్టవశాత్తు గుడ్డిపాఠం చేసిన ప్రశ్నలే వచ్చాయి. పరీక్షలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. 'ఇప్పుడు రమ్మనండి. ఎవరో వస్తారో నాకు ఇంగ్లీషు రాదనడానికి' – అని సవాలు విసిరాడు. పట్టుదలకు దృష్టాంతం దక్షిణామూర్తి.

మా కళాశాలలో చదివిన తమిళ, కన్నడ, మలయాళ విద్యార్థులూ చాలా మంది గొప్ప స్థితికి వచ్చారు. వారిలో లక్ష్మీనారాయణ శాన్‌భోగ్ బొంబాయిలో గొప్ప పేరు పొందాడు.

తిరుపతి పెద్ద యాత్రాస్థలం కనుక వివిధ రాష్ట్రాల నుంచీ దేశాల నుంచీ కూడా చాలా మంది వచ్చేవారు. ఇక నాటకాల సంఘాల గురించీ, నాటకాలను గురించీ చెప్పనక్కరలేదు. అప్పటి ప్రముఖ నాటక సంఘాల నాటకాలను చూచాను. ప్రముఖ నటులనూ కలుసుకున్నాను. కాని వారి నాటకాలను, నటనను విశ్లేషించే శక్తి అప్పటికి

నాకు లేదు. నిజానికి ఇప్పటికీ లేదు.

తిరుపతిలోని అప్పటి కవి పండితులలో ప్రముఖులు ఎందరో ఉన్నారు. వారిలో కొందరే గుర్తున్నారు. మహామహోపాధ్యాయ కపిస్థలం దేశికాచార్యులుగారు మా సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్‌గా ఉండి విరమించినవారు. తర్క వేదాంతాలలో ఉద్దండపండితులు. ఆంధ్ర, తమిళ, కర్ణాటకలలో ఆయన శిష్యులు చాలా మంది ఉన్నారు.

'అపర మల్లినాథులు' వేదం వేంకటరాయశాస్త్రిగారు 1928లో అవసాన దశలో ఉన్నారని తెలిసి మేము కొందరం నెల్లూరు వెళ్లి దర్శించుకొని వచ్చాము. అప్పటికే ఆయన నైషధవ్యాఖ్యానం, ఆముక్తమాల్యద వ్యాఖ్యానం ప్రసిద్ధి పొందాయి. అవి గొప్పవనడంలో సందేహం లేకపోయినా, నా మట్టుకు నేను సంస్కృత వ్యాఖ్యానాలతో వానిని పోల్చుకునేవాడినికాను.

నాగపూడి కుప్పుస్వామయ్యగారు అప్పుడు న్యాయశాఖలో ఉన్నత పదవిలో ఉన్నట్టు గుర్తు. ఆయన పారిజాతాపహరణానికి వ్రాసిన పరిమళోల్లాసం గొప్ప వ్యాఖ్యానం. ఆయన మంచి వక్త. ఆయన ప్రసంగం విన్నవారు ఆయన వాదాన్ని అంగీకరించ కుండా ఉండలేకపోయేవారు. ఆయన వ్యక్తిత్వం అలాటిది.

కుప్పుస్వామయ్యగారి శిష్యుడు పాతాళభేది సుబ్రహ్మణ్యంగారు. ఉత్తమ కవి, మంచి వక్త, స్ఫురద్రూపి. కనుక ఆయన కవితాగోష్ఠులు, ప్రసంగాలు మాకు చాల ఆకర్షణగా ఉండేవి. ఆయన భట్టనారాయణుని వేణీసంహార నాటకం ఆంధ్రీకరించారు. దానిని కుప్పుస్వామయ్యగారికి అంకిత మిచ్చినట్టు గుర్తు. దాని ఆవిష్కరణోత్సవమో, అంకితోత్సవమో మా కళాశాల ఆవరణలోనే జరిగింది. సుబ్రహ్మణ్యంగారు ఆ ఆంధ్రీకరణపై ప్రసంగిస్తూ "అశ్వగోయుగం" అనే పదాన్ని వివరించడం నాకు జ్ఞప్తిలో ఉంది. గోయుగం అంటే పశువుల జంట అని, అది క్రమంగా జంట అనే అర్థంలో రూఢమయిందని, అశ్వగోయుగం అంటే అశ్వాల జంట అని ఆయన వివరణ. ఆయన సతీమణి గొప్ప ఇల్లాలు. మాధుకర విద్యార్థులకు ఆమె పండుగనాడు పిండి వంటలను వేటి కవి విడివిడిగా కట్టి జోలెలో వేసేవారు. శ్రీ సుబ్రహ్మణ్య కవి కుమారుడు డాక్టర్ గోపాలకృష్ణ ఇప్పుడు ఆకాశవాణిలో ప్రముఖాధికారి.

మఠం మాడభూషి వేంకటాచార్యులు, గోపాలాచార్యులు అనే వారు న్యాయ వాదులు, కవులు. వారు ఎన్నో కావ్యాలు రచించారు. అవి నాకు గుర్తు లేదు.

కపిస్థలం కృష్ణమాచార్యులుగారు మా ప్రిన్సిపాలు. ఆయన గోవిందరాజస్వామి బ్రహ్మోత్సవంపై ఒక భాణం సంస్కృతంలో రచించారని ఇదివరకే చెప్పాను.

వీరందరూ దేశభక్తులు, శుద్ధఖద్దరుదారులు, గాంధీజీ అనుయాయులు. అందు వలన కూడా వీరిపై నాకు భక్తి, వారికి నాపై వాత్సల్యమూ; పెరిగాయి.

**"సర్వద్రవ్యేషు విద్యైవ**
**ద్రవ్య మాహు రనుత్తరమ్,**
**అహార్యత్వా దనర్ఘ్యత్వాత్**
**అక్షయత్వాచ్చ సర్వదా"**

**(అన్ని ద్రవ్యాలలోను విద్య అనే ద్రవ్యం ఉత్తమోత్తమమైనదని పెద్దలన్నారు. ఎందుకంటే విద్యను దొంగిలించడానికి అవకాశం లేదు. వెలకట్టడానికి వీలులేదు. ఎన్నటికీ తరిగించడానికి సాధ్యం కాదు. విద్య అహార్యం, అనర్ఘ్యం, అక్షయం.)**

# 37

# శాసనోల్లంఘనం - అరెస్టు

"ఉద్యమం సాహసం ధైర్యం
బుద్ధి : శక్తిః పరాక్రమః
షడేతే యత్ర వర్తంతే
తత్ర దేవః సహాయకృత్"

**(పూనిక, సాహసం, ధైర్యం, బుద్ధి, శక్తి, పరాక్రమం - ఈ ఆరూ ఉన్నచోట దైవం సహాయం చేస్తుంది. పూనిక లేకుండా, పరిశ్రమ లేకుండా ఏ పనీ జరుగదు. దైవం కూడా తోడ్పడదు.)**

**గాం**ధీ - ఇర్విన్ ఒడంబడిక విఫలమయినది. "జయగాంధీ గుణ కంధీ ప్రేమ పంధీ గాంధీ" అనే గీతాలు పాడిన గళాలు మూగవోయాయి. దేశమంతా మళ్లీ సత్యాగ్రహోద్యమం ముమ్మర మయింది.

సంస్కృత కళాశాల విద్యార్థులమయిన మేము విదేశ వస్త్ర బహిష్కరణ, విదేశ వస్త్రాల దుకాణాల ముందు పికెటింగ్, విదేశ వస్త్ర దహనం కొనసాగించాము. నేను ఆదిమూర్తి ఆచారిగారి అధ్యక్షతన పట్టణ కాంగ్రెస్ కార్యవర్గాన్ని సమావేశపరచి ఉద్యమం తీవ్రతరం చేయాలని తీర్మానించాను. సభ్యులు శంకరయ్య, పుల్లయ్య, వెంకట సుబ్బారెడ్డి మున్నగువారు ఆయా ప్రాంతాలలో ఉద్యమ కార్యక్రమం నిర్వహించాలని నిర్ణయం జరిగింది. మొదట శ్రీనివాసరావు అనే సభ్యుడు సత్యాగ్రహం చేసి జెయిలుకు వెళ్లాలని

నిర్ణయించాము. ఆయన సాధారణ వ్యక్తి, పెళ్లిళ్లలో వంటలు చేసేవాడు. భార్య, ఒక కుమార్తె ఉన్నారు. అయినా తొలి సత్యాగ్రహిగా వెళ్లడానికి అంగీకరించాడు. మా కార్యకలాపాలకు విస్తారంగా ప్రచారం కలిగింది. చాల మంది పెద్దలు తొందర పడవద్దని మమ్ముల్ని హెచ్చరించారు. కాని, పత్రికలలో – ముఖ్యంగా అప్పటి ఏకైక జాతీయ దినపత్రిక అయిన 'ఆంధ్రపత్రిక' దేశంలోని వివిధ ప్రాంతాలలో జరుగుతున్న ఉద్యమాన్ని, అరెస్టులను, శిక్షలను ప్రచురించడం చదివి మా ఉత్సాహం పొంగులు వారసాగింది.

అప్పుడు మద్రాసు నుంచి దిగాడు 'మద్రాసు గాంధీ'. ఆయన పేరు బి.ఎన్.శర్మ అని గుర్తు. అచ్చం గాంధీలాగే అచ్చు గుద్దినట్టు ఉండేవాడు. నన్ను వెదుక్కుంటూ వచ్చి, పట్టణ కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం ఏర్పాటు చేసి తొందరపడవద్దని తీర్మానం చేయించమన్నాడు. "మీరు చదువుతున్నది జాతీయ భాష అయిన సంస్కృతం. ఒక విధంగా అది దేశసేవే. కనుక తీవ్రమయిన ఉద్యమాలేవీ నిర్వహించకండి" అని నచ్చజెప్పాడు. నేను అలాటి తీర్మానం చేయనన్నాను. రెండు దినాలు మా అందరి చెవుల్లో ఇల్లు కట్టుకుని మరీ చెప్పాడు. సరే మీ ఇష్టం. ఇకముందు జరిగే మహోద్యమం కోసం ఇప్పుడు ఆగమన్నాను" అంటూ వెళ్లిపోయాడు.

ఈ ఊపులోనే గోవిందరాజస్వామి మహాద్వార గోపురంపై త్రివర్ణ పతాక ఎగుర వేయడానికి మరొకమారు యత్నించాము నేనూ, కలచవీడు శ్రీనివాసాచార్యులూను. అప్పటికే పోలీసుల నిఘా ఎక్కువ కావడం చేత మా ప్రయత్నాలు ఫలించలేదు. చివరికి ఒక నిర్ణయానికి వచ్చాను. శ్రీనివాసరావును సత్యాగ్రహానికి ప్రోత్సహించాను. ఏదో తీవ్రమయిన గృహచ్ఛిద్రాలలో అతడు ఊగిసలాడాడు. చుట్టుపట్ల జిల్లాలలో సత్యాగ్రహజ్వాలలు అలుముకొంటున్నాయి. మన జిల్లా, అందునా మన తిరుపతి వెనుకంజ వేయడమా? అని పట్టణ కాంగ్రెస్ సంఘంలో వాదించాను. నేను తొలి సత్యాగ్రహి కావడానికి నిర్ణయించుకున్నాను. పోలీసుల దృష్టి ఆకర్షించడానికి కనీసం మా కళాశాల ఉన్న నమ్మాళ్వార్ సన్నిధి గోపురం పైనన్నా త్రివర్ణ పతాక ఎగురవేయడం, కరపత్రాలు వ్రాసి పంచడం, నిషేధాజ్ఞలు ఉల్లంఘించి సభ జరిపి సత్యాగ్రహం చేస్తున్నట్టు ప్రకటించడం – అనే కార్యక్రమాల్ని వరుసగా నిర్వహించాలని నిర్ణయించాము.

మొదటి దినం కార్యక్రమం నమ్మాళ్వార్ కోవెల గోపురంపై త్రివర్ణపతాకను

ఎగురవేయడం. రెండవ నాడు కరపత్రాలు పంచడం. మూడోనాడు సత్యాగ్రహం అనే నిర్ణయం ప్రకారం 1932 జనవరి 30వ తేదీన పెద్ద ఖద్దరు గుడ్డకొన్నాము. రాత్రి హాస్టలులో అందరూ నిద్రపోయిన తర్వాత నేనూ కలచవీడు శ్రీనివాసాచార్యులూ, కుంటిమద్ది రాఘవాచార్యులూ, మరి ఇద్దరు (పేర్లు మరిచాను) దానికి రంగులు పూశాము. రంగులు ఆరడానికి గంట రెండు గంటలు పట్టింది. ఒక గదిలోని గుడ్డలు ఆరేసుకొనే ఒక దండెం తెచ్చి, ఆ పతాకం ఒక అంచును ఓరగా కుట్టి దానిని దండం గడకు తగిలించి కోవెల పైకెక్కి గోపురశిఖరానికి కట్టాము. గడ దాదాపు పది అడుగులది. అది ఊరి వారికి కనిపిస్తుందో, లేదో అనే శంకతో మరొక దండం గడను దాని చివరకు గట్టిగా బిగించి కట్టాము. దాదాపు పదిహేను ఇరవయి అడుగుల పొడుగయింది. రాత్రి దొంగతనంగా కళాశాల వెనుకవైపు వీధిలోకి వెళ్లి చూచాము. పతాకం గాలికి ఎగురుతూ సంతోషం కలిగించింది. కళాశాల హాస్టలుకు తిరిగి వచ్చి రంగులు కలిపిన, పూసిన గుర్తులు తెలీకుండా ఆ ప్రాంతమంతాకడిగి చేతులు తుడుచుకొన్నాము. తెల్లవారింది. ఎప్పటిలాగే బావికి వెళ్లి స్నానాదులు ముగించుకొని దాదాపు ఆరు గంటలకు తిరిగి వచ్చాము.

ఏడు ఏడున్నర గంటలకు ప్రార్థన, ఉపస్థితి నివేదనం (అటెండెన్స్) జరుగు తున్నాయి. జనం కళాశాలలోకి తోసుకుని వస్తున్నారు. వీధంతా జనం, కోలాహలం. ప్రిన్సిపాల్ ఉత్తమూరు వీరరాఘవాచార్యులుగారు దిగ్భ్రాంతులై చూస్తున్నారు. ఇంతలో పోలీస్ సబ్ ఇన్‌స్పెక్టరు కన్నయ్యనాయుడుగారు తుపాకులు పట్టిన డజను మంది పోలీసులతో హడావిడిగా ప్రవేశించారు. ప్రిన్సిపాలు గారి గదిలోకి వెళ్లి సవినయంగా పతాకం సంగతి అడిగారు. ఇంట్లో జరిగే విషయాలు ఊరంతా తెలిసినా యజమానికి తెలియదన్న సామెతగా ఇంతమంది జనం కళాశాలకు వచ్చినా ఏమి జరిగిందో ప్రిన్సిపాలుకు తెలీదు. ఆయన పాపం స్నాన సంధ్యాద్యనుష్ఠానం ముగించుకొని వచ్చారు! తలెత్తి చూచిన పాపాన పోలేదు. కంగారుపడ్డారు. "ఇలాటి పీడ మన పట్టణంలో రాగూడదని చూస్తున్నాను. అయ్యగారూ! మీరు వెంటనే ఆ జెండా గుడ్డను తీసి వేయించండి; జెండా కర్ర విరిచి పొయ్యిలో పెట్టండి" అన్నారు వినయంగా కన్నయ్యనాయుడుగారు. ప్రిన్సిపాలే ఏమీ తోచక ఎవరీ పనిచేశారో తెలియక ఐదు నిమిషాలు తటపటాయించారు. నాయుడుగారికి కోపం వచ్చింది. 'ఉఁ' అన్నారు. పోలీసు జవానులవైపు చూసి, "బూట్లతో

గోపురంపైకి ఎక్కకండి" అని మాత్రం అన్నారు ప్రిన్సిపాలు. ఇంతలో తక్కిన ఆచార్యులూ అక్కడికి వచ్చారు. ఎవరికీ ఏమీ పాలుపోలేదు.

పోలీసులు కూడ దైవభీతి, భక్తికలవారే గనుక బూట్లు వదలి గోపురం ఎక్కి త్రివర్ణ పతాకను లాగివేసి ఇన్‌స్పెక్టరు చేతికిచ్చారు. ఆయన దానిని చుట్టి చుట్టి వీథిలోకి విసురుతూ ప్రిన్సిపాల్‌వైపు చూచి వినయంగా "అయ్యంగారూ! ఈ దఫా సరిపోయింది. ఇలాటిది ఇంకొకసారి జరగకుండా చూడండి. జరిగితే బాగుండదు" అంటూ మా అందరివైపు చూచి చేతిలోని రాజదండం (బెత్తం) ఎత్తి "ఇదిగో పిల్లకాయలూ! కొన్ని నెలలుగా చూస్తున్నా, మీలో కొందరు చేస్తున్న పనులు. ఏదో పగడసాల (పాఠశాల)లో సదూకుంటున్న పిల్లలూ, అమ్మా అబ్బా దగ్గరలేని పిల్లలూ అని ఊర్కున్నా. ఇలాటిది ఇంకెప్పుడయినా జరిగితే ఊర్కుండేది లేదు. బొక్కలో తోయడమే. జాగర్త!" అని హెచ్చరించి నిష్క్రమించారు సపరివారంగా.

పోలీసులు వెళ్లిపోగానే గుసగుసలు బయలుదేరాయి. నన్ను విద్యార్థులూ, కొందరు ఉపాధ్యాయులూ అనుమానించినా దొంగకు తేలు కుట్టినట్టుగా ఉన్న మమ్ముల్ను – ముఖ్యంగా నన్ను – ఏమీ అడగలేకపోయారు. ఆ దినం పాఠాలు ఏమీ జరగలేదనే చెప్పాలి. ఒక్క గిరిధరాచార్యులు – విద్యార్థులందరి హితం ఎక్కువగా కోరుతూ మా అందరి భక్తినీ చూరగొన్న గిరిధరాచార్యులు మాత్రం – నన్ను ఏకాంతంగా పిలిచి "ఇది నీవే చేసి ఉంటావని నా మనస్సు చెబుతున్నది. నీవు చేస్తున్నది మంచి పనే. కాని చదువు ఒక ఘట్టానికి రానీ. అంతవరకు ఓపికపట్టు. ఈ ఉద్యమం ఇప్పట్లో ఆగేది కాదు. చదువు పూర్తి చేసిపో" అని అన్నారు. నేను బయటపడతానేమో నని రెండు నిమిషాలు ఆగారు. నేను ఆయనకు నమస్కారం చేసి వచ్చివేశాను.

కరపత్రాలను పంచడం మరుసటి దినమే వద్దని నా కాంగ్రెస్ మిత్రులు సలహా ఇచ్చారు. పతాకారోహణ ప్రతిస్పందన పట్టణంలో ఎలా ఉంటుందో వేచి చూద్దామ న్నారు. రెన్నాళ్లు ఆగాను. సంస్కృత పాఠశాల పిల్లకాయలు మన ఊరి పరువు దక్కించారు అనే మాట ఊరంతా వినబడింది. కలచవీడు శ్రీనివాసాచార్యులతో సంప్రదించాను. ఒకటి రెండు క్వయిర్ల (దస్తాల) తెల్లకాయితాలు తీసుకొని వచ్చాను. కళాశాల కార్యాలయం నుంచి రెండు మూడు కార్బన్ పేపర్లు సంపాదించాను. ఇలాటి వస్తువుల సేకరణలో నాపై సానుభూతి పనిచేసింది. పైకి అనడానికి భయంగాని, అందరికీ నా

పని మెచ్చుకోలే! ఫిబ్రవరి 3వ తేదీ రాత్రల్లా కూర్చుని పావుతావు కాయితంపై దేశ పరిస్థితికీ, ఉద్యమానికీ త్యాగానికీ సంబంధించిన మూడు ప్యారాగ్రాఫులు రాశాను. దానిని శ్రీనివాసాచార్యులు, రాఘవాచార్యులు నకలు చేశారు. దాదాపు ఐదు వందల కరపత్రాలు సిద్ధమయాయి. కొన్ని నా ట్రంకు పెట్టెలో భద్ర పరచాను. కొన్ని మరుసటి దినం పట్టణ వీధులలో పంచాలని నిశ్చయించుకున్నాను. కరపత్రంలోని వక్కాణం జ్ఞప్తిలేదుగాని, చివర మాట మాత్రం గుర్తుంది. పోలీసు కుక్కలకు భయపడకుడు" అనేది ఆ వాక్యం చివరిది. పోలీసులపై ఈగవాలితే తుపాకీ పేల్చే ఆ కాలంలో అలాటి తీవ్రమైన మాటలకు శిక్షపడడం దేవుడెరుగు మొదట ఒళ్లు హూనం కావడం తప్పదు. ఈ వాక్యం ఎన్ని అనర్థాలకు మూలమో తెలియక కాదు, ఎప్పటికన్నా అరెస్టు కాక తప్పదనే నిశ్చయంతో ఉన్నాను గనుకనే అట్లా రాశాను.

ఫిబ్రవరి నాలుగవ తేదీ ఏదో సెలవు దినమని గుర్తు. నేను కరపత్రాల కట్ట చేత్తో పుచ్చుకొని పాదయాత్రకు బయలుదేరాను. మా మిత్రులు "ఎట్లా ఉంటుందో పరిస్థితి; భోజనం చేసి పోవోయ్; తిరగడంలో శోషవచ్చి పడిపోయేవు!" అన్నారు. ఎవరన్నా ఏ పనికన్నా బయలుదేరినప్పుడు భోజనం చేసి పొమ్మని ఎవరన్నా అనడం అపశకునంగా భావిస్తారు పాతవారు. ఈ సత్యాగ్రహయాగానికి అంతా మంచి ముహూర్తమే.

**"త దేవలగ్నం సుదినం తదేవ**<br>
**తారాబలం చంద్రబలం తదేవ**<br>
**తిథేర్బలం యోగబలం తదేవ**<br>
**లక్ష్మీపతేః అంఘ్రియుగం నమామి"**

లక్ష్మీపతి చరణారవిందాలను ధ్యానించి పని ప్రారంభించిన గడియ అంతా శుభకరమే. అదే సుదినం, అదే మంచి లగ్నం. తారాబలం, చంద్రబలం, తిథి, యోగ కరణాల బలం కలదీ అదే – అని పురోహితులు చదివే శ్లోకం మననం చేసుకొని, అయినా భోజనం ఎందుకు మానడం అని సుష్టుగా భోంచేసి బయలుదేరాను.

కరపత్రాలు పంచడం కరణాల వీథితో ప్రారంభించాను. చదువుకున్నవాడు, ఉద్యోగి, పెద్దమనిషి అని తోచినవారికి మాత్రమే కరపత్రం అందిస్తూ, దేశ పరిస్థితు లను వివరిస్తూ ముందుకు సాగాను. కరణాల వీథి, గోవిందరాజస్వామి కోవెల మాడ వీథులు, తేరువీథి, గాంధీవీథి (అప్పటి పేరు మైసూరు సత్రం – మహంతు మఠం వీథి), గంగుణ్ణా

మంటపం వీథి, బజారు వీథి, కొత్త వీథి, మిట్ట వీథి, రామస్వామి కోవెల మాడవీథులు, పుష్పతోట వీథి, కపిలతీర్థం దారి – ఇలా ఒక పర్యటన చేశాను. సాయంకాలం ఐదు గంటలు కావచ్చింది. రెండు కరపత్రాలు మిగిలాయి. బజారు వీథిలోని పోలీసు స్టేషనులో ఇద్దాము– ఎలాటి ప్రతిక్రియ ఉంటుందో చూద్దామనిపించింది. పోలీసు స్టేషను పెద్దది. ఇనుప గేటు దాటి లోపలికి వెళ్లి హెడ్ కానిస్టేబుల్‌కు ఇచ్చి, వెలుపలికి వచ్చి వీథి ఎక్కాను. ఏదో రాసుకుంటున్న హెడ్ కానిస్టేబుల్ ఏదో కాయితం లే అని అనుకున్నాడు కాబోలు! రెండు నిమిషాల తర్వాత చదువుకున్నట్టున్నాడు "పట్కో! పట్కో! ఆ ఖద్దరువాలాను పట్కో!" అంటూ వీథిలోకి పరుగెత్తి వచ్చాడు. ఏమి గొడవో అని ఇద్దరు ముగ్గురు జవానులు వెంట పరుగు తీశారు. నేను అప్పటికి బజారువీథిలోని వెంకోబరావు గారి సుప్రసిద్ధ విదేశీ వస్త్రాల దుకాణం ముందున్నాను. అంతకు గంట ముందు ఇచ్చిన కరపత్రాన్ని ఆ దుకాణంలోని వారందరూ చదివే ఉంటారు. నేను ఆ దుకాణం ముందు నడుస్తుండగా హెడ్‌కానిస్టేబుల్ పరుగున వచ్చి నా పైన బడి నన్ను పట్టుకున్నాడు. పోలీసు స్టేషనుకు లాక్కుపోయాడు. జనం పోలీసు స్టేషను ముందు మూగారు. కాని, పోలీసు వారు వారిని చెదరగొట్టారు.

సబ్ ఇన్‌స్పెక్టర్ కన్నయ్యనాయుడుగారు ఇంతలో ఉరుముతూ వచ్చారు. ఆయనకు ఎవరో కరపత్రం అందజేశారు కాబోలు! "ఈ పగడసాల (పాఠశాల) పిల్లనాకొడుకు నా మానం మూడు దమ్మిడీలకు తీశాడురా – పోలీసు కుక్కలంట! చెప్పు నానబెట్రా ఫోర్ట్వంటీ! వెంట్రుకలు ఊడగొడదాం. ఆడపిల్లలకున్నంత పొడుగాటి జుట్టు కత్తిరిద్దాం. ఎక్కడ? కత్తెర పట్కురా! ఇంతవరకు ఇలాంటి పని జరక్కుండా చూచినాను. నా ప్రమోషన్ పాడు చేసినాడు ఈ పిల్ల నా కొడుకు!" అంటూ వీరంగం తొక్కాడు. హెడ్‌కానిస్టేబుల్ సిద్ధపరచిన స్పెషల్ రిపోర్టు చేత్తో పట్టుకుని నన్ను డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటుగారి ఇంటికి నడిపించారు. అప్పుడు దాదాపు రాత్రి ఎనిమిది గంటలు.

డిప్యూటీ పోలీసు సూపరింటెండెంట్ ఒక వెలమ దొరగారు. ఆయన చాల సాహసుడని నిజాయితీగలవాడని పేరు. కన్నయ్యనాయుడుగారూ నిజాయితీ గలవాడే. కాని స్వప్రయోజనానికి నేను అడ్డం వచ్చానుగా. వెలమ దొరగారి పేరు గుర్తులేదు– వెంగళరావో, అప్పారావో! ఆయన నన్ను చాలసేపు బుజ్జగించారు. నన్ను బాగా చదివించి ఏ కాలేజీలోనో సంస్కృతం లెక్చరరుగా నియమించేట్టు చేస్తానన్నారు. క్షమాపణ

కోరుకోమన్నారు. దానివల్ల ఆయనకు కీర్తి. కాని, నేను "అయ్యా! నేను చేస్తున్న పని సత్కార్యమని నా నమ్మకం. కనుక క్షమాపణ గిమాపణ కుదరదు" అని సహజ కర్కశ స్వరంతో అన్నాను. "సరే నీ ఇష్టం!" అని ఆయన నన్ను తీసుకో పొమ్మని ఉత్తరువు చేశారు.

కన్నయ్యనాయుడూ మండిపోయారు. "దొరగారు హితం చెబితే వినవా? నా యాల-పోలీస్ స్టేషన్‌లో నిన్ను ఏమి చేస్తానో చూస్కో!" అని గుడ్లెర్ర జేశాడు. నన్ను లాకప్‌లో వేశారు. హోటల్నుంచి ఏదో తెప్పించి పెట్టారు పోలీసులు. మా పథకానికి ముందుగానే అరెస్టయినందుకు ఆనందంతో నాకు ఆకలి కాలేదు; నిద్రపట్టలేదు. సబ్ ఇన్‌స్పెక్టరు గర్జనలు వినిపిస్తూనే ఉన్నాయి. "పగడసాలలో ఇంకా ఎంత మంది ఉన్నారో ఈ మొండి నాకొడుకులు; పదండి!" అంటూ మా కళాశాల హాస్టలుకు వెళ్లారు.

ఆ రాత్రి పోలీసులు హాస్టల్‌లో నేను, మరికొంత మంది ఉన్న హాలు గాలించారు. అందరి ట్రంకు పెట్టెలు తెరిపించి వాటిలోని వస్తువులను కుప్పగపోసి వెదికారు నిషిద్ధ సాహిత్యం దొరుకుతుందేమోనని. కలచవీడు శ్రీనివాసాచార్యులు, కుంటిమద్ది రాఘవాచార్యులు మొదలయినవారిని బెదిరించారు. కరపత్రాలను వారికి చూపించి 'ఎవరి చేతివ్రాత?' అని ప్రశ్నించారు. ఇలాటి పరిస్థితి వస్తే తక్కిన వారు చిక్కులో పడి చదువు పాడుచేసుకోరాదని నేను ముందుగానే హెచ్చరించాను - అన్నీ నా తప్పే అని నా మీద తోసివేయండి - అని. అందువల్ల కలచవీడు శ్రీనివాసాచార్యులు "రెండు మూడు నాళ్లుగా రాత్రులు ఏవో వ్రాస్తున్నాడండీ. ఏవో పరీక్షకు నోట్సు అనుకున్నాము. ఇంత పనిచేశాడని తెలీదు. సంఘానికి సేవ చేస్తున్న పోలీసులను కుక్కలని అనడం.. అవ్వ! ఎంత తప్పు!" అంటూ కన్నయ్యనాయుడుగారిని ఠండా చేశాడు. "ఐతే నీవు రేపు చంద్రగిరి కోర్టుకి మా పక్షాన సాక్ష్యం చెప్పాలి. తప్పించుకొనేవ్ జాగర్త" అని బెదిరించారు నాయుడుగారు. శ్రీనివాసాచార్యులు ఇదే అదను అని "అతనిని చూడవచ్చా సార్?" అని అడిగాడు. నాయుడుగారికి నా క్షమాపణపై ఇంకా ఆశ చావలేదు గనుక "అయితే అయ్యవారా! రేపు లాకప్పులో ఉంటాడు. రేపు రాత్రి సబ్‌జెయిలులో పెడతాము. విచారణ తీర్పు తర్వాత. రేపు, ఎల్లుండి; భోజనం కూడా పట్టుకొనిరా. క్షమాపణ కోర్టులో కూడ కోరవచ్చు. నచ్చజెప్పు, వినకపోయాడా అతని తలరాత" అన్నారు. ఇదంతా నాకు మరుసటి రోజు శ్రీనివాసాచార్యుల వల్ల తెలిసింది.

టౌన్ పోలీస్ స్టేషన్ లాకప్పులో ఉన్న నన్ను ఫిబ్రవరి 5వ తేదీ ఉదయం శ్రీనివాసాచార్యులు, రాఘవాచార్యులు, మరి కొందరు మిత్రులూ చూచి కన్నీళ్లు పెట్టుకున్నారు. నేను అప్పటికే స్నానాదులు ముగించుకొని ఉన్నాను. రాత్రి ఏమీ తిన్నవాడిని కాదు గనుక వాళ్లు తెచ్చిన ఆహారం తీసుకున్నాను. శ్రీనివాసాచార్యులు సబ్ ఇన్‌స్పెక్టర్‌ను మెప్పించడానికి నాతో క్షమాపణ సంగతి ఎత్తాడు. విన్నాను.

"యథా హ్యేకేన చక్రేణ
న రథస్య గతి ర్భవేత్
ఏవం పురుషకారేణ
వినా దైవం న సిధ్యతి"

**(ఒక చక్రంతో బండి నడవనట్టే మానవ ప్రయత్నం లేక దైవం ఏ పనికీ తోడ్పడదు. మానవ ప్రయత్నం ఏమీ లేక ఏ పనీ నెరవేరదు.)**

# 38

# విచారణ - శిక్ష

"ప్రజాపీడన సంతాపాత్
సముద్భూతో హుతాశనః
రాజ్ఞః కులం శ్రియం ప్రణాన్
నాదగ్ధ్వా వినివర్తతే"

**(రాజు ప్రజలను పీడించడాం వల్ల కలిగిన సంతాపం నుంచి పుట్టిన మంట అతని కులాన్ని, సంపదను, ప్రాణాన్ని కూడ కాల్చకుండా వెనుదిరగదు.)**

**పం**దొమ్మిది వందల ముప్పై రెండు ఫిబ్రవరి 5వ తేదీ నా జీవితంలో పెద్ద మలుపు. మా మేనమామ పేరంగూరు తిరునారాయణాచార్యులు గారు రాఘవంపల్లె నుంచి తిరుమలకు యాత్రకు వస్తున్నవారితో చెప్పారు "మా రామునికి 19వ ఏట కేతుదశ చివర కారాగారప్రాప్తి యోగం ఉంది. అక్కడ హాస్టలులో ఉన్నాడు. ఏ విద్యార్థో, మరొక కానివాడో ఏదో దొంగతనమో, మరొకటో మోపి జైలుపాలు చేస్తాడేమో; జాగ్రత్తతో ఉండమనండి" అని. పోలీసుస్టేషను లాకప్‌లో ఉండగా నాకు ఆ సందేశం గుర్తుకు వచ్చి నవ్వుకున్నాను. ఆయన చెప్పిన కారాగార ప్రాప్తియోగం ఈ విధంగా మంచికే అయిందని.

నేను మరుసటి కార్యక్రమం కోసం సిద్ధంగా ఉన్నాను. ఏమి జరుగుతుందో, ఎక్కడికి తీసుకువెళ్ళుతారో తెలియదు. నన్ను చూడవచ్చిన నా కళాశాల మిత్రులు వెళ్లిపోయారు.

సాయంకాలం పరిణామాలు తెలుసుకొని వస్తామన్నారు. అరెస్టు చేస్తారనే భయంతో నా కాంగ్రెస్ మిత్రులు ఎవరూ రాలేదు. ఉద్యమం ఒక పద్ధతిలో నడవాలి, ఎక్కువ కాలం కొనసాగాలి గాని, ఊరికే అరెస్టు కావడం ముఖ్యం కాదుగదా!

ఇంతలో కన్నయ్యనాయుడుగారు రంకెలు వేసుకుంటూ వచ్చారు. "ఏడీ? ఆ పగడసాల పిల్లకాయను - వ్యానులో - కాదు కాదు బస్సులో - చంద్రగిరికి మేజిస్ట్రేటు కోర్టుకు తీస్కపోవాల. తయారుకాండి" అంటూ ఉత్తర్వులు జారీ చేశారు. నేను బేడీలతో స్టేషను నుంచి బస్సు స్టాండుకు నడిచాను. నా ఇరుపక్కలా పోలీసులు నేను ఎక్కడ పారిపోతానో అన్నట్టు బేడీ గొలుసులను గట్టిగా పట్టుకున్నారు. కన్నయ్య నాయుడుగారు విజయగర్వంతో ముందు నడిచారు. నేను కోరుకోకుండానే నాకు మంచి ప్రచారం కలిగింది. మా కళాశాల విద్యార్థులే కాక, హైస్కూలు, ట్రెయినింగ్ స్కూలు విద్యార్థులూ నన్నొక మహావీరుడుగా చూచి జేజేలు చెప్పారు.

తిరుపతికి చంద్రగిరి పదిమైళ్ల లోపు. కనుక బస్సులో, అరగంటలో, సుమారు మధ్యాహ్నం పదకొండు గంటలకు చేరాము. చిత్తూరు జిల్లాలోనే మొదటి సత్యాగ్రహం కేసు కదా! కోర్టు చాల హడావుడిగానే ఉంది. మేజిస్రేటు ఎన్.డి.కృష్ణరావుగారని గుర్తు. ఆయన ఎం.ఏ., ఐ.సి.ఎస్. అని ఇదివరకే తెలుసు. ఆయనను రెండు మూడుసార్లు ఏవో సాహిత్య సభలకు అధ్యక్షత వహించినప్పుడు చూచాను. కాని, నేను ఆయనకు పరిచితుడిని కాదు. మహానాయకుడిని అంతకన్నా కాదు.

నన్ను నిందితుల బోనులో నిలబెట్టారు. మేజిస్ట్రేటు గారు నావైపు చూచారు. చేతులకు బేడీలతో నిలుచున్నాను. ఏమి కనికరం కలిగిందో! "బేడీలు అనవసరం నిందితునికి. సత్యాగ్రహి గనుక ఎక్కడికీ పారిపోడు" అన్నారు. పోలీసులు బేడీల తాళం తీసి, బేడీలను తొలగించారు. కందిపోయిన మణికట్లను ఒకమారు చూచుకున్నాను. నీవు కార్మికుడివి. అంటే కర్మయోగివి. చేతులు ముఖ్యం. వాటిని భద్రపరచుకో - అని కందుగుర్తులు నన్ను హెచ్చరించినట్లనిపించింది. ఒక్కసారి వాటిని చేతులతో తడుముకుని నిలుచున్నాను. పేరు, ఊరు మొదలయిన ప్రశ్నల పరంపర మొదలయింది. నేను చేసిన పని మహా అయితే నాలుగయిదు గంటలది. దానిని ప్రాసిక్యూషన్ పక్షం గంటన్నర సేపు వర్ణించింది. నేను నాలుగైదేళ్లుగా చేసిన పనులన్నీ భయంకరంగా వర్ణనకెక్కాయి. వింటూ విస్తుపోయాను. మనకు తెలియ కుండా ఎందరు ఎన్ని నిఘాలు వేసి ఉంచారో

ఆనాడు తెలిసింది. మనం చేసే పనులు చంద్రసూర్యులు, దిక్కులూ చూస్తూ ఉంటాయనే ఉపనిషద్వాక్యం గుర్తుకు వచ్చింది.

"అఖిల భారత కాంగ్రెస్ సంఘం అక్రమ సంఘమని నిర్ధారణ చేయబడి యుండుటచే అట్టి సంఘమునకు సహాయభూతుడై బహిష్కరింపబడిన కరపత్రము లను పంచి పెట్టినందుకు, నీవు క్రిమినల్ లా చట్టం 17వ సెక్షన్ సబ్ క్లాజు (1) ప్రకారం నేరము చేసినావు అని మేజిస్ట్రేటు ఆరోపణ పత్రం (చార్జిషీటు) చదివి వినిపించారు. తర్వాత నేను చేశానా? లేదా? అని ప్రశ్నించారు. "మీ దృష్టిలో నేను నేరస్తుడినేమో కాని, నా దృష్టిలో కాదు. నేను మీరు ఆరోపించిన విషయాలన్నీ మాతృ దేశభక్తితో, దేశం కోసం చేశాను. అలాంటప్పుడు నేను నేరం చేసినవాడిని ఎలా అవుతాను?" అని ఎదురు



ప్రశ్న వేశాను.

నా మాట విని కన్నయ్యనాయుడు మండిపడ్డాడు. కాని, అది న్యాయస్థానం. అందువల్ల కోపంతో బిగుసుకున్న పిడికిళ్లతో కుర్చీలోనే దేహాన్ని వంపులు తిప్పారు.

తర్వాత ప్రాసిక్యూషన్ తరఫున పోలీస్ సబ్ ఇన్‌స్పెక్టరు, హెడ్‌కానిస్టేబుల్‌లను మేజిస్ట్రేటు విచారించారు. వాళ్లిద్దరూ పై ఛార్జిషీట్‌లోని వివరాలు తెలిపారు. తర్వాత నా కరపత్రాలు అందుకున్న వారిలో కొందరు ప్రాసిక్యూషన్ తరఫున సాక్ష్యమిచ్చారు. వారిలో విదేశవస్త్ర వ్యాపారి బాబూరావు, సైకిలు విడిభాగాల వ్యాపారి వెంకోబరావు మాత్రం నాకు గుర్తున్నారు. నేను కరపత్రాలను తమకు స్వయంగా పంచిపెట్టినట్లు చెబుతూ జేబులోని కరపత్రాలను పైకి తీసిచూపారు.

వాళ్లిద్దరి సాక్ష్యం తర్వాత నా మిత్రుడు కలచవీడు శ్రీనివాసాచార్యుల వంతు వచ్చింది. అతడు తన సాక్ష్యంలో నేను ఐదారేళ్లుగా తనకు తెలుసుననీ, తాను వ్యాకరణ శిరోమణి విద్యార్థి అని, కరపత్రాలు దస్తూరీని బట్టి నావేనని, తక్కిన కార్యకలాపాలు తనకు తెలియవని అన్నారు.

మేజిస్ట్రేటు నావైపు తిరిగి "నీవు దోషివనడానికి బలమయిన సాక్ష్యం ఉంది. దోషిని కాను అనడానికి నీవైపు న్యాయవాది ఎవరన్నా ఉన్నారా? ప్రాసిక్యూషన్ వారు చేసిన ఆరోపణలు తప్పని అనగలవా?" అని లాంఛనంగా ప్రశ్నించారు. "అయ్యా! నేను నేరమే చేయలేదన్నప్పుడు నాకు న్యాయవాదులూ, సాక్షులు ఎందుకండీ? నన్ను మీరు నేరగాడినని ఇన్ని గంటల వాదప్రతివాదాలతో నిర్ణయించు కొన్నారు. మీ చిత్తం వచ్చినట్లు చేయండి" అన్నాను. చంద్రగిరి డివిజన్ జాయింట్ మేజిస్ట్రేట్ రావుగారు నా మాటలు విని తలపంకించారు.

ఇదంతా అయ్యేవేళకు ఫలహారం వేళ అయింది. ఫలహారం తర్వాత కోర్టు సమావేశ మయింది. జాయింట్ మేజిస్ట్రేటు ఉభయ పక్షాల వాదప్రతివాదాలను పరిశీలించిన తర్వాత తన తీర్పు వినిపిస్తున్నానని తెలుపుతూ, 1908 క్రిమినల్ లా చట్టం సెక్షన్ 17(1) ప్రకారం ఎదిరికి సంవత్సరం కఠిన శిక్ష విధిస్తున్నాను" అని తీర్పిచ్చారు. నా మిత్రుడు శ్రీనివాసాచార్యులు బాధపడ్డాడు. జీవితంలో ఒక సంవత్సరం వ్యర్థ మయిందన్నారు. నేను నవ్వుతూ నా బోటివాడు పుట్టడమే వ్యర్థం. ఆ మహావ్యర్థంలో ఇదొక చిన్న వ్యర్థం" అన్నాను. అతడూ నవ్వు తెచ్చుకుని "ఒక విధంగా వ్యర్థం కాదనుకో,

ఇదొక గొప్ప అనుభవం. అందరికీ వస్తుందా? నీతోపాటు నేనూ పనిచేశాను గదా? నీలాగ నేను ధైర్యం చేయగలిగానా?

**"న హి భవతి యదభావ్యం**
**భవతి చ భావ్యం వినాపి యత్నేన**
**కరతల గత మపి నశ్యతి**
**యస్యహి భవితవ్యతా నాస్తి"**

**"జరుగరానిది జరుగదు. జరుగవలసింది ప్రయత్నం లేకనే జరుగుతుంది. భవిష్యత్తు లేనివాడికి అరచేతిలో ఉన్నది కూడా జారిపోతుంది – అని పంచతంత్రంలో చదివాము గదా! నీ భవితవ్యత ఏమిటో ఎవడికి తెలుసు?"** అని దుఃఖాన్ని నవ్వుగా మార్చారు.

తీర్పు జరిగిన కొంత సేపటికి నన్ను బస్సులో ఎక్కించి మళ్లీ తిరుపతికి తీసుకొని వచ్చి సబ్ జెయిలులో తోశారు. తీర్పు తర్వాత కన్నయ్యనాయుడుగారి వైఖరిలో మార్పు వచ్చింది. పారుష్యం పోయి, కొంచెం మార్దవం తొంగి చూచింది. సాక్షులు, వారితోపాటే, శ్రీనివాసాచార్యులూ మా బస్సులోనే వచ్చారు గనుక, కన్నయ్యనాయుడు గారు శ్రీనివాసాచార్యులవైపు చూచి "అయ్యవారా! ఈ రాత్రీ, రేపు పగలూ నీ సంగాతగాడికి అన్నం తెచ్చి పెట్టు. రేపు మధ్యాహ్నం వేలూరు సెంట్రల్ జెయిలుకు పంపుతుంద్రు. అక్కడ అతని పాటు అతనిది" అన్నారు. నా మిత్రుడు సరే నన్నాడు. సబ్ జెయిలులో ఉన్న నన్ను నా కళాశాల మిత్రులు చాలమంది వచ్చి చూచి పరామర్శించారు. వారి దృష్టంతా చదువుపాడయిపోయిందే అనే.

నన్ను ఫిబ్రవరి ఆరవతేదీ మధ్యాహ్నం రేణిగుంట – కాట్పాడి రైలులో ఇద్దరు పోలీసు కానిస్టేబులుల రక్షణలో వేలూరుకు పంపారు. కన్నయ్యనాయుడుగారు వెంట ఉన్నారని చెప్పనక్కరలేదు. కాని, ఏదో పోగొట్టుకున్నట్టు పరధ్యానంగా ఉన్నారు. నా మిత్రులు చాలమంది రైలు స్టేషనుకు వచ్చారు గాని, వారిని పోలీసులు నేనున్న పెట్టెవద్దకు రానివ్వలేదు. రైలు ఐదు నిమిషాలకు కదులుతుందనగా, కన్నయ్య నాయుడుగారు నా వద్దకు వచ్చి; నా రెండు చేతులూ పట్టుకుని, "అయ్యవారా! నిన్ను నా డ్యూటీలో ఏందేందో అన్నాను. నువ్వు నా కొడుకుతో సమానం. దాన్నంతా మనస్సులో పెట్టుకోబాక. నువ్వు సుఖంగా పెరిగి ఏదో సదువుకుంటున్న పిల్లకాయవు. నీకు 'సి' క్లాసు కఠినశిక్ష

ఇచ్చినాడు మేజిస్ట్రేటు. ఆ రాగి సంకటి, రాగి రొట్టే, ఉడికీ ఉడకని అన్నం నువ్వు తినలేవు. అక్కడయినా క్షమాపణ కోరుకో. క్షమాపణ అంటే నా కోసం చెబుతున్నానని అనుకోబాక. నువ్వు ఆ జెయిలు కూడు తినలేవు. క్షమాపణ కోరుకోలేకపోతే ఒకటి చేయి. ఆస్తిని బట్టి 'ఏ' క్లాసు, 'బి' క్లాసు అని ఉంటాయి. జెయిలు సూపరింటెండెంట్ దొరకు అర్జీపెట్టుకో. భోజనం బాగుంటుంది. పెద్ద పనీ ఉండదు" అని కన్నీళ్లు కురిపిస్తూ అన్నారు. నా మనస్సూ కరిగింది "నాయుడు గారూ! కోరి కష్టాలు పడదానికే పోతున్నప్పుడు అవంతా ఎందుకండీ? పెద్దలు ఇంత చెప్పారు. సంతోషం" అంటూండగా రైలు కదిలింది. నాయుడుగారు ఆ విచారంలోను బాష్పధారలోను మెరిసే కళ్లతో "అయ్యవారా! నీవు గట్టి పిండమే. నా మాటలు ఏందీ మనసులో పెట్టుకోబాక!" అంటూ చేయి ఊపారు. ఆ రాతిలో ఇంత తేమ ఉందని తెలిసి ఆశ్చర్యపడ్డాను. ఔను! తన విద్యుక్తధర్మంగా పరుషంగా ప్రవర్తించారు. అంత మాత్రాన మానవత్వం అడుగంటినవాడు కాదు గదా! అతనికి ఎంతసేపటికి నా భోజనం చింతే. జెయిలుకూడు తినలేవు, క్షమాపణ కోరుకో – అనే పాట, పాపం! నివురు గప్పిన మానవత్వం గల మహానుభావుడు!

రైలు కదిలింది. వేగం పుంజుకుంది. అంతవరకు లేని ఉద్విగ్నత నా మనస్సును కమ్మివేసింది. ఏదో ఆందోళన! నన్ను నేను చూచుకున్నాను. గూడకట్టు ఖద్దరు పంచ, ఉత్తరీయం, విరబోసుకున్న పొడుగాటి జట్టు. నా మిత్రుడు కప్పగంతుల లక్ష్మణశాస్త్రిది కూడా బారెడు జట్టు. వారం వారం తలంటి పోసుకోలేక చచ్చేవాళ్లం. ఒకళ్ల జుట్టు మరొకళ్లు సీకాయ పొడితో రుద్దు కొనేవాళ్లం.

ఒకమారు ఆచంట లక్ష్మీపతిగారు మా కళాశాలకు వచ్చి అభ్యంగనం గురించి గంటా రెండు గంటలు ఉపన్యాసమిచ్చారు.

**అభ్యంగం ఆచరే న్నిత్యం**
**సజరాశ్రమ వాతహా,**
**దృష్టి ప్రసాద పుష్ట్యాయు**
**శిరశ్శ్రవణ పాదేషు**
**తం విశేషణ శీలయేత్.**

అని మేఘ గంభీరధ్వనితో చెబుతూ, "ప్రతి దినమూ తలంటుకోవాలి, దానివల్ల అలసట తగ్గుతుంది. ముదిమి దూరమవుతుంది. కంటిచూపు చక్కబడుతుంది. శరీరం

పుష్టిగా ఉంటుంది. ఆయుస్సు పెరుగుతుంది. అందునా తల, చెవి, పాదాలకు నూనె బాగా రాచుకోడం అలవాటు చేసుకోవాలి" అని వివరించారు. ఆయన ఏమి చెప్పినా తలంటిపోసుకోలేక పిలక పెట్టుకుందామా అంటే "పెండ్లి అయ్యేవరకూ జుట్టు ఉండనీరా! పెండ్లాం మల్లెదండ నీ పొడుగాటి జుట్టుకు చుట్టాలి" అని మా అమ్మ కోరిక. ఈ జుట్టుతో ఏమి బాధో జెయిలులో అని అనిపించింది. ఏడేళ్లుగా ఉన్న తిరుపతికి దూరమవుతున్నానని భయమయింది. క్రమంగా గోవిందరాజస్వామి దేవాలయ మహాద్వార గోపురం, ఎన్నిసార్లు ప్రయత్నించినా త్రివర్ణ పతాక ఎగుర వేయడం పడని మహాద్వార గోపురం; తిరుమల కొండల వరుసా మరుగవుతున్నాయి. రాత్రి ఏడెనిమిది గంటలకు కాట్పాడి చేరి, రాత్రి 9.00 గంటలకు ఇతర ప్రాంతాల నుంచి వచ్చిన ఖైదీలతోపాటు జెయిలులో ప్రవేశించాను.

వేలూరును రాయవేలూరు అని కూడా అంటారు. విజయనగర సార్వభౌములలో ప్రౌఢదేవరాయలో మరొక రాయలో, దక్షిణాదిని ఈ దుర్గం కట్టించాడు. దానిని కృష్ణ రాయలు అభివృద్ధిపరచాడు. కనుక రాయలవేలూరు - రాయవేలూరు అని పేరు వచ్చింది. ఇప్పుడు అక్కడి అమెరికన్ ఆస్పత్రి సుప్రసిద్ధమయింది. సత్యాగ్రహ సమయంలో అప్పటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో తమిళ ప్రాంతంలో వేలూరు, కడలూరు, తిరుచిరాపల్లి జెయిళ్లు ప్రసిద్ధమయినవి.

నేను జెయిలులో ప్రవేశించగానే నా పేరు రిజిస్టర్ చేసుకుని, నా గుడ్డలు తీసి వేయించి - ఎన్ని గుడ్డలు? ఒక పంచ, ఒక ఉత్తరీయం - జెయిలు దుస్తులు - గళ్ల బనీను, గళ్ల నిక్కరు, ఒక అల్యూమినియం కంచం, ఒక గ్లాసు ఇచ్చారు. నేను వాటితోపాటు క్వారంటైన్ పీరియడ్ హాలులోకి నడిచాను. కొత్తగా వచ్చినవారిని అంటురోగాలేమయినా ఉన్నాయేమోనని పరీక్షించి అక్కడ ఉంచుకొనడానికో, మరొక చోటికి పంపడానికో నిర్ణయమయ్యేవరకు విడిగా పెట్టి ఆయా ఇంజక్షన్లు, మందులు ఇచ్చే హాలు అది. క్వారన్టైన్ అంటే నలభయి రోజుల పరిమితి.

నేను హాలులో ప్రవేశించగానే వందల మంది సత్యాగ్రహులు, నానా ప్రాంతాల నుంచి వచ్చినవారు నన్ను చుట్టుముట్టి ఎక్కడి నుంచి వచ్చావు? ఏమి చేశావు? ఎలా అరెస్టయ్యావు? ఉద్యమం ఎలా ఉంది? - లాంటి ప్రశ్నలతో ఉక్కిరిబిక్కిరి చేశారు. నేను వాళ్లందరినీ చూస్తే వాళ్ల ప్రశ్నలకు ఓపికతో సమాధానం చెబుతూ

నూతనోత్సాహానందాలతో గడిపాను, కొంతసేపు. రైలెక్కినప్పటి దిగులు పోయింది. ఇంత మంది మనవాళ్లు ఉన్నారు. దిగులెందుకు?

**"కులశీల గుణోపేతః**

**సర్వధర్మ పరాయణః**

**ప్రవీణః ప్రేషణాధ్యక్షః**

**ధర్మాధ్యక్ష విధీయతే"**

**(ధర్మాధ్యక్షుడు - న్యాయాధీశుడు మంచి వంశంలో పుట్టినవాడు, మంచి నడవడి గలవాడు, సకల ధర్మపరాయణుడు, సమర్థుడు, రాజాజ్ఞలను - న్యాయమైన ఆజ్ఞలను - సక్రమంగా నిర్వహించగలవాడు అయి ఉండాలి.)**

# 39

# తిరుచిరాపల్లి కారాగారంలో

"ఏక ఏవ ఖగో మానీ
చిరం జీవతు చాతకః
మ్రియతే వా పిపాసాయాం
యాచతే నా పురందరమ్"

**(పక్షులలో ఆత్మాభిమానం గలది ఒక్క చాతకమే. అది చిరకాలం జీవించనీ! దాని ఆత్మాభిమానం ఎటువంటిదంటే, దప్పికతో చావనన్నా చస్తుంది గాని, ఇంద్రుణ్ణి తప్ప మరెవర్నీ నీళ్ళిమ్మని అడుగదు.)**

**క**న్నయ్యనాయుడుగారు అంతగా భయపెట్టిన 'జెయిలు కూడు' 1932 ఫిబ్రవరి ఆరవ తేదీ రాత్రే వెల్లూరు జెయిలులో ప్రత్యక్షమయింది. కుడిచేత్తో అల్యూమినియం కంచం ఎడమ చేత్తో అల్యూమినియం చెంబు పట్టుకొని తక్కిన ఖైదీలతోపాటే వంటశాల ముందు వరుసలో నిలుచున్నాను. సుమారు ముప్పావు అన్నం ముద్ద, కంచంలో పడేసి దానిమీద పులుసు పోశాడు ఒక ఖైదీ. అన్నం ఉప్పుడు బియ్యపు అన్నం. నా సహచరులతోపాటు కూచున్నాను తినడానికి. ముద్ద దిగలేదు. 'కష్ట పడడం కోసమే వచ్చావు' అని బుద్ధి హెచ్చరించింది. మనస్సు రాయి చేసుకొని నాలుగు ముద్దలు తిన్నాను. పక్క ఖైదీ అన్నాడు: "ఇది క్వారన్‌టైన్ పీరియడ్. మరే జెయిలుకన్నా మారుస్తారు. అక్కడ భోజనం ఇంతకన్నా బాగుంటుందట! అని నేను విన్నాను."

సాధారణంగా క్వారన్‌టైన్ పీరియడ్ రెండు మూడు వారాలు ఉంటుందట. మాకు

రోగ నిరోధకమైన ఇంజక్షనులు కొన్ని చేసి మూన్నాళ్లకే తిరుచిరాపల్లి సెంట్రల్ జెయిలుకు పంపారు. అక్కడ దాదాపు వేయి మంది వివిధ రాష్ట్రాలకు చెందిన సత్యాగ్రహులు ఉన్నారు. తెలుగు కన్నడ తమిళ మలయాళ మహారాష్ట్ర గుజరాత్ హిందుస్తానీ వంగాది భాషలతో అదొక చిన్న భారతదేశమేనని అనిపించింది. భోజనం మామూలే – వెల్లూరు జెయిలు భోజనానికి సమానమే. నేను, జెయిలని వచ్చానుగాని, ఇల్లని సుఖపడడానికి రాలేదుగదా. కనుక భోజనం సంగతి ఆలోచించడమే మానుకున్నాను.

నేను జెయిల్లో ప్రవేశించగానే నాకు స్వాగతం చెప్పినవాడు హనుమంతరెడ్డి అనే కాన్విక్ట్ వార్డర్. ఖైదీలలో సత్ప్రవర్తన గలవారిని, కొంచెం చదువు సంధ్యలు ఉన్నవారిని జెయిలు వార్డర్‌కు సహాయుడుగా, వార్డర్‌లుగా నియమిస్తారు. వారిని కాన్విక్ట్ వార్డర్స్ అంటారు. వార్డర్ అంటే కావలివాడు. ఖైదీ అయిన కావలివాడు. కాన్విక్ట్ వార్డర్ హనుమంతరెడ్డి అప్పటికి ముప్పయేళ్లవాడు. బక్కపలచగా చామన ఛాయతో, కోరమీసాలతో, ఎదుటివారి దృష్టిని ఆకర్షించే ముఖ కవళికలతో గంభీరమయిన వ్యక్తి. పదహారేళ్లకే పెళ్లయింది. నాలుగేళ్లు కాపురం చేశాడు. భార్యకు పరపురుషునితో సంబంధం ఉన్నట్టు అనుమానం కలిగింది. ఉద్రేకం పట్టలేక అనుమానితుడిని కొట్టాడు. వాడు ఆ దెబ్బకు చచ్చాడు. ఇతనికి యావజ్జీవ కారాగారవాస శిక్ష, ద్వీపాంతరవాస శిక్ష పడ్డాయి. అండమాను జెయిలులో ఐదారేళ్లు ఉన్నాడు. భారతదేశ జెయిళ్లలో గడుపుతూ తిరుచిరాపల్లి జెయిలులో రెండేళ్లు ఉన్నాడు. సత్ప్రవర్తన వల్ల కాన్విక్ట్ వార్డర్ అయ్యాడు.

హనుమంతరెడ్డి నిజంగానే సచ్చరితుడు. ఏదో క్షణికోద్రేకంతో పన్నారాజులాగా ప్రవర్తించాడేగాని క్రూరుడు, దుర్జనుడు కాదు. భగవద్గీత కంఠపాఠం. విష్ణుభక్తుడు, విష్ణు సహస్రనామం మొదలయిన స్తోత్రాలు వచ్చు. "రోజూ సత్యాగ్రహులు వస్తుంటారు. వారిలో 'మన బళ్లారి జిల్లావాళ్లు ఎవరయినా ఉన్నారా' అని చూస్తుంటాను. నేను జెయిలు సూపరింటెండెంట్ ఆఫీసులో అటెండరుగా ఉన్నాను. రోజూ వచ్చేవాళ్ళ లిస్ట్ అక్కడికి ముందుగానే వస్తుంది. దానిలోనే పేరు, ఊరు, జిల్లా, ఎక్కడ అరెస్టయింది ఉంటుంది. నీవు బళ్లారి జిల్లా కమలాపురం వాడివని తెలుసుకున్నాను. వెదుక్కుంటూ వచ్చాను" అన్నాడు నన్ను పెద్దన్నలాగ పలకరిస్తూ, నేను చాల సంతోషించాను – అంత ప్రేమతో పలకరించినందుకు. హనుమంతరెడ్డి జెయిలు పరిస్థితి, జెయిలు జీవితం వివరించాడు.

"ఇగో! చిన్నస్వామి! నీకు ఏం కావలసి ఉన్నా అడుగు. మొగమాటం వద్దు. జెయిలులో ఒక్క బీడీ ఒక్క రూపాయితో సమానం. రూపాయి అంటే ఎంతో తెలుసా? ఆరుసేర్ల బియ్యం. ఆరు సేర్ల బియ్యమంటే ఎంతో తెలుసా? బాగా తినేవాడికి పదిహైదు దినాల అన్నం. అంటే ఒక బీడీ పదిహైదు దినాల భోజనంతో సమానమన్నమాట. ఇక్కడ పెద్ద పెద్ద కాంగ్రెసోళ్లు నూనె కోసం, సబ్బుల కోసం, చిరుదిండ్ల కోసం నానా అగచాట్లు పడుతూ ఖైదీలకు బీడీలిచ్చి నూనె గానుగ నుంచి నూనె, జెయిలు పొలం నుంచి కూరగాయలు, బయట నుంచి సబ్బులూ తెప్పించుకుంటూంటారు, పాపం! సుఖంగా ఉన్నవాళ్లు కష్టపడలేరు గదా! నేను వాళ్లకు కావలసింది సప్లయి చేస్తుంటాను. నువ్వు ఏం కావలసినా నన్నడుగు. దుడ్లు, బీడీలు ఖర్చు పెట్టకుండా నీకు తెచ్చిస్తా. నీవు మన జిల్లా స్వామివి" అన్నాడు హనుమంతరెడ్డి.

నేను స్పష్టంగా చెప్పాను. "హనుమంతప్పా! నేను సత్యాగ్రహిగానే ఉండదలచాను. ఇక్కడి భోజనం నాకు చాలు. అది అరిగితే వచ్చే బలం చాలు. అంతగా అవసర మయితే నిన్ను అడుగుతానులే. నీ కంటే దగ్గరి వాళ్లెవరున్నారు గనుక?" అని అన్నాను. అతడు సంతోషంతో తన పనికి వెళ్లిపోయాడు.

నన్ను ఒంటి గదిలో పెట్టారు. గది సుమారు ఐదడుగుల వెడల్పు, ఎనిమిదడుగుల పొడవూ ఉంది. ముందు కటకటాల తలుపు. వెనుక ఒక వెంటిలేటర్. ఒక కంబడి, ఒక జంబుఖానా. వేసుకున్న గళ్ల నిక్కరు, బనీను కాక ఒక నిక్కరు, బనీను. వేసుకున్న బనీనుకు నా క్రమసంఖ్య ఉన్న ఇనప బిళ్ల. రెండు చిన్న గళ్లవి తుండు గుడ్డలు. ఒక అల్యూమినియం కంచం, చెంబు. ఇవి నా ఆస్తి. రాత్రి మూత్ర విసర్జనకు ఓ మట్టిముంత, పురీషానికి మూకుడు. అలాటి ముంతలోనే నీళ్లు. ఆ ముంతలు, మూకుళ్లు, ఇంత కఠినశిక్ష ఏమిటా అని అనుకున్నాను. "నువ్వు పోలీసులను తిట్టినావంట. అందుకోసం నిన్ను మంచి బందోబస్తులో పెట్టమని ఉత్తర్వు" అని ఏదో సందర్భంలో హనుమంతరెడ్డి అన్నాడు.

తిరుచిరాపల్లి జెయిలులో నా నిత్యకర్మ ప్రారంభమయింది. నా స్నానసంధ్యలు, పుండ్రధారణం ఎక్కడికి పోయాయో! అక్కడి నుంచి ఇక్కడికి ఎట్లా ఒదిగి పోయానో నాకే ఆశ్చర్యం! ఉదయం సైరన్ మోగగానే సుమారు 5-30కి లేవడం. జెయిలు వార్డర్, కాన్విక్ట్ వార్డర్ తలుపు తెరవగానే మూత్ర, పురీషపాత్రలు పట్టుకొని అతని

వెంట మరుగుదొడ్డికి వెళ్లి వాటిని కడిగి, పళ్లు తోముకుని, ముఖం కడుక్కొని - కాలకృత్యాలు తీర్చుకొని, ఆ మూత్ర పురీషాల పాత్రలు పట్టుకొని ఒంటి గదికి (సింగిల్ సెల్‌కు) రావడం, కాన్విక్ట్ వార్డర్ తలుపు మూసుకుని పోయిన పిదప ఉదయపు బియ్యం నూకల గంజి కోసం ఎదురు చూడడం. అది తాగిన తర్వాత సుమారు 7.00 గంటలకు అందరితో పాటు వరుసగా ఆయా పనులకు వెళ్లడం, ఒంటి గంట వరకు పనులు, అప్పుడు భోజనం. అన్నం ముద్ద - పులుసు కాని, రాగి రొట్టె - పులుసు కాని. తర్వాత రెండు గంటల నుంచి సాయంకాలం 5.00 గంటల వరకు పని, పిదప గదికి తిరిగి వచ్చి గంట విశ్రాంతి, 6.00 గంటలకు లైడౌన్ అంటే నిద్రకు ఉపక్రమించే బాకా (విజిల్) ఇదంతా కాపలాతోను, ఖైదీల వరుసతోను.

మేము చేసే పని ఏమిటో చెప్పాలి గదా! సాధారణమైన ఖైదీలలో చదువుకున్న వారికి, వారి ప్రవర్తన మంచిదని అధికారులకు నమ్మకం కలిగిన తర్వాత, ఆఫీసులో వ్రాతకోతల పని ఇస్తారు. కాని, సత్యాగ్రహులు రాజద్రోహులు గనుక వారికి శారీరక పరిశ్రమగల పనులే ఇస్తారు. ఇది 'సి' క్లాసు ఖైదీలకు మాత్రమే. కఠినశిక్ష అంటే పని చేయాలి. సాధారణ శిక్ష అంటే పనిచేయనక్కరలేదు. ఆస్తులను బట్టి - నేను ఆస్తి గలవాడినని, ఈ అన్నం తినలేనని - అర్జీలు పెట్టుకుంటే 'బి' క్లాసు, 'ఏ' క్లాసు ఇస్తారు. భోజనం బాగుంటుంది. పని చేయనక్కరలేదు. జెయిలు దుస్తులు ధరించ నవసరం లేదు. 'ఏ' క్లాసువారికి అదనంగా పత్రికలు, పుస్తకాలు చదవడానికి ఇస్తారు. డెటెన్యూలది అందరికన్న పై తరగతి. డెటెన్యూ అంటే కాపలాలో ఉన్నవాడు. సకల సౌకర్యాలు ఉంటాయి, అలాటివారికి. కాని వెలుపలికి వెళ్లే స్వేచ్ఛ ఉండదు. 'సి' క్లాసు కఠిన శిక్ష. వాళ్లకే కష్టమంతా. వారు సాధారణమైన ఖైదీలవంటివారుగానే పరిగణన.

సెంట్రల్ జెయిలంటే స్వయం పోషకమయిన పెద్ద గ్రామం. కమ్మరం, కుట్టుపని, కుమ్మరం, నూనెగానుగ, ఇటుకల మాలారం, గుడ్డల నేత, కంబళ్ల నేత, కంబళ్ల ఉన్ని విడదీయడం, కూరపాదులు కట్టడం, కంకర కొట్టడం, మట్టిమోయడం. ఇవి కాయకష్టపు వృత్తిపనులు. సత్యాగ్రహులకు చాల మందికి వృత్తిపనులే రావు. గనుక కంకర కొట్టడం. ఉన్ని విడిపించడం, గానుగ తిప్పడం వంటి పనులు చెప్పేవారు. నేను కొన్నాళ్లు ఉన్ని విడిపించాను. గొర్రెల నుంచి తీసిన ఉన్ని పై సున్నపు నీరు చల్లి, నీరు ఆరిన తర్వాత జెయిళ్లకు పంపుతారు. బేళ్లుగా కట్టి, ఉన్నిని విడతీసి శుభ్రంగా మళ్లీ బేళ్లు కట్టాలి. ఈ

బేళ్లు విప్పి ఉన్ని విడదీసేటప్పుడు సున్నం ఘాటుకు బాధపడవలసి ఉంటుంది. అలాటివాటికి మళ్లీ చికిత్స. వేరుసెనగ నూనె, నువ్వుల నూనె గానుగలు తిప్పడానికి ఎడ్లుగాని, మరలుగాని, ఉండవు. ఖైదీలే తిప్పాలి ఎడ్లలాగ. నేను కొన్నాళ్లపాటు ఈ సేవ చేశాను. కంకర కొట్టడం ప్రతి జెయిలులోను పెద్ద పరిశ్రమ. ఆ కాలంలో రోడ్డుకు జెయిళ్లే కంకరను సరఫరా చేసేవి. దీనివల్ల ప్రభుత్వానికి కోట్ల రూపాయల కూలీ మిగిలేది. నేను కొన్నాళ్లు కంకర కొట్టాను. చేతులు బొబ్బలెక్కి కాయలు కాచాయి. హనుమంతరెడ్డి నన్ను పరామర్శిస్తూ, కావలసినవి అడగమనేవాడు. నాకు కావలసినవి ఏమున్నాయి? జెయిలు జీవితానికి అలవాటు పడ్డాను. ఏమీ వద్దనేవాడిని. "నువ్వు ఒక్కడివే నిజమైన కాంగ్రెసోడివి. తక్కిన బ్లాకుల్లో చూడు! నూనెకనీ, సబ్బులకనీ, సిగరెట్లకనీ, పిప్పరమెంట్లకనీ; నన్ను ప్రాధేయపడేవాళ్లే. పాపం సుఖంగా బతికినోళ్లు! నువ్వంటే ఉన్నావుగాని, వాళ్లు నోళ్లూ మనసులూ కట్టగలరా?" అనేవాడు.

నేను మంచివాణ్ణనుకున్నారేమో అధికారులు; నన్ను ఒంటి గది నుంచి పెద్ద బ్లాకుకు మార్చారు. అది పెద్ద హాలు వలె ఉండేది. దానిలో రెండు వరుసలలో ఒక మనిషి పడుకోగలిగినంత సిమెంటు దిమ్మలు, మంచం కొలతలో మూడడుగుల ఎత్తున ఉండేవి. నా ఎడమ పక్కన కామరాజ్ నాడార్. అప్పటికి ఆయన సాధారణ స్వచ్ఛంద సేవకుడు. ఇంకా నాయకుడు కాలేదు. మరొకపక్క మధురైవాసి, గొప్ప పరిశ్రమల యజమాని; సోమయాజులు. ఆస్తులలోను, చదువులలోను చాల గొప్పవారు. వారికీ 'సి' క్లాసే. అప్పటికి సత్యాగ్రహుల సంఖ్య వేయి దాటింది. జెయిలు అధికారి ఒక ఐరిష్. పేరు గుర్తులేదు. కొంత సానుభూతితో చూసేవాడు. సత్యాగ్రహులు కాక వేయికి పైగా తక్కిన ఖైదీలూ ఉండేవారు. విడిగా 'ఏ' క్లాసు, 'బి' క్లాసు, డిటెన్యూల బ్లాకులుండేవి. బ్రిటిష్ ప్రభుత్వం జెయిలు నుంచే సత్యాగ్రహులలో ఏ.బి.సి క్లాసులతో చీలికలు తెచ్చింది.

ఈ బ్లాకుకు మారిన తర్వాత నా పరిచయ పరిధి పెరిగింది. పని కూడా తగ్గింది. తమిళ, కన్నడ, మలయాళ ప్రముఖులు ఎక్కువగ ఉండేవారు. తెలుగువాళ్లు కూడా చాలామంది తర్వాత వచ్చారు. నాకు కామరాజ నాడార్, బారిస్టర్ ఎల్.ఎస్.ప్రభు, కోయంబత్తూరు నాయకుడు సుబ్బయ్యపిళ్లే, మధుర ప్రముఖులు పట్టాభిరామయ్య, సోమయాజులు, ఉత్తరార్కాడు గొప్ప నాయకుడు ఉభైదుల్లా, రాజాజీ కార్యదర్శి సుబ్బయ్యర్, తిరునెల్వేలి జిల్లా ప్రముఖుడు ఇళంగో, దక్షిణార్కాడ్ జిల్లా నాయకుడు వేదారణ్యం

వేదరత్నం పిళ్లె, రాజపాళయం ప్రముఖులయిన సుబ్బరాజు, పెరుమాళ్ల రాజు, తర్వాత గొప్ప నాయకులయిన కూర్గువారు కుశాలప్ప, తర్వాత గొప్ప కమ్యూనిస్టు నాయకులయిన గోపాలన్, నారాయణ నంబియార్, జోసెఫ్, స్వామి నిత్యానంద మొదలయినవారితో పరిచయమయింది.

తెలుగువాళ్లలో రాజమండ్రి డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం, ఆశ్రమం డాక్టర్ దీక్షితులు, డాక్టర్ నాగేశ్వరరావు, ఆళ్ల బాలకృష్ణారెడ్డి, పట్టాభిరామిరెడ్డి, భూపతిరాజు, గొప్ప నాయకుడు మద్దూరి అన్నపూర్ణయ్య మొదలయినవారు పరిచితులయ్యారు.

నారాయణన్ అనే సత్యాగ్రహి ఉండేవాడు. అతడు డెటెన్యూల వద్దకు వెళ్లి హిందూ పత్రిక చదివి వచ్చి, సాయంకాలం రోల్ కాలుకు ముందు ప్రార్థన కోసం సత్యాగ్రహులు సమావేశమయినప్పుడు హిందూ పత్రిక మొదటి పుట మొదటి కాలంలో ఈ వార్త – రెండో కాలంలో ఈ వార్త అంటూ ఎనిమిది పుటలలోని వార్తలూ, ఒప్పజెప్పేవాడు. అదీ అవధానమే. అష్టావధానులూ, శతావధానులూ కవిత్వానికి తమ అవధాన శక్తిని వినియోగిస్తే నారాయణన్ వార్తలకు వినియోగించి సంపాదకీయంతో సహా అన్నీ కామా పుల్‌స్టాపులతో ఒప్పజెప్పేవాడు.

అప్పుడు జిల్లా మెడికల్ ఆఫీసర్ కల్నల్ డాక్టర్ శంకరశాస్త్రిగారు. ఆయన వారం వారం జెయిలుకు వచ్చి, ఖైదీల ఆరోగ్య పరిస్థితిని పర్యవేక్షించేవాడు. జెయిలు వార్డర్లు మమ్ములను వరుసగా నిలబెట్టేవారు. కల్నల్ శాస్త్రిగారు ఒక్కరొక్కరినే పరిశీలిస్తూ వెళ్లేవారు. వారి ఫిర్యాదులను వినేవారు. ఆయన చేసే చికిత్సలో, సూచనలో ఆయన వెంట వున్న వైద్యులు ఒక పుస్తకంలో రాసుకొనేవారు. తర్వాత అమలు పరచేవారు. జెయిల్ తిండితో చాల మందికి అనారోగ్యం కలిగేది. కల్నల్ శాస్త్రి అది గ్రహించి అలాటివాళ్లకు పాలు మొదలయినవి లభించేట్టు ఉత్తర్వు చేసేవారు. హనుమంతరెడ్డి పాలు, రొట్టె కోరమని సలహా ఇచ్చేవాడు. "నాకు జెయిలు అన్నం, దేవతా పులుసు అరిగి ఒంటబడితే చాలు" అని అనేవాణ్ణి. మెచ్చుకోలుతో అతని కళ్లు మెరిసేవి.

ఒక్కసారి మాత్రం కల్నల్ శాస్త్రిగారితో "నాకు అసహ్యమయిన కలలు వస్తున్నాయి" అని ఫిర్యాదు చేశాను. ఆయన నవ్వుతూ "ఆడపిల్లలను గురించి ఆలోచించవద్దు. చన్నీళ్లు స్నానం చేయి, మూడుసార్లు" అని సలహా ఇచ్చాడు.

సత్యాగ్రహులు ఎక్కువ మంది ఉండడం వల్ల జెయిలు సూపరింటెండెంట్ ఐరిష్

కావడం వల్ల; క్రమంగా సత్యాగ్రహులపై ఒత్తిడి తగ్గింది. చదువుకొనడానికి, గోష్ఠులు జరపడానికి అవకాశం కలిగింది. కాయకష్టం నామమాత్రంగా చేసేవాళ్లం. తిరుచినాపల్లి జిల్లా ప్రముఖుడు చక్రవర్తి అనే విద్వాంసుడు కంబరామాయణం చదివి వ్యాఖ్యానించేవాడు. ఎల్.ఎస్.ప్రభు న్యాయశాస్త్ర విషయాలు, ప్రాచీన స్మృతులతో పోల్చి రోజూ ఓ గంట ప్రసంగించేవాడు. ప్రభును గురించి కొంచెం చెప్పాలి. ఆయన మంగుళూరులో గొప్ప న్యాయవాది. ఆయన సకుటుంబంగా - నెల్లూరులో ఓరుగంటి వెంకటసుబ్బయ్యగారు సకుటుంబంగా, కొడుకులు, కోడళ్లతోసహా సత్యాగ్రహం చేసి జెయిలుకు పోయినట్లు - జెయిలుకు వెళ్లినవాడు. ఆయన భార్యకు ఐదు వందల రూపాయల జుర్మానా, సంవత్సర కఠినశిక్ష విధించాడు మంగుళూరు జిల్లా మేజిస్ట్రేటు. ఆమె జుర్మానా కట్టనంది. అప్పుడు మేజిస్ట్రేటు ఆమె మంగళసూత్రం కోర్టులో వేలం వేయించి జుర్మానా డబ్బు కట్టించాడు. ఈ దుష్టచర్యకు దేశమంతా ఉడికిపోయింది. పత్రికలు తీవ్రంగా విమర్శించాయి. వీళ్ల ప్రసంగాలు, క్లాసుల వల్ల నాబుద్ధి కొంత వికసించినట్టు భావించాను.

మద్దూరి అన్నపూర్ణయ్యగారు, అల్లూరు సీతారామరాజుగారి సహాధ్యాయులు. ఆయన జీవితంపై ఒకనాడు ఐదారు గంటలు ప్రసంగించారు. "ఆయన పాదాలు ప్రబంధాలలో వర్ణించినట్టు పద్మాలలాగ లేతగా ఉండేవి. ఆయన పాదరక్షలు ధరించే వారు కాదు. కొండలపైన గుట్టలపైన పరుగెత్తేవారు. కాళ్లు చిట్లిపోతాయేమోనని భయపడేవాడిని. ఒకమారు పంచమ జార్జి పుట్టిన రోజున బళ్లల్లో అందరికి మిఠాయిలతోపాటు యూనియన్ జాక్ ఇచ్చారు. ఆ జెండాను సీతారామరాజు చొక్కాకు గుండె దగ్గర గుచ్చుకున్నాడు. "ఎందుకు ఇక్కడ గుచ్చుకున్నానో తెలుసా? ఈ ప్రభుత్వాన్ని గుండెలో నిండిన కోపంతో ద్వేషిస్తున్నాను" అన్నాడు. ఆయన గురి అర్జునుని గురి. బాణం ఎక్కడ వేయదలచుకుంటే అక్కడే పడేది. ఒకమారు బాణానికి లేఖ ప్రయోగించాడు. అది బంగ్లా వరండాలో పత్రిక చదువుతూ కూర్చున్న కలెక్టర్ కాళ్లవద్ద పడింది. అతడు బాణమేమిటా అని తీసి దానికి కట్టిన జాబు విప్పాడు. అది ఆంగ్లంలో అతనికి హెచ్చరిక - ఇలా అన్నయ్యపూర్ణయ్యగారు ఎన్నో విషయాలు చెప్పారు.

దేశంలో సత్యాగ్రహం తీవ్రంగా ఉన్నందున ఆ సంవత్సరం అఖిల భారత కాంగ్రెస్ మహాసభ జరుగలేదు. మేము తిరుచిరాపల్లి జెయిలులోనే సభ జరిపాము. మధురై

ప్రముఖులు, వయోవృద్ధులు, పట్టాభిరామయ్యగారు అధ్యక్షత వహించారు. జెయిలు సూపరింటెండెంటు పరోక్షంగా అనుమతించాడు గనుక సభ చక్కగా జరిగింది. ఆ జెయిలులోని స్వేచ్ఛను చూచి ఉభైదుల్లా తరచు చప్పట్లు కొడుతూ "జెయిలా ఇదు?" అని తమిళ్‌లో నినాదాలు చేసేవాడు.

**"యదా కించిద్‌జ్ఞో హం గజ ఇవ మదాంధః సమభవం**
**తదా సర్వజ్ఞో స్మీతి అభవ దవలిప్తం మమ మనః**
**యదా కించిత్ కించిత్ బుధజనసకాశా దవగతం**
**తదా మూర్ఖోస్మీతి జ్వర ఇవ మదో వ్యపగతః"**

**(అరకొర జ్ఞానం ఉన్నప్పుడు సర్వజ్ఞుణ్ణని విర్రవీగుతూ మదించిన ఏనుగులాగ పోతరించాను. పండితుల వద్ద కొద్ది కొద్దిగా తెలుసుకొన్న కొద్దీ, నా గర్వం జ్వరం లాగ దిగిపోయింది.)**

# 40

# డెటెన్యూలు చేసిన బ్రెయిన్ వాష్

"మ్రదీ యసీ మపి ఘనామ్
అనల్ప గుణ కల్పితామ్
ప్రసారయంతి కుశలాః
చిత్రాం వాచం పటీమివ"

**(నేర్పరులు మన ఎదుట మృదు మధురాక్షరాలతో ఉన్న అర్థ గౌరవంతో గొప్ప గుణాలతో, శబ్దాది చిత్రాలంకారాలతో చిక్కగా చక్కగా అల్లిన మాటలను సన్ననివి, నున్ననివి, అయిన గట్టి పోగులతో చిక్కగా దట్టంగా నేసిన చిత్రవిచిత్రమైన తెరను దించినట్లు దించుతారు.)**

**తి**రుచిరాపల్లి జెయిలులో ముగ్గురు డెటెన్యూలు ఉండేవారు. వారు ముగ్గురూ బెంగాలీలు, ఒకరు ప్రతూల్ చంద్రగంగూలీ, భారీగా ఎర్రగా ఉండేవాడు. అతడు సైన్యంలో చేరి సైనికుల మనస్సులను మార్చడానికి ప్రయత్నించాడనే ఆరోపణపై నిర్బంధంలో ఉన్నాడు. రెండవ వ్యక్తి జీవన్‌లాల్ ఛటర్జీ. ఈయన కమ్యూనిస్టు సిద్ధాంతి. అందువల్ల నిర్బంధంలో ఉన్నారు. మూడవ వ్యక్తి సురేంద్రమోహన్ ఘోష్. ఈయన అరవిందఘోష్ కార్యదర్శి. గొప్ప విద్వాంసుడు. రవీంద్ర సాహిత్యం బాగా అధ్యయనం చేసినవాడు. బక్కపలచగా పొడుగ్గా ఉండేవాడు. ముగ్గురూ బంగారు రంగుతో చాల

అందంగా ఉండేవారు. ఘోష్ తర్వాత కాంగ్రెస్‌లో చేరి కాంగ్రెస్ చరిత్ర రచించారు.

మరి ఇద్దరు 'ఏ' క్లాసు ఖైదీలు కుందన్‌లాల్‌గుప్త, బట్‌కేశ్వరదత్. కుందన్‌లాల్‌గుప్త మీరట్ కుట్రకేసులో నిందితుడు. ఏడేళ్ల శిక్ష గడుపుతున్నవాడు. బట్‌కేశ్వరదత్త; ఇరవయ్యేళ్ల శిక్ష అనుభవిస్తున్నాడు. వీరంతా మంచి మాటకారులు. జెయిలులో సత్యాగ్రహులపై తీవ్రత తగ్గిన పిదప; జిజ్ఞాసువులు, ఉత్కంఠితులు చాలమంది వాళ్లదగ్గరికి వెళ్లి వచ్చేవారు. వారు గాంధీజీని ప్రశంసిస్తూనే ఆయన సిద్ధాంతం ఎందుకు ఆచరణ సాధ్యం కాదో, సాయుధ విప్లవం ఎంత త్వరగా ఫలప్రదమౌతుందో, మృదుమధురంగా ఎదుటివారు తమ తీర్థం పుచ్చుకునేంత పట్టుగా ప్రసంగించేవారు. సురేంద్రమోహన్ ఘోష్ గాంధీజీనీ, మరెవరినీ విమర్శించేవాడు కాదు. సాహిత్యం తప్ప మరొకటి మాట్లాడేవాడు కాదు నాతో. ఆ ముగ్గురు డెటెన్యూల వయస్సు దాదాపు నలభై నలభయ్యయిదు ఏళ్లు.

నేను సంస్కృత విద్యార్థిని అని తెలిసిన తర్వాత సురేంద్రమోహన్‌ఘోష్ నన్ను రవీంద్రుని సుప్రసిద్ధ గీతం 'అకేలా చలో'ను అనువాదం చేయమన్నాడు. నేను చేసి ఆయనకు వినిపించాను. చాల సంతోషించి ప్రోత్సహించేవాడు. ఆ గీతంలోని రెండు చరణాలు మాత్రం గుర్తున్నాయి.

**"ఏకాకి చర ఏకాకీ చర**
**ఏకాకీ చరరే**
**భువనే సలే రే భవతా న వదతి**
**భీషయమాణే ముఖే సత్య పి**
**పరై రథర్షిత ధీర హృదంతర**
**ఏకాకీ చరరే**
**ఝంఝూవాతే రజనీ సమయే**
**నాలోకే నతి ద్వారే పిహితే**
**వజ్ర జ్వాలిత వక్షః పంజర**
**ఏకాకీ చరరే"**

**(ప్రపంచమంతా నీతో మాట్లాడకపోయినా, భయపెడుతూ నీకు విముఖంగా ఉన్నా; ఎవరికీ బెదరని గుండెతో ఒంటరిగా ముందుకు నడు.**

**తుఫాను చెలరేగినా, చీకటి ముంచుకు వచ్చినా, వెలుతురు ఏ మాత్రమూ లేకపోయినా, తలుపులు మూతపడి ఉన్నా, పిడుగుతో నీ వక్షః పంజరాన్ని వెలిగించు కొని ముందుకు నడు!)** ఈ గీతం గాంధీజీకి చాల ఇష్టమైనది. రవీంద్రుడు ప్రచ్ఛన్నంగా సత్యాగ్రహాన్ని బలపరుస్తున్నాడని ఈ గీతం విన్న తర్వాత గాంధీజీ భావించారు. మరికొన్ని కూడ అనువదించాను గాని గుర్తు లేదు.

జీవన్‌లాల్ ఛటర్జీ తన దగ్గరికి వచ్చిన వాళ్లందరికీ నిరంతరం విప్లవం, సాయుధ సమరం, ధనికుల (తాను పెద్దభూస్వామి) దౌర్జన్యాలు వివరిస్తూ మాబోటి యువకులను రెచ్చగొట్టేవాడు. "ఈసారి నీవు ఏ బ్రిటీష్ వాడినయినా కాల్చి చంపి జెయిలుకు రా, నేను సంతోషిస్తాను" అని బాహాటంగా దౌర్జన్యం ప్రచారం చేసేవాడు. నేను సగం మారిపోయాను. ఆ ఉద్రేకంలో ఎన్నో ఆర్యలు వ్రాశాను. సుమతే, అనే మకుటంతో ప్రారంభించిన శతకాన్ని ఈ విద్వేష దౌర్జన్యాలతో నింపివేశాను. ప్రారంభంలో కొత్తగా మంచి శతకం వ్రాద్దామనే అనుకున్నాను.

**"శ్రీ పరమేశ్వర గురుతర**
**మహిమా వగమే కృతోద్యమా మనుజాః**
**సాగర వైశాల్య మహో**
**జ్ఞాతుం నిస్సృతాః పిపీలికాః సుమతే"**

**(పరమేశ్వరుని మహిమను తెలుసుకొనడానికి ప్రయత్నించే మానవులు సముద్రం వైశాల్యాన్ని కనుగొనడానికి బయలుదేరిన చీమల వంటివారు అనే ఆర్యతో ప్రారంభించాను. కాని, అది విద్వేష విషం కక్కుతూ ముగిసింది.)** దాన్ని తర్వాత తిరుపతి నుంచి వెలువడే చిన్న పత్రికలో ప్రచురించాను. కాని. ఇప్పుడు ఆశతకం, దానిని ముద్రించిన ముద్రణాలయం రెండూ లేవు, ఆ శతకం నుంచి జ్ఞప్తిలో ఉన్న కొన్ని ఆర్యలు ఇవి:-

**"దీనజన రుధిర చూషణ**
**సక్తానామ్ ఆఢ్య రక్ష సామగ్రే**
**ప్రాణేషు కంఠగతేష్యపి**
**సనమయ దైన్యేన మస్తకం సుమతే"**

(దరిద్రుల రక్తాన్ని పీల్చే ధనవంతుల ఎదుట ప్రాణాలు కంఠగతాలయినా తలవంచకు.)

"దీనానాం కంకాళైః
ఆమిష పిండైశ్చ శోణితాసారైః
సంఘటితే ధని భవనే
పాదన్యాసోపి పాపకృత్ సుమతే"

(దరిద్రుల అస్థిపంజరాలతో మాంసం ముద్దలతో, రక్తధారలతో కట్టిన ధనికుని ఇంట్లో అడుగుపెట్టడం కూడ పాపం కలిగించేదే.)

"యాచక గణ మంగణగీత
మతిపురుషం భర్త్స యంతి యా వాక్యః
తాసా మపి పరిపీడనమ్
అస్మన్నీత్యా సదీహితం సుమతే"

(ముంగిట్లో నిలిచి బిచ్చమడుగుతున్న యాచకులను కటు వాక్యాలతో నిందించే స్త్రీలను బాధించవలసిందే. నా నీతి ప్రకారం అది మంచి పనే.)

"దుష్ట జన విభవ హారణం
మనురప్యాశాస్తి ముక్తకంఠేన
విశ్వస్య తత్ర కర్మణి
ముక్తా శంక స్త్వరస్య నను సుమతే"

(దుర్మార్గుల సంపదను స్వాధీన పరచుకోవచ్చునని మనువు ఎలుగెత్తి చెబుతున్నాడు. ఆ మాటలను నమ్మి ఆ పనికోసం త్వరగా పూనుకోవోయ్!)

"న కదా వ్యపకురు ధనినం
సంతత మా పద్య మాన మపి విపదమ్
జ్వలన జ్వాలా మోచక
మసి పురుషం దశతి వృశ్చిక స్సుమతే"

(నిప్పులో పడబోయే తేలును కాపాడినవాడినే ఆ తేలు కుదుతుంది. కాపాడాడు

**గదా అనే కనికరం ఏమీ ఉండదు. అట్లే ఆపదలో చిక్కుకున్న ధనవంతుడిని రక్షించకు. రక్షించావా, అతడే నీకు ఎసరు పెడతాడు.)**

ఇలా సాగింది, శతకం. ఈ పద్యాలు విని డెటెన్యూలందరూ ఆనందించారు. తమ దౌర్జన్యమంత్రం బాగా పారిందని సంతోషించి ఉంటారు బెంగాలీవారు.

ఎన్నో సంస్కృత గీతాలు వ్రాశాను దేశభక్తిని ప్రబోధిస్తూ. వాటిని సిమెంట్ దిమ్మ మంచం ఎక్కి గోడమీద బొగ్గుతో వ్రాశాను. మాకు కలాలు, పెన్సిళ్లు, కాగితాలు నిషిద్ధం. కనుక శ్లోకాలు మనస్సులోనే పెట్టుకొని డెటెన్యూల వద్దకు పోయినప్పుడు కాగితం, కలం అడిగి పుచ్చుకొని తలలోది కాగితం మీదికి దించేవాణ్ణి.

జెయిల్లో "సత్యాగ్రహ విజయః" అనే నాలుగంకాల నాటకమూ ఒకటి వ్రాశాను. ప్రథమాంకంలో ఇతివృత్తం సత్యాగ్రహి తన సహచరులతో 'భింది భింది భారతీయ మాతృదాస్యశృంఖలమ్' అనే మార్చింగ్ సాంగ్ పాడుతూ నగర వీథులలో తిరుగుతూ ఉండేటప్పుడు ఇంకా కొందరు పౌరులు ప్రకటించిన భావాలు. రెండవ అంకంలో సత్యాగ్రహిని పోలీసులు నిర్బంధిస్తారు. విచారణ; జెయిలు శిక్ష కూడా ఉంటాయి. మూడో అంకంలో అతని ఆవేదన. జెయిలులో పితూరీ జరుపుతారు. నాలుగో అంకంలో కోర్టు విచారణ - ఉరితీత. ఉరికంబం నుంచి ఆ సత్యాగ్రహి.

**"శైల రాజ తుంగ శిఖర**
**ఖేల దతుల కేతన మయి**
**లీలయా స్వకీయ విభవ**
**సారమేద వదతి వదతి**
**ధీరాభవ జననీతప**
**కారాత్రి దివత్వ మేతిః"**

**"ఓ జననీ! భయపడకు, ధీరురాలివిగా ఉండు. హిమనగపు అత్యున్నత శిఖరం మీద రెపరెపలాడే నీ త్రివర్ణ పతాక నీ విభవ సారాన్ని తెలుపుతున్నది. నీ కారాగారం స్వర్గమవుతుంది"** అంటూ ప్రాణాలు వదులుతాడు.

నాయకుడు మరణించిన దీనికి 'విజయః' అనే పేరేమిటి? అని శంకిస్తారేమో! సత్యాగ్రహం కొనసాగుతుంది. దమననీతికి తలొగ్గడం జరుగలేదు. అదే విజయం!

నాబోటి చంచల మనస్కులైన యువకులందరికీ డెటెన్యూల మాటలు చక్కెర మూటలయ్యాయి. శిక్ష పూర్తయి విడుదలయిన తర్వాత విప్లవోద్యమం కొనసాగించాలని; నేను, ఆళ్ల బాలకృష్ణారెడ్డి, పట్టాభిరామిరెడ్డి, బుచ్చిరెడ్డిపాళెం అనంతరామ అయ్యంగారు, భూపతిరాజు వెంకట్రాజు; మరికొందరం చేతుల మీద మరొకరి చేతులు వేసుకొని ప్రతిజ్ఞ చేశాము.

ఈలోగా ఒక గొప్ప సంఘటన జరిగింది. ఆళ్ల బాలకృష్ణారెడ్డి ప్రభుత్వం నిషేధించిన పుస్తకాలు కొన్నిటిని సంపాదించాడు. వాటిలో ఒకటి వినాయక దామోదర సావర్కర్ వ్రాసిన "సిపాయి పితూరీ" అనబడే ప్రథమ భారత స్వాతంత్ర్య సమరం - ది ఫస్ట్ వార్ ఆఫ్ ఇండియన్ ఇండిపెండెన్స్ అనే ఆంగ్ల పుస్తకం. దానిని అతడు బ్రెడ్డు ముక్కల మధ్య పెట్టి పంపించే ఏర్పాటు చేశాడు. అతడు బ్రెడ్ కావాలని కోరినట్లు దానిని ఒక కాన్విక్ట్ వార్డర్ తెచ్చి ఇచ్చినట్లు నాటకం. మేమంతా దానిని అతి రహస్యంగా రోజుకొకపూట చొప్పున చదివాము. మరికొన్ని నిషిద్ధ హిందీ పుస్తకాలూ చదివాము. మా విప్లవ దృష్టి బాగా బలపడింది. విడుదలయిన వెంటనే అందరూ ఒక చోటచేరి విప్లవోద్యమానికి ఒక దిట్ట (పథకం) నిర్ణయించుకోవాలని తీర్మానించుకొన్నాము. ఆళ్ల బాలకృష్ణారెడ్డి మా అందరికన్నా ముందు విడుదలయ్యాడు. పట్టాభిరామిరెడ్డి చాల చతురుడు. శ్రీమంతుడు. విప్లవ కార్యక్రమాలకు ధనసాయం చేస్తానన్నాడు. మైపాడు బలరామి రెడ్డి పెద్ద భూస్వామి. అతడూ తోడ్పడతానన్నాడు. నేను విడుదలయిన తర్వాత నెల్లూరికి వెళ్లేట్లు ఏర్పాటయింది. సమాన భావాలుగల తమిళ కన్నడ మలయాళ తుళు యువకులు కూడా మాతో ఏకీభవించారు. ఇప్పుడు తలుచుకుంటే నాకు నవ్వు వస్తుందిగాని, అప్పుడు మా విప్లవోద్యమం జయిస్తుందనే మా విశ్వాసం.

హనుమంతరెడ్డి నన్ను అప్పుడప్పుడు కలుసుకొనేవాడు. నన్నూ నాలోని మార్పునూ పరిశీలించేవాడు. 'స్వామీ! నువ్వు గాంధీ మహాత్ముని పేరు మీద జెయిలుకు వచ్చినావు. దాన్ని దాటవద్దు. ఆ డెటెన్యూల మాటలు వినొద్దు. వాళ్లకేం? బాకా కొవ్వినవాళ్లు. కోటీశ్వరులంట. వాళ్లు ఏంచేసినా, ఏం మాట్లాడినా చెల్లుతుంది. నీది గాంధీ మార్గం. అదే సరైంది. దాన్ని వదలక' అని హెచ్చరించే వాడు. నేను విని తల ఊపేవాణ్ణి.

ఈలోగా మా ఇంటి నుంచి ఉత్తరం వచ్చింది. "జెయిలుకు పోయినవారు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. నీవు దేశం కోసం జెయిలుకు వెళ్లావు. జెయిలు నుంచి

విడుదల కాగానే శ్రీరంగం వెళ్లు. తిరుచిరాపల్లికి ఎనిమిది మైళ్లలో ఉంది. శ్రీరంగం శ్రీవైష్ణవులకు ప్రధాన క్షేత్రాలలో ప్రధానమైనది. రామానుజులవారు 'శ్రీరంగ మంగళ మణింకరుణా నివాసం' అని సెలవిచ్చినారు. నీవు శ్రీరంగం వెళ్లి కావేరిలో సంకల్ప పూర్వకంగా స్నానంచేసి శ్రీరంగనాథుణ్ణి సేవించుకొనిరా, అంతకన్న ప్రాయశ్చిత్తం మరొకటి లేదు' అని ఉత్తరం సారాంశం.

ఒకటి చెప్పడం మరచాను. నేను సింగిల్ సెల్ నుంచి హాలుకు మారిన తర్వాత దినమూ స్నానానంతరం సంధ్యావందనం చేసేవాడిని. పెద్దలు, ముఖ్యంగా ఉభైదుల్లా మెచ్చుకొనేవారు. "సంధ్యావందనం భగవదారాధన వంటిది. దానిని వదలడం ఎందుకు? అది దేశసేవకు అడ్డేమీ రాదు" అనేవాడు. నీవు ఒక్కడివేనయ్యా సరైన పాప్పాన్‌వి - అని ప్రశంసించేవాడు. ప్రార్థనాదికాలు సొంత విషయాలు. వాటిని వదులుకోనక్కరలేదని ఆయన వాదం.

ఎందుకో నాకు శిక్షలో రెండు మూడు నెల్లు రెమిషన్ (తగ్గింపు) ఇచ్చారు. కనుక ముందుగా విడుదలయ్యాను. హనుమంతరెడ్డి కన్నీటితో సాగనంపాడు. గాంధీదారి వదలకు అన్నాడు. నాకు గానుగాడినందుకు, కంకర కొట్టినందుకు, గొర్రె ఉన్ని విడదీసినందుకు, ఇల్లు చేరుకునే వరకు భోజనానికి కలిపి ఏ లెక్కన ఇచ్చారోగానీ రైల్వే ప్రయాణం వారంటుతోపాటు సుమారు ఇరవై, ఇరవై అయిదు రూపాయలు చేతిలో పెట్టారు, జెయిలు అధికారులు. ఇదీ అదృష్టమే అనుకున్నాను. ఇంటినుంచి వచ్చిన ఉత్తరం ప్రకారం శ్రీరంగం వెళ్లి కావేరిలో గ్రుంకులిడి రంగనాథుని సేవించుకుని అక్కడే పొంగలి ప్రసాదం కడుపునిండా తిని, రైలెక్కాను. హొస్పేటకు రైల్వేవారంటు. అప్పుడు హొస్పేట చేరుకోవడానికి మూడు రోజుల ప్రయాణం.

రైలు ఎక్కే ముందు ఒక ఆనంద సంఘటన. శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయి గారు తిరుచిరాపల్లి జెయిలు స్త్రీల విభాగం నుంచి విడుదలయ్యారు కాబోలు! "భారతదేశపు మట్టి, అది మాకు కనకము! భారతదేశపు నీరు అది మాకు అమృతమూ" అని పాడుతూ తిరుచిరాపల్లి స్టేషన్ సమీప వీథుల్లో కొందరు స్వచ్ఛంద 'సేవకులతో'పాటూ సంచరించడం కనిపించింది. దానిలో చేరుదా మనిపించింది. కాని, విప్లవ కార్యక్రమమో! కనుక వెళ్లి రైలెక్కాను.

"వాఙ్మధుర్యాత్ నాన్యదస్తి ప్రియత్వం
వాక్పారుష్యాచ్చ ఉపకారో పి నేష్టః!
కిం తత్ ద్రవ్యం కోకిలేనోపనీతమ్
కో వా లోకే గర్దభ స్యాపరాధః!!"

(మాటల తీపి కన్న ఇష్టమయినది మరొకటి ఉండదు. పరుషమయిన మాటలాడి ఉపకారం చేసినా ప్రియంగా ఉండదు. కోకిల మనకు తెచ్చి ఇచ్చిందేమిటి? గాడిద చేసిన అపకారం ఏమిటి?)

# 41

# నెల్లూరు వేద సంస్కృత కళాశాలలో...

"గౌరవం ప్రాప్యతే దానాత్
నతు విత్తస్య సంచయాత్
స్థితి రుచ్చైః పయోదానాం
పయోధీనా మధః స్థితిః"

**(దానం చేయడంవల్లనే గౌరవం కలుగుతుంది. కూడబెట్టడం వల్ల కలుగదు. మేఘాలు దానమిస్తున్నాయి, వర్షిస్తున్నాయి. కనుక వాటి స్థానం మీదనే ఉంది. సముద్రం నీటిని కూడబెడుతున్నది; గనుక, దాని స్థానం కిందే.)**

నేను తిరుచిరాపల్లి నుంచి బయలుదేరి నాలుగోనాడు హాస్పేట చేరుకున్నాను. అక్కడి నుంచి బస్సుమీద కమలాపురం చేరాను. నేను అరెస్టయిన వేషంతోనే ఇల్లు చేరాను గనుక; ఇంటివాళ్లూ, ఇరుగు పొరుగులూ ఆశ్చర్యపడ్డారు. అక్కడ ఒక్క రోజు మాత్రమే ఉన్నాను. నా పెద్దలు సంతోషించినా, నా చదువుపోయిందని చింతపడ్డారు.

తిరుపతికి బయలుదేరాను. జెయిలు అధికారులు ఇచ్చిన కూలీ డబ్బులు ఉన్నాయి. అప్పుడు ధర్మవరం పాకాల మీదుగా తిరుపతికి రైలు చార్జీ రెండున్నర రూపాయలు. నా వద్ద ఉన్న డబ్బుతో రెండుసార్లు తిరుపతికి సుఖంగా యాత్ర చేయవచ్చు. నా మనస్సులో చదువుకంటే, ఉద్యమంవైపు మొగ్గు ఎక్కువగా ఉంది. మా నాన్నగారు, తాతగారు కొన్ని ఉపదేశాలు చేశారు. శ్రద్ధగా విన్నాను.

తిరుపతి చేరాను. నా మిత్రులందరూ సంతోషించారు. వారు నాకు తలాపావలా చందావేసుకుని 25 రూపాయలు సేకరించి ఇచ్చారు. ఎందుకు? అనడిగాను. డబ్బు దేనికయినా ఉపయోగపడుతుంది. ఎందుకేమిటి? అన్నారు వారు. సంస్కృత కళాశాల ప్రిన్సిపాలును కలుసుకొన్నాను. రాజకీయ చర్యలో సంబంధం ఉన్న వారిని చేర్చుకోమని ఆయన స్పష్టంగా చెప్పాడు. బతిమాలడానికి నా మనస్సు ఒప్పలేదు. ఇదికాకపోతే మరొకటి అనే పొగరుతో ఉన్నాను. నా మిత్రులందరూ విచారపడ్డారు.

అప్పుడు నా జెయిలు మిత్రుడు ఆళ్ల బాలకృష్ణారెడ్డి అన్న మాటలు గుర్తు వచ్చాయి. నెల్లూరు మూలపేటలో వేదసంస్కృత పాఠశాల ఉంది. దాని పోషకులు చాలమంది కాంగ్రెస్‌వారు. అక్కడ చేరు, మన విప్లవకారుల దగ్గర ఉంటావు – అని అతడన్నాడు. అతడు నాకు జెయిల్లో ఆత్మీయుడు. చురుకైన బుద్ధి, సాహసం గలవాడు. బుచ్చిరెడ్డిపాలెం సమీపంలోని ఒక పల్లె అతని నివాసస్థలం. పేరు గుర్తులేదు. తండ్రి పేరు వెంకటరెడ్డి అని గుర్తు. తల్లి లేదు. సవతి తల్లి, ఒక తమ్ముడు. వృత్తి వ్యవసాయం.

నా మిత్రులను నొప్పించి, ఒప్పించి నెల్లూరు చేరాను. ఒక మారు పంచ, మారు ఉత్తరీయం. సిద్ధాంతకౌముది, శాకుంతలం, మరి రెండు పుస్తకాలున్న చేతి సంచి, ఇదీ నా సామాను. స్టేషనులోనే స్నానం చేసి, ఊర్ధ్వపుండ్రాలు ధరించి సరాసరి మూలపేటకు నడిచి వెళ్లాను. అప్రయత్నంగా ఒక సహాయం దొరికింది. తిరుపతి సంస్కృత కళాశాలలో చదువుతూన్న తిరుక్కాండ్యూర్ తిరువేంగడాచార్యులనే విద్యార్థి కనిపించాడు. అతడు కళాశాలలో చేరడానికి కొన్ని కిటుకులు చెప్పాడు. “నేను తిరుపతి నుంచి ట్రాన్స్‌ఫర్ సర్టిఫికెట్టు మొదలయినవి వెంట తెచ్చాను. నీవు కాంగ్రెస్ వాడివి. మా ప్రిన్సిపాలుగారికి కాంగ్రెస్సంటే పడదు. కళాశాల నిర్వాహకులలో కాంగ్రెస్ అభిమానులు కొందరున్నారు. నీవు సుప్రసిద్ధ న్యాయవాదులు కె.వి.రాఘవాచార్యులు, మాడభూషి నరసింహాచార్యులు గార్లతో చెప్పించు. అప్పుడు తప్పక నీకు ప్రవేశం దొరుకుతుంది” అన్నాడు.

ఆ పూట అతని సిఫార్సుతో అక్కడ భోజనశాలలోనే భోజనం చేశాను. అతడు చెప్పినట్టు రంగనాయకుల పేటకు బయలుదేరాను. దాదాపు నాలుగు గంటల సాయంకాలం, కె.వి.రాఘవాచార్యులు గారి గేటు దాటిన తర్వాత, నేను ఆయనకు నమస్కరించి నా వివరాలు చెప్పాను. “దానికేం, మన మూలపేట పాఠశాలలో నీకు ప్రవేశం కలిగేట్టు ప్రిన్సిపాలుకు చెబుతాను. ఇది అకాలం గనుక నీకు అక్కడ భోజనం

ఏర్పాటు వెంటనే ఉండదు. మన ఇంటి ఎదురుగా స్వయంపాకుల వారి సత్రం ఉంది; దానిలో నీకొక గది ఇమ్మంటాను. మరి సాపాటు సంగతి ఏమిటి?" అన్నారు. ఆయనే మళ్లీ "నీవు వారాలు చేసుకో, అదే మంచిది, నీకు వారాలు కుదిరే వరకూ మన ఇంట్లో సాపాటు చేయవచ్చు. తళిగస్వామికి చెబుతాను. నీవు ఎప్పుడు వచ్చినా పరమారమని (భోజనం వడ్డించమని)" అంటూ, "అడీ!" అని శ్రీమతిని పిలిచి, "ఈ అబ్బాయి సత్యాగ్రహంలో శిక్షణ పొంది వచ్చాడే; మనవాడు. ఎదుటి సత్రంలో గది ఇప్పిస్తానన్నాను. మన పిల్లవాడిలాగ చూడు. నీవు లేడీస్ క్లబ్బు సెక్రటరీవి గదా; మీ వాళ్లతో చెప్పు, వారానికొక దినం సాపాటుకు!" అని మహోత్సాహంతో చెప్పారు. ఆమె "అప్పడియే, అదుక్కెన్న (అలాగే, దానికేమి?)" అంటూ నావైపు కృపాకటాక్షం ప్రసరింపజేసింది. ఆమె వయస్సు దాదాపు నలభైఏళ్లు కావచ్చు. ఆయన ఆమెకన్నా ఐదారేళ్లు పెద్దకావచ్చు. ఇద్దరూ పోతపోసిన బంగారు విగ్రహాలు. రాఘవాచారిగారు మద్రాసులో సహకారోద్యమ ప్రముఖులు, నాయకులు భాష్యమయ్యంగారి తోడల్లుడు – ప్రముఖ న్యాయవాది; ఒంగోలు వెంకటరంగయ్య గారు తరచు ఆయన సలహాలు పొందేవారు.

అనాయాసంగా సంస్కృత కళాశాలలో ప్రవేశం లభించింది. నేలటూరి శ్రీనివాసా చార్యులు, రామానుజాచార్యులు, మాడభూషి నరసింహాచార్యులు, నడాదూర్ కృష్ణమా చార్యులు, కె.వి.రాఘవాచార్యులగార్ల ఇండ్లలో వారాలు కుదిరాయి. నివాసం స్వయం పాకులవారి సత్రం గదిలో. సత్రంలో నాలుగయిదు గదులుండేవి. వీథికున్న గదులలో కొందరు విద్యార్థులు ఉండేవారు. లోపలి గదిలో నేనుండేవాడిని, మరొక గదిలో ఒక వితంతువు, కుమార్తెతో ఉండేది. ఆమె అప్పుడప్పుడు మాకు పచ్చి పెసరపప్పు పచ్చడితో భోజనం పెట్టేది. అక్కడి విద్యార్థులతో గురునాథం గొప్ప ఖ్యాతిపొందాడు.

వారాల భోజనం పెట్టిన తల్లుల ప్రేమ నాకు ఆనేగొంది గురువుగారింటి ప్రేమను తలపించింది. నాపైన వారి పుత్రవాత్సల్యానికి, భ్రాతృప్రేమకు వాళ్లు చెప్పిన కారణాలు చాల ఉన్నాయి. సంస్కృత విద్యార్థిని కావడం, తల్లిదండ్రులకు దూరంగా ఉండటం, సత్యాగ్రహిగా జెయిలుకు వెళ్లడం, వాళ్లు చెప్పే కబుర్లన్నీ శ్రద్ధగా వినడం – ఇలా ఎన్నో! మాడభూషి నరసింహాచార్యులుగారికకుమార్తె పుష్పవల్లి వయస్సు అప్పుడు పన్నెండేళ్లు. "అన్నా, జెయిలు విషయాలు చెప్పవూ? సంస్కృత కావ్యాలు, నాటకాలు కథలు చెప్పవూ?" అని కోరి ఎన్నో చెప్పించుకొనేది. ఆమె కోసం నేను చదివి సరళమైన

భాషలో శృంగార స్పర్శ లేకుండా చెప్పడానికి పరిశ్రమ చేయవలసి వచ్చేది. ఆమె ఒకమారు: అడిగింది. శకుంతలను పక్షులు ఎలా పెంచుతాయి? - అని. నేను చిక్కులోపడ్డాను. అప్పుడు తోడేళ్లు ఎవర్నో కుర్రవాణ్ణి పెంచినట్టు పత్రికలలో చదివాను. ఆ సరళ హృదయ నమ్మింది కాని నాకు మాత్రం నేటికీ సందేహమే. అలాగే నేలటూరు రామానుజాచార్యుల వారి ఇంటిలోని పిల్లలంతా సోదరుడుగా చూచేవారు. నేను భోజనానికెళ్లేనాడు నా కోసం కాచుకొని ఉండేవారు. వారందరి నడుమనే నేనొక కాకిలాగ ఉండేవాడిని. వాళ్లకంతా నేనొక వీరుణ్ణి. ఒకసారి, జెయిలు భోజనం గురించి చెప్పాను. వాళ్లు ఆశ్చర్యపడి "అలా ఉంటుందా? నిజంగానే?" అంటూ ఆలోచిస్తూ ఉండిపోయేవారు.

మా కళాశాల ప్రిన్సిపాల్ గాజులపల్లి హనుమచ్ఛాస్త్రిగారు. తక్కిన ఉపాధ్యాయులు హరిహరశాస్త్రిగారు కేరళం నుంచి వచ్చారు. శిరోమణి, ఎమ్.ఏ. ఈయన సాహిత్యాలంకార శాస్త్రాలు చెప్పేవారు. తర్కభూషణం గోవిందాచార్యులు తర్కం, రంగరామానుజాచార్యులుగారు వ్యాకరణం చెప్పేవారు. పండిత కవి గోపాలాచార్యుల శిష్యులయిన పులుగుండ్ల నరసింహశాస్త్రిగారు ఆయుర్వేదోపాధ్యాయులు. రంగరామానుజాచార్యులుగారు తిరుపతి సంస్కృత కళాశాల విద్యార్థి. ఆయన తిరుచానూర్ నుంచి వచ్చేవారు. ఉదయం ప్రార్థన సమయానికి రాలేక పోయేవారు. ఒక రోజు ప్రిన్సిపాలు సుబ్బారావుగారు ప్రార్థనానంతరం ఆయనను పిలిచి విద్యార్థులను సంబోధిస్తూ "ఈయన పేరేమో తెలుసా? రంగరామానుజాచార్యులు - అంటే వ్యుత్పత్తి ఏమిటో తెలుసా? రంగేయా రామః తస్యాః అనుజః అంటే నాట్యరంగంలో నాట్యంచేసే స్త్రీకి అనుజుడు, తాళం కొట్టేవాడు" అని అన్నారు, ఆయన సిగ్గుతో ముడుచుకునిపోయి, మరుసటి దినం నుంచి తెల్లవారు జాముననే బయలుదేరి ప్రార్థన సమయానికి అందుకునేవాడు.

నేను ఉన్నప్పుడు జరిగిన కొన్ని విచిత్ర సంఘటనలను తెలుపడం అవసరం. నెల్లూరులో ఒకనాడు నేను కళాశాలకు వస్తుండగా, కళాశాల సమీపంలో పెద్ద గుంపు కనిపించింది. కుతూహలంకొద్దీ తొంగి చూచాను. ఒక అందమైన మలయాళీ పిల్లవాడు నిలిచి ఉన్నాడు. పన్నెండు పదమూడేండ్లు ఉండవచ్చును. అతని చేయి పట్టుకుని నిలబడ్డాడు ఒక నడివయసు బ్రాహ్మణుడు. ఇద్దరు ముగ్గరు పోలీసులున్నారు. జనం

సరేసరి. "నన్ను మోసం చేశాడు. ఈ కుర్రాడు నా కొంప ముంచాడు!" అని గోలపెడుతున్నాడు బ్రాహ్మణుడు. ఆ కాలంలో తెలుగునాట పెండ్లికాని వారు మలబారుకు వెళ్లి పిల్లలను కొనుక్కుని వచ్చేవారు. ఈ కన్యల క్రయవిక్రయాలు అప్పుడు తమిళ, కేరళాలలో జోరుగా జరిగేవి. తెలుగునాడు నుంచి వెళ్లినవారిని అక్కడ వారు మోసం



చేసి ఎవరినో అంటగట్టేవారు. కొన్ని మోసం లేనివీ ఉండేవి. మరి కొన్ని పూర్తి మోసం. ఈ కేరళ బాలుడు నాటకాలలో ఆడవేషాలు వేసేవాడు. అతని పరిచితులెవరో పెండ్లికూతురు వేషం వేయి. పెండ్లి తరువాత నిన్ను ఒక ఊరు తీసుకుని వెళ్లుతాము. అక్కడ రెన్నాళ్లు ఉండి వచ్చివేద్దాం - అని అన్నారు. అతడు ఒప్పుకున్నాడు. అతనికి మలయాళం, ఇంగ్లీషు వచ్చు. పెండ్లికూతురు వేషం వేశారు. పెండ్లి అయింది. నెల్లూరికి తీసుకొని వచ్చారు. అతనికి తనవాళ్లెవరూ కనిపించ లేదు. ఉదయం పెళ్లికూతురు వేషం తీసిపారేసి, నిక్కరు, బనియన్‌తో మూలపేటలో ఉన్న మలయాళీ కాకా హోటలుకు పరుగెత్తి వచ్చాడు. అతన్ని వెతుక్కుంటూ బ్రాహ్మణుడు, అతని బంధువులు వచ్చారు. నాకు అయిదు వేలకు పెండ్లి కూతుర్ని అమ్మారు. నిన్నరాత్రి కొత్తపిల్లగదా, ఉదయం చేరదీద్దామనుకున్నాను. వేషం తీసి వీడు పరిగెత్తాడు. దగా, మోసం! మగపిల్లవాడికి ఆడవేషం వేసి అయిదు వేలు కొట్టివేశారు - అని బ్రాహ్మణుని గోల. పోలీసులు రంగంలోకి దిగి ఇద్దరినీ లాక్కుపోయారు పోలీసు స్టేషనుకు. "అయ్యగారా! ఊ! తెలీక అడుగుతున్నాను. ఆడో, మగో తెలీకుండా ఎలా పెళ్లాడారండీ?" అని ఒక పోలీసు హాస్యం, 'రాత్రి పెళ్లి జరిగింది. వేషం చూచి మోసపోయాను. ఈ వెధవ మోసగాడని కలగన్నానా?" అంటాడు బ్రాహ్మణుడు. "నాకేం తెలీదు. నాటకంలో వేషం అంటే వచ్చాను" అంటాడు కుర్రవాడు.

స్వయంపాకులవారి సత్రం ఒక తోటలో ఉంది. తోట నడుమ చేద బావి. నేను ఉదయం అక్కడే నీళ్లు చేదుకుని స్నానం చేసి గుడ్డలు ఉతుక్కుని రావడం దినకృత్యం. తోటమాలీలు ఏనాదివాళ్లు. ఒక దినం నేను స్నానం చేస్తున్నప్పుడు ఆ తోటమాలి భార్య విచిత్రమైన భాషలో కేకలు వేసింది. అది విని మాలి ఒక మూలకు పరుగెత్తాడు. నేను చేద వదిలి ఏమిటా అని అక్కడికి వెళ్లాను. మాలి గడ్డిపోచ తీసుకొని అక్కడి పుట్టలో పొడిచాడు. బుస్సుమని పాము రెండు మూరలెత్తు లేచింది. అది లేవడమేమిటి, మాలి ఎడమచేతి చిటికితో పాముపడగతో పాటు నోటిని పట్టుకోడమేమిటి, మాలి కుడిచేత్తో ఒక రాయి తీసుకుని దాని పళ్లు రాలగొట్టి చేతికి చుట్టుకుంటున్న పాము శరీరాన్ని విడిపించుకుని విసిరివేయడమేమిటి, ఒక గంపతో సిద్ధంగా ఉన్న మాలి భార్య, విసిరివేయగా, పడి, గింజుకుంటున్న పాముపై గంప బోర్లించి దానిమీద బరువుకు పెద్దరాయిమోపడమేమిటి - కొద్ది క్షణాల్లో - మొత్తం అరనిమిషంలో జరిగిపోయాయి.

నేను మాలి ధైర్యానికి, మాలి భార్య ప్రత్యుత్పన్నమతికి నోరు తెరుచుకుని నిలబడ్డాను. ఆమె నన్ను ఎగాదిగా చూచి "ఏంది అయ్యోరా! అట్ట సూత్తందవు? ఇది మామూలే. ఇదేంది? మనోడు బారెడు బారెడు జెర్రిపోతుల్ని చిటికెలో పట్టేత్తాడు. అది తోకతో మూతికి కొట్టిందంటే, నాసామిరంగా, మూతి పగులుద్ది! ఇదేం పాము! తానం ముగించు" అన్నది. "అంచనా తప్పి చిటికను పాము కరిస్తే...?" అన్నాను కష్టంతో నోరు విప్పి, "అదెట్టా అవుద్ది? అట్టా అనుకోబాక. మావోణ్ణి చూస్తేనే దానికి బెదురు పుట్టడంలా?" అన్నది.

ఏనాదుల కంఠం కోకిల కంఠం. నలుపు తీసేస్తే కోలముఖాలతో, చేరడేసి కళ్లతో, గట్టికాయపుష్టితో చాల అందంగా ఉంటారు. తోటలో వాళ్ల ఏనాది భాగోతాలు, పెళ్లిపాటలు వింటూ ఆనందించేవాళ్లం.

ఆదిభట్ల నారాయణదాసుగారు మహాకవి. బహుదేశ విదేశ భాషావేత్త. వినాయక హాలులో ఆయన హరికథ ఏర్పాటు చేశారు. హరికత ఆశుకవితామయంగా ఉంటుందని ప్రథ; గనుక విద్యార్థులమంతా వెళ్లాం. హాలు ప్రేక్షకులతో, శ్రోతలతో కిటకిటలాడుతున్నది. దాసుగారు చేత్తో చిరుతలతో రంగస్థలం ప్రవేశించారు. పూటుగా తాగి ఉన్నారు. "వ్యత్యస్త పాదారవిందా" అంటూ కాలు ఎత్తారు. తూలిపోయారు. శిష్యులు వచ్చి లేపి నిలబెట్టారు. ఆయన ఆ చరణమే పాడుతూ. మళ్లీ పడిపోయారు. ప్రేక్షకులు "గోవిందా! గోవిందా!!" అన్నారు. తెరపడింది. అందరూ టికెట్టుకొని వచ్చినవాళ్లు. పెద్దగోల చేశారు. దాసుగారు పన్నెండు గంటల తర్వాత గాని లేవలేదుట.

వినాయక థియేటర్‌లోనే 'శకుంతల' నాటకం వేశారు. యడవల్లి సూర్యనారాయణ గారు దుష్యంతుడు. కణ్వుడు అద్దంకి శ్రీరామమూర్తిగారు. 'శకుంతల' సంజీవరావని గుర్తు. వీళ్లందరికీ మూల శ్లోకాలు చదివి, పద్యాలు పాడడం అలవాటు. అందులోనూ యడవల్లివారికి. ముందు వరుసలో వెంకటగిరి రాజా మొదలైనవారూ, బొబ్బిలి రాజాగారూ ఉన్నట్లు గుర్తు. యడవల్లివారు 'గ్రీవాభంగాభిరామం' అని శాకుంతల శ్లోకం చదువుతూ పాదచ్ఛాయలు వేస్తూ వస్తూ ఉంటే, ఆ నడక ఠీవికి ముగ్ధులైన రాజావార్లు 'వన్స్‌మోర్' అని కేకలు వేసేవారు. అరగంట పాదచ్ఛాయలలోనే గడిచేది. 'కథమప్యున్నమితం న చుంబితం తు', అనే శ్లోకం చదవడానికి వన్స్‌మోర్లు మహిళల నుంచి వచ్చేవి. 'కిం శీతలైః ప్రహ వనోధిఖి' అనే శ్లోకం చదివి, "చల్లనివై శ్రమం

బుదుపజాలిన తామరపాకు వీవనల్" అన్న పద్యంలోని వీవనతోవీచే నటనకు వన్స్‌మోర్లు కురిసేవి. వల్లెవాటు మార్చి వేసుకోవడానికి వన్స్‌మోర్లు. నాడు యడవల్లి నాటకరంగ స్థలాన్ని రారాజుగా ఏలాడు. ఆనాడు సంగీతానికి సమప్రాధాన్యం ఉండేది గనుక అప్పటి మహానటుల కంఠాలు మధుర గంభీరమయినవే. నాటకం సమాప్త మయిన తరువాత సంస్కృత విద్యార్థులం ఆయనను కలుసుకుని అభినందించాము. సంస్కృతం వచ్చినవారు వింటే గదా నా నటనకు సార్థక్యం అని ఆయన తెగ మురిసి పోయారు, మమ్ములను ప్రోత్సహించడానికి.

తిరుపతి క్షేత్రం సంస్కృతి కేంద్రం కనుక నాటకాలు చాలానే చూచాను. అన్ని సంఘాలవాళ్లు నాటకాలు ఆడేవారు. అప్పటి దృష్టివేరు గనుక అనుభూతి తక్కువ. నెల్లూరు నాటకాలకు పెద్ద కేంద్రం. మరి, టికెట్టుకొని పోగలమా? నాటక ప్రారంభం కాగానే గేటు తెరిచేవారు. మేము గుంపు గట్టుకొని హాల్లోకి దూరేవాళ్లం. నిలబడే చూచేవాళ్లం. ఆ విధంగా మహానటుల నాటకాలు చాలవరకు అన్నీ చూచాను.

హరికథకుడు రామదాసుగారిని ప్రత్యేకంగా పేర్కొనాలి. ఆయన ఆరడగులు నీల మేఘవిగ్రహం. పెద్దకళ్లు, అందమైన కళ్లు, అందమైన ముఖం, నొక్కుల బారెడు జుట్టు. మెరిసే చక్కని పలువరుస. మయూరక్రేంకార మధురమూ, భేరీ నినాద గంభీరమూ అయిన కంఠం. మైకులు లేని ఆ కాలంలో రామదాసుగారు జొన్నవాడ అమ్మవారి జాతరలో పెన్నగట్టుపైన హరికథ చెబుతుంటే మైళ్లకు వినబడేది. "నను బ్రోవుమని చెప్పు నారీ శిరోమణి" అని కీర్తన నిశ్శబ్ద నిశీథిలో రాముని వరకూ వినబడే దనుకుంటాను. ఆయన తగ్గుస్థాయిలో పలికే గుసగుసలూ వినబడేవి. ఆయన పాటపాడుతూ అర్ధభ్రమరులు, భ్రమరులు చేసేవాడు. చెవుల వజ్రాల పోగుల, చేతి వజ్రాల ఉంగరాల కాంతులు, ఆయన అందమైన పలువరస మెరుపుతో పోటీ పడేవి. అది హరికథ కాదు, నృత్యనాటకం. ఏకపాత్రతో బహుపాత్రభ్రమ కలిగించే ఇంద్రజాలం.

నేను తీరిక వేళల్లో ఖద్దరు అమ్మేవాణ్ణి. గోసేవ సంఘంలో పనిచేసేవాణ్ణి. అందరికీ సత్య ధర్మస్వరూపుడయిన రామచంద్రుణ్ని. చంద్రుని వెనుక భాగం చాల అంధకార బంధురమయినట్టే నావెనక భాగం నల్లన. నా విప్లవ మిత్రులు నా గదికి వచ్చేవారు. రాత్రంతా చర్చలు. కాళయ్యసెట్టి, బాలకృష్ణారెడ్డి, తాలూకా బోర్డు అధ్యక్షుని కుమారుడు వి.బాలకృష్ణారెడ్డి మొదలైనవారు వచ్చేవారు. గూట్లోని శాకుంతలం, ధ్వన్యాలోకం కింద

పిస్తోళులు, బాకులు, రివాల్వర్లు ఉండేవి. నా గుండె కొట్టుకొనేది. "అయ్యవారా! నీవు తొండరపడి ఆళ్వారులాగ ఉన్నావు. నిన్ను ఎవరూ అనుమానిం చరు. గది సోదా చేయరు; భయపడమాక!" అనేవారు వాళ్లు. నేను అడకత్తెరలో ఇరుక్కున్న వక్కను. వాళ్లకు మాట ఇచ్చాను కనుక వాళ్ల వెంట ఉండాలి కాని, గాంధీతత్త్వం దాటవద్దనే తాతతండ్రుల మాటకు భంగం కారాదు. ఇదంతా బయటపడితే వారం భోజనం పెట్టిన పెద్ద మనుషులలో నా పరువేమిటి? ఈ డోలాయమాన హృదయంతోనే వాళ్ల వెంట రెండు మూడు దోపిడీలకు, దొంగతనా లకు వెళ్లాను. అమావాస్య చీకట్లలో భోరున కురుస్తున్న వానలలో, విప్లవకారులను తప్పించదానికి వెళ్లాను. మా ప్రయత్నాలేవీ సఫలం కాలేదు. (ఆ వివరాలు 'కుట్ర కేసు'లో). కానీ మనస్సు వ్యథపడేది. మంచి మార్కులతో సాహిత్య శిరోమణి ప్రిలిమినరీ పాసయ్యాను. నెల్లూరులో ఉండటం ప్రమాదకరమని నిర్ణయించుకున్నాను. ఏమీ చేయలేక ఒక క్రూరమైన ముఠా చేతుల్లో కీలుబొమ్మనయ్యాననిపించింది. ఇది పూర్తిగా దుర్మార్గమే. మంచిని మంచితో సాధించాలిగాని దుర్మార్గంతో, ఖల ప్రవృత్తితో కాదు. ఎలా వదిలించుకోవడం? మా తండ్రిగారు చెప్పిన శ్లోకం గుర్తుకొచ్చింది.

**"ఖలానాం కంటకానాం చ**
**ద్వివిధైవ ప్రతిక్రియా,**
**ఉపానన్ముఖ భంగో వా**
**దూరతో వా విసర్జనమ్"**

**(దుర్మార్గులకు, ముండ్లకు రెండే విరుగుళ్లు. దుర్మార్గుణ్ణి చెప్పుతో ముఖంపై కొట్టనన్నా కొట్టాలి; ఊరి నుంచి వెడలగొట్టనన్నా వెడలగొట్టాలి. ముండ్లకొనలను చెప్పుతో రాచనన్నా రాచాలి; దూరంగా విసిరివేయనన్నా విసరివేయాలి.)**

# 42

# కొందరు నెల్లూరు పెద్దలు

**"శ్రీ మత్సింహపురీ పరాక్రమ కలా వైదగ్ధ్య పూర్ణోదరీ**
**గీర్వాణాంధ్ర రసజ్ఞ పండిత కవిబ్రహ్మాది భాగేశ్వరీ,**
**చండోన్మత్త గజాన్ యథా స్వబలతః సింహో తిశేతే తథా**
**యా సర్వాంధ్ర మహా పురీః స్వగుణతో జేజీయతాం సా న్వహమ్"**

**(సింహపురి - నెల్లూరు పరాక్రమ కళావైదగ్ధ్యంతో తొణికిసలాడేది, రసజ్ఞులయిన గీర్వాణాంధ్ర పండితులు కవిబ్రహ్మలు నివసించే భాగ్యం పొందినట్టిది, సింహం మదోన్మత్తమయిన ఏనుగులను ఎలా తన బలంతో మించి పోతుందో అలాగు గుణాలతో ఆంధ్రప్రదేశ్‌లోని తక్కిన పట్టణాలనూ మించి పోతున్నట్టిది; దినదినాభివృద్ధితో విరాజిల్లుగాక!)**

**సు**గృహీత నామధేయులు కాశీ కృష్ణాచార్యులవారు చెప్పిన ఈ శ్లోకంలో అతిశయోక్తి ఏ మాత్రమూ లేదు. సర్ సి.ఆర్.రెడ్డిగారు నెల్లూరులో ఒకమారు ఒక సభలో 'మీరు నెల్లూరు నెరజాణలయితే మేము చిత్తూరు చిరుజాణలము' అని ప్రసంగం ప్రారంభించారు. ఒక జాణతనంలోనేగాదు, అన్ని రంగాలలోను, నెల్లూరునెరియే - సంపూర్ణమే. నేను నెల్లూరులో ఉన్నప్పటి (1933-34నాటి) పెద్దలను గురించి వ్రాసినా మహాభారతమంత అవుతుంది. మా కళాశాల గురువులనే మొదట స్తుతిస్తాను.

కళాశాల ప్రిన్సిపాల్ గాజులపల్లి హనుమచ్ఛాశాస్త్రిగారు గొప్ప వైయాకరణులు. వైయాకరణ కేసరి బిరుదాంచితులు. పాఠశాలను చాల అభివృద్ధిపరచారు. ఒక వివాహంలో నన్ను పిలిచి, "మీకు వైదికకర్మలో నమ్మకం లేదని విన్నాను. ఎందుకు వచ్చారు, ఇక్కడికి?" - అని అవమానించారు. నేను గురువుగారితో వాదం ఎందుకని

మిన్నకున్నాను. నడాదూర్ రంగరామానుజాచార్యులుగారు వ్యాకరణం చెప్పేవారు. వీరిని గురించి సుబ్బారావుగారి ఛలోక్తిని ఇదివరకే చెప్పాను. తర్కంలోను ఉద్దండులు. ఈయన మంజూషా పరామర్శ, గీతాభాష్య పరామర్శ, అనే ఉత్తమ సంస్కృత గ్రంథాలు రచించారు. ఎన్.ఎన్.హరిహరశాస్త్రిగారు పాలఘాటువారు. తిరువయ్యూరు సంస్కృత కళాశాలలో చదివి, సాహిత్యశిరోమణి, ఎం.ఏ. అయ్యారు. మంచి ఉపాధ్యాయులు, అలంకారశాస్త్రం, నాటకాలు చెప్పేవారు. కవితార్కిక సింహ గోవిందాచార్యులుగారు న్యాయసాహిత్యాలు చెప్పేవారు.

అప్పటి నా సమకాలీనులయిన నెల్లూరు సంస్కృత కళాశాల విద్యార్థులలో సూరి రామకోటిశాస్త్రి సాహిత్య విద్యాప్రవీణ చదివినా, పెక్కు శాస్త్రాలు చదివి తెనాలి సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ అయ్యారు. కేసరి సుందరరామయ్య సంస్కృతాంధ్ర పండితుడుగా, శాసనపరిశోధకుడుగా పేరు పొందారు. జంధ్యాల శివన్నశాస్త్రిగారి తమ్ముడు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గొప్ప విద్వాంసుడయ్యాడు. పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి గొప్ప వైయాకరణుడయ్యాడు. 'మధురా విజయః' మున్నగు సంస్కృత కావ్యాలు అనువదించాడు. అచ్చతెనుగు నిఘంటువును నిర్మించారు. ఉత్తర హరివంశానికి విపులపీఠిక వ్రాసారు. రామచరణం అనే విద్యార్థి గొప్ప విద్వాంసుడై ఏర్పేడు మలయాళ మఠాధిపతి అయ్యాడు. నారాయణ చరణం గొప్ప వక్త. వేంకట రత్నం మంచి నటుడు, గాయకుడు – సంస్కృత విద్యార్థులు ఘంటసాల బలరామయ్యగారి దర్శకత్వంలో ప్రదర్శించిన శాకుంతల నాటకంలో సారథి పాత్ర నిర్వహించాడు. నేను ధీవరుని వేషం వేశాను.

విద్యారణ్యపంచానన, విద్యావాచస్పతి, కళానిధి ఎక్కిరాల రామచంద్రాచార్యులు గారు నేను నెల్లూరు వెళ్లడానికి కొన్ని నెలలముందే అస్తమించారు. వారి వైదుష్యాన్ని గురించి గొప్పగా చెప్పేవారు. వారు ఆశుతోషముఖర్జీ మన్నన పొందినవారు. ఆయన కుమారులు ఎక్కిరాల శేషాచార్యులుగారు మహా విద్వాంసులే. అప్పటికి నాకు అపరిచితులు.

అప్పుడు నెల్లూరులో తిక్కన పార్టీ ఒకటి బలంగా ఉండేది. వేదం వేంకటరాయ శాస్త్రిగారి వర్గం, దుర్భా సుబ్రహ్మణ్యశర్మ, దీపాల పిచ్చయ్యశాస్త్రిగార్ల నాయకత్వంలో శాస్త్రిగారి ప్రత్యర్థి వర్గం ఉండేది. 'రంగము మీదికెక్కుదము రా' అని పిచ్చయ్యశాస్త్రి గారు వేదం శాస్త్రిగారిని సవాలు చేశారు.

దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు అభినవ తిక్కన బిరుదాంకితులయిన గొప్ప కవి

పండితులు. వీరి శిష్యవర్గంలోని వారు మోచర్ల రామకృష్ణయ్య మొదలయినవారు. శర్మగారు మొదట రెవెన్యూ శాఖలో పనిచేశారు. తర్వాత నెల్లూరులోని దువ్వూరి రామిరెడ్డి, ముత్తరాజు సుబ్బారావు వెంకటగిరి రాజా కాలేజీలో ఆంగ్లోపన్యాసకు లయ్యారు. దాక్షిణ్యం చూపని సాహిత్య విమర్శకులు. సుబ్బారావు మొదలయినవారు ఈయన శిష్యులు. ఈయన; కవితలో చిన్న లోపాన్ని కూడా సహించని కరుకు విమర్శకులు.

దువ్వూరి రామిరెడ్డిగారు ఆగర్భ శ్రీమంతులు. ప్రకృత్యారాధకులు. వీరి రచనలు పానశాల, కృషీవలుడు, కుంభరాణా, వనకుమారి, సీతావనవాసం, నలజారమ్మ, అగ్నిప్రవేశం, పలితకేశం మొదలయినవి అప్పటికే ప్రసిద్ధమయినవి. ఈయనను ఆంధ్రులు 'కవికోకిల' అని ప్రేమతో పిలుచుకున్నారు.

సరసకవి, కవిశేఖర, ప్రసన్న మధురకవి, సాహిత్యరత్న మొదలయిన బిరుదులున్న మోచర్ల రామకృష్ణయ్యగారు ప్రముఖ న్యాయవాది. విమర్శకులుగాను, వాగ్మిగాను కీర్తి పొందారు. రమణానందలహరి, అమృతకలశం, ప్రేమలీల, స్వాత్మార్పణం మొదలయిన స్వతంత్ర రచనలు, అనువాదాలు వీరివి ఇరవయిదాక ఉన్నాయి. అమృత కలశం ఈయనకు చాల కీర్తి కలిగించింది.

నేలటూరి రామదాసయ్యంగారు వేంకటరాయశాస్త్రిగారి వర్గంలో ప్రముఖులు. సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో ప్రచండులు. వెంకటగిరిరాజా కాలేజీలో అధ్యాపకులు. శకుంతల, కుమారసంభవ, రఘువంశ, ఉత్తర రామచరిత్ర, కిరాతార్జునీయాదులకు ఆంగ్ల వ్యాఖ్య వ్రాశారు. ఎన్నో సాహిత్యవ్యాసాలు వ్రాశారు. మంచి వక్త. కాళిదాసుని పోకిరితనం అని ఒకమారు వారు ఉపన్యసించగా విన్నాను.

దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు 1932 నాటికే గొప్ప కవులుగా ఖ్యాతిపొందారు. జాషువాగారితో కలిసి అవధానాలు చేశారు చిన్నతనాన. భాసకాళిదాసాదుల కృతులను సరసంగా అనువదించారు. "చాటుపద్య రత్నాకరం" అనే పేర ప్రాచీన చాటువులు సేకరించారు. 'సాహిత్య సమీక్ష' ఈయన పాండిత్యానికి నికషం. నేను 1962లో ప్రత్యేకంగా దర్శించి 'మరపురాని మనీషులు' శీర్షికలో ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో ఈయనను గురించి వ్రాశాను.

చిలకపాటి సీతాంబగారు అప్పటి ప్రసిద్ధ రచయిత్రి. దిలీపుడు, సముద్ర మథనము అనే నాటకాలు, పద్మినీపరిణయమనే పద్యకావ్యం చాల పేరు పొంది, తర్వాత ఈమె

గృహలక్ష్మీ సువర్ణకంకణ బహుమానం పొందారు.

మహావదాన్యులు తిక్కవరపు రామరెడ్డిగారి కుమారులైన పఠాభి (పట్టాభిరామరెడ్డి) 1932కే గొప్ప ఆధునిక కవి. తర్వాత వారి ఫిడేలు రాగాల డజన్ ప్రచురితమయింది.

ఎన్.ఎస్.కృష్ణమూర్తిగారు అధివక్త (అడ్వకేట్). అయినా, కళాప్రియులు, కళా విమర్శకులుగా అప్పటికే పేరు పొందారు. ఆనందకుమారస్వామి జీవిత చరిత్ర రచించారు. రుద్రమదేవి, త్యాగరాజు నాటకాలు రచించారు. నాట్యశిల్పకళను గురించి ఆంధ్రాంగ్లాలలో పెక్కు వ్యాసాలు వ్రాశారు.

నేలనూతల పార్వతీకృష్ణమూర్తిగారు, ఎన్.ఎస్.కృష్ణమూర్తిగారి సతీమణి. హిందీ తెలుగు భాషలలో విద్వాంసురాలు. తులసీదాసదాసి అనే పేరుతో రామచరిత మానసాన్ని, జాయసీ పద్మావతీ కావ్యాన్ని సరళ గ్రాంథికవచనంగా అనువదించారు. అవి తర్వాత చాల ఏళ్లకు ముద్రణ పొందాయి. నాకు రవలడ్లు ఇష్టమని రవలడ్లు చేసి పెట్టే సోదరి పార్వతిగారు ఇటీవలే కీర్తికాయ అయినారు.

గుర్రం వేంకటసుబ్బయ్యగారు, వేంకటగిరి రాజా కళాశాలలో ఆంగ్లోపన్యాసకులు, ధరణికోట వెంకటసుబ్బయ్యగారు, ఆంధ్రోపన్యాసకులు, వీరు వేంకటరాయశాస్త్రి గారి శిష్యులు. అప్పుడప్పుడే పేరు పొందుతున్నవారు.

మిత్రులు షేక్‌దావూద్ సాహెబ్‌ను ప్రత్యేకంగా పేర్కొనాలి. ఈయనది దేశభక్తిగల వంశం. ఈయన నాన్నగారు మతకలహాలలో హతుడయ్యాడు. దావూద్ సుప్రసిద్ధ న్యాయవాది మాలకొండయ్యగారి ఇంటి సమీపంలోని మూలలో ఒక చిన్న కిళ్లీకొట్టు పెట్టాడు. ఇతనికి భారతంలో కర్ణుడు ఇష్టం. భారతం క్షుణ్ణంగా చదివాడు. కర్ణునిపై కమనీయంగా పద్యాలు వ్రాసేవాడు. అతని కిళ్లీకొట్టుకు అతని సాహిత్యాభిమానం కారణంగా పలువురు పండితులు, కవులు, న్యాయవాదులు వచ్చేవారు. నాలుగడుగుల చదరపు బడ్డీ. కవిపండితులతో కిటకిటలాడేది. నేను తరచు కిళ్లీకొట్టుకు వెళ్లేవాడిని; అతని స్నేహం కోసం. తర్వాత అతడు తెలుగు హిందీ విద్వాన్ పరీక్షల్లో ఉత్తీర్ణుడయి, కర్నూలు ఉస్మానియా కళాశాలలో తెలుగు, హిందీ ఉపన్యాసకుడుగా పనిచేశాడు. అతని మొదటి కావ్యం దాసీపన్నా. గొప్పకావ్యం. అజరామరంగా ఉంటుందని నా విశ్వాసం. సాయిబాబా చరిత్ర, క్రీడాషిర్డీశ్వరము, చంద్రవదన మోహియార్ మొదలయిన స్వతంత్ర రచనలూ, హిందీ నుంచి పెక్కు అనువాదాలూ చేశాడు.

ఆచార్య ఆత్రేయ అప్పుడప్పుడే పైకి వస్తున్న యువ రచయిత, రంగనాయకుల పేటలో రోజూ తారసిల్లేవారు. ఎన్.జి.వో. నాటికతో ప్రసిద్ధులయ్యారు. చలన చిత్ర రంగంలో ప్రవేశించిన తర్వాత గేయరచయితగా గొప్ప ఖ్యాతి పొందారు. గౌతమబుద్ధ, అశోకసమ్రాట్, ఈనాడు, పరివర్తన, కప్పలు మొదలయిన నాటికలు వ్రాశారు.

పాటూరు సుబ్బరామయ్య మహావీరుడయిన పత్రికారచయిత. సింహపురి అనే వారపత్రికను 1922లో ప్రారంభించారు. ప్రభుత్వ నిషేధాజ్ఞలవల్ల 1930లో ఆగిపోయినా, 1934 ఏప్రిల్‌లో మళ్లీ ప్రారంభించారు. పోలీసులకు భయపడి ఎవరూ పనికి వచ్చేవారు కారు. కనక; ఆయనా, ఆయన భార్య, పిల్లలు; కంపోజింగ్ మొదలు కొని అన్ని పనులూ నేర్చారు. ఎప్పటికప్పుడు పోలీసుల భయంతో దినగండం నూరేళ్లాయుష్షుగా పత్రిక రెండు మూడు దశాబ్దాలు బ్రతికిందనుకుంటాను.

"తీర్పుల పత్రిక" అనే పక్షపత్రిక ఒకటుండేది. ఇది కోర్టు తీర్పులు ప్రచురించేది.

నెల్లూరు వెంకటరామానాయుడు సాహసంగల సంపాదకుడు. జమీన్‌దారీ రైతు అనే పత్రికను నడిపిన అనుభవంలో జమీన్‌రైతు అనే వారపత్రికను 1934లో ప్రారంభించారు. అప్పటికి మన్నేపల్లి రామకృష్ణరావుగారి సంపాదకత్వాన సుబోధిని అనే వారపత్రిక, ఘాలి సుబ్బరామయ్యగారి 'ప్రజాసేవ" ఉండేవి.

జస్టిస్ పార్టీ ప్రముఖులు బెజవాడ రామచంద్రారెడ్డిగారు 'స్వతంత్ర' పత్రిక నడిపారు. స్వాతంత్ర్యానంతరం రాజగోపాలాచారి స్థాపించిన స్వతంత్ర పార్టీలో చేరారు.

నెల్లూరు గొప్పదాతలకు కాణాచి, తిక్కవరపు రామిరెడ్డి, రేబాల లక్ష్మీనరసారెడ్డి, దొడ్ల సుబ్బారెడ్డి మొదలయినవారు మహాదాతలుగా పేరు పొందారు. రేబాల పట్టాభి రామరెడ్డిగారిని ఒకమారు చూచాను. ఆయన తాంబూలంలో ఏదో పెట్టి ఇవ్వబోయారు. "అయ్యా, నేను మిమ్ములను చూడాలని వచ్చాను. గాని ధనసాహాయ్యం కోసం కాదు" అన్నాను.

నెల్లూరు; స్వాతంత్ర్యసమరంలోనూ ముందే ఉంది. నెల్లూరు జిల్లాలో అమంచర్ల సుబ్బుకృష్ణరావు పంతులు, కిడాంబి వీరరాఘవాచార్యులుగార్లు 1908 నాటికే కాంగ్రెస్ సంఘం స్థాపించారు. అది మూడుపువ్వులు అరవైకాయలుగా వృద్ధి పొందింది.

స్వాతంత్ర్యోద్యమంలో ప్రముఖ న్యాయవాదులు, పండితులు, కవులు, రచయితలు, పాల్గొని కారాగారక్లేశం అనుభవించారు. ఇలాటి వారిలో ప్రముఖులు ఓరుగంటి

వెంకటసుబ్బయ్యగారు, వీరు వీరి కుమారులు, కోడళ్లు, కుమార్తెలు, అల్లుళ్లు అందరూ జెయిలుకు వెళ్లారు. ఈయన అల్లుళ్లలో ఒకరయిన చివుకుల సుబ్రహ్మణ్యం తిరుపతిలో నా సహాధ్యాయుడు. వెంకటసుబ్బయ్యగారు గొప్ప న్యాయవాది.

తర్వాత పేర్కొనదగినవారు బెజవాడ గోపాలరెడ్డిగారు. ఈయన, ఈయన సోదరులు; రక్తసంబంధంగల బంధువులంతా జెయిలుకు వెళ్లారు.

తూములూరు పద్మనాభయ్యగారు సింహసంహననులు, సబ్ ఇన్‌స్పెక్టర్ ఉద్యోగం వదలి 1932-33లో తిప్పరాజు వారి సత్రం గోడను స్వాధీనపరచుకొని, బాగుచేసి; దానిపై వార్తలు వ్రాసి భిత్తి వార్తాపత్రిక నడిపారు. దీనిని టైమ్స్ ఆఫ్ ఇండియా కూడా ప్రశంసించింది.

ముత్తరాజు గోపాలరావు కూడ 'నగరజ్యోతి' అనే కుడ్యపత్రిక నడిపారు.

పొణకా కనకమ్మగారు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని జెయిలు శిక్ష అనుభవించారు. మంచి వ్యక్తి, రచయిత్రి. కస్తూరీదేవి బాలికావిద్యాలయం, కస్తూరీబా పారిశ్రామిక విద్యాలయం నిర్వహించారు. రమణమహర్షి, రామయోగిగార్ల శిష్యురాలు.

నెల్లూరు న్యాయవాదులూ, మహాదాతలూ, స్వాతంత్ర్యసమరయోధులు, ఎందరో విద్యార్థులకు అన్నదానం చేసేవారు. మాడభూషి నరసింహాచార్యులుగారు వెంకటగిరి సంస్థానం న్యాయవాది. ఆయన రెండవ కుమారుడు గోపాలాచార్యులు తండ్రిగారి వృత్తిలో ఉన్నారు. కె.వి.రాఘవాచార్యులను గురించిర ఇదివరకే చెప్పాను. టి.వి.శివ రామయ్య బాట్లీవాలా కేసులో వాదించిన ప్రముఖులు. చతుర్వేదుల కృష్ణయ్యగారు పేరు మోసిన న్యాయవాది. కోర్టు సెలవులలో ఎక్కడికయినా వెళ్లితే వారం విద్యార్థుల కోసం వంటవాడిని పెట్టి వెళ్లేవారు. చివుకుల మాలె కొండయ్యగారి పంక్తిలో రోజూ ముగ్గురు నలుగురు విద్యార్థులు భుజించేవారు.

వెన్నెలకంటి రాఘవయ్యగారు సమర్థులయిన న్యాయవాది. జాతీయోద్యమంలో పెక్కుసార్లు జెయిలుకు వెళ్లారు. ప్రత్యేకంగా ఏనాదుల ప్రగతి కోసం పనిచేసి ఏనాది రాగవయ్య అనే బిరుదు పొందారు. నా మిత్రుడు ఆళ్ల బాలకృష్ణారెడ్డి క్షయ తగిలి మంచం పట్టాడు. నేను అతన్ని పల్లెనుంచి పిలుచుకొని వచ్చి నెల్లూరు ఆస్పత్రిలో చేర్చాను. రాఘవయ్యగారు చికిత్సకోసం ఎంతో డబ్బు వెచ్చించారు. నేను, ఖద్దరుస్టోరు సుందరరామయ్య; ఎంతో సేవ చేశాము. కాని, అతడు దక్కలేదు. రాఘవయ్యగారు

తర్వాత ప్రకాశం మంత్రివర్గంలో ప్రధాన కార్యదర్శి అయ్యారు. రాష్ట్రపతి వి.వి.గిరికి వియ్యంకుడయ్యారు.

ఒంగోలు వెంకటరంగయ్యగారు గొప్ప అధివక్త(అడ్వకేటు). గొప్ప చరిత్ర పరిశోధకులు, శుక్రనీతిసారం, తాండవ లక్షణం, రామాయణ విమర్శనం చారిత్రక వ్యాస సంపుటి, 'కొందరు నెల్లూరి గొప్పవారు' మొదలయినవి ఈయన రచనలు. నేను కె.వి.రాఘవాచార్యులను కలుసుకొన్ననాడే ఆయన వచ్చారు. నా వివరాలు తెలుసుకొని, ఏదీ గ్రీవాభంగాభి రామం శ్లోకం వ్యాఖ్యానించు అన్నారు. నేను గ్రీగ్రీ అని కొంచెం తడుముకున్నాను. "నత్తి ఏడ్చినట్టుందే? సంస్కృతం వాళ్లకు నోరుండాలి. నత్తి అయితే ఎట్లా?" అన్నారు. నేను సవినయంగా "నత్తికాదండీ, పెద్దలను చూచి బెదురు" అన్నాను. అలాటిది పెట్టుకోబాక, ఝామ్మని చెప్పు" అన్నారు. ఆయన ఎనభైయేళ్లకు పైగా బ్రతికి, మరణించే వరకు పరిశోధనవ్యాసాలు వ్రాశారు.



మామిడిపూడి రామకృష్ణయ్యగారు ప్రముఖ న్యాయవాది. కొంతకాలం ప్రభుత్వ న్యాయవాదిగా ఉన్నారు. వీరు మామిడిపూడి వెంకటరంగయ్యగారి సోదరులు. మృదుమధురశైలిలో రామాయణవచనం వ్రాశారు.

పుచ్చలపల్లి సుందరయ్యగారు జాతీయోద్యమంలో పాల్గొని కారాగారం వెళ్లి పల్లెపాడులో కాబోలు కాంగ్రెస్ ఆశ్రమం స్థాపించారు. కొన్ని వారాలు నేనక్కడ ఉన్నాను.

అమృత హస్తులయిన ఏటూరి శ్రీనివాసాచార్యులుగారు పండిత దివి గోపాలా చార్యుల శిష్యులలో ఒకరు. సుఖవ్యాధుల నిపుణులని పేరు. పేదలకు ఉచితంగా వైద్యం చేసేవారు. యోగరత్నాకరానికి 'అమృతకర' అనే వ్యాఖ్య రచించారు. ధారాకల్ప చికిత్సనూ చేసేవారు. వారం విద్యార్థి అయిన నాతో ఎన్నో వైద్య విషయాలు చర్చించేవారు.

పులుగుండ్ల నరసింహశాస్త్రిగారు కూడా గోపాలాచార్యుల శిష్యులే. గొప్ప వైద్యులని పేరు. మూలపేట సంస్కృత కళాశాలలో ఆయుర్వేదం బోధించేవారు. నాకు గురువులు. సంస్కృతాంధ్రాలలో కవిత చెప్పేవారు.

నెల్లూరులో నిరంతరం సంగీత కచ్చేరీలు జరిగేవి. గొప్ప వైణికులు, గాయకులు ఉండేవారు. వారితో నాకు అంతగా పరిచయం లేదు. త్యాగరాజుగారి ప్రశిష్యులలో

ఒకరు ఉండేవారు. గొప్ప గాయకులు, ఆయనను చిన్ననాడు ఎద్దుపొడిచింది. అందువల్ల ఎద్దును చూస్తే భయం. ఆయనతో బాగా పాడించుకొని చివరన 'దుర్ బసవన్న' అని ఎవరో అరిచేవారు. ఆయన లేచి పరుగు తీసేవారు. పేరు మరిచాను.

వేదం వేంకటరాయశాస్త్రిగారి ఆచార్యత్వంలో పలువురు న్యాయవాది ప్రముఖులు నటులయ్యారు. నేను కందాడై దొరస్వామయ్యంగార్ నటనను చూచాను. పర్వతరెడ్డి రామచంద్రారెడ్డి కబీరు పాత్ర చూచాను. నెల్లూరి నాగరాజారావుగారు యుగంధర, పాపారాయుడు, రుస్తుం మొదలయిన పాత్రలను గొప్పగా నటించేవారు. 'ఢిల్లీ సుల్తాన్ పట్టుకపోతాన్' అన్న వాక్యాన్ని అనేక విధాలుగా పలికి నటించి ప్రేక్షకులను భయ భీతులను, ముగ్ధులను చేసేవారు.

ఒక మహనీయుని, ప్రపంచానికొక శిల్పభండారాన్ని ప్రసాదించిన పరిశోధకుని తెలుపడం మరిచాను. వారు ఆసూరి రంగస్వామిసరస్వతి. వారు నేలటూరి రామానుజా చార్యులు గారి పెద్ద అల్లుడు. పురాతత్త్వశాఖలో పనిచేసేవారు, కృష్ణా, గుంటూరు పరిశోధన యాత్రలో ఒక దిబ్బ నుంచి కొద్దిగా కనిపిస్తున్న శిల్పాల ముక్కలు చూచి ఇదేదో మహాశిల్పక్షేత్రమని ఊహించి, ప్రభుత్వానికి తెలిపి తవ్వించారు. అది మహా కళాక్షేత్రమయిన నాగార్జున కొండగా బయల్పడింది. నాగార్జునకొండను కనిపెట్టిన తొలి పరిశోధకుడుగా వారి పేరు నిలిచిపోయింది.

ఇది నాకు జ్ఞప్తిలో ఉన్న కొందరి రేఖాచిత్రం. నెల్లూరుకు నేనెంతో ఋణపడి ఉన్నాను.

కాళిదాసు ఇంటిపేరుగల జిల్లా సెషన్స్ జడ్జి రిటైరయ్యారు. ఆయన సంస్కృతాభిమాని గనుక మా సంస్కృత కళాశాలలో వీడ్కోలు సభ చేశారు. అప్పుడు నేను ఆయనను ప్రశంసిస్తూ శ్లోకాలు వ్రాశాను. వాటిలో ఒకటి గుర్తుంది.

**న్యాయగ్రంథ విమర్శనం హి కురుషే ధృత్వోపనేత్రేసదా**
**న్యాయాధీశ కటాక్ష మేక మపి భోః నాస్మాస్వకస్మాదపి**
**వ్యర్థం నః తరుత్వ మిత్వతితరాం భాషాభి రభ్యర్థితాః**
**రాజంతే హ్యుపకారవేతన మిమే స్వీకృత్య తన్మానసాః**

**కళ్లజోడు పెట్టుకొని ఎప్పుడూ న్యాయగ్రంథాలనే పరిశీలిస్తుంటావు. మా పైన ఒక కటాక్షమన్నా పడనీయవు. మా వయస్సంతా వ్యర్థమవుతున్నది - అని** భాషలు కోరగా

ఉపకారవేతనం పొంది భాషాపరిచర్యలో నిమగ్నులయ్యారా అనిపిస్తున్నది - అని దీని అర్థం. ఆయన దక్షిణాదివాడు. మాతృభాష తెలుగు. అనేక భాషలు వచ్చు.

**"ఉత్తరపినాకినీ తట**
**హరినగర నివాస ముత్తమై స్సేవ్యమ్**
**భూతి విభూషితదేహం**
**మూలస్థానేశ్వరం సదాసేవే"**

**ఉత్తరం పినాకినీ తీరంలో సింహపురిలో వేంచేసి ఉన్న, ఉత్తములకు సేవ్యుడయిన భూతి భూషితదేహుడైన మూలస్థానేశ్వరుణ్ణి నిరంతరం సేవిస్తాను.**

# 43

# చెట్టుకింద కరకబళం

"కరా వివ శరీరస్య
నేత్రయో రివ పక్ష్మణీ
అవిచార్య ప్రియం కుర్యాత్
తన్మిత్రం మిత్ర ముచ్యతే"

**(శరీరానికి చేతులవలె, కళ్లకు రెప్పలవలె అప్రయత్నంగా, అనుకోకుండా మంచి చేసే మిత్రుడే మిత్రుడు.)**

నెల్లూరులో నా జీవితయానం ద్వంద్వరీతిలో – రెండు పట్టాలపై నడిచింది. పగలేమో పరమభాగవత వేషం – గూడకట్టు పంచ, ఉత్తరీయం, రెండు చేతులతో పట్టుకున్నా ఇమడని జుట్టు ముడి, నొసట కొట్టవచ్చే ఊర్ధ్వత్రిపుండ్రాలూ. రేయి ఏమో రాత్రించర వేషం. అడపాదడపా అంతరాత్మ ప్రబోధించేది. నీవు హింసా మార్గంలో నడుస్తున్నావు, హింసతో సంపాదించేది ఏదీ మంచిదికాదు. మంచి పనికి మంచి సాధనాలు అవసరమనే మహాత్మునిబోధ మరచావు, హింసతో ఎవరూ ఏమీ ఉద్ధరించలేరు, రవి అస్తమించని సామ్రాజ్యాన్ని కూల్చడానికి ఎంత బలం కావాలి? అలాటి సైన్యబలం లేదని కదా గాంధీజీ అహింసా మార్గం, సత్యాగ్రహం అని కొట్టుకోడం – ఇత్యాదిగా.

కాని, నేను నిస్సహాయుణ్ణి. నా విప్లవ మిత్రులు నాకన్నా అన్నివిధాల బలవంతులు.

"పరోక్షే కార్య హంతారం
ప్రత్యక్షే ప్రియవాదినమ్
వర్జయేత్ తాదృశం మిత్రం
విషకుంభం పయోముఖమ్"

**(పరోక్షంలో పనిచెడగొట్టేవాడు, ఎదుట తియ్యని మాటలు చెప్పేవాడు, పయోముఖ విషకుంభంలాటి మిత్రుడు కాడు మిత్రభ్రువుడు.)**

అలాటివాడిని విడనాడాలని పెద్దల మాట. కాని వీరు అలాటివారా? లక్ష్యం ఉదాత్తమైనది కదా! మార్గం మాత్రం మంచిది కాదు. ఆవులను చంపి చెప్పులు దానం చేసినట్లు అని మా తాతగారు ఏదో సందర్భంలో అన్న మాటలు జ్ఞప్తికి వచ్చాయి. వీళ్లుకాదు; వీళ్లతోపాటు నేను చేస్తున్న పనీ అలాటిదే కదా? ఇలా పరిపరివిధాల ఆలోచనలు ముసురుకుంటున్నా ఆళ్ల బాలకృష్ణారెడ్డినో, కాళయ్య సెట్టినో చూడగానే, మంత్ర ముగ్ధుడిలాగా మెత్తబడిపోయేవాడిని, ఇలాంటివి ఇతరులతో చర్చించే వీలు లేదు. ప్రమాదకరం. క్లిష్టసమయాల్లో మా అమ్మ సలహాలు అడిగే అలవాటున్న నేను ఈ విప్లవ విషయాలు ఆమెకి చెప్పడానికి వ్రాయడానికీ సంకోచించాను. అలాగే ద్వంద్వ ప్రవృత్తితో భారంగా సమయం లాగుతున్నాను.

ఆ పరమభాగవత వేషంలో కొన్ని మంచి పనులే చేశాను. ఒకటి – నా మిత్రుని చెల్లెలు ఈయూణ్ణి జగన్నాథాచార్యుల భార్య అయిన ఉత్తమురాలికిచ్చిన సలహా. దానిని ఇదివరకే (32వ భాగంలో) తెలిపాను. రెండవది, సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు తచ్చూరు శ్రీనివాసాచార్యులుగారి బంధువు స్టోన్ హౌస్‌పేటలో కాపురం ఉండేవారు. ఆయన పేరు వెంకట రంగాచార్యులు. ఆయన భార్య శ్రీమతి కమలమ్మ విదుషి. “కాళిదాసు ఎంతటి పోకిరి? ఆడపిల్ల, ఆశ్రమం తోటలో ఏదో ఆడుకుం టూంటే, స్త్రీలను ఆకర్షించడానికి గడసరి అయిన దుష్యంతుడు ఏదో సాకుతో లోపల ప్రవేశించి, మాటలతో మభ్యపెట్టి ఒక అమాయకురాలిని నమ్మించి కడుపుచేసి, నాకేమీ తెలియదంటాడా?” అని విమర్శించేది ధైర్యంగా. అరవై ఏళ్ల క్రితం ఒక సామాన్య గృహిణి; కేవలం లోకజ్ఞానంతో చూచిన గృహిణి ఇలా విమర్శించిందంటే ఇప్పటివారు ఆశ్చర్యపడవచ్చు. మొదటి అంకంలో దుష్యంతుని ప్రవర్తనే స్త్రీ జన సహ్యం కాదని ఆమె వాదం.

ఆ వెంకటరంగాచార్యులుగారు జబ్బుపడి ఆస్పత్రిలో చేరారు. నేను రాత్రి ఆస్పత్రిలో సహాయకుడిగా పడుకునేవాడిని. ఒక రాత్రి నేను ఆయన్ని కనిపెట్టుకొని అలసిపోయిపడుకున్నాను. మంచి నిద్ర పట్టింది. ఇంతలో ఆస్పత్రిలో – గందరగోళం జరిగింది. ‘దొంగా దొంగా’ అని ఒక యువతి అరచింది. ఆ దొంగ నా పక్కన వచ్చి

పడుకున్నాడు. ఆస్పత్రి సిబ్బంది అంతా వచ్చింది. వెతుకుతూ ఆ బాధితురాలూ వచ్చింది. డాక్టర్ నా గుండె పరీక్షించాడు. పరిగెత్తి వస్తే గుండె గతిలో కలిగే మార్పులేమీ స్ఫురించలేదు. 'ఇతడు కాదు దొంగ' అని ఆమె అన్నది. మరి దొంగ ఎలా ఉన్నాడు అని అడిగాడు ఆర్.ఎమ్.ఓ. "అతనికి చేతుల్లేవు. మొండి మోచేతుల్తో నా పోకముడి నొక్కిపెట్టి, నోటితో ముడివిప్పి, దాచుకున్న వందరూపాయలు నోటితో కరచుకొని పారిపోయాడు" నమ్మశక్యంగాని విషయం. ఎవరూ నమ్మలేదు.

ఇంతలో నేను మేల్కొన్నాను. నన్ను ఎగాదిగా చూసి ఇతను కాదు – అన్నది ఆమె. ఆ మొండిచేతులవాడు ముసుగుతన్ని నా పక్కనే పడుకున్నాడు. అతడిన్ని రోజులుగా నాతో, అందరితో వేదాంతం కబుర్లు చెబుతూ తిరిగేవాడు. రెండు చేతులూ లేవు కదా అని అందరూ కనికరించేవారు. అలాంటివాడికి ఇంత దొంగబుద్ధి ఉంటుందని కలగన్నామా? నేను యథాలాపంగా అతని ముసుగు తీశాను. వెల్లకిలా పడుకున్నాడు, మొండిచేతుల మహానుభావుడు. ఆ బాధితురాలు 'వీడే వీడే' అని కేకలు వేసింది. డాక్టరు అతని గుండె పరీక్షించారు. అసాధారణంగా కొట్టుకొంటోంది. అతని గుడ్డలు ఊడదీశారు. చల్లడం (డ్రాయరు) జేబులో వంద రూపాయలూ ఉన్నాయి. అతన్ని పోలీసుల కప్పగించారు. అంతటి వికలాంగుని దొంగ బుద్ధి చూసి ఇన్నాళ్లు అతనితో స్నేహంగా ఉన్నందుకు పశ్చాత్తాపపడ్డాను. ఒక చాటువు గుర్తుకు వచ్చింది.

**"వర్జనీయో మతిమతా**
**దుర్జన స్సఖ్యవైరయోః**
**శ్వా భవత్యపకారాయ**
**విహన్నపి దశన్నపి"**

**(దుర్మార్గునితో స్నేమమూ మంచిది కాదు; వైరమూ మంచిది కాదు. కుక్క స్నేహంతో నాకినా చెడుపే, కోపంతో కరచినా చెడుపే.)**

నెల్లూరికి పదిమైళ్లలో ఒక పెద్ద దేవాలయం ఉంది. అక్కడ మా గురువుగారు నమ్మయ్యగారి అల్లుడు పూజ చేసేవాడు. ఆయన పందరి భజనలో దిట్ట.

**"పారిరారా, కృష్ణ! పారిరారా;**
**పందరిపురము విడచీ నీవు, పారిరారా, కృష్ణ!**

**చంద్ర భాగతీర్థములోన స్నానమాడరా కృష్ణ"**
**స్నానమాడి పరుగూ పరుగున బేగరారా కృష్ణ**

అనీ, మరెన్నో పాటలూ పాడి అభినయం పట్టేవాడు. అతనికి మృతాశౌచం వచ్చింది. పదినాళ్లూ నన్ను దేవాలయంలో పూజచేయమన్నాడు. 'నాకు గృహ పూజా విధానం మాత్రమే తెలుసు. అది సరిపోతుందా' అని అడిగాను. "దానికి బలి హరణం చేర్చండి చాలు. ఆపద్ధర్మం కదా?" అన్నాడు. పదిరోజులూ పూజ చేశాను. కోవెల తిరుమడప్పళ్లి (పాకశాల) లోనే వండిన నివేదితాన్నం తిన్నాను. అదొక విచిత్రానుభవం.

తిరుపతి సంస్కృత కళాశాలకు అనుబంధంగా ఉన్న ఆయుర్వేద కళాశాలలో చదివిన కె.బ్రహ్మయ్య (కందుకూరు అని జ్ఞాపకం) గ్రామీణ ఆయుర్వేద వైద్యుడిగా నియమితుడయ్యాడు. అతడు ఆలిగఢ్ ఆయుర్వేద విద్యాపీఠంవారి, ఆయుర్వేదం పరీక్షల కేంద్రం నెలకొల్పి పరీక్షలు నిర్వహించేవాడు. నేను ఆయుర్వేదభూషణ అనే పరీక్షకు వెళ్లాను. ఎనిమిది ప్రశ్నపత్రాలు. సంస్కృతంలో వ్రాయాలి. వ్రాశాను. ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాను. తర్వాతి పరీక్ష 'ఆయుర్వేదాచార్య.' అదే చివరిది. వెళ్లలేదు.

నాటకాలు ఎన్నో చూచాను. కపిలవాయి రామనాథశాస్త్రి ఆ కాలంలో త్యాగరాజు అవతారంగా పేరు పొందాడు. ఆయన పాట "ఏదీ గతీ నాకు" "రంగా, శ్రీరంగా!" మొదలయిన ఆనాటి రికార్డులు ఆ కాలంలో దక్షిణ భారతం అంతా హోరెత్తి పోయాయి. "అడడా! ఎన్నపాట్టు! ఎన్నపాట్టు! త్యాగరాయర్‌వాళ్ అవతారందా!" అన్నారు తమిళులు, ముక్తకంఠంతో. దురదృష్టవంతుడు, తాగుడు వ్యసనంలో పడి మరణించాడు.

ఈలోగా విప్లవ మిత్రుడు దువ్వూరి బలరామరెడ్డి పిలవగా మైపాడుకు వెళ్లాను. నా వెంట సంస్కృత కళాశాల మిత్రులు చివుకుల సత్యనారాయణ, సుసర్ల దక్షిణా మూర్తి, పంచాగ్నుల సత్యనారాయణ మొదలయినవారు వచ్చారు. ఒక వెన్నెల రాత్రి భోజనానంతరం బయలుదేరి కాలినడకన తెల్లవారుజామున మైపాడు చేరాము. సముద్రంలో సూర్యోదయం చూడాలని కాచుక్కూచున్నాము. మా అదృష్టం! ఆనాడు పూర్వదిశలో ఆకాశం నిర్మలంగా ఉంది. సూర్యోదయం దృశ్యం మహాసుందరంగా ఉంది. స్వర్ణారుణ కాంతులు దిగంతాలను వెలిగించాయి. అందరూ ఆనందించారు. నాకు మాత్రం ఆ అరుణ గభస్తి - నీవు హింసామార్గంలో పడ్డావు - అని కన్నెర్రజేసి నట్లనిపించింది.

దువ్వూరి బలరామరెడ్డి మాకందరికీ అప్పటి ఆచారం ప్రకారం ఒక సత్రం వంట యింటిలో భోజనాలు ఏర్పాటుచేసి ఆదరించాడు. ఆ రాత్రి బయలుదేరి కాలినడకన తిరిగి వచ్చాము.

ఒకసారి నా మనోవ్యథను బాలకృష్ణారెడ్డి వద్ద వెళ్లబోసుకున్నాను. "నా రాత్రించరత్వం బయటపడితే నాకు పుట్టగతులుంటాయా? వారం భోజనం పెట్టేవాళ్ళంతా ఏమనుకుంటారు? నా ముఖం చూస్తారా? ఉమ్మివేయరా" అన్నాను. అతను నవ్వి "మీరు పొరుగూరివారు, విద్యార్థి. మేమంతా స్థానికులం. మోతుబరులం. మా పరువేంగాను? అయినా ఇది దేశం కోసం గాదా? మన పొట్ట కోసమా?" అన్నాడు. "ఇలాటి సందేహాలు పెట్టుకోబాకండి. మనం పుణ్యక్షేత్రమయిన జెయిలులో శపథం చేశాము; గుర్తుంచుకోండి" అని హెచ్చరించాడు.

భగత్సింగును ఉరితీసిన తర్వాత అతని సహచరులను అండమాను జెయిలుకు మారుస్తారని, వారిని చీరాల - పేరాల మధ్య రైలు ఆపి విడిపించాలని, వారిని విడిపించిన తర్వాత రహస్య స్థానంలో దాచడానికి ఏర్పాట్లు జరిగాయని, మన పని విడిపించి తప్పించుకొనే వరకేనని, ఫలానా దినం రాత్రి సిద్ధంగా ఉండమని కాళయ్యసెట్టి నాకు సందేశం పంపాడు. సుగ్రీవాజ్ఞకదా! సిద్ధంగా ఉన్నాను. అక్కడికి వెళ్లాము, దాదాపు వదిమందిమి. అనుభవమూ, తగినంత బలగమూ లేనందున ఘోరంగా విఫలులమయ్యాము. దానితో నాకున్న వ్యామోహం తొలగిపోయింది. ఇక క్రమంగా తప్పుకుందామనుకున్నాను. తరుణం వచ్చింది.

నాకు శిరోమణి ఫైనలు ప్రవేశానికి ప్రిన్సిపాలు చాల అడ్డంకులు కలిగించారు. మంచి మార్కులు వచ్చినవారికి విద్యార్థి వేతనం ఇవ్వవలసి ఉన్నా ఈయక ఇబ్బంది పెట్టారు. నిర్వాహక మండలి సభ్యులతో సంబంధం ఉందని నా మీద కోపం. మళ్లీ రెండేళ్లు వారం విద్యార్థిగా ఉండడానికి నా మనస్సు ఒప్పలేదు. దాతలు సంతోషంతో ఒప్పుకొనేవారే కాని, నేను విప్లవ హింసాకార్యాలకు దూరంగా ఉండదలచాను. గనుక మద్రాసు వెళ్లి మైలాపూర్ సంస్కృత కళాశాలలో ప్రయత్నిద్దామనుకున్నాను. నాకు భోజనం పెట్టిన తల్లులకు, పెద్దలకు, నన్ను సోదర ప్రేమతో చూచిన వారందరికీ కృతజ్ఞతావందనాలు సమర్పించి మద్రాసు రైలు ఎక్కాను. వాళ్ళంతా కన్నీళ్ల మధ్య బొంగురు మాటల మధ్య నన్ను వదిలారు.

నాకు వసతి సమస్యేలేదు గదా! మద్రాసు సెంట్రల్ స్టేషనులోనే స్నానాదికం ముగించి చేరాను. నా అదృష్టం! అక్కడ నా మిత్రులు దమ్మాలపాటి శేషగిరిరావు (డాక్టర్ దమ్మాలపాటి రామారావు ఎం.ఎల్.ఏ.గారి జ్యేష్ఠసోదరుడు), కప్పగంతుల లక్ష్మణశాస్త్రి ఉన్నారు. ఇద్దరూ సాహిత్య శిరోమణిలో ఉత్తీర్ణులయి, వేదాంత శిరోమణి కక్ష్యలో చేరారు. వారు నన్ను హఠాత్తుగా చూడగానే సంభ్రమాశ్చర్యాలతో కౌగిలించు కొని కుశల ప్రశ్నానంతరం "ఎక్కడ బస?" అనడిగారు. నేను నవ్వుతూ 'మద్రాసులో, సంస్కృత కళాశాలలో' అని అంటూ, నా కథ చెప్పాను.

మరుసటి దినం జస్టిస్ కృష్ణస్వామి అయ్యర్‌గారి కుమారుడు, సుప్రసిద్ధ న్యాయవాది; కళాశాల నిర్వాహక మండలి అధ్యక్షులు; ధర్మరక్షామణి బిరుదాంకితుడు కె.బాలసుబ్రహ్మణ్య అయ్యరుగారిని దర్శించాను. "ఇప్పటికే కాలాతీతమయింది. కనుక, పాఠశాలలో ప్రవేశం ఇవ్వగలంగాని, భోజన సదుపాయం కలిగించలే"మన్నారు. నాకు మద్రాసు ఆగమనంతో భోజనం సమస్య చాల ఏళ్లు వెంటాడింది. భోజనం కోసమే నేను పుట్టినట్లుగా జీవితం సాగింది. కళాశాల వసతికి అనుమతించారు. గనుక, అక్కడే స్నానశయనాదికం.

నా మిత్రులవల్ల మరొక మిత్రుడు కాశీభట్ట రామనాథ దత్త అక్కడ ఆయుర్వేద శిరోమణి చివరి సంవత్సరంలో ఉన్నాడని తెలిసింది. అతని ఇంటికి వెళ్లాను. అతడూ, అతని భార్య లక్ష్మమ్మ; చాల సంతోషించారు. ఆమె అత్తవారింట పామిడిలో ఉన్నప్పుడు ఒకసారి వెళ్లి చూచాను. గనుక ఆమె సోదరి ప్రేమతో పలకరించింది. నా సంగతి చెప్పాను మిత్రునికి. "భోజనానికి ఇబ్బంది పడవద్దు. అవసరమయినప్పు డల్లా భోజనానికి రా" అని ఒక శాశ్వతాహ్వానం అందించాడు రామనాథదత్త. అన్నా, అతడూ నావంటి విద్యార్థే. కాని, అతడు కుటుంబంతో ఉన్నాడు. కనుక భోజనానికి శాశ్వత పరిష్కారం ఏమిటా అని ఆలోచించారు లక్ష్మణశాస్త్రి, శేషగిరి. నేను ఆలోచించడం మానివేసి, ఆపనీ వాళ్లకే అప్పజెప్పాను. హాస్టలులో దాదాపు యాభై మంది ఉంటారు. నాబోటి వాడికి పట్టెడన్నం మిగలకపోదు. కాని, నియమం ప్రకారం అనుమతి ఉన్నవాళ్లకే పంక్తిలో భోజనం. వార్డెన్ కొంత కరుకైనవాడు. నాకు భోజనం పెట్టడానికి పైవారి అనుమతి లేకుండా - అంగీకరించలేదు. లక్ష్మణశాస్త్రి పెద్ద వంటవాడితో మాట్లాడి, వాడు నస్యప్రియుడు గనుక, అతనితో చేయి కలిపి హాస్టలులో చేరే అనుమతి ఇచ్చేవరకు




మిగులు అన్నం, పులుసు, కూరలు ఇచ్చేట్టు ఏర్పాటు చేశాడు. అదీ నిబంధన. మజ్జిగా నెయ్యీ లేవు.

పాపం! లక్ష్మణశాస్త్రి, శేషగిరిరావు; రాత్రి తొమ్మిది గంటలకు ఒక గోకర్ణంలో రెండు పట్టెళ్ల అన్నం, సాంబారు, వంటశాలలోని తిరుగబోత మిగులు కాచిన నూనె దానిలో పోసి కలిపి, ఒక చెట్టుకింద రాతిబెంచీపై కాచుక్కూచునే నాకు అందించే వారు. నేను పగలంతా పస్తు ఉన్నాను కనుక గబగబా ఆ అన్నం తినేవాడిని. పరిషేచనం లేదు ఆపోశనం లేదు. ప్రాణాహుతులు లేవు, ఉత్తరాపోశనం లేదు. సన్న్యాసి తన భిక్షాపాత్రలో – ఆఁ గుర్తుకు వచ్చింది కరపాత్రీస్వామీ తన భిక్షాపాత్రలో అన్ని వంటకాలూ కలిపి ఏకాకారంగా... తిన్నట్టు తినేవాడిని. అది ఆ వంటవాడి మెహర్బానీ. హాస్టల్ వార్డెన్ ఒక్కొక్కప్పుడు రాత్రి పది గంటల వరకు ఉండేవాడు. ఆ నాడు క్షేత్రపాలక జపమే. అప్పుడప్పుడు పండుగలకు, పర్వాలకు రామనాథదత్త ఇంట్లో పగలు భోజనం. తిరుపతికి నేను రావడానికి కారణమై, తిరుపతిలో రఘువీర దాసు ప్రిన్సిపాలుగా ఉన్న కాలంలో ఉపాధ్యాయులై, కాశీనాథుని నాగేశ్వరరావుగారి పిలుపుపై భారతి పత్రికలో చేరిన మా

గురువు తిరుమల వెంకటరంగాచార్యుల ఇంట్లోను అప్పుడప్పుడు భోజనం చేసేవాడిని.

నా మిత్రులందరూ నా స్థితికి కన్నీళ్లు కార్చేవారు. ఏమీ చేయలేని పరిస్థితి. కళాశాల ప్రిన్సిపాలు మహామహోపాధ్యాయ కరుంగుళం కృష్ణశాస్త్రిగారు, తక్కిన ఆచార్యులు, లక్ష్మణశాస్త్రి, రామచంద్ర దీక్షితార్, సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మొదలయిన వారు; ఎంతో ప్రేమతో చూచేవారు. నేను సుమతి శతకం పద్యాలు వినిపించడం వల్ల నన్ను 'హే! సుమతే!' అని సంబోధించేవారు. కాని నా మిత్రులకు తప్ప ఎవ్వరికీ నా కరకబళం కథ తెలియదు.

గుంటూరులో సుప్రసిద్ధ న్యాయవాది - దేశభక్తుడు - శ్రీ భావనాచార్యులుగారి మేనల్లుడు మాడభూషి వెంకటాచారి అనే ప్రెసిడెన్సీ కాలేజీ సంస్కృత విద్యార్థి పరిచయం కలిగింది. ఆ పరిచయం అతడు జీవించి ఉన్నంతకాలం కొనసాగింది. అప్పటికే అతడు ఒక ఎం.ఏ. ప్యాసయి సంస్కృత ఎం.ఏ.లో చేరాడు. అతడు నాకు అడపాదడపా సాహాయ్యం చేసేవాడు. ఇలా రెండు మూడు నెలలు గడిచాయి. అప్పుడు ఒక సంఘటన!

"నాస్తి క్షుధా సమం దుఃఖం
నాస్తి రోగః క్షుధా సమః
నాస్త్యాహార సమం సౌఖ్యం
నాస్తి క్రోధ సమో రిపుః"

**ఆకలి వంటి దుఃఖం లేదు, ఆకలి వంటి రోగం లేదు. ఆకలి అన్ని దుఃఖాలకూ, వ్యాధులకూ మూలం. తిండికి సమమైన సౌఖ్యం లేదు. క్రోధానికి దీటయిన శత్రువు లేదు. క్రోధం సకల శత్రుత్వాలకు మూలం.**

# 44

# ఆనాటి మా మద్రాసు కుట్ర కేసు

"గుణవ దగుణవద్వా కుర్వతాం కార్యమాదౌ
పరిణతి రవధార్యా యత్నతః పండితేన
అతిరభసకృతానాం కర్మణా మావిపత్తేః
భవతి హృదయదాహీ శల్యతుల్యో విపాకః"

**(వివేకవంతుడు తానుచేసే మంచిపనికైనా, చెడ్డపనికైనా పరిణామం ఏమిటా అని ముందుగానే ఆలోచించాలి. తొందరపడి చేసే పనులు ఆపద కలిగించడమే కాక హృదయం మండించే మేకులాగ పరిణమిస్తాయి.)**

**భా**రత స్వాతంత్ర్యోద్యమం మరింత ముమ్మరమయింది. భగత్‌సింగ్ మొదలయిన వారిని బ్రిటిష్ ప్రభుత్వం దౌర్జన్యవాదులనే సాకుతో ఉరితీయించి ఎంతో కాలం కాలేదు. యువకుల నెత్తురు ఉడికి పోతున్నది. దేశం ఇంత అల్లకల్లోల మయినా, మైలాపూర్ సంస్కృత కళాశాలలో యథాప్రకారం పనులు సాగిపోతున్నాయి. గురువర్యులు లక్ష్మణశాస్త్రిగారు అలంకార శాస్త్రపాఠం చెబుతున్నారు. 'స్యాదశ్యపుస్సుం దరమసి సిత్రైణైకేన దుర్భగమ్' అని దోష కథన ప్రసంగంలో కావ్యాదర్శ శ్లోకాన్ని ఉదాహరిస్తూ ఉపన్యసిస్తున్నారు. దేహం ఎంత సుందరమయినా, శ్వేతకుష్టం ఒక చుక్క ఉన్నా

దుర్భరమయినట్టు, కావ్యం ఎంత సుందరమయినా, ఒక్క దోషంతో కొరగాని దవుతుందని ఈ శ్లోకం అర్థం. దీనిని నేను దేశానికి అన్వయించి ఆలోచిస్తున్నాను. మన దేశం ఎంత అందంగా విశాలంగా, సస్య సమృద్ధంగా ఉన్నా, స్వాతంత్ర్యం లేని లేదా పారతంత్ర్యం అనే దోషంతో కొరగాని దయిపోయింది సుమా అని అనుకుంటున్నాను.

ఇంతలో 'ఫలానా వారు ఉన్నారా అంటూ ఒక పెద్ద మనిషి తరగతి గదిలోకి వచ్చాడు. తెల్లటి పంట్లాం, తెల్లటి షర్టు, తెల్లటి కోటు – అతడు మఫ్టీలో ఉన్న సి.ఐ.డి. ఇన్‌స్పెక్టర్ పార్థసారథి అయ్యంగార్ అని నాకేం తెలుసు? ఎవరో పెద్దమనిషి అని అనుకున్నాను. అతడు పాఠం ముగిసేవరకూ కూచున్నాడు. గంటకొట్టగానే మరొక పాఠానికి నేను వెళ్లుతున్నాను. ఆయన నావెంట వస్తూ 'ఇదిగో నాయనా' ఒక్కమాట! అని ఎంతో ఆప్యాయంగా పలకరించాడు. నాకు అతడు ఎవరో గుర్తుకు రాలేదు. మావాళ్లు పంపగా పలకరించడానికి వచ్చాడేమోనని అనుకున్నాను.

"నా వెంట రావాలి నీవు" అన్నాడు నన్ను ఆపి. "క్లాసులు పూర్తికాలేదు" అన్నాను. "మీ ప్రిన్సిపాలు గారితో చెప్పాను. రెండు మూడు గంటలపని" అన్నాడు కొంచెం అధికార ధోరణితో. అప్పటికీ నాకు వారు పోలీసు వాళ్లని తోచలేదు. ఇంతలో మరొక వ్యక్తి వచ్చి అతనితో గుసగుసలాడాడు. 'ఇంత రహస్యమేమిటి?' అని సందేహమూ కలుగలేదు. పుస్తకాలు నా మిత్రుడు లక్ష్మణశాస్త్రి పెట్టె వద్ద (విద్యార్థులుండే హాలులో) పడవేసి వారి వెంట బయలుదేరాను. వారు నన్ను ట్రాము ఎక్కించి, తిరువల్లిక్కేణిలో దింపారు. రెండు ఫర్లాంగులు నడిచి, పార్థసారథి స్వామి తేరు వీథిలోని ఒక ఇంట్లోకి పిలుచుకొని వెళ్లారు. అక్కడ చూశాను. ఆయన పేరున్న ఇత్తడి అక్షరాలతో మెరిసి పోతున్న పలకను.

నా మెదడులో కొన్ని వేల మెరుపులు మెరిశాయి. నెల్లూరి పనులు పొక్కాయేమో! మా మిత్రులలో ఎవరన్నా పట్టుబడ్డారేమో! గొప్పలకోసం మనసులో అనుకున్నవన్నీ బయటికి కక్కేశారేమో! మనసు, శరీరం వేడెక్కిపోయాయి. వివేకం మేల్కొని అనుక్షణం హెచ్చరికలు చేస్తూంది – 'నోరు జారేవు సుమా! నీ మాట మీద నీ మిత్రులు ఆధారపడి ఉండవచ్చు. పెదవి దాటితే పృథిని దాటుతుందని సామెత. పోలీసుల మాయమాటలకు మోసపోయేవు!' అంటూ.

ఇంతలో.. "ఆచార్యులవారూ కూర్చోండి" అన్న మాటలు వినిపించాయి. ఆలోచనా




తంత్రి తెగింది. కూర్చున్నాను. ఆయన మర్యాదగా ప్రవర్తించాడు. కన్నయ్యనాయుడి మొరటు ప్రవర్తనలేదు.

మీకు ఫలానా పట్టాభిరామిరెడ్డి తెలుసా? - అని ఆయన ప్రశ్న.

"తెలుసు, తిరుచిరాపల్లి జెయిలులో సహవాసులం" అన్నాను.

పొరపాటయి పోయింది. ప్రశ్నల వర్షం కురిసింది. ఏమి చెబితే ఏమి ప్రమాదమో! ఎవరికి ఎంత నష్టమో! అంటీ అంటనట్టు సమాధానాలు చెబుతున్నాను. అతని ముఖం ఎఱ్ఱబడింది కోపంతో. కాని, శాంతవాత్సల్యాలుగా మార్చుకొని; నవ్వు మొగంతో

"అబ్బాయీ! చూడు, ఈ బుకాయింపులు పనికిరావు. నీ మిత్రులందరూ పట్టుబడ్డారు. నీవు నిజం చెబితే మంచిది. సంస్కృతం చదువుకుంటున్నవాడివి. ఎందుకు నీకిదంతా? పట్టాభిరామరెడ్డి, ఎన్.కృష్ణన్ అంతా చెప్పారు. వాళ్లను లండన్‌కు పంపుతున్నాము. నిన్ను లిప్జిగ్ యూనివర్శిటీలోనో, డుబింజన్ యూనివర్శిటీలోనో (జర్మనీలోవి ఇవి), ఆక్స్‌ఫర్డ్‌లోనో సంస్కృతాభ్యాసానికి పంపిస్తాను. అక్కడి నుంచి తిరిగి రాగానే ఏ కాలేజీలోనైనా ప్రొఫెసర్‌వి అవుతారు" అంటూ ఇంకా ఏవేవో చెప్పాడు. ఆయన గంటసేపు నోరు విప్పుకున్నాడు.

నేను మాట్లాడక తప్పిందికాదు. మేమేమీ చేయలేదని, ఏవో కేవలం ఆలోచనలే నని... అంటూండగా "అవేచెప్పు, పోలీసు కమిషనర్ ముందు. నడు కమిషనర్ దొరగారి దగ్గరికి!" అని అధికారం అరిచింది.

కారు సిద్ధంగా ఉంది. నన్ను బీచ్‌రోడ్డులో పోలీసు కమిషనర్ కార్యాలయానికి తీసుకువెళ్లారు. కమిషనర్ వైద్యనాథమొదలియార్ అని గుర్తు. ఆయన కోప్పడలేదు. మహాచతురుడు. శాంతంగా "దేవభాష చదువుకుంటున్న బ్రహ్మచారి. పాఠశాలకి పంపించి వేయండి. అవసరమైతే పిలిపించుకుందాం. కళాశాల ప్రిన్సిపాలుకు చెప్పారు గదా! అబ్బాయీ! ఎక్కడికీ వెళ్లక. నీ కోసం మీ కళాశాలలోనే ఇద్దరు పోలీసు జవాన్లను పెట్టాము. ఏమయినా అవసరమైతే వాళ్లు నీకు తోడ్పడుతారు. ఈ పార్థసారథి అయ్యంగార్ ముప్పూటలా వచ్చి నీ యోగక్షేమాలు కనుక్కుంటారు" అన్నారు. అంతే. నేను కదలకుండా కట్టుదిట్టం చేశారన్నమాట. నన్ను కళాశాలలో దిగబెట్టారు. నోరు విప్పకూడదు, ఏమయినా సరే – అని నిశ్చయించుకొన్నాను.

వైద్యనాథ మొదలియార్ అన్నట్టే, పార్థసారథి అయ్యంగార్ సాయంకాలం వచ్చి యోగక్షేమాలు అడిగిపోయాడు. మసకమసక చీకటి. కుంటుకుంటూ ఒక వ్యక్తి నా వద్దకు వచ్చాడు. మరొక సి.ఐ.డి అనుకొని ప్రశ్నలకు సిద్ధమయ్యాను.

'మీరేనా రామచంద్రుడు?' అనడిగాడు. ఔనన్నాను. "మరెవరైనా మీ దగ్గరికి వచ్చారా? మీరేమైనా వారికి చెప్పారా? నేను మీకు మిత్రుణ్ణి. పేరు పి.రామమూర్తి. సుప్రసిద్ధ న్యాయవాది బచ్చు జగన్నాథదాసుగారికి జూనియర్ను. (తర్వాత ఈయన మార్క్సిస్ట్ కమ్యూనిస్టు పార్టీ నాయకుడూ, పార్లమెంటు సభ్యుడూ అయ్యాడు.) నా వెంట రాండి, జగన్నాథదాసు గారింటికి వెళ్లుదాం. కేసులో ఏ విధంగా మెలగాలో

తెలుపుతారు" అన్నాడు. ఇదీ చూద్దాం. వచ్చే నష్టమేమిటి? అనుకున్నాను. అతని వెంట బయలుదేరాను.

ఇద్దరమూ తిరువల్లిక్కేణిలో బిగ్‌స్ట్రీట్ చేరాం. ఒక ఇంట్లో ప్రవేశించాము. బచ్చు జగన్నాథదాసు అడ్వకేట్ అనే నామఫలకం గోడకు వేలాడుతూంది. ఆయన టంగుటూరి ప్రకాశంగారికి జూనియర్‌గా పనిచేశారు. ప్రముఖ జాతీయవాది. కుంటి రామమూర్తి మాటలపైన నమ్మకం కలిగింది. డ్రాయింగ్ రూములో చాలమంది మూగి ఉన్నారు. ఈ కేసు గురించే చర్చిస్తున్నారు. రామమూర్తి నన్ను జగన్నాథదాసుగారికి పరిచయం చేశాడు. నేను నమస్కారం చేశాను. ఆయన నన్ను కూర్చోమన్నారు. మాట్లాడడం ప్రారంభించారు.

"ఇదిగో నాయనా! మీరంతా అమాయకంగా ఒక ఘోరమైన కుట్రకేసులో చిక్కుకున్నారు. మిమ్మల్నందరినీ రక్షించడానికి – ప్రకాశంగారు; పేరు విన్నావుగదా పూనుకున్నారు. ఆయన నాయకత్వంలో కొందరు న్యాయవాదులు మీ అందరి పక్షాన రక్షణ సంఘంగా ఏర్పడ్డారు. దీనిలో పి.రాజగోపాలాచారి, ఎస్.ఎస్.మణి, సుసర్ల సూర్యప్రకాశరావు, కె.భాష్యం, మరికొందరు: సభ్యులు. రామమూర్తి కార్యదర్శి. (అంటూ అందరినీ చూపారు. నేను నమస్కరించాను) నీకు తెలిసిన విషయాలు పూర్తిగా మాకు తెలపాలి. నీవు అందరికన్నా చిన్నవాడివి, సంస్కృత విద్యార్థివీ గనుక, నిన్ను పోలీసులు ఈ కుట్రకేసులో తమ మొదటిసాక్షిగా వేసుకున్నారు."

నేను కొంచెం గాబరా పడ్డాను. కాని బుద్ధి మాత్రం చురుకుగా పనిచేసింది. పట్టాభిరామరెడ్డి, కృష్ణన్ ఏమేమి వాగారో! పట్టాభి మంచివాడే. ఏమో స్వార్థంతో మారిపోయి ఉంటాడు. వాళ్లు: అంతగా సాహసాలను నూరిపోసేవారు. అప్రూవర్లు ఎలా అయ్యారు? వాళ్లు ఎవరెవర్ని ఇరికించారో? అని అనుకుంటుండగా, జగన్నాథ దాసుగారు నా మనస్సులోని విషయం కనిపెట్టారేమో – ఇలా అన్నారు.

"తిరుచిరాపల్లి కారాగారంలో మీరంతా ఉన్నప్పుడు అక్కడి దౌర్జన్యవాదుల ఉపదేశాలతో దౌర్జన పద్ధతులతో బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి కుట్ర పన్నారని ఆరోపణ. నిందితులు ఎవరంటే ప్రముఖ కార్మిక నాయకుడు – ఫార్వర్డ్ బ్లాక్ కార్యదర్శి – ముకుందలాల్ సర్కార్, ఏ.గోపాలశాస్త్రి, కె.అరుణాచలం, టి.ఆర్. సుబ్రహ్మణ్యం, జి.లోకనాథన్, టి.కణ్ణన్, కణ్ణాయిరం, వేలాయుధన్, ఎస్.రంగరాజన్, కె.నారాయణ

నంబియార్, బి.బాలకృష్ణారెడ్డి, దువ్వూరి బలరామిరెడ్డి, వి.బాలిరెడ్డి, దశరథ రామిరెడ్డి, జి.కాళయ్యసెట్టి, సి.జగన్నాథం, భూపతిరాజు బాపిరాజు, కానూరు రామానందచౌదరి, బి.జోసెఫ్, టి.రామచంద్రాచార్య (నేను). కానూరి దామోదరయ్య గారు పెద్ద భూస్వామి. ఆయన కుమారుడు రామానందచౌదరి. ఆయన, మరి కొందరు నిందితుల తల్లిదండ్రులు ప్రకాశంగారిని కోరడం వల్ల, ఆయన పదేళ్ల కిందట వదలుకున్న వకాలత్‌ను మీ అందరికోసం మళ్లీ ఆరంభించారు. మీపై ఆరోపణలకు కనీసం 15-20 ఏళ్ల శిక్ష తప్పదు. నీవు చెప్పే విషయాలపై నీ మిత్రులను రక్షించడానికి కొంత ప్రయత్నించవచ్చు.

నేను వినయంతో “నన్నేం చెయ్యమన్నారు?” అని అడిగాను.

“వాస్తవాలు చెప్పు. అవి ఎంతవరకు మా డిఫెన్స్ వాదానికి ఉపయోగపడతాయో తెలుస్తుంది” అన్నారు ఆయన.

లాయర్ల వాసన కొట్టడం వల్లనేమో నా బుద్ధి కూడా కొంత తర్కాన్ని ఆశ్రయించింది. “మొదట పోలీసులు ఏమారోపించారో డిఫెన్స్ న్యాయవాదులు గనుక మీకు తెలిసే ఉంటుంది. వాటిని తెలిపితే నేను నిజా నిజాలు తెలుపడానికి ప్రయత్నిస్తాను” అన్నాను.

“వివరాలు చెప్పడానికి సమయం లేదు. సంక్షిప్తంగా చెబుతాను. వివరాలు ఈ ఫైలులో ఉన్నాయి. తర్వాత నీవు చదువవచ్చు” అంటూ ఆయన తెలిపారు.

నాకు సంబంధించినంత వరకు దాని సారాంశమిది: “అబ్బాయి! భగత్సింగుని ఉరితీసిన తర్వాత అతని సహచరులను అండమాను జెయిలుకు మద్రాసు మీదుగా పంపినప్పుడు వారిని తప్పించడానికి మీరంతా ప్రయత్నించారు. ఆ పనికి అవసరమయిన ఆయుధాల కోసం డబ్బు అవసరం. దానికోసం దోపిడీలు చేయాలి. దొంగతనాలు చేయాలి. దానిలోను ఒక నీతి పాటించారు. వారసులులేని వారి ఇళ్లు దోచుకోవచ్చు. ధనవంతుల ఇళ్లు దోచుకోవచ్చు. ప్రభుత్వం రెవిన్యూ డబ్బు అపహరించవచ్చుననీ, పట్టుబడితే ప్రాణాలు తీసినా రహస్యం పొక్కరాదని ఎన్నో శపథాలు రక్తంతో వ్రాసుకొన్నారు.

భగత్‌సింగ్ సహచరులను 1933 ఆగస్టు నెలలో (తేదీ నాకు జ్ఞప్తిలేదు) మద్రాసుకు తరలిస్తున్నారని తెలిసింది. బిట్రకుంట - కావలి స్టేషనుల మధ్య తప్పించాలని పథకం వేశారు. ఎవరెవరు ఏ పనిచేయాలనేది నిర్ణయమైంది. నీ పని ఎవరైనా వస్తే

నినాదాలివ్వడం. రైలులో అదివరకు పయనిస్తున్న నీ మిత్రులు గొలుసు లాగారు. రైలు ఆగింది. రైలు అధికారులు హడావిడిగా రైలు ట్రాకంతా తిరిగారు. నీవు ఒక చెట్టు గుబురులో రివాల్వరుతో ఉన్నావు. రైలు గంట తర్వాత కదిలింది. ఆ రైలులో భగత్‌సింగ్ సహచరుల బదలీ జరుగలేదు. మీ ప్రయత్నం వ్యర్థమైంది. నీ కర్తవ్య నిర్వహణకు అవకాశమే కలుగలేదు.

"బుచ్చిరెడ్డిపాళెం వద్ద ఒక గ్రామం ఉంది. ఆ గ్రామంలో ఒక సంపన్నురాలైన విధవ ఉంది. ఆమెను మరి ముగ్గురు విధవలు ఆశ్రయించి ఉన్నారు. వారి వయస్సు 80, 65, 45, 25 ఏళ్లు. చాల పిసినిగొట్లు. ఆ ఇంటిని దోచుకోవడం పాపం కాదని నిర్ణయించుకున్నారు. జోరున వర్షం కురుస్తున్న ఒక అమావాస్యరాత్రి జట్కాలో బుచ్చిరెడ్డిపాళెం వరకు వెళ్లి అక్కడి నుండి మూడు నాలుగు మైళ్లు నడిచి, ఆ పల్లె చేరారు నలుగురూ. నీవు, బి.బాలకృష్ణారెడ్డి, కాళయ్యసెట్టి, ఆళ్ల బాలకృష్ణారెడ్డి. నీ పని 80 ఏళ్ల ముసలమ్మను కదలనీకుండా చూడడం. భోషాణం తాళం చెవి లాక్కోడం, అందరి దగ్గరా పిస్తోళ్లు, చురకత్తులు ఉన్నాయి. అత్యవసరమయితే తప్ప ఆయుధాలు వాడరాదని నియమం. ఒక్క పొరపాటు జరిగింది. కుక్క ఉందన్న సంగతి మరిచారు.

"కాళయ్యశెట్టి గోడదూకి పెరడులో దిగి పాతకాలపు గడియమానులు ఇనుప ఊచలతో పైకిలేపాడు. తలుపులు నెమ్మదిగా తెరిచి ఇంట్లో ప్రవేశించి అదాటుగా ఆ విధవల మీద పడ్డాడు. కుక్క మొరగడం ప్రారంభించింది. కాళయ్యశెట్టి పట్టుకున్న నడి వయస్సు విధవ "దొంగలు దొంగలు" అని అరవడం ప్రారంభించింది. ఆమె బలవంతురాలు. కాళయ్యశెట్టి బొడ్డులో చెయి దోపి పంచె పట్టుకొంది ఉడుము పట్టుతో. ఆరడుగుల కాళయ్య గిజగిజ తన్నుకున్నాడు. ఊరిజనం పోగయింది, కాగడాలు వెల్గించుకొని. కాళయ్య చురకత్తితో, పంచను నిలువుగా చించి ఆమెను వదిలించుకుని బయలుదేరాడు పని సఫలం కాక పరుగెత్తారు మీరు. అక్కడ పెన్న నీటి సరఫరా కోసం అమర్చాలని పడేసిన పెద్ద సిమెంటు గొట్టాలు కనిపించాయి. వాటిలో మీరు దూరారు. ఊరివాళ్లు చీకట్లో వానలో మరి వెంటపడలేక వెళ్లిపోయారు. వాళ్లు దగ్గరికి వస్తే కాల్చివేద్దామనుకున్నారు మీరు. వాళ్లక్కూడా భయమే కదా, వెళ్లిపోయారు. గంటసేపు గొట్టాల్లో కుక్కిన పేనుల్లాగ నక్కిఉండి తర్వాత గంటసేపు నడవగా పెన్న గట్టు కనిపించింది. కాళ్లీడ్చుకుంటూ నీవు ఉన్న స్వయంపాలకులవారి సత్రంచేరి పిస్తోళ్లు,

కత్తులు గూళ్లలో పడేసి ఎవరిదారిన వాళ్ళు వెళ్లారు. ఉదయం నిద్రలేచేసరికి కాళ్లు చింత మొద్దులయాయి. రాత్రి అడ్డదిడ్డంగా ముళ్లనకా రాళ్లనకా పరిగెత్తిన దాని ఫలం. సత్రంలో వీధి గదిలో ఉన్న గుర్నాథం అనే విద్యార్థి నిన్ను చూచి ఏవో వ్యసనాల్లో పడ్డావని ఒక విధంగా చూచాడు. ఇతరులు అనుమానిస్తారని నీవు కళాశాలకు పోవడం మానలేదు. కుంటుతూ వెళ్లావు. నయం కావడానికి వారమయింది.

"మరొకసారి మీ ముఠా పట్టపగలే కోవూరు దగ్గర దోపిడీకి బయలుదేరింది. రెవెన్యూ శిస్తు డబ్బును అధికారులు నెల్లూరు తెస్తున్నారు. వారిని దారిలో అటకాయించి మాటల్లో దింపడం నీపని. ఊరికి మూడు మైళ్లు దూరం. ఫలించకపోతే, పరుగెత్తి దాక్కోవడానికి కొంచెం దూరంలో దట్టంగా చెట్ల గుబురు. ఏ కారణం వల్లనో శిస్తు డబ్బు తెచ్చే బృందానికి అనుమానం కలిగింది. పరుగెత్తడం ప్రారంభించారు. కాళయ్య వాళ్లను వెంబడించాడు కొంతదూరం. కాని ప్రయత్నం వ్యర్థమయింది. ఇలా మరి రెండు నీ సంబంధం ఉన్నవి ఉన్నాయి" ఆగారు దాసు గారు. నావైపు సాభిప్రాయగా చూచారు.

"ఇదంతా నిజమేకదా!" అన్నాను అమాయకంగా. రామమూర్తి నా మాట విని "వట్టి గప్పాలు కదూ!" అంటూ విరగబడి నవ్వాడు. నా ముఖం కోపంతో ఎర్రబడింది. దాసుగారు పరిస్థితి గ్రహించి "అబ్బాయి! నిజం కావచ్చు. పోలీసులు పూర్తిగా ఆకాశ పురాణం అల్లరు. కొద్దిపాటి నిజమైనా నేరాన్ని కొండంతగా చూపుతారు. దానికి కుట్ర అనే నామకరణం చేస్తారు. మీరు చేసిన పనులు ఫలించకపోయాయి; కాని, ఉద్దేశం ఉందికదా, అది చాలు పోలీసులకు. ఒక నిర్ణయం చేసుకో - నీ మిత్రులను రక్షించుకోవడమా? అరకొర నిజం చెప్పి మిత్రులకు మరింత కష్టం, నష్టం కలిగించడమా? - నీవు భారతం చదివే ఉంటావు. ఒక పెద్ద మంచి పని కోసం అబద్ధం చెప్పవచ్చు. అదీ చెప్పనప్పుడు తెలీదనవచ్చు" అన్నాడు.

మరల ఆయన "పోలీసులు ఇవన్నీ అడిగారా? నీవు నోరుజారావా?" అని ప్రశ్నించారు.

"లేదు" అన్నాను "మరి మిత్రులను రక్షించదలచలేదా? ఆ అభిప్రాయం గూడ లేదా?" అనడిగారు. "ఉంది" అన్నాను. అయితే, బంతి నీ చేతిలో ఉంది. నిన్ను ముద్దాయిగా చేర్చాల్సింది. నీవు పట్టాభిరామిరెడ్డి ప్రియమిత్రుడివి గనుక పోలీసులకు తోడ్పడుతావనే నమ్మకంతో నిన్ను మొదటి ప్రాసిక్యూషన్ సాక్షిగా వేయించి మోసం

చేశాడు. దానికి విరుగుడుగా నీవు కోర్టులో – నాకేమీ తెలీదు – అని చెప్పాలి. మరేదైనా చెప్పావో, నీతోపాటు అందరికీ ముప్పు, ఇంతకూ మీ వల్ల జరిగిందేమీ లేదు, కనుక మిత్రుల ప్రాణరక్షణ ముఖ్యం" అన్నారు దాసుగారు.

బాగా చీకటి పడింది. పాఠశాలకు బయలుదేరాను. పట్టాభి ఎంత దుర్మార్గుడు– అని మనసులో అనుకొన్నాను. నా మిత్రులు నా కోసం గోకర్ణంతో కాచుక్కూచున్నారు. బయలుదేరేప్పుడు రామమూర్తి నా భుజం మీద చేయివేసి "నీవు దాసుగారిని కలుసుకున్నావని పోలీసులు నిన్ను తమ పని అయ్యేవరకు దాచేయవచ్చు. మాకు దూరమయి పోతావు" అన్నమాటలు చెవుల్లో మోగుతున్నాయి. "ఎక్కడికి వెళ్లావు? ఏమిటి? పొద్దున ఎవరో నీ కోసం వచ్చారట. సాయంత్రం మళ్లీ ఎవళ్లో..." అంటూ ఆత్రంగా ప్రశ్నించారు నా మిత్రులు శేషగిరిరావు, లక్ష్మణశాస్త్రి, కాశీభట్ట రామనాథదత్త.

నేను వారికి పూసగుచ్చినట్టు అన్నీ చెప్పాను. వారికీ విషయాలేవీ తెలుపలేదు గదా నేను, ఇంత సాహాయ్యం చేస్తున్నవారికి చెప్పవలసిందే; కాని, తెలీదు గదా ఇలాటి పరిస్థితి వస్తుందని! వారు నా మాటలు విని కళ్లు పెద్దవిచేసి నిలుచుండి పోయారు.

**"యా సాధూంశ్చ ఖలాన్ కరోతి విదుషా**
**మూర్ఖాన్ హితాన్ ద్వేషిణః**
**ప్రత్యక్షం కురుతే పరోక్ష మమృతం**
**హాలాహలం తక్షణాత్**
**తామారాధయ సత్క్రియాం భగవతీ భోక్తుం ఫలం వాంఛితం**
**హే సాధో వ్యసనైర్గుణేషు విపులే ష్వాస్థాం వృథా మకృథాః"**

**ఓ సాధువా! నీవు కోరిన ఫలం అనుభవించ దలచుకుంటే, సత్క్రియ – మంచిపని అనే దేవిని పూజించు. అది దుష్టులను సాధువులనుగా చేస్తుంది. మూర్ఖులను విద్వాంసులనుగా చేస్తుంది. శత్రువులను మిత్రులనుగా చేస్తుంది. పరోక్షంగా ఉండే దాన్ని ప్రత్యక్షం చేస్తుంది. హాలాహల విషాన్ని అమృతం చేస్తుంది. అందువల్ల దానిని ఆరాధించు. వ్యసనాలతో, గొప్ప గొప్ప గుణాలపై శ్రద్ధ మానుకోకు; అది వ్యర్థం**

# 45

# కుట్రకేసు విచారణ-
# నాకు బహిష్కరణ

"కుల శీల గుణోపేతః
సర్వధర్మ పరాయణః
ప్రవీణః ప్రేషణాధ్యక్షః
ధర్మా ధ్యక్షే విధీయతే !!"

**(మంచి వంశంలో జనించిన వాడిని, శీలం గల వాడిని, గుణవంతుడిని, ధర్మపరుడైన వాణ్ణి, సమర్థుడిని, తన ఆజ్ఞలను నిర్వర్తింపజేసుకోగల శక్తి మంతుడిని ధర్మాధ్యక్షుడుగా నియమించాలి. శీలవంతుడు, ధర్మపరాయణుడు, కాకపోతే న్యాయాధీశుడు న్యాయంగా ప్రవర్తించలేదు. ఇవన్నీ ఉన్నా అతని తీర్పులు ఆచరణ కావాలి. అవి కేవలం తీర్పులుగానే ఉండిపోతే ప్రయోజనం లేదు. కనుకనే ప్రేషణాధ్యక్షుడూ కావాలి. జారీ చేసిన ఆజ్ఞలు అమలు కావాలి)**

మైలాపూర్ సంస్కృత కళాశాలలో నాకు చదువు సాగుతూనే ఉంది. కాని మునుపటి అంత ప్రశాంతంగా కాదు. ముందు భోజనం సమస్య మాత్రమే ఉండేది. ఇప్పుడు ఈ పోలీసు పీడ ఎప్పుడు ముగుస్తుందో అని అదనంగా ఆందోళన. దాదాపు మూడు నెలలు గడిచాయి. నా సంగతి ప్రిన్సిపాల్ గారికీ, నా మిత్రులకూ

తప్ప మరెవ్వరికీ తెలీదు. పోలీసులు ప్రతిదినమూ వచ్చి పోతున్నారు గదా, ఏమిటి సంగతి? అని ప్రశ్నించుకున్నవాడే లేడు. నా మిత్రులు మాత్రం ఆందోళన పడుతూనే ఉన్నారు. నేను నా ఆందోళనను వాళ్లకు అప్పగించి హాయిగా ఉన్నాను. ఏమవుతుంది మహా! కళాశాల నుంచి తొలగిస్తారు. ఆ పరిస్థితి వస్తే చూద్దాం. దాని గురించి ఇప్పటి నుంచి బాధపడటం ఎందుకూ? అదీ నా ధోరణి.

పార్థసారథి అయ్యంగారూ అతనికి తెలియకుండా కుంటి రామమూర్తి; వచ్చి యోగక్షేమములు అడిగిపోతూనే ఉన్నారు. రామమూర్తి మద్రాసు పెనిటెన్షియరీ (సెంట్రలు జైలు)లో ఉన్న నా మిత్రుల యోగక్షేమాలు తెలియజేస్తున్నాడు. నేను తప్పించుకొని పోకుండా రహస్యంగా ఏర్పాట్లు జరగనే జరిగాయి. నిజానికి ఎక్కడికి పోగలను? రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యంలో ఎవరైనా తప్పించుకుపోగలరా?

మా కుట్రకేసు దక్షిణభారతంలో మొట్టమొదటి కుట్రకేసు. కనుక దేశంలోని పత్రికలన్నీ చాలా ప్రచారం చేశాయి. అంటే అనుకూలంగా అని కాదు. జాతీయ పత్రికలూ నిందితులపై పక్షపాతం చూపే అవకాశం లేనందున యథాతథంగా వార్తలు ప్రచురించేవి. ప్రభుత్వానుకూల పత్రికలు నిందితులను రాక్షసులనుగా చిత్రిస్తూ చిలువలు పలువలుగా ప్రచురించేవి.

చివరకు కుట్రకేసు విచారణ తేదీ ప్రకటించారు. 1933 సెప్టెంబరు 8వ తేదీ. ఆనాడు చూడాలి, మద్రాసు నగరం సంబరం. ఇరవై మంది యువకుల ప్రాణాలను రక్షించడానికి కంకణం కట్టుకొన్నది ప్రకాశంగారే అయినా, ఆయన వెంట ప్రచ్ఛన్నంగా మద్రాసు నగర మేధావులంతా ఉన్నారు.

రాష్ట్ర ప్రభుత్వం, పోలీసు అధికారుల సంగతి చెప్పనక్కర్లేదు. పందగంతా వారిదే కదా! కేంద్ర ప్రభుత్వ పోలీసు శాఖలోని ఉన్నతాధికారులూ దిగారని తెలిసింది.

కువ్వం (కూము) నదీ తీరంలో చింతాద్రిపేట ప్రాంతంలో ఉన్న ఒక గ్రంథాలయ భవనాన్ని మా కుట్రకేసు విచారణకు ప్రత్యేక న్యాయస్థానంగా మార్చారు. భవనం పరిసరాలలో పోలీసు బందోబస్తుతో మహాదుర్గమమయింది. ఆ ప్రాంతంలో పిట్టయినా వాలడానికి వీలులేదు.

మద్రాసు పౌరుల ప్రేమపాత్రుడు ప్రకాశం గారు. ఆంధ్రకేసరి ప్రకాశంగారి పేరు ప్రజల నిత్యజపమయింది. ప్రకాశం వంటి వారు కేసును చేపట్టిన తర్వాత ఎన్ని

గుండెలు బ్రిటిష్ ప్రభుత్వానికి – యువకులను, దేశం కోసం మంచిని ఆలోచించిన యువకులను శిక్షించడానికి – అన్న ఈసడింపు రాష్ట్రమంతటా వ్యాపించింది. విచారణ ప్రారంభ దినం 1933 సెప్టెంబర్ 8వ తేదీ: రానే వచ్చింది.

ఒకవైపు పోలీసు అధికారులు, మరొకవైపు రామమూర్తీ, మిత్రులూ : నన్ను విచారణ దినానికి ముందునాడే హెచ్చరించారు సిద్ధంగా ఉండమని.

స్పెషల్ మేజిస్ట్రేట్ కోర్టు విచారణ ప్రారంభమయింది. న్యాయస్థానం ప్రత్యేక రాజభక్తులతో కిటకిటలాడింది. డిఫెన్స్ పక్షం న్యాయవాదులు ఒకవైపు వరుసలో కూర్చున్నారు. ఎదుటి వరుసలో ప్రాసిక్యూషన్ పక్షం పబ్లిక్ ప్రాసిక్యూటర్, పోలీసు కమీషనర్, మొదలయిన వారు కూర్చున్నారు. నా మిత్రులు ఉక్కుటోపి/రిజర్వు పోలీసుల వ్యానులో వచ్చారు. నేను పోలీసు కాపలాతో ఒకచోట నిలబడ్డాను. కొన్నాళ్లపాటు ప్రాసిక్యూషన్ పక్షం కేసును వివరించిన తర్వాత, సాక్షుల విచారణ ప్రారంభమయింది.

మొట్టమొదటి ప్రాసిక్యూషన్ సాక్షిని నేనే. నేను బోనులో నిలుచున్నాను. నిందితులయిన నా మిత్రులందరూ నన్ను చూచి, జై రామచంద్రాజీ! అని కేకలు వేశారు. అది నాకు ఒక విధంగా 'ఒళ్లు దగ్గర పెట్టుకొని మసలరోయ్' అని హెచ్చరిక. ప్రకాశం గారు లేచారు. రంగు వెలసిన ఖద్దరు శాలువాను కుడిచేతితో సర్దుకున్నారు. ప్రకాశం గారి వేషభాషలను గురించి అదివరకే పత్రికలు వర్ణించాయి. దుబ్బు జుట్టుకు నూనె రాసి దువ్వారనీ; ఎప్పటిదో, నల్లకోటు వద్దనుకున్నారనీ, ధోవతి లాల్చీ రంగు వెలసిన ఖద్దరు శాలువాలతోనే కోర్టుకు వస్తున్నారనీ, ఇదనీ, అదనీ.

ఆయన లేచి నిలబడగానే ప్రాసిక్యూషన్ వర్గం భయకంపితమైంది. క్రిమినల్ కేసులలో ప్రకాశం గారంటే పోలీసులకు అదివరకే సింహస్వప్నం. ప్రాసిక్యూషన్ పక్షం నోటి తడి ఆరిపోయింది. స్పెషల్ మేజిస్ట్రేట్ ముఖం తెల్లబారింది. ఆయన లేచి ఛాంబరులోకి వెళ్లి దుస్తులు మార్చుకొని వచ్చారు. ఆయన పేరు మరచాను. ప్రకాశంగారు నన్ను క్రాసు పరీక్ష చేశారు. దాని సారాంశమిది. క్రమం గుర్తు లేదు.

"ఏమయ్యా? ఎక్కడ చదువుతున్నావ్?"

"మైలాపూర్ సంస్కృత కళాశాలలో నండి."

"ఏమి చదువుతున్నావ్?"

"సాహిత్య శిరోమణి అండీ"



"నీ దగ్గర రివాల్వర్లు అవీ ఉన్నయన్నారే పోలీసు వారు. నీవు రివాల్వర్లు ఎప్పుడయినా చూచావా? అవి ఎలా ఉంటాయి?

"........................"

"ధనుర్బాణాలు చదివి ఉంటావు కావ్యాలలో."

"ఔనండి."

"వాటినైనా చూచి ఉండవు"

"............................."

"పోలీసులు ఆరోపిస్తున్న కుట్ర సంగతి నీకు ఏమైనా తెలుసా?"

"కుట్రా! ఏమీ తెలీదండి."

ఇలా సాగింది క్రాసు పరీక్ష దాదాపు గంటసేపు. ప్రకాశంగారు నేను జవాబు చెప్పడానికి అవకాశమే ఇవ్వలేదు. ప్రశ్నా, జవాబూ ఆయనే ఏకపాత్రాభినయం చేశారు. పోలీసులు గుడ్లప్పగించి చూడడం తప్ప మరేమీ చేయలేకపోయారు. పోలీసులకు మరొకవైపు నా మీద గొంతు వరకు కోపం పొంగింది.

"యువర్ ఆనర్! ఏదో గురుకులంలో చదువుతున్న సంస్కృత విద్యార్థిని ఋషికుమారుడి వంటి వాడిని, చూడండి ఆ వేషం, నొసట మూడు నామాలూ, కృష్ణ చైతన్యులలాగ వేలాడుతున్న జుట్టు, ముతక వంగపండు రంగు ఖద్దరు పంచా, ఉత్తరీయం: నిందితులున్న తిరుచిరాపల్లి కారాగారంలో సత్యాగ్రహి అయి శిక్ష అనుభవిస్తూ వారితో పాటు ఉన్నాడన్న ఏకైక కారణంతో పోలీసులు తోలుకుని వచ్చి లేనిపోని ప్రతికూల సాక్ష్యాలిప్పించడానికి ప్రయత్నించడం ఏమి న్యాయం?" అని ప్రకాశం గారు మేఘ గంభీరనిస్స్వనంతో అన్నారు. నిందితులు, రాజభక్తులయిన ప్రేక్షకులు కూడా గొల్లుమని నవ్వారు. మేజిస్ట్రేటు ఇలా అప్రయోజక సాక్షిని తెచ్చినందుకు విసుక్కుంటూ నన్ను బోను దిగిపొమ్మని ఉత్తర్వుచేశాడు.

నేను ఆషాఢభూతి వినయంతో "అయ్యా! మేజిస్ట్రేట్ దొరగారు! నేను నిజం చెప్పాను. న్యాయస్థానం నుంచి వెలుపలికి అడుగుపెట్టిన వెంటనే పోలీసులు నన్ను శోధించకుండా తమరు రక్షించాలి. వారు కసితో ఏమి చేస్తారో ఏమోనని భయంతో సతమతమవుతున్నాను" అని విన్నవించాను.

"అలాంటి భయమేమీ లేదు. నీవు స్వేచ్ఛగా వెళ్లిపోవచ్చు" అన్నాడా దొరగారు.

"అలాటిది ఏమన్నా జరిగితే నాకు చెప్పు" అన్నారు ప్రకాశంగారు నా వైపు తిరిగి.

న్యాయస్థానం నుంచి వీధిలోకి అడుగుపెట్టాను. సరాసరి సంస్కృత

కళాశాలకు వెళ్లాను. నాకన్నా ముందే వెళ్లింది వార్త. విద్యార్థులందరూ నన్ను బెదురు చూపులతో చూచారు.

"నాయనా! నీవు పెద్ద తలైవర్ (నాయకుడివి). మేము సర్కారు గ్రాంటుతో సంస్కృత కళాశాల నడుపుతున్నాము. నీ బోటివాడు మా పాఠశాలలో ఉంటే గ్రాంటు నిలిచిపోతుంది. నీవు వేరే పాఠశాల చూచుకో" అని అన్నారు మా ప్రిన్సిపాల్ మహామహోపాధ్యాయ కరుంగుళం కృష్ణశాస్త్రిగారు. నా వల్ల అపరాధమేమి లేదని, నా వల్ల ప్రమాదమేమీ లేదని ఎంత బ్రతిమాలినా, ఆయన ఒప్పుకోలేదు. నేను కళాశాల నుంచి వెళ్లిపోవలసి వచ్చింది. ప్రతిచోట నీళ్లే గాని తాగడానికి ఒక్క చుక్కయినా లేదని – ఒకానొక ఆంగ్లకవి అన్నట్లు విశాల ప్రపంచం నా ముందు ఉన్నా, నాకు ధైర్యంతో సహాయం చేసేవారు ఎవరూ కనిపించడంలేదు. నా మిత్రులు కాశీభట్ట రామనాథ దత్త నా ముందుకు వచ్చినా, నేను అతనిని ఇరుకున పెట్టదలచలేదు. తక్కిన మిత్రులు శేషగిరిరావు, లక్ష్మణశాస్త్రి, ప్రెసిడెన్సీ కాలేజీలో సంస్కృతం ఎం.ఏ. చదువుతున్న ప్రముఖ దేశభక్తుడు, ప్రముఖ న్యాయవాది గుంటూరు భావనాచార్యులు గారి మేనల్లుడు మాడభూషి వెంకటాచార్యులు అడపాదడపా ధన సహాయం చేసేవారు. అయినా వాళ్లు విద్యార్థులు. ఎంతని చేయగలరు? నా పినతండ్రి గారి మామగారి ఇంటికి, మరికొందరు బంధువుల ఇళ్లకు; వెళ్లాను చుట్టపు చూపుగా.

"స్వామీ! మా ఇండ్లకు రావద్దు. మీ కేసు పత్రికలలో చదువుతున్నాము. పోలీసులకు విరుద్ధంగా సాక్ష్యం చెప్పావు. వాళ్ల నిఘాలో ఉన్నావు. మా ఉద్యోగాలు ఊడిపోవచ్చు గాక. మహానుభావ!" అని వేడుకున్నారు. అలాటి పిరికివారి గడప తొక్కడం నాకే అవమానం. నేను ఎక్కడ అడుగు పెట్టినా అనుమానంతో, భయంతో చూచేవారే. నా రక్తబంధువులు (మా అమ్మవేలు విడిచిన మేనమామ) కూడా నన్ను రావద్దన్నారు.

ఉదయమంతా తిరిగాను, పలువురి ఇళ్ల చుట్టూ కాలుకాలిన పిల్లిలాగ. ఆకలి. మిత్రులు ఇచ్చిన డబ్బుల్లో అణా మిగిలింది. బీచికి వెళ్లాను సాయంకాలానికి. కానీకి దోసెడు వేరుసెనగ పప్పు వచ్చేది. రెండు దోసిళ్ల వేరుసెనగ పప్పు తిన్నాను. ఇక రెండు కానులు మిగిలాయి. అలసిన మగతలో నిద్ర పట్టింది. నా సామానంతా చేతి సంచిలో వావిలాల మార్కు ఒక పంచ, ఉత్తరీయం, తువ్వాలే గనుక; ఆ సంచి

తలకింద ఉంది. గంట తర్వాత నిద్రలేచాను. మిగిలిన అరణాకు రెండు ఇడ్డెనలు తిన్నాను; డబ్బాలో పెట్టుకొని అమ్మే ఒక బ్రాహ్మడి వద్దకొని. ఇక దబ్బుతో నా సంబంధం తెగిపోయింది. జీవితం వ్యర్థమనిపించింది. ఆపాదమస్తకం – అంటే మెడవరకు ఒకసారి చూచుకున్నాను. చావడం మేలనిపించింది. సముద్రంలో మోకాళ్లు బంటి నీళ్లలో దిగి, అలలను తట్టుకుంటూ ముందుకు వెళ్ళుతున్నాను. వెనుక నుంచి ఎవరో లాగినట్టయి తిరిగి చూచాను. గంట పన్నెండని ప్రెసిడెన్సీ కాలేజీ గంట స్తంభం చూపింది. నన్నులాగిన వారిద్దరు బీట్ కానిస్టేబుళ్లు. నాకు వాళ్లను చూడగానే భయం కన్నా కోపం తలకెక్కింది.

"చావడాని క్కూడా మీ ఆటంకమా?" అంటూ గట్టిగా అరిచాను.

"ఔను... నడు, గట్టుకు!" అంటూ వాళ్లు లాక్కుపోయి రేడియో వినడానికి కట్టిన సిమెంటు అరుగుపై కూలవేశారు. ఇప్పుడు చెప్పు నీ సంగతి" అన్నాడు, వారిలో ఒకడు. అప్పుడు స్పృహలోకి వచ్చాను. మంగలం మీది నుంచి పోయిలోకి పడినట్టయిందని గ్రహించాను. హోటల్లో పనిచేయడానికి వచ్చాననీ, ఎక్కడా దొరక్క విసుగెత్తి చావబోయానని బొంకాను. వారు నా వేషం చూచి పాప్పార్ పయ్యన్ (బ్రాహ్మల పిల్లవాడు) నిజమే చెబుతున్నాడని నమ్మి; చావడం మంచిది కాదని, ఎవరి ఇళ్లకఅరుగులమీద పడుకోనివ్వరనీ, పోలీసులు లేవగొడతారని, పార్థసారధి గుడి మండపాలలో రాత్రి గడిపి తెల్లవారగానే హోటళ్లలో ప్రయత్నించమని, నీపై ఆత్మహత్య కేసు పెట్టి పోలీసు స్టేషనుకు నడిపించి లాకప్పులో వేయగలమని, కాని దయతలచి వదులుతున్నామని గంటసేపు నచ్చచెప్పి, తమ గొప్పగుణం చాటుకున్నారు. నా అదృష్టం. పత్రికల్లో నేను కోర్టులో సాక్ష్యమిచ్చిన ఫొటో పడింది. దానిని బట్టి గుర్తించవచ్చు నన్ను. తాటికాయంత అక్షరాలతో నా సాక్ష్యాన్నీ ప్రచురించారు పోలీసులకు ప్రతికూలం గనుక. కాని, రాత్రి అనుకోని పరిస్థితిలో నా వేషభాషలలో కృత్రిమత లేకపోవడం, ఆకలికి అలిసినట్టు కనిపించడం – ఇవన్నీ పోలీసులకు అనుమానించే అవకాశం ఇయ్యలేదనుకుంటాను.

మరుసటి ఉదయం పార్థసారథి కోవెల పుష్కరిణిలో స్నానం చేసి, కోవెల లోపలికి వెళ్లాను. ఏదో ఉత్సవం కాబోలు; ప్రసాదం పంచుతున్నారు. నేనూ గోష్ఠిలో నిలబడి చేతులు చాచాను. పెద్ద ముద్ద పులిహోర ప్రసాదం దోసిట్లో పడింది. కళ్లకద్దుకొని ఆరగించాను. కాలి నడకన ఆంధ్ర పత్రికా కార్యాలయం ఉన్న తంబుచెట్టి వీధికి బీచి

మార్గంలో బయలుదేరాను.

అక్కడ: మా బంధువులూ, నేను ఆనేగొంది నుంచి తిరుపతి రావడానికి ప్రేరకులూ, తిరుపతి పాఠశాలలో ఉపాధ్యాయ పదవి మాని కాశీనాథుని నాగేశ్వరరావు గారి ఆహ్వానంపై భారతి పత్రికలో సబ్ ఎడిటర్‌గా చేరిన తిరుమల వేంకట రంగాచార్యుల ఎదుట నిలుచున్నాను. ఏదో వ్రాసుకుంటూ తలెత్తి నన్ను హఠాత్తుగా చూచి ఆయన ఆశ్చర్యపడ్డాడు. 'ఆంధ్రపత్రిక'లో నేను ఉదయం నీ సాక్ష్యం చదివాను. నీవు మద్రాసు రావడం, మైలాపూర్ పాఠశాలలో చేరడం నాకు నీవు చెప్పనేలేదు. పేపరులో చదివి తెల్లబోయాను. ఇంతకూ ఇప్పుడెక్కడ ఉనికి? ..... అని ప్రశ్నల వర్షం కురిపించారు. నేను నా సంగతి చెప్పాను.

"ఈ కేసు ఇంతతో ముగియదు. రెండుమూడు నెలలయినా పడుతుంది. అంతవరకూ పరశువాకంలో నాతోపాటు ఉండు. ఆంధ్రపత్రిక ఎప్పుడూ పోలీసుల నిఘాలో ఉండేదే గనుక నాకేమీ భయం లేదు. అయితే ఒక షరతు. నీవు కేసు తీర్పు జరిగేవరకు ఎక్కడా తిరగరాదు. నాతోపాటు ఎప్పుడయినా భారతి కార్యాలయానికి రావచ్చు." అని అన్నారు ఆయన. నాకు తక్షణ సమస్య నిలువ నీడ. రెండవది తిండి. సరేనన్నాను. నా నుంచి ప్రత్యుపకారమేమి ఆయన కోరలేదు.

వేంకట రంగాచార్యులు గారన్నట్టు మా కేసు విచారణ స్పెషల్ మేజిస్ట్రేట్ కోర్టులో మూడు నెలలు జరిగింది. స్పెషల్ మేజిస్ట్రేట్ తన ఇష్టం వచ్చినట్టు పది, పదిహైదు, ఇరవై అని లెక్క పక్కా లేకుండా శిక్ష విధించాడు. కాని, జగన్నాథదాసు గారు హైకోర్టుకు అప్పీలు చేశారు. హైకోర్టులో న్యాయమూర్తి పాకెన్‌హామ్ వార్ష్ 1934 జనవరి 8న విచారణ ప్రారంభించారు. అది ఏప్రిల్ 24వ తేది వరకు జరిగింది. అందరి కన్న హెచ్చు శిక్ష నాలుగు సంవత్సరాలు ముకుందలాల్ సర్కార్‌కు పడింది. తక్కిన వారికి రెండు సంవత్సరాలు పడింది. కేసు దాదాపు పది నెల్లు జరిగింది. కనుక ఆ సమయాన్ని శిక్షలో కలిపారు. దానితో నిందితులలో సర్కార్ తప్ప తక్కిన వారంతా సంవత్సరం తిరగ్గానే విడుదలయ్యారు.

దౌర్జన్యవాది అనీ విప్లవకారుడనీ ముద్రవేసిన వాడికి ఆశ్రయమీయడం మహాసాహసమయిన ఆ కాలంలో మూడు నెలలు మూడు యుగాలుగా నన్ను కాపాడిన వేంకట రంగాచార్యుల వారి ధైర్యసాహసౌదార్యాలను ఏమని చెప్పగలను! ఎంత కృతజ్ఞత

తెలిపినా కొంతే అవుతుంది.

మా ఆయుర్వేద గురువులు చింతపల్లి సుబ్రహ్మణ్యం శాస్త్రిగారి చుట్టం డాక్టర్ సురభి సుబ్రహ్మణ్యం నాకు కూడా పరిచితుడే. ఆయన చాకలిపేటలో గొప్ప డాక్టర్. ఆయన బంధువొకరు ఉన్నత పోలీసు అధికారి. ఆయన సురభి సుబ్రహ్మణ్యం ద్వారా నాకు వర్తమానం పంపారు. సాధ్యమయినంత త్వరలో మద్రాసు వదిలిపొమ్మనీ, పోలీసులు మరో కేసు పెట్టి నన్ను అరెస్టు చేయదలచారనీ ఆ వర్తమానం. పోలీసుల్లోనూ నాకు సానుభూతి చూపే వారున్నందుకు సంతోషించాను. కాని ఎక్కడికి వెళ్లడం? మూడు నెలలుగా వేంకటరంగాచార్యుల వారి ఇంట్లో ఉన్నాను. ఆయనను ఇక ఎక్కువకాలం కష్టపెట్టరాదని నిశ్చయించుకున్నాను. అప్పుడు నా మనస్సు విరిగే ఒక దుర్ఘటన జరిగింది.

"రాజసేవా మనుష్యాణామ్<br>
అసిధారావలేహనమ్<br>
పంచానన పరిష్వంగో<br>
వ్యాళే వదన చుంబనమ్"

(మానవులకు రాజసేవ కత్తి వాదరను నాకడం వంటిది. సింహాన్ని కౌలిగించుకోవడం వంటింది. పెంటిపామును ముద్దు పెట్టుకోవడం వంటింది.)

# 46

# దయామయుడు డాక్టర్‌దాసూరావ్

"ధనాని జీవితం చైవ
పరార్థే ప్రాజ్ఞ ఉత్సృజేత్
తన్నిమిత్తో పరం త్యాగః
వినాశే నియతే సతి"

(వివేకవంతుడు పరుల కోసం ధనం, జీవితం వినియోగించాలి. వినాశం తప్పదు గనుక పరుల కోసం త్యాగం చేయడం ఉత్తమం.)

**మా** కుట్రకేసు విచారణ జరుగుతుండగా, నా యోగక్షేమాలు తెలుసుకొనడానికి కుంటి రామమూర్తి మొదలైన వారు అప్పుడప్పుడు పరశువాకంలో నేనున్న వేంకటరంగాచార్యుల గదికి వచ్చేవారు. నేనూ, ఎప్పుడయినా వెలుపలికి వెళ్లి నా మిత్రులను కలుసుకునే వాడిని. నా ఆశ్రయదాతకు ఇది నచ్చలేదు.

ఒకరోజు రాత్రి నేను పదకొండు గంటలకు గదికి వచ్చాను. ఆకలి దహించుకొని పోతూంది. వేంకట రంగాచార్యులను పలకరించాను. ఆయన నిద్రపోతున్నట్లు నటిస్తూ పలకలేదు. మేల్కొన్న వాడిని లేపలేము గదా! నా ప్రవర్తన ఆయనకు నచ్చలేదని గ్రహించాను. రెండు కారియర్లు ఉన్నాయి. ఎత్తి చూచాను. తేలికగా ఉన్నాయి. వాటిని తెరిచాను. రెండుమూడు పిడికిళ్ల కన్నా ఎక్కువ లేదు అన్నం. ముగ్గురం తినే దాన్ని ఇద్దరూ తినేశారన్నమాట. మూడోవాడు ఆయన తమ్ముడు

వీరరాఘవాచార్యులు. ఎల్.ఐ.ఎం. చదివేవాడు. పులుసు, కూరలు కొద్దిగా మిగిలాయి. అన్నీ కలిపాను. కసికొద్దీ తిన్నాను. చిన్ననాడు చదివిన పంచతంత్రంలోని గంగదత్తుడనే మండూకం కథ జ్ఞాపకం వచ్చింది.

"బుభుక్షితః కిం న కరోతి పాపం
క్షీణాః జనాః కాపురుషా భవంతి"

(ఆకలి గొన్నవాడు ఏ పాపకార్యమయినా చేస్తాడు. మానవులు దారి ద్ర్యంతో దుర్మార్గులవుతారు.)

నిజం, అంతే! కారియర్లు ఉన్నాయి. అవి ఉచ్ఛిష్టమైనా సిగ్గూ శరమూ లేకుండా బాముకున్నాను. ఇవి లేకపోతే దొంగతనానికీ తలపడే వాడినేమో! పరిస్థితి అది, మరుసటి దినం ఇక ఇక్కడ ఉండరాదని అప్పటికప్పుడే నిర్ణయించుకున్నాను. పోలీసు అధికారి కూడా నన్ను ఊరు వదలమంటున్నాడు గదా!

ఉదయం లేవగానే నా చేతి సంచి భుజానికి తగిలించుకున్నాను. వస్తానని వేంకటరంగాచార్యులు గారికి చెప్పాను. ఆయన ఈ పరిణామానికి కొంత ఆశ్చర్యపడినా, కోపం ఇంకా తగ్గలేదనిపించింది. 'ఎక్కడికి?' అని మాట వరుసకు పలకరించారు. "ఈ ఊరు వదులుతున్నాను" అన్నాను. ఆయన మౌనంగా ఉన్నారు. నేను సరాసరి మాడభూషి వెంకటాచార్యులు హాస్టలు గదికి వెళ్లాను. నా పరిస్థితి చెప్పాను. అతడు పది రూపాయలు ఇచ్చాడు. అప్పుడు మద్రాసు నుంచి హోసపేటకు చార్జీ ఐదు రూపాయలని గుర్తు. బళ్లారికి టికెట్టు కొని రైలెక్కాను.

బళ్లారి రైలు స్టేషనులో దిగి, ధర్మవరం కృష్ణమాచార్యుల బంగ్లా కాంపౌండు వైపు నడుస్తున్నాను. నన్నొక హెడ్ కానిస్టేబుల్ రైలు దిగినప్పటి నుంచి అనుసరిస్తున్నాడని నాకేం తెలుసు? పత్రికలో నా ఫొటో చూచి ఉంటాడు. విజిల్ ఊదాడు. ఇద్దరు పోలీసులు వచ్చి నన్ను చెరొక రెక్క పట్టుకొని, "నడవండి టౌన్ పోలీస్ స్టేషన్‌కు" అన్నారు మర్యాదగానే. హెడ్ కానిస్టేబుల్ విజయగర్వంతో ముందుకు నడిచాడు.

పోలీస్‌స్టేషన్ చేరాము. హెడ్ నన్ను ఇన్‌స్పెక్టర్ ముందు నిలబెట్టి, ఎంతో కాలంగా పోలీసులకు కావలసిన ఆసామీ దొరికాడని సవినయంగా మనవి చేశాడు. ఆయన నన్ను ఎగాదిగా చూచి, నా వేషానికి నవ్వుతూ, "ఎవరో రామాలయం పూజారిని పట్టుకు వచ్చావేమయ్యా? " అని అడిగాడు.



**కారులో, స్టీరింగు వద్ద: డాక్టర్ దాసూరావు; కారు ముందువైపు చివర అప్పటి బళ్లారి కలెక్టర్.**

హెడ్ కళ్లు పెద్దవి చేసి, "కాదు సార్, అదే సార్, ఔను సార్. అదేదో మద్రాసు మోటారు కేసు సార్, బడా ఆసామీ సార్. మన పోలీసోళ్లను మాయ చేశాడు సార్" అన్నాడు. "ఏమి మోటారు కేసయ్యా? ఈ స్వాములను చూస్తే మోటారెక్కే ఆసామిగానే కనబడడే?" అన్నాడు హేళనగా; ఇన్‌స్పెక్టర్. నా గుండె కొట్టుకుంటూంది. హెడ్ అవస్థ చూడలేక కుట్రకేసు అని అందిద్దామా అన్నంత జాలి కలిగింది మరొక వైపు. ఇన్‌స్పెక్టర్ నన్ను ప్రశ్నించి, వివరాలు తెలుసుకొన్నాడు. "ఎక్కడికి పోతాడులే - బంగ్లా కాంపౌండుకే గదా! కేసు పేరు గుర్తు రాగానే పట్టుకోవచ్చులే. వదలి వేద్దాం" అని హెడ్‌తో అన్నాడు. హెడ్ నా వైపు చూస్తూ, "ఇప్పుడు తప్పించుకొన్నావు సరే; ఎక్కడికి పోతావు" అన్నట్టుగా తలపంకించాడు.

నేను నా ఉద్వేగాన్ని పైకి పొక్కనీయకుండా, నిదానంగా బంగ్లా కాంపౌండ్ వైపు నడిచాను. అక్కడ మా పినతండ్రిగారితో రెండు నిమిషాలు మాట్లాడాను. నా రాక సుడిగాలిలా బంగ్లా కాంపౌండంతా వ్యాపించింది. వాళ్ల దృష్టిలో నేనొక వీరుణ్ని. నా చుట్టూ మూగారు. ఈ పరిస్థితిలో హెడ్ కానిస్టేబుల్ వచ్చాడు అంటే కొంప మునుగుతుందని నేను గబగబా రెండు మెతుకులు కొరికి బస్సులో హోస్పేటకు బయలుదేరాను. బస్సు ఛార్జీ రెండణాలు.

మా తాతగారూ నాయనగారూ : అదివరకే, పోలీసులకు, దౌర్జన్యవాది

అయిన నాకు తమతో సంబంధం లేదని తెలిపారు గనుక, కమలాపురానికి పోదామా, వద్దా: అనే విచికిత్సలో పడి బస్సుస్టాండులో తారట్లాడుతుండగా ఒక అపూర్వ వ్యక్తితో పరిచయమయింది. జేబులో స్టెతస్కోపు, భుజానికి తగిలించుకొన్న తుపాకి; వెంట ఎందరో పరిజనం. నన్ను ఆయన చూచారు. నా వేషం విచిత్రంగా కనిపించిందేమో! దగ్గరికి వచ్చారు. వెనుక ఉన్నవారు "డాక్టర్ దాసూరావు గారు! కమలాపురం డాక్టరుగారు!!" అన్నారు నాతో. ఆయన పేరు ఇది వరకు నేను విన్నాను గనుక నేను నమస్కరించి ఫలానా అని చెప్పాను. "అరెరె! మీరేనా?" అంటూ కౌగిలించుకున్నారు. తన వెంట ఉన్న వారిని పరిచయం చేసి, "రండి పోదాం, కారులో. మీ ఇంటికి వెళ్లవచ్చు. మీ బంధువులను, మిత్రులను చూడవచ్చు" అంటూ వారి పేర్లు ఏకరువు పెట్టారు. జాగీర్దార్ తోళప్పాచార్యులు, బాణగిరి సింగరాచార్యులు, బెళగల్ గుండాచార్యులు, జలాలుద్దీన్, ఆనేగొంది రాజులు రాజా శ్రీదర్బారు కృష్ణదేవరాయలు, తిరుమల దేవరాయలు, శ్రీ వేంకటదేవరాయలు, మణూరు వెంకోబాచార్, హనుమాన్‌సింగ్, సీతారాం సింగ్, గౌదర కృష్ణమూర్తి, ప్రబంధ రంగాచార్యులు, జూటూరు చంద్రప్ప, రంగారి హనుమంతు, రంగారి నరసింగప్ప, ఈశ్వరయ్యనవరు, కరణం వాసుదేవరావు, రాజారాం సింగ్...."

"ఎందుకు ఇందరి పేర్లు?" అనడిగాను. "మీరు వస్తే, వీళ్లంతా మీ కుట్రకేసును శ్రద్ధగా చదువుతున్న వారు; వాళ్లను చూడవచ్చు. కొంత గోష్ఠి జరుపవచ్చు" అన్నారు ఆయన. "అయ్యా! ఇప్పటికే పోలీసులు వెంటాడుతున్నారు. మన ఊరికి వస్తే లాకప్పులో పడడమే తరువాయి"అన్నాను. పోలీసుల భయమేమీ మీకు వద్దు. కలెక్టరు, పోలీసు సూపరింటెండెంట్ మన మిత్రులు" అన్నారు ఆయన.

నేను వెళ్లడానికి నిరాకరించాను. ఎంత మిత్రులయినా, పోలీసుల దృష్టిలో పడడం మంచిది కాదనిపించింది. రైలు స్టేషన్‌కు వెళ్లి, వెళ్లడానికి సిద్ధంగా ఉన్న ఏదో రైలెక్కాను. అది ధార్వాడ రైలు. ధార్వాడ స్టేషనులో దిగి అటూ ఇటూ తిరిగి, గుంతకల్లు మీదుగా మద్రాసు చేరుకున్నాను. మద్రాసు చేరే వరకు డాక్టర్ దాసూరావు గారే మనసులోను, కళ్ల ఎదుటా; ఉన్నారు.

వాగ్భటుడు చెప్పిన వైద్య లక్షణాలన్నీ నిండుగా ఉన్న వ్యక్తి దాసూరావు గారు. వైద్యుణ్ని చూడగానే రోగికి – ఇక భయం లేదు. మనకు ఆరోగ్యం చూకూరుతుంది – అనే విశ్వాసం కలగాలి అంటాడు వాగ్భటుడు. దాసూరావు గారు అలాటి వారిలో

అగ్రగణ్యులు. సదాచార సంపన్నుడయిన సౌమ్యమూర్తి. కాని, ఆచారం తమ వరకే. జాతి, మత, కుల భేదాలు పాటించేవారు కారు. దాసూరావుగారి చల్లని దయామయమైన పలుకులకు రోగి సంపూర్ణంగా ఆరోగ్యవంతుడు అయ్యేవాడని ప్రథ.

దాసూరావు 1906 మే 6వ తేదీన జన్మించి ఎల్.ఎమ్.పి పట్టా పుచ్చుకొని కమలాపురానికి వచ్చారు. వైద్యులుగా, అమృతహస్తులుగా పేరు పొందారు. 82 సంవత్సరాల సంపూర్ణ జీవితం గడిపారు. ఎందరికో ఆయువు పోశారు. పురుళ్లు పోశారు. 1988 సెప్టెంబరు 3వ తేదీన దివంగతులయ్యారు. ఆయన సతీమణి రమణమ్మ గారు 1996 మే 23న దివంగతులయ్యారు. ఆయనను గురించి నా మిత్రుడు బాణగిరి శ్రీ కృష్ణమాచార్యులు నాకు మద్రాసులో ఎన్నో కథలు చెప్పారు. దాసూరావుగారి కుమార్తె శ్రీమతి నిప్పాణి లక్ష్మిగారు ఇటీవల తమ తండ్రిగారి ఔదార్యాన్ని గురించి, వేటను గురించి ఎన్నో ఉదంతాలు తెలిపారు.

ఆయన రెండు గుళ్ల తుపాకీని మెడకు తగిలించుకొని, సైకిలుపై తిరిగేవారు. చిరుతపులులను, మొసళ్లను, ఎలుగుబంట్లను వేటాడే వారు. చిరుత కూనలను, మొసలి పిల్లలను సాకేవారు. పాములనయితే తోక పట్టుకుని దూరానికి విసిరివేసే వారు. ఇంటి నిండా పులిచర్మాలు, ఎలుగుబంటి చర్మాలు, మొసలి చర్మాలు వేలాడుతుండేవి. బళ్లారి జిల్లాలో గృహనిర్బంధంలో ఉన్న పన్నారాజుతో కలిసి వేటాడేవారు.

వైద్యుడుగా ఆయన ప్రజలకు దేవుడు. బీద రోగులకవిషయంలో అపార దయ చూపేవాడు. పేద రోగులకు తన ఇంట్లో భోజన, నివాస వసతి కూడ కలిగించే వారు. అర్ధరాత్రి వచ్చి తలుపు తట్టినా రోగులకు మందు ఇచ్చేవారు విసుగు అన్నదే లేకుండా. మరుసటి ఉదయం రోగి ఇంటికి వెళ్లి మందు పనిచేసిందా లేదా అని విచారించేవారు.

ఆనేగొంది ఆవల తుంగభద్ర ఒడ్డున మధ్వ సిద్ధాంతభక్తి మార్గ ప్రచారకులయిన యతీశ్వరుల తొమ్మిది సమాధులున్నాయి. వాటిని 'నవబృందావన' అని వ్యవహరిస్తారు. ఒకమారు ఉత్తరాది మఠం స్వామి ఒకరు, కమలాపురానికి విజయం చేసి నవబృందావనంలో ఆరాధన చేయాలనుకున్నారు. అప్పుడు తుంగభద్రకు భయంకరమైన వరదలు. ఆ వరదలలో హరిగోలును (పుట్టిని) నడపడానికి ఎవరూ

సాహసించలేదు. దాసూరావు గారు ఆ సాహసానికి పూనుకున్నారు. స్వామివారిని హరిగోలులో కూర్చోబెట్టుకొని, నవబృందావనం తీసుకువెళ్లి ఆరాధన చేయించి భద్రంగా కమలాపురం చేర్చారు. స్వామి వారు దాసూరావు గారిని "హనుమంతుడవయ్యా నీవు" అని ఆశీర్వదించారు.

ఆయన నిరంతర సంచారవైద్యుడు. వైద్యాలయం కూడా. అవసరమైన మందులతో సైకిలు ఎక్కి గ్రామాలు తిరిగే వారు. కనుకనే దాసూరావు డాక్టరంటే ఆబాలగోపాలానికి ఎరుకే. బళ్లారి జిల్లాలోని ఆయన బంధువుల కంతా ఆయన ఇల్లు ప్రసూతి శాల. సుప్రసిద్ధ చలనచిత్ర నటి శ్రీమతి జమునగారు కమలాపురంలో దాసూరావు గారింట 1936లో జన్మించారు. కేవలం బంధువర్గానికే కాదు. గర్భిణుల కందరికీ ఆయన ఇల్లు ప్రసూతిశాలే. పేదల వద్ద ఒక్క దమ్మిడీ కూడ తీసుకోడం ఎరగరు దాసూరావుగారు.

నిజాం రాజ్యంలో రజాకార్ దుండగాలు ప్రబలినప్పుడు – ఆనేగొంది రాయచూరు జిల్లాలోనిది గనుక నిజాం రాజ్యంలో చేరినట్టిది. రజాకార్లు అక్కడా-దుండగాలు ప్రారంభించారు. ఆనేగొంది రాజకుటుంబం ఎదిరించిందిగాని, తట్టుకోలేకపోయింది. ఆనేగొంది రాజకుటుంబం వైద్యులయిన దాసూరావు గారు హోంగార్డ్సు దళాలు ఏర్పాటుచేసి వారికి తుపాకి శిక్షణ ఇచ్చి, ఆనేగొందిని, రాజ కుటుంబం వారి కోట్ల విలువయిన నగలకట్టును రజాకార్ల బారి నుంచి రక్షించారు.

డాక్టర్ దాసూరావు దయామయులు. ఉదారులు; అయినా, వృత్తి ధర్మంలో కచ్చితంగా ఉండేవారు. నా మిత్రులు బాణగిరి శ్రీ కృష్ణమాచార్యుల స్వాను భవం ఒకటి తెలిపారు. "నేను పురాతత్త్వ శాఖలో పని చేసేవాడిని గదా! ఒకమారు ఒక మెడికల్ సర్టిఫికెట్టు కావలసి వచ్చింది. తేదీ మార్పు అవసరమయింది. వెనకటి రోజు తేదీతో సర్టిఫికెట్టు ఇమ్మన్నాను. అంత సన్నిహితులుగా ఉన్నా అలా ఇవ్వడానికి నిర్దాక్షిణ్యంగా నిరాకరించారు. అది వైద్యవృత్తికి విరుద్ధమని గట్టిగా చెప్పారు."

ఒకానొక వ్యక్తి పాముకాటుకు గురి అయ్యాడు. మరొక డాక్టర్ వద్ద వైద్యం చేయించుకొన్నాడు. ఆ డాక్టరుకు కావలసిన మందు లేదు. "దాసూరావుగారి వద్ద ఆ మందు ఉంది. ఆయన ఆ మందు ఇచ్చినా సరే, నాకు మందు పంపినా సరే నేను వైద్యం చేస్తాను." అని డాక్టర్ దాసూరావు గారికి కబురు పంపారు. "నేను

మందిస్తే ఆయన ఇచ్చిన మందుకు విరుద్ధం కావచ్చు. నా చికిత్స పద్ధతి ఆయన చికిత్స పద్ధతి వేరు. కనుక నా వద్ద ఉన్న మందుకమరొక వైద్యునికి ఇయ్యను. ఇది వైద్య వృత్తి ధర్మానికి విరుద్ధం. ఇది నా సిద్ధాంతం, నియమం." అని ఖండితంగా జవాబు చెప్పారు దాసూరావుగారు.

దాసూరావుగారు దైవభక్తులు. సుశీలులు, నిరాండబరులు. గాంధీ మతానుయాయులు, బస్సుస్టాండులో ఉన్న ఒక కుష్ఠరోగికి దినమూ అన్నం పెట్టేవారు. తర్వాతనే భోజనం చేసేవారు.

దాసూరావు గారికి నలుగురు కుమారులు, ఐదుగురు కుమార్తెలు. ఒక కుమారుడు కమలాపురంలోనే తండ్రి గారి వైద్య వృత్తిని నిర్వహిస్తున్నాడు. ఒక కుమార్తె సినిమా నటి శ్రీమతి జమున గారి తమ్ముని భార్య. దాసురావుగారి సతీమణి రమణమ్మగారు కృష్ణదేవరాయల ఆముక్తమాల్యదలో వర్ణించిన విష్ణుచిత్తుని భార్యే.

మా నాయనగారు కూడా మద్రాసుకు వచ్చినపుడు ఏదో సందర్భంలో డాక్టర్ దాసూరావుగారి గుణగణాలను, చికిత్స నిరతిని, ఆర్తుల ఎడల వారికి గల దయను ప్రశంసించారు. ఆయన వైద్యోనారాయణో హరిః - అనే సూక్తికి అక్షరాల ఉదాహరణం. (ఈ విషయాలు నేను తర్వాత తెలుసుకున్నవి)

నేను మద్రాసు సెంట్రల్‌లో దిగాను. కాని, ఎక్కడికి వెళ్లడం? మహాబిం కంగా వెంకటరంగాచార్యుల గది వదిలాను గదా! మరి అక్కడికి వెళ్లదలచుకోలేదు. విడిగా ఉండడానికి గది కావాలి. కనీసం మూడు రూపాయల అద్దె పెట్టనిదే గది రాదు. భోజనానికి ఏడు రూపాయలు నెలకు. కనీసం పది రూపాయల సంపాదన అవసరం. రెండు మూడు నెలల అద్దె చేతులో ఉంటే, గది తీసుకొని, గదిలో పడి ఉండవచ్చు. మూడు రూపాయలంటే మాటలా? స్నేహితులను అడుగరాదని నిశ్చయించుకున్నాను. డబ్బు విలువ అప్పుడు తెలిసింది.

ఈ ఆలోచనల జీమూతాలలో మెరుపులా మెరిసింది ఒక భావన. మా పినతండ్రి ప్రథమ కళత్రం పెత్తండ్రి కుమార్తె కోమల గుర్తుకు వచ్చింది. తండ్రి ఆరావమదు అయ్యంగారు. ఏదో పెద్ద ఉద్యోగమే చేసి ఉపకార వేతనం పొంది నెల్లూరులో ఉండేవాడు. స్టోనుహావుసుపేటలోని ఆయన ఇంటికి అప్పుడప్పుడు పండుగలకు, పబ్బానికి వెళ్లేవాడిని. కోమల కాన్వెంటులో ఎస్.ఎస్.ఎల్.సి చదివింది. తెలుగు తమిళ సాహిత్యాలలో మంచి

ప్రవేశం ఉంది. నాతో స్వేచ్ఛగా ఎన్నో సంగతులు చర్చించేది. ఆరావమదు అయ్యంగారు ఒక దశలో కోమలను నాకు ఇవ్వాలనుకుని ఆమె ఎదుటే నన్ను కదిపారు. కోమలకు నేను పెద్ద శూరుణ్ని, వీరుణ్ని. "నాకు దూర సందు లేదు. ఈ డోలును మెడకు ఎక్కడ కట్టుకోను?" అన్నాను. ఇద్దరూ నవ్వేశారు.

మరోమారు కోమలే అడిగింది. అప్పుడు నేనన్నాను: "ఏమి చూచి నన్ను కోరుతున్నావు? నీ అంతస్తూ, నా అంతస్తూ అతికేనా? నీ తాత బరోడా దివానుగిరీ చేశారు. మీ నాన్నగారు పెద్ద ఆఫీసరు. నేను నీ కన్నా ఎక్కువ చదివిన వాడిని కాను. అందమా.... నీ ఎదుట దిష్టి బొమ్మను. సంపాదనా? వారాలు!" అన్నాను. కోమల నవ్వి "ఇవన్నీ చెప్పక! మా తండ్రి ఇచ్చే దాంతో పదేళ్లు బతకవచ్చు. ఆలోగా నీవు పైకి రావా? నీవు గొప్పవాడిని అవుతావని నాకు నమ్మకం. నీవు ఏ పని చేసినా నాకు ఇష్టమే" అన్నది. "నేను విప్లవచర్యలు, వారాలలో ఉన్న వాడిని, లేనిపోని ఆశలు మాని మంచి సంబంధం చూడమను నాన్నగారిని. నేనెప్పుడూ నీ హితం కోరుతుంటాను." అన్నాను. మొగం ఇంత చేసుకున్నది.

అయ్యంగారు మంచి సంబంధం చూచారు. వరుడు రంగస్వామి. మద్రాసు లా కాలేజీలో లైబ్రేరియన్. అందగాడనే అనాలి. వివాహం నెల్లూరులో జరిగింది. నేను వెళ్ళాను. నాకు పాదాభివందనం చేస్తూ, "నీవు కాదన్నావు. వారికి వచ్చింది పరమాన్నం" అన్నది నాకు మాత్రమే వినబడేట్లు. "పిచ్చిదానా! మంచి సంబంధం. హాయిగా కాపురం చేయి, మంచి పిల్లలను కను. ఆ పిల్లలను గొప్పవాళ్ళను చేయి" అని దీవించాను.

ఒక నవ్వు నవ్వింది.

ఆ నవ్వు గుర్తుకు వచ్చింది. వెస్టుమాంబళంలో ఆమె సొంత ఇల్లు. నంబరు చూచాయగా గుర్తుంది. అయినా, లా కాలేజీ లైబ్రేరియన్ అంటే ఎవరయినా, చెబుతారు. అనుకొని 'నంబరు టు' బస్సు (నడకతో) ఎక్కి వాళ్ల ఇల్లు చేరాను. సెంట్రల్ నుంచి కనీసం ఐదారు మైళ్లకు తక్కువ లేదు. తొమ్మిది గంటలకు చేరి ఉంటాను. రంగస్వామి నన్ను చూచి ఆశ్చర్యంతో "మీ కేసు హైకోర్టుకు వచ్చిందే." అని కుశల ప్రశ్న చేశారు. "వెళ్లాలి. ఎలెక్ట్రిక్ ట్రెయిన్ పట్టుకోవాలి" అన్నాడు. "ఒక్కసాయం కోసం వచ్చాను" అన్నాను. విషయం చెబుతున్నాను. 'అడీ! కోఁవళా! పారుడీ' ఉంగరామచంద్రన్ ఎన్నమో కేక్కరార్, సాప్పాడు, సాయిచ్చి కుడుత్తు అనుప్పు' అంటూ వెళ్లిపోయాడు. (మీ

రామచంద్రన్ ఏమిటో అడుగుతున్నాడు. భోజనం పెట్టి ఇచ్చి పంపు)

కోమల లోపలి నుంచి 'యారూ?' అనుకుంటూ వచ్చి ఆశ్చర్యానందాలతో నన్ను చూచి స్వాగతం పలికింది. మునుపటి చిలిపితనం స్థానంలో గాంభీర్యం కనిపించింది. స్నానపానాదుల తర్వాత "ఎంత కావాలి?" అని అడిగింది. "పది చాలు గది అద్దెకు" అన్నాను. "సర్వమూ ఇస్తానన్నాను. నువ్వు కాదన్నావు. ఇదిగో ముప్పయి తీసుకో. నీ జీవితానికి నా పెట్టుబడి" అంటూ ఒక వెండి పళ్లెంలో మూడు పది రూపాయలనోట్లు పెట్టి నా ముందుకు జరిపింది. బస్సు ఛార్జీకి చిల్లరా ఇచ్చింది. వైష్ణవ సంప్రదాయం ప్రకారం సేవించింది. (నమస్కరించింది) "మంచి మొగుడు, పెద్ద ఉద్యోగం, సొంత ఇల్లు... సామాన్య గృహిణి కోరేవన్నీ నీకు ఉన్నాయి. పాత ఆలోచనలను మాని హాయిగా, గొప్ప ఇల్లాలుగా ఉండు" అని నిష్కల్మషంగా ఆశీర్వదించి బయలు దేరాను. ఆ పెట్టుబడి ఋణం తీర్చనేలేదు. కోమల ఎక్కడుందో! ఎక్కడున్నా గొప్ప ఇల్లాలే!.

**జాతిర్యాతు రసాతలంగుణగణః తత్రాప్యధో గచ్ఛతాం**
**శీలం శైల తటాత్ప తత్వభిజనః సందహ్యతాం వహ్నినా**
**శౌర్యే వైరిణి వజ్రామాశునిపత త్వర్థోస్తు నః కేవలం**
**యేనైకేన వినా గుణాః తృణలవ ప్రాయాస్సమస్తా ఇమే**

**(జారి, పాతాళంలో పడనీ, గుణాలు అంతకన్నా అడుక్కుపోనీ, శీలం కొండమీద నుంచి కిందకి దొర్లిపోనీ, వంశం మంటల్లో పడికాలిపోనీ, శౌర్యమనే ఈ శత్రువుపైన పిడుగు పడనీ, వెంటనే! డబ్బు ఒక్కటే చాలు; అది లేకపోతే పైన చెప్పిన గుణగుణమంతా గడ్డిపోచతో సమానం!)**

(47)

# కూటి కోసం కోటి విద్యలు

"అస్య దగ్ధోదరస్యార్థే
కిం న కుర్వంతి పండితాః
వానరీ మివ వాగ్దేవీం
నర్తయంతి గృహే గృహే"

**(ఈ పాడు పొట్ట కోసం పండితులు ఏ పనిచేయరు.? వాగ్దేవిని కోతిని ఆడించిననట్లు ఇల్లిల్లూ తిప్పి ఆడిస్తున్నారు.)**

**ము**ప్పయి రూపాయలు. కోమల ఇచ్చిన ముప్పయి రూపాయలు. ఎంత పెద్ద మొత్తం! పదకొండు రూపాయల నెల జీతంలో ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుడు నలుగురు పిల్లలతో తాను, భార్యా సుఖంగా గడిపే కాలమది. ఒక గుమాస్తా సవిలాసంగా పత్నీ సహితంగా జీవితం గడిపే కాలమది. నెలకు పది రూపాయలు వాడుకున్నా మూడు, నెలలు సుఖంగా గడపవచ్చు. మూడు నెలల్లో ఏదైనా పని చూచుకోవచ్చు.

పని చూసుకోడమా? ఏమి చూచుకుంటాను, నా ముఖం! నాకు డబ్బు సంపాదించే ఏ యోగ్యత ఉంది? "బి.ఏ.లు హోటలులో కప్పులు కడుగుతున్నారు. ప్రాచ్య పట్టభద్రులు పౌరోహిత్యంలో జీవితం వెళ్లమారుస్తున్నారు. నీకు గుమాస్తా కావడానికి అర్హత లేదు; ఉపాధ్యాయుడు కావడానికా, యోగ్యత లేదు. చేతి పనులు ఏవైనా వచ్చా? కనీసం పౌరోహిత్యం చేయగలవా? లేదు. మరి ఎట్లా బతుకుతావు?"



అని ప్రశ్నించింది అంతరాత్మ. నేను మూలిగాను అవమానంతో. అయినా చూద్దాం - అనుకున్నాను. మూణ్ణెల్లు గడుస్తాయి గదా అనే మొండి ధైర్యంతో. ఈ ధైర్యం వెలుగులో పోలీసులూ మరుగయిపోయారు.

పరశువాకంలో శరవణ మొదలి వీధిలో (అని గుర్తు) రెండు రూపాయలకు గదిన్నర అద్దెకు తీసుకున్నారు. గదిన్నర అంటే ఒక పంచ, దాని వెనుక గది. పోలీసు లైన్‌లాగా వరుసగా పది పన్నెండు ఇళ్లు. పంతుళ్లు, పురోహితులు, గుమాస్తాలు కాపురం ఉన్నారు. సాధారణంగా అలాటి వాడలలో బ్రహ్మచారులకు అద్దెకీయరు. కాని, నా వేషం, భాష నమ్మకం కలిగించాయేమో! గది దొరికింది. ఇరుగుపొరుగు వారు నన్ను ఆశ్చర్యంతో చూచారు. కూరగాయలు మార్కెటు నుంచి వచ్చిపట్టు ఒక సంచీతో దిగంగానే.

ఆనాడు పంకజ విలాస్ హోటలులో ఏడు రూపాలయకు అరవై భోజనం

టికెట్లు కొన్నాను. నెలపాటు భోజనం సమస్య ఉండదు. గదికి రెండు రూపాయలు అద్దె ముందుగా చెల్లించాను. బయానా (అడ్వాన్స్) అడగలేదు. ఇరవై ఒక్క రూపాయలు మిగిలాయి. ఆ పూట రాత్రి భూశయనం చేశాను గదిలో. ఉదయం లేవగానే ఉమ్మడి స్నానాల గదిలో కొళాయి కింద స్నానం చేశాను.

ఇరుగు పొరుగు వారు వచ్చారు. నెమ్మదిగా యోగక్షేమాలు అడగడానికి. నేను కుట్రకేసు మినహాగా అంతా నిజమే చెప్పాను. గదిలోకి తొంగి చూచారు, "అయ్యవార్లంగారి నట్టిల్లు. ఏం చేస్తారు?" అనడిగారు "ఏమీ లేదు, చూడాలి" అన్నాను. "సంస్కృతం, తెలుగు ట్యూషన్లు చెప్పండి, మేము కుదురుస్తాము. తలా రెండు రూపాయలిస్తారు. సుఖంగా గడిచిపోతుంది" అన్నారు ఉపాధ్యాయులు. "మా దుకాణంలో గుమాస్తాలు అవసరం. పది రూపాయలు ఇచ్చేట్టు చూస్తాను. మీరు థర్డ్ ఫారం అయ్యారు గదా లెక్కలు చాలు" అన్నారు ఒక గుమాస్తా సోదరుడు. వారి అవ్యాజ ప్రేమను, మధ్య తరగతి సాహాయ్య చికీర్షను మెచ్చుకుంటూ, సరేనన్నాను. కాని, నాకు అప్పటి నుంచే డబ్బు తీసుకుని చదువు చెప్పడం ఇష్టం లేదు. మరి ఉపాధ్యాయవృత్తో అంటారు గదూ? అది సంస్థల సేవ అని సమాధానం.

గదికి తాళమేమీ లేదు. సామాను ఏమైనా ఉంటే గదా బాధ్యత. చిలుకు పెట్టి, పని వేటకు బయలుదేరాను. ఒక లక్ష్యం ఉందా? (ఇప్పటికీ జీవిత లక్ష్యం కనిపించలేదే!) ఏదో తిరిగాను. దగ్గరే ఎగ్మూరులో మ్యూజియం. దానిని చూడడానికి వెళ్లాను. అక్కడ అమరావతీ శిల్పశాల ఉంది. రంగస్వామి సరస్వతిగారు కనుగొన్న అమరావతీ, నాగార్జున కొండల దిబ్బల శిల్పాలు కొన్ని లండనుకూ, విదేశీ రాజధానులకు తరలిపోగా మిగులూ బొగులూ మద్రాసు మ్యూజియంలో భద్రపరచామని ఆయనే చెప్పగా విన్నాను. కనుక, అమరావతీశాల ప్రవేశించాను. అక్కడ మందహాస సుందరమైన బుద్ధశిరస్సు ఒకటుంది. దానిని చూస్తూ నిలుచున్నాను కొంచెం సేపు.

మ్యూజియం చూడడానికి వచ్చిన వాళ్ళలో ఒకరు నాతో "ఇక్కడ చచ్చిన కాలేజీలో తాళపత్ర గ్రంథాలయం ఒకటుందట, మీకు తెలుసా?" అని అడిగారు. మ్యూజియంను చచ్చినకాలేజీ అని, జూపార్కును బతికిన కాలేజీ అని వ్యవ హరించేవారు. చిన్నప్పుడు రెండు మూడుసార్లు మద్రాసుకు వచ్చినా తాళపత్ర గ్రంథాలయం సంగతి నాకు తెలియదు. కుతూహలం కలిగింది. "రండి, నాకూ తెలియదు, తెలుసుకుందాం" అని అతనితోపాటు బయటికి నడిచాను.

ఈ తాళపత్ర గ్రంథాలయాన్ని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం, ప్రాచ్య లిఖిత పుస్తకాలయం అని తెలుగులోను, ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ అని ఇంగ్లీషులోను అంటారు. ఇది మ్యూజియం వెనుకవైపు ఉన్న పొడుగాటి విశాలమయిన కట్టడం. దీనిని మొదట్లో ఆంగ్లేయులు బార్‌గాను, బాల్‌రూమ్ నృత్యశాలగాను వాడేవారట. తర్వాత కొన్నేళ్లకు ఈ లిఖిత పుస్తక గ్రంథాలయం మద్రాసు విశ్వవిద్యాలయ గ్రంథాలయ భవనానికి మారింది.

నేను అతనితోపాటు ప్రాచ్య లిఖిత గ్రంథాలయంలో ప్రవేశించాను. అదొక సరస్వతీ నిలయం. సంస్కృతాంధ్ర, కన్నడ, తమిళ, మలయాళ, పారసీ, అరబ్బీ, ఉరుదూ. హిందీ, మహారాష్ట్ర గ్రంథాలు, ముప్ఫయి వేలకు పైగా ఉన్నాయన్నారు. భారతదేశంలో అంతటి లిఖిత పుస్తకాలయం లేదన్నారు. సంస్కృతాంధ్ర, కన్నడ, తమిళ, మలయాళ భాషలకు చెరి ఇద్దరు పండితులూ, పారసీ, అరబ్బీ, ఉరుదూ భాషల కొక విద్వాంసుడూ ఉన్నారు. మూలప్రతి నుంచి ప్రతులు వ్రాసే వారు పది పన్నెండుగురు కనిపించారు. వారు గ్రంథ (తమిళనాడులో సంస్కృత గ్రంథాలు వ్రాయడానికి వాడే లిపిని గ్రంథ లిపి అంటారు.) తెలుగు, కన్నడ, మలయాళ లిపులలో ఉన్న సంస్కృత గ్రంథాలను దేవనాగరి లిపిలో వ్రాస్తున్నారు. తెలుగు గ్రంథాల లేఖకులూ ఉన్నారు.

నాతో వచ్చిన వ్యక్తి తెలుగు పండితులను చూడాలని వారిని గురించి ప్రశ్నించాడు. ఒక అటెండర్ ఆయనను చూపించాడు. (అటెండర్‌ని అప్పుడు ప్యూన్ అనేవారు) ఆ వ్యక్తి "మీరూ రండి, చూద్దురు గాని!" అని నన్నూ ఆయన వద్దకు తీసుకపోయాడు. ఆయన పేరు బులుసు వెంకటరమణయ్యగారు. ఆయన వ్యాసాలను, పద్యాలను నేను మా ఇంటికి క్రమం తప్పకుండా వచ్చే 'భారతి' సాహిత్య మాసపత్రికలో చదివాను. ఆయనకు నమస్కారం చేసి "మీ రచనలు చదివాను" అని ప్రశంసాపూర్వకంగా అన్నాను.

ఆయన ప్రసంగవశాన "నేను ఇక్కడ తాత్కాలికంగా పని చేస్తున్నాను. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఇక్కడ సీనియర్ తెలుగు పండితులు. వారు రెండు నెలలు సెలవులో ఉన్నారు. నెల గడిచింది. ఇక నెలలో వస్తారు" అన్నారు. నేను ఆశ్చర్యంతో నోరు తెరుచుకొని ఉండిపోయాను. "భారతి మాసపత్రికలో తొలి సంచికలో 'శివకవులు' అనే వ్యాసం, తర్వాత శాసనాలను గురించి వ్రాస్తున్న ప్రభాకరశాస్త్రిగారేనా ఆయన?"

అని ఆశ్చర్యంతో పెగిలీ పెగలని మాటలతో తొందర తొందరగా అడిగాను. "ఔను, వారే" అని వెంకటరమణయ్యగారు ముక్తసరిగా సమాధానమిచ్చి, నా వెంట వచ్చిన వ్యక్తితో మాట్లాడి ఆయనను పంపివేస్తుండగా నేనూ లేచాను.

వెంకటరమణయ్యగారు "కూర్చోండి" అన్నారు. నేను కూర్చున్న తర్వాత నా వివరాలు అడిగారు. నాకు ప్రభుత్వోద్యోగులంటే, కొంత భయం; ఏదైనా పోలీసులకు అందిస్తారేమోనని. అయినా ఏం పోయింది. చదువు గురించే కదా, తెలుపుదాం - అనుకుని నా అర్హతలు తెలిపాను. "మరేం లేదు. వారం క్రితం భారతి కార్యాలయానికి వెళ్లాను. అక్కడ టి.వి.రంగాచార్యులు గారు మీ లైబ్రరీలో కాపీయిస్టులు (చూచివ్రాత వాసే వారు) కావాలా అని అడిగారు. ఉంటే పంపండి. వెలుపలి నుంచి ప్రతుల కోసం చాలా మంది అడుగుతున్నారు. అలాటి వారికి పరిచయం చేస్తాను అని అన్నారు. "మీ వైష్ణవ వేషం చూచి, ఇంటి పేరు చూచి ఆయన తాలూకేమో అనుకున్నాను. ఒక కాపీయిస్టు అవసరం ఉన్నాది (విశాఖ యాస). మీకు ఇష్టమయితే సీనియర్ పండిట్ వి. కృష్ణమాచార్యులు గారితో మాట్లాడుతాను. ప్రభాకరశాస్త్రిగారు వచ్చినాక ధ్రువపరుస్తారు. అంతవరకూ పనిచేస్తూండండి. మీ నాగరి, తెలుగు దస్తూరీ నమూనాలు కావాలి. రెండు తెల్లకాయితాలు ఇస్తాను. నాగరీ, తెలుగులలో ఈ పుస్తకంలోవి వ్రాయండి" అంటూ ఒక తెలుగు లిపిలో ఉన్న తాటాకు పుస్తకం నా ముందుకు తోశారు.

బులుసు వెంకటరమణయ్యగారి అవ్యాజప్రేమకు ఆనందబాష్పాలు కురిపించాను. వేంకటరంగాచార్యులకు మనస్సులోనే మరిన్ని నమస్కారాలు పెట్టాను. ఇలాటి పెద్ద మనిషికి నా కేసు విషయాలు మరుగు పరచడం న్యాయం కాదనిపించింది. చెప్పాను. ఆయన ఏ మాత్రమూ కలత పడకుండా "ఇదేమీ సర్కారు నౌకరీ కాదు. చూచి వ్రాత కాంట్రాక్టు పని. వంద అనుష్టుప్ శ్లోకాలకు ఐదు రూపాయలు వ్రాత కూలీ. ముప్పయి రెండు అక్షరాలున్న శ్లోకాన్ని గ్రంథం అంటారు. అదీ ఇక్కడ లెక్క. మీ స్వవిషయం అక్కరలేదు మాకు. పోలీసులు వస్తే కాంట్రాక్టు పని అని చెబుతాము. ఇంతకూ ఇది తాటాకుల పుస్తకాల లైబ్రరీ. మరో లోకం. పోలీసులు రారు. వచ్చినా, మిమ్ముల్ని గుర్తుపట్టరు. గుంపులో మీ పని మీరు చేసుకపోండి. శాస్త్రిగారు వచ్చినాక వారికీ ఈ సంగతి చెప్పండి. మీ కేసు హైకోర్టుకు పోయింది గదా. రెండు మూడు

నెలల్లో తేలిపోతుంది. కాని ఒక్క సంగతి. ఇక్కడ వారికెవరికీ మీ సంగతి చెప్పకండీ" అన్నారు హెచ్చరికగా.

వెంకటరమణయ్యగారు ఆ ప్రేమను జీవితాంతం చూపారు. నేనూ వారూ కలిసి 1962 ప్రాంతంలో లలిత విస్తర పురాణాన్ని అనువదించి, ధారావాహికంగా ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధంలో ప్రచురించాము.

అటూ ఇటూ తిరిగి పంకజ విలాస్‌లో భోజనం చేసి రాత్రి తొమ్మిది గంటలకు గది చేరాను. అప్పటి మద్రాసు హోటళ్లు సంగతి, తత్రాపి పంకజ విలాస్ సంగతి కొంత చెప్పాలి. మద్రాసు తెలుగు, కన్నడ, తమిళ, మలయాళ ప్రాంతాలకు ఉమ్మడి రాజధాని కనుక ఆయా ప్రాంతాల నుంచి వచ్చిపోయే జనం విపరీతంగా ఉండేది. కనుక హోటల్లో విపరీతమైన భోక్తృసమ్మర్దం, కొన్ని హోటళ్లలో బ్రాహ్మణులకు లోపల విడిగాను, పట్టుబట్టలు కట్టనిచ్చి వడ్డించేవారు. వ్యంజనాలలో తెలుగు, తమిళుల వంటకాలూ ఉండేవి. రెండు కూరలు, కూట్టు, పప్పు, పెరుగు పచ్చడి, పులుసు (పప్పు పులుసు), చారు, పెరుగు, గోంగూర, ఆవకాయ, మామూలు రుబ్బుడు పచ్చడి, పండుగ దినాలలో వడ, పరమాన్నం, దీపావళికి లడ్డూ (తమిళనాడులో ఆశ్వీయుజమాసానికి సెనగ మొదలయిన అపరాలు పండుతాయి గనుక బూందీ లడ్డూ దీపావళికి తప్పనిసరి), మజ్జిగ పులుసు, వెత్తకొళంబు (పప్పులేని వరుగుల పులుసు) కోసుంబరి – ఇట్లా లెక్క వేస్తే – 14 వ్యంజనాలు సాధారణ దినాలలో. నెయ్యి అడిగి నప్పుడల్లా వేసేవారు. ఇది విడిగా పూటకు మూడణాలు. నెలసరి ఏడు రూపాయలు. ఇక ఫలహారాలలో ఏ తీపి పదార్థమయినా అణా మించదు. కానీకి దోసెడంత ఇడ్లీ. రెండు కాసులకు రెండు ఇడ్లీ. అర్ధకప్పు కాఫీ, అరవున్నుకు తక్కువ లేనిది అర్థణా. కప్పు ముక్కానీ. కడుపు నిండిపోయేది ఉదయం ఫలహారం.

నేను గది చేరే వేళకు దాని రూపురేఖలే మారిపోయాయి. ఒక కొత్త చాప, తలగడ, దుప్పటి, మంచినీటి కూజా, రెండు ఇత్తడి గ్లాసులు – అప్పటికి జర్మన్ లోహం చిలుము పట్టనిది ఉందిగాని, స్టెయిన్‌లెస్ స్టీల్ రాలేదు. ఒక లాంతరు, నిప్పు పెట్టె, ఒక్క ఇత్తడి బకెట్టు, చెంబు దర్శనమిచ్చాయి. పక్కింటి రుక్మిణి అనే పదేళ్ల అమ్మాయి దీపం ముందు చదువుతూంది. నా గదేనా ఇది – అనే సందేహం కలిగింది నాకు. ఇంతలో ఇద్దరు ముగ్గురు పెద్దలు వచ్చారు. 'మన్నిక్కణుం (మన్నించాలి) కొంత

స్వతంత్రంగా వ్యవహరించాము. నిన్న మీరు నేల మీద బారుగా పడుకోడం, కొళాయి కింద స్నానం చేయడం చూచి ఇవన్నీ అత్యవసరమని కొన్నాము. తాళం కూడా కొన్నాము" అన్నారు సంకోచిస్తూ. నా తుంగచాప రెండణాలు, తలగడ పావలా, దుప్పటి అర్థ రూపాయి, కూజా అర్థణా, ఇత్తడి గ్లాసులు రెండణాలు, లాంతరు రూపాయి. నిప్పుపెట్టె కానీ, ఇత్తడి బకెట్టు రూపాయి, చెంబు పావలా, మొత్తం మూడు రూపాయల ఆరణాలు. తాళం అర్థ రూపాయి. నేను ఆశ్చర్యా నందాలతో వాళ్లను చూస్తున్నాను. "మీ వద్ద డబ్బు లేకపోతే పరవాలేదు. ఉన్నప్పుడు ఇయ్యండి. రేపు ఖద్దరు స్టోరుకు వెళ్లి రెండు హాఫ్ ఆరమ్‌లు అర్థ రూపాయకు, చెప్పులు మంచివి అర్థరూపాయికి కొందాం. అన్నీ చేరి నాలుగూ పద్నాలుగణాలు" అన్నారు.నా మూలధనం ఐదు రూపాయలు : కరిగి పోయాయి. ఇరవయ్యొక్క రూపాయల్లో ఐదు పోతే పదహారు రూపాయలు మిగిలాయి. నెలపట్టుగా ప్రతి వ్రాత సాగిస్తే పదిహేను రూపాయలకు తక్కువ వుండదు రాబడి. ఎక్కి తక్కి. మహాతల్లి, కోమల ఎంత మంచి మనస్సుతో ఇచ్చిందో! కళ్లు మూసుకుని మనస్సులోనే వేయి విధాలుగా కృతజ్ఞత తెలిపాను.

నా జీవనయాత్ర ప్రారంభమయింది. నేను ప్రాచ్య లిఖిత పుస్తకాల యానికి రెండునాళ్ల తర్వాత వెళ్లాను. నా దస్తూరీని పరిశీలించి పై పండితులు, లైబ్రేరియన్ ఆమోదించడానికి వ్యవధి ఉండాలని నేను రెండు నాళ్ల తర్వాత వెళ్లాను. నేను గ్రంథాలయంలో ప్రవేశించి వెంకటరమణయ్యగారికి నమస్కారం చేశాను. "రండి, రండి. మీ కోసమే ఎదురుచూస్తున్నాను. ఒక గిరాకీ ఉన్నాది. గుజరాత్ ప్రాంతంలో గోండాల్ అనే నగరం ఉంది. దానిలో గోండాల్ ఆయుర్వేద అనుసంధానాలయ అనే పేర ఆయుర్వేద పరిశోధన సంస్థ ఉన్నాది. (ఇప్పుడది పేరు మారి ఉండవచ్చు, లేకపోనూ వచ్చు) ఆ సంస్థ ప్రతినిధి ఒకరు వచ్చారు. వారికి తెలుగు, కన్నడ, మలయాళ లిపులలో ఉన్న ఆయుర్వేద సంస్కృత గ్రంథాలన్నింటికీ దేవనాగరి లిపిలో ప్రత్యంతరం కావాలట. నాగరీ లిపిలో వ్రాయడానికి చాల మందే ఉన్నారు. మీకు జీవిక అవసరం కదా! ఆ ప్రతినిధి ఒక గంటలో వస్తారు. మీరు మాట్లాడి ఒప్పుకోండి, లైబ్రరీ రేటు ప్రకారం చెల్లిస్తారు డబ్బు. వారు కోరిన పుస్తకాలకు కావలసిన మొత్తం మా వద్ద ఉంచుతారు. మేము మీకు చెల్లిస్తాము. మోసానికి అవకాశం ఉండదు" అన్నారు.

నేను ఆ పెద్దమనిషి కోసం వేచి ఉన్నాను. ఆయన వచ్చారు. నమస్కారం

ప్రతినమస్కారాల తర్వాత ఆయన "కయా భాషయా ఆవయో,  ఆలాపః?" (మనం ఏ భాషలో మాట్లాడుకోవాలి) అని ప్రశ్నించాడు. (యయా కయాపి భాషయా' (ఏ భాష అయినా సరే) అని అన్నాను. అతడు కనుబొమలెత్తి (అయితే హిందీ వచ్చా?") అన్నారు. అర్థం కాకపోతే సంస్కృత భాష ఆపద్బాంధవిగా ఉండనే ఉంది గదా! అన్నాను ఆయన నవ్వాడు; సంస్కృతాన్ని ఆపత్కాల భాష అన్నందుకు!

దాదాపు ముప్పయి ఆయుర్వేద గ్రంథాలకు ప్రతులు వ్రాయవలసినట్టు తేలింది. ఏడెనిమిది వందల రూపాయలు లైబ్రరీ అధికారులకు అప్పగించారు. నేను ప్రతి వ్రాసి మూలగ్రంథంతో మరొకరి సాహాయ్యంతో సరిచూసి తైపారుచేసి లైబ్రేరియనుకు అప్పగించడమేమిటి, ఆయన అక్షరాల సరాసరి లెక్కించి బిల్లు సిద్ధపరచడమేమిటి, డబ్బు చెల్లించడమేమిటి - రెండేళ్ళకు సరిపోయిన పని. నిశ్చింత. అయితే, నా సహజ చంచలమయిన మనస్సు నిలకడగా ఉండాలి, అంతే!

కొన్నాళ్లు గడిచింది. (కొన్నాళ్ల కాలం గడిచింది అనేది లక్షణార్థం గనుక ఈ ప్రయోగం చాల ప్రాంతాలలో వ్యవహారంలో ఉంది) నా గదికీ, లైబ్రరీకి దాదాపు మైలు. నడిచిపోయి వస్తున్నాను. లైబ్రరీ ఉన్న ఎగ్మూరు (ఎళుంబూరు) ప్రాంతంలోనే గదికి ప్రయత్నిద్దామనుకున్నాను. కాని, నేనున్న గది పరిసరాల ప్రేమ ప్రవాహాన్ని దాటి పోవడానికి మనస్సు ఒప్పుకోలేదు. కాని, నాతో పాటు లైబ్రరీలో సహలేఖకుడుగా ఉన్న గృహస్థు ఒకడు కొత్తకాపురం పెట్టదలచి మీ ప్రాంతంలో గదేమైనా ఉందా అని అడిగాడు. నాకు ఎగ్మూరులో గది దొరికితే నాదే ఇప్పిస్తానన్నాను. అతడు దాని కోసం కాచుక్కూచున్నాడు.

ఒకమారు పక్కింటి అమ్మాయి రుక్మిణి అన్నది "మామా, మామా? ఇవ్వళవు నీళముడి - ఇంత పొడుగుజుట్టు, ఆడవాళ్లక్కూడా తలంటుకోవాలన్నా, శిరస్నానం చేయాలన్నా కష్టం. చక్కగా మా అన్నలాగ క్రాపు చేయించుకోరాదూ!" తమిళనాడులో మామ అని సంభోదించడం ఆత్మీయతకు, గౌరవానికీ చిహ్నం. నీవు నా పుట్టింటి వాడివి సుమా, చెడు తలపులు వద్దు అనే హెచ్చరిక కూడా ఉంది అందులో. వైష్ణవులలోను 'మామా' అని సంబోధించే సంప్రదాయం ఉంది. పెద్దలను నడివయస్సు దాటితే 'తాతా'!

"అమ్మో! నేనా క్రాపు చేయించుకోడమా? మా అమ్మ ఏమంటుంది?

నాన్నగారు ఏమంటారు?" "ఆఁ ఏమీ అనరు. కొన్నాళ్లు కోపంతో మూతి ముడుచుకుని ఉంటారు. మా నాన్నగారూ అలాగే చేశారు. తర్వాత సరిపోతుంది. అంతగా అయితే మార్వాడీలాగ క్రాపులో ఒక పిలక కలపండి" అన్నది. ఆలోచించాను. నాకూ కష్టంగానూ ఉంది. తలంటు గొడవ. క్రాపు చేయించేశాను. ధైర్యంగా ఈ సంగతి మా అమ్మకూ వ్రాశాను. కానీ కార్డులో ఆమె నుంచి జవాబు వచ్చింది. "ఎట్లాగూ నిన్ను వదులుకున్నాం గదా, దౌర్జన్యవాది అని! మీ తాతగారూ, నాన్నగారూ కొంచెం కష్టంపడ్డారు. గోష్పాదమంత శిఖ ఉంటే సరిపోయేది గదా! అయినా, ఇప్పుడు నీవు స్వతంత్రుడివి. స్వాతంత్ర్యాన్ని దుస్సహవాసంతో దుర్వినియోగం చేసుకోవనే మా నమ్మకం. విచక్షణత గల నీకు ఇంతకన్నా ఎక్కువేం వ్రాస్తాను?" అని ఆ జవాబు సారాంశం. దానిని అనువదించి చెప్పాను రుక్మిణికి, "మరేం పరవాలేదు." అంటూ నవ్వి వెళ్లిపోయింది.

నేను ఈ చిన్నపిల్ల మాట విని "జుట్టు తీసివేయడమేమిటి? ఊరి నుంచి వచ్చిన జవాబును వినిపించడమేమిటి?" అని ఆలోచించాను. నా అంతరాల్లో జుట్టు తీసివేయాలనే భావం ఉంది. దానికి ఒక గడ్డిపోచంత ఆలంబనం దొరకాలి. ఒక పద్ధతిలో ఉన్న వాడికి పెద్దలు అంటే ఇరుగు పొరుగు పెద్దలు మనకెందుకులే అని ఎలాటి హితాలు, అహితాలు చెప్పరు. రుక్మిణి చిన్నపిల్ల. తన అన్న అనుభవం చూచింది. నాలో అంతరంగంలో ఉన్న భావానికి ఆమె సలహా నాకు నైతిక బలం చేకూర్చింది. నా భావమే ఆమె మాటల రూపంలో మళ్లీ నా మెదడుకు తాకింది. దీనికి మనస్తత్త్వశాస్త్రజ్ఞులు ఏదో అంటారు. ఇది కేవలం వెంట్రుకలకు సంబంధించిన చిన్న సమస్య కాదు. ఒక సంస్కృతిని, సంప్రదాయాన్ని అతిక్రమించడం, అందులోనూ ఎంత అభ్యుదయ భావాలున్నా, వేషభాషల్లో మార్పును అంతగా అంగీకరించని నా పెద్దలను తిరస్కరించడమే గదా! నిజానికి వెంట్రుకలకూ, వాటి కింద మెదడులో ఉన్న భావాలకూ ఎలాంటి సంబంధమూ లేదు. అంత పెద్ద సంస్కర్త గాంధీజీ శిఖను తీసి వేశాడా? ఆధునిక వేషంతో ఉన్నవారు, ఎందరు వేయ్యేళ్లు వెనుకబడి ఉండడం లేను? అలాటి వారిని ఆంధ్రప్రభలో నా సహోద్యోగి పున్నావఝుల సీతారామబ్రహ్మం గారు 'కడుపులో పిలకున్న వాళ్లు" అనే వారు నవ్వుతూ.

నెల గడిచింది. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు సెలవు ముగించి వచ్చారు. నేను వారిని దర్శించాను. వెంకటరమణయ్యగారు నా సంగతి ముందుగానే చెప్పారు గనుక కోప్పడకపోయినా, ప్రసన్నత చూపలేదు. ఆయన పూర్తిగా గాంధీ మతాను

యాయులు కనుక నా యెడల అప్రసన్నత సహజమే. "ఇప్పుడలాటివేమీ లేవుగదా." అన్నారు. తల అడ్డంగా ఊపాను. 'బాగా పనిచేసుకో. నీ పని తప్ప మరేదీ వద్దు; పక్కవాళ్లు ఆరా తీస్తారు...' అని హెచ్చరించారు, తల నిలువుగా ఊపాను. చెప్పడం మరచాను. నేను భారతి మాసపత్రికలోని వారి వ్యాసాలు చదివి ఎలా ఊహించు కున్నానో అలాగే ఉన్నారు ఆయన. అదే గాంభీర్యం. అదే మితభాషిత్వం, అదే కరుణాతరంగితమైన చూపు.

ప్రభాకరశాస్త్రి గారు నన్ను పరిశీలనలో (అబ్జర్వేషన్‌లో) పెట్టినట్టున్నారు. రెండు మూడు నెలలపాటు నా పనితీరు చూస్తూ, నా నడవడి చూస్తూ నాపై ఎవరయినా ఏమయినా అంటారేమోనని గమనిస్తూ ఉన్నారని నాకు తోచింది. ఇంతలో 1934 ఏప్రిల్ నెలలో మా కేసుపై తీర్పు వచ్చింది. మద్రాసు హైకోర్టు ఎడ్వకేట్లుగా బచ్చు జగన్నాథదాసుగారు, ప్రకాశంగారూ, శాస్త్రిగారికి బాగా పరిచితులే. శిక్ష పడిన మిత్రులందరినీ పెనిటెన్షియరిలో మద్రాసు సెంట్రల్ జెయిలులో ఒకమారు చూచి వచ్చాను. కేసు తీర్పుతో గుండెమీద నుంచి, మనస్సు మీద నుంచి ఒక బండరాయి తొలగించినట్టయింది. తర్వాత నేను క్రమంగా స్వేచ్ఛగా తిరగడానికి సాహసించాను. శాస్త్రిగారికి సన్నిహితుడిని అయ్యాను. నా ప్రవర్తనలో మార్పు గుర్తించిన శాస్త్రిగారు నన్ను ఇంటికి రమ్మన్నారు. ఒక రాట్నం ఇస్తూ "ఇది మూలబడింది. నీవు ఉపయోగించుకో. నీ జీవితచక్రం కూడ మారుతుంది" అన్నారు. రాట్నంతో నా గది చేరాను. దానిని స్వాయత్తం చేసుకున్నది రుక్మిణి. కొన్నాళ్లకు ఆ వీధికే నేను అపర గాంధీనయ్యాను. వీధిలోని ఖద్దరు అభిమానులందరూ ఇంటికి వచ్చి, రుక్మిణి చెప్పుచేతల్లో నూలు వడికి వెళ్లేవారు. ఆనాటి రుక్మిణి ఆరు దశాబ్దాలు గడిచినా, అప్పటి మనస్తత్వంతోనే ఉంది. నేటికీ, భర్తృహరి చెప్పిన సాయంకాలపు నీడలాంటి పవిత్రమైత్రితో.

**"కి మకారి న కార్పణ్యం**
**కస్యాలంఘున దేహలీ**
**అస్య పాపోదరస్యార్థే**
**కి మనాటి న నాటకమ్"**

**(ఈ పాపిష్టమైన పొట్టకోసం చూపని నీచత్వం ఏదీ? తొక్కని గడప ఏదీ? ఆడని నాటకం ఏదీ?)**

# 48

# ప్రభాకరులప్రభావం

"యోగేన చిత్తస్య పదేన వాచాం
మలం శరీరస్య చ వైద్యకేన!
యో పాకరోత్ తం ప్రవరం మునీనామ్
పతంజలిం ప్రాంజలి రానతో స్మి!!"

**(వ్యాకరణ మహాభాష్యం అధ్యయనం చేసేవారు ప్రారంభంలో ఈ ధ్యాన శ్లోకం పఠించడం పరిపాటి. పతంజలి మహర్షి మనోమాలిన్యం తొలగించడానికి యోగసూత్రాలు, భాషా దోషాలు తొలగించడానికి మహాభాష్యం, శరీర వ్యాధులు తొలగించడానికి వైద్యక గ్రంథాలు రచించారు. ఈ విధంగా మనో వాక్కాయాల మలాలను పోగొట్టారు. ఆ మునిశ్రేష్ఠునికి నమస్కరిస్తున్నాను.)**

**ఈ** విధంగానే ఇరవయ్యో శతాబ్ది పూర్వార్థంలో యోగ. వాఙ్మయ, చికిత్స ప్రపంచంలో ప్రభాకరులుగా వెలుగొందిన వారు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. అంత గొప్ప విద్వాంసుని వద్ద నేను పుస్తకం పట్టుకొని పాఠంగా చదివిందేమీ లేదు. ఒకసారి బాలవ్యాకరణం చెప్పండని కోరాను. ఆయన నవ్వి, "కౌముది చదువుకున్న వాడికి ఒకరు చెప్పక్కర్లేదు తెలుగు వ్యాకరణం. వ్యాఖ్యానాలున్నాయి. సందేహాలు వస్తే అడుగు" అన్నారు. అప్పటి నుంచి ఆయనను ఏమీ అడగకపోయినా, ఆయన సంభాషణలు,

చర్చలు, రచనలు, ప్రవర్తన నాకు చాల బోధించాయి. కనుక ఆయనకు నేను ఏకలవ్య శిష్యుణ్ని.

ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీలో నా పని సాగిపోతూంది. నాకు డబ్బు చాలా అవసరం గనుక కచ్చితంగా ఐదు గంటలు పనిచేసి, దినానికి సరాసరి పదిహేను పదారు పుటలు వ్రాసేవాడిని. కనీసం రూపాయి గిట్టుబాటు కావాలన్నది నా లక్ష్యం. కాని, నెలకు ఇరవై రూపాయలు వస్తే చాలు. అనుకొని తక్కిన సమయాన్ని నా జ్ఞానాభివృద్ధికి వినియోగించుకొనే వాడిని. శాస్త్రిగారు నా ప్రవర్తన పరవాలేదని నమ్మకం కలిగిన తర్వాత "సాయంకాలం లైబ్రరీ నుంచి వెళ్లిన తర్వాత ఏం చేస్తావు?" అని ఒకమారు ప్రశ్నించారు. నాకు చిన్నప్పటి నుంచి సాయంకాలాలు పనిచేయడం గిట్టేది కాదు. రాత్రులు, తెల్లవారుజాము నాకిష్టమైన పఠనకాలాలు. కనుక ఆ సంగతే చెప్పాను. "అయితే సాయంకాలాలు; తీరిక, ఇష్టం ఉన్నప్పుడు నాతోపాటు మా యింటికి రా" అన్నారు.

ఒక సాయంకాలం వారింటికి వెళ్లాను వారితో కలిసి. మేము ఇల్లు చేరే వరకే చాలా మంది చేరి ఉన్నారు. పొడుగాటి పంచలో చాపలపై కూర్చున్నాం. శాస్త్రిగారు అప్పుడు తిరువల్లిక్కేణిలో సముద్రతీరానికి సమీపంలోని వెంకటరంగం పిళ్ళయి వీధి నాలుగో నంబరు ఇంట్లో ఉండేవారు. వీధిగేటు దాటగానే బయలు, ఆతరువాత అడ్డంగా పొడుగాటి పంచ. ఎదురుబదురుగా ముప్పయి మంది కూర్చోవచ్చు. కూర్చున్న వారంతా వారి దుస్తులను బట్టి వారు పెద్ద ఉద్యోగులనే తెలుస్తూంది. కొందరు స్త్రీలూ ఉన్నారు. నన్ను కూర్చోమన్నారు శాస్త్రిగారు. నేను ముంగిట్లోని కొళాయి వద్ద కాళ్లు, చేతులు కడుక్కుని కూర్చున్నాను. శాస్త్రిగారు లోపలికి వెళ్లి పది నిమిషాల తర్వాత వచ్చి, నా వరుసలో కూర్చున్నారు. నన్ను అందరికి పరిచయం చేశారు. "ఈయన మా లైబ్రరీలో కాపీయిస్టు. పేరు వీరభద్రాచార్యులు." అని. నేను "రామచంద్రాచార్యులు" అని సవరించాను. "అదేనండి, పెద్దలు పెట్టిన పేరు రామచంద్ర. చేసిన చర్యలు వీరభద్రునివి" అని శాస్త్రిగారు నవ్వుతూ అన్నారు. నేను ఊరుకున్నాను.

ఆరు గంటల సమయం. అందరూ చేతులెత్తి నమస్కారం చేసి, కళ్లు మూసుకొని కూర్చున్నారు. నేను అందరినీ చూస్తున్నాను. నన్ను నమస్కారం చేయమని ఎవరూ చెప్పలేదు. నేను చేయలేదు. ఆ ప్రార్థన సమయంలో ఆవులించేవారు, తుమ్మే

వారు, దగ్గేవారు, అపాన వాయువులు వదలేవారు, బ్రేవుమని తేన్చేవారు, పడుకొని పొర్లాడేవారు, కేకలు వేసే వారు, నవ్వేవారు. విధవిధాలుగా చేష్టలు, నేను చూస్తున్నాను. పదిహేను ఇరవై నిమిషాలకు అందరూ మరొక మారు చేతులెత్తి నమస్కరించి కళ్లు తెరిచారు. కొంచెం సేపు ఆనాటి దేశపరిస్థితిని, ప్రార్థనలో పాల్గొన్న వారి జబ్బులను గురించి చర్చించి, వెళ్లిపోయారు. నేనొక్కణ్ణే మిగిలాను. ఆయన నన్నేమీ అడగలేదు. నేను ఏమీ చెప్పలేదు. శాస్త్రిగారు నా వైపు తిరిగి "సుందరమూర్తి (ఆయన జ్యేష్ఠ పుత్రుడు) ఇంటర్‌లో సంస్కృతంలో తప్పాడు. నీవు సెలవుల్లో వచ్చి, ఏదో నాటకం ఉంది, అది అతనికి చెప్పు" అన్నారు. సరేనన్నాను. అలాగే చెప్పాను. మృచ్ఛకటికమో, ప్రతిమా నాటకమో - గుర్తులేదు (ఆయన ఆ పరీక్షలో నెగ్గాడు. బి.ఎస్.సి.లో చేరాడు.)

నేను మూడు నాలుగుమార్లు ప్రార్థనలో కూర్చున్న తరువాత ఒకసారి శాస్త్రిగారు "నీవు కళ్లు మూసుకొని చూడు ఏమవుతుందో!" అని అన్నారు. నేను అలాగే చేశాను. ఆయన ఏదో జపిస్తూ, అందరితోపాటు కళ్లు మూసుకున్నారు. నేను ఉన్నవాణ్ణి ఉన్నట్టుగా, ఎక్కడికో వెళ్లినట్టు, ఏవో శిల్పాలు చూస్తున్నట్టు, బుద్ధుడు ధ్యానముద్రలో కనిపించినట్టు, నేను ఏవో తెలియని లిపులు చూస్తున్నట్టు అర్ధచేతనావస్థలో కనిపించసాగింది. తమాషాగానే ఉంది. తరచు ఏ లోకాలకో రెక్కలల్లార్చుకొని వెళ్లుతున్నట్టు, కొండలు ఎక్కుతున్నట్టు, కోనలు తిరుగుతున్నట్టు, కలలు వచ్చేవి. ఈ అనుభవమూ వాటిలాగే ఉంది. శాస్త్రిగారు నన్ను భుజం తట్టి పిలిచే వరకు నాకు మెలకువ రాలేదు. "ఏం జరిగిందో చెప్పు" అన్నారు. 'నేను మ్యూజియంలో బౌద్ధశాలను అప్పుడప్పుడు చూస్తుంటాను గదండీ, అవి కనిపించాయి' అన్నాను.

శాస్త్రిగారు కుంభకోణం యోగీశ్వరులు మాస్టర్ సి.వి.వెంకాస్వామిరావు గారి శిష్యవర్గంలోని వారని తర్వాత తెలుసుకొన్నాను. వెంకాస్వామిరావుగారు తెలుగుదేశం నుంచి కొన్ని శతాబ్దాలు క్రితం తమిళనాడుకు వలసపోయిన తెలుగు కుటుంబాల వారు. గొప్పశక్తులు గల యోగీశ్వరులు. నేను వారిని దర్శించలేదు. కాని, శాస్త్రి గారితోపాటు మాస్టర్‌గారి శిష్యులయిన భుజంగనాడీ జోస్యర్, శంకరయ్యర్, ప్రణతార్తిహర అయ్యంగార్, మైనంపాటి నరసింహంపంతులు, నరసింగరావు మొదలియార్ గార్లను దర్శించాను.

శాస్త్రిగారు అప్పుడు మద్రాసులో సుప్రసిద్ధులయిన ఆయుర్వేద, అలోపతి

వైద్యులు నిరాశతో వదలిన పలువురు రోగులను నిరోగులను చేశారు. శస్త్రచికిత్సకు లొంగని వాటిని కూడా బాగు చేయడం వల్ల అప్పటి గొప్పశస్త్ర వైద్యుడు డాక్టర్ కినీ, "గో టు దట్ ఫ్యాట్ జెంటిల్‌మన్" అని అనేవాడని ప్రథ. నేను ఆ ప్రార్థన సమయంలో చాలా అద్భుతాలను చూచాను. అన్నిటినీ వివరిస్తే మహాభారత మంత అవుతుంది. కనుక రెండు మూడు ఉదాహరిస్తాను.

నా మిత్రుడు, "గృహలక్ష్మి" సంపాదకుడు చదువుల రామచంద్రయ్యకు ఫ్లూరసీ వచ్చింది. అంటే గుండె చుట్టూ నీరు. నేనే శాస్త్రి గారి వద్దకు పిలుచుకొని వచ్చాను. అతనికి ప్రార్థన సమయంలో విచిత్రమైన అనుభవాలు కలిగేవి. శాస్త్రిగారు రోగుల ఈ దృశ్యాలను వివరించి చికిత్సలు సూచించేవారు. అవి భూతభవిష్యత్ స్థితికి సూచకాలుగా ఉండేవి. రామచంద్రయ్యకు బంగారు కుంచెతో ఎవరో గుండె చుట్టూ బంగారు పూత పూసినట్టు, పాదరసం ఇంజెక్షన్‌లు ఇచ్చినట్టు కనిపించేది. ఫ్లూరసీకి బంగారు పూత, పాదరసం ఇంజెక్షన్‌లు అలోపతిలో అప్పటి కొత్త చికిత్స. శాస్త్రిగారు ఆధునిక శరీరశాస్త్రాన్ని చదవకపోయినా ఆ వైద్యులు అబ్బురపడేట్టు వివిధ శల్యాలు, శల్య రోగాలు వివరణ చేసేవారు. అదంతా యోగదృష్టే. రామచంద్రయ్యకు అప్పటికి నయమయింది. కాని, ఏ కారణం వల్లనో కొన్నేళ్ల తర్వాత మరణించాడు.

రామచంద్రయ్యను గురించి కొంత చెప్పాలి. అతడు మదనపల్లెవాడు. అక్కడి కళాశాలలో బి.ఏ.లో ఉత్తీర్ణుడై ఉద్యోగాన్వేషణలో మద్రాసు వచ్చాడు. ఇంటిపేరు చదువులవారు. రెడ్డి. గృహలక్ష్మి పత్రికలో చేరి సంపాదకుడయ్యాడు. గృహలక్ష్మి నిర్వాహకులు కె.ఎన్.కేసరి గారికి ప్రీతిపాత్రుడయ్యాడు. అప్పుడు సంగెం లక్ష్మీబాయిగారు లలితకళా పాఠశాలలో చిత్రకళను అభ్యసించేవారు. ఆమె గుంటూరు శారదా నికేతనం విద్యార్థిని. నిజామాబాద్ వాస్తవ్యురాలు, చిన్నప్పుడే భర్తను కోల్పోయారు. గృహలక్ష్మి స్త్రీల మాసపత్రిక గనుక, లక్ష్మీబాయిగారు పత్రికా కార్యాలయానికి, కేసరిగారి వద్దకు రావడం వల్ల ఆమెతో రామచంద్రయ్యకు పరిచయం ఏర్పడింది. ఆమెను వివాహమాడదలచి నాతో సంప్రతించి, ఆమెతో ప్రస్తావించమని కోరాడు. నేను ప్రస్తావించాను. "నేను విశ్వసిస్తను. మారు మనువు మా కులంలో ఉన్నా, నేను మళ్లీ వివాహ మాడదలచలేదు. నా లక్ష్యం సంఘసేవ, దేశసేవ, నా ధర్మసహోదరి లలిత ఉంది. ఆమెను చేసుకోమనండి" అన్నారు ఆమె. కొంతకాలానికి నా మిత్రుడు

ఒప్పుకున్నాడు ఆ ప్రతిపాదన. పెళ్లికాకముందే నా మిత్రుడు, మందభాగ్యుడు కన్ను మూశాడు. ఆ లలిత గొప్ప మహిళ. అంత అందగాడు, సంస్కారవంతుడు, విద్యావంతుడు పోయిన తర్వాత పెళ్లెందుకు? అని నిశ్చయించుకుని, బ్రహ్మచారిణిగా జీవితం గడిపింది పవిత్రంగా, జీవిక కోసం ఉపాధ్యాయినిగా పని చేసింది.

రామచంద్రయ్య గొప్ప కథకుడు, ఉత్తమ సంపాదకుడు, గృహలక్ష్మి సాహిత్యస్థాయిని పెంచాడు. ఉపేక్ష అనే గొప్ప కథ వ్రాశాడు. ఉపేక్ష వల్ల ఎన్ని రంగాలలో భారతదేశం వెనుకబడిందో చెప్పడం దాని లక్ష్యం. అది కలకాలానికీ గొప్ప కథ అని నా విశ్వాసం. సంగెం లక్ష్మీబాయి చిత్రకళా పట్టభద్ర అయిన తర్వాత హైదరాబాద్‌లో ప్రభుత్వ కళాశాలలో చిత్ర కళోపాధ్యాయినిగా కొంతకాలం పనిచేసి, దానిని వదిలి రాజకీయాల్లో ప్రవేశించి బూర్గుల రామకృష్ణరావుగారి మంత్రివర్గంలో విద్యాశాఖ ఉపమంత్రిగాను, తర్వాత పార్లమెంట్ సభ్యురాలుగాను ఉన్నారు. తన లక్ష్యాలకు అనుగుణంగా, హైదరాబాద్‌లో సంతోష్‌నగర్ కాలనీలో బూర్గుల రామకృష్ణరావుగారు గారి తనయ ఇందిర గారి పేర ఇందిరాసేవాసదన్ అనే అనాథాశ్రమం స్థాపించి సేవ చేశారు. ఆమె వజ్రసంకల్ప. సేవానిరత, గొప్పవ్యక్తి. 1994వ సం॥లో కీర్తికాయ అయ్యారు. శాస్త్రిగారి వద్దకు చికిత్స కోసం భూతావిష్టులూ వచ్చేవారు. వారిలో రాఘవేంద్రరావు గారనే రెవిన్యూ శాఖాధికారి ఒకరు. ఆయనకు గొల్ల దయ్యం పట్టిందనే వారు. భూతావిష్టుడయినప్పుడు ఆయన గొల్లల యాసలలో సంభాషించేవాడు. కథలు, సుద్దులు వినిపించేవాడు. ఆశ్చర్య కరంగా ఉండేవి. దయ్యాలను గురించి శాస్త్రిగారు తమ అనుభవం ఒకటి చెప్పారు. "నేను తాళపత్ర గ్రంథాలను సేకరించడానికి తూర్పుగోదావరి జిల్లాలో ఒక గ్రామంలో ఒక బ్రాహ్మణుని ఇంట్లో బస చేశారు. ఆయన కుమార్తెలలో ఒకావిడ భర్తృహీన. వయస్సు ఇరవై ఏళ్లుంటాయి. ఇంటికి ఎవరయినా అతిధులు వచ్చినప్పుడు ఆవిడకు దయ్యం పడుతుంది. బాధలు, భయాలు, కేకలు, ఈ సంగతి ఆ గృహస్థు నాతో అన్నాడు.

"నేను ఈవేళ చూస్తాను. ఆ సమయంలో పిలవండి" - అన్నాను. పిలిచారు. వెళ్లాను. నేను మాస్టర్ గారిని ధ్యానించి ఇలాటిది ఇక రాకూడదు; ఈ ఏస్ట్రల్ బాడీ వదలిపోవాలి - అని సంకల్పించాను. ఆవిడ నా ఎదుట సొమ్మసిల్లి పడుకుంది. పడుకున్న ఆమె శరీరం నుంచి బక్కపలచని చామనచాయ వ్యక్తి బయలు వెడలాడు. నేను "ఎవరు నీవు?" అనడిగాను. "నేను ఈవిడ భర్తను, ఇంటికి కొత్తవారు

వచ్చినప్పుడు, వారు ఏమయినా అకార్యం చేస్తారేమోనని నా సందేహం" - అన్నాడు ఆ ఏస్ట్రల్ బాడీ. "ఇక ఆమెను పీక్కొని తినక, వేరే జన్మ చూచుకో, ఆమె మంచి వంశంలో పుట్టినట్టిది. అపమార్గం తొక్కదు" - అన్నాను. అతడు వదలిపోతానన్నాడు. మళ్లీ ఎప్పుడూ ఆమెకు దయ్యం సోకలేదు... ఇదంతా ఏమిటనే అనుమానిస్తావు గదూ? మరణించిన వ్యక్తి సూక్ష్మశరీరం, అతని ఆశాపాశాన్ని బట్టి, మరణాత్పూర్వ పరిసరాలలో తిరుగుతూంటుంది. అది కొన్నేళ్లపాటూ ఉండవచ్చు. మరుజన్మ వరకు ఇది తప్పదు. భూతావిష్టుల మనోబలాన్ని బట్టీ ఈ పరిస్థితి మారవచ్చు. నాకు దయ్యాలపై నాటికీ నేటికీ నమ్మకం లేదు. అది కేవలం చిత్తభ్రమ అని నా విశ్వాసం. అయినా, శాస్త్రిగారి యోగచికిత్సా పద్ధతి విజయాన్ని బట్టి, ఆయనను, ఆయన మాటలనూ విశ్వసిస్తున్నాను.

ఉడిపి వేంకటరావుగారు అప్పుడు మద్రాసులో ప్రముఖ దంతవైద్యుడు. ఈయన మద్రాసు ఆంధ్ర జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు, ప్రముఖ వైద్యులు డాక్టర్ ఉడిపి రామారావుగారి సోదరులు. ఈయనకు ఏదో చర్మవ్యాధి. ఎక్కడా కుదరకపోతే శాస్త్రిగారి చికిత్సకు వచ్చారు. ప్రార్థన సమయంలో అంతా బరుక్కోవడం, గోక్కోడమూను. ఈయనకు మరణించే వారితో సంభాషించే ప్లాంచెట్ (ఈ ఉచ్చారణ తప్పు కావచ్చు) పైన విశ్వాసం ఎక్కువ. అప్పుడు బొంబాయిలో ఋషి అనే పేరు గల గొప్ప ప్లాంచెట్ నిపుణుడుండేవాడు. ఆయన పెద్ద ప్రభుత్వోద్యోగి కూడా. ఆయన అప్పుడు మద్రాసుకు వచ్చారు.

వేంకటరావుగారు ఆయన గొప్పదనం చూపించడానికి శాస్త్రిగారి వద్దకు పిలుచుకొని వచ్చారు. ఋషి తన వెంట తెచ్చిన చిన్న బల్ల వంటి దానిని ఒక చోట పెట్టాడు. తమ పితృపితామహులతో మాట్లాడదలచిన వారు ఆ బల్లపైన రెండు చేతులూ పెట్టాలి. ఋషి వారి పితృ పితామహ ప్రపితామహాదులను ఆహ్వానిస్తారు. పృచ్ఛకులు అడిగే ప్రశ్నలకు వారు చెప్పే సమాధానాలను ఋషి ఒక కాయితంపై పెన్సిలుతోగాని, కలంతోగాని వ్రాస్తాడు. వ్రాత వేగం విపరీతంగా, అత్యాశ్చర్యకరంగా ఉంటుంది. నిమిషానికి దాదాపు వంద పుటలు వ్రాస్తాడు. అతిమానుషమో, అమానుషమో! శాస్త్రిగారి మిత్రులు కాక, చాల మంది ఈ వింత చూడడానికి వచ్చారు. మా వైష్ణవ సంప్రదాయం ప్రకారం శరణాగతి పొందిన వారికి పునర్జన్మ లేదు గనుక నా ప్రపితామహాదులెవరూ సూక్ష్మశరీర ధారులై లేరు గనుక, నాకసలు నమ్మకం లేదు. గనుక; నేను కేవలం

పరిశీలకుడుగానే కూర్చున్నాను. ఋషి చాల మంది పూర్వులను ఆహ్వానించాడు. చేయి వ్రాయడం అలా ఉండగా, కదలనయినా కదలలేదు. "మీ సమక్షంలో నేనేమీ వ్రాయలేకపోతున్నాను." అన్నాడు సవినయంగా ఋషి. 'నేను మీ నమ్మకాలను గాని, మీ కార్యక్రమానికి గాని విఘ్నం కలిగించడం లేదు. నేను ఉండడం విఘ్నకరమైతే వెళ్లిపోతాను'అంటూ శాస్త్రిగారూ లేచారు. "కాదు, కాదు. నేను ఎందుకో ఫెయిలయ్యాను" అంటూ ఋషి మన్నన వేడాడు. వెంకటరావు గారికేకాక, తమ పూర్వులతో మాట్లాడదలచిన వారికంతా నిరాశ కలిగింది.

కొందరు రోగులు ప్రార్థన సమయంలో చాలా బాధపడుతూ హాహాకారాలు చేసేవారు. నా మనస్సు కుమిలిపోయేది. కోపం పెరిగేది. "ఏం సార్! ఏం చికిత్స సార్ మీది? వాళ్లు అంగలార్చిపోతూంటే మీరేమిటలా కళ్లు మూసుకొని పెదవులు కదలిస్తూ కూర్చుకుంటారు? అంత మాహాత్మ్యమే ఉంటే, వెంటనే వ్యాధి నయం కావద్దా? అబ్బా!" అని శాస్త్రిగారిని ఒకటి రెండు సార్లు కోపపడ్డాను కూడా. ఆయన చిరునవ్వు నవ్వేవారు. అంతే తర్వాత నేనే ఎంతో సిగ్గుపడేవాడిని. చికిత్స చేస్తున్న వారు ఆయన. ఆ యోగచికిత్స పద్ధతేమో తెలిసింది ఆయనకు. నేను గట్టు మీద కూర్చున్న వాడిని. ఏమిటీ నా అగాయిత్యం! అనుకునేవాడిని.

కాశీనాథుని నాగేశ్వరరావుగారు చివరి దశలో మనశ్శాంతి కోసం శాస్త్రిగారి వద్దకు వచ్చారు ఒక సాయంకాలం ప్రార్థన సమయంలో. అప్పటికి ప్రార్థన అయిపోయింది. శాస్త్రిగారు ఏవో జబ్బులను గురించ్ వివరిస్తున్నారు. హఠాత్తుగా నాగేశ్వరరావుగారు గేటు తలుపులు తెరచుకుని వస్తున్నారు. శాస్త్రిగారు తలెత్తి చూచి సంభ్రమంతో లేచి, ఎదురు వెళ్లి స్వాగతం చెప్పారు. ఆయన వచ్చి చాప మీద కూర్చుంటూ "నాకు మనశ్శాంతి లేదు. దాని కోసం వచ్చాను" అన్నారు శాస్త్రిగారితో. ఆయన "తమరు పడుకొని కళ్లుమూసుకుని అబ్జర్వ్ చేయండి" అంటూ ప్రార్థన చేశారు. మేమందరము కళ్లు మూసుకున్నాం. ఐదు, పది, పదిహేను, ఇరవై, ఇరవయ్యయిదు నిమిషాలు, అరగంట... పంతులుగారు తటాలున మేల్కొని చుట్టుపట్ల చూచి "అమ్మయ్య! ఎంత హాయిగా ఉంది. తలమీది నుంచి ఏదో బరువు దిగిపోయినట్టయింది. ప్రతి దినమూ ఈ వేళకు వస్తాను...?" అన్నారు. శాస్త్రిగారు "నేను వస్తాను. సాయంకాలం ప్రార్థన మీ ఇంట్లో జరుపుదాము" అన్నారు. అంత పెద్దవారిని బాధ పెట్టడం ఎందుకుని. శాస్త్రిగారు నాగేశ్వరరావుగారి నివాసమయిన శ్రీబాగ్‌కు రెండు సాయంకాలాలు

వెళ్లారు. ప్రార్థనానంతరం పంతులు గారు ప్రార్థన జనిత శాంత్యా నందాలతో శాస్త్రిగారికి తాము చేయదలచిన భావి సత్కార్యాలను వివరించారు. పంతులు గారి పరిజనవర్గానికి అది నచ్చలేదు కాబోలు! మూడోదినం నుంచి శాస్త్రి గారిని శ్రీబాగ్ తొక్కనియ్యలేదు. శాస్త్రిగారు విచారంతో తమ ఇంట్లోనే వారి కోసం ప్రార్థనలు చేశారు. కాని వారం తర్వాత అది 1938 ఏప్రిల్ నెల అని గుర్తు. భారతి సంపాదకులు గన్నవరపు సుబ్బరామయ్యగారు ఆ నెల భారతి సంచికలో తుదిమొక్కు అనే సంపాదకీయ వ్యాసం వ్రాశారు. అదొక గొప్ప కరుణ రసప్లావిత కావ్యఖండం. “సార్, నాకు హోటల్‌లో పనిచేద్దామనుంది” అన్నారు ఒకమారు శాస్త్రిగారితో. “ఏమిటి అది తక్కువ వృత్తి అని భావిస్తున్నావా?” అన్నాను. “అబ్బే! అదేం కాదండీ. ఆ అనుభవమూ చూద్దామనుంది” అన్నాను. అప్పుడు తిరువల్లిక్కేణి సింగరాచారి వీధిలో రామవిలాస్ అనే గొప్ప హోటలు ఉండేది. దాదాపు నెలసరి టిక్కెట్లతో భోజనం చేసేవారే మూడు నాలుగు వందల మంది. ఇక దినదినం వచ్చేవారి సంఖ్య చెప్పనక్కరలేదు. ఆ హోటల్ యజమాని శాస్త్రిగారి వద్దకు చికిత్సకోసం వచ్చేవాడు. శాస్త్రిగారు నన్ను అతనికి పరిచయం చేశారు. నేనొక నెలనాళ్లు ఆ రామవిలాస్‌లో ప్రతిఫలాపేక్ష లేకుండా పని చేశాను. అప్పుడు నడుం వంచి పనిచేయడం వల్లనే ఇప్పటికీ నా నడుం వంగలేదని నా విశ్వాసం. తర్వాత నేను టంకశాల వీధి (మింట్ స్ట్రీట్)లోని ఒక గుజరాతీ హోటలులో రుబ్బడం మొదలయిన పనులు చేశాను. ఆ హోటలులో ఫలహారశాఖ, భోజనశాఖ - రెండూ ఉండేవి. భోజనశాఖలో మిగిలిన అన్నం, కూరలు, కూట్టు, పప్పు, పులుసు, అప్పడాలతో సహా అన్నీ పిసికి ఉల్లిపాయలు, పచ్చిమిరపకాయలు తరిగివేసి కలిపి పకోడీలుగా వేయించేసేవారు. అద్భుతమయిన రుచి! చాలా గిరాకీ ఉండేవి వాటికి. ప్రభాకరశాస్త్రి గారి వంటి మహనీయుని సన్నిధిలో ఉన్నా నాకు లక్ష్యశుద్ధి ఏర్పడలేదు. అడుగడుగుకూ వక్రించే కుజగ్రహం లాగా ఉన్నాను. నా వైచిత్రిని చూచి కార్మిక నాయకుడు రామానుజం ఒకమారు నాతో ఈమాటే అన్నాడు.

**“చలం విత్తం చలం చిత్తం చలే జీవిత యౌవనే ।**
**చలాచల మిదం సర్వం కీర్తి ర్యస్య స జీవతి ॥”**

**(సంపద, మనస్సు, జీవితం, యౌవనం - అంతా చలమైనది, నశించేది. కీర్తి ఒక్కటే స్థిరమైనట్టిది. అలాటి వారు సర్వదా జీవించే ఉంటారు.)**

# 49

# మద్రాసులో సజ్జన సాంగత్యం

**"దిట్టా హరంతి దుక్ఖం**
**జంపంతా దేంతి సఅలసోఖ్ఖాఇం,**
**ఏఅం నిహిణా సుకఅం**
**సుఅణాజం ణిమ్మి ఆ భువణే"**

**(సజ్జనులను చూస్తేనే చాలు సకల దుఃఖాలూ అణగారిపోతాయి. వారితో మాట్లాడితే సకల సౌఖ్యాలూ కలుగుతాయి. లోకంలో ఇలాటి సజ్జనులను సృష్టించి మంచి పని చేశాడు బ్రహ్మ.)**

మద్రాసు నగరం; ముఖ్యంగా ప్రాచ్యలిఖిత పుస్తకాలయం, సజ్జనుల సాంగత్యం, నాకు ఎన్నో అవకాశాలు - మనోబుద్ధుల వికాసానికి అవకాశాలు కలిగించాయి. వాటిని వినియోగించుకోకపోవడం నా పొరపాటు. ఇంతకు ఆ అంగుళం రబ్బరు ముక్కను లాగితే అయితే జానెడు పొడవు కావచ్చునుగాని బారెడు అయ్యేనా! నా పరిస్థితి అదే అనుకుంటాను.

ప్రాచ్యలిఖిత పుస్తకాలయంలో గోండాల్ వారి కోసం ప్రతిలేఖనం సాగుతూనే ఉంది. ఇరవై రూపాయల రాబడి చాలు అనుకొని ఆ పని చేసే వాడిని. తక్కిన సమయంలో అక్కడ ముద్రిత గ్రంథాలూ - వేల కొలది ఉండేవి, వాటిలో నా అభిరుచికి తగినట్టు చదువుకొనే వాడిని. ప్రభాకరశాస్త్రిగారి కోసం చాల పుస్తకాలు నకలు చేసి

ఇచ్చాను. ఆ విడి సమయాలలో చాటు పద్యమణి మంజరి రెండవ భాగం ప్రచురించదలచాను. "తెలుగు తాళపత్ర గ్రంథాలలో కావ్యాల చివర, అక్కడక్కడా లేఖకులు వ్రాసిన చాటుపద్యాలు ఉంటాయి. వాటిని చూచి వ్రాసిపెట్టు" అన్నారు శాస్త్రిగారు. కొన్ని పద్యాలు సేకరించి వ్రాసి పెట్టాను. ప్రతిఫలాపేక్ష లేకుండా చాలమందికి అలా ఎంతో పనిచేశాను. ప్రతిఫలం కోరడం, ఆ వ్యక్తి ఇస్తానని, ఎగవేయడం; దానితో కష్టపడడం ఎందుకని, ప్రతిఫలాపేక్ష లేకనే పనిచేసే వాడిని. శాస్త్రిగారి మాటతో నలుగురయిదుగురికి; ఇలా నకలు చేసిన పెట్టడం, వాళ్లు ఎగవేయడం, శాస్త్రిగారు తమ మాటపోయిందని కష్టపడడం జరిగింది. రెండు సంగతులు మాత్రం గుర్తున్నాయి అలాటివి.

సీతారామయ్య అనే వారు విజయనగరంలో ఒక కళాశాలలో చరిత్రోపన్యాసకులు. గాంగవంశరాజులపై పరిశోధన చేస్తున్నారు. ప్రాచ్యలిఖిత పుస్తకాలయంలో గాంగవంశావళి అనే సంస్కృత గ్రంథం ఉంది. నకలు, అనువాదం కావాలని శాస్త్రిగారిని కోరారు. ఆయన గ్రంథాలయ నియమానుసారం అయ్యే ప్రతిఫలం వివరించారు. గ్రంథాలయం మూలంగా ఈ వ్యవహారం జరిగితే, మొదట్లోనే డబ్బంతా చెల్లించాలి. "అదంతా వ్రాతకోతలెందుకు? ఇచ్చేస్తాను గదా, వ్రాయించి పెట్టండి" అన్నాడు. శాస్త్రిగారు నాకు ఆ పని అప్పజెప్పారు. నేను దేవనాగరిలో ఉన్న ఆ గ్రంథాన్ని తెలుగులో వ్రాసి దాన్ని అనువాదం చేసి, వ్రాసి, అందజేశాను. దాదాపు నెలన్నర పట్టిందని గుర్తు. సీతారామయ్య దాన్ని తీసుకొని వెళ్ళారు. పరిశోధన గ్రంథం వ్రాశాడు. నా అనువాదం అనుబంధంగా ప్రచురించాడు. డబ్బు పంపలేదు సరిగదా, ఉత్తరం ముక్కయినా వ్రాయలేదు. అప్పుడు కార్డు ముక్క అర్ధణా.

అలాగే ప్రతివాది భయంకరుల వారొకరూ చేశారు. వారి పేరు మరిచాను. ఆయన తిరుపతిలో టీచర్స్ ట్రెయినింగ్ స్కూలుకు హెడ్మాస్టరు. ఆయుర్వేదంలో అభిరుచి. నిత్యనాథ సిద్ధుని రసరత్నాకరంలో ఒక ఖండాన్ని నాతో నకలు చేయించి అనువదింపజేశాడు. హెడ్మాస్టర్, పెద్ద మనిషి గదా అని శాస్త్రి గారు నమ్మారు. ఆయన అనువాదం తీసుకుపోయిన తర్వాత పత్తాలేదు. శాస్త్రిగారు అటు తర్వాత అప్పుడప్పుడు 1950 ప్రాంతంలోను తమాషాగా "వీరభద్రాచార్లూ, ఆ సీతారామయ్యగాని, ప్రతివాది భయంకరులు గాని కనిపించారా?" అని అడిగేవారు నవ్వుతూ. ఈలాటి

ప్రతివాది భయంకరులను గురించే కాబోలు ఒక ప్రాకృతకవి అన్నాడు. ఇలాటి వారు ఛేకులు – అంటే చతురులు, స్వకార్యసాధకులు.

"జఇ పథమదిణే తహ
పచ్ఛి మమ్మి పరుసాయి ణే అజంపంతి
అవ్వో! మహాణుహావా
నిరజ్జ మానా విదుల్లక్ఖా."

(ఇలాటి ఛేకులు చాల వాళ్లు. తమ మనసులోని గుట్టు ఎప్పుడూ రట్టు కానీయరు. పరిచయమయిన మొదటినాడు ఎలా ఉంటారో తర్వాత గూడా అలాగే వ్యవహరిస్తారు. ఎప్పుడూ కటువుగా మాట్లాడరు. తమకు ఇష్టం లేనప్పుడు మనను వదలుకుంటున్నా అలా కనపడరు. మరొక కవి ఈ దగాకోరు చతురులను బ్రహ్మను మించిన వాళ్లనుగా వర్ణించాడు.)

"తం ణిత్థి తం ణ హూ అం
ణ హు హోసిఇ తం చ తిహు అణే స అలే,
తం విహిణాని న విహిఅం
జం నహు నా అం ఛ ఇల్లేహిం"

(చతురులయిన స్వార్థపరులకు ఈ మూడు లోకాలలోను తెలియని భూత భవిష్యవర్తమానాలు లేవు. బ్రహ్మకు తెలియనివి కూడా వాళ్లు తెలుసు కుంటారు.)

ఎవరో పుస్తక ప్రచురణకర్త శాస్త్రిగారిని హరవిలాసం పరిష్కరించి పీఠిక వ్రాయమన్నారు. నన్ను తంజావూర్ వెళ్లి సరస్వతీమహల్ గ్రంథాలయంలోని హరవిలాసం లిఖిత ప్రతుల పాఠాంతరాలు సేకరించుకొని రమ్మన్నారు శాస్త్రిగారు. నేను తంజావూరు వెళ్లి పాఠాంతరాలు మక్కికి మక్కి సేకరించాను. పుస్తక ప్రచురణ గొప్ప కళ, శాస్త్రం. దానిలో శాస్త్రిగారి విచక్షణత జ్ఞానం గొప్పది. గుడి, కొమ్ములు వంటి చిన్న మార్పులతో, అక్షరాల మార్పులతో, చక్కని పాఠాలు నిర్ణయించేవారు. అవంచియే కంచి నీకు అడుగామడయే – అని ఒక గీత పద్యపాదం. శిరియాళుని తండ్రికి శివుడు ప్రత్యక్షమై నేను ఒంటిగా భోజనం చెయ్యను. నా పంక్తిలో మహేశ్వరుడుండాలి. పక్కనే కంచి ఉంది. అక్కడికి వెళ్ళి మహేశ్వరులను పిలుచుకురా – అని అంటున్న ఘట్టం. అన్ని

తాటాకు ప్రతులలోను అవంచి అనే ఉంది. నేనూ ఆలోచిస్తున్నాను. శాస్త్రిగారూ అరగంటసేపు ఆలోచించారు. చప్పున "వీరభద్రాచార్లూ! మహానగరాల పేర్లు చెప్పు!" అన్నారు.

**"అయోధ్యా మధురా మాయా**
**కాశీ కాంచీ హ్యవంతికా ।**
**పురీ ద్వారవతీ చైవ**
**సప్తైతే మోక్షదాయికాః ॥"**

అని అప్పగించాను.

"ఇంకేం? పాఠం సవరించు" అన్నారు. నేను ఆశ్చర్యంతో క్షణం సేపు స్థాణువైపోయి, "అవంతియే కంచి నీకు" అని సవరించాను. కంచికి కాంతి అని రూపాంతరమూ ఉందని, అలాగా చకారాంతంగా మారడం ఉంది గనుక అవంతి అవంచి అని వ్రాసి ఉంటారనీ అన్నారు. శాస్త్రిగారు కంచి దగ్గరే ఉంది గదా, అదేమన్నా అవంతీ నగరమా దూరం కావడానికి అని మాయజంగముని దెప్పిపొడుపు. తరణాసీర, తవాయి" అనే పద్యంలోను ఇతరత్రానూ ఉన్న సంస్కృతీకృతపదాలకు సరయిన అర్థాలను, ప్రాంతాలనూ గుర్తించారు. తరణాసీర అనేది తెన్నాసిరం అనీ, ఇదీ, తవాయి అనేదీ బర్మాలో ఉన్నాయనీ గుర్తించారు. అప్పుడు మనకోస్తా ప్రాంతాల రేవుల నుంచి దూర ప్రాచ్య దేశాలకు, పశ్చిమ దేశాలకూ వ్యాపార సాపారాలు జరిగేవి విశేషంగా.

నేను చాటు పద్యాల కోసం తాటాకు పుస్తకాలను గాలిస్తుండగా, గొప్ప గ్రంథం దొరికింది. అది పండితారాధ్యుల శివతత్త్వసారం కన్నడానువాదం. ఒక పెద్ద తాటాకు కట్టలో సంఖ్య క్రమంతో కొన్ని వందల పద్యాలు దొరికాయి. భాష ప్రాచీనం, శైవమతానికి సంబంధించినది, పెద్ద రచయితదే అయి ఉంటుందని భావించాను. ప్రతి కందం చివర శివ అని సంబోధనం, శివతత్త్వసారమై ఉండవచ్చునని సందేహం కలిగింది. పండితారాధ్యుడు, సోమనాథుడు, మొదలయిన వారు కన్నడంలోనూ ఉద్దండులే. కాని, పండితారాధ్యుడు కన్నడంలో రచన చేశాడని తెలియదు. శాస్త్రిగారికి చూపి నా సందేహాలు తెలిపాను. వారు వెంటనే కొమర్రాజు లక్ష్మణరావుగారు ప్రచురించిన శివతత్త్వసారం తెలుగు ప్రతిలో కన్నడ పద్యాలను సరిచూచి పరిశీలించి ఆనందబాష్పాలు గండస్థలాలను తడుపుతుండగా పది నిమిషాలు ధ్యానమగ్నులయ్యారు. దానిని కన్నడ, తెలుగు

ఎదురుబదురుగా ప్రచురించాలనుకొని ముద్రణకు సిద్ధపరిచాను. కుదరలేదు. ఇతర కార్యాల వల్ల ఆసక్తి కూడా తగ్గింది. ముద్రణకు సిద్ధపరచిన ప్రతి నా వద్ద ఇంకా ఉంది. మరణించేలోగా ప్రచురించాలి. మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ వారు కన్నడ భాగం మాత్రం ముప్పయి ఏళ్ల క్రిందట ప్రచురించారు.

మా కుట్రకేసుపై 1934 ఏప్రిల్ నెల చివరికి మద్రాసు హైకోర్టు తీర్పు ఇయ్యడంతో ఆ సంవత్సరమంతా పోలీసుల కనులు కప్పి ఒక విధంగా అజ్ఞాతవాసంలో ఉండడం, 1935లో కొంత తెరపి కలుగడం, ఆ సంవత్సరమంతా దేశంలో వ్యష్టి సత్యాగ్రహం జరిగినా, 1936కు రాష్ట్రాలలో కాంగ్రెస్ అధికారం చేజిక్కించుకోవాలని అభిప్రాయపడడంతో, దానికి సన్నాహాలు ప్రారంభించడం వల్ల ప్రభుత్వ వైఖరిలో మార్పు వచ్చింది. పోలీసుల నిఘాలు, వేటలూ తగ్గాయి. నేను నిర్భయంగా తిరగడం ప్రారంభించాను.

శాస్త్రిగారితో పాటు మాస్టర్ సి.వి.వి.గారి జయంతికో, వర్ధంతి కోకకుంభకోణం వెళ్లాను. అక్కడికి దక్షిణాపథంలోని మేధావులందరూ వచ్చారు. డాక్టర్ నరసింగరావు వంటి గణితాచార్యులూ, విశ్వవిద్యాలయాల ఆచార్యులు, విస్సా అప్పారావు గారి వంటి వారూ వచ్చారు. జోస్యర్ అనే వారు మాస్టర్ సి.వి.వి.గారి ప్రథమ శిష్యులు. వారి తర్వాత వారంతటి వారు అనే వారు. వారి వద్ద భుజంగ నాడి అనే తమిళ నాడీ గ్రంథం ఉండేది. దానిలో విశేషం ఒక జాతకుని జీవితంతో పాటు, గత జన్మల విశేషాలు, దేశకాల పరిస్థితుల వర్ణన ఉండడం. దాని కథనాలన్నీ ఫలిస్తాయనే విశ్వసించేవారు. నా వరకూ నాకు అప్పటి నుంచీ ఇప్పటి వరకు జ్యోతిషం 20 శాతం ఫలిస్తే గొప్ప అని అభిప్రాయం. కాని, ఒక కరదీపికగా, కార్యశూరుడు వినియోగించుకోవచ్చు. నాకూ జ్యోతిషంలో కొంత ప్రవేశముంది. నేను ఏమిటేమిటో అవుతానన్నారు. ఏమయ్యాను. చచ్చు వెధవనయ్యాను. ఏమైంది జోస్యం? నా సంగతి అలా ఉంచుదాం.

భుజంగనాడి భవిష్యవాణులు – ముఖ్యంగా దేశానికి సంబంధించినవి చాల జరిగాయి. వాటిలో 'విశాకత్తిల్ పాంబు' అనేది – ద్వితీయ ప్రపంచయుద్ధ సమయంలో జర్మనులు భారతదేశ వాసులను, బ్రిటిష్ పాలకులను భయపెట్టడానికి విశాఖపట్టణం నౌకాశ్రయంపై బాంబులు వేశారు. ఈ దుర్ఘటనను జోస్యర్ గారి భుజంగనాడి రెండు

మూడు సంవత్సరాల క్రిందటే చెప్పింది. విశాకత్తిల్ బాంబు అని. ఇది విస్సా అప్పారావు గారి జాతకంలో ప్రసక్తమయింది. అప్పుడు – విశాఖా నక్షత్రంలో పాంబు – రాహువు సంచరించినప్పుడు అప్పారావు గారు విశాఖలో పెద్ద పదవులు పొందుతారనే వారికి సంబంధించిన విషయం. అప్పుడాయన మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో అడిషనల్ ఫిజిక్స్ ప్రొఫెసర్‌గా ఉన్నారు. తమిళ్ వర్ణమాలలో కాది వర్గాలలో అనునాసికం వినా తక్కిన నాలుగు వర్ణాలకూ వర్ణం ఒక్కటే గనుక, పాంబును బాంబుగాను చదువవచ్చు. విశాఖ నక్షత్రంలో రాహువు సంచరించినప్పుడు విశాఖలో బాంబు పడుతుందని జ్యోస్యర్ వ్యాఖ్యానించించారు. అదిపడే వరకు నమ్మలేదెవరూ.

కుంభకోణం సమావేశంలో జ్యోస్యర్ , లెక్కలను గురించి, ఐన్‌స్టీన్ సాపేక్షవాదం గురించి ప్రసంగించారు. జ్యోస్యర్ చదివింది ఐదో తరగతి. కాని, భుజంగనాడి జ్ఞానంతో, మాస్టర్ సి.వి.వి. యోగబలంతో నకల విషయాలపై వ్యాఖ్య చేసేవారు. విశ్వవిద్యాలయాచార్యుల తలలు తిరిగిపోయేవి. జ్యోస్యర్ ప్రసంగం నాకు కంచుగోడ. మేథమేటిక్స్ ప్రొఫెసర్ నరసింగరావుగారు లేచి కోటుపై అలంకారంగా వేసుకున్న కండువాను నడుముకు చుట్టుకుని సాష్టాంగ నమస్కారం చేశారు. విస్సా అప్పారావు గారు గుబురు మీసాల మధ్యన మందహాసంతో చేతులు జోడించారు.

తర్వాత అప్పారావుగారికి నేను సన్నిహితుణ్నయ్యాను. నన్ను ఎవరో శిరోమణో, విద్వానో పూర్తి చేయమన్నారు. డిగ్రీపైన నాకు విశ్వాసం తక్కువ. అపారగౌరవం కాని, వాటి వల్ల నాబోటివాడికి ప్రయోజనం ఉండదని దృఢ విశ్వాసం. అంతేకాక 1936 జనవరికి నా వయస్సుః22 ఏళ్లు. ఈ ప్రాచ్యపరీక్షలకు ప్రైవేటుగా వెళ్లడానికి ముప్పయికి ఎక్కువ నిండి ఉండాలి. నేను అబద్ధంగా వయస్సు ఎక్కువ వేసుకుని పరీక్షకు వెళ్లదలచలేదు. అప్పుడు శాస్త్రిగారు నన్ను అప్పారావు వద్దకు పిలుచుకుని వెళ్లి, నా వయస్సుఃసంగతి చెప్పి, ప్రయివేటుగా ప్రాచ్యపరీక్షలకు వెళ్లే వారు 30 ఏళ్లకు వెళ్లితే, వారికి ఉద్యోగ కాలపరిమితి, పెన్షన్ వంటి సౌకర్యాలు మొదలయిన వాటిలో నష్టం కలుగుతుందని, దానిని మార్చడం అవసరమని కోరారు. శాస్త్రి గారికి అప్పారావుగారు యోగమిత్రులు.

అప్పారావుగారు నన్ను అప్పటి మద్రాసు విశ్వవిద్యాలయం రిజిస్ట్రార్ సి.డి.ఎస్.చెట్టిగారి వద్దకు పిలుచుకొని వెళ్లారు. ఒక దరఖాస్తుతో గంటన్నర చర్చ

తరువాత, పాలకవర్గంలో నా దరఖాస్తుపై తీర్మానం చేయిస్తానని, దాని వల్ల ఇతర విద్యార్థులకూ ప్రయోజనం కలుగుతుందదనీ అన్నారు. నేను 1936 ఏప్రిల్ నెలలో విద్వాన్ పరీక్షకు వెళ్లాను. వయస్సు పరిమితి 23 దాటరాదని విశ్వవిద్యాలయం నిర్ణయించడం వల్ల. కాని, దీని వల్ల 30-35 ఏళ్లవాళ్లు కూడా 23 ఏళ్ల లోపు వయస్సు చూపి పరీక్షలకు వెళ్లడం మితిమీరిపోయింది. చాలా ఫిర్యాదులు, ఆకాశరామన్న ఉత్తరాలు ఎక్కువయాయి. దానితో విశ్వవిద్యాలయం 1938లో కాబోలు, మళ్లీ పాత నిబంధననే - 30 ఏళ్ల వయఃపరిమితినే పునరుద్ధరించింది.

నేను విద్వాన్ ప్రిలిమినరీ, ఫైనల్ పరీక్షలకు ఒకేమారు వెళ్లదలచడం వల్ల చదువు కోసం లైబ్రరీ పనికి రెండుమూడు నెలలు వెళ్లలేదు. డబ్బులేకపోయింది చేతిలో. నా మిత్రుడు రామచంద్రరావు అనే ఉడిపివాసి ఎగ్మూరులో ఒక హోటల్ పెట్టాడు. అతడు 'గృహలక్ష్మి' కేసరిగారి ఇంట్లో వంటపని చేసేవాడు. ఉడిపిలో ఘనాంతస్వాధ్యాయం చేసిన వారు. వేదపాఠశాలల్లో పనిదొరక్క మొదట పెళ్లి వంటలకు దిగాడు. ఆరడుగుల బంగారు పోతపోసిన విగ్రహం. తర్వాత కేసరిగారికి వంటవాడయ్యాడు. ఆయన వద్ద నాలుగైదేళ్లు వంటచేసిన పిదప ఒక దినం కేసరిగారన్నారట - ఎదుగూ బొదుగుల్లేని ఈ ఉద్యోగం ఎన్నాళ్లు చేస్తావు? నేను వెయ్యి రూపాయలు మదుపు పెడతాను. ఒక చిన్న హోటలు పెట్టుఃఅని. రామ చంద్రరావు ఆ విధంగా చేశాడు. పదేళ్లలో ఉడిపిలో రెండు మేడలు కట్టాడు. అతనికి నా పరిస్థితి చెప్పాను. "మీకు ఉదయం రెండణాలు, రాత్రి రెండణాలు టిఫిన్ అరువిస్తాను. కానీకి ఒక పెద్ద ఇడ్లీ ఉదయించే చంద్రబింబం లాంటిది. నాలుగిడ్లీ, నాలుగు వడలూ చాలు. కడుపు నిండుతుంది. నెలకు ఏడున్నర రూపాయి. పరీక్ష తర్వాత పనిలో చేరి డబ్బు చేతికి వచ్చినప్పుడు ఇయ్యండి" అన్నారు. సమస్య పరిష్కారమయింది. కాని, నాకు మనస్సు ఒప్పలేదు. చేతిలో రెండు రూపాయ లున్నాయి. ఆ హోటల్లోనే ఉదయం రెండు ఇడ్లీలు తిని, పరీక్ష కేంద్రమయిన లయోలా కాలేజీకి నడిచి వెళ్లి పరీక్ష వ్రాసి తిరిగి వచ్చి రాత్రంతా చదవడం. ఇలా పరీక్ష ఎనిమిదినాళ్లూ జరిగింది. మూర్ఖత్వం. కేవలం మొండితనం!

పరీక్ష తర్వాత శాస్త్రిగారింటికి వెళ్లాను. "పదిరోజులుగా ఎక్కడికి వెళ్లావు?" అనడిగారు శాస్త్రిగారు. "విద్వాన్ పరీక్షలండీ!" అన్నాను. మరేవేవో అడిగారు. సమాధానాలు చెప్పాను. తల దిమ్ముగా ఉంది. కాళ్లు తేలిపోతున్నాయి. జవాబు

చెబుతున్నానే గాని, ఏం చెబుతున్నానో నాకే తెలియడం లేదు. 'ఇలాగే అవాకులూ చెవాకులూ వ్రాశావా పరీక్షలో?' అనడిగారు. "లేదండీ, బాగానే వ్రాశాను" అన్నాను. "మరి తూలిపోతున్నావెందుకు? మాటలు తడబడుతున్నాయెందుకు?" అన్నారు. "పది రోజులుగా భోజనం లేదండీ" అని జరిగిన సంగతి చెప్పాను. "మీ అమ్మ కడుపు చల్లగా, ఎంత పని చేశావు!" అంటూ మహాలక్ష్మమ్మ గారిని పిలిచి నాకు భోజనం వడ్డించమన్నారు. మహాలక్ష్మమ్మగారు శాస్త్రిగారి సహధర్మచారిణి. నేను భోజనం చేయడమేమిటి, అరుగుమీద ఒరిగి పోవడమేమిటి ఏకకాలంలోనే జరిగాయి.

మరుసటి దినం ఉదయం 9-00 గంటలకు లేచాను. అంటే పదిహైదు గంటలు నిద్రపోయానన్నమాట. "నన్నడిగితే డబ్బివ్వలేకపోయానా? ఎందుకింత మొండితనం?" అన్నారు శాస్త్రిగారు. నేను జవాబియ్యలేదు. "నీకొక రహస్యం చెప్పనా? నీవు నాస్తికుడినంటావు. నా మాటల్లో, నా చిత్తశుద్ధిలో నమ్మకం ఉంది కదా?" అన్నారు. "ఇదేమిటి సార్! భగవంతుడి సంగతి నాకు తెలీదు గాని బుద్ధుని పైన, మీ పైనా, గాంధీజీపైనా నాకు సంపూర్ణ విశ్వాసం" అని అన్నాను. "అయితే విను. ఈ వారం పదిరోజులూ నీ కోసం ఎంత ఆందోళన పడ్డానని?" ఎంత తిన్నా హరించుకుపోయేది. ఆకలి! ఆకలి! దయ్యపు తిండి. అంతా ఏమైపోతోందో! నీ సంగతి విన్న తర్వాత నాకర్థమైంది. నా అన్నరసమంతా నీకు సప్లై అయింది" అన్నారు. వారి మాటలను శాస్త్రీయంగా నిరూపించలేను గాని, ఆపన్నుల పాలిటి అమృత భాండమయిన ఆయన హృదయాన్ని ఎరిగిన నేను ఆ మాటలు నమ్మాను. నమ్ముతున్నాను.

నాకు పాపచింత వల్ల మలేరియా వంటి జ్వరము వచ్చిందన్నాను గదా! 'ఆస్పత్రిలో పది పదహైదు దినాలున్నా శాస్త్రిగారు నా యోగ క్షేమాలు తెలుసుకోలేదే' అని కొంచెం అసంతృప్తి కలిగింది. ఆలోచనలో నిద్ర పట్టింది. అప్పుడొక అపూర్వదృశ్యం కనిపించింది. అది కల గాదు. మగత నిద్రలో అర్ధ సుషుప్త్యవస్థలో సంఘటన. ఒక గోడకు మూడు పటాలు ఉన్నాయి. మొదటిది బుద్ధునిది, రెండవది గాంధీజీది; మూడవది కొంచెం క్రిందుగా ప్రభాకరశాస్త్రి గారిది. ఇదేమిటి ఈ ప్రాచ్యలిఖిత పుస్తకాలయంలోని పండితుడు - గొప్ప పండితుడే కావచ్చు గాక - బుద్ధ, గాంధీజీలతో సమానులా? అబ్బే! బాగా లేదు - అని అనుకొని, పటం ఆ వరుసలో కొంచెం కిందికే ఉందిలే అని సంతృప్తి పడ్డాను. ఈ సంగతి శాస్త్రి గారికి తెలిపాను. "అయితే నేను థర్డ్ క్లాసన్నమాట"

అని ఛలోక్తి విసిరారు శాస్త్రిగారు. "మిమ్ముల్ను బుద్ధునితో, గాంధీతో సమానంగా ఎలా చూడను సార్?" అన్నాను. "అయితే కుడి నుంచి లెక్క పెట్టు. నేనే ఫస్ట్" అన్నారు నవ్వుతూ.

నా దృష్టిలో మరొక గొప్ప సంఘటన డాక్టర్ యల్లాప్రగడ సుబ్బారావుగారి అమెరికా పయనం. ప్రపంచ విఖ్యాత వైద్యశాస్త్రజ్ఞుడు డాక్టర్ యల్లా ప్రగడ సుబ్బారావు గారు మద్రాసులోని ఇండియన్ మెడికల్ కాలేజీలో ఎల్.ఐ.ఎం.లో ఉత్తీర్ణులయి మద్రాసు కార్పొరేషన్ ఆయుర్వేద వైద్యశాలలో పనిచేసేవారు. జీతం నెలకు అరవై రూపాయలు.

వారానికి ఒకసారి మైలాపూర్‌లోని కపాలేశ్వరస్వామి గుడి పుష్కరిణి మెట్లపై కలుసుకునే వారం. యల్లాప్రగడ సుబ్బారావుగారు, ప్రసిద్ధ చిత్రకారుడు చేమకూర సత్యనారాయణ, మూడు ఎం.ఏ.ల మాడభూషి వెంకటాచారి, మరికొందరూను, మాకు సంబంధించని పలు విషయాలపై చర్చలు మహావేశంతో జరిగేవి. చేమకూర సత్యనారాయణ "దేవాంగులతో వాదించక" అని అశ్లీలగర్భితమైన విసుర్లు విసిరేవారు. ఆయన దేవాంగులు.

ఈ గోష్ఠులలో యల్లాప్రగడవారు సర్పగంధిని గురించి, వాస (అడ్డసరం) గురించి, మరెన్నో ఓషధులను గురించి సోదెగా మాట్లాడేవారు. "నాకెవరైనా పదివేల రూపాయల పెట్టుబడి పెడితే సర్పగంధితో అద్భుతాలు చూపుదును" అనేవారు. సత్యనారాయణ గారు "బాబూ! నీ సొద చాలించవయ్యా. ఏ అమెరికా వాళ్లో నీకు సహాయం చేయాలి. మా చెవులు చిల్లులు పడ్డాయి. చంపక!" అనే వారు ఛలోక్తిగా.

ఒక గోష్ఠినాడు పెద్ద వర్షం కురిసింది. తలదాచుకోడానికి పుష్కరిణి పరిసరాల దుకాణాల చూరుల కింద నిలబడ్డాము. ఒక విదేశీయుడు కూడా అక్కడ మాతో పాటు నిలుచున్నాడు. సుబ్బారావు గారు సహజ ధోరణిలో ఆంగ్లంలోనే సర్పగంధిని గురించి దంచేస్తున్నారు. ఆ విదేశీయుడు ఆసక్తితో వింటున్నాడు. మాకు మామూలే, అతడు విని విని, "ఎస్! యంగ్ డాక్టర్! నీ మాటలు గంటగా వింటున్నాను. నీ మాటలను నీవు నిరూపించుకోగలవా? నేను అమెరికాలోని ఒక మందుల సంస్థ ప్రతినిధిని" అన్నాడు.

సుబ్బారావుగారు ఆశ్చర్యంతో అతన్నే చూస్తూ – "ఎస్. సార్ ప్రూవ్ చేస్తాను సార్. పదివేల పెట్టుబడితో ఆరు నెలలు గడువివ్వండి సార్. నేను మాట నిలబెట్టుకోకపోతే భారతదేశానికి పంపివేయండి సర్.....?" అంటూ పిచ్చిగా పలవరించాడు. ఇంతలో

వాన వెలిసింది. ఆ అమెరికన్ సుబ్బారావుగారి భుజం తట్టి "యంగ్‌మాన్! నేను రేపు వెళ్లుతున్నాను. మా సంస్థ డైరెక్టర్లతో మాట్లాడి నీకు రెండు నెలల్లో ఉత్తరం రాస్తాను. నీకు ఇబ్బంది లేకుండా ఇక్కడి అమెరికన్ కాన్సలేట్ ప్రయాణం టికెట్, వీసా, ప్యాస్‌పోర్టు మొదలయినవి ఏర్పాటు చేస్తుంది. నీవు చెప్పే సప్పాగాండీ ఒకటి ఫలించినా చాలు. సిద్ధంగా ఉండు" అని మా కందరికి ఒక సెల్యూట్ కొట్టి వెళ్లిపోయాడు.

మరుసటి సమావేశం నుంచి "ఎప్పుడు వస్తుందో"! అని "ఇంకా రాలేదే?" అని అందరినీ విసిగించారు సుబ్బారావుగారు. "ఎందుకయ్యా, అంత తొందర? అతడు పెద్ద మనిషిలా ఉన్నాడు. మేమంతా నమ్మాం. నీవూ నమ్ము!" అంటూ ఊరించేవారు సత్యనారాయణగారు.

ఆరు వారాల తర్వాత నిజంగానే లెదర్లే కంపెనీ నుంచి సుబ్బారావు గారికి జాబు వచ్చింది. "యంగ్ డాక్టర్! మా ప్రతినిధి వల్ల నీ ఉత్సాహం, ఓషధీ విజ్ఞానం తెలుసుకున్నాం. ప్రజల కోసం కొత్త మందులు కనిపెట్టడం మా సంస్థ లక్ష్యం. నీ ఓషధులలో ఒక్కటి ప్రజోపకరమైనా సంతోషిస్తాం నీవు నెలలోగా ఢిల్లీలోని మా సంస్థ కార్యాలయం చేరు. నీ ప్రయాణం ఏర్పాటు అక్కడ చేస్తారు." ఇది జాబు సారాంశాం.

ఆ జాబును మాకు వందసార్లు చదవి వినిపించారు. "మొనగాడంటే నీవే నయ్యా! పిచ్చిని సచ్చంగా మార్చుకొన్న మొనగాడివి" అని సత్యనారాయణ గారు అభినందించారు. మా కందరికీ తమ ఇంట్లో విందు చేశారు.

ఆ సమయంలో సర్ కె.వి.రెడ్డి నాయుడుగారు మద్రాసు గవర్న రయ్యారు. తెలుగు వారు గవర్నర్ కావడం గొప్ప కదా! బ్రిటిష్ ప్రభుత్వ కాలంలో దానికి అనుకూలంగా ఉండడంతో పాటు సమర్థత కూడా చూచేది. ఇప్పుడయితే పాలకపక్షం వాడయితే చాలు; గవర్నర్లయిపోతున్నారు. సంవత్సరం సరిగా గుర్తులేదు. 1935-36 అనుకుంటాను. తిరుపతి వెంకటకవులలో వారయిన చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి వారు శిష్యులు గనుక వారి ఇంట్లోనే వెంకటశాస్త్రి గారికి బస ఏర్పాట్లు చేశారు. వెంకటశాస్త్రిగారు ఎప్పుడో, కొన్ని దశాబ్దాల క్రితం చెన్నపురికి విజయం చేశారు, తర్వాత ఇదే కనుక సర్ రెడ్డి నాయుడుగారు వారికి సన్మానసభ ఏర్పాటు చేశారు తమ అధ్యక్షతన. గరవ్నర్ తలచుకుంటే కానిది ఏముంది? చైనా బజారులోని అప్పటి పచ్చయప్ప కళాశాలలో సన్మానసభ జరిగింది.

ఆ సన్మానం మద్రాసులోని మేధావుల కంతా కలకాలం స్మరణీయ మయింది. ఆ పచ్చయప్పహాలులో పదివేల మంది హాయిగా కూర్చోవచ్చు. మద్రాసు రాష్ట్రంలోని వివిధ భాషల కవి పండితులకు ఆహ్వానాలు అందాయి. అలాటి సన్మాన సభను తర్వాత నేను దక్షిణాపథంలో చూడలేదు. చెన్నపురిలో ఆంధ్ర మహాసభ, ఆంధ్రనాటక పరిషత్తు వంటివే కాక, తమిళ కన్నడ మలయాళాది భాషల సంఘాలు కూడా వెంకటశాస్త్రిగారిని సన్మానించాయి. అదొక గొప్ప ఉత్సవం. దాదాపు మూడు గంటలు వెంకటశాస్త్రిగారు, దంటు సుబ్బావధాని గారు మొదలయిన ఆయన శిష్యులు వెంట గమకులుగా ఉండగా, కొన్ని అవధానాల, వందల పద్యాలు పఠించారు. చివరికి వెంకటశాస్త్రిగారు "ఏనుగు నెక్కినాము, ధరణీశులు మెచ్చగ నిక్కినాము" అంటూ తమ రెండు గంటల ప్రసంగాన్ని ముగించారు. కరతాళ ధ్వనులు అణగడానికి అరగంట పట్టింది. సర్ రెడ్డినాయుడు మొదలైన వారు వెంకటశాస్త్రిగారిని ముక్త కంఠంతో ప్రశంసించారు. నేను మొదటి నుంచి చివరి వరకూ వారిని అంటిపెట్టుకునే ఉన్నాను, సేవ కోసం.

అలాటి వారి అస్తమయం వల్ల దేశానికి అన్ని విధాల లోటే. ఒక ప్రాకృత కవి అలాటి లోటును సహజ విషాదంగా, తన అనుభవసారం నుంచి ఇలా వర్ణించాడు.

**"సు అణో జం దేం అలంకరేఇ**
**తం విఅ కరేఇ పవసంతో,**
**గామాస ణ్ణమ్మాలి అ**
**మహా పడట్ఠాణ సారిచ్ఛమ్."**

**సజ్జనుడు ఎక్కడ ఉన్నా ఆ ప్రాంతానికి అలంకారంగా ఉంటాడు. అక్కడి నుంచి వెళ్లిపోయాడా పెద్ద వెలితి ఏర్పడుతుంది. దానిని పూరించడం కష్టం. గ్రామసమీపంలో ఒక ఊడల మర్రి ఉందనుకుందాం. అది కూలిపోతే, దాని స్థానంలో ఎన్ని చెట్లు మొలిచినా, మొదటి అందం, గాంభీర్యం, ఉపయోగం ఎలా కలుగుతాయి? ఆ వెలితి ఎలా తీరుతుంది?**

# 50

# నాగేశ్వర సందర్శనం

"పొట్ట భరంతి స ఉణా
వి మా ఉ అప్పణో అనువ్విగ్గా
విహాలుద్ధరణ సహోవా
హువంతి జ ఇకేవి సప్పురిసా"

**(పక్షులు కూడా ఎలాటి ఒడిదొడుకులూ లేకుండ తమ పొట్ట పోసుకుంటాయి. అది ఒక గొప్ప సంగతి కాదు. ఆర్తులను ఉద్ధరించే స్వభావం గల సత్పురుషులు కొందరే ఉంటారు.)**

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఈ ఆర్యకు ముమ్మూర్తులా ఉదాహరణ. నేను వారిని మైలాపూర్ సంస్కృత కళాశాలలో విద్యార్థిగా ఉన్నప్పుడే దర్శించాను. పంతులుగారు సూర్యోదయ సమయంలో పాఠశాలకు సమీపంలోని లజ్ ప్రాంతంలో వారి భవనం శ్రీబాగ్‌లోని తోటలో భగవద్గీతాది పారాయణం చేసుకుంటారని విని ఒక ఉదయం అక్కడికి వెళ్లాను. అప్పుడే పారాయణ ముగించి పత్రికను తిరగవేస్తున్నారు వారు. నేను వారిని సమీపించి నా సంగతులు వివరించి సాహాయ్యాపేక్షతో రాలేదని, కేవలం దర్శనార్థం వచ్చాననీ అన్నాను. వారు నన్ను వాత్సల్యంతో చూస్తూ 'సాహాయ్యం అడిగినా తప్పులేదు'. ప్రపంచంలో మానవమాత్రుడు

ఇతరుల సాహాయ్యం లేనిదే మనలేడు. ఆ సాహాయ్యంలో రూపభేదం ఉండవచ్చు అంతే" అంటూ 'ఆంధ్రపత్రికకు వస్తూండు, బాగా చదువుకో, ఏమన్నా వ్రాయి పత్రికకు' అన్నారు.

నేను కుట్రకేసులో చిక్కుకున్నందున 1934 చివరి వరకు రాకపోకలు తగ్గించాను. ఆ భయం తీరిన తర్వాత తరచు ఆంధ్రపత్రిక కార్యాలయానికి, ముఖ్యంగా భారతి పత్రిక విభాగానికి వెళ్లేవాడిని.

ఆంధ్రపత్రిక అప్పుడొక సముద్రం. టాబ్లాయ్డ్ సైజులో దాదాపు 30 పుటల దినపత్రిక. వారపత్రిక విడిగా. భారతి సరేసరి, ఆంధ్రవాఙ్మయానికి కేంద్రం. సబ్ఎడిటర్లు ఒక మంద – అంటే నిరసనతో అనడం లేదు. ఏబయి అరవై మంది పత్రికలో, పది పదిహేను మంది వార పత్రికలో. ఆరేడుగురు భారతిలో. పంతులుగారు తమకు సమర్థులని తోచిన వారినంతా సబ్ఎడిటర్లుగా చేరమనే వారు. పుటకు ఇద్దరు చొప్పున ఉండేవారు. భారతిలో మా గురువుగారు తిరుమల వెంకట రంగాచార్యులుగారు ఉండనే ఉన్నారు.

భారతి సంపాదకులు గన్నవరపు సుబ్బరామయ్యగారు. ఆయన అద్భుతవ్యక్తి. స్వయంకృషితో పండితుడయిన వారు. సంభాషణ చతురులు. ఎదుటివారి స్థాయిని బట్టి ఒకొక్కప్పుడు పచ్చిబూతులూ ఆడేవారు. ఆయన అదృష్టమేమిటో, అవి జుగుప్సాకరంగా ఉండేవి కావు. నన్ను తొలిసారిగా చూచినప్పుడు "కోఽయం క్షీర కంఠః" (ఎవరీ పాలు తాగే పసివాడు?) అన్నారు. ఆయన ఎదుట నేను క్షీరకంఠుణ్ని కాక మరేమిటి? కొంపెల్ల జనార్దనరావుగారు, ఒంగోలు వెంకటరంగయ్య గారి కుమారుడు పద్మరాజుగారు, ప్రతివాది భయంకర ఆచార్యులు ఒకరు – ఇలా ఒక విషయానికి ఒకరు.

మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, వెల్లాల సుబ్బారావు అనేవారూ, మరికొందరు ఆంధ్ర విజ్ఞాన సర్వస్వంలో పనిచేసేవారు. నాగేశ్వరరావు పంతులు గారు భారతదేశంలోనే విజ్ఞానసర్వస్వం ప్రారంభించిన మొదటి వారేకాక, బ్రిటిష్ ఎన్సైక్లోపీడియా ప్రారంభకులలోను ఒకరు. అప్పుడు (అటు తర్వాత కూడా) ఆంధ్రపత్రికలో చేరిన వారు వెళ్లిపోవడమనేది లేనే లేదు. అక్కడి సంబంధాలు అటువంటివి. ఇక కార్మికులలో ఆయనతో బొంబాయి వెళ్లి తిరిగివచ్చి జన్మాంతం కొలువులో ఉన్నవారు చాలమంది.

త్యాగరాయుడు అనే కంపోజిటర్ ఉండేవాడు. అతడు బాల్యంలో అక్కడే పనిచేసే తండ్రితోపాటు ఆంధ్రపత్రికా కార్యాలయానికి వచ్చాడు. పంతులుగారి కంటబడ్డాడు. అతని చురుకుదనం చూచి "బొంబాయికి వస్తావటోయ్!" అనడిగారు. తండ్రి తల ఊపాడు. ఎనిమిదేళ్ల కొడుకూ తల ఊపాడు. అతడు నేను 1959లో భారతిలో చేరినప్పుడు ఫోర్‌మాన్. అప్పటికి డెబ్బయేళ్ల వయస్సు. ధనకోటి అనే ఫోర్మన్ కూడా అలాటి వాడే. ఎనిమిదేళ్లప్పుడు ఐదో తరగతి చదివి కంపోజిటరుగా చేరాడు. భారతిలో ప్రముఖులు! గొప్పవారమని చెప్పుకునే వారి వ్యాసాలలోని స్ఖాలిత్యాలు, విషయప్రమాదాలు ఎత్తిచూపి సవరించేవాడు. వ్యాసాలు చదివి విచక్షణతో మంచి చెడ్డలు చెప్పగలిగేవాడు. కార్మికులందరూ చాల వరకూ ఇలాటి వారే, ఉద్యోగుల్లోను ఎక్కువ శాతం. నేను హరిజనోద్యమ సమయంలోను, శ్రీబాగ్ ఒడంబడిక సమయంలో శ్రీబాగ్‌కు చాలాసార్లు వెళ్లాను. హరిజనోద్యమంటే గుర్తుకు వచ్చింది. నేను ఎవరి సిఫార్సుతోనో - బహుశా వావిలాల గోపాలకృష్ణయ్యగారి సిఫార్సుతో ననుకుంటాను - గాంధీజీ కోస్తా హరిజనోద్యమ పర్యటన బృందంలో వాలంటీరుగా ఉన్నాను. గాంధీజీతో పాటు పర్యటించాను. (ఇలాంటి పర్యటనలు నేను క్యాష్ చేసుకోలేదు.)

ఆ సమయంలో మద్రాసులో ఒక చిక్కులో పడ్డాను. నేను మద్రాసులో మాంబళం నుంచి నుంగంబాకం మీదుగా ఎగ్మూరుకు నడిచివస్తున్నాను. అడ్డదారిగా ఒక తోటలో దూరాను. అక్కడ ముప్ఫై నలభై మంది హరిజన బాలురు హాకీ ఆడుతున్నారు. నా వేషం చూచి వాడిలో ఒకడు "అడెడె పాప్పాన్‌డా!" అని కేక వేశాడు. ఆట మాని అందరూ నా చుట్టూ మూగారు. జస్టిస్ పార్టీ వారు కాంగ్రెస్ కార్యక్రమాలన్నిటినీ వక్రభాష్యాలతో వక్రీకరిస్తున్న కాలం. ఒకడు కొట్టు అన్నాడు. తలా ఒక దెబ్బ వేసినా నేను హరీ అంటాను. నేను లోపల భయపడుతున్నాను. మేకపోతు గాంభీర్యంతో వాళ్లలో పెద్దవాణ్ని ఒకణ్ని దగ్గరికి పిలిచినాను. "అబ్బాయి! చూడు, నేను కాంగ్రెస్ వాణ్ని. అది నా వేషమే చెబుతుంది. హరిజనోద్యమంలోను ఉంటున్న వాణ్ని, మీకు మిత్రుడినే కాని, శత్రువును కాను, మీరు ఒక్కొక్కరు ఒక్కో దెబ్బ వేసినా చాలు, నేను ఫైసల్. అనవసరంగా నన్ను బాధ పెట్టడం వల్ల మీ పెద్దలకు చెడ్డ పేరు రావచ్చు. కొట్టదలిస్తే కొట్టండి" అని ఉత్తరీయం తీసిపారేసి నిలుచున్నాను. వారిలో మనఃపరివర్తన కలిగింది. అరగంటసేపు వాళ్లలో వాళ్లు మాట్లాడుకున్నారు. 'విట్టు విడుడా, పావం'



ఆంధ్ర శేషగిరిరావు

(విడిచి పెట్టరా పాపం!) అని పెద్ద అబ్బాయి అన్నాడు. 'పోంగో అయ్యరే!' అంటూ అందరూ ఒకే మాటగా అన్నారు. నేను వాళ్లను ఆశీర్వదిస్తూ కదిలాను. ఇప్పుడిది సామాన్య విషయంగా కనిపిస్తుందిగాని, అప్పుడు జీవన్మరణ సమస్య.

అప్పుడు పరిచితులయిన వారిలో నాకు చాలా ఆత్మీయులయిన వారు పత్రకార పితామహులు ఆంధ్ర శేషగిరిరావు గారు. ఆయన ఆంధ్రభూమి అనే మాసపత్రికను నడిపేవారు. ఆంధ్ర రాష్ట్రం వచ్చే వరకు క్షవరం చేసుకోనని దీక్ష పట్టారు. నల్లటి బవరి గడ్డంతో ఆపస్తంబుడిలాగా ఉండేవారు. "మీ ప్రాం తంలోని బసివి పద్ధతి గురించి వ్రాయండి, అది వ్రాయండి, ఇది వ్రాయండి" అని ఎప్పుడూ ప్రోత్సహిం చేవారు. ఇప్పుడున్న పత్రికా రచయితలలో ఆంధ్రదేశంలోనే కాదు, భారత దేశంలోనే ఆయన జ్ఞానవయోవృద్ధులు. ఇప్పటికీ రచనలు చేస్తుంటారు. వయసు దాదాపు తొంబయ్యయిదు. నేను వీరిని 1994లో విశాఖపట్నం ప్రొఫెసర్ డాక్టర్ మల యవాసిని గారింట దర్శించి పాతజ్ఞాపకాలు గుర్తుతెచ్చాను. డాక్టర్ మలయవాసిని గారు శేషగిరిరావుగారి పుత్రికారత్నం.

సుబ్బరామయ్యగారి పరిచయం నాకు ప్రయోజనకరమయింది. భారతికి సంస్కృత సాహిత్యం గురించి ఏదైనా వ్రాయమనేవారు. భారతిలో వ్యాసం ప్రచురితం కావడమంటే మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి గౌరవ డి.లిట్ . బిరుదం పొందినంత సమ్మానమని విశ్వసించే కాలమది. నేను ప్రభాకరశాస్త్రి గారి ప్రోత్సాహంతో వారి భావాలను అనుసరించే "ఆంధ్రచ్ఛందో విశేషములు" అనే వ్యాసం పంపాను. అది భారతి 1935 సెప్టెంబర్ సంచికలో ప్రచురితమైంది. ఇతరులు ప్రశంసించక ముందు నా వీపు నేనే తట్టుకున్నాను. నెల తర్వాత మద్రాసుకు ఏదో పనిమీద వచ్చిన రావుసాహెబ్ గిడుగు రామమూర్తి పంతులుగారు ప్రభాకరశాస్త్రిగారింట్లో ప్రార్థనా సమయంలో కలిసినప్పుడు, శాస్త్రిగారితో "ఎవరో ఈ నెల భారతిలో వఝుల చిన సీతారామశాస్త్రిగారి వాదం ఖండిస్తూ మంచి వ్యాసం వ్రాశారండీ. మంచి జవాబే." అని అన్నారు. శాస్త్రిగారు నన్ను చూపారు. నా వైపే చూచి ఆయన ఆశ్చర్యపడుతూ "ఎవరో పెద్ద శాలువా పండితులనుకున్నాను.

కుర్రవాడే!" అన్నారు మెప్పుగా. నేను రెండవ డి.లిట్. బిరుదం ఇచ్చినంతగా సంతోషించాను.

భారతిలో నా మొదటి వ్యాసంతో నాకు ఆ రాత్రి నిద్రే పట్టలేదు. 1935 డిసెంబర్‌లో 'ఎసగు-పొసగు, అనే నా వ్యాసం పడింది. ఎసగులో అరసున్న ఉందా లేదా అనేది ఈ వ్యాసం సారాంశం. ఇది కూడా ప్రభాకరశాస్త్రిగారి సిద్ధాంతానికి సంబంధించే. ఆ నెల నేను భారతి కార్యాలయానికి వెళ్లినప్పుడు సుబ్బరామయ్య గారు "క్షీరకంఠా! ఒకరి సిద్ధాంతాలను సమర్థించడం సరే. అంతకన్నా నీవు నీవుగా ఆలోచించి కొత్త విషయాలు చెప్పడానికి ప్రయత్నించు. తెలుగు నాట కవిపండిత పరిశోధకులలో ఎన్నో వర్గాలున్నాయి. వాటి గతులు పరిశీలిస్తూ స్వతంత్రంగా ఆలోచించడం ఆరంభించు" అన్నారు.

ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రేరియన్ హనుమంతాచార్యులుగారు కర్నూలు జిల్లా వారు. రాయలసీమ ప్రాంతాల పండితుల నుంచి తాళపత్ర గ్రంథాలు సేకరించమని నన్ను ప్రోత్సహించారు. నేను ఒకమారు – అప్పటికి కేసు బాధ తొలగి, కాంగ్రెస్ పార్టీ రాష్ట్ర శాసనసభలో ప్రవేశించదలచింది గనుక, స్వేచ్ఛగానే తిరగనారం భించాను గనుక – మా మేనమామగారు పేరంగూరు తిరునారాయణాచార్యులు గారి శ్రోత్రియం గ్రామం రాఘవంపల్లెకు పోయి, శ్రీకృష్ణ బ్రహ్మతంత్ర పరకాల స్వామివారు పూర్వాశ్రమంలో రచించిన 'కృష్ణరాయ విజయః' అనే కావ్యం, శ్రీ వైష్ణవు లకు అత్యంత ప్రమాణమయిన 'పరాశరస్మృతి' మొదలయిన పెక్కుగ్రంథాలు సేకరించాను. అలాగే బళ్లారికి వెళ్లాను. మా ఊరికీ వెళ్లాను. హోస్పేటలో సర్వజ్ఞాచారి గారనే వారి వద్ద నుంచి వారి తండ్రిగారు రచించిన 'సూత్రార్థామృతలహరీ' అనే గ్రంథం సంపాదించాను. ఇది ద్వైతాద్వైతా విశిష్టాద్వైత సిద్ధాంతాలు మూడూ వివరిస్తూ బ్రహ్మసూత్రాలకు చేసిన గొప్ప వ్యాఖ్యానం. దాని తర్వాత మూడు దశాబ్దాలకు ఓరియంటల్ లైబ్రరీవారు ప్రచురించారు.

'కృష్ణరాయ విజయః' నా వద్దనే ఉండేది. అది చారిత్రక కావ్యం గనుక ముమ్మడి కృష్ణరాయ ఒడయర్‌కు, హైదర్ టిప్పుసుల్తానులకు జరిగిన యుద్ధాల వివరాలు న్యాయన్యాయాలు చాలా తెలిసేవి. కాని, ఎవరో తస్కరించారు. నా ఉపేక్షకు చాలా పశ్చాత్తాపపడ్డాను. వెంటనే లైబ్రరీకి అప్పగించినా బాగుండేది. సొంతంగా ప్రచురిద్దామనే ఆశతో మొదటికే మోసం కలిగించుకున్నాను.

కాంగ్రెస్‌వారు శాసనసభల్లో ప్రవేశించాలనడం నిర్ణయమైంది గనుక ఆయా ప్రాంతాలలో సత్యాగ్రహులు, కార్యకర్తలు, కారాగార క్లేశం పొందిన వారు ఎవరెవరని ఆరాలు తీయడం ప్రారంభమయింది. అప్పుడు ఆస్తులను బట్టి ఓటింగ్ హక్కు. నేను ఆ ఆస్తిపరుల పరిధిలోనే ఉన్నాను. కారాగారానికి వెళ్లిన వాణ్ని. హొస్పేట తాలూకా వాసులలో మొదట జెయిలుకు వెళ్లిన వాణ్ని. కనుక మా తాతగారు నరసింహాచార్యుల వారి శిష్యులయిన హొలహర్వి సీతారామరెడ్డి మొదలయినవారు మా తాతగారితో సంప్రతింపులకు వచ్చారు. నేను కాకతాళీయంగా అక్కడికి వెళ్లాను. నన్ను బళ్లారి జిల్లాలో ఒక నియోజకవర్గం నుంచి అభ్యర్థిగా నిలబెడతామన్నారు. ఎంతగానో నచ్చజెప్పారు. కాంగ్రెస్ పార్టీకి జనాదరం ఉంది కనుక విజయం తథ్యమనీ గట్టిగా చెప్పారు. కాని, మా తాతగారు ఒప్పుకోలేదు. క్రియాశీల రాజకీయాలు వద్దని గట్టిగా చెప్పారు.

అప్పుడు హొస్పేట వ్యాస్తవ్యులు సర్వజ్ఞాచారి గారి కుమారుడు, న్యాయవాది అయిన చక్రపాణి గారిని నిలబెట్టారు. ఆయన పెద్ద మెజారిటీతో గెలిచారు. నేను మద్రాసు తిరిగి వచ్చాను. అప్పుడు చెన్నపట్నంలో ఉన్న తెలుగు ప్రముఖులలో కనుపర్తి మార్కండేయశర్మగా రొకరు. ఆయన గొప్ప సంస్కృతాంధ్ర పండితులు, సంస్కర్తలు, ధర్మప్రబోధం కోసం ఒక మాసపత్రికను నడిపేవారు. కొన్ని సంస్కృతాంధ్ర గ్రంథాలు ప్రచురించారు. వాటిలో సుందరపాండ్యుని నీతి ద్విషష్టికా అనే గ్రంథం ఒకటి. ఇది క్రీ.శ. ఐదు, ఆరు శతాబ్దులది. ఆర్యచ్ఛందస్సులో ఉంది. దీనిని మూడు నాలుగు దశాబ్దాల తర్వాత సుగృహీత నామధేయులు రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు 'ఆర్యా' అనే పదంతో తెలుగు చేశారు.

బెజవాడ గోపాలరెడ్డిగారి వివాహం 1935-36లో జరిగినట్టు గుర్తు. ఉన్నవ లక్ష్మీనారాయణగారు పురోహితులు. నేను శాస్త్రిగారింట్లో ఉన్నప్పుడు ఆయన వచ్చారు. "ఏమోయ్! నాకు అసిస్టెంట్‌గా ఉంటావా?" అన్నారు. "అయ్యా! నాకు పెళ్లి మంత్రాలు వచ్చు గాని తంతు తెలీదు" అన్నాను. "తంతుకేముంది? నేను ఉన్నాగా, మంత్రాలు సస్వరంగా చదువుచాలు" అన్నారు. సరే వెళ్లాను. కాని ఆయనకు మరి కొందరు అసిస్టెంట్స్ వచ్చారు. గోపాలరెడ్డిగారి పెళ్లికదా, నేను స్టాండ్‌బైగానే ఉండిపోయాను. కనుక అక్కడి నాయకుల దృష్టిలో పడలేదు.

గన్నవరపు సుబ్బరామయ్యగారితో నాకు సాన్నిహిత్యం బాగా పెరిగింది. తరచు

వాళ్ల ఇంటికి వెళ్లేవాణ్ని. ఎన్నో చర్చలు. ఆయన సతీమణి సుబ్బాయమ్మ గారు తల్లిలాగ చూచేవారు. అప్పుడప్పుడు భోజనానికి కూడా లేచేవాణ్ని. 'రేపు మా ఇంట్లో నాన్నగారి శ్రాద్ధం. ఇష్టపంక్తికి రావోయ్' అన్నారు సుబ్బరామయ్యగారు. నేను వెళ్లాను. మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు పురోహితులు. ఆయనది వీరాంధ్రం, భగవంతుడు సర్వజ్ఞుడు, సర్వవేత్త, తెలుగు రాదనడం కుదరదు గదా, కనుక తెలుగు తద్దినం పెడదాముఅన్నారు. ఆయన చేసే సంధ్యావందనం కూడా తెలుగులోనే. ఆయన 'తెలుగు గుడి' అనే సంస్థ స్థాపించి 'నుడికడలి' అనే నిఘంటవును ప్రారంభించారు. నేను తిరుచిరాపల్లి జెయిలు నుంచి విడుదల కానుండగా, ఆయన వచ్చారు. మూన్నాళ్లు ముచ్చటగా సహవాసం.

తద్దినం ప్రారంభమయింది తెలుగులో. తంతుకు మంత్రాల క్కూడా చక్కని అనువాదం.

**సమస్త సంపత్సను నాస్తి హేతనః**
**సముత్తితాపత్కుల ధూమకేతవ ।**
**అపార సంపార సముద్ర సేతవః**
**పునంతు మాం బ్రాహ్మణ పాదపాంసవః ॥**

అని ప్రారంభమయ్యే శ్రాద్ధం మంత్రం తెలుగు తద్దినంగా "అన్ని సంపదలకు ధూమకేతువులూ అపారమయిన సంసార సముద్రం దాటడానికి వంతెనలూ అయిన బ్రాహ్మణ పాదరేణువులు నన్ను పవిత్రం చేయుగాక!" అంటూ "నమస్కారం చేయండి"గా రూపొందింది. ఆయన భగవంతుని 'ఎల్లడు' అనే వారు. "అయ్యా విశ్వేదేవులూ దయచేయండి. ఇదిగో అర్ఘ్యం, ఇదిగో పాద్యం, సకల విధాల పూజించాను. ఆ ఆసనంపై కూర్చోండి, ఇలాగే పితృస్థానం వారు. విష్ణుస్థానం వారూను, అయ్యా వడ్డన అయింది. ఇది అన్నం, ఇవి భక్ష్యాలు, ఇవి కూరలు. ఇవి పచ్చళ్ళు. ఇది పప్పు, అన్నం అమృత స్వరూపం. రాత్రికి మరీ ఆకలి కాకుండా మీకు ఇష్టమైన వాటిని మారు అడుగుతూ కడుపు నిండా భోజనం చేయండి. భోజనానంతరం అయ్యా అన్నశేషం ఏమి చేయమంటారు? ఇష్టులతోపాటు భుజించండి" ఇలా సాగింది, తద్దినం. ఆశ్చర్యంతో నోరు తెరుచుకుని చూస్తూ వింటూండిపోయాను. రామ చంద్రశాస్త్రిగారిని చూచిన తర్వాత ఒక లక్ష్యసిద్ధికి అంత మొండితనము, పిచ్చి అనిపించే ధోరణీ అవసరమేమోనని అనిపించింది.

ఈలోగా ఓరియంటల్ లైబ్రరీలో శాస్త్రిగారు మూడు నెలలు సెలవు పెట్టారు. నేను అక్కడ కాపీయిస్టును. విద్వాన్ ప్యాసయిన వాడిని గనుక నన్ను ఆ స్థానంలో నియమించారు. అసిస్టెంటుగా ఉన్న వెంకటసుబ్బాశాస్త్రి గారిని నియమించవలసింది గాని ఆయన విద్వాన్ కాదు. ఆ మూడు నెలలూ నేను తాళపత్ర గ్రంథాల వర్ణాత్మక సూచి సిద్ధపరచడం మొదలైన పనులు చేశాను. తర్వాత వెంకటసుబ్బాశాస్త్రిగారూ రెండు మూడు నెలలు సెలవు పెట్టారు. ఆయన స్థానంలోను నేను పనిచేశాను.

మద్రాసు విశ్వవిద్యాలయం సంస్కృత శాఖ వారు కొన్ని వందల సంస్కృత లిఖిత పుస్తకాలు సేకరించారు. మానవల్లి రామకృష్ణకవి గారిని వాటి క్యాటలాగు సిద్ధపరచడానికి నియమించారు. కవిగారు ఓరియంటల్ లైబ్రరీలో నాకున్న అనుభవాన్ని బట్టి నన్ను సహాయుడుగా నియమించుకున్నారు. కవిగారితో కలిసి పనిచేసే గొప్ప మహారాజయోగం నాకు కలిగింది. వారి ప్రతిభను దగ్గర నుంచి చూచాను.

పని మొదలైన మొదటి దినం ఉదయం 10-30 నుంచి సాయంకాలం 5.00 వరకు పని. మధ్యాహ్నం ఒంటి గంట నుంచి రెండు గంటల వరకు ఉపాహార విరామం. మొదటి రోజు ఒంటిగంట కొట్టింది. "ఆచార్లూ లేవవయ్యా, లేవవయ్యా!" అని కవిగారు కేకవేశారు. నేను తాళపత్రాల కట్టల నుంచి ఏ పామో, తేలో వచ్చిందని గాభరాపడి లేచాను. " అంత గాభరా ఎందుకు? ఒంటి గంటయింది, లంచ్‌కు లేవమన్నాను." అన్నారు నవ్వుతూ. మా పని మద్రాసు విశ్వవిద్యాలయం భవనాలలో. పక్కనే రెవిన్యూ బోర్డ్ క్యాంటీన్. అది విశ్వవిద్యాలయం క్యాంటీన్ కంటే బాగుండేది. అక్కడికి వెళ్లాము. అణాకు నేతి మసాల దోసె ఒకటి తింటే కడుపు నిండిపోయేది. ఆయన ఏకంగా నాలుగు దోసెలు తెమ్మన్నారు. "ఎందుకు సార్ నాలుగు?" అనడిగాను. నీకు రెండు, నాకు రెండు అన్నారు ఆయన. నేను ఒకటి కన్నా తినలేనండి అన్నాను వినయంగా. సరే నేను మూడు తింటానులే!" అన్నారు. ఆయన మంచి భోక్త. అప్పటికే ఆయన వయస్సు డెబ్బయి పైచిలుకు. ఆయన భోజన పరాక్రమం నాకు తెలుసు గనకు నేనేమీ ఆశ్చర్యపడలేదు.

ప్రభాకరశాస్త్రిగారూ మంచి భోక్తలే. రెండు కూరలూ, రెండు పచ్చళ్లూ, ముద్దపప్పూ, పులుసూ, చారు, పెరుగూ, శ్రీనాథుడు లక్ష్మణ వర్యుల ఇంట్లో వర్ణించిన చేయి చురుకుమనే నేతి ధార రెండు పూటలూ, నేను దర్శించిన చాలమంది మేధావులు

మంచి భోక్తలే. తిండి ఎక్కువ తినడం వల్ల మంద బుద్ధులవుతారనే భ్రమకు అలాటి వారంతా అపవాదం. మహావిద్వాంసులు వేదవ్యాఖ్యాత కరపాత్రీస్వామీ మంచి భోక్తే. ఆయన భిక్షాపాత్ర సింహళ నారికేళంలో సగం. ఒక వాయకు అర్థసేరు సన్నన్నం పట్టేది. ఆయన అన్నీ దాంట్లో వేయించుకొని కలిపివేసి పెద్ద ముద్దలు చేసి తినేవాడు. విదేశ రచయితలతో బాల్జాక్ మొదలయిన రచయితలూ గొప్ప భోక్తలని కవి చరిత్ర చెబుతున్నది.

యోగమిత్రులయిన విస్సా అప్పారావుగారు, ప్రభాకరశాస్త్రిగారు వియ్యంకులయ్యారు. శాస్త్రిగారి జ్యేష్ఠపుత్రిక లలితమ్మ గారికి, అప్పారావు గారి జ్యేష్ఠపుత్రుడు డాక్టర్ రామచంద్రరావు గారికి 1938 ఏప్రిల్‌లో బెజవాడలో వివాహం జరిగింది. నేనూ వెళ్లాను. శాస్త్రిగారు మద్రాసులో బాదంహల్వాకూ, బాదాంఖీర్‌కు ప్రసిద్ధుడయిన కోయంబత్తూరు కృష్ణయ్యర్‌ను పెండ్లి వంటలకు పిలుచుకువెళ్లారు. బెజవాడలో తీవ్రమైన ఎండలు. కృష్ణయ్యర్ డ్రమ్ములతో బాదాంఖీర్ చేశాడు. స్పెన్సర్స్ కంపెనీ నుంచి మంచుగడ్డలు తెప్పించి బాదాంఖీర్‌లో కలిపాడు. పెళ్లికి వచ్చిన వారు పిండి వంటలు మాని బిందెల బాదాంఖీర్ తాగారు. కృష్ణయ్యర్‌ను శాస్త్రిగారు సమ్మానించారు.



గన్నవరపు సుబ్బరామయ్య

మద్రాసులో నా పరిచయ పరిధి పెరిగింది. నేను 'గృహలక్ష్మి' పత్రికలోనే గేయాలూ, అవీ వ్రాసేవాడిని. సంపాదకుడు రామ చంద్రయ్య నా మిత్రుడే. అయినా నేను ఆ మైత్రిని దుర్వినియోగించుకోలేదు. అతనికి ముందు నేను కొన్ని రచనలు పంపాను. త్రిప్పి పంపారు. ఒకసారి కోమలను కలుసుకొని, నీ పేరుతో పద్యాలూ, గేయాలూ, సంస్కృత గేయాలూ పంపుతాను గృహలక్ష్మికి, గాభరా పడక!" అని చెప్పాను. "అన్యాయం కదా!" అన్నది. "అన్యాయమే. కాని పత్రికల వారి బుద్ధి తెలుసుకుందాం." అన్నాను. ఆమె పేరుతో పంపాను. పడ్డాయి. ఇటీవల 1996 నవంబరులో మరణించిన ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు తమ ఆంధ్ర రచయిత్రులు అనే గ్రంథంలో కోమల గేయాలను ప్రస్తావించి ప్రశంసించారు. నవ్వుకున్నాను. రామచంద్రయ్య కాలంలో వ్రాసిన గేయాలలో ఒకదాని ఒక చరణం గుర్తుంది.

**సకలము కర్మాధీనంబని నీ కటకట కన్నుగవ మోడ్చి శూన్యమున**

**ముక్తిని వెదకెద వయ్యో తావకశక్తిని గనుగొన లేకిటు వమ్మగ**

**(శీర్షిక గుర్తు లేదు; తక్కిన గేయాలు గుర్తు లేదు. వెదికి ప్రచురించ దగినంత గొప్పవికావని ప్రయత్నించలేదు.)** గన్నవరపు సుబ్బరామయ్యగారి వల్ల నేను నిరంతర పరిశ్రమ నేర్చుకున్నాను. ఆంధ్రశేషగిరిరావు గారి వల్ల పువ్వు మీద ఈగల్లాగా వాలి వానిలో తేనె కొంచెం సేకరించడం నేర్చుకున్నాను. శేషగిరిరావు గారు సెంచరీ కొడుదురు గాక అని భగవంతుని ప్రార్థిస్తున్నాను.

**నవసాయ ఫలం విహనో నిహవస్సయ విమల జన సముద్దలణం**

**విహలుద్ధరణేణ జసో జసేణ భన కింణ పజ్జత్తం**

పరిశ్రమకు ఫలం సంపద. సంపదకు ఫలం అర్హులను ఆదుకోవడం, అర్హులను ఆదుకున్నందుకు ఫలం కీర్తి. కీర్తి చాలదా? మానవునికి మిగిలేది కీర్తి ఒక్కటే! అది అన్నిటికీ మించిన ఫలం!

# 51

# తంజావూరు సరస్వతీమహల్

భూర్జతాళ పట పట్టికా శిలా
లోహ కాష్ఠ ఫలకేష్ట చర్మసు ।
కాకలే చిర ముపాస్య శారదా
తైజసే వపుషి రాజతే ధునా ॥

**(సరస్వతీ దేవి భూర్జపత్రాలలోను, తాళపత్రాలలోను, గుడ్డలలోను, కడితా పట్టీలలోను, రాతిబండలు, గుండ్లలోను, లోహాలలోను, కర్రపలకలలోను, ఇటుకలలోను, చర్మాలలోను, కాయితాలలోను చాలకాలం వసించి, ఇప్పుడు కాంతిదేహంతో - కాంతిప్రసారంతో జరిగే వివిధ ముద్రణ రీతులలో వసిస్తున్నది.)**

**ఆం**ధ్ర విశ్వవిద్యాలయం ద్విపత భారతాన్ని ప్రచురించదలచి, తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరీ ఉన్న ప్రతులలో సరిచూసి ముద్రణ ప్రతి సిద్ధపరచడానికి తాళపత్ర గ్రంథ పరిశీలనానుభవం ఉన్న పండితులిద్దరు కావాలని పత్రికలలో ప్రచురించింది. ఇలాటి ప్రకటనలపై నాకు విశ్వాసం తక్కువ. ఎందుకంటే ప్రకటన చేసేవారు తమ దృష్టిలో తమ వారిని పెట్టుకుని ఉంటారని, ఇంటర్వ్యూలు అనేవి కేవలం ప్రజలను మోసం చేసే నాటకాలని భావించే వాడిని కనుక. అయినా ఎవరి ప్రోత్సాహంతోనో గుర్తులేదు కాని, ఒక దరఖాస్తు వ్రాసి పంపాను. నాకు తాళపత్ర

గ్రంథ పరిశీలనలోను, వాటిని చూచి వ్రాయడంలోను నాలుగేళ్ల అనుభవం ఉందని, ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో కొన్ని నెలలపాటు పండిట్‌గా పనిచేశానని, చాలా భాషలు, లిపులు వచ్చునని దరఖాస్తులో వ్రాశాను. ఇది జరిగింది 1938 మే ప్రాంతమనుకుంటాను. అప్పటికి విస్సా అప్పారావుగారు ఆంధ్రవిశ్వవిద్యాలయం కళాశాలల ప్రిన్సిపాలుగా ఉన్నారు. నేను దరఖాస్తు పంపిన రెండు నెలలకు కాబోలు అప్పారావుగారు మద్రాసు వచ్చారు. ప్రభాకరశాస్త్రి గారింట్లో దిగారు. నేను యథారీతిగా వారింటికి వెళ్లాను.

ప్రభాకరశాస్త్రిగారు ప్రసంగవశాన, వీరభద్రాచార్యులు కూడ ద్విపద భారతం పరిష్కరణ పండితపదవికి దరఖాస్తు పంపాడటండీ అని నా ఎదుటే అప్పారావుగారితో అన్నారు. "ఓ అలాగా, నాకుదానితో ఏమీ సంబంధం లేదే, అదంతా లక్ష్మీకాంతం గారిది" అన్నారు అప్పారావుగారు. శాస్త్రిగారుగాని, నేను గాని మాటలు పొడిగించలేదు.

భోజనానంతరం అప్పారావుగారు నాతో మాట్లాడుతూ "ఏమోయ్! అప్లికేషన్ వేశానన్నావు గదా! వాళ్లు ఇంటర్వ్యూ చేసి ఏమైనా అడుగుతారనుకో, సిద్ధంగా ఉన్నావా?" అన్నారు. ఉన్నానండి – అన్నాను. కొంత సేపటికి సంఖ్యలపై చర్చసాగింది. "మరి మన తెలుగు అంకెలు ఎలా పుట్టాయంటావ్? ఆలోచించావా, ఎప్పుడయినా?" అని అప్పారావుగారడిగారు.

నేను అది ఇంటర్వ్యూ అని అనుకోలేదు. ఏదో అడ్డదిడ్డంగా ఏదో సమాధానమిచ్చాను. "తెలుగు ఒకటి బోర్లించిన గిన్నెలాగ ఉండడానికి కారణం బ్రహ్మాండాన్ని ఊహించడం. పూర్వం ఒకటి అనడానికి ఒక అడ్డగీత పెట్టేవారు. రెండుకు రెండు అడ్డగీతలు, మూడుకు మూడు. వీటిని విసురుగా వ్రాయడంలో తెలుగు రెండు మూడు అంకెలు ఏర్పడ్డాయి. నాలుగు క్రాసు, ఇంటూ గుర్తు, నాలుగు కొనలు దాన్ని విసురుగా వ్రాయడంలోక్రింది భాగం కలిసిపోయింది. నాలుగుకు పక్కన గీత ఇచ్చారు. అయిదు అయింది. మూడును తలక్రిందులు చేశారు. ఆరయింది. ఆరు పై కొసను పొడిగించారు. తొమ్మిదయింది. ఇలా ఏమేమో కోశాను. ఇంగ్లీషు అంకెల సంగతి కూడా ఏదో చెప్పాను. ఆయన "ఊహలు బాగానే ఉన్నాయోయ్" అన్నారు.ఆగస్టు చివరి వారానికి నాకు ఆంధ్రవిశ్వవిద్యాలయం నుంచి ఉత్తరువు వచ్చింది. "మీతో మా ప్రిన్సిపాల్ అప్పారావుగారు జరిపిన ఇంటర్వ్యూను

పురస్కరించుకొని మిమ్ములను ద్విపదభారతం ముద్రణను సిద్ధపరచడానికి తంజావూరులో నియమించడమైంది. మీరూ మరొక పండితులు కొమ్మనమంచి జోగయ్యశర్మగారితో సహకరించి పనులు సకాలంలో పూర్తిచేయాలి. నెల కొకతూరి పని తీరు నివేదిక పంపాలి. సెప్టెంబర్ నెల నుంచి సంవత్సరం పాటు ఉద్యోగం." నేను ఆశ్చర్యపడ్డాను. అప్పారావుగారికి మనస్సులో కృతజ్ఞత తెలిపాను.

ఆగస్టు చివరి వారానికి తంజావూరు చేరాను. అదివరకు కుంభకోణం వెళ్లినప్పుడు, హరవిలాసం పాఠాంతరాల కోసమూ తంజావూరు వెళ్లాను గనుక ఆ నగరం నాకు చిరపరిచితమే. అందమైన విశాలమయిన వీధులు, సందులూ ఎక్కువే. ఒక సందు నుంచి బయలుదేరితే ఊరంతా తిరిగి మళ్లీ ఆ సందే చేరతారని ప్రతీతి. నాకు తంజావూరులో అదివరకు తిరుచిరాపల్లి కారాగారంలో నాతో పాటు ఉన్న రాజగోపాలయ్యర్, భూవరాహయ్యంగార్ అనే ప్రముఖ కాంగ్రెస్ నాయకులు కనిపించారు. తమ ఊరి లైబ్రరీలోని పుస్తకాల కోసం విశాఖపట్నం నుంచి వచ్చానని ఎంతో ఆదరంతో చూచేవారు. ఇద్దరూ బ్రాహ్మణ జమీందార్లు. రాజసం ఉట్టిపడే వ్యక్తులు. చాల పలుకుబడి కలవారు.

వారు నాకు ఒక పాత రాజప్రాసాదంలో రెండు రూపాయల అద్దె కొక గది కుదిర్చిపెట్టారు. ఈ లోగా జోగయ్య శర్మగారు వచ్చారు కుటుంబంతో. ఒక చెట్టు కింద జోస్యుని సహాయంతో ఒక వాటా ఆయనకు కుదిరింది. ఆ జోస్యుడు మాకు ఎంతో సహాయకుడుగా ఉండేవాడు. లైబ్రరీ ఉదయం ఎనిమిది గంటల నుంచి రాత్రి ఎనిమిది గంటల వరకు. మా పని గంటలు ఉదయం 10-00 సాయంకాలం 5-00 వరకు. తక్కిన వేళల్లో నేను ప్రభాకరశాస్త్రిగారి కోసం చాల లిఖిత పుస్తకాలు, నన్నెచోదుని కుమారసంభవం, నైషధపారిజాతం, బేతాళ పంచవింశతి మొదలయిన పుస్తకాలు - ప్రతులు వ్రాసి ఇచ్చాను. నేలటూరి వెంకటరమణయ్యగారికి నన్నెచోదుని కుమారసంభవం ప్రతి వ్రాసి ఇచ్చాను.

ఒక విచిత్రమయిన సంగతి చెప్పడం మరిచాను. నేను తంజావూరు రైలు స్టేషనులో దిగగానే చెప్పు తెగింది. రైలు స్టేషను ఎదుటే ఒక గొడారి కనిపించాడు. అతనికి తెగిన చెప్పు అందించి నిలుచున్నాను. గొడారి అరవై ఏళ్లవాడు. "ఒరేయ్ అప్పిగా! నీల్లు పట్రారా" అని ఒక పిల్లవాడితో అన్నాడు. నేను ఆశ్చర్యంతో "ఏం తాతా! నీవు తెలుగు

వాడివా?" అన్నాను. "ఔను దొరా, ఇసాపట్నమండి. ఏడంకెసాలు నుంచి ఇక్కడ ఉంటున్నామండీ. తమరు తెలుగు వారండీ? యాతర్లుకా?" అనడిగాడు. "నేను సరే గాని ఈ గొడారి పనికి విశాఖపట్నం నుండి ఇక్కడికి రావాలా?" అని అడిగాను. "ఏడంకెసాలు అన్నాగదండీ. ఆళ్లు వచ్చీసీశారండి. మా పని ఇదేగదండీ, ఆపని సేత్తన్నానండీ. తెలుగోళ్లు శానా మందే ఉన్నారండీ ఇక్కడ" అన్నాడు. ఏడు తరాలు నడిచినా తెలుగును కాపాడుతున్నందుకు అతన్ని అభినందించి ఊళ్లోకి వెళ్లాను. సరాసరి లైబ్రరీకి వెళ్లి అక్కడ గుడ్డలున్న పక్క చుట్ట పెట్టి, అక్కడ వాచ్‌మెన్ చూపిన కొళాయిక్రింద స్నానం చేసి గదివేటకు బయలుదేరాను. గది కుదిరిన సంగతి ఇదివరకే తెలిపాను గదా!

ప్రభాకరశాస్త్రిగారికి వ్రాసి ఇచ్చిన నన్నెచోడుని కుమారసంభవం గురించి కొంచెం చెప్పాలి. మానవల్లి వారికి అదొక ప్రతే లభించింది. తక్కినవన్నీ దాని పుత్రికలే. అది 1938-39 నాటికి అక్కడడక్కడ పురుగు పట్టింది. నేనుదానిని తపస్సులాగా నకలు చేశాను. ఉన్నదున్నట్టు వ్రాసి ఇచ్చినప్పుడే పరిశోధకులు పరిశీలించడానికి అవకాశం ఉంటుంది. నేను మార్జిన్‌లో నా అభిప్రాయాలు వ్రాసేవాడిని. ఒక పాఠం గురించి మాత్రం నాకు గుర్తుంది. పార్వతీదేవి అంగాంగ వర్ణన ఘట్టం. వీపు వర్ణన అంతా గజిబిజిగా ఉంది. పురుగు కొట్టి కొన్ని అక్షరాల తలకట్టు, మరి కొన్నింటి కొమ్ములు, గుళ్లు పోయాయి. సంస్కృత కవులు సుందరుల వీపును మన్మథుని నెత్తపలకగా వర్ణించారు. నెత్తం అంటే పాచికలాట, నెత్త పలక ఆ ఆట గళ్లు వేసున్న పలక, ఇది మధ్య సన్నగాను, చివరలు వెడల్పుగాను, ఉంటుంది. మహిళ నడుము సన్నగాను, కట్యురోభాగాలు పెద్దగాను ఉంటాయి. గనుక దీనితో పోలిక. కుమార సంభవంలోని ఈ పద్యభాగంలో వీపు అనే చోట వి అక్షరం కింది ఎడమ సుడి, గుడిలో సగం. మధ్యన సున్నపు వర్ణం కొమ్ములో సగం ప తలకట్టు కొన మాత్రం ఉన్నాయి. సాధారణంగా తాళపత్రలేఖకులు దీర్ఘాలు ఒక్క ఆ కారం ఉ కారం తప్ప తక్కినవి వ్రాయరు. అర్ధానుస్వారానికి మారు పూర్ణానుస్వారమే వ్రాస్తారు. సందర్భానుసారం మనం చదువుకోవాలి. కాని ఒక పద్ధతి ఉంది. రాముడు అన్నప్పుడు ము తర్వాత అరసున్న నిండుసున్న అవుతుంది. గనుక దానికి సూచనగా రాముండు అని వ్రాస్తారు. సున్నా తర్వాత అక్షరానికి ద్విత్వం ఉంటే అది పూర్ణానుస్వారం. వాఁ

డు అన్నప్పుడు వా తర్వాత అరసున్న నిండుసున్న కాదు. కనుక దానిని వాండు అని వ్రాస్తారు. ఇది అర్ధానుస్వారమన్నమాట. కనుక అరసున్న అని అర్థం. దీన్ని నేను పరిశీలించి. మారిజన్‌లో దీనినంతా వివరించి సంస్కృతకవులు వీపును నెత్తపలకలాగ ఉందని వర్ణించారని ఇది వీపయి ఉంటుందని వ్రాశాను. ఇలాటివి చాలా సూచనలు చేశాను. ప్రభాకరశాస్త్రిగారు నా సూచనలకు సంతోషించి ఆమోదించారు.

తంజావూరు విజయనగర రాజ్యపతనానంతరం తెలుగు సాహిత్య సంగీత నాటకకళలకు కేంద్రం కదా! నాయకరాజుల సంప్రదాయాన్ని తర్వాత వచ్చిన మహారాష్ట్ర రాజులూ అనుసరించి తెలుగు సాహిత్యాన్ని కళలను పోషిస్తూ తెలుగు నాటకాలూ, కావ్యాలూ రచించారు. తమ రాజ్యంలోని దేవాలయాల బ్రహ్మోత్సవాలలోను, ఇతరోత్సవాలలోను అవభృథం తర్వాత తెలుగు యక్షగాన నాటకాలు ప్రదర్శించడం నేటికీ ఉంది. నేను తంజావూరులో ఉన్నప్పుడు బృహదీశ్వరాలయ బ్రహ్మోత్సవసమయంలో ఆ ఆలయం ఎదుట ఉన్న విశాలమయిన మైదానంలో భామాకలాపం, గొల్లసుద్దులు మొదలయిన నాటకాలు ఆడడం, తమిళులు ఆనందించడం చూసి మురిసిపోయాను. తెలుగు దేశానికి వచ్చిన ఇతర భాషల వారు తమ భాషలను మరిచిపోయి, తెలుగు వారిలో కలిసిపోయారు. వారి ఇంటి పేర్లు మాత్రం మిగిలాయి. పిరాట్ల వారని, అరవవారని, పెరుమాళ్లవారని, ప్రబంధం వారనీ, కానీ రాజరాజనరేంద్రుని కాలం కులోత్తుంగ చోడుని కాలంలో తమిళదేశానికి ఇతర ప్రాంతాలకూ వెళ్లిన తెలుగువారు తమ అప్పటి భాషను కాపాడుకుంటూండడం ఎంత అభినందపాత్రమో చెప్పలేను. వారి మాటలు వినడానికే, వారి ఆచారాలు చూడడానికే నేను మన్నారుగుడి, స్వామిమలై మొదలయిన ప్రాంతాలలో తిరిగాను. కొందరు నన్నయ భారతభాష, కొందరు విజయనగర సార్వభౌముల కాలం నాటి భాష మాట్లాడుతుంటారు. వారి మాటలలో భారతంలోని పంచమీ విభక్తి తొట్టి, కూంతురు, పేండ, వాండు, వేకి (జ్వరం), నిప్పటి, మండిపడడం (కోప్పడడం), కొత్తడి (స్త్రీ సమూహం), కుడుము (ఇడ్లీ) వంటి పదాలు దొర్లుతుంటే నా వరకు నాకు కర్ణపేయంగా ఉండేది.

తిరుపతి తమిళశాఖలో ఆచార్యుడు సుబ్బురెడ్డియార్ ఒక మారు నాతో రహస్యంగా "రామచంద్ర, మా మాటలూ మీ మాటలు చాల వ్యత్యాసంగా ఉండును, ఏది సరైన మాట?" అని అడిగారు. "రెడ్డియార్, మీరు మాట్లాడే భాష ప్రాచీనమైంది, అప్పటమైన

తెలుగు, వేయి సంవత్సరాలుగా మీరు తల్లి భాషను కాపాడుతున్నారంటే మేమంతా ఎంతో గర్వించాలి" అన్నాను. "మీరు అట్టదా సెపుదురు, మాకు సిగ్గయ్యాని" అనేవారు రెడ్డియార్ . "ధైర్యంగా అదేభాష మాట్లాడండి, తప్పని ఎవరన్నా కూస్తే నా పేరు చెప్పండి" అనే వాడిని. తమిళనాడు నడిగడ్డలో సెందమిళ్ అని సగర్వంగా తమ భాషను ప్రశంసించుకునే వారి మధ్య తెలుగు యక్షగాన నాటకాల ప్రదర్శన, వాటిని చూచి తమిళ ప్రజలు ఆనందించడం, నా మట్టుకు నాకు అబ్బురమే!

తంజావూరు హైస్కూలులో పనిచేసే అహమద్ అలీ రావుత్తర్ అనే ఉర్దూ పార్శీ పండితుడు నాకు పరిచయమయ్యారు. తమిళనాడులో ముస్లింలను తులుక్కర్ అని, రావుత్తర్ అని అంటారు. తులుక్క, తురక అనే పదాలు టర్కీ టర్క్‌మేనియా నుంచి మనకు సంక్రమించిన పదాలు. మనకు ఇస్లాం మతప్రాదుర్భావం ముందు శతాబ్దాల నుంచే అరేబియా, సిరియా, పర్షియా, అబిసీనియా దేశాలతో సంబంధం ఉన్నా ఇస్లాంప్రాదుర్భావం తర్వాత, మనకు మొదట పరిచయమైనవారు ఇస్లాం మతం వారు కనుక ముస్లింలు తురుక్, తురక్ అయ్యారు. కబీర్‌దాస్ హిందూ - తురుక్ అని ప్రయోగించాడు. అలాగే రావుత్తర్ అనేది మన దేశపదమైనా విచిత్రమైన పదం. రాజపుత్ర అనేది రాయ ఉత్త-రావుత్త అని ప్రాకృతంలో మారింది. ఈ రావుత్తరౌతు అయింది. గుర్రం రౌతు అంటే అశ్వారూఢుడయిన రాజపుత్రుడు. రాజవంశీయుడు, ఉత్తరభారతంలో ఇస్లాం మతాన్ని స్వీకరించిన రాజపుత్ర వంశీయులను మొగల్ చక్రవర్తులు, దక్షిణ భారతానికి ప్రతినిధులుగా, అధికారులుగా పంపారు. వారు తమను మహమ్మదీయులమనో, ముస్లింలమనో చెప్పుకోకుండా రాజ్‌పూత్-రాపుత్త-రావుత్తర్ అని చెప్పుకున్నారు. అదిక్రమంగా రావుత్తర్ అంటే ముస్లింలని రూఢమయింది.

అహమద్ రావుత్తర్‌కు తెలుగంటే అభిమానం. కనుక నాతో "అథవా విద్యయావిద్యా" అనే పద్ధతి పైన నేను అతనికి తెలుగు వ్యవహారం నేర్పేట్టు, అతడు నాకు ఉరుదూ నేర్పేట్టు ఒప్పందం చేసుకున్నాము. ఇది రెండు నెలలు సాగింది.

సెలవుల్లో నేను పరిసరాలలో తిరువయ్యూర్ మొదలయిన ప్రాంతాలలో తిరిగాను. త్యాగరాజుల వారి ఇల్లు చూచాను. కాని, నేను చూచిన ప్రాంతాల ఫోటోలు సంపాదిద్దామని భద్రపరచుకుందామనే దృష్టిలేదు అప్పట్లో.

స్వామిమలైకి వెళ్లుతున్నప్పుడు అనుకుంటాను, కావేరిపాయను దాటవలసి వస్తుంది.

సామాన్యంగా నడుం లోతు నీళ్లుంటుంది. పాయ వెడల్పు ఇరవయి గజాలు. మగవాళ్లయితే కట్టుకున్న గుడ్డలు విప్పి తలకు చుట్టుకొని, కౌపీనధారులు గనుక నిస్సంకోచంగా వెళ్లిపోతారు. స్త్రీలు ఎదుటిగట్టున ఎవరూ లేనప్పుడు చీరనుక్రమంగా పైకి ఎత్తుతూ, నీటి లోతు తగ్గగానే చీర దింపుతూ దాటుతారు. బళ్లలో వెళ్లే వాళ్లకు ఈ సమ్యస్యేలేదు. బళ్లు వెళ్లిపోతాయి. నీళ్లు నొగల వరకు వస్తుంది. ఎద్లు మోర ఎత్తుకొని దాటిపోతాయి. స్త్రీలు ఈ విధంగా దాటుతారని నాకు తెలీదు.

నేను ఇటువైపు గట్టున ఉన్నాను. అటు వైపు గట్టుకు పచ్చిగడ్డి మోపు మోసుకొని ఒక పల్లెత వచ్చింది. మంచి యౌవనంలో ఉంది. నేను అక్కడ ప్రకృతి సౌందర్యం - కొబ్బరి తోటలు, అరటి తోటలు, వాటి మధ్యన దేవాలయాలు, దూరాన పల్లె పట్లు చూస్తున్నాను. "అయ్యరే! నీ దాండివా" (నీవుదాటిరా) అన్నది. ఇదేమి దీని ఆజ్ఞ? ప్రకృతి సౌందర్యం చూడరాదంటుందా - అని అనుకుని "ఎందుకు? నీవే మొదట నది దాటు. నేనిక్కడ అందాలు చూడాలి" అన్నాను ఆ పడుచు ఏమి అర్థం చేసుకొందో, నామాటల్లో వ్యంగ్యం ఉందనుకుందో ఏమో "ఔనౌను, ఆ అందాలు చూడడానికే నీవు ఉన్నావు. నాకు తెలుసు, దాటి రావయ్యా! నేను త్వరగా సంతకు పోయి గడ్డి అమ్మి తిరిగి రావాలి" అన్నది. "నీవు గడ్డి అమ్మడానికి నేను అడ్డున్నానా? అమ్ముకోవద్దన్న వారెవరు" అని పట్టుదలగా అన్నాను. "ఏ ఊరయ్యరే నీది? నా మాటలు నీకు అర్థం కావా? మొదట దాటు స్వామీ, పొద్దుపోతుంది" అన్నది ప్రాధేయపడుతూ.

ఈ వాదంతో అరగంట గడిచింది. ఇంతలో నేనున్న వైపు మరెవరో వచ్చారు. ఆ పల్లెపడుచు నేను నది దాటిరావడం లేదని ఫిర్యాదు చేసింది. అతడు నన్ను పరాయివాడని గ్రహించి "ఏ వూరండీ మీది?" అనడిగాడు. "మద్రాసు. తంజావూరు సరస్వతీ మహల్‌లో పనికోసం వచ్చాను" అన్నాను. అతడు మర్యాదగా పరిస్థితి వివరించి చెప్పాడు. నేను "ఆ మాట మొదటే చెప్పవచ్చుగదా, నేనెప్పుడో పాయదాటి పోయేవాడినే" అన్నాను "పెణ్‌గళ్ (స్త్రీలు) ఎలా చెబుతారు సార్? మీరు మరీను" అంటూ నన్ను వెంటబెట్టుకుని దాటి ఆవలిగట్టు చేరి ఆమెకు చీవాట్లు పెట్టాడు. "అయలూరు కారర్ (పరాయి ఊరివారు) మన పద్ధతులు తెలీవు కదా! వాదమెందుకూ! ఓపిక పట్టలేక పోయావా?" నాకేం తెలుసు ఏదో అళగు (సౌందర్యం) చూస్తానన్నాడు," అంటూ సిగ్గు అభినయిస్తూ దాటిపోయింది. నా దారిన నేను స్వామిమలైకి వెళ్లాను.

ఇలాటి స్థితే లాహోర్లో రావీనదీ తీరంలో తరచు ఏర్పడేది. వాళ్లు తంజావూరు పల్లెపడుచుల లాగ ప్రాధేయపడలేదు. ఘాగరాలు పైకెత్తి మనుషులు ఉన్నారన్న భావమే లేకుండా దాటిపోతుంటారు. మనమే సిగ్గుపడి తప్పుకోవాలి.సరస్వతీమహల్ లైబ్రరీలో వరదరాజశర్మ అనే సంస్కృత పండితుడు ఉండేవాడు. అతడు నాకంటే చాల పెద్దవాడు. నాతో మైత్రితో ఉండేవాడు. ఒక రోజు అతడు, 1939 ఏప్రిల్ నెలలో అనుకుంటాను, హిందూ పత్రికలో పడిన ఒక ప్రకటనను నాకు చూపి దీనికి దరఖాస్తు పెట్టుకోండి" అన్నాడు. పంజాబ్ విశ్వవిద్యాలయ గ్రంథాలయంలో దక్షిణ భారత లిపులలో ఉన్న తాళపత్రాది లిఖిత పుస్తకాలకు వర్ణనాత్మకసూచి సిద్ధపరచడానికి ఒక పండితుడు కావాలి. జీతం యాభై రూపాయలు. ప్రయాణపు ఛార్జీలు, బత్తా ఉంటాయి. ఇదీ దాని సారాంశం. నేను వరదరాజశర్మతో అన్నాను. "ఎందరో ఎం.ఏ.లు దరఖాస్తులు పెట్టుకుంటారు. నాలాటి వాడికి వస్తుందా?" అని. అప్పుడు నా జీతం నలభయి రూపాయలు.

"మనం సంస్కృతంలో దరఖాస్తు వేద్దాం. వస్తుందని నా విశ్వాసం. రాకపోతే మనకు నష్టం అణాకవరు" అని అతడు అంటూ వెంటనే అరఠావు కాగితం పైన సంస్కృతంలో దరఖాస్తు వ్రాసి, నాతో సంతకం చేయించి, తపాలు పెట్టెలో పడవేశాడు. అదేమి విచిత్రమో మే చివర ఉత్తరువు వ్చంది. లాహోరులో చలి మంచు కురిసేంతగా ఉంటుంది కనుక, సెప్టెంబరులో రావాలని అప్పటి నుంచి వాతావరణం కొంత అలవాటు పడితే, చలి తట్టుకునే శక్తి ఏర్పడుతుందని సూచన కూడ. వరదరాజశర్మ చాల సంతోషించాడు. ఈ కారణాన దేశమంతా తిరిగి చూసే అవకాశం కలిగిందని నేను సంతోషించాను.

నాకు మే 7వ తేదీన వివాహం జరిగింది. సురపురం అనే సంస్థానం అత్తగారి ఊరు. ఇది గుల్బర్గా జిల్లాలో గుల్బార్గాకు ముప్పయి మైళ్ళలో ఉంది. నా అర్ధాంగి పేరు అనంతలక్ష్మి. ఎక్కువ చదువుకున్నదేమీ కాదు. కన్నడం మిడిల్ చదివింది. హిందీ పరీక్షలేవో పూర్తిచేసింది. మా నాన్నగారు కుదిర్చిన సంబంధం. నాకు పెళ్లి వద్దని, రానని అన్నాను. "నా పరువు కాపాడు" అని టెలిగ్రాం ఇచ్చారు ఆయన. మొక్కుబడిగా పెళ్లి చేసుకొని వచ్చాను. లాహోరు ఉత్తర్వు వచ్చింది, ఆ ముహూర్తబలంతోనే నేమో!

ద్విపదభారతం పరిష్కరణ పూర్తికావచ్చింది. మరి కొన్ని లిఖితప్రతులను ముద్రణకు సిద్ధపరచడానికి నేనూ, జోగయ్యశర్మగారూ ఆలోచిస్తున్నాము. అప్పటికి తొమ్మిది నెలలు గడిచాయి. మే నెల చివర వారం అనుకుంటాను మేమిద్దరం బజారుకు వెళ్లాము.

మేము తంజావూరికి వచ్చినపుడు సాహాయ్యం చేసిన చెట్టు కింద జోస్యుడు కనిపించాడు. మా భవిష్యద్గతి ఏమిటని జోగయ్య శర్మగారు వినోదంగా అడిగారు. "ఈ వేళ ఆదివారం కదా! మీరు రేపు ఈ పాటికి ప్రయాణ సన్నాహాల్లో ఉంటారు. ఉత్తరాభిముఖంగా" అన్నాడు జ్యోస్యర్.

జోగయ్య శర్మగారు నవ్వారు. మరుసటి ఉదయం సరస్వతీ మహల్‌కు వెళ్లే వేళకు పింగళి లక్ష్మీకాంతంగారి నుంచి ఒక టెలిగ్రామ్ మా కోసం ఎదురుచూస్తూన్నది. తిరుమల రామచంద్ర మద్రాసుకు వెళ్లి రంగనాథరామాయణం పరిష్కరణంలో గన్నవరపు సుబ్బరామయ్యగారికి తోడ్పడాలి. జోగయ్యశర్మగారు విశాఖపట్నం తరలి రావాలి. ఇదీ టెలిగ్రాం సారాంశం. జ్యోస్యర్ మాటలకు నవ్విన జోగయ్యశర్మగారి ముఖం వెలవెలబోయింది. వెంటనే అతన్ని వెదుక్కుంటూ వెళ్లి అతనిని ప్రశంసించి చెరికొంత దక్షిణ సమర్పించి మే 31న తంజావూరును అర్ద్రహృదయంతో వదిలాము.

మళ్లీ చూడగలమో, చూడలేమో అనే సందేహంతో ఆ వారమే నేను మేలట్టూర్ వెళ్లి వచ్చాను. మేలట్టూరు తంజావూరుకు 12 మైళ్ల దూరంలో ఉంది. భాగవతమేళాలకు ప్రసిద్ధిగన్న వూరు. తంజావూరు రాజ్యపాలకుడైన అచ్యుతప్పనాయకుని కాలంలో (1577-1640) తెలుగు కోస్తా ప్రాంతం నుంచి కొన్ని విద్వత్సంగీత నాట్యకుటుంబాలు తాళికోట యుద్ధంలో విజయనగర సామ్రాజ్య పతనానంతరం తంజావూరు రాజ్యానికి వలస వచ్చాయి. వాటికి అచ్యుతప్ప నాయకుడు శూలమంగళం, శాలియమంగళం, ఉత్తక్కాడు, శాలియమంగల మొదలైన ఐదు గ్రామాలను అచ్చుతాపురం అనే పేరుతో దానం చేశాడు. అచ్యుతప్ప ఒకమారు పొరపాటున ఎడమచేత్తో విడెం వేసుకొన్నాడు. ఆ దోషపరిహారార్థం ఈ గ్రామాలు దానం చేశాడట. ఆ కుటుంబాలలో వెంకటరామశాస్త్రి అనే వారు 12యక్షగాన నాటకాలు వ్రాశారు. ఇతడు తంజావూరు మహారాష్ట్ర రాజులయిన సెర్ఫోజీ, శివాజీల కాలంవాడు, ఈ నాటకాలు ప్రహ్లాదచరిత్రము, ఉషాపరిణయం, హరిశ్చంద్రనాటకము (రెండు భాగాలు), రుక్మాంగదనాటకము, హరిహరలీలావిలాసము, సీతాపరిణయము, సతీసావిత్రీ నాటకము, గొల్లభామ నాటకము, ఈ నాటకాలలో స్త్రీ పాత్ర పురుషులే ధరిస్తారు. ఇవి తెలుగు గ్రాంథికంలో ఉంటాయి. నటేశయ్యర్, వెంకటరామశాస్త్రిగారి నాటకాలను ప్రదర్శించేవారు. ఈయన ప్రహ్లాద చరిత్రలో లీలావతీ పాత్ర ధరించేవారు. ఈయనకు వరదయ్య, నాటక దొరైస్వామి,

ముత్తు కృష్ణశాస్త్రి సహనటులు. ఈయన 1937 వరకు ఈ నాటకాలు ఆడాడు. తర్వాత గణేశయ్యర్ అనే విద్వాంసుడు "లక్ష్మీనరసింహ జయంతి భాగవతమేళా నాట్య నాటకసంఘం" అనే సంస్థ స్థాపించి 1938-39లలో మార్కండేయ, ఉషాపరిణయం నాటకాలు ఆడారు. ఈ సంఘంలో కె. పాలయ్యర్, కె. రమణ అయ్యర్, పీస్పాటి రామమూర్తి అయ్యర్, ఏ. నారాయణస్వామి అయ్యర్, స్వామినాథన్ సభ్యులు. ఏ సంఘం వారిదో చెప్పలేను. గాని, నేను మేళత్తూరివారి ఉషాపరిణయము, గొల్లభామా నాటకం చూశాను. 1939లో బాలూ భాగవతార్ అనే మేళత్తూరు నటుడు సుప్రసిద్ధుడు. ఈ నటుల పేర్లను డాక్టర్ జొన్నలగడ్డ అనూరాధగారితో ధ్రువపరచుకున్నాను.

వీరు తమ మాతృభాషను చాలవరకు మరచిపోయినా, ఈ నాటకాలను తమిళంలోనే వ్రాసుకొని, సుదీర్ఘవర్ణనలను, సంభాషణలను వల్లించి ప్రదర్శించడంలో చూపే శ్రద్ధ వర్ణనాతీతం, ప్రస్తుతం వీరిలో ప్రముఖులు ఎస్. నటరాజన్. ఈయన దుబాయి ప్రభుత్వంలో ఇంజనీరు. ప్రతి సంవత్సరం నృసింహజయంతి నాటికి భారతదేశానికి వచ్చి, భక్తిశ్రద్ధలతో ప్రహ్లాద చరిత్రం ప్రదర్శిస్తారు. ఈ జట్టులో గణేశయ్యర్ కూడా ప్రముఖులు.వలస పోయిన తెలుగువారు శాయశక్తులా కాపాడుకుంటూ వస్తున్న ఈ అపూర్వ నిధిని - వెంకటరామశాస్త్రి రచించిన 12 నాటకాలను ప్రచురించడం, ఈ నాటకాలను పరిశోధించి డాక్టరేట్లు పొందడానికి విశ్వవిద్యాలయాలు, ఆంధ్రప్రభుత్వ వివిధ నాట్యనాటక సంఘాల బాధ్యత అని నా అభిప్రాయం. నాటకం ప్రదర్శనను తపస్సుగా నిర్వహించే మేళత్తూరు భాగవతుల దీక్షను మన నటులు ఆదర్శంగా గ్రహించాలి. మేళత్తూరు అంటే తెలుగు భాగవతుల సంగీతనాట్య నాటక మేలనాలు జరిగే ఊరు. మేలత్తు-మేలనాల, ఊరు అయింది. ఆ మహాతపస్వులను ఆంధ్రనాట్య నాటక సంస్కృతి రక్షకులను స్మరిస్తూ తిరిగి వచ్చాను.

**"చతురంగ బలో రాజా**

**జగతీం వశమానయేత్ !**

**అహం పంచాంగ బలవాన్**

**ఆకాశంవశమానయే !!"**

**(చతురంగ బల సమేతుడయిన రాజు ప్రపంచాన్ని వశపరచుకుంటాడు. నేను పంచాంగ బలం కలవాడిని, ఆకాశాన్ని వశపరచుకుంటాను.)**

# 52

# మద్రాసులో సుభాష్ చంద్ర బోస్

"తం కిం పి సాహసం పా -

హసేణ సాహంతి సమస సహావా,

జం భావి ఊణ దివ్వో

పరం ముహో దుణి ని అసానం."

**(సాహస స్వభావం గలవారు సాహసంతో సాధించదగిన పనులను సాధిస్తారు. దానిని తలచుకొని దైవం ముఖం తిప్పి తల పరికిస్తుంది - గడుసువాడే అనే భావంతో)**

**నేనూ, జోగయ్య శర్మగారూ మద్రాసు చేరాము. జోగయ్య శర్మగారు మద్రాసులో రెండు మూడునాళ్లు గడిపి విశాఖపట్నం వెళ్లిపోయారు. నేను రంగనాథరామాయణం పరిష్కరణంలో గన్నవరపు సుబ్బరామయ్యగారికి తోడ్పడడానికి ఆయన ఇంటికి వెళ్లేవాడిని.**

నేను తంజావూరు వెళ్లినా, ఎగ్మూరులో నేనున్న గదిని ఖాళీ చేయలేదు. తంజావూరి నుంచి వస్తే మళ్లీ గదిని వెదుక్కోవడం కష్టమనుకుని. కనుక ఎగ్మూరు హైరోడ్డులోని హరిహరవిలాస్‌లో భోజనం చేసి పది-పదిన్నరకు చింతాద్రిపేట శ్రీనివాస పెరుమాళ్ కోవిల్ సన్నిధి వీధిలోని (అనుకుంటా) సుబ్బరామయ్యగారింటికి వెళ్లేవాడిని. అక్కడ సాయంకాలం ఐదున్నర వరకు పనిచేసి కొంచెం సేపు ఆయన పిల్లలతో వినోదంగా

గడిపి గదికి తిరిగి వచ్చేవాడిని. నా అనంతపురం-బళ్లారి ఏసలు ఆ కుటుంబానికి వింత వింతగా ఉండేవి. నన్ను ఆటపట్టించేవాళ్లు. ఒకసారి ఒక చిక్కులో పడ్డాను.

సుబ్బరామయ్యగారి ధర్మపత్ని సుబ్బాయమ్మగారు ఒక మారు నా చేతికి ముప్పై రూపాయలిచ్చి సవరాలు తెమ్మన్నారు. అప్పుడు బంగారు సావరిన్ ధర పదిహేను రూపాయలు. రెండు సావరిన్‌లు తెమ్మని ఆమె ఉద్దేశం. నేను చైనా బజారుకు పోయి, సవరాలు - మహిళలు తమ జడలు పొడుగ్గా కనిపించడానికి పెట్టుకొనే కూటకేశీలు కొన్నాను. ఇదేమిటీ ఇన్ని సవరాలు వీరికెందుకు అనే సందేహం నాకు కలుగలేదు. వారికి ఇంటినిండా ఆడపిల్లలు గనుక అవసరమేమో ననుకున్నాను. పది రూపాయలకే దాదాపు వంద వచ్చాయి. ఇవి బాగున్నాయనీ వారు అంటే తక్కినడబ్బుకూ కొందామని, వాటిని మూటగట్టుకొని ట్రామెక్కి వాళ్ల ఇంటి వద్ద దిగాను. "ఇవిగోనండి సవరాలు" అంటూ పెద్ద మూట ఆమె ఎదుట పెట్టాను.

ఆమె ముక్కుమీద వేలు వేసుకొని చోద్యంగా చూస్తూ "సవరాల మూట ఏమిటి?" అంటూ విప్పి చూచి మరీ విస్తుపోయింది. పిల్లలంతా నవ్వారు. ఆ బృందహాస రవం ఎదురింటి వారికి, పొరుగింటి వారికీ వినబడి వాళ్లూ వచ్చారు. "సవరనులు తేవయ్యా అంటే సవరాలు పట్టుకువచ్చారు. మా బళ్లారి ఆచార్లు" అంటూ ఆమె వారికి చెప్పింది. నన్ను వారంతా వింత మృగంగా చూస్తుండగా, సుబ్బరామయ్యగారు "ఇప్పుడేమయింది? సవరాలు బాగున్నాయి. తలా రెండు ఇచ్చేయి. వాళ్లకు నచ్చితే కొంటారు. మనకు నష్టమేమీ లేదు" అన్నారు. నా మాట దక్కింది. కాని, పిల్లలు నాకు సవరాల ఆచార్లు అని పేరు పెట్టారు.

అప్పుడు అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్ష పదవికి ఎన్నికలు జరిగాయి. పట్టాభిసీతారామయ్యగారికీ, సుభాస్‌చంద్రబోస్‌గారికీ జరిగిన పోటీలో సుభాస్‌చంద్రబోస్ గెలిచారు. గాంధీజీకి సుభాస్ తీవ్రవాది అనే కారణంగా ఇష్టం లేదు కనుక "పట్టాభి ఓటమి నా ఓటమి!" అన్నారు. సుభాస్‌చంద్రబోస్ దేశమంతటా పర్యటిస్తూ మద్రాసు వచ్చారు. మెరీనా బీచ్‌లో బహిరంగ సభ జరిగింది. మద్రాసుకు మద్రాసే ఆయనను చూడడానికి బీచ్‌లో దిగింది. పది లక్షలకు పైగానే జనం.

ప్రభాకర శాస్త్రిగారు గాంధీ ప్రవణులు. కనుక గాంధీజీని ఎదిరించి గెలిచిన సుభాస్ అంటే గిట్టలేదు. కనుక "అతను తీవ్రవాది, అతని ఉపన్యాసాలకు వెళ్లకండి" అని

తమ వారికి చెప్పారట కూడా, ఆ సంగతి నాకు తెలియదు. శాస్త్రిగారి సతీమణి మహాలక్ష్మమ్మగారు సుభాస్ బీచ్ ఉపన్యాసం నాటి సాయంకాలం నన్ను పిలిచి "పిల్లలను బీచ్‌కి పిలుచుకు వెళ్లి సుభాస్‌చంద్రబోస్‌ను చూపించి త్వరగా తిరిగి రండి. శాస్త్రిగారు ఆంధ్రవిశ్వవిద్యాలయం తెలుగు ఎం.ఏ. పరీక్షకు సంఘం అధ్యక్షుడు. రేపు మీటింగు. ఎనిమిదిన్నరకు విశాఖ రైలుబండి. మీరు ఎనిమిదిలోపు రండి" అని అన్నారు. "శాస్త్రిగారు కోప్పడతారేమోనండీ!" అని నీళ్లు నమిలాను. "అది నాకు వదలండి. ఆలస్యం చేయక రండి, నేనేదో నచ్చజెబుతాగా!" అన్నారు ఆమె.

మద్రాసు మెరీనా బీచ్ అందమైన ప్రపంచపు బీచిల్లో ఒకటి. ఇప్పటిలాగ అప్పుడు మత్స్యజీవుల దురాక్రమణం, తక్కిన నానావిధాల దుకాణాలు లేక విశాలంగా ఉండేది. మద్రాసు విశ్వవిద్యాలయ సమీపంలోని ఐరన్ బ్రిడ్జ్ (ఇనుప వంతెన) నుంచి ఆకాశవాణి వరకు పరచుకొని, బీచ్‌లోని లవర్స్ పాత్ (మిథునపథం) పరమరమణీయంగా పరిశుభ్రంగా, ప్రేమోద్దీపకంగా ఉండేది. మధ్యాహ్నం నుంచే నగరంలోని వివిధ దూరప్రాంతాల నుంచి తండోపతండాలు జనం బీచికి రావడం ప్రారంభించింది. నేను తొమ్మిదేళ్ల ఆనందును, ఆరేళ్ల సుజాతను, నాలుగేళ్ల వినతను (అప్పటి వయసును బట్టి వారిని ఏకవచనంతో పేర్కొన్నాను మన్నించాలి) పిలుచుకొని బీచికి వెళ్లాను.

సుభాస్‌చంద్రబోస్ ఆరుగంటలకు వచ్చారు. ఆయన కూడా ప్రభాకరశాస్త్రిగారు పయనించే బండిలోనే నెల్లూరుకు వెళ్లాలట. గనుక ఏడు గంటలకల్లా బహిరంగసభ పూర్తయింది. సుభాస్‌చంద్రబోస్, ద్వితీయ ప్రపంచసంగ్రామం రాబోతున్నదని, బ్రిటీష్‌వారితో భారతీయులు సహకరించరాదని, త్వరలో స్వరాజ్యం సిద్ధిస్తుందని గంభీరంగా ప్రసంగించారు. ధన్యవాదాల తర్వాత సభ సమాప్తమైంది. జనం కదిలింది. మహాసముద్రం పొంగిన ఉప్పెన !

నేను వినతమ్మను ఎత్తుకొని ఎడమ భుజానికి ఆనించుకొన్నాను. గట్టిగా పట్టుకోమన్నాను. ఆనంద్ (ఆచార్య డాక్టర్ వేటూరి ఆనందమూర్తి) నా ఎడమ పక్కన నా కుర్తా పట్టుకొని నడుస్తున్నాడు. కుడి వైపున నా చేయి పట్టుకొని సుజాతమ్మ నెమ్మదిగా కదులుతోంది. సభాస్థలి నుంచి (ఇప్పటి కణ్ణగి శిలావిగ్రహం ఎదుట ఉన్న) రోడ్డుకు దూరం వందగజాలు. రోడ్డు నుంచి వెంకటరంగంపిళ్లే వీధికి దూరం దాదాపు ఫర్లాంగున్నర అంటే 320 గజాల దూరం నడిచి రావడానికి దాదాపు వంద నిమిషాలు

పట్టింది. మౌంట్ రోడ్డు రౌండ్ ఠాణా వరకు చిక్కని జనం గుంపు. ఆ జనసమ్మర్దానికి, ఆరేళ్ల సుజాతమ్మ, నాలుగేళ్ల వినతమ్మ బిక్కమొగాలతో కన్నీళ్లు కురిపిస్తున్నారు. వారిని ఓదారుస్తూ ఆనంద్ ఎక్కడ తప్పిపోతాడో అని క్షణక్షణానికి హెచ్చరిస్తూ నత్తనడకతో కాదు చీమనడకతో – శాస్త్రిగారున్న 4వ నంబరు ఇల్లు చేరాము. తొమ్మిది కొట్టింది, పక్క దుకాణం నుంచి గేటు తెరిచాను. వాళ్లు ముగ్గురూ పరుగుతో లోపలికి వెళ్లారు. నేను గేటు సందులో నుంచి దూరి లోపల ప్రవేశించి ఆరు బయలులో నిలబడి ఉన్నాను.

ప్రార్థనకు వచ్చిన వారంతా అలాగే కూర్చున్నారు. మద్రాసు మహానగరంలో ఆనాడు ఒక్క వాహనం కనిపించలేదు. పరిస్థితి ప్రళయపూర్వపు గాంభీర్యంతో ఉంది. గేటు తెరిచి నేను నిలుచున్నానో లేదో, అంతవరకూ అటూ ఇటూ మహావేగంగా పచారు చేస్తున్న శాస్త్రిగారు నా వద్దకు విసురుగా వచ్చారు. భయమనేది మా వంశంలోనే లేదు గనుక నేను భయపడలేదు గాని, ఏదో ప్రమాదమే ముంచుకు వచ్చిందనీ లేకపోతే శాస్త్రిగారికి ఇంత కోపం రాదని ఊహించి, ఆత్మరక్షణ పద్ధతులు ఆలోచిస్తున్నాను.

విసురుగా వచ్చిన శాస్త్రిగారు "ఎవరయ్యా నువ్వు? బుద్ధి ఉండక్కర్లా? నాకు ఇష్టం లేని వ్యక్తిని, గాంధీజీని ఎదిరించి, ఇది నా పరాజయం అని ఆయన బాధపడేట్టు చేసిన వ్యక్తిని చూడడానికి నా అనుమతి లేకుండా నా పిల్లలను తీసుకుని వెళ్లడమా? ఎంత ధైర్యం? తీసుకెళ్లడానికి నీవెవరూ అంట? నువ్వెక్కడన్నా అఘోరించు, నా పిల్లలను నా క్రమశిక్షణలకు విరుద్ధంగా తీసుకువెళ్లి,, నా ఇంట్లోనే, నా మీద, విద్రోహం రేపుతావా? ఎవరు నువ్వు? ఎవరూ అంట?...." అంటూ మీది మీదికి వస్తూంటే ఏదో చెప్పబోయాను. శాస్త్రిగారి సతీమణి మహాలక్ష్మమ్మగారు గుమ్మంలో నుంచే సైగ చేశారు చేత్తో, ఏమీ మాట్లాడవద్దని, ప్రార్థనకు వచ్చిన పెద్ద మనుష్యులంతా కిక్కురుమనకుండా కూర్చున్నారు. నన్నూ, శాస్త్రిగారినీ మార్చి, మార్చి చూస్తూ, శాస్త్రిగారు మళ్లా అందుకున్నారు.

"నీ వల్ల నా మాట మర్యాద ఏమయింది, విశ్వవిద్యాలయంలో? రేపు సాయంత్రం ప్రధాన పరీక్షాధికారుల సమావేశం. వస్తానన్నవాణ్ణే పోలేకపోయాను. పిల్లలను చూచిపోదామనుకున్నాను. నీవు నా ప్రోగ్రామంతా పాడుచేశావు (నిజానికి ఆనాడు త్వరగా వచ్చినా విశాఖపట్నం బండి అందుకునే వారు కాదు, సాయంకాలం ఐదు నుంచే బళ్లరాకపోకలు బంద్, ఏ రైలూ సకాలానికి కదలలేదు) నరే. దానికేదో

చెప్పుకుంటాననుకో. నా అనుమతిలేనిదే ఎలా పిలుచుకుపోయావు పిల్లలను? తేలుకు పెత్తనమిస్తే తెల్లవార్లూ కుట్టిందట! (అమ్మగారు పిలుచుకు వెళ్లమన్నారండీ అని అందామని నాలుక చివరి వరకు వచ్చింది కాని ఆ ప్రళయంలోనూ ఆలోచించాను, ఆ పదే వషట్కారాలు నాకే పడనీ, ఇంత మంది ఎదుటా శాస్త్రిగారు ఆమెను ఏమయినా అంటే అంతకన్నా నేను చేసే మహాపాపం ఏముంటుంది? అని అనుకుని నోరు నొక్కుకున్నాను) ఏం! పలుకవేం? చేసింది తప్పుకాక, మాట్లాడకుండా నన్ను అరిపిస్తావా? తాచెడ్డకోతి వనమెల్ల చెరిచిందట...?"

ఈ విధంగా గంటకు పైగా సాగింది శాస్త్రిగారి ఆగ్రహం. ఆ ప్రవాహం ఆగేట్టు కనిపించలేదు. నేను గిరుక్కున తిరిగి, గేటు నెమ్మదిగా మూసి వీధిలో పడి ఎగ్మూరులోని నా గదికి బయలుదేరాను. బస్సులో కాదు. ఏ వాహనమూ లేదు. రౌండ్ ఠాణా, హారిస్‌రోడ్ గుండా ఎగ్మూరు హై రోడ్డు చేరాను. సభకు వచ్చిన జనం ఇంకా నడుస్తూనే ఉంది. ఎగ్మూర్ హైరోడ్‌లోని హరిహరవిలాస్‌కు చేరే వేళకు పన్నెండు కొట్టింది. ఈ హోటలు పూర్వం వీరేశలింగంగారు నివసించిన వేదవిలాస్ భవనానికి ఎదుటి వరుసలో దాని దరిదాపుల్లో ఉంటుంది. హోటళ్ల యజమానులు తెలివిగలవారు. ఈలాటి సభల నుంచి జనం ఆలస్యంగా వస్తారని, బస్సులు ఉండవని, ఆకలి గొని ఉంటారని గ్రహించే; భోజనం కన్నా ఇడ్లీ, వడ, దోశ, పొంగల్ వంటివి ఎక్కువగానే వండి ఉంచుతారు. నాలుగిడ్లీలతో కడుపు నింపుకొని గది చేరి చాపమీద పడ్డాను. అంతలోగా, పక్క కాపురాల వాళ్లు, ఇంటివాళ్లూ వచ్చారు. "కూట్టం విశేషం ఎన్నాం?" అంటూ, వారితో ముచ్చట్లయ్యేవేళకు ఒంటిగంట.

నేను చాప మీద వెల్లికిలా పడుకున్నాను. ఆలోచనలు ముసురుకున్నాయి. నిజమే. నాది తప్పే. కనీసం ఆయనకు సూచించి ఉంటే బాగుండేది. ఆయనను అడగకుండా పిల్లలను పిలుచుకొని పోవడం తప్పే. అదృష్టం బాగుంది గనుక సరిపోయిందిగాని, ఆ తొక్కిసలాటలో పిల్లలకు ఏ ప్రమాదమైనా జరిగి ఉంటే, ఎంత అపకీర్తి? అమ్మగారి క్కూడా ఎంతమాట! ఇది సవ్యంగా సాగిన ఆలోచన మార్గం, చెడ్డ ధోరణి కూడా గుండె దగ్గర గొణిగింది. శాస్త్రిగారివి తీవ్రమైన రాగద్వేషాలు. బరోడాలా ఉన్న గాయక్వాడ్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ వారు దక్షిణ భాషాలిపులు తెలిసిన పండితుడు కావాలని పత్రికలలో ప్రకటించారు. నేను దరఖాస్తు పెట్టుకున్నాను. నాకు ఇంటర్వ్యూ వచ్చింది.

అప్పుడు మద్రాసు నుంచి బరోడాకు రైలు ఛార్జి ఎనిమిది రూపాయలు. అది నెల మధ్య గనుక నా వద్ద డబ్బులు లేవు. శాస్త్రిగారిని, నా ఆర్డరు చూపించి పది రూపాయలు అప్పిమ్మని కోరాను. "నీకిది రాదు. నీవు వెళ్లవద్దు. నా వద్ద డబ్బు లేదు" అన్నారు. నేను వెళ్ళలేకపోయాను. ఇది 1937 మొదట్లో జరిగింది. సరే నేను కొంచెం కష్టపడ్డాను. ఆ ఉద్యోగం నాకు తప్పక వచ్చేది. ఆ రంగంలో నా కంటే అర్హత గలవారు అప్పుడు అరుదు. ఆ సంవత్సరం చివర బరోడా లైబ్రరీ నుంచి ఒక విద్వాంసుడు ఏవో సంప్రతింపుల కోసం మద్రాసు ఓరియంటల్ లైబ్రరీకి వచ్చారు. అందరినీ పరిచయం చేసుకొన్నారు. నేను ప్రసంగవశాత్తు ఆయనతో నా దరఖాస్తు, ఇంటర్వ్యూ ప్రస్తావించాను. అరెరె! మీ పేరు రామచంద్ర కదూ. మూడు దరఖాస్తులు వచ్చాయి. మీది మా పరిశీలనలో మొదటిస్థానంలో ఉంది. తక్కిన రెండూ తమిళ, మలయాళం వారివి. తమిళ అభ్యర్థి మా పరిశీలనలో నెగ్గలేదు. మీరు రాలేదు. రాలేకపోయానని జాబయినా వ్రాయలేదు. అలా వ్రాసి ఉంటే మీ కోసం వేచి ఉండేవారం. జీతం అరవై రూపాయలని ప్రకటించినా మీ అనుభవాన్ని బట్టి 75తో ఆరంభమయ్యేది. 75 అంటే కాలేజీ లెక్చరర్ జీతం. మేము చాలా బాధపడ్డాము. రెండో వ్యక్తిని నియమించాము. అతడు మాకు ఏమీ ఉపయోగపడలేదు. ఇంతవరకు..." అని అన్నారు. నాకు ఇటర్వ్యూ వచ్చిన నాటి కన్నా ఎక్కువ బాధ కలిగింది. బరోడా లైబ్రరీ విద్వాంసులంతా విశ్వవిఖ్యాతులయ్యారు... ఇదంతా అప్పుడు గుర్తుకు వచ్చింది. నేటి అవమానం అంతమంది ఎదుట... ఇలా కొంత చెడు ధోరణి కూడా సాగింది. రెండింటినీ వివేకంతో పరిశీలించాను. నాకు అప్పుడప్పుడు వివేకం తలఎత్తి కనిపిస్తూంటుంది ఆశ్చర్యకరంగా. నాదే తప్పని నిర్ణయించుకొని మరుసటి దినం రంగనాథరామాయణం డ్యూటీ తర్వాత చింతాద్రి పేట నుంచి శాస్త్రిగారి ఇంటికి వెళ్ళి శాంతపరుద్దామని అనుకున్నాను. నిద్రపట్టింది. జనసమ్మర్దం, శాస్త్రిగారి కోపాఘాతం, గత స్మృతులతో మనస్సు అలసిపోయిందేమో, గాఢనిద్ర!

ఉదయం లేచేసరికి ఎనిమిదయింది. పదికి డ్యూటీకి వెళ్లాలి. ఆ విషయంలో గన్నవరపు సుబ్బరామయ్యగారు కరుకైన వ్యక్తి. విందులు, వినోదాలు, హాస్యాలు ఎన్ని ఉన్నా కర్తవ్యం, సమయపాలనం-అంటే ఖరాఖండిగా వ్యవహరించేవారు. త్వరగా స్నానాదికాలు ముగించి బయలుదేరి సుబ్బరామయ్యగారి ఇల్లు చేరాను.

ఇద్దరం పాతాంతరాల చర్చలో ఉన్నాం. సుబ్బరామయ్యగారి కాపురం మేడ మీద. ఆ ఇల్లు ఉత్తరాభిముఖమైనా, వారి వాటా తలవాకిలి దక్షిణాభిముఖం. వాకిలి దాటి రాగానే పెద్ద హాలు. నేను దక్షిణపు తల వాకిలికి వీపు చేసి కూర్చున్నాను. సుబ్బరామయ్యగారు దక్షిణాభిముఖంగా కూర్చున్నారు. పదకొండు గంటల సమయం. నా ఎదుట వాకిలికి ఎదుట కూర్చున్న సుబ్బరామయ్యగారు ఠపీమని లేచి వాకిలి వైపు పరుగెత్తారు. ఏమిటా అంత పరుగు అనుకుంటూ తిరిగి చూతును గదా, శాస్త్రిగారు! నేను సంభ్రమాశ్చర్యాలతో లేచి నమస్కరించి నిలబడ్డాను వినయంగా.

శాస్త్రిగారు పరుగెత్తుకు వచ్చి, నన్ను కౌగిలించుకొని ఏదో మాట్లాడబోయి, మాట పెగలక కంఠస్తంభిత బాష్పవృత్తి కలుషమైన రవంతో కన్నీళ్లు కురిపిస్తూ నిలబడే ఉండిపోయారు. పది నిమిషాలు గడిచాయి. సుబ్బరామయ్యగారి కుటుంబమంతా ఏమీ తోచక మా ఇద్దరి చుట్టూ మూగింది. శాస్త్రిగారు తెప్పరిల్లుకొని, రుద్ధకంఠంతో "నాయనా! ఎంతో నొప్పించాను..." అన్నారు. నాకు తల కొట్టేసినంత పని అయింది. "నాది తప్పు..." అన్నాను, "అబ్బే! నీదేమీ తప్పులేదు. మద్రాసుకు మద్రాసే విరగబడగా లేనిది నీవు వెళ్లితే తప్పా? పిల్లలు అమాయకులు. ప్రసిద్ధ నాయకులను చూద్దామనే కుతూహలం వారికి సహజమే. నేను అక్కడికి వచ్చిన వారందరినీ శాసించగలిగానా?" అదీ వారి పశ్చాత్తాపం. ఆ నిప్పులో కాలి నిర్మలమయిన ఔదార్యమూను! ఒకప్రాకృతకవి ఇలాటి వారిని గురించే అన్నాడు.

**"సుఅణో ణ కుప్పఇవ్వి ఆ**

**అహ కుప్ప ఇ విప్పి అం ణ చింతేఇ,**

**అహ చింతే ఇ ణ జంప ఇ**

**అహ జంపి లజ్జిఓ హోఇ."**

**(సజ్జనుడు కోపపడదు. ఒకవేళ కోపపడితే చెడు ఆలోచించడు. ఒకవేళ అలా చెడు తలపోశాడా నోటితో అనడు, వాగడు, ఒకవేళ పొరపాటుతో నోరు జారాడా సిగ్గుపడిపోతాడు. ఛీ! ఛీ! ఏమిటిది? నేనేనా నోరుజారడం – అని సిగ్గు ముంచుకొని వస్తుంది.)**

శాస్త్రిగారు నన్ను క్షమాపణ కోరనక్కరలేదు. వారి ముందు నేనెంతటి వాడిని? నా వల్ల నా–కోపతాపాల వల్ల వారికి కలిగే నష్టమేమీ లేదు. నా ఒళ్లు కాలడం తప్పు! నా

గదికి వెళ్లి, నేను ఇక్కడికి వచ్చి ఉంటానని వచ్చారట - తర్వాత తెలిసింది. అలా నన్ను వెదుక్కుంటూ రానక్కలేదు. అయినా ఎప్పటికప్పుడు, ఏ చిన్న తప్పు జరిగినా, ఆయన పశ్చాత్తాప పంచాగ్నిలో తప్తమై శ్యామశబలవ్రతం చేసే బంగారు ముద్ద!

శాస్త్రిగారు సుబ్బరామయ్యగారి ఇంటికి వచ్చి చాల ఏళ్లే అయిందట. ఈ కారణంగానైనా వారు వచ్చినందుకు వారంతా మురిసిపోయారు. శాస్త్రిగారు ప్రసన్నచిత్తులై. "వీరభద్రాచార్లూ, వీపు దురదగా ఉంది, కొంచెం గోకవయ్యా" అన్నారు. ఆ మాటకు సుబ్బరామయ్యగారి కుటుంబం వారంతా మరీ విస్తుపోయారు.

సుబ్బరామయ్యగారి సంగతి కొంత చెప్పాలి. కాశీనాథుని నాగేశ్వరరావుగారు కైలాసవాసులు కాగానే సుబ్బరామయ్యగారు భారతిలో 'తుదిమొక్కు' అనే సంపాదకీయంతో తుదిమొక్కు పెట్టి తప్పుకున్నారు. భారతి నుంచి 1938 మే నెలలో. ఈ లోగా ఆంధ్రవిశ్వవిద్యాలయం వారు సర్ డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారి సూచనపై రంగనాథరామాయణ పరిష్కరణను వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి అప్పగించి, తమకు ఇష్టమయిన వారిని సహాయకులుగా నియమించుకోవచ్చునన్నారు. శాస్త్రిగారు సుబ్బరామయ్యగారిని సహాయకులుగా నియమించుకున్నారు, దానిలో వారికున్న అనుభవాన్ని బట్టి.

నేను సెప్టెంబరు మొదటి తేదీకి లాహోర్‌లో ఉండాలికదా. ఆలస్యంగానైనా వెళ్లవచ్చు. కాని సమయపాలనం మంచిదని నేను ఒక దినం ముందు ఉండడమే ఉచితమని అనుకున్నాను. అప్పుడు ఢిల్లీకి వెళ్లడానికి మూడు దినాలు పట్టేది. అక్కడ నుంచి లాహోర్‌కు ఒక పూటకు పైనే. కనుక నేను మద్రాసు నుంచి ఆగస్టు 27 రాత్రి బయలుదేరాలనుకున్నాను. దాదాపు పదిహేను వందల మైళ్ల ప్రయాణం. అప్పుడు ఆరక్షణ మనేదే తెలియదు. దూరప్రయాణమంటే తోటి ప్రయాణికులు దయదలచి పడుకోడానికి కూడా స్థలమిచ్చేవారు.

నేను అంత దూరం వెళ్లిపోతున్నందుకు సుబ్బరామయ్యగారు, ఆయన కుటుంబం వారు ముఖ్యంగా ఆయన నాల్గవ కుమార్తె ఆదిలక్ష్మిగారు చాలా బాధపడ్డారు. ఆదిలక్ష్మిగారిని గురించి కొంత చెప్పాలి. సుబ్బరామయ్యగారు, ఆయన ధర్మపత్ని సుబ్బాయమ్మగారు, సంతానం అంతా కారు నలుపు. కానీ కనుముక్కు తీరుతో కళ గలవారు. ఆదిలక్ష్మిగారు ఆకర్షణీయంగా ఉండేవారు. మేమిద్దరం వివాహం

చేసుకుందామనుకున్నాం. ఆమె తల్లిదండ్రులు ఒప్పుకున్నారు. మా నాన్నగారు 1937లో మద్రాసుకు వచ్చినప్పుడు వారిని సుబ్బరామయ్యగారింటికి పిలుచుకొని వెళ్లి పరిచయం చేశాను. అప్పుడు ఆదిలక్ష్మిగారు కొంత సంభ్రమం చూపారేమో నాకు తెలియదు. నా గదికి తిరిగి వస్తూ చింతాద్రి పేటలోని కువ్వం నది వంతెన దాటుతుండగా, మా నాయనగారే ఆ సంగతి ఎత్తి "నీవు నన్ను వాళ్లకు ఎందుకు పరిచయం చేశావో నాకు అర్థమైంది. నీవు ఆ పిల్లను చేసుకోవాలని ఉన్నావేమో! నాకు ఇష్టం లేదు. మన దగ్గరి చుట్టాలలో రత్నాల్లాంటి వాళ్లున్నారు. ఒక వేళ నేను ఒప్పుకున్నా మీ అమ్మ సర్దుకుపోవడం కష్టం!" అంటూ మా అమ్మపైన తోసేశారు. నేను ఆ విషయం ఎప్పుడూ ప్రస్తావించలేదు. పెళ్లే వద్దనుకున్నాను. నేను 27 ఉదయం సుబ్బరామయ్యగారింటికి వెళ్లి సెలవు పుచ్చుకున్నాను. ఆదిలక్ష్మిగారు గబ గబా వెళ్లి కింది నుంచీ వరండాకు పాకిన జాజి పూవులు కోసి నా దోసిలి నిండా పోసి, "మనం పెద్దలను ఒప్పించలేకపోయాము. నొప్పించి కలవడం మంచిది కాదు. మీ జీవితం ఈ జాజిపూవులలాగ నిర్మలంగాను కీర్తిపరిమళ భరితంగాను ఉండాలని నిరంతరం కోరుకుంటుంటాను." అని నమస్కరించింది. నేను ఆ జాజులను లాహోర్‌కు తీసుకువెళ్లాను. వాడిపోయిన తర్వాత చాలా ఏళ్లు ఉంచుకున్నాను.

చింతాద్రి పేట నుంచి శాస్త్రిగారి ఇంటికి వెళ్లాను. సుభాస్‌చంద్రబోస్ సంఘటన తర్వాత అక్కడికి వెళ్లడం ఇదే మొదటిసారి. శాస్త్రిగారికి నేను మద్రాసు వదలడమే ఇష్టం లేదు. కనుక అంతగా హర్షించలేదు. మహాలక్ష్మమ్మగారికి నమస్కరించాను.

అప్పుడు శాస్త్రిగారు ఏదో ఛందశ్చర్చలో ఉన్నారు. రేఫ సంయుక్తమయిన అక్షరం వెనుక ఉన్న వర్ణం గురువు కాదని, ప్రవహ్వా -ప్రహ్వా అనే సంయుక్తాక్షరాల వెనక ఉన్న అక్షరం లఘువవుతుందని, ఇదే రేఫయుక్త సంయుక్తాక్షరానికి ఉపలక్షకమని వ్యాఖ్యాత వివరిస్తూ

**"తరుణం సర్షపశాకం**
**నవౌదనం పిచ్ఛిలానిచ దధీని !**
**అల్ప వ్యవయేన సుందరి**
**గ్రామ్య జనో మృష్టమశ్నాతి !!"**

అనే ఆర్యలో మూడవ పాదం చివరి వర్ణం నాల్గవ పాదం మొదటి వర్ణం గ్రా వెనక ఉన్నా లఘువే, గురువుగా గ్రహిస్తే ఒక మాత్ర ఎక్కువై ఛందోభంగం అని ఉదాహరించాడు. శాస్త్రిగారు ఈ శ్లోకాన్ని వివరిస్తూ, "లేత ఆవవేసిన కూర, కొత్త బియ్యపన్నం, గడ్డ పెరుగు - ఎక్కువ ఖర్చు లేకుండా పల్లెటూరి వారు మృష్టాన్నం తింటున్నారు" అన్నారు. నేను "సర్ ! తరుణం సర్షపశాకం" అని అన్నాడు కనుక లేత ఆవకూర అయి ఉంటుందండీ, కొత్తిమీర, మెంతికూరలను మనం తింటున్నాము. అలాగే, ఆవకూర కూడా తింటారేమో!" అన్నాను. లేతయని, ఆవ వేసి పొగిచిన కూర - అని మరీ నొక్కి చెప్పారు. నేను వాదించదలచలేదు. ఎందుకంటే నాదీ, ఊహే గదా! సెలవు తీసుకొన్నాను.

నేను నా అమూల్యమైన పుస్తకాలు పెద్దల ఉత్తరాలూ కట్టలు కట్టాను. మా ఊరికి పంపమని, నాకు తిరుపతి నుంచి పరిచితుడు, పక్క వాటా వాడు, మిత్రుడూ అయిన ప్రతివాది భయంకరం రామానుజాచార్యులకు అప్పగించాను, రైల్వే పార్సెలు ఖర్చులకు అవసరమైన డబ్బుతో. వాటిలో తాటాకు పుస్తకాలూ ఉన్నాయి. ఆయన అశ్రద్ధ చేశాడు. పంపలేదు. అవి పాడయిపోయాయి. ఈ విధంగా నేను సరస్వతికి ద్రోహం చేశాను.

నా లాహోరు ప్రయాణ సామగ్రి ఇది. ఒక తంజావూరు తుంగ చాప. జంబుఖానా, రెండు ఖద్దరు పంచెలు, రెండు కుర్తాలు, రెండు బనియన్లు, తువ్వాళ్లు, ఒక దుప్పటి, అభిజ్ఞానశాకుంతలం, వేదాంతదేశికుల సుభాషితనీతి, వావిలికొలను వారు ప్రచురించిన పోతన భాగవతరత్నాలు. నన్ను ఎన్నో అనుభవాలలో ముంచెత్తిన మద్రాసుకు నమస్కరించాను చేతులెత్తి. రాత్రికి ఢిల్లీ బండి కదిలింది.

**"దేవమ్మి పరాహుత్తే**

**సత్తిఅ ఘటిఅంపి విహడ ఇ ణరాణం,**

**కజ్జం వాలు ఆ వరణం**

**వ్వ కహూని బంధం విఅ ణ ఎఇ."**

**(దైవం అనుకూలంగా లేనప్పుడే సమకూడే పని కూడా చెడిపోతుంది. ఇసుక గోడ ఎంతగా కట్టినా నిలవనట్టు పని అనుకూలం కాదు. మానవయత్నానికి దైవం అనుకూలించాలి.)**

## 53

# లావణ్యం ఒలికే లాహోర్

**"పుంసాం సర్వ సుఖైక సాధన ఫలాః సౌందర్య గర్వోద్ధుర**
**క్రీడాలోల విలాసినీ జన మనః స్ఫీత ప్రమోదావహాః**
**గుంజద్భృంగ వినిద్ర పంకజభర స్ఫారోల్లసద్దీర్ఘికా**
**యుక్తాస్సంతి గృహేషు యస్య విపులా రామాః సపృథ్వీపతిః"॥**

**(ఉద్యానవనాలు మానవులకు సకల సౌఖ్యాలు కలిగించే ఏకైక సాధనాలు; వినోదంగా విహరిద్దామనుకునే విలాసినులకు ఆనంద కలిగించేవి. మోగుతున్న తుమ్మెదలు ముసురుతున్న కమలాలతో అందాలు చిందే నడబావులున్న ఇలాటి విశాలమయిన ఉద్యానవనాలు ఎవడి పట్టణాలలో, అంతఃపురాలలో ఉంటాయో, అతడే రాజు.)**

ఎవరో ప్రాచీనకవి ఉద్యానవనాలను గురించి వర్ణించాడు ఇలాగ. ఉద్యానవనాలు ఒక్క రాజులకే కాదు, ఈ ప్రజాస్వామ్యంలో ప్రజలకూ ఉన్నాయి. లాహోర్ నగరానికి సిటీ ఆఫ్ గార్డెన్స్ - ఉద్యానవనాల నగరం - అని పేరు. అలాగే లక్నో నగరానికి సిటీ ఆఫ్ పార్క్స్ - లఘు ఉద్యానాల నగరం - అని పేరు.

లాహోర్ లావణ్యం ఒలికే నగరం. ఆ నగర పౌరులు కూడా ఆ ఉద్యానాల

సౌందర్యాన్ని రక్షించుకుంటూ మురిసిపోతుంటారు (ఇప్పటి హైదరాబాద్‌లాగ చెత్తను పార్క్‌లలో కుమ్మరించరు). నగరంలో విశాలోద్యానాలలో లారెన్స్ గార్డెన్స్ అత్యంత విశాలమైంది. నగరం శివార్లలోని షాలీమార్ గార్డెన్స్ మహామనోహరమైంది. ఇది మొఘల్‌చక్రవర్తుల నాటిది. వసంతపంచమి వంటి రంగురంగుల ఉడుపుల సుందరీమణులతో శ్రీరామచంద్రుని కుమారుడయిన లవమహారాజు పేరుతో వెలసింది ఈ పట్టణమని ఐతిహ్యం.

పంజాబీలు స్నేహప్రియులు. వారి 'కీహుయా' – ఏముందిలే అనే కేర్‌ఫ్రీ తత్త్వం నా స్వభావానికి చాలా నచ్చింది. ఆయా ఋతువులకు అనుగుణమయిన పచ్చి కూరగాయలను భుజించడం, ఎలాటి కైతవ ప్రతిష్ఠలూ లేక వ్యవహరించడం, ఎదుటి వానిలోని సమాన ధర్మాలు గ్రహించి ఆత్మీయత పెంచుకోవడం, తెగే వరకు లాగని సరళత – నాకు నచ్చాయి. నన్నెప్పుడూ వారు పరాయివాణ్నిగా చూడలేదు.

నేను ఆగస్టు 31 ఉదయం పది గంటలకు లాహోర్ స్టేషన్‌లో దిగినట్టు గుర్తు. కొత్త ఊరు. ఆ నాడు ఆదివారమో, మరే సెలవో, స్టేషన్ ఎదుట ఉన్న శాకాహార భోజన్ అనే నామఫలకం ఉన్న హోటల్‌కు వెళ్లి, నేను మద్రాసు నుంచి వచ్చానని, ఫలానా పని అని; వేరే గది దొరికేవరకు ఇక్కడ ఉంటానని అన్నాను హోటల్ యజమానితో. అతడు తన సహజ ధోరణిలో "కో ఈ ఫికర్ ణా, ఎత్థే సామాన్ రక్ఖో, రాహా, ధోకే, భోజణ్ కరో – పురానీ అనార్కలీ అనే ప్రాంతంలో మద్రాసీలు చాల మంది ఉన్నారు. అక్కడికి వెళ్లి గది కోసం చూడండి" అని నాతో చెప్పి, నా సామాను భద్రపరచమని ఒక పిల్లవాడికి చెప్పి, నాకు స్నానాల గది చూపమన్నాడు. నేను స్నానాదులు ముగించి భోజనానికి కూర్చుని ఏమిటి కూరలు అని యథాలాపంగా అడిగాను. వడ్డించేవాడు సర్సోంకా సాగ్, బైంగన్ అంటూ జాబితా చదివాడు. నేను "ఏమిటేమిటి? సరసోంకా సాగ్ ఏమిటి?" అనడిగాను. అతడు ఆవాకు కూర అన్నారు. ఆవాకు పోచ తెమ్మన్నాను. అతడు ఆశ్చర్యంతో రెండు మూడు పోచలు తెచ్చాడు. నేను జేబులో పెట్టుకొని భోజనం ముగించాను తొందరగా.

దగ్గర పోస్టాఫీసు ఉందని తెలుసుకొని పరుగెత్తాను. అణా కవరుకొని, ప్రభాకరశాస్త్రిగారికి "తరుణం సర్షపశాకం" అంటే ఆవ వేసిన లేత కూర కాదని, లేత ఆవకూరే అని, ఈవేళ మొదటి కబళం దానిదేనని, మీ పరిశీలనకు రెండు పోచలు

కవరులో పెట్టి పంపుతున్నానని సుదీర్ఘలేఖ వ్రాసి ఆవకూర పోచలు పెట్టి తపాలాపెట్టెలో పడవేశాను. ఎంతో ఆనందించాను! ఏదో బరువు దించుకున్నట్టుగా భావించుకొన్నాను.

వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది. పంజాబ్ విశ్వవిద్యాలయం ఎక్కడ ఉందో కనుక్కోవడం అవసరం కదా! పురానీ అనార్కలీకి దగ్గరే ఉందన్నాడు హోటల్ యజమానుడు. నేను పురానీ అనార్కలీకి టాంగాలో బయలుదేరాను. దాని పరిసరాలలో దిగాను. అక్కడ జనం ఒక మిఠాయి దుకాణం చుట్టూ మూగి ఉన్నారు. ఏమిటీ విడ్డూరం అని చూతును గదా – వేడి వేడి పూడాలను, అప్పుడే నేతిలో వేయించి తీసిన వాటిని ఆవురావురుమని తింటున్నారు. పూడా అనేది మన సొజ్జ అప్పం. నేతి పరిమళం దిగంతాలకు వ్యాపిస్తున్నది. నేను చాపల్యం కొద్దీ రెండు మూడు పూడాలు దోసెడంత వెడల్పువి తిని, ఆ హల్వాయీనే అడిగాను, ఇక్కడ ఏదయినా గది అద్దెకు దొరుకుతుందా? అని. అతడు వెంటనే "మన దుకాణం పక్క సందులో వెళ్లండి. రెండు మూడు చాకళ్ల దుకాణాలున్నాయి. వాటి ఎదురుగా బఖీన్ అనే ముసలాయన ఉన్నాడు. ఇప్పుడే ఎవరినయినా అద్దెకు చూడమన్నాడు. త్వరగా వెళ్లండి" అన్నాడు.

నేను వెంటనే పరుగెత్తి – అంటే త్వరగా వెళ్లి – అతన్ని పట్టుకున్నాను. డెబ్బయ్యేళ్ల వృద్ధుడు. బఖీన్ అంటే వైశ్యులు. నేను అతని పేరు మరచాను. మొదటి అంతస్తులో చిన్న గది. వరుసగా వేస్తే మూడు మంచాలు పడతాయి. ఒక అల్మారా ఉన్నట్లు గుర్తు. పక్కన మరొక గది, మరొకరిది. రెండో అంతస్తులో మరుగుదొడ్డి. పంజాబ్, సింధులలో మరుగు దొడ్లు చివరి అంతస్తులో ఉంటాయి. మురికి గాలి పైకి పోతుందని వారి వాస్తువు. నీళ్లు స్నాన పానాలకు వాళ్ల ఇంట్లో నుంచి తెచ్చుకోవాలి. బఖీన్, అతని భార్య; వృద్ధులు. మగ పిల్లలు లేరు. ఒక్క కుమార్తె పేరు సుమిత్ర. గుజరన్‌వాలాలో భర్తతో కాపురం. గదికి మూడు రూపాయలు అద్దె. నేను వెంటనే బయానా ఇచ్చి సొంతం చేసుకున్నాను. అతడు తన తాళం వేసి, తాళం చెవి నా చేతికి అందించాడు. ఒక సమస్య సులభంగా పరిష్కారమయింది. పంజాబ్ యూనివర్సిటీ లైబ్రరీ అక్కడికి పది నిమిషాల నడకలో ఉంది. నేను వెంటనే రైల్వేస్టేషను దగ్గరి హోటలుకు వెళ్లి నా సామాను తీసుకొని వచ్చి వేశాను. రాత్రి అక్కడే పడుకున్నాను.

మరుసటి ఉదయం నా బహుభాషాలిపి జ్ఞానం గురించి మద్రాసు విశ్వవిద్యాలయ సంస్కృతాచార్యుడు, డాక్టర్ కున్హన్ రాజా, సంస్కృత కేటలాగ్స్ కేటలాగరు అధ్యక్షుడు

డాక్టర్ వి. రాఘవన్, మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ లైబ్రేరియన్ హనుమంతాచార్, మద్రాసు విశ్వవిద్యాలయం చరిత్రశాఖ రీడర్ నేలటూరి వెంకటరమణయ్య, భారతి సంపాదకులు శ్రీ గన్నవరపు సుబ్బరామయ్య మొదలయిన వారిచ్చిన యోగ్యతాపత్రాలు - విద్వాన్, ఆయుర్వేద భూషణ యోగ్యతాపత్రాలు పంజాబ్ యూనివర్సిటీ, లైబ్రరీ ఆర్డరు; తీసుకొని యూనివర్సిటీ లైబ్రరీకి వెళ్లి లైబ్రేరియన్ లాభూరాం గారిని కలుసుకున్నాను. ఆయన సంస్కృత విభాగం అధ్యక్షులు బాలా సహాయ్ శాస్త్రిజీని పిలిపించి, నన్ను పరిచయం చేసి, ఆ శాఖలో పనిచేయాలని, విశ్వవిద్యాలయం సంస్కృతాచార్యులు డాక్టర్ లక్ష్మణ్‌స్వరూప్ అప్పుడప్పుడు తనిఖీ చేస్తుంటారని చెప్పారు.

ఆ మధ్యాహ్నం నుంచి నా పని ప్రారంభమైంది. దాదాపు రెండు వేల తాళపత్ర గ్రంథాలు తెలుగు, కన్నడ, గ్రంథ, మలయాళ, నందినాగరి - లిపులలోవి, ఒకటి రెండు కాశ్మీరు పండితులు వాడుతున్న శారదాలిపిలోవి ఉన్నాయి. ఆ తాళపత్రాలలో సగానికి సగం శ్రుతి, స్మృతి గ్రంథాలు. కావ్యాలు చాల తక్కువ. ఆదివణ్ శఠగోపజియ్యర్ - శ్రీనాథుని సమకాలికులు - రచించిన వాసంతికా పరిణయం నిర్దుష్ట ప్రతి కనిపించింది. కర్త తెలియదు ఘన జటాన్యాయ పంచాశత్ అనే ఘన జటాస్వరాలకు సంబంధించిన చిన్న ఏభై శ్లోకాల లక్షణ గ్రంథం, దాశరథి తంత్రం అనే తంత్రశాస్త్ర గ్రంథం అపూర్వమైనవి. దాశరథితంత్రం ఆకుల వెడల్పు రెండంగుళాలు, దానిలో 20 పంక్తులు ముత్యాల వరుస. ఎలా వ్రాయగలిగారో ఇప్పటికీ ఆశ్చర్యమే.

తాళప్రత గ్రంథాల సూచీకర్త వచ్చి చేరాడనే వార్త లాహోర్‌లోని కళాశాలలకు అందగానే హిందీ, సంస్కృత, ప్రాకృత పండితులు వచ్చి పరిశీలించి ప్రశ్నల వర్షం కురిపించేవారు. ఈ విధంగా నాకు లాహోర్‌లోని కవి పండితులు, రచయితలు పరిచయమయ్యారు. యూనివర్సిటీ ఓరియంటల్ కాలేజీ (హిందీ ప్రాకృత, సంస్కృత శాఖ) ప్రిన్స్‌పాల్ మహోపాధ్యాయ మాధవశాస్త్రి భండారీజీ, రామచంద్రశాస్త్రి, వైదికానుసంధాన సంస్థ అధ్యక్షుడు విశ్వబంధు శాస్త్రి డాక్టర్ సూర్యకాంత్, ప్రభుత్వ కళాశాల సంస్కృతాచార్యుడు గౌరీశంకరశాస్త్రి, విశ్వవిద్యాలయా చార్యులు డాక్టర్ బనారసీ దాస్ జైన్ (అర్ధమాగధి), డాక్టర్ లక్ష్మణ్‌స్వరూప్ (సంస్కృతం), డాక్టర్ మోహన్‌సింగ్ (పంజాబీ), స్థానిక రచయితలు ఉదయశంకర్ భట్, సంత్‌రాం, ప్రముఖ వేదవిజ్ఞాన ఖని పండిత భాగవద్దత్ - ఇలా ఎందరో.

లాహోర్‌లో ప్రైవేటు వ్యాపార సంస్థలలోను, రైల్వేలోను, మిలటరీ అకౌంట్స్‌శాఖలోను, రాష్ట్ర శాసన సభ కార్యాలయంలోను ఉద్యోగులుగా తెలుగువారు చాల మంది ఉన్నారు. వారందరితో పరిచయం అయింది. వారిలో నాకు గుర్తున్న వారు జమ్మలమడక లక్ష్మీనారాయణగారు (డిప్యూటీ అసిస్టెంట్ కంట్రోలర్ ఆఫ్ మిలిటరీ అకౌంట్స్) జనమంచి కామేశ్వరస్వామి (డి.ఏ.సి.ఎం.ఎ.), వెంకటరమణయ్య (అసెంబ్లీ రిపోర్టర్), పార్థసారథి అయ్యంగార్ (అసెంబ్లీ చీఫ్ రిపోర్టర్), కాంగ్రెస్ నాయకులలో డాక్టర్ సత్యపాల్, గోపీచంద్ భార్గవ, అకాలీ నాయకులలో మాస్టర్ తారాసింగ్, అహరార్ పార్టీ నాయకులు కొందరు, ఖాక్‌సార్ పార్టీ వారు అల్లామామష్రీన్ మొదలయిన వారు పరిచయమయ్యారు.

తెలుగు విద్యార్థులు చాలమందే ఉండేవారు. వారిలో ఎం.ఏ. ఎకనామిక్స్ చదువుతున్న చీమకుర్తి సీతారామయ్య, హిందీ విద్యార్థి వక్కలగడ్డ వెంకటేశ్వర్లు, సంస్కృత శాస్త్రి విద్యార్థి గోపాల్ గుర్తున్నారు. వక్కలగడ్డ వెంకటేశ్వర్లు గుంటూరు జిల్లా సంగం జాగర్లమూడి వాడు. మహామేధావి. ఒక సత్రంలో ఉంటూ లంగర్‌లో భోజనం చేస్తూ చదువుకొనేవాడు. మంచి విమర్శకుడు. హిందీ వాగ్వివాదాలలో పాల్గొనేవాడు. చీమకుర్తి సీతారామయ్య ఎం.ఏ. తర్వాత ఎల్.ఎల్.బి అయ్యాడు. లాహోర్‌లో కోటీశ్వరులు లాలాబిందా శరణ్‌కు అప్పుడు. హైదరాబాద్‌కు వచ్చి, న్యాయవాదిగా జీవితం ప్రారంభించాడు. శంకరానంద్ అనే కన్నడ విద్యార్థి ఉండే వాడు. అతడు హైదరాబాద్‌లో జరిగిన ఆర్య సమాజోద్యమంలో పాల్గొన్నవాడు. శాస్త్రి పరీక్షలో ఉత్తీర్ణుడై, ఎం.ఏ. చదివేవాడు. శాస్త్రి అనేది సంస్కృతంలో అత్యున్న తమైన బిరుదు. దానిలో ఉత్తీర్ణులయిన వారు, మెట్రిక్, ఇంటర్, బి.ఏ.ల్లో ఇంగ్లీషు మాత్రం చదివి ఉత్తీర్ణులయితే బి.ఏ. డిగ్రీ పొందవచ్చు. తర్వాత ఎం.ఏ. సంస్కృతంలో ఉత్తీర్ణులయితే ఎం.ఏ.తో పాటు ఎం.ఒ.ఎల్. డిగ్రీ అదనంగా ఇచ్చేవారు. శాస్త్రి, ఎం.ఏ., ఎం.ఓ.ఎల్., బిరుదావళితో విరాజమానుడు కావచ్చు.

తాళపత్ర గ్రంథ ప్రదర్శనం జరిపితే బాగుంటుందని నేను మూడు నాలుగు నెలల తర్వాత బాలాసహాయ్ శాస్త్రి గారికి, లైబ్రేరియన్ లాభూరాం గారికి సూచించాను. నేను గన్నవరపు సుబ్బరామయ్య గారికివ్రాసి, గంటంతో వ్రాయడం, తాళపత్రాలను వ్రాయడానికి అనువుగా సిద్ధపరచడం, గంటాల ఒరలు, తిక్కన గంటం, మొదలయిన

వాటి ఫోటోలు తెప్పించాను. ప్రదర్శనం జరిపాము. స్థానిక పత్రికలు, ట్రిబ్యూన్, సివిల్ అండ్ మిలిటరీ గజెట్, హిందీ, ఉరుదూ మిలాప్‌లు ప్రదర్శనాన్ని గొప్పగా ప్రశంసించాయి. రెండంగుళాల తాటాకు మీద 20 పంక్తుల తెలుగక్షరాల ముత్యాల వరుసలున్న దాశరథి తంత్రాన్ని విశేషంగా పొగిడాయి. దానితో విద్వన్మండలిలో నా ప్రతిష్ఠ పెరిగింది. వివిధ సంస్కృత పరిశోధక సంస్థలు నన్ను ఆహ్వానించి సలహా అడగడం ప్రారంభించాయి. చెట్లు లేని చోట ఆముదం చెట్టే మహావృక్షం కదా!

నేను లాహోర్‌లో నా హిందీ జ్ఞానాన్ని విస్తరింపజేసుకొనడానికి ప్రయత్నించాను. లాహోర్ కార్యాలయాల పని గంటలు విచిత్రమైనవి. చలికాలంలో మధ్యాహ్నం 11 గంటల నుంచి నాలుగు గంటల వరకు. పన్నెండు తర్వాత వీధి ముఖం చూస్తే తల పగిలేది. చలికాలంలో సాయంకాలం నాలుగున్నరకే చీకట్లు ముసిరేవి. గ్రంథాలయాలు మాత్రం తెరిచే ఉండేవి. మొదటి నుంచి గ్రంథాలయ పక్షినే గనుక, అక్కడ గ్రంథాలయాలలో సమయాన్ని బాగా వినియోగించుకున్నాను. హెవలాక్ ఎల్లిస్ సైకాలజీ ఆఫ్ సెక్స్ చదివాను. మన కామశాస్త్రగ్రంథాలలో తులనాత్మక అధ్యయన దృష్టితో రెండు పద్ధతులలోను సహజత ఎంత అని నిరూపించే గ్రంథం వ్రాయాలనుకున్నాను. కాని వ్రాయలేదు. ఒకరోజు దయానంద ఆయుర్వేద కళాశాల ముందు వెళ్లుతూ, ఆ కళాశాల స్థాపన శిలాఫలకం చూచి ఆశ్చర్యపడి నిలుచున్నాను. లోపలి నుంచి ఒక పెద్ద మనిషి వచ్చి, ఏమిటి చూస్తున్నారు? అని అడిగాడు. "ఈ శిలాఫకలం పైన ఉన్న పండిత గోపాలాచార్యులు మా ఆంధ్రుడు. ఆయన ఈ సంస్థకు శంకుస్థాపన చేయడం గర్వంగా భావిస్తూ చూస్తున్నాను." అన్నాను. ఆయన ఆ కశాశాల ప్రిన్సిపాలు. పేరు మెహతా అని గుర్తు. తలపాగ తీసి నన్ను గౌరవించి "మా గురువుల దేశం వారు, స్వాగతం" అన్నాడు. ఆయన మైత్రి నాకు చాలా ఉపకరించింది. చర్చలలో గోపాలాచార్యులు గారి శిష్యులు చింతలపల్లి సుబ్రహ్మణ్య శాస్త్రి, పులుగుండ్ల నరసింహశాస్త్రి, వేటూరి శంకరశాస్త్రి మున్నగు వారు తమ గురువు గారి శిష్యవాత్సల్యాన్ని, బోధన ప్రతిభను చెప్పగా విన్నాను. మెహతా ప్రశంస దానిని బలపరిచింది.

ఒక ప్రముఖుని సంగతి చెప్పడం మరిచాను. చింతకుంట హను మంతరావ్ సాహెబ్. ఆయన పంజాబ్ విశ్వవిద్యాలయంలో గణిత శాఖాధ్యక్షులు. మహామేధావి. ధైర్యశాలి అని పేరు. ఆయనను రెండు మూడుసార్లు కలుసుకున్నాను. ఆయన

లాహోర్‌లోని అత్యున్నతమైన ఇంగ్లీషు హోటల్‌లో ఉండేవారు. ఐదు రూపాయలకు నెల భోజనం ఉన్న కాలంలో విశ్వవిద్యాలయం ఆచార్యులకు వేయి రూపాయల జీతం. ఎంత వైభవమో ఆలోచించండి. హనుమంతరావు గారు విజయనగరం వారు. తర్వాత కుటుంబ సమస్యలతో ఈ హోటలులోనే ఆత్మ హత్య చేసుకొన్నారని విన్నాను.

నేను లాహోర్‌లో ఉన్నప్పుడు నాకు గొప్పగా తోచిన కొన్ని సంఘట నలను పేర్కొనడం నా కర్తవ్యం. అఖిల భారత హిస్టరీ కాంగ్రెస్ 1940లో లాహోర్‌లో జరిగింది. సుప్రసిద్ధ ఆంధ్ర చరిత్రకారులు డాక్టర్ మారేమండ రామారావు, రాళ్లబండి సుబ్బారావు గారు మున్నగువారు వచ్చారు. రామారావుగారు ప్రసంగింస్తూ "దక్షిణభారతం నుంచి కె.ఎ. నీలకంఠశాస్త్రి మున్నగు ప్రముఖ చరిత్రాచార్యులు వచ్చి ఉంటే ఒక పట్టుపట్టేవాణ్ని. ఇప్పుడు నా వాదం ఖండించడానికి పూనుకునే వారే లేకపోయారు." అంటూ విచారం ప్రకటించారు. రాళ్లబండి వారు కోటు జేబుల నిండా వేరుసెనగలు నింపుకొని తింటూ కూర్చునేవారు. పిఠాపురం నుంచి ఎవరో వచ్చారు. పేరు గుర్తులేదు. సభలు ముగిసిన తరువాత రామారావుగారు "చీకటి కోణాలను చూడకపోతే యాత్రసార్థకం కాదు గదా" అన్నారు. నన్ను వెంట వేసుకొని హీడాదుండి – వేశ్య వాటికకు వెళ్లారు. అక్కడ రెండు గంటలు ప్రతివేశ్యనూ చూస్తూ గడిపి తిరిగి వచ్చాము." గురువుగారూ, కేవలం చూడడంతో సరిపోయిందే మీ యాత్రా సార్థక్యం?"అన్నాను. "అంతేనయ్యా బాబూ! నేను హిస్టోరియన్ను, అన్ని కోణాలూ తెలుసుకోవాలి గదా! అన్నీ అనుభవించామంటే ఛస్తాం" అన్నారు ఆయన. రామారావుగారు చాల సరసులు. గొప్పవక్త. వాదంలో ప్రతివాదులపై పిడుగుపాటుగా పడడమే! వారికి ఆ సమయంలో నానక్ జన్మభూమి అయిన నంకెనా సాహబ్ చూపించాను. ఇది లాహోర్ పరిసరాల్లో ఉన్న క్షేత్రం. నానక్ శిక్కు మత ప్రవర్తకులు.

డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో తత్త్వశాస్త్రా చార్యులుగా నియమితులయిన తర్వాత కాబోలు, లాహోర్ వచ్చారు. "వాట్ ఈజ్ ఫెయిత్? విశ్వాసం అంటే ఏమిటి?" అనే విషయమై ప్రసంగించారు. రెండు గంటలు. ఏడెనిమిది వేల మంది పట్టే హాలు కిటికిటలాడింది. మహాకవి ఇక్‌బాల్ కూడా వచ్చారు. రాధాకృష్ణన్‌ను ప్రశంసిస్తూ ప్రసంగించారు ఆయన. రాధాకృష్ణన్ ప్రసంగానికి ముగ్ధులయిన లాహోర్ మేధావులు ఆయన వెంట వినయంతో శిష్యులలాగ చరించారు. అదొక గొప్ప

ఆనందసమయం. డాక్టర్ రాధాకృష్ణన్ నెల్లూరు కళాశాలకు ఇన్స్పెక్షన్ కోసం వచ్చారు, 1935లో, సర్ సి.వి.రామన్‌తోపాటు.

మలయాళ మహాకవి వల్లత్తోళ్ గారు కథక్కళి నృత్యబృందంతో వచ్చారు. అప్పుడు సర్ శంకర్‌నాయర్ కేంద్రప్రభుత్వ హోం శాఖ కార్యదర్శి అని గుర్తు. లాహోర్‌లో వల్లత్తోళ్ గారికి పట్టుతాపితాలు భూమి మీదపరచి స్వాగతం చెప్పారు లాహోర్ ప్రజలు. అప్పటి అసెంబ్లీ హాలులో సమావేశం జరిగింది. వల్లత్తోళ్ అనర్గళంగా సంస్కృత, మలయాళాలలో ప్రసంగించగా శంకర్‌నాయర్ ఆంగ్లీకరించారు. కథక్కళి పుట్టుపూర్వాలు ప్రసంగం తర్వాత మోహినీ భస్మాసుర మొదలైన నృత్యనాటికల ప్రదర్శనం జరిగింది. భారతీయుల సంస్కృతిని కాపాడుతున్నది దక్షిణాపథమే అని పంజాబీ ప్రముఖులు ప్రశంసించారు.

వ్యాసుడు అష్టాదశ పురాణాలు రచించాడని ప్రథ. కొందరు నమ్మరు. నేను నమ్ముతాను. వల్లత్తోళ్‌గారు పురాణాలన్నిటినీ కేరళీకరించారు. ఆధునిక కవితలు చెప్పారు. ప్రాచీనకావ్యాలు రచించారు. వల్లత్తోళ్, శివరామకారంత్, విశ్వనాథ సత్యనారాయణ, రాహుల్ సాంకృత్యాయన్ వంటి రచయితలను చూచిన పిదప వ్యాసుడు కల్పనాపురుషుడు కాదని నేను విశ్వసించాను.

అఖిల భారత జాతీయ క్రైస్తవ మహాసభ 1940-41లలో లాహోర్‌లో జరిగింది. ఆంధ్రక్రైస్తవ నాయకుడు ధన్వాడ రామచంద్రరావు గారు అధ్యక్షత వహించారు. నేను, చీమకుర్తి సీతారామయ్య, వక్కలగడ్డ వేంకటేశ్వర్లు, న్యాయవాది నటరాజన్ (సికిందరాబాద్) మరికొందరు తెలుగు వారం రామచంద్రరావుగారిని కలుసుకొన్నాము. ఆయన అచంచల దేశభక్తుడు. సంపూర్ణ అహింసావాది. గాంధీజీ అనుయాయి. తెలుగు మేధావులలో ఒకరు. నిష్కల్మషమయిన ఆయన మాటలు ఆయన హృదయాన్ని పట్టి చూపుతుంటే, మేము ఎంతో స్ఫూర్తి పొందాము.

కాశీ విశ్వవిద్యాలయం మీమాంసాచార్యులు మహామహోపాధ్యాయ చిన్న స్వామి శాస్త్రిగారు లాహోర్ ఓరియంటల్ కాలేజీ ఆహ్వానంపై వచ్చారు. చామనచాయ. అంత చలిలోను ఒంటిమీద శాలువా మాత్రమే. కాళ్లకు చెప్పులు తొడగరు. ఆయన త్వరగా నడిచేవారు. లాహోర్‌లోని ఆయన శిష్యులు, పండితులూ, పురప్రముఖులు పరుగులు తీసేవారు. ఆయనకు సంస్కృతం. తమిళం, హిందీ తప్ప మరొక భాషరాదు. సంస్కృతంలో ఆయన వివిధ యజ్ఞాలను గురించి వేదమంత్రాలతో సోదాహరణంగా

వివరిస్తూంటే, ఆర్య సమాజ నాయకులు ఉప్పొంగిపోయి జేజేలు కొట్టారు. వ్యక్తిత్వం అంటే అదీ అనిపించింది నాకు.

పంజాబ్ యూనివర్సిటీ ఓరియంటల్ కాలేజీలో సంస్కృతం, హిందీ లతోపాటు అరబ్బీ, ఫార్సీ, పంజాబీ, ఉరుదూ శాఖలూ కూడా ఉండేవి. మొత్తం కాలేజీకి ప్రిన్సిపాలు డాక్టర్ ఖురైషీ. ఆయన ఆక్స్‌ఫర్డ్ విద్యార్థి. అరబ్బీ, ఫార్సీలలో మహావిద్వాంసుడు. ఆయన కుమారుని పెళ్లి జరిగింది. మమ్ములందరినీ ఆహ్వానించారు. మాధవశాస్త్రి భండారీ వంటి సచ్ఛీలుడు, విద్వాంసుడు – తన ఆతిథ్యం తీసుకోవాలని ఆయన ఆశ. ఆయననే అడిగాడు ఏం చేస్తే బాగుంటుందని; భీష్మణ్ని, అర్జునుడు అడిగినట్టు. “మీ బంగ్లా కాంపౌండ్‌లోని తోటలో ఒక ప్రాంతాన్ని గోమయంతో మూడుసార్లు అలికి, రంగవల్లులు తీర్చి, బ్రాహ్మణుడు వండిన ప్రతి ఘృతపక్వ పదార్థంలోను చుక్క గోమూత్రం ప్రోక్షించండి. నేను ఉడికించినవి తినను. ఘృతపక్వాలను పుచ్చుకుంటాను.” అన్నారు భండారీజీ. ఆ గోహంతకుడు – పాపం శమించుగాక, – అలాగే చేశాడు. భండారీ వెంట మేమంతా వెళ్లాము. డాక్టర్ ఖురైషీ శామియానా, దడి వెలుపల సవినయంగా నిలుచుని “భండారీ సాహబ్, పక్వాన్న లీజియే, సంకోచ్ మత్ కీజియే, మై ధన్య్ హోగయా, మేరా పరివార్ ధన్య్‌హోగయా” అంటూ పదే పదే విన్నవించాడు.

భండారీజీ గర్భాష్టమంలో ఉపవీతులై పన్నెండేళ్లు వ్యాకరణశాస్త్రం, తర్వాత పది సంవత్సరాలు న్యాయమీమాంస శాస్త్రాలూ అధ్యయనం చేసి, 30వ ఏట గృహస్థాశ్రమంలో ప్రవేశించి, యోగాయుర్వేదాలు అధ్యయనం చేసిన మహా విద్వాంసుడు. విద్యకు తగిన శీలం. బంగారు మైచాయతో పొడుగ్గా, బక్కపలచగా మరాఠీ టోపీతో గోఖలేలాగా ఉండేవారు. అలాటి మహితాత్ముని ఆశీస్సు, ఆనందం ఎవరికయినా ఇష్టం కదా!

సంవత్సరం గడించిదో లేదో! నేనున్న ఇంటి యజమాని బషీన్ మరణించాడు. భారతదేశంలో పంజాబీగా పుట్టి మరణించడం మహాపాపం! మరణించిన వాని బంధువుల ఏడ్పులు అతి భయంకరం. ఏడ్చేవారు లేకపోతే కూలి పెట్టి అయినా ఏడిపిస్తారు. నేను శవయాత్రకు వెళ్లాను. పితృమేధ మంత్రాలు దేశమంతా సమానమే గనుక రెండు మూడు చోట్ల శవాన్ని దింపి స్త్రీలు మహాభయంకరంగా ఏడుస్తారు. గొంతుక్కూచుని, మోకాళ్లు, రొమ్ములు, ముఖం కొట్టుకుంటూ, మృత్యుగీతాలు పాడుతూ ఏడుస్తారు. రోదన, పేతన,, పిట్టన ధ్వనులు శ్మశానమంతా వ్యాపించి నక్కల గద్దల

కూతలను మరిపించేవి.

దహనానంతరం ఇంటికి తిరిగి వచ్చాము. బషీన్ కుమార్తె సుమిత్ర పుండయిన మోకాళ్లతో, చిట్లిపోయిన రొమ్ములను సూచించే రక్తపు మరకలున్న ఆచ్‌కన్‌తో, మాంసపు ముద్దలయి పోయిన పెదవులు, ముక్కులతో సాయంకాలం కనిపించింది. నేను ఏదో దయ్యాన్ని చూచినట్లు భయపడుతూ "సుమిత్రా, ఏమిటీ ఘోరం! తండ్రి పోతే దుఃఖం తప్పదు. కాని ఇంత అమానుషంగా లయబద్ధంగా గీతాలతో ఏడవడం విడ్డూరం. నీ ముఖం అద్దంలో చూచుకో!" అన్నాను. సుమిత్ర నా నోరు బలవంతంగా ఎడమ చేత్తో మూసి, "ప్రా! కీకర్ణీ? ఏత్థే ఏ రివాజ్ – (భ్రాతా ఏమి చేయమంటావు? ఇది ఇక్కడి ఆచారాం.) ఏడవకపోతే "దుఃఖం లేదు. ఆస్తికి సిద్ధం' అంటారు." అన్నది. "నీ రివాజు చల్లగుండా, నీవు కోలుకోడానికి నెల చాలదు" అన్నాను. "నిజమే ప్రా. ఇంతేకాదు, ప్రతి మాసికానికీ ఏడవాలి. సంవత్సరమంతా ఇదే బాధ. దీని కోసం గీతాలు వ్రాసేవారూ, పాడే వారూ ఉన్నారు. వారికి సన్మానాలు రహస్యంగా" అన్నది సుమిత్ర. పంజాబీ ముస్లిమ్‌లు రహస్యంగా ఏడుస్తారు.

పంజాబీ శాఖాధ్యక్షుడు డాక్టర్ ప్రొఫెసర్ మోహన్ సింగ్ ఒక దినం "పండిత్‌జీ! రేపు నా ఉపన్యాసం, మీరు రావాలి" అన్నారు. "నాకు పంజాబీ రాదే?" అన్నాను. "భాష కాదు ప్రధానం, సంఖ్య; వచ్చిన వారి సంఖ్య ప్రధానం" అన్నాడు. నేను మరి ఇద్దరు తెలుగువారితో పాటు వెళ్లాను. ప్రాచీన సాహిత్య పంజాబీ భాష సంస్కృత ప్రాకృత వికారమే గనుక నాకు చాలా వరకు అర్థమయింది. ఉపన్యాసంలోని విషయాలు నోట్ చేసుకున్నాను. సభానంతరం మోహన్‌సింగ్ నా దగ్గరికి వచ్చి "ఏమీ రాదన్నారు. చాల నోట్ చేసుకున్నారే!" అంటూ కృతజ్ఞత తెలిపాడు. "మీరు నంబర్ కౌంట్స్ అన్నారు. ముగ్గురిని వెంట తెచ్చాను." అన్నాను. అతడు అందమైన శిక్కు. అందంగా నవ్వాడు.

ఒక దీపావళికి అమృత్‌సర్ వెళ్లాను. ఆ దేవాలయ నిర్వహణ అత్యద్భుతం. భారతదేశంలోని దేవాలయాలన్నీ ఆ విధంగా నిర్వహణలో ఉంటే భక్తిప్రపత్తులు విస్తరిస్తాయని నా విశ్వాసం. దీపావళి బాణసంచాతో దీపాలతో అమృతసర్ (అంబ్రత్‌సర్) సుందరాతి సుందరంగా ఉంటుంది.

అమృత్‌సర్‌లోని మజీద్ (మంజిష్ఠా) మండీలో తెలుగు వాళ్ల పసుపు దుకాణాలు చాల ఉన్నాయి. నిమ్మగడ్డ రామలింగయ్య, జొన్నలగడ్డ రంగయ్య, ఇలా దాదాపు ముప్పై

నలభై దుకాణాలు ఉన్నాయి. వారందరితో పరిచయం చేసుకున్నాను.

లాహోర్‌లో ఉంటూ, పశ్చిమాన ముల్తాన్ వరకు, తూర్పున ధరమ్‌శాల వరకు తిరిగాను. పన్నెండు కోసులకు భాష మారుతుంది అన్న పంజాబీ భాషకు అనుగుణంగా మారుతున్న పంజాబీ మధురవాక్కులు ఆస్వాదిస్తూ, వారిండ్ల ఆవ కూర, యవలపిండి రొట్టెలు తింటూ, తామరతూళ్ల ఊరగాయలు నంజుకుంటూ మన మధ్యాక్కర వంటి వారి హీర్ ఛందస్సులోని పాటలు వింటూ, నిలువెత్తు ఆవ చేలలో, మొక్కజొన్న చేలలో, రహస్యంగా పెంచే నల్లమందు తోటలలో, భంగ్ (భంగా) తోటలలో తిరిగాను. ప్రా ప్రా (భ్రాతా భ్రాతా) అంటూ చుట్టూ చేరి, నా జరీ ఖద్దరు పంచెలు చూసి విస్మితులవుతూ జరీ ఉత్తరీయాలు, చుట్టుకుని ఆనందించే అమాయకులైన పల్లెపడుచుల ఆనందాన్ని చూచి మురిసిపోతూ 'రబ్బా! (భగవంతుడా) నీవు ఉన్నావు. నీవు భారత గ్రామప్రజల ఆనందంలో ఉన్నావు' అనుకుని కళ్లుమూసుకుని మా అమ్మను తలచుకొని ఆమె మాటలు మననం చేస్తూ సంతోషించాను.

ఎంతటి దురదృష్టం! మాధవశాస్త్రి భండారీగారు పరమపదించారు. వారం కిందే ఆయన ఇంటికి వెళ్లి నా జాతకం చూపాను. ఆయన "మీకు ఆయుస్సు చాలా ఉంది. దానిని సద్వినియోగం చేసుకోండి. భగవాన్ మీకు అలాటి అవసరం అనుగ్రహిస్తాడు." అన్నారు. నేను వారి ఇంటికి వెళ్లి చివరి నమస్కారం చేశాను. ఏదో మహావృక్షం కూలిపోయినట్టు, ఒక పర్వతశిఖరం దొర్లిపోయినట్టు, మహానది ఇంకిపోయినట్టు అనిపించింది. అలాటి వారిని గురించే కాబోలు హరకుంధుడనే ప్రాకృత కవి ఇలా అన్నాడు.

సుఅణో జం దేప మతం
కరేఇ తం విఆ కరేఇ పవనంతో,
గ్రామాసణ్ణుమ్మూలి ఆ
మహహోవటార్థాణ సారిచ్ఛమ్

**(సుజనుడు ఊళ్లో ఉన్నప్పుడు ఊరు నిండుగా ఉంటుంది. అతడు మరుగయిపోతే అంతా వెలితే. అది ఎలాటి వెలితి అంటే గ్రామ సమీపంలోని మర్రి మాను కూలిపోతే ఎలాటి వెలితో అలాటిది. ఆ వెలితిని పూడ్చడం కష్టం.)**

# 54

# కొందరు లాహోర్ రచయితలు

**పరి వడ్డఇ విణ్ణాణం**
**సంభావిజ్జఇ జసో విసప్పంతి గుణా,**
**సువ్వన్ని సుపురిస చరి అం**
**కిం తం జేణ ణ హరంతి కవ్వాలాపా,**

**అని ప్రవరసేనుని వాక్యం 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' – అన్న దానికి జవాబు.**

**(జ్ఞానం పెరుగుతుంది. కీర్తి కలుగుతుంది. గుణాలు సంపన్నమవుతాయి. సత్పురుషుల విమలచరితాలు తెలుసుకోవచ్చు. ఇలాటి కావ్యాలలో ఎవరి మనసు హరించే గుణాలు లేవు?)**

**బ**షీన్ మరణించడం వల్ల నేను గది ఖాళీ చేయవలసి వచ్చింది. సంవత్సరం పాటు వారిలో వారి ప్రేమతో ఉన్నాను. నేను గదిలో చేరగానే బషీన్, నన్ను ఖద్దరు స్టోరుకు పిలుచుకొని వెళ్లి రెండు రజాయిలు కొనిపించాడు. ఒక నెహ్రూ కోటు, మఫ్లరు కొనిపించాడు, "ఆచార్య సాబ్! గొంతు నుంచి పొత్తి కడుపు వరకు కాపాడుకుంటే చాలు. లాహోర్ చలి నిన్నేమీ చేయదు. చలికాలంలో పండ్లు, పచ్చి కూరగాయలూ బాగా తిను, ఏ జబ్బూ రాదు" అన్నాడు. ఆ జ్ఞాపకాలు నన్ను వెన్నంటాయి.

ఖద్దరు స్టోరులో నేను తెలుగు వాడినని నా పంచెకట్టు చూచి తెలుసుకున్న పనివాళ్లు తెలుగు పంచెకట్టు నేర్పమని వెంట పడ్డారు. వారికి ఆ కళ నేర్పడానికి రెండు

మూడు గంటలు పట్టింది. హైదరాబాద్ ఆర్య సమాజోద్యమంలో పాల్గొన్న ఒక యువకుడు నన్ను సమీపించి “పండిత్! మీరు నాకొక సాహాయ్యం చేయాలి. మీ గదికి వస్తాను. నా వద్ద కొన్ని తెలుగు ఉత్తరాలున్నాయి. వాటిని చదివి చెప్పాలి” అన్నాడు. సరే రమ్మన్నాను.

పెద్ద కట్ట జాబులతో మరుసటి దినం వచ్చాడు. నేను ఖద్దరు వ్యాపారానికి సంబంధించిన జాబులేమో ననుకున్నాను. కాదు, అతడు ఆర్య సమాజోద్యమంలో పాల్గొనడానికి హైదరాబాద్‌కు వెళ్లినప్పుడు ఒక యువతిని 'ప్రేమించాను. పెళ్లి చేసుకొన్నాన'న్నాడు. లాహోర్‌కు తిరిగి వచ్చాడు. రెండేళ్లకు పైగా గడిచింది. వారానికొక జాబు ప్రకారం వందకు పైగా జాబులు. ఆ యువతి ఆవేదన, నిరీక్షణ, ఆశ, నిరాశ, వాగ్దానాల పునశ్చరణ – ఒకటేమిటి ప్రవాసిత అయిన నవోఢ భావశబలత అంతా ముద్ద కట్టినట్టివి, ఆ జాబులు. “ఏమయ్యా! పరదేశానికి ఒక పవిత్రోద్యమానికి వెళ్లావు. ఇలాటి పని చేశావు. భాషన్నా తెలియదు. మోసం కాదా?” అన్నాను. అతడు “గురూజీ! పరిస్థితులు వికటించాయి. పిలుచుకొని వద్దామని రోజూ మథనపడుతూనే ఉన్నాను.” అన్నాడు. “ఇన్ని జాబులకు జవాబు వ్రాయలేదా? ఎంత ఘాతుకుడివి?” అన్నాను. ఏదో నీళ్లు నమిలాడు. ప్రతి ఉద్యమంలోనూ ఇలాటివి ఎన్నో!

బాలసహాయ్‌శాస్త్రిగారి ఇంట్లో ఏదో వ్రతం జరిగింది. ఆయన నన్ను ప్రత్యేకంగా పిలిచి పెద్ద అల్లగంప (వెదురు అల్లిక గంప)లో ముద్దగా పోసిన బూందీ లడ్డూ దానం చేశాడు. నేను ఆ వీధి వాళ్లందరికీ పంచినా, నెల నాళ్లు తిన్నాను.

నేను నా లైబ్రరీ సహోద్యోగులతో కలిసి, పంజాబీ సినిమాలు చూచాను. వాటిలో యమలాజాట్, పూరణ్ భగత్ అనేవి గుర్తున్నాయి. యమలాజాట్ అంటే అమాయకుడుగా నటించే చతురుడైన కర్షకుడు. పూరణ్ భగత్ మన సారంగధర చరిత్రను పూర్తిగా పోలిన కథ. ఈ సినిమా చూచిన పిదప రాజమహేంద్రవరంలో సారంగధర చరిత్ర జరిగి ఉండదని, ఒక్క పంజాబ్‌లోనే కాక ఇతర దేశాల్లో కూడా ఇలాటి కథ ఉందని ప్రభాకరశాస్త్రి గారికి వ్రాశాను.

నేను గది ఖాళీ చేసి, మిలిటరీ అకౌంట్స్ ఆఫీసర్ జమ్మలమడక లక్ష్మీ నారాయణగారి ఇంటి మేడమీద ఒక గదిలో ఉన్నాను. హోటల్‌లో భోజనం. ఆయన సుప్రసిద్ధ నటుడు ఏ.ఆర్.కృష్ణ మామగారు. పండుగలకు, పబ్బాలకు ఆయన భోజనాలకు పిలిచే వారు. ఆయన పెద్దకుమారుడు సత్యనారాయణ, డాక్టర్ సత్యపాల్ దంత

వైద్యకళాశాలలో దంతవైద్యశాస్త్రం నేర్చుకొనే వాడు. రెండవ కుమారుడు వెంకటేశ్వరరావు ఇంజనీరింగో, ఏదో చదివేవాడు. ఏ.ఆర్.కృష్ణ భార్య అన్నపూర్ణ అప్పటికి అవివాహిత.

లక్ష్మీనారాయణగారు జలంధర్‌కు బదిలీ కావడం వల్ల నేను గది మారాను. ఒక బెంగాలీ మిత్రుడు శ్యామాప్రసాద్ మిత్ర గదిలో చేరారు. ఇద్దరం ఎదురుబదురుగా మంచాలు వేసుకొని పడుకునేవారం. అప్పుడే జనమంచి కామేశ్వరస్వామి గారి అల్లుడు పరబ్రహ్మశాస్త్రితో కలిసి పేరలల్ బారుపై వ్యాయామం చేసే వాడిని. మిత్ర మార్టిన్ అండ్ బర్న్ కంపెనీలో స్టెనోగ్రాఫర్. శ్యామ సుందరుడయిన ఆరడుగుల వ్యక్తి. సహృదయుడు.

అప్పుడొక విచిత్రమైన సంఘటన జరిగింది. నేనున్న గది ఒక పెద్ద వాడాలోది. నా గది వరుసలో ఐదు గదులు. మేడ మీద రెండు మూడు వరుసలలో ఇరవై గదులు ఉండేవి. ఇవి గాక కాపురాల వాటాలు. విద్యార్థులు, ఇతరులు మొత్తం వంద మంది. స్టేన్స్ టీ కంపెనీ వాళ్లు టీ ప్రచారానికి పూనుకొన్నప్పుడు ఆ వాడా ముందు టీ వ్యానుతో తెల్లవారుజామున ఐదు గంటలకే వచ్చి అందరికీ పళ్లపొడి, నాలుక గీచుకొనే బద్దా ఇచ్చి దాదాపు ఒక పైంటు (20 ఔన్సులు) గ్లాసుతో టీ ఇచ్చేవారు. అప్పుడప్పుడు బిస్కత్తులు కూడా. ఈ విధంగా ఆరు నెలలు ఇచ్చారు. ఏదో నెల మొదటి రోజు రాలేదు. ఆరు నెలలుగా టీకి అలవాటు పడిన ప్రాణాలు విలవిలలాడిపోయారు. "కేదా యే కుత్తే దా పుత్రా (ఎక్కడ ఈ కుక్కల కొడుకు) కేదాయే సువర్ దా తుఖామో? (ఎక్కడ ఈ పంది బీజం)" అంటూ శాపనార్థాలు పెట్టారు. చాలాసేపు కాచుకుని ఉండి కాళ్లు ఈడ్చుకుంటూ హోటలుకుపోయి చాయ్ సేవించక తప్పలేదు. ప్రచారమంటే అదీ! అప్పుడు రామారావు అనే కడపవాసి ఆ ప్రచారం అధికారి.

నాకు పలువురు పండిత కవులతో పరిచయం కావడం ఎంతో ఉత్సాహం కలిగించింది. అప్పటి రచయితలలో ముగ్గురు నలుగురే గుర్తున్నారు. (వారి గ్రంథాల ధ్రువీకరణ విషయంలో ఉస్మానియా విశ్వవిద్యాలయం హిందీ రీడర్ డాక్టర్ పెరుమాళ్ల మాణిక్యాంబ గారిని సంప్రదించాను.)

అప్పుడు జగత్ప్రసిద్ధుడు స్వామి సత్యదేవ పరివ్రాజక్. ఈయన చరిత్రలు చాల వ్రాశాడు.

ఆయన కథలలో 'ఆశ్చర్యజనక ఘంటీ' నాకు హిందీ సాహిత్యరత్నలో

పాఠ్యవిషయం. యాత్రాచరిత్రలో మొదటిది అమెరికా దిగ్దర్శన్! ఇది 1911లో రచితం. అమెరికా భ్రమణ్. ఇది 1916లో రచితం. ఇవి రెండూ అమెరికా సామాజిక, రాజకీయ, క్రైస్తవమత స్థితిగతులను వివరిస్తాయి. మేరీ కైలాస యాత్రా, కార్‌గోదామ్ దగ్గరి నుంచి టిబెట్ వరకు యాత్రావృత్తాంతం వర్ణన. ఇది కైలాసపర్వతం, మానససరోవరం, హిమాలయాల ప్రకృతి వర్ణన అతిమనోజ్ఞం. ఇది 1915లో రచితం. సత్యదేవ్ ఆర్య సమాజ సన్యాసి. భారతీయ సంస్కృతిని పశ్చిమదేశాలలో విస్తరింపచేశాడు. వివేకానందుడు అమెరికాలో ఉన్నప్పుడు 'నీ దేశమేది' అని ఎవరో ప్రశ్నించగా చెప్పిన సమాధానాన్ని సత్యదేవ్ హిందీకరించి పాడి వినిపించాడు.

ఆ పాట ఇది.

**"మేరా వతన్ వహీ హై**
**మేరా వతన్ వహీ హై**
**బహతీ జహాఁ పె గంగా**
**యమునా కీ స్వచ్ఛ ధారా**
**ఋషియోం నే జిస్ కీ తట్ పర్**
**ఈశ్వర్ కో థా విచారా"**

ఆరడుగుల సత్యదేవ్ చేతులెత్తి ఈ గేయం ఆలపిస్తుంటే, ఆకాశ గంగను అందుకుంటున్నట్లు కనిపించేది.

ఉదయ శంకరభట్ కవి, నాటకకారుడు. విప్లవకర భావాలతో కవితలల్లే వాడు. మన చిలుకూరు నారాయణరావు గారు అంబపైన మొండిశిఖండి అనే నాటకం రచించిన 1935 ప్రాంతంలోనే, ఉదయ శంకర్‌భట్ "విద్రోహినీ అంబా" అనే నాటకం వ్రాశారు. నేను ఈ సంగతి ఆయనతో ప్రస్తావించగా, నవ్వుతూ "గొప్పవారి భావాలు సమానంగా ఉంటాయి గదా!" అని ఛలోక్తి విసిరారు.

ఈయన రచనలో గొప్ప ఆఖ్యాన కావ్యం తక్షశిల. ఇది భారతీయ సంస్కృతి మహౌన్నత్యాన్ని చిత్రిస్తుంది. ఛాయావాద ప్రభావంతో రచించిన కావ్య సంగ్రహాలు చాల ఉన్నాయి. రాకా మానసీ, విసర్జన, యుగదీప్, అమృత్ ఔర్ విష్ ఇవన్నీ 1940కి ముందు వ్రాసినవే.

నాటకాలలో విద్రోహినీ అంబా (1935), మత్స్యగంధా (1937), విశ్వామిత్ర (1938), విక్రమాదిత్య, దాహిర్ అధవా సింధ్ పతన్; చాల ప్రచారం పొందాయి. ఆధునిక ఏకాంకీ నాటక్ సంకలనం 1938లో ప్రచురించారు. దీని పేరు దస్‌హజార్ ఏకాంకీ. పల్లె పట్ల జీవితాన్ని చిత్రించేది సాగర్ లహరేం ఔర్ మనుష్య.

తర్వాత కూడ ఈయన శకవిజయ, క్రాంతికారీ, నయాసమాజ్, పార్వతీ; మరికొన్ని పౌరాణిక ఏకాంక నాటకాలను రచించారు. ఇవన్నీ 1941 తర్వాతివి.

ఉదయశంకర్ భట్ లాగే నాకు చాలా ఆప్తుడు సుదర్శన్. కథారచయి తగా, నాటకకర్తగా ఇతనికి చాలా పేరుంది, గొప్పభావుకుడు ఇతని సామాజిక నాటకాలు అంజనా (1923), ఆనరరీ మేజిస్ట్రేట్ (1926), భాగ్యచక్ర (1937). ఈయన కథలలో హార్ కీ జీత్, కవి కీ స్త్రీ, చాల ప్రచారంలో ఉండేవి. ఈయన దాదాపు పది పన్నెండు కథాసంకలనాలు ప్రచురించాడు. సుదర్శన్ సుధా, సుదర్శన్, తీర్థయాత్రా, పుష్పలతా, గల్పమంజరీ, సుప్రభాత్, పరివర్తన్, పన్‌ఘట్ మొదలయినవి.

ఉదయశంకర్‌భట్, సుదర్శన్‌ల గొప్పతనం ఏమిటంటే, ఎదుటి వాడు కోపంతో తమ రచనలను తీవ్రంగా విమర్శించినా, ఎలాటి కలవరమూ లేకుండా, ప్రశాంతంగా సమాధానం చెబుతూ, తమ దృక్కోణాన్ని నచ్చజెప్పడం. సుదర్శన్, ఉదయశంకరభట్ నాటకాలపై పెద్ద దుమారమే రేగింది. ప్రాచీన పౌరాణిక పవిత్ర సాహిత్యానికి అపవ్యాఖ్యానాలు చేస్తున్నారని, వారు వేదప్రమాణంతో, ఆ విమర్శలను ఖండించేవారు.

విద్యార్థులకు ప్రియుడయిన రచయిత గులాబ్‌రాయ్. రాజులు ధరించే లపేటా, నల్లటి అచ్‌కన్‌లతో, వెలిగిపోయే ఎర్రటి ముఖంతో రాజఠీవితో ఉండేవాడు. తక్కిన రచనలతోపాటు ప్రాచ్యపరీక్షలు హిందీ రత్న, హిందీ భూషణ, హిందీ ప్రభాకరల కోసం ప్రబంధ రత్న, ప్రబంధ భూషణ, ప్రబంధ ప్రభాకర అనే పేర్లతో ఆయా స్థాయికి తగినట్టు వివిధ విషయాలపై - భాష, సాహిత్యం, భాషాచరిత్ర, సాహిత్య చరిత్ర, భారతేతిహాసం, ఆంగ్ల సాహిత్యంలో తులనాత్మక సమీక్షలు - ఇలా పెక్కువ్యాసాలు ఉండే సంకలనాలివి. విద్యార్థులకు తగిన శైలి, సరళ సుందర హిందీ లలిత నిబంధ అనే పేరుతోను వ్యాస సంకలనం ఉంది. దానిలోని ఠలావా క్లబ్, ఫిర్ నిరాశా క్యా మేరీ అసఫలాతయేం, మేరీ మకాన్ మేరే నాపితాచార్య, మేరీ దైనికీ కా ఎక్ పృష్ఠ, ప్రీతిభోజ్ వంటి హాస్య, వ్యంగ్య రచనలూ చేశారు. నవరస్ (1921) వంటి కావ్య లక్షణ గ్రంథాలను

రచించారు. ఏమైనా వ్యాసాలకు ఈయన చాల ప్రసిద్ధుడు.

ఉర్దూ, పంజాబీ కవులు కూడా పరిచయమయ్యారు గాని, ఆత్మీయత తక్కువ. పంజాబీ కవితలు, భాష కూడా ప్రాకృత సంస్కృతాలకు చాలా దగ్గరగ ఉంటూ శ్రవణ పేయంగా ఉంటాయి. మన తిట్లలాగా 'నీయమ్మ' 'నీయక్క' లాగా కాకుండా "సద్దాముడియా త్వడ్డి మాఁదా బోసారేవా" – మా అబ్బాయి మీ అమ్మాయినీ ముద్దు పెట్టుకోనూ" ఇలా. నాకు అప్పటి పంజాబీ సినిమాలోని ఒక గీతం చరణం గుర్తుంది. "టా తీదే థిల్లే బైకే, ఆబైకే మాయాలేమాయా కరియే దిలదియా గల్లా"– చెట్టు కింద హాయిగా కూర్చుని మనసులోని మాటలను కలబోసుకుందాం అని దీని అర్థం.

నేను ఒకమారు మిత్రులతో పాటు అసెంబ్లీకి వెళ్లాను రమణయ్య గారిచ్చిన ప్యాసుతో. సికిందర్ హయ్యాత్ ఖాన్ పంజాబ్ రాష్ట్ర ప్రధాని. ప్రతిపక్షంలో ఆర్యసమాజ్ నాయకుడు భాయీ పరమానంద్ ఉన్నారు. ఏదో వాగ్వాదంలో "ఇది కాదు మన బలాబలాలు నిరూపణకు! బయటికిరా" అన్నాడు. ప్రధాని (అప్పుడు రాష్ట్ర ముఖ్యమంత్రులను ప్రధానమంత్రి అనే వారు) సరేనన్నారు. భాయీ పరమానంద్. ఇద్దరూ అసెంబ్లీ వెలుపలికి వచ్చి పచ్చిక బీడులో నిలబడ్డారు. చుట్టూ శాసనసభ్యులు. నా బోటి ప్రేక్షకులూను.

భాయీ పరమానంద్ మంచి కసరత్తు చేసిన మల్లుడు. సికిందర్ హయ్యత్‌ఖాన్ గొప్ప క్రీడానిపుణుడు. ఇద్దరూ కలబడ్డారు. అర గంట కుస్తీ సాగింది. పరమానంద్‌ది పై చేయిగా కనిపించింది. అప్పటి పంజాబ్ ప్రభుత్వం యూనియన్ పార్టీదని గుర్తు. పార్టీ మంత్రులు వచ్చి ఇద్దరినీ విడిపించారు. ఇద్దరూ దుమ్ము దులుపుకొని అసెంబ్లీలో ప్రవేశించారు. పత్రికా రచయితలు ప్రశ్నించారు. భాయీ పరమానంద్‌ను – ఇలాటిది విచిత్రమే అని. "కభీ కభీ ఏసా హోతా హే, హోనా చాహిఏ, జోష్ కం హోనే కా తరీకా ఏహీ హే – అప్పుడప్పుడు ఇలాటివి జరుగుతాయి. జరగాలి కూడ. వేడి తగ్గడానికి ఇదే పద్ధతి – అన్నాడు భాయి (పంజాబీలు ఐత్వం పలకరు. హై–ని హే అంటారు.)

సర్ ఫిరోజ్‌ఖాన్‌నూన్ అప్పుడు విదేశాలలో బ్రిటిష్ కమిషనర్‌గా ఉండేవాడు. ద్వితీయ యుద్ధానంతరం భారతం స్వతంత్రమవుతుంది. విచ్ఛిన్నం అవుతుంది గనుక, హిందూ మెజారిటీ గల లాహోర్‌ను ముస్లిం మెజారిటీగా చేయాలని ఫిరోజ్‌ఖాన్‌నూన్ వచ్చి సంప్రతింపులు జరిపి, లాహోర్ మునిసిపాలిటీని రద్దు చేయించాడు. పాకిస్తాన్‌కు

అప్పుడే పునాదులు పడ్డాయి. సంస్కృత విద్వాంసులలో భగద్దత్ – ఈయనను భగవద్దత్ అని కూడ వ్యవహరించేవారు – నాకు చాలా సన్నిహితులయ్యారు. భగవద్దత్ గొడారి. ఆర్యసమాజ్‌లో చేరి మహావిద్వాంసుడ య్యారు. ఋగ్వేద పద సూచిక ఈయన గొప్ప గ్రంథం. నాతో పరిచయం కాగానే ఆయన వేసిన మొదటి ప్రశ్న "మీది ఏ సూత్రం?" అని. ఆపస్తంబ సూత్రమన్నాను. "చూచారా? ఆపస్తంబుడు ఆంధ్ర మహర్షి అని నా వాదం. ఆపస్తంబ సూత్రులు దక్షిణాపథంలోనే ఉన్నారు; ఎక్కువగా. అందులోను ఆంధ్రలో అలాటి మహర్షుల రక్తం ప్రవహించే మీరంటే, బ్రాహ్మణులంటే నాకు మహా గౌరవం. కాని మీరు ఆ మహర్షుల మార్గాన్ని కొంచెమైనా అనుసరించాలి. మాతో పాటు మీరూ తోళ్ల వ్యాపారానికి దిగి మాతో పోటీ పడితే ఎలా?" అనే వాడు ఆయన.

"మీరు న్యాయంగా ఆలోచించండి, ఇప్పుడు జీవికకు ఎంతో పోటీ కదా! పాత వృత్తులతో కడుపు నిండుతుందా, కాలు నిండుతుందా" అనే వాడిని, "అజీ సాహబ్! డట్‌కె అపనే పేపేశేమే రహియే. తబ్ కే ఖియే, లోగ్ ఆప్‌కె యాహాం దౌడేంగే"– "అయ్యా, మీ వృత్తిలో మీరు స్థిరంగా ఉండండి. – అప్పుడు చూడండి; జనం మీ వద్దకు ఉరుక్కుంటూ వస్తారు" అనే వాడు ఆయన. "అంతటి స్థితప్రజ్ఞత్వం ఉండవద్దూ?" అనడిగాను. పూర్వం మీ పెద్దలయిన ఋషులు లేరూ? మనువు ఎంత ఆత్మస్థయిర్యంతో అన్నాడు!

**అస్మిన్ దేశప్రజా తస్య**
**సకాశా దగ్రజన్మనః**
**స్వస్వం చరిత్రం శిక్షేరన్**
**పృథివ్యాం సర్వమానవాః ॥**

**(ఈ దేశంలో పుట్టిన అగ్రజన్ముని నుంచి ప్రపంచ ప్రజలు తమ చరిత్రాన్ని నేర్చుకోవాలి)**

ఇప్పటి బ్రాహ్మణులు కూడ ఆ నిబ్బరంతో, గాంభీర్యంతో ఉండాలి. దయానందులు చూడండి. ఆయనను ఎందుకు పూజిస్తున్నాం? అగ్రజాతి వారు ఆ స్థాయిని అందుకోవాలి.... ఔను మిమ్ములను మరొక దారికి లాగాను. కొంతకు కొంత న్యాయం చాలు. అన్నిటికీ అంగలార్చకండి అన్నారు. భగద్దత్ మాటలన్నీ ఆలోచనామృతాలే.

"తెలుగు గోసాయిలు వచ్చారట పండిట్‌జీ. వాళ్ల భవిష్యవాణి వేద వాక్కట.

మీరు రండి, మాకు దుబాసిగా ఉండడానికి" అన్నారు ఒక రోజు లైబ్రరీ సహోద్యోగులు, ఇక్బాల్‌సింగ్, జన్నత్ హుసేన్, సోనారాం మొదలయిన వారు. నేను బయలుదేరాను, వారితో పాటు. రైలు స్టేషన్ దగ్గర ఒక సత్రంలో దిగారు గోసాయిలు. సత్రం చాల పెద్దది. నలుగురైదుగురు తెలుగు గోసాయిలూ ఉన్నారు. వారిలో ఒకరు కడప పట్టణం వారు.

నా మిత్రులు అతనిని ఏమిటేమిటో అడిగారు. అతడు చెప్పిన భూతవిషయాలు సరిపోయిందన్నారు. దానిని బట్టి భవిష్యద్విషయాలు జరుగవచ్చునని వారు నమ్మారు. "ఎప్పుడు జరుగుతాయి ఇవన్నీ?" అనడిగారు మాలో ఒకరు. "నేను తెలుగువాణ్ణి అందులోను రాయలసీమ వాడిని. నా మాట అంటే రాతి మీద గీతే" అన్నాడు గోసాయి. నేను నవ్వి "ఇదేమి అహంకారం? మీరు గోసాయి అయినా మమకారాలు పోలేదే?" అన్నాను. అతడు నవ్వుతూ "ఎంతటి వానికయినా స్వస్థాన వేషభాషలనే మమకారం తప్పదు. అది ఇతరుల ప్రయోజనానికి భంగకరం కారాదు. కబీరంతటి జ్ఞాని తన గీతాలకు కవితలకు కబిరా, కబీర్ అనే ముద్ర వేసుకున్నాడు. అభిమానం తప్పుకాదు. దురభిమానం తప్పు" అన్నాడు. మేము తిరిగి వస్తున్నాము. బజారులో ఒక శిక్కు యువకుడు రకరకాల వినోదాలు చేస్తున్నాడు. నిప్పులు పరిచాడు నడవడానికి. తన పేరు గుల్జార్ సింగ్ అని. తను కోడిరామమూర్తి శిష్యుడనని చెప్పుకున్నాడు. నేను రామమూర్తి గారి పేరు విని, చుట్టూ మూగిన గుంపులో దూరాను. "నేను నా సింగ్ అనే పదం తీసేసి గుల్జార్ మూర్తి అని పేరు మార్చుకున్నాను. మా గురువు గారొకరే సింగ్. ఆయన ఎదుట మేము మేక పిల్లలం" అంటూ అనర్గళంగా ప్రసంగిస్తున్నాడు.

నేను గది చేరే వేళకు ముగ్గురు నలుగురు ఆజానుబాహువులయిన సన్యాసులు నా కోసం కాచుక్కూచున్నారు. వాళ్లకు నమస్కారం చేసి, గది తాళం తీసి, మంచంపై వాళ్లను కూర్చోబెట్టి అక్కడి ఆచారం ప్రకారం "కీ సేవా?" అనడిగాను. "మరేం లేదు. మీరు మద్రాసు నుంచి వచ్చారని విని వచ్చాము. అక్కడ ఆంధ్రపత్రికలో వేలాల సుబ్బారావు అనే విద్వాంసుడు పని చేస్తున్నాడు. అతను మా జట్టులో వాడు. నీ వల్ల తెలుగు భాషకు అవసరం ఉంటుంది. వెళ్లమని పంపాము. ఇక్కడ శాస్త్రి, హిందీ ప్రభాకర్, బి.ఏ. చేశాడే, అతని యోగక్షేమాలు.... " అని వారు ఏక కంఠంతో ప్రశ్నించారు.

సంతోషాశ్చర్యాలతో నాకు మాట పెగలలేదు. వేలాల సుబ్బారావుగారు మోకాళ్ల

వరకు తెల్లటి గూడగట్టు ఖద్దరు గుడ్డ, బనీను, మెడకొక సంచీ, రసాయన శాస్త్రజ్ఞుడు ప్రఫుల్లచంద్రరాయ్ లాగ ఉండేవారు. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వంలో మల్లం పల్లి సోమశేఖరశర్మగారికి సహాయకులుగా ఉండేవారు. ఆయన వివరాలు తెలిపాను. “జీతే రహో!” అంటూ ఆశీర్వదించి సన్యాసులు వెళ్లిపోయారు. సుబ్బారావు గారి గొప్పదనం అంతవరకు ఎవ్వరికీ తెలీదు.

నేనున్న ప్రాంతానికి అనార్కలీ అని పేరు ఎందుకు కలిగిందో చెప్పలేదు గదూ! అదొక కరుణగాథ. అనార్కలీ ఎవరో సామాన్య దాసీ బాలిక. సుందరి కావడం వల్ల అనార్‌కలీ అన్నారు. అనార్‌కలీ అంటే దానిమ్మమొగ్గ. దాని రంగు రూపం మధుర మోహనమని చెప్పనక్కరలేదు. ఆ బాలికను యౌవనం ఆవేశించగానే చాలామంది కళ్లు కుట్టాయి. అలాటి వారిలో ఒకడు జహంగీర్ అనే రాజ్యాభిషేక నామం ధరించిన సలీమ్. అతడు ఆమెను పట్టపురాణిని చేస్తానని వాగ్దానం చేసి, అనుభవించాడు. ప్రతి రాజకుమారుడూ చేసే పని ఇదే. తీరా ఆ సమయం వస్తే ఏవో కుంటిసాకులు!

తండ్రి అక్బరుకు ఈ ప్రేమ కలాపం తెలిసింది. తనది గొప్ప వంశం కదా! రాజపుత్ర స్త్రీలతో సంబంధం గౌరవప్రదం గాని, ఒక దాసీకన్యతో సంబంధమా! మండిపడ్డాడు. సలీముకు చెప్పి చూచాడు. వినకపోయేసరికి రాజ్యం ఎర పెట్టాడు. అత్యంత విస్తారమయిన మొఘల్ రాజ్యమా, అనార్కలీయా? ఏదో ఒకటి కోరుకోమన్నాడు. సలీం వెర్రివాడా? రవి అస్తమించని రాజ్యాన్ని తృణప్రాయంగా వదలి తాను ప్రేమించిన వనితను పెండ్లాడి, తొంభయ్యేళ్లకు పైగా రాజకీయాలకు దూరంగా జీవితాన్ని మహోదాత్తంగా గడిపిన అష్టమ ఎడ్వర్డ్ చక్రవర్తి వంటి ధీరుడా నికమ్మా సలీమ్? హాయిగా రాజ్యమే కోరుకున్నాడు. అనార్కలీని గాలికి వదిలాడు.

అక్బర్ చక్రవర్తి అనార్కలీని అహింసాత్మకంగా శిక్షించాడు. ఉరితీస్తే హింస, తమ పూర్వుల ఆచారం ప్రకారం రాళ్లతో కొట్టి చంపడం హింస. కనుక అనార్కలీని కట్టుగుడ్డలతో నిలబెట్టి ఒంటికి అంటుకొనేట్టు నాలుగు వైపులా కోట రాళ్లతో గోడ కట్టించి కప్పు వేయించి కాపలా పెట్టించాడు. ఆ అభాగ్యురాలు ఒక నికమ్మా నవాబ్‌జాదా మాయ ప్రేమకు బలయిపోయింది ఊపిరాడక. ఆమె ప్రేమకు ప్రతిఫలం సజీవసమాధి. దుర్మార్గుడైన సలీముకు, అక్బరుకు శాశ్వత రౌరవాది నరకాలని నా విశ్వాసం. దానికి అనుకొని ఊరు పెరిగింది.

ఇది పురానీ అనార్కలీ. పెరిగింది నవ అనార్కలీ. ఆ గోడలు చెక్కు చెదరకుండా ఉండేవి. నేను ఆ దారిన వస్తూ పోతూ దాని ఎదుట క్షణం నిలబడి "అనార్కలీ! నీవు యుగయుగాలకు ఆదర్శప్రణయినివి" అని గొణుక్కునే వాడిని.

ఎక్కడ ఏం జరిగినా స్పందించే కవివతంసులు సలీం, అక్బర్ల గొప్పదనాన్ని తెగవ్రాశారు కావ్యాలు. బ్రిటిష్ వారు మనకు శత్రువులయినా, వారి గొప్పదనాన్ని మనం మెచ్చుకోవాలి. వ్యాసుడు, వాల్మీకి ఈ విధంగానే చేశారు. బ్రిటిష్ వారికి అలాటి తత్త్వం ఉంది. గాంధీజీని మెచ్చుకున్నారు, తమ సామ్రాజ్యం కూలగొట్టిన వాడయినా. మన కవులలో ఒక్కరు సమకాలీన మహోదాత్త ప్రేమేతిహాసమయిన అష్టమ ఎడ్వర్డ్ త్యాగ ప్రేమకు స్పందించారా? వారికి పాత చరిత్రలోని ప్రేమ స్ఫూర్తిదాయకం; సమకాలీన ప్రేమగాథ కాదు - ఏమో! ఎటునుంచి ఎటు మళ్లుతుందో! ఎందుకు గొడవ! - ఇదీ మన కవుల స్పందన. అష్టమ ఎడ్వర్డ్ త్యాగప్రేమ గాథ యుగయుగాలు కొనసాగుతుంది. చరిత్రలో, కవులు పద్యాలు అల్లక పోయినంత మాత్రాన మరుగైపోదు!

**నికటస్థం దహత్యగ్నిః**
**న తు దూరాపసర్పితమ్ ।**
**కులం దహతి రాజాగ్ని :**
**స పశు ద్రవ్య బాంధవమ్ ॥**

**(నిప్పు దగ్గర ఉన్న వాడిని కాలుస్తుంది. దూరంగా తప్పుకున్న వాడిని కాల్చదు. కాని, రాజు అనే నిప్పు - పశువులు, సామగ్రి, ధనం బంధువులతో పాటు కులాన్నీ కాలుస్తుంది.)**

# 55

# మాయ బంగారాలు - మాయ తాయెత్తులు

"వరం దారిద్ర మన్యాయ
ప్రభవా ద్విభవా దపి !
కృశతాభిమతా దేహే
పీనతా న తు శోఫతః"

**(అన్యాయంగా సంపాదించిన విభవం కన్నా దారిద్ర్యమే మేలు. బక్కగా ఉండడం మంచిది. వాపు వల్ల వచ్చే బలుపు వద్దు. అన్యాయ మార్గంతో కలిగే సంపద ఎప్పుడు మనస్సును గిల్లుతూనే ఉంటుంది. అంతకన్నా దరిద్రుడుగా ఉండడం హాయి. వాపు ఎప్పుడూ బలం కాదు గదా. అది రోగం. దేహంలో దోషాలు చెలరేగినప్పుడుగాని, ఏదైనా అఘాతం కలిగినప్పుడు గాని వాపు ఏర్పడుతుంది. అది బలం ఎలా అవుతుంది?)**

పంజాబ్ యూనివర్సిటీ లైబ్రరీలో తాళపత్రాది లిఖిత పుస్తకాల సూచీ నిర్మాణ కార్యం అయిపోయింది. కాని, నాకు కొత్త వెలుగులు ఇచ్చిన పంజాబును వదిలి రాబుద్ధి పుట్టలేదు. అక్కడే ఉండి బి.ఏ. పూర్తి చేద్దామనుకున్నాను. నా మిత్రుడు చీమకుర్తి సీతారామయ్య కూడ అదే మంచిదన్నాడు. నేను అద్దెకున్న జమ్మలమడక లక్ష్మీనారాయణ గారూ మంచి ఉద్దేశమే అన్నారు. ఏదైనా పని వెదుక్కో వాలనుకున్నాను.

వారం గడిచింది. ఎప్పటిలాగే, పాలు, జిలేబీ తీసుకోడానికి ఒక ఉదయం హల్వాయి దుకాణానికి వెళ్లాను. పురానీ అనార్కలీ ప్రాంతంలో వాడే, చిరపరిచిత ముఖుడే; ఒకాయన, జిలేబీలు తింటూ 'ఒక రోల్డు గోల్డు కంపెనీలో దక్షిణభారత

భాషలు తెలిసిన గుమాస్తా కావాలిట. మీరు వెళ్లుతారా?'అని నన్ను ప్రశ్నించాడు. నేను సరే ననగా, వివరాలు తెలిపాడు.

నాకు ఉద్యోగం వెంటనే అవసరం గనుక ఆ దినమే బయలుదేరాను. లాహోరు శివారులలో ఒక పెద్ద తోటలో ఉంది ఆ రోల్డుగోల్డు కంపెనీ. రోల్డుగోల్డు వస్తువులు-విదేశాల నుంచి వచ్చేవి అయితే కనీసం ఐదేళ్లయినా మెరుగుమాయకుండా ఉంటాయి. ఈ కంపెనీ అలాటిది కాదు గనుక, దొంగ బంగారం కంపెనీ, మాయ బంగారం కంపెనీ - అని అనడం న్యాయం. లాహోరుకు పడమరగా మూడు నాలుగు మైళ్లలో ఉంది. కాలి నడకన గంట ప్రయాణం.

నేను అటువైపు వెళ్లే టాంగాలో వెళ్లాను. పంజాబ్ గోల్డ్, జలంధర్ గోల్డ్ అమృత్‌సర్ గోల్డ్, లండన్ గోల్డ్, అమెరికన్ గోల్డ్, ప్యారిస్ గోల్డ్ - అని వరుసగా పది గజాల కొకటిగా నామఫలకాలు వేలాడుతున్నాయి. అన్నిటి సరుకూ ఒకటే. అన్నిటికీ యజమానుడు ఆనంద్ అనే ఆయన. ఆనంద్ అనేది ఒక ఇంటి పేరు. ఆనంద్, స్వరూప్, మల్హోత్రా, మెహరోత్రా అనేవి పంజాబ్ కాయస్తుల ఇంటిపేర్లు. అతని పేరు శోభరాజ్ ఆనంద్ అని గుర్తు. మనకందరికీ తెలిసిన ముల్క్‌రాజ్ ఆనంద్ ఆ ఆనంద్ శాఖ వారే.

ఆనంద్ ఎఱ్ఱగా బొద్దుగా అందంగా ఉన్న ఆరడుగుల ఆసామీ. అహిమహిరావణ మారీచేంద్రజిత్తులంత జిత్తులమారి. అతని చాతుర్యం వ్యాపారంలోనే. తన కంపెనీలో పనిచేసే వారికి కచ్చితంగా జీతాలిచ్చేవాడు. దక్షిణాపథ భాషలలోని తిట్లు, మర్యాదమాటలు కొన్ని తెలుసుకొన్నాడు. మర్యాదగా వ్యవహరించేవాడు.

చెప్పడం మరచాను. ఈ శోభరాజ్ ఆనంద్, ఆనంద్‌స్వామిగానూ వెలశాడు. రుద్రాక్షమాలలూ, తులసి పూసల మాలలూ, స్ఫటికమాలలూ మెళ్లోవేసుకొని; ముఖంపై మూడు విభూతి పట్టెలతో, వ్యాఘ్రాసనంపై కూర్చుని తీసుకున్న ఫోటోలు. పశ్చాద్భూమికగా ఉన్న, దూరంగా ఉన్న ఒకహాలులోకి తలుపులున్న మూడు నాలుగు గదులకు వశీకరణ్ తావీజ్, పరీక్షా పాస్ తావీజ్, అదాలత్ విజయతావీజ్, అపనా అంగాంగ్ బఢానే కీ ప్రక్రియా వంటి నామ ఫలకాలు వేలాడుతున్నాయి. వశీకరణానికి తాయెత్తు, పరీక్షలో ఉత్తీర్ణతకు తాయెత్తు, అంగాలు పెంచుకొనే ప్రక్రియ అని వాటి అర్థం.

నేను ఆయనను సమీపించి ఫలానా వారు తెలుపగా వచ్చాను–అన్నాను. రండి రండి – అంటూ కూర్చోండి అన్నాడు తెలుగులో. 'ఏం భాషండీ మీది? ఇంటికి వచ్చిన పెద్ద మనుష్యులను రండీ, రాండీ అనడం?' అని ఛలోక్తి విసిరాడు. పరిజనంతో పాటు నేనూ నవ్వాను. అతనే మళ్లీ "ప్రతి భాషలోను ఇతర భాషల వారికి ఏవగింపు కలిగించే మాటలు ఉండనే ఉంటాయి. హమ్ దేంగే అంటే మీకు తప్పు, అంతేనా?" అంటూ. మరొకసారి నవ్వి దాని అర్థం పరిజనానికి వివరించాడు. వాళ్ళు కనుబొమ్మలెగరేస్తూ నవ్వారు. "సడ్డీ బోలీ చంగీ" – మన భాష మంచిది – అన్నారు ఒకరు పంజాబీలో.

"ఇలాంటి ఛలోక్తులు మన ఇద్దరి భాషలలోను చాలా ఉన్నాయి. తీరిగ్గా నవ్వుకుందాం. ఇప్పుడు మీ పని ఏమిటంటే – అసలు విషయం మరచాను. మీకు ఈ పని సంగతి చెప్పిన వారు తెలిపారో లేదో; ఇక్కడ యాభయి రూపాయలు గుమాస్తాలకు నెలసరి జీతం. లాభాలు ఉన్నప్పుడు బోనస్సూ ఉంది. మీకు అన్ని భాషలు వచ్చు గనుక అరవై ఇస్తాను. చూచారు గదా నా వాలకం; అందరూ నవ్వుతూ ఉండాలని నేను ఆశిస్తాను. అంటే మన కంపెనీల బృందం మోసం చేస్తున్నట్టు తోచవచ్చు. అది వ్యాపారం. వ్యాపార విషయంలో నాది యుద్ధనీతి. అంటే, విజయానికి ఏమన్నా చేయవచ్చు. ఏమంటారు?" అన్నాడు ఆనంద్.

"మీ షరతులు నాకు కష్టమయినవేమీ కావు. కాని, వ్యాపారం, అన్యాయం అని మీరే అంటున్నారు. మరి నేను ఒక పద్ధతిగా పెరిగినవాడిని, అన్యాయమిది, అని నా అంతరాత్మ బోధిస్తే, నేను మీ అనుమతితో వెళ్ళిపోవచ్చు గదా?" అని అడిగాను.

ఆయన నోరంతా తెరిచి నవ్వాడు. బంగారు దవడ పళ్ళు కనిపించి మెరిసేట్టుగా నవ్వాడు. నన్నొకసారి ఎగాదిగా చూచాడు. తన పరిజనాన్ని చూచాడు. తన పరిజనంలో ఒకరిని చూపుతూ అన్నాడు. 'మీ మద్రాసీలతో ముఖ్యంగా తెలంగీలతో ఇదే బాధ. అమృత్‌సర్‌లో నాకూ ఒక పసుపు దుకాణం ఉంది. అక్కడ జొన్నలాగాధా రామలింగ్గయ్యా కక్కానీ వెంకటారతనం, మోతో సాంబయ్యా నా సాటి పసుపు వ్యాపారులు. న్యాయం, న్యాయం అంటారు. వ్యాపారంలో న్యాయం ఏంటి? సరుకు మంచిదిస్తావు. పదింతల సొమ్ము పుచ్చుకుంటావ్. సంపాదించి దేవాలయం కట్టు. బీదలకు దానం చేయి. ఒక కాలేజీ పెట్టించు. ఏమంటారు – మీ పేరు రామచంద్ర

కదూ - ఏమంటారు. రామచంద్రజీ? ఇదే ఈయన్ను చూచారా? ఈయన రెండు రామాలయాలు కట్టించారు. వ్యాపారం ఏమిటో తెలుసా? సట్టా. ఇదిగో ఈయన్ను చూడండి. ఈయన హర్ద్వార్‌లో ఒక సత్రం కట్టిస్తున్నారు. వ్యాపారం ఏమిటనుకున్నారు? వైన్. ఇదంతా మీకెందుకూగ్గాని, ఈ వేళే చేరుతారా? మంచి రోజు, మీ మద్రాసీలకు- రాహుకాలం, వరజ్యం అనీ చాల పట్టింపు - ఇంతకూ వ్యాపారంలో అన్యాయమనేది లేదు అంటా. అంతే. నాతో ఉండండి. బెజ్వాడలో ఒక్క బ్రాంచి పెడదాం' అన్నారు.

నేను ఆ వేళ చేరడానికే వచ్చానన్నాను. "అయితే పని సంగతి మాఖన్‌లాల్ - మా సెక్రటరీ చెబుతాడు. వెంట వెళ్ళండి" అని నన్ను ఒక నవయువకుని వద్దకు పంపాడు. అతడు పరిజనంతో పాటు కారులో వెళ్ళిపోయాడు.

మాఖన్‌లాల్ నాకు పాఠాలు చెప్పడం ప్రారంభించాడు. "రామచంద్రజీ దేఖియే, తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ భాషలలో ఉత్తరాలు వస్తాయి. ఇంగ్లీషులోగాని, హిందీలోగాని వ్రాయండయ్యా అని సరుకులతో పాటు నోటీసులు పంపినా చూడరు. సరుకు కావాలన్నా వాటిపై ఇంగ్లీషులో, మీకు హిందీ వచ్చుగా ఇకనేం హిందీలో రిమార్కువ్రాయండి. సరుకు బాగులేదు. మోసం వంటివి చించి బుట్టలో వేయండి హాఁ!, పోలీసు కంప్లెయింట్లు, ప్రభుత్వోద్యోగులకంప్లెయింట్లు ఆనందుగారికి పంపండి, సారాంశం వ్రాసి. మీకు బెంగాలీ వచ్చా? -వస్తే అవి గూడ చూడండి. బెంగాలీ వచ్చిన వారిని నియమిస్తున్నాము. " ఈ సమావేశాలు, ఉపదేశాలు, అయ్యేవేళకు సూర్యుడు అస్తగిరి అంచులకు చేరాడు. నేను బయలుదేరాను. వెంట మఖన్‌లాల్ వచ్చాడు. సరసుడు, మంచివాడు. ఆనంద్‌గారికి నమ్మిన బంటు. నన్ను బాగా పనిచేయమని,బెజవాడలో తమ కంపెనీల శాఖా కార్యాలయం కొన్ని నెలల్లో నెలకొల్పనున్నామని, దానిలో, ఆంధ్రప్రాంతం వాడిని గనుక, నాకు ప్రాధాన్యం ఉంటుందని, వంద,వందా యాభైకి తక్కువ లేని జీతం, ఉత్తరోత్తరా అభివృద్ధి ఉంటుందని,వంద రూపాయలంటే, పట్టభద్రులక్కూడా లేని జీతమని అన్నాడు. స్నేహంతో నేను తల ఊపాను. నీళ్లలో ఉన్న గేదెను బేరమాడినట్టు, వ్యాపారంలో తలా తోకా తెలీదు. అంత లోపలే భవిష్యత్తుకు నిచ్చెనలు, ఆకాశహర్మ్యాలు.

మరుసటి దినం నుంచి పని ప్రారంభమయింది. సంచుల కొద్దీ ఉన్నాయి, ఉత్తరాలు. వాటిని భాషల వారీగా విడదీయడానికే రెండు మూడు రోజులు పట్టింది. అలాంటి వింగడింపేమీ వద్దు. చేతికి దొరికింది దొరికినట్టుగా చదివి పరిష్కరించండి.

– అన్నారు: మాఖన్‌లాలూ, ఆనంద్‌గారూ. కాని నేను క్యాటలాగర్ను గదా! క్రమబద్ధంగా, భాషల వారీగా విడదీస్తే పని సులువని వారికి చెప్పాను. "మీ ఇష్టం. పని తెమలడం ముఖ్యం. మీరు ఏ పద్ధతి అనుసరించినా సరే" అన్నారు వారు.

ఆ ఉత్తరాలలో తెలుగు వారివి వేలలో, రెండవ స్థానం కన్నడం వారిది. మూడు నాలుగు తమిళ మలయాళీలవి. బెంగాలీలు తెలుగు వారికేమీ తీసిపోలేదు. బెంగాలీ ఉత్తరాలు విడిగా పెట్టాను. ఒరియా నాకు రాదు. కనుక చదువలేదు.

ఆ ఉత్తరాలు చూస్తూ ఉంటే, తెలుగు వారి అమాయకత్వం, నగలపైన వ్యామోహం, కామప్రవృత్తి, తాయెత్తులపై వెర్రినమ్మకం, – ఒకటేమిటి, సకల వికారవైపరీత్యాలూ తెలిసేవి. స్వాతంత్ర్యోద్యమంలోనే కాదు; సకల అభ్యుదయోద్య మాలలోను పురోగాములుగా ఉన్న తెలుగు వారు ఇంత పతితులయి పోయారా, ఇంతటి దయనీయస్థితికి చేరుకున్నారా; బాగుపడే అవకాశం ఉందా? – అనే ఆవేదనతో నా మనస్సు కుంగిపోయేది.

వాత్స్యాయనాది కామశాస్త్ర గ్రంథాలలోను, ఆయుర్వేదంలోను, హరమేఖలాది ప్రాకృత గ్రంథాలలోను, కామవర్ధకమైన ప్రక్రియలు, అంగవృద్ధికి, దృఢీకరణకు, భావప్రాప్తికి, దీర్ఘశక్తికి ఔషధాలు ఉండడం వాస్తవమే. అవి శాస్త్రీయాలే. కాని, నిష్ణాతులయిన వైద్యుల ద్వారా వాటిని సేవించాలి కాని, ఇలా రెడీమేడ్ మాయమందుల వల్ల ప్రయోజనం శూన్యం. ప్రజలలోని ఈ ప్రవృత్తి, ఉత్సుకత, దొంగ వ్యాపారులు లాభం పొందడానికి తోడ్పడుతాయే గాని ఆరోగ్యకరమయిన ఔషధసేవకు తోడ్పడవు.

ఆ ఉత్తరాలు యథాతథంగా తెలుపలేను గాని, వాటి సారాంశాలు కొన్ని తెలుపుతాను. రాసినవారి మనః ప్రవృత్తి తెలియడానికి!

అయ్యా! మీరు పంపిన రోల్డ్‌గోల్డ్ జలంధర్ గోల్డు నగల బంగీవిప్పి చూచాము. నల్లబడి పోయాయి. ఇంత మోసం ఎక్కడయినా ఉంటుందా? పత్రికలలో మీ ప్రకటనల వాక్యాడంబరం చూచి మోసపోయాము. పోలీసులకు ఫిర్యాదు చేయదలచాము. పచ్చి మోసం!"

"అయ్యా! మీ లండన్‌గోల్డ్ నగలు వట్టి ఇత్తడి రేకులు! ఇంతటిమోసం ఎప్పుడూ ఎరుగము. చింతపండు పులుసు పెట్టి తోమినా అవి మెరిసే దోవ కనిపించలేదు.

"ఆనంద్ స్వామీజీ! నమస్కారాలు. మీరు పంపిన –వశీకరణం తాయెత్తు కట్టుకుని, మీరు సూచనలిచ్చినట్టు నేను ప్రేమించిన ప్రియురాలి కంటబడడానికి కాలేజీలో ఆమె ముందు రెండు మూడు సార్లు అటూ ఇటూ తిరిగాను. రాత్రి నా గదికి ఆమె అన్నలూ, తమ్ముళ్లూ వచ్చి దేహశుద్ధి చేశారు. మీ తాయెత్తు వశం చేయకపోగా దుర్దశకు కారణమయింది. ఇది నా దురదృష్టమా? మీ మోసమా?"

"అయ్యా! మీరు పంపిన పరీక్షా పాస్ తావీజ్ పూజాగృహంలో ఉంచి ధూప దీపనైవేద్యాలు జరిపి కట్టుకున్నాను. పరీక్షకు వెళ్లే ముందు, రెండు నెలల క్రితం. ఈ సారి నేను ఉత్తీర్ణుడు కావడం తప్పదు, మీ తాయెత్తు వల్ల – అని నమ్మాను. కంపార్ట్‌మెంట్ పూర్తిచేసుకున్నా బాగుండేది. అన్ని సబ్జెక్ట్స్‌కూ కట్టాను. అంతా పోయింది. మళ్లీ ఎం.ఎస్.ఎం. రైల్వే ప్రయాణం (మార్చ్ – సెప్టెంబర్ – మార్చ్) తప్పదు. ఎంత దారుణం! నా ఉసురు కొట్టక పోతుందా మీకు!"

"అయ్యా! మీ అదాలత్ విజయ్ తావీజ్ కట్టుకుని ఈసారి ధీమాగా కోర్టుకు వెళ్లాను. లక్షరూపాయలదావా. వకీలుకు ఇదివరకే ఫీజు బాగా ముట్టింది. ఈసారి ముందుకన్నా గట్టిగా బల్లగుద్ది మరీ వాదించాడు. నా దురదృష్టం! దావా గెలవకపోగా ఉభయఖర్చులూ ఎదిరి పక్షానికి చెల్లించాలని కోర్టు తీర్పు. హైకోర్టుకు అప్పీలు చేసే తాహతు లేదు. మీ తావీజ్ ఏమీ పనిచేయలేదు. ఆ డబ్బు ఏ గంగలో పారేసినా పుణ్యం వచ్చేది."

'ఆనంద్ స్వామీజీ! స్తన వృద్ధికి మీరు పంపిన మలాము రొమ్ములకు రాచుకొన్నాను. వారం రోజులు. దద్దుర్లులేచాయి గాని, స్తనాలు పెరగలేదు. గుండ్రంగా అవుతాయని మీరు బొమ్మవేసిన కాయితం పంపారు కాని అలా కాకపోగా దద్దుర్లతో కొనలు పుండు కావడం వల్ల మా ఇంటి వైద్యునికి చూపారు మా తల్లిదండ్రులు సిగ్గు విడిచి. ఇలాంటి మందులలో భల్లాతకం (జీడి) వాడుతారనీ, భల్లాతకాన్ని సరిగ్గా శుద్ధిచేయకపోతే ఇలాటి విపరిణామాలు కలుగుతాయని మా వైద్యుడు అన్నారు. బాగా వాచిపోవడం వల్ల ఆస్పత్రిలో చేరవలసి వచ్చింది. లేడీ డాక్టర్ చీవాట్లుపెట్టి, వంశాన్నిబట్టి, ఆహారాన్ని బట్టి, శరీర తత్వాన్ని బట్టి అంగాల అభివృద్ధి ఉంటుంది. దానికి తప్పుడు దోవలు, షార్ట్‌కట్లు: పనికిరావు – అన్నది. ఆమె సర్టిఫికెట్టు, మా ఇంటి వైద్యుడు ఆర్.ఎం.పి.గనుక అతని సర్టిఫికెట్టు; కలిపి మీ పై మాన నష్టం దావా వేయాలని మా

నాన్నగారు ఆలోచిస్తున్నారు. మా నాన్నగారు లాయరు. లాహోర్‌లో నటరాజన్ అనే అడ్వకేట్ ఉన్నారు. మా నాన్నగారికి మిత్రుడు. మద్రాసు కోర్టులోదావా ఆలస్యమవుతుంది. గనుక, లాహోర్ హైకోర్టులోనే దావా దాఖలు చేయదలచాము."

"ఆర్యా! ఆలస్యంగా భావప్రాప్తికి, అంగవృద్ధికి మీరు పంపిన మందులు వాడాను. సుఖం సంగతి అలా ఉండగా, పుండ్లు పుట్టుకువచ్చాయి. ఇద్దరం సెక్స్ స్పెషలిస్టు వద్దకు, స్కిన్ స్పెషలిస్టు వద్దకు పరుగెత్తాము. పుండు మానడానికి నెల పట్టింది. మీకు కోర్టు ద్వారా పంపే నోటీసు నకలు ముందు హెచ్చరికగా పంపుతున్నాను. ఇలా అరకొర జ్ఞానం మందులతో ప్రజలను చంపకండి."

"అయ్యా! మీరుపంపిన అంగవృద్ధి సాధనాల బంగీ అందింది. మీరు సరిగా ప్యాక్ చేయనందువల్లనో, మరే కారణం వల్లనో ఒకటి రెండు గొట్టాలు విరిగిపోయాయి. ఉన్న వాటిని నెల రోజులు వాడాను. ప్రయోజనం లేకపోగా, రాపిడి వల్ల పుండ్లు ఏర్పడ్డాయి. దానికి ప్రతిక్రియ వెంటనే తెలుపగలరు. ఇక్కడి వైద్యులకు చూపడానికి సిగ్గు పడుతున్నాను."

దీనికంతా కారణమేమిటి? ఆశ ఏదో అనుభవిద్దాం, ఏదో చిటికెలో సాధిద్దాం అనే దురాశ.

ఇవి చాల సభ్యమయిన లేఖలు, బూతులు తిడుతూ వ్రాసినవే చాలా. వీటిని అనువదించి, కొన్ని తీవ్రమయిన వాటి అనువాదాలు స్వయంగా తీసుకొని వెళ్లి ఇచ్చేవాడిని. ఆయన "పోలీసుఅధికారులు వ్రాసినవి, న్యాయవాదులు, పెద్ద ఉద్యోగులు వ్రాసినవి విడిగా పెట్టండి. వారికి మన నగలలో సంవత్సరం పాటు నల్లబడనివి పంపుదాం. సంవత్సరం కంటే ఎక్కువ గ్యారంటీ ఇవ్వడం లేదు. ఆ అమ్మాయి లేఖకి ఇలా జవాబు వ్రాయండి. అమ్మా! ప్యాకింగ్ పొరపాటువల్ల భల్లాతక లేపం మీకు అందింది. అది పుండ్లకు వాడే మందు. మరొకటి పంపిస్తున్నాము. దానిని మీరు గేదె వెన్నతో కలిపి మర్దనా చేయండి. మేము బొమ్మలో చూపినదాని కన్నా గుండ్రంగా టెన్నిస్ బంతుల్లాగా అవుతాయి. ఫలితం వ్రాయండి. లాయర్ బేవకూఫ్ కూతురు. దీనిలో ఒక రహస్యం మీకు చెబుతాను. గేదె వెన్న ఎలాటి మంటల నయినా తగ్గించే మందు. కనుక ఆ పిల్లకు మొదట మంటలు తగ్గుతాయి. అంగాభివృద్ధి తరువాత. గేదె పేడ పూత వల్ల కూడా ఈ పని జరుగుతుంది" అన్నాడు.

నా తటపటాయింపు చూచి ఆయన, "మీ మనస్సులో అన్యాయం అని అనుకుంటున్నారు గదా! న్యాయం ఎక్కడుంది? ఆస్పత్రులలో బోరిక్ పౌడర్‌కు బదులు సున్నం సప్లయి చేస్తారు మందుల కంట్రాక్టర్లు. రోగులు లబోదిబో మంటారు. ఆస్పత్రుల్లోనే ఇలా ఉంటే...." (హైదరాబాదు ఆస్పత్రులలో ఇలాటిది జరిగింది).

నేను మధ్యలోనే "వాళ్లు ఎక్కడయినా సత్యానాశ్ కానివ్వండి. మనం కొంచెం న్యాయంగా ఉండవద్దా?..' అంటుండగా ఆయన అడ్డు తగిలి "రామచంద్రజీ! మన మందులు సగానికి సగం శాస్త్రీయమయినవి. కామశాస్త్ర ప్రకారం పరిశోధన చేసిన వారు సూచించినట్టివి. అన్నీ అందరికీ పడవు. కొందరికే పడతాయి. ఆ శాతం ఎప్పుడూ ఉంటుంది. చింతా మత్‌కీజియే" అంటూ నన్ను ఓదార్చేవాడు.

అంత సమర్థుడు మరొక వ్యాపారం న్యాయంగా చేస్తే బాగుండునే అనిపించేది. తన ఉద్యోగులతో అతని ప్రవర్తన ఆదర్శప్రాయం. కనుకనే అతని వ్యాపారం మూడు పువ్వులూ, ముప్పైకాయలుగా ఉందని అనుకునేవాడిని.

రెండు మూడు నెలలు అక్కడ పనిచేసినట్టు గుర్తు. నా మనస్సు ఒప్పలేదు. నా అంతరంగం మూల్గింది. నీ భాషాజ్ఞానం ఈ కామకళాకథల అనువాదానికేనా? అని అనిపించింది. వదలిపోవడానికి ముందు సూచన అవసరం లేదని మొదటే అన్నాడు. గనుక, జీతం తీసుకున్న నాడే (నెల మొదటి తేదీకే జీతం ఇచ్చేవారు) ఆయనకు వెళ్లిపోతానని చెప్పడానికి వెళ్లాను. ఆయన నన్ను కూర్చోమని గంట సేపు వ్యాపార రహస్యాలు బోధించాడు. "మీరు ఏమి కాదలచుకొన్నారో మొదట నిర్ణయించుకోండి. వ్యాపారం చేయదలిస్తే, స్వాగతం. మీకు మా సంస్థ తలుపులు తెరిచే ఉంటాయి. ఐదేళ్లలో మీరునన్ను మించిపోవచ్చు. హిట్లరు యుద్ధం ప్రారంభించి ముందుకు వస్తున్నాడు గదా! మహా యుద్ధమే, ప్రారంభమయితే మన వ్యాపారం మూడు పూవులూ, మూడు వేల కాయలు" అన్నాడు. నమస్తేతో వీడ్కోలు చెప్పుకున్నాను.

అదృష్టవశాత్తు వెంటనే ఒక నౌకరీ దొరికింది. పురానీ అనార్కలీలో మద్రాసు రాష్ట్రం వారు కొన్ని వందల మంది ఉండేవారు. వారి పిల్లలకోసం ఒక సజ్జనుడు (పేరు కళ్యాణ సుందరం అని గుర్తు) హైస్కూలు పెట్టాడు. దానిలో నన్ను హిందీ ఉపాధ్యాయుడుగా చేరమన్నాడు. చేరాను. నేను ఆ సంవత్సరమే పంజాబ్ విశ్వవిద్యాలయం హిందీ ప్రభాకర్ పరీక్షలో నెగ్గాను గనుక ఆ అర్హత. పిల్లలు, చురకత్తుల వంటివారు. నన్ను ప్రశ్నలతో ఉక్కిరి బిక్కిరి చేసేవారు. నేను ప్రత్యుత్పన్నమతిని కాను.

నిజానికి ఏమతినీ కాను మందమతిని తప్ప – (నా జాతకంలో మందుని ప్రాబల్యం ఎక్కువ) రెండు మూడు నెలల కన్నా ఎక్కువ కాలం ఉండలేకపోయాను. హెడ్ మాస్టర్ "మీ టీచింగ్ బాగుంది. పిల్లలూ ఇష్టపడుతున్నారు. వాళ్ళ ప్రశ్నలకు గాభరా పడరాదు" అన్నారు. అయినా నేను వదలి పెట్టాను. నిజానికి పిల్లలు బాధపడ్డారు. ప్రాధేయపడ్డారు వదలకండి అని. ఉపాధ్యాయ వృత్తికి నేను తగనని ఇప్పటికీ నా నమ్మకం.

**ఆశవై రాక్షసీ పుంసామ్**
**ఆశైవ విషమంజరీ**
**ఆశైవ జీర్ణమందిరా**
**ధిగాశా సర్వదోషభూః**

**(ఆశ అనేది ఒక రాక్షసి, అదొక విషమంజరి – విషపు పూవుల గుత్తి, అదొక పాత మద్యం. వెంటనే మత్తు కలిగిస్తుంది. ఆశ సర్వ దోషాలకూ పుట్టినిల్లు. ఛీ ! ఛీ!)**

# 56

# డా॥ రఘువీర మాట వినక మిలటరీలో చేరిక

**క్వచి ద్భూమౌ శయ్యా క్వచి దపి చ పర్యంక శయనం**
**క్వచి చ్ఛాకాహారీ క్వచిదపి చ శాల్యోదన రుచిః**
**క్వచి త్కంథాధారీ క్వచి దపి చా దివ్యాంబరధరః**
**మనస్వీ కార్యార్థీ న గణయతి దుఃఖం న చ సుఖమ్**

(గొప్ప పనులు సాధించదలచిన మంచి మనస్సు గలవాడు సుఖదుఃఖాలను లెక్కపెట్టడు. కార్యార్థి అయి పరదేశానికి వెళ్లుతాడు. అక్కడ అనుకున్న సౌకర్యాలు ఉంటాయా? ఉండవు. నేలమీద పడుకోవలసి వస్తుంది. కటిక నేలమీదే పడుకుంటాడు. మరొకచోట తినడానికి ఏమీ దొరకవు. కాయలు కూరలు తప్ప. వాటినే సంతోషంతో ఆరగిస్తాడు. మరొక చోట కప్పురభోగి వంటకం లభిస్తుంది. దానిని లొట్టలు వేస్తూ తింటాడు. పని పూర్తికాదు. చాల కాలం ఉండవలసి వస్తుంది. బట్టలు మాసిపోతాయి. ఉతుక్కోవడానికి అవకాశమేది? అవి బొంతల్లాగ తయారవుతాయి. వాటినే కట్టుకుంటాడు. ఒకప్పుడు దివ్యాంబరాలు దొరుకుతాయి. వాటిని మెచ్చుకుంటూ ధరిస్తాడు. ఇలా కార్యసాధకుడు కాల దేశ వర్తమానాలకు అనుగుణంగా ప్రవర్తిస్తూ పనులు సాధిస్తాడు. కష్టమని చేతులు కట్టుకొని కూర్చోడు, సుఖమని పొంగిపోడు

అంటాడు - భర్తృహరి.)

**నే**ను లాహోర్‌లో ఉన్నప్పుడు పెక్కు రంగాలలోని ప్రముఖులతో పరిచయం అయింది. వారిలో ఒకరు డాక్టర్ రఘువీర. ఆయన లాహోర్‌లోని సనాతన ధర్మకళాశాలలో సంస్కృతాచార్యుడని మాత్రమే తెలుసు. కాని ఆయన చాల గొప్పవాడని గ్రహించే వివేకం అప్పటికి నాకు లేదు.

ఒక సాయంకాలం అలా నడుస్తూ ఇక మీద ఏమి పనికి ప్రయత్నించాలా అని ఆలోచిస్తూ లాహోర్ శివారు వరకూ వెళ్లాను. డాక్టర్ రఘువీర కనిపించారు. ఒక గడ్డి బండిపై కూర్చున్నారు. అది గుర్రబ్బండే. నెమ్మదిగా వెడుతోంది. మొదటి చూపులోనే ఆయనకాదేమోనని అనుకొని రెండోసారి పరకాయించి చూచాను. ఆయనే. పచ్చిగడ్డి మోపు మీద భద్రాసనంలో కూర్చున్నారు, ఏదో పుస్తకం చదువుకొంటూ. పరుగుతో దగ్గరికి వెళ్ళి "డాక్టర్ సాబ్! నమస్కార్" అన్నాను. నమస్తే అనేది ఆ రోజులలో ఆర్యసమాజం వారి మర్యాద. సనాతనులది నమస్కార్. ఆయన ఉలిక్కిపడి "ఇత్థే కేథ్థే తుసీ?" (ఇక్కడ ఎక్కడ మీరు?) యూనివర్సిటీ లైబ్రరీకి సెలవా?" అన్నారు.

ఆయన నన్ను మొదట చూచింది నేను పంజాబ్ విశ్వవిద్యాలయం లైబ్రరీలో ప్రాచ్యశాఖలో లిఖిత పుస్తకాల క్యాటలాగరుగా ఉన్నప్పుడు. అది అయిపోయిందని వివరాలు తెలిపాను. అయితే రండి, వారం తర్వాత. నేను ఊళ్లోనే ఉంటాను. మీతో అత్యవసరంగా మాట్లాడాలి" అన్నారు. ఆయన గడ్డి బండి వెళ్లిపోయింది.

డాక్టర్ రఘువీర పూర్వుల నివాసస్థలం పంజాబ్ - ఉత్తరప్రదేశ్ సరిహద్దులలోని జగాధరీ పట్టణం. ఇది రకరకాల పాత్రలకు ప్రసిద్ధి పొందిన వ్యాపార కేంద్రం. రఘువీర వంశంవారు జన్మతో వైశ్యులయినా, అధ్యయనాధ్యాపనాలనే బ్రాహ్మణ వృత్తిలో ఉన్నారు. సనాతన వైష్ణవ మతావలంబులు. తాతగారు సీతారాం మిడిల్ స్కూలు హెడ్మాష్టరు. తండ్రిగారు మున్షీరాం, రావల్పిండిలో ఒక హైస్కూలు హెడ్ మాస్టరుగా ఉండగా రఘువీర 1902లో జన్మించారు. చిన్నతనంలోనే తల్లి మరణించింది.

రఘువీర చాల చురుకైన విద్యార్థి. చిన్నతనంలోనే విద్యార్థి వేతనంతో సంస్కృతం ఎం.ఏ. పరీక్షలో సర్వప్రథములుగా ఉత్తీర్ణులయారు. పిదప ఒక పరిశోధన విద్యార్థిగా లాహోర్‌లోని పంజాబ్ విశ్వవిద్యాలయంలో చేరి డాక్టరేట్ పట్టా పుచ్చుకున్నారు. ఉరుదూ భాషలోనూ ఈయన గొప్ప పండితులు. వారాహగృహ్యా సూత్రంపై పరిశోధన

జరిపి హాలెండులోని యుట్‌రీప్ట్ విశ్వవిద్యాలయం నుంచి డి.లిట్. బిరుదు పొందారు. తర్వాత లాహోర్‌లోని సనాతనధర్మ కాలేజీలో సంస్కృతాచార్యులుగా పనిచేశారు. వేద సంస్కృత పునరుద్ధరణ కోసం "ఇంటర్నేషనల్ అకాడమీ ఆఫ్ ఇండియన్ కల్చర్" అనే సంస్థ స్థాపించి జీవితాంతం సంచాలకులుగా ఉన్నారు. 1946లో సనాతనధర్మ కాలేజీ ఉద్యోగం మానివేసి స్వతంత్రంగా పనిచేయడం ప్రారంభించారు. ఆ సంవత్సరమే నాగపూర్‌లో అమూల్యమైన అపూర్వమైన ప్రాచీన భూర్జపత్ర, తాళపత్ర గ్రంథాలు సేకరించారు. వేద సాహిత్యానికి ఆయన చేసిన సేవ అపారం.

ఆయన మరొక గొప్ప సేవ ప్రపంచ భాషా నిఘంటు నిర్మాణం. భాషాశాస్త్రానికి అదొక గొప్ప మణిదీపం. రాజ్యసభ సభ్యులుగా ఉండి కేంద్ర ప్రభుత్వంతో ఎన్నో మంచి పనులు చేయించారు. భారతీయ జనసంఘ్ అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. ఎన్నికలలో రామ్‌మనోహర్ లోహియా కోసం ప్రచారం చేయడానికి కారులో వెళుతూ 1963 మేనెల 14వ తేదీ ప్రమాదం జరిగి మరణించారు. ప్రపంచమంతా ఆయన మరణానికి దురపిల్లింది.

వారం తర్వాత రఘువీర దర్శనానికి వెళ్లాను. కుశల ప్రశ్నల తర్వాత ఆయన "మీకు దక్షిణ భారత భాషలు చాలా వరకు వచ్చు. సంస్కృతం, హిందీ, సరేసరి". ఇంగ్లీషు వ్యవహార జ్ఞానం చాలు, డిగ్రీ కోసం ప్రయత్నిస్తున్నారని విన్నాను. నేను ప్రపంచ భాషల నిఘంటువు సంకలనం చేయదలచాను. దక్షిణ భారత భాషల విషయంలో మీరు నాకు తోడ్పడండి. నేను మీకు నెలకు ముప్పయి రూపాయలు ఇయ్యగలను. అంతకు మించి నాకు శక్తిలేదు. దానికోసం డబ్బు సేకరిస్తున్నాము. ఉత్తరోత్తరా చూద్దాం" అన్నారు. నేను అనాలోచితంగా 'లాహోర్ యూనివర్సిటీ వారు నాకు క్యాటలాగు చేయడానికి నెలకు యాభయి రూపాయలు ఇచ్చారు. మీరు అదే ఇయ్యండి. మీతో సహకరిస్తాను. నా పనిని ఆవశ్యకతను బట్టి తర్వాత మీరే నిర్ణయించండి' అన్నాను. ఆయన చాలాసేపు ఆలోచించారు. వారం తర్వాత చెబుతానన్నారు. సరేనని సెలవు పుచ్చుకున్నాను.

నా గదికి తిరిగి వస్తూ ఆలోచించాను. నకిలీ బంగారు కంపెనీ వాడిచ్చిన దానిలో సగమా? నిఘంటునిర్మాణం వంటి గొప్ప పనికి యాభయి రూపాయల జీతమూ తక్కువే. మద్రాసులో కేటలాగ్స్ కేటలాగర్‌గా పనిచేసే వారికి వందరూపాయల్లు జీతం. ఇంత దూరంలో ఉన్నాను. యాభయి రూపాయలూ తక్కువే - ఇలా పోయిందే గాని

బుద్ధి; నిఘంటు నిర్మాణం వంటి పనిలో, నలభయ్యేళ్లకి మూడు విదేశీ విశ్వవిద్యాలయాల నుంచి డి.లిట్‌లు పొంది, అప్పటికే వేద సంస్కృత్యుద్ధారకుడుగా విఖ్యాతి పొందిన రఘువీరతో పనిచేయడం ఎంత గొప్ప! రఘువీర ఎంత గొప్పమేధావి! 1928కే మూడు డాక్టరేట్లు 1933 నుంచే ప్రాచ్యపాశ్చాత్య దేశాలు పర్యటించి చైనా, మంగోలియా, మంచూరియా, టిబెట్, జావా, జపాన్ భాషలు నేర్చినవారు; అలాటి వారితో పనిచేస్తే, ముందు ముందు ఎంతటి అభివృద్ధి ఉంటుంది, అంతర్జాతీయ ఖ్యాతి పొందవచ్చు అనే ఆలోచన పారలేదు.

వారం గడిచింది. ఆయనే నన్ను కలుసుకొని ముప్పయి రూపాయల కంటే ఎక్కువ చెల్లించే పరిస్థితిలో లేను, ప్రభుత్వ కళాశాలల్లో ప్రొఫెసర్లకు వేల జీతాలు గాని, ఖాన్గీ కళాశాలల్లో జీతాలు తక్కువ. సేవాదృష్టితో అవి నడుస్తున్నాయి. డి.ఏ.వి. (దయానంద్ ఆంగ్ల వేదిక్) కాలేజీ పంజాబ్ రాష్ట్రంలోని కళాశాలలన్నిటి కన్న గొప్పది గదా! దానిలో ప్రొఫెసర్లకు జీతం ఎంతనుకున్నారు? ఆర్థిక శాస్త్ర నిపుణుడైన ఆచార్య బాలీకి వంద జీతం, చిన్నయిల్లు ఉండడానికి. ఆ కళాశాల ప్రిన్సిపాల్ మొహర్‌చంద్ మహాజన్‌కు వంద జీతం. ఉండడానికి మూడు గదుల ఇల్లు. అదీ ఉద్యోగం, సేవ చేసినంత కాలమే. అలాగే మేము కూడా సేవాభావంతో చేస్తున్నాము. నా జీతం దగ్గర దగ్గర రెండు వందలు, నా ఉత్సాహం కొద్దీ ఈ పని చేస్తున్నాను. నాతో కలిస్తే ఎంతో సంతోషిస్తాను. మనం వేదానికీ, సంస్కృత భాషకూ ఎంతో సేవ చేయవచ్చు. ముప్పయి రూపాయలకు మంచి భోజనం దొరుకుతుంది. గదికి మూడు రూపాయల అద్దె. గది కూడ మీకు విడిగా అవసరంలేదు. నాతో, నా నిఘంటు కార్యాలయంలోనే ఉండండి" అన్నారు.

నేను మూర్ఖుడ్ని. 'తివిరి ఇసుమున తైలంబు దీయవచ్చు' మూర్ఖుడి చిత్తం మార్చలేమని భర్తృహరి ఊరికే అన్నాడా? నేను పెడచెవి పెట్టాను. అటు తర్వాతనూ ఒకటి రెండు సార్లు ఆయన కబురంపారు. నేను వినలేదు. ఆయన కొన్నేళ్లకు - యుద్ధానంతరం అనుకుంటాను - ప్రపంచ భాషానిఘంటువు నమూనా ప్రతిని ప్రచురించారు. నేను మద్రాసు విశ్వవిద్యాలయ గ్రంథాలయంలో చూచాను. తిరగవేశాను. చాల బాధపడ్డాను. ఎంత పొరపాటు చేశానో అర్థమయింది. పశ్చాత్తాపపడ్డాను. గతజల సేతుబంధనం!

ప్రతి వ్యక్తికి అతని యోగ్యతను బట్టి మంచి అవకాశాలు కలుగుతాయి. ఎలాటి యోగ్యతాలేని నా బోటి వారికి అరుదుగా కలుగుతాయి. వాటి బాగోగులను ఆలోచించుకొని, వాటిని వినియోగించుకొని ముందుకు పోవడంలోనే ఉంది విజయం. అలా వినియోగించుకోక, వచ్చిన అవకాశాలను జారవిడుచుకొనే మూర్ఖుడు జీవితమంతా పశ్చాత్తాప పడవలసిందే. ఇలాటి వారిని గురించేనేమో కబీర్‌దాస్ బలే బాగా అన్నాడు.

**జిన ఢూబా తిన పాఇయాఁ**

**గహరే పానీ పైఠ్!**

**మై బరీ ఢూబన డరీ**

**రహీ కినారే బైఠ్!!**

**(ధైర్యంగా గంభీరమైన, లోతైన సముద్రంలో మునిగిన వానికి ముత్యాలూ, పగడాలూ, రత్నాలూ దొరికాయి. నేను వెర్రిదాన్ని (వాడిని). మునగడానికి భయపడ్డాను. గట్టు మీదే కూలబడిపోయాను. (నాకు రత్నాలు ఎలా దొరుకుతాయి?) కబీర్ దీన్ని భగవత్సాక్షాత్కారం విషయంలో అన్నాడనుకోండి. ఎవరు ఘోరమైన తపస్సుతో, నిశ్చలమైన భక్తితో ఆత్మావలోకనం చేస్తారో, వారికి ముక్తి. అది చేయని వాడు సంసారమనే గట్టుమీదే కొట్టుకుంటుంటాడు - అని కబీర్ భావం. దీన్ని సామాన్య లౌకిక విషయాలకూ అన్వయించి కార్యాచరణకు పూనుకోవచ్చు.)**

డాక్టర్ రఘువీర గొప్ప వ్యక్తి. ఆయన మరణంతో దేశం ఎందరినో - ఒక మహావిద్వాంసుడిని, ఒక మహాపరిశోధకుడిని, ఒక మహా వేదోద్ధారకుడిని, ఒక మహా బహుభాషావేత్తను, ఒక మహా సాంస్కృతిక సంధాతను, ఒక మహావీరుడిని - ఇంతెందుకు, ఒక యుగపురుషుణ్ని కోల్పోయింది. రఘువీర ఒక వ్యక్తి, ఏకైక వ్యక్తి కాదు; అనేకానేక విషయాల సమష్టి, అనేకానేక సంస్థల సమాఖ్య. ఆయన అజరామరులు. ఇలాటి వారిని గురించే అన్నారు.

**స జీవతి యశో యస్య**

**కీర్తి ర్యస్య స జీవతి!**

**అయశో కీర్తి సంయుక్తో**

**జీవన్నపి మృతో హి సః!!**

**(యశస్సు కలవాడు జీవించే ఉంటాడు. కీర్తి**

**గలవాడు జీవించే ఉంటాడు. యశస్సు, కీర్తి లేనివాడు బతికి ఉన్నా చచ్చినట్టే (దానాదుల వల్ల కలిగేది కీర్తి, శౌర్యాదుల వల్ల కలిగేది యశస్సు).**

లాహోర్లో మరొక గొప్ప అనుభవం భూకంపం. నేను చిన్ననాడు క్వెట్టా భూకంపం గురించి, తక్కిన భూకంపాలను గురించి చదివాను గాని, స్వయంగా అనుభవించడం లాహోర్‌లో.

నేనొక సెలవు రోజున మంచంమీద కూర్చుని ఏదో చదువు కొంటున్నాను. అపరాహ్ణం రెండు గంటలు. టేబిల్ మీద పక్క పక్కన పెట్టిన చెంబు, గ్లాసు జలతరంగిణిలాగ మోగుతున్నాయి. రెండు సెకండ్లు గడిచాయి. షెల్ఫ్‌లో ఉన్న పుస్తకాలు ఒకదానిపై ఒకటి ఒరిగాయి. వినోదంగా చూస్తున్నాను. నేను కూర్చున్న మంచం కదలినట్లయింది.

ఇంతలో కింద వీధిలో పెద్ద గోల! "ఉతరో, ఉతరో" అని కేకలు. ఎందుకీ కేకలు అనుకుంటూ లేచి పిట్టగోడ వద్దకు నడిచాను. తూలి పడిపోయాను. ఏమిటో అర్థం కాలేదు. కింది నుంచి, జల్దీ, జల్దీ, అని ఇంటి యజమాని కేకలు. ఎందుకు? - అని అడిగాను. "అరే బేవకూఫ్ పండిత్‌జీ, పహలే ఉతరో!" బుద్ధిలేని పండిట్‌జీ, మొదట దిగు. తర్వాత కారణం చెబుతాను - అన్నాడు అతడు.

నేను దిగడానికి మెట్ల వద్దకు వెళ్లబోయాను. తాగినవాడిలాగ తూలిపడిపోయాను. చెంబు, గ్లాసు ఇంకా జలతరంగిణి వాయిస్తూనే ఉన్నాయి. ఇవంతా ఒక్క నిముషంలో జరిగిన సంఘటనలు. జనం విసురుగా మెట్లెక్కి నా వద్దకు వచ్చారు. నన్ను లేపి కూర్చోబెట్టి "అయిపోయింది. ఆగిపోయింది. బతికాం. ఏమీ నష్టం కలుగలేదు" అని అనుకున్నారు. "ఏమండీ! అంతగా అరిచినా వినిపించుకోలేదే?" అన్నాడు ఇంటి యజమాని బషీన్. నాకు ఆశ్చర్యమయింది.

సుప్రసిద్ధ సాహిత్యవేత్త, పరిశోధకుడు దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు 1935లో నాతో అన్నారు. "అయ్యవారా, నీకు సంవత్సరం మోయన ఒకేమారు ఇస్తాను. ఒక ఇల్లు ఇస్తాను. నాతో ఉండు. ఇద్దరం సాహిత్యానికి గొప్ప సేవ చేద్దాం" అని. గన్నవరపు సుబ్బరామయ్యగారి వల్ల ఆయన పరిచయమయ్యారు. నేను "దేశం తిరుగుదామని ఉందండీ. ఐదారేళ్ల తర్వాత చూద్దాం"అన్నాను.

తర్వాత 1948లో నేను ఈ విషయం ఆయనతో ప్రస్తావించాను. "ఇప్పుడేం చేస్తాం? నెల్లూరు జిల్లాలోని మా భూములలో భూమి పగిలి నిలువులోతు కాలువలు ఏర్పడ్డాయి. రైతు ఋణనివారణ చట్టం వల్ల నష్టమయింది. ఇప్పుడు నేను ఏమీ చేయలేను" అన్నారు.

ఇదీ నా భూకంప అనుభవం, నష్టమునూ.

ద్వితీయ ప్రపంచ యుద్ధం 1941 మధ్యకాలం నుంచే ముమ్మరమయింది. హిట్లర్, ముస్సోలినీల మైత్రి వల్ల యూరపులో చాలభాగం వారి వశమయింది. హిట్లర్ మాస్కో వైపు వెడలినాడు, సోవియట్ యూనియన్ యుద్ధంలో చేరింది. సుభాష్‌చంద్రబోస్ ఇండియన్ నేషనల్ ఆర్మీ స్థాపించి జపాన్ సాయంతో బర్మా మీదుగా భారతదేశ ఆక్రమణకు సన్నద్ధమవుతున్నాడు. సోవియట్ యూనియన్ యుద్ధంలో దిగడంతో భారత కమ్యూనిస్టులు – మిత్రుల యుద్ధం. భారత ప్రజలు తోడ్పడాలని కొత్తగా నినదించారు. నా మనస్సు వారిపై మొగ్గి ఉండడం వల్ల మిలటరీలో చేరదామనే భావం కలిగింది. కాని, ఒకవైపు వీడని కాంగ్రెస్ అభిమానం వద్దని ఉద్బోధించింది. నాకు సద్యస్సమస్య నౌకరీ, పని. ఉన్న పుస్తకాలు, వస్తువులూ అనంతపురానికి (అప్పటికి మా నాయనగారు అనంతపురం కమలానగర్‌లో కొత్త ఇల్లు కట్టారు, నా తమ్ముళ్లు, చెల్లెళ్ల కాలేజీ చదువుల కోసం). రైల్వే పార్సెల్‌లో పంపి, మిలిటరీలో చేరాను. నా గది తోడు మిత్రా ఈ హఠాత్పరిణామానికి విస్తుపోయాడు.

మిలిటరీ అక్కౌంట్స్ శాఖ డి.ఏ.సి.ఎం.ఏ. (డిప్యూటీ అసిస్టెంట్ కంట్రోలర్ ఆఫ్ మిలిటరీ అక్కౌంట్స్)లో జమ్మలమడక లక్ష్మీనారాయణగారికి మిలిటరీలో చాలామంది ఉన్నతోద్యోగులు తెలుసు. ఆయన ద్వారా పోయి ఉంటే, కొంత పై ర్యాంకు ఉద్యోగమే దొరికేదేమో! కాని, నేనొక ముద్దకట్టిన అహంకారం, మూర్ఖాగ్రేసరుణ్ని గనుక సరాసరి రిక్రూటింగ్ ఆఫీసుకు వెళ్లాను. నన్ను హవల్దార్ క్లర్క్‌గా చేర్చుకున్నారు. మరుసటి రోజే నన్ను ప్రశిక్షణ (ట్రెయినింగ్) కోసం బెలూచిస్తాన్‌లోని క్వెట్టాకు పంపారు.

క్వెట్టా అనే మాటను నేను చిన్నప్పుడే విన్నాను. నా చిన్నతనంలో క్వెట్టాలో భయంకరమైన భూకంపం సంభవించింది. కొన్నివేలమంది మరణించారు. క్వెట్టా నగరం – బెలూచిస్తాన్ రాష్ట్రం రాజధాని – నేలమట్టమయింది. ఆంధ్రపత్రికలో క్వెట్టా భూకంప బాధితుల సహాయనిధి ప్రకటనలు తరచు చూచేవాడిని. ఆ క్వెట్టాయేనా ఇది అని అనుకున్నాను.

హిమాలయ పశ్చిమోపత్యకాలలో ఉన్న అందమైన పర్వత నగరం క్వెట్టా. ఎండకాలంలో విపరీతమైన ఎండలు, చలికాలంలో అడుగు అడుగున్నర మేర హిమపాతం. హిమం – మంచు అంటే వర్షమే. కిందకి పడేంతలో వాతావరణం వల్ల మంచయి మల్లె రేకులు పడుతున్నట్టు పడుతుంది. పట్టణంలో చలికాలంలో హమాంలు అంతస్తును బట్టి ఉంటాయి. అక్కడ సకల సౌకర్యాలతో తలంట్లు, స్నానాలు, హమాంలు స్నానాగారాలు.

క్వెట్టా అప్పటి బ్రిటిషు ప్రభుత్వానికి భారతదేశం పడమటి సరిహద్దులో పెద్ద సైనిక స్థావరం. పెరేడ్ మైదానంలో పదివేలమంది సైనికులు – పది బెటాలియన్‌లు (పటాలాలు) విన్యాసాలు చేయడానికి, ప్రశిక్షణ పొందడానికి తగినంత ఏర్పాటు ఉంది.

మాకు శిక్షణ ఇచ్చిన సీతారామ్ అనే సైనికాధికారి ఆ పెరేడ్ మైదానం మధ్యన్న ఉన్న కంట్రోల్ టవర్లో కూర్చుని పదివేల మందికి ఆదేశాలిచ్చేవాడు. ఎవరు తప్పటడుగులు వేసినా "ఐ! దూసరే బెటాలియన్ కే తీసరే ప్లాటూన్‌కా బీస్వా జవాన్! కదం ఠీక్ మిలావో – రెండవ బెటాలియన్ మూడవ ప్లాటూన్లోని ఇరవయ్యవ సైనికుడా! అడుగులు సరిగ్గా కలుపు. తప్పటడుగులు వేయకు" అని మైక్‌లో గర్జించేవాడు. అది సహస్రావధానం కాదు; శతసహస్రావధానం. కళ్లు పైకి, కిందికి, అడ్డంగా తిరగాలి. తాపీగా, నిదానంగా పద్యం చెప్పడం వంటిది కాదు. ఒక సైనికుని అడుగు తడబడితే, అంతా పాడవుతుంది. సీతారామ్ వంటి సైన్యప్రశిక్షకుడు మరొకరు లేడనే వారు. ఆయన బ్రహ్మచారి. సైన్యానికి సంబంధించిన ఆటలు, వ్యాయామంతో పాటు యోగాసనాలూ వేసేవాడు. తెల్లవారు జామున నాలుగు గంటలకే లేచి కాలకృత్యాలు తీర్చుకొని యోగాసనాలు, స్నానపూజలు ముగించి ఏడు గంటలకు కంట్రోల్ టవరుకు వచ్చేవాడు. సిపాయి దుస్తులతో కవాతు, తుపాకులు, మెషీన్‌గన్ ప్రయోగించడం నేర్పాడు మాకు. కృతక యుద్ధాలతో యుద్ధానుభవమూ కలిగించాడు.

ఉదయం ఐదుకు సైరన్ కూతతో లేచి కాలకృత్యాలు తీర్చుకొని, ఆరు నుంచి ఏడు వరకు పి.టి. (ఫిజికల్ ట్రెయినింగ్) ముగించి, స్నానం (చేయదలచుకొంటే) చేసి, రెండు పరోఠాలో, బ్రెడ్ – వెన్నో తిని, చాయ్ తాగి, ఎనిమిది కంతా పెరేడ్‌కు తయారయి, రెండు గంటల పెరేడు పిదప, పది నుంచి ఒంటి గంట వరకు భోజనం, చపాతీలు, పప్పు, కూర, వెన్న, పెరుగు, వారం వారం స్వీట్లు – ముగించి, మరీ

రెండు నుంచి ఐదు వరకు ఆఫీసు పని చూచి, చాయ్ కాని, పాలు కాని, తాగి, ఆరున్నర వరకు రకరకాల ఆటలు ఆడి, బారక్స్‌కు వచ్చి, విశ్రాంతి తీసుకొని, ఎనిమిది వరకు భోజనం ముగించి, తొమ్మిది వరకు పాటలతోనో, చదువుతూనో, తులసీదాస్ రామాయణం మొదలయినవి వింటూనో గడిపి, తరవాత లైడౌన్ – పడుకోవాలి. పడుకొనే ముందు పక్కకు దోమ తెరలు కట్టుకోవాలి. ఆఫీసు పనులు లేని వారికి ఖడ్డా (కందకం) తవ్వడం, మూయడం – ఇదీ దినసరి కారక్రమం. వారం వారం రూట్ మార్చ్. మిలిటరీ బాండ్. బాకాల లయకు అడుగులు వేస్తూ, గంటకు అనాయాసంగా పదిమైళ్లు నడిచేవాళ్లు.

అక్కడ సహజంగానే చలి ఎక్కువ గనుక ఉన్ని డ్రాయరు, ఉన్ని పంట్లాం, ఉన్ని బనియన్, భుజాల వరకు ఉండే స్వెట్టర్. దాని పైన ఫుల్ ఓవర్ స్వెట్టర్, రూట్ మార్చ్‌లలో గ్రేట్ కోటు ఉండేవి. మూడు నెలల తర్వాత నన్ను క్వెట్టాకు 80 మైళ్లు వాయువ్యంగా ఉన్న చమాన్ అనే సైన్యం కేంద్రానికి పంపారు. అక్కడ ఒక గూర్ఖా బెటాలియన్‌లో కొంతకాలం పనిచేసిన పిదప, అక్కడి మిలిటరీ ఆస్పత్రిలో మాస్టర్‌గా మార్చారు. చమన్, ఆఫ్ఘనిస్తాన్ – పర్షియా – భారత దేశాల వాయువ్య సరిహద్దులోని చిన్న పట్టణం. పండ్లు – ఎండుపండ్ల ఎగుమతి కేంద్రం. నార్త్ వెస్ట్ రైల్వే చివరి స్టేషన్ (టెర్మినస్). ఊరికీ, మా సైన్య శిబిరానికీ మధ్యన చమన్ రైల్వే స్టేషన్. చివరి స్టేషన్ గనుక రైల్వే లైన్లు ఫర్లాంగు వెడల్పున ఉండేవి. మా శిబిరంలో రెండు వందల పడకల ఆస్పత్రి కూడా ఉండేది గనుక, వెయ్యి – పదిహేను వందల మందికి దినసరి భోజనపదార్థాలు కొలిచి ఇవ్వాలి గనుక పని ఎక్కువగానే జరిగేది. క్వార్టర్ మాస్టర్లు మొత్తం నలుగురం, నా పైన జోషీ అనే పంజాబీ ఉండేవాడు. మన తలకాయ మనకు తెలీకుండానే కత్తిరించి మరొకరికి, వాడిది మనకు తగిలించే నేర్పరి. తాగుబోతు. అందమైన సైనికుల వెంట పడేవాడు. కాని, పనిలో మొనగాడు. ప్రభుత్వం వస్తువులను కండెమ్ చేసి (పనికి రావని ముద్ర వేసి) అమ్మేవాడు. మూడు నాలుగు వేల విలువగల గుడారాలను (టెంట్లను) కండెమ్ చేసి, నాలుగైదు వందలకు అమ్మి తాగేసేవాడు. మంచి ఇంగ్లీషు మాట్లాడేవాడు. వ్రాసేవాడు. బ్రిటిష్ ప్రభుత్వానికి వైయక్తిక విషయాల కన్నా పని ముఖ్యం గనుక బతికిపోయాడు. నేను నా కర్తవ్య నిర్వహణలో కచ్చితంగా ఉండేవాడిని. అన్యాయపు పనులకు సహకరించే వాడిని కాదు. కనుక అతడు నాపై ఒక కన్నువేసి ఉంచాడు. అవసరం వస్తే నొక్కి వేద్దామని. అలాటి అవకాశమూ

సంవత్సరం తర్వాత కలిగింది.

మన సైన్యంలో అప్పటి పదవీవ్యవస్థలో ఇండియన్ కమిషన్, బ్రిటిష్ కమిషన్ అని రెండు అధికార వర్గాలు ఉండేవి. సిపాయీ, లాన్స్ నాయక్, నాయక్, హవల్దార్, హవల్దార్ మేజర్, వారంట్ ఆఫీసర్, జమాదార్, సుబేదార్, సుబేదార్ మేజర్; – ఇదీ ఇండియన్ కమిషన్ కింది నుంచి వరస. సెకెండ్ లెఫ్టినెంట్, లెఫ్టినెంట్, కెప్టెన్, మేజర్, మేజర్ లెఫ్టినెంట్, లెఫ్టినెంట్ కల్నల్, కల్నల్ బ్రిగేడియర్, మేజర్ జనరల్, లెఫ్టినెంట్ జనరల్, జనరల్ – ఇది బ్రిటిష్ వారి వరస. యుద్ధకాలంలో భారతీయులు డాక్టర్లను, ఇంజనీర్లను బ్రిటిష్ కమిషన్‌లో సరాసరి తీసుకొనేవారు. మా యూనిట్ కమాండర్ కలనల్ కామ కాకా. పార్శీవాడు. ఉత్తముడు. అప్పటికి లెఫ్టినెంట్ జనరల్ అయిన భారతీయుడు – కస్టర్జీ అనే పార్శీ ఒక్కడేనని అనేవారు. నేను 'సర్పంబు పడగ నీడన కప్ప వసించిన విధంగా' గడిపేవాడిని.

**పరవివర లద్ధ లక్ఖే**
**చిత్త లే భీసణే జనుల జీహే**
**వంక పరి సక్కిరే**
**గోణ సేవ్వ పిసుణే సుహకత్తో**

**(దుర్మార్గుడు పాము వంటి వాడు. వాడు పక్కన ఉండగా వాడికీ సుఖం ఉండదు, ఇతరులకూ సుఖం ఉండదు. పాము ఇతర జంతువులు చేసిన రంధ్రాలను వెతుక్కుంటూ పోయి దూరుతుంది. దుష్టుడు ఇతరుల రంధ్రాలను ' (లోపాలను) వెదుకుతుంటాడు. దుర్మార్గుడు రకరకాల రంగులు మారుస్తాడు. పాము రకరకాల రంగులది. వాడూ భయంకరుడే, అదీ భయంకరమే. వాడికి రెండు నాలుకలు - మాట మారుస్తాడు. దానికీ రెండు నాలుకలు. ఇద్దరి నడకా వంకరే. ఇలాటి వాళ్ల దగ్గరుంటే సుఖం ఉండేనా?)**

57

# చర్చిల్ సందర్శనం

**అంతస్సారైః అకుటపైః**
**అచ్ఛేద్రై స్సుపరీక్షితైః !**
**మంత్రిభిః ధార్యతే రాజ్యం**
**సుస్తంభైరివ మందిరమ్ !!**

**(చేవగల, వంకరలు లేని, లోపాలు లేని, కఠిన పరీక్షలకు నిలచిన స్తంభాలవంటి మంత్రులు రాజ్యమనే భవనాన్ని మోస్తారు.)**

**చ**మన్‌లో మా బెటాలియన్ కోటకు వెలుపల కొన్ని డేరాలుండేవి. అవి పట కుటీరాలు కావు. పటభవనాలు. ఒక హాలు, పడక గది, చదువుకొనే గది, స్నానాల గది, మరుగు దొడ్డి, కుటుంబంతో ఉండదలచిన వారికి మరొక గది అదనం, స్త్రీలకోసం. నేనూ నా తోటి గుమాస్తా షా మహమ్మద్ అలాటి ఒక పట భవనంలో ఉన్నాము. అతని వాటా, నా వాటా కలిసి ఉండేవి. తల వాకిలి దాటి లోపలికి వచ్చే వరకు.

షా మహమ్మద్ మంచి సూఫీ. మూడు సార్లూ నమాజ్ పఠించేవాడు. "రబ్బా ! రామచంద్రజీ పైకి కాఫిర్‌గా కనిపిస్తాడు. కాని హృదయం మంచిది కనుక ఆస్తికుడే. అతన్నీ రక్షించు" అని ప్రతి ప్రార్థనలోనూ నా విషయంలోనూ సిఫార్సు చేసేవాడు.

షా నవాజ్ సిపాయి. పంజాబీ వాడు. మంచి వాడు. సెలవులకు ఊరికి పోతున్నప్పుడు "బాబూజీ, బైట బిస్కట్ పొట్లం ధర, బ్రెడ్ కేకుల ధర మండిపోతూంది"

అనేవాడు. "నా సీనియర్ కండెం చేసినవి మణుగుల కొద్దీ పడున్నాయి. నిజానికి వాటి గడువు తీరలేదు. తీసుకుపో, కానీ, పట్టుబడితే మాత్రం నీ మీదే తోస్తాను." అనేవాణ్ని, కండెం గుర్తున్న వాటిని మిలిటరీ పోలీసులు పట్టుకోరు. అలాగే ఫ్లానెల్, చొక్కాలు, జర్సీలు, కంబళ్లు కూడా ఇచ్చేవాడిని. ఇలా వందల మంది లాభం పొందారు.

ఫతేసింగ్ అనే రాజ్‌పుత్ ఉండేవాడు. ఇతడు నర్సింగ్ ఆర్డర్లీ. అంటే మేల్ నర్స్, పదిహేనవ ఏటే ఎక్కువ వయస్సు చెప్పుకుని సిపాయిగా చేరాడు. పదిహేనేళ్ల సర్వీసు ఉంది. మిలిటరీ ఆస్పత్రుల అనుభవంతో పెద్ద పెద్ద శస్త్రచికిత్సలనూ డాక్టర్ల పర్యవేక్షణలో చేసేవాడు. కానీ తాగేవాడు బాగా. ఒక పైంట్ విస్కీ సీసాను ఎత్తి తాగి 'మే అ ఖ్యా! నేనంటాను. పరమాత్మ ఉన్నాడు. అని"ఇలా ప్రారంభించి గొప్ప తత్వవేత్తలా మాట్లాడేవాడు. ఐదో క్లాసు చదివిన ఈ పల్లెటూరి రైతుకు ఏమిటీ ఈ దివ్యజ్ఞానం! అని విస్తుపోవడం నా వంతు. నాకు ప్రాణమిత్రుడు. "బాబూజీ! ఇక్‌బార్ అంబ్రత్ చక్ఖో, ఇమ్త ఈహాన్ బేవాస్తే - ఒకసారి అమృతం తాగు పరీక్షకోసం" అని రెండు పెగ్గులు జానీ వాకర్ పట్టించాడు. ఎక్కడో తేలిపోతున్నట్టనిపించింది. "హుణ్‌బస్' ఇక చాలు, అని; మరెప్పుడూ తాగనని వాగ్దానం చేయించాడు. ఇతరులను చెడపడం తప్పనే వాడు.

అతని తమ్ముడు కర్నైయిల్‌సింగ్, ఫతేసింగ్‌ను సగ్గా ప్రా - ఒక తల్లిపిల్లలం అనేవాడు. అన్నయేమో చాచాదాముండా - బాబాయి పిల్లవాడు అనేవాడు. ఈ రహస్యం అర్థమయ్యేది కాదు. ప్రేమచంద్ కథల్లో అన్న మరణిస్తే, ఆస్తులు ముక్కలు కారాదని పెద్దమరదిని పెళ్లాడడం చదివాను. కాని అది కింది కులాల్లోనే. బ్రాహ్మణ, క్షత్రియ, రాజ్‌పుత్‌లలో లేదని విన్నాను. కర్నైయిల్ సింగ్ 20 ఏళ్లవాడు. వాడిని అడగడం కంటే, ఇంటికే వెళ్లి పరిశీలిద్దామనే నిర్ణయించుకొన్నాను.

తేజాసింగ్ శిఖ్ఖు మిత్రుడు, ఒకరోజు విందుకు పిలిచాడు. "రామచందర్‌జీ, మిన్ను పూత్రా జమ్యా - నాకు కుమారుడు పుట్టాడు" అన్నాడు. ఇదేమిటీ సర్దార్జీ? సంవత్సరంన్నర వరకూ నాతోపాటు ఉన్నావే?..' అని నీళ్లు నమిలాను. "మేరా ప్రా హేగా, నా తమ్ముడున్నాడు" అంటూ నాలుగు పెగ్గులు పోసుకున్నాడు. దేవరన్యాయం భారతకాలం నుంచి ఉంది. శిఖ్ఖుల్లోను, ఇతర కులాల్లోను ఇంకా ఉందనడానికి ఇది దృష్టాంతం. ఇలా ప్రాణమిచ్చే వారు ఎందరో?

కరాచీలోని సుప్రసిద్ధ వైద్యుడు డాక్టర్ భట్ కొడుకు, సింధ్ నాయకుడు గిద్వానీ చుట్టం వాద్వానీ హీరా ఉండేవాడు. వీళ్లు నోరు తెరిస్తే బూతులు, అయినా సత్ప్రవర్తన కలవారు.

మిలిటరీ సూత్రాలు విచిత్రంగా ఉండేవి. విధినిషేధాలు - వెంటనే అపవాద సూత్రాలు. "జానా మానాహై అగర్ జానా చాహతే హో పహలే దౌర్‌కామ్ కే బాద్, డాక్టర్ కే పాస్ జావ్" - వ్యభిచారం నిషిద్ధం. వెళ్ళదలచావా, మొదట పని తర్వాత డాక్టర్ దగ్గరికి వెళ్లు. "పీనా మనాహై, అగర్ పిఓగేతో బారక్స్ మే పడే రహో" తాగుడు నిషిద్ధం - తాగదలచావా తాగి బారకాసులలోనే పడి ఉండు - చల్లగాలి తగిలితే మత్తు ఎక్కువవుతుంది.

యుద్ధం తీవ్రమయింది. క్వెట్టా ప్రాంతాన్ని రణరంగంగాప్రకటించాలనే యోచన ఉందని విన్నాము. దాని వల్ల మాకు నెల సెలవు దొరుకుతుంది. తరువాత ఎవరు ఏ లోకంలోనో! అప్పుడు అత్యున్నత బ్రిటిష్ నాయకుడు హఠాత్తుగా తనిఖీకి వస్తున్నాడని సర్వం సిద్ధంగా ఉండాలని మాకు హెచ్చరికలు అందాయి. మేము మా బెల్టులు, బాక్సులు, బూట్లు మెరిసేట్టు రుద్దాము. తుపాకులు పట్టుకుని అప్పుడే శత్రువుపై పోరయ్యేట్టు సిద్ధమయ్యాము. మరుసటి రోజు పెరేడు పెద్ద మైదానంలో జరిగినప్పుడు ఒక మిలిటరీ జీపులో ఉన్నత సైనికాధికారుల మధ్య బ్రిటిష్ ప్రధాని చర్చిల్ ఉన్నారు. పెరేడ్ ఇన్‌స్పెక్షన్‌లో ఐస్ సైట్ అని మా కల్నల్ ఆజ్ఞాపించాడు లౌడ్ స్పీకర్లో. అంతవరకు సర్ విన్‌స్టన్ చర్చిల్ అని తెలీదుగదా! ఆ రెండు క్షణాలలోను ఎక్కడో చూసిన మొహంలాగా ఉందే అనుకుంటుండగా, పత్రికల్లో తరచూ చూసే చర్చిల్ ముఖం. అదిరిపడ్డాను. అందరూ గుసగుసలాడారు. పైకి చెప్పరాదు. చర్చిల్ భారతశత్రువైనా మహావీరుడు, మహారాజనీతి కుశలుడు. యుద్ధానంతరం ఆయన యుద్ధాన్ని గురించి వ్రాసిన సంపుటాలను, శివలెంక శంభుప్రసాద్‌గారు నాతో చదివించారు. చర్చిల్ దర్శనం నేను గొప్పగానే భావించాను.

కాని బ్రిటిష్ ప్రజలు చర్చిల్ కంటే గొప్పవారు. ఎవరిని ఎలా ఉపయోగించుకోవాలో తెలిసినవారు. యుద్ధానంతరం జరిగిన ఎన్నికలలో చర్చిల్‌ను, అతని పార్టీని ఓడగొట్టి లేబర్ పార్టీని ఎన్నుకున్నారు.

నేను నా కర్తవ్యనిర్వహణలో పర్షియా సరిహద్దులోని జాహిదన్‌కు,

దారిలోని సీలాబాద్, శిబి, పట్టణాలకు వెళ్లాను. షీలాబాద్‌కు వెళ్తూ ఒక దుర్ఘటనను కళ్లారా చూసి విలపించాను. మంచు కుండపోతగా కురుస్తూంది. దారి కనిపించడంలేదు. ఒక కొండదారిని ఎడమవైపు ఆనుకొని స్టేషన్ వ్యాగన్‌పోతున్నది. ముందు సైనికులతో పోతున్న మరొక స్టేషన్ వ్యాగన్ మంచు తుపానుకు రెండు అంగుళాలు కుడివైపు ఒరిగింది. తుఫాను గట్టిగా కొట్టింది. ఆ మంచులో ఆ బండి లీనమయిపోయింది. మా ప్లాటూన్ కమాండర్ మా వాగన్ ఆపి దానిలో మోకాళ్లపై కూర్చుని వారి ఆత్మశాంతికి ప్రార్థన చేయండని ఆదేశించాడు. కనుచూపు మేర వరకు ఒకే మంచు. హిమాలయం శీర్షభాగప్రాంతం కదా!

శిబి చక్రవర్తి ఆ ప్రాంతాన్ని పాలించాడని ఐతిహ్యం. అతని పేరు ఆ ఊరిలో మిగిలింది. పర్షియా సరిహద్దులోని అహిదాన్‌లో మన ముఖాలు చూసుకోదగినంత నిగనిగలాడే మేనిచాయ గల ఒంపు ఒడళ్లతో రత్నాలు వెదజల్లినట్లు పారసీకసుందరులు కన్పిస్తారు. కాని దారిద్ర్యం. తగినంత ఆచ్ఛాదన లేక చలికాలంలో గిలగిలలాడేవారు.

సౌందర్యమంటే నాకు గుర్తు వ్పంది. పాత పాటియాలా సంస్థానం దివాన్ రారేవాలా కుమార్తెది లోకోత్తర సౌందర్యం. పేరు ఏదో కౌర్. మరచాను. ఆవిడను రెండు మూడుసార్లు లాహోర్‌లో చూచాను. సభలలో ఆవిడ తన పరివారంతో పాటు వస్తుంటే ఒక కాంతిపుంజం వస్తున్నదనే భ్రమతో సభలోని వారు వెరగుపడి లేచి ఆమె కూర్చునే వరకు నిలుచుండి పోయేవారు. విధి తన దగ్గర ఉన్న లావణ్యాన్నంతా ఒక సుందరి శరీరంలో ఇమిడ్చాడు. కాని పెద్ద ముద్ద మిగిలిపోయింది. దాన్ని రెండుగా చేసి రొమ్ముల స్థానంలో పెట్టాడు, అంటాడొక ప్రాకృత కవి. ఆమె విభ్రాంతికర లావణ్య సౌందర్యాలు చూపరులకు ఆశ్చర్యం కలిగించేవే గాని దుష్టభావన కలిగించేవి కావు. అందుకే కాళిదాసు అన్నాడు. లోకోత్తర రూపం పాపవృత్తికి కాదు అని.

**యదుచ్యతే పార్వతిపాపవృత్తయే**
**స రూప నిత్యవ్యభిచారి తద్వచః!**
**తథాహి, తే రూపం ఉదారదర్శనే**
**తపస్వినామప్యు పదేశతాం గతమ్ !!**

(తపస్సు చేస్తున్న పార్వతిని పరీక్షించడానికి వటువేషంతో వచ్చిన

**పరమేశ్వరుని మాట ఇది. పార్వతీ! ఉత్తమమైన రూపం పాపవృత్తికి కారణం కాదని పెద్దలనే మాట నిక్కం సుమా! మహోన్నత భావాలు కలిగించే నీ రూపం తపస్వులకు కూడ ఒరవడి అయింది.)**

అలాంటిది ఆ రారేవాలా కుమార్తె సౌందర్యం. దీపశిఖ కాదు. కాంతి పుంజం నడయాడినట్టుండేది.

మరొక కవి మిత్రుడు - అఫ్‌తాబ్ మహమ్మద్ మా బెటాలియన్‌కు కొత్తగా వచ్చాడు. జాతీయవాది, సరసుడు, మిలిటరీ జీవితానికి ఇమడలేకపోయేవాడు. కవితలు అల్లేవాడు.

**హాయ్ ! హాయ్ ! మిలిటరీ**
**రామ్ భరోసే తేరీ**
**యే కర్తూత్ నహీఁ హమారే**
**పఢనా, పఢానా పూరీ**
**అఫ్‌తాబ్ సునో బాత్ మేరీ**
**జిందగీ ఖుష్ రహేగీ సారీ.**

**(అయ్యో, అయ్యో, మిలిటరీ, రాముడే నిన్ను కాపాడాలి. ఇది మా పనికాదు. చదవడం, చదివించడం మా పని, అఫ్‌తాబ్ నా మాట విను. జీవితమంతా సుఖంగా గడుస్తుంది.)**

అఫ్‌తాబ్ సంస్కారంగల యు.పి. కుటుంబం వాడు. అతనితో చర్చలు బాగుండేవి.

మా బెటాలియన్‌లో ఇంగ్లీషు లైబ్రరీ ఉండేది. నేను అక్కడ చదివిన తొలి నవల (ఇంటర్, బి.ఏ. ఇంగ్లీషు పాఠ్య పుస్తకాలలో సంగ్రహనవలల కథలు కాక) ఐవన్హో. దానిని పారాయణమే చేశానన్నా తప్పులేదు. తర్వాత ప్రైడ్ అండ్ ప్రిజుడిస్. బోకాషియో బూతు కథలు చాలానే చదివాను. అవి కొన్ని జక్కన విక్రమార్క చరిత్రలోని బూతుకథలను చాలా పోలి ఉన్నాయి. ఆశ్చర్యమే! ఇక్కడివే కర్ణాకర్ణిగా అక్కడికి చేరి ఉంటాయి. క్వెట్టాప్రాంతమూ యుద్ధరంగం కావచ్చునేమో గనక చాల మందిని వార్ ఫర్లో - యుద్ధపు సెలవు నెల రోజులు - ఇంటికి పోయి రమ్మన్నారు. నేను వెళ్లేటప్పుడు నా సహ టభవనవాసి షా మహమ్మద్ నాకు కొన్ని యునానీ మాత్రలిచ్చి

పునర్మిలన్‌లో నాడండి అని సలహా ఇచ్చాడు. అదే సన్మిత్రుని లక్షణం. అడగకే ఉపకరించడం.

నాకు క్వెట్టా, రోహ్రీ, సూరత్, బరోడా, అహమదాబాద్, బొంబాయి, గుంతకల్లు మీదుగా అనంతపురానికి వెళ్లేటప్పుడూ, వచ్చేటప్పుడు పూనా, భూసావల్, భోపాల్, ఢిల్లీ, లాహోర్, క్వెట్టా, చమన్‌లకు రైల్వే వారంటు ఇచ్చారు. కారణమేమిటో? దీని వల్ల నేను పశ్చిమభారత ప్రాంతమంతా చాలవరకు చూచినట్టయింది. గుజరాతీల సభ్యత, ఆదరణ, పసుపు, నెయ్యి నిండుగా ఉండే వారి వంటకాలూ చూచాను. నర్మదా, తపతీ నదుల్లో స్నానం చేశాను.

నేను నాలుగోరోజు అనంతపురం చేరి అందరినీ ఆశ్చర్యంలో ముంచాను. అమ్మకు నాన్నగారికి నమస్కరించాను. నాలుగేళ్ల తర్వాత నేను రెండు మూడు పెద్ద బుట్టలు రకరకాల పళ్లు, మేవాలు (ఎండుపళ్లు) తీసుకువెళ్ళాను. మా అమ్మ వాటిలో కొంత వీధి వారికి పంచింది. నేను మరుసటి దినమే అత్తవారి ఊరికి అత్యవసరమైన దుస్తులతో, పళ్లు, మేవాలతో బయలుదేరాను. మద్రాసు - బొంబాయి మార్గంలో రాయచూర్ తర్వాత వచ్చే యాద్‌గిర్ అనే స్టేషన్‌లో దిగి, తెల్లవారు జాము బస్సులో చేరాలి. అత్తవారి ఊరి పేరు సురవరం.

సురవరం విజయనగరం బహమనీ రాజ్యాల మధ్య ఉన్న బప్పూర్ రాజ్యం. భీమాకృష్ణా నదుల మధ్యన సారవంతమయిన భూమి. తెల్లజొన్నలు, పత్తి ప్రధానమయిన పంటలు. రాజులు వ్యాధులు. మహాపరాక్రమవంతులు. విజయనగర సార్వభౌములకు యుద్ధ సమయాలలో సైనికులను పంపడం ప్రధానమైన ఒప్పందం. వీరు వైష్ణవ మతావలంబులయిన తర్వాత, తమిళ, తెలుగు ప్రాంతాల నుంచి శ్రీవైష్ణవ కుటుంబాలను పిలిపించుకున్నారు. కిరీటం వెంకటాచార్యులుగా ప్రసిద్ధులయిన తిరుమల బుక్కపట్నం వెంకటాచార్యులు మొదలయిన వారు ఈ సంస్థానాశ్రితులు. నా మామగారి పూర్వులు పెరుమాళ్ల సేవ కోసం దక్షిణదేశం నుంచి వచ్చిన వారు కనుక పెరుమాళ్ల అనేది ఇంటి పేరయింది. వాధూలస గోత్రులు. వీరిని కందాడై వారని అంటారు.

సురపురాన్ని జయించడానికి ఔరంగజేబు రెండుసార్లు వచ్చి పరాజయంతో పరుగెత్తి, మూడోసారి కుట్రతో జయించి దేవాలయాలను నేలమట్టం చేసి, వాటిపై మసీదులు కట్టించి రాజ్యాన్ని ధ్వంసం చేశాడు.

నేను తెల్లవారుజామున ఐదు గంటలకు సురపురం చేరాను. తోటి ప్రయాణీకులను అడిగి అత్తవారి ఇంటిదారి పట్టాను. అదృష్టవశాత్తు మా మామగారి జ్ఞాతి రంగాచార్యులనేవారూ ఆ బస్సులోనే దిగారు. కనుక నన్ను అత్తవారి ఇల్లు చేర్చారు. తలుపుతట్టి నా బావగారు, పండితరత్నం గుండాచార్యులు గారిని పిలిచి "అల్లుడు వచ్చాడు, చూడు" అని తమ దారిని పోయారు.

మా బావగారు ఒక హైస్కూలు హెడ్ మాస్టర్. ఆయన ఎం.ఏ. మామగారు నా పెళ్లి తర్వాత పరమపదించారు. నాకా సంగతి తెలియదు. సంస్థానాలలోని ఇళ్ల సంగతి చెప్పక్కర్లేదు గదా! పెద్ద అరుగులు, నడవలు, గదులు, నేను అరుగు మీద చతికిలబడ్డాను. బావగారి తర్వాత నా భార్య అక్కయ్యలు నలుగురు. ఆయన ఏమి విన్నాడో, ఏమో లాంతరుతో పాటు వచ్చి, తలుపు తీసి ఎవరు అంటూ లాంతరు ఎత్తి నన్ను చూచి గాబరాతో లాంతరు పడేసి లోపలికి వెళ్ళి అందరితో తిరిగి వచ్చారు. అత్తగారు అస్వస్థతతో ఉండడంవల్ల రాలేదు. అప్పుడు నా పెద్ద షడ్డకుని కూతురి పెళ్లి, కనుక చుట్టాలు చాలామంది వచ్చారు. వారంతా వచ్చారు. నేనొక ప్రదర్శన వస్తువునయ్యాను. అంతమందిలోను నా కళ్లు నా భార్యను వెదికాయి, కనిపించలేదు. బావగారు (బావమరిదే నా కన్నా ఐదారేళ్లు పెద్దవారు. కన్నడ, సంస్కృత కవి, ఉరుదూ, హిందీ, పారసీ పండితుడూ గనుక బావగారు అంటున్నాను) ఏమీ మాట్లాడరు.

గంటసేపు అరుగుపై కూర్చున్నాను. కొందరు ముత్తయిదువులు నా వద్దకు వచ్చి ఆరతి ఎత్తి, దిష్టి తీసి లోపలికి వెళ్లారు. "బావగారూ దంతధావనాదులు చేయండి!" అని బావగారు నన్ను పెరటిలోని మేడిచెట్టు కింద స్టూలు వేసి, పళ్లపొడి, తాటాకు బద్ద, తువ్వాలూ మరొక ముక్కాలిపీట మీద పెట్టి వెళ్లారు. నేను స్నానం కూడా ముగించి మూడేళ్ల తర్వాత త్రిపుండ్రాలు పెట్టుకొని అనంతర కార్యక్రమమేమిటా అని ఆలోచిస్తూంటే, మా బావగారు వచ్చి "బావగారూ, పెళ్లింటికి ఫలహారానికి వెళ్లుదాం" అన్నారు. నేను బయలుదేరాను వారితోపాటు. ఫలహారం, భోజనం అయ్యాయి. సాయంకాలం కావచ్చింది. నా భార్య రూపు కనపడలేదు. ఈవిడకు ఏమో అయింది. చెప్పడానికి సంకోచిస్తున్నారు. - అనే నిర్ణయానికి వచ్చాను. మా బావగారు నా వద్దకు వచ్చి "బావగారూ, మీరు రెండు వేల మైళ్లనుంచి పళ్లూ, మేవాలు తెచ్చారు. ఊళ్లో వినాయక్, మీనాక్షి, నటించిన; "బ్రహ్మచారి" సినిమా ఆడుతూంది. వినాయక్ బ్రహ్మచారీ

మేవాలు అమ్ముతాడు. చూద్దామా?" అన్నారు. "పక్క ఇల్లు ఖాళీగా ఉంది. మా అక్కయ్యదే. మీరు విశ్రాంతి తీసుకోండి. సాపాటు తర్వాత రెండో ఆటకు వెళ్లుదాం" అన్నారు. నాకు ఒళ్లు మండింది కాని, ఏమి చేయగలను? నాల్గేళ్లుగా ఒక్క ఉత్తరం ముక్కయినా వ్రాయని నీకు అప్పుడు లేని ఆత్రం ఇప్పుడు వచ్చిందా? అంటే ఏం చేయను? కుక్కిన పేనులాగ పడి ఉన్నాను.

నిద్రపట్టింది. రెండు మూడు గంటలు నిద్రపోయి ఉంటాను. బావగారు వచ్చి, "సినామా పొద్దయింది. ఫలహారం చేసి పోదామా?" అన్నారు. నాకు విసుగుపుట్టి, గట్టిగానే చెప్పాను. "సినిమాకు రాను, నన్ను వదలండి" అని. అయితే మీకు పక్కగదిలో మంచం ఏర్పాటు చేస్తాను. విశ్రాంతి తీసుకోండి" అంటూ వెళ్లిపోయారు. మళ్లీ నాకు మగత పట్టింది. గంట దాటినట్టుంది. కళ్లు తెరిచి చూచాను. టేబులు మీద లాంతరు వెలుగుతూంది. గదికి ఒక మూలలో ఒక వనిత ఆకారం గోచరించింది. బక్క చిక్కిన దేహం, రంగు వెలసిన చీర, సంస్కారం లేకుండా ఒంటి జడగా పేనుకుపోయిన కేశపాశం. తలదించుకొని ఆలోచిస్తూంది. నేను నాలుగేళ్ల క్రిందట పెండ్లిలో చూచాను. అదాటుగా చూస్తే గుర్తుపట్టలేను. అక్కడ ఆ పరిస్థితిలో ఆ గదిలో ఉంది గనుక నా భార్యే అయి ఉంటుందనుకున్నాను.

లేచి తలుపులకు గడియ బిగించి, రెండడుగులు ముందుకు వేశాను. శాకుంతలంలోని దుష్యంతుని మాటలు జ్ఞప్తికి వచ్చాయి.

**వసనే పరిధూసరే వసానా**
**నియమ క్షామముఖీ ధృతైక వేణీ,**
**అసి నిష్కరుణస్య శుద్ధ శీలా**
**మమ దీర్ఘం విరహ వ్రతం బిభర్తి.**

**(దుమ్ము కొట్టిన గుడ్డలతో, వ్రతనియమాలతో ఎండిపోయిన ముఖంతో సంస్కారం లేక ఒంటిగా పేనుకుపోయిన కేశపాశంతో ఈ శుద్ధశీల ఎంతమాత్రమూ కరుణ లేని నా వంటి వాని కోసం విరహవ్రతం పట్టింది - అంటాడు దుష్యంతుడు.)**

నేను దగ్గరికి వెళ్లాను, రొమ్ము మీద పైట కన్నీటితో ముద్దయింది. ఏమి చెప్పగలను? ఏమి ఓదార్చగలను? ఇద్దరం అక్కడే కూర్చుండిపోయాం. అవిదిత గత యామా రాత్రి రేవ వ్యరంసీత్-జాములు ఎలా గడిచాయో తెలీకుండా రాత్రే

వెళ్ళిపోయింది. అనే ఉత్తరరామ చరిత్ర శ్లోకం గుర్తుకు వచ్చింది గాని, అది సీతారాముల విషయం, అపచారమని చెంపలు వేసుకొన్నాను. చాలసార్లు తలుపు బాదిన చప్పుడు వినిపించింది. గాని, నన్ను రాత్రి వరకు – పన్నెండు గంటలపాటు భయంకర కుతూహలంలో పెట్టినందుకు ప్రతీకారంగా, తెరవలేదు. ఇద్దరం, పస్తు, జాగారం.

పక్షుల కలకలం, పెళ్లి వారి భూపాలరాగగీతాలు వినిపిస్తున్నాయి. సూర్యుడు మూరెడు పొద్దెక్కినట్టున్నాడు. "అక్కా!" అంటూ తలుపు తట్టిన చప్పుడయింది. "కుసుమ. నా దోస్తురాలు. తలుపు తెరవండి. బాగుండదు" అంటూ నన్ను పురమాయించి తానే తొందరగా లేచి వెళ్లి తలుపు తీసింది నా భార్య. చిరునవ్వే ముఖమయిన కుసుమ "బావనవరే!" అంటూ లోపలికి దొర్లింది; బొద్దుగా ఉండడం వల్ల అలా అనిపించింది.

రెండు రోజులు గడిచాయి. కుసుమను అడిగాను "ఏమిటి? నీ సఖియళు పన్నెండు గంటలు కనిపించకుండా ఏడ్పించిందే? ఎందుకు?" అని. "అదా? అదొందు కథె – అదొక కథ" అంటూ కుసుమ చెప్పింది. నేనిక రాననే ఊరంతా అనుకున్నారట. బైరాగుల్లో కలిశానని కొందరు, యుద్ధంలో చచ్చానని కొందరు ఆడిపోసుకున్నారట. "ఈలాటి మాటలు విని విని పిచ్చెక్కింది నా మిత్రురాలికి. ఇటీవల పెళ్లికి వచ్చిన వారూ సూటిపోట్లు విసిరారు. మీరు వచ్చినట్టు అకస్మాత్తుగా తెలిస్తే సంతోషంతో గుండె పగిలి ఏమవుతుందో ఏమో అని మాస్టరు సాబరు (మా బావగారు) ఈ సంగతి క్రమంగా చెప్పగా ఆమె తేరుకోవడానికి పన్నెండు గంటలు పట్టింది" అన్నది. నాక్రౌర్యం ఎంత తీవ్రమయిందో అప్పటికిగాని నాకు అర్థం కాలేదు.

నేను రెండు రోజులుండి నా భార్యతో పాటు అనంతపురం వెళ్లాను. అక్కడ రెండు రోజులున్నాను. లాహోర్‌లో ఉన్నవ లక్ష్మీనారాయణగారి భార్య గోంగూర తెమ్మన్నారు. మా అమ్మ అనంతపురం మెట్ట గోంగూర బస్తా తెప్పించి, నేతిలో వాడ్చి ఉప్పువేసి ఉంచింది. శ్రీ వైష్ణవులు గోంగూర, ముల్లంగి, మునగ తినరు. లాహోరుకు వెళ్లిన తర్వాతే నాకివి అలవాటయాయి. అప్పుడు ప్రభాకరశాస్త్రిగారు మద్రాసులో రిటైరయి తిరుపతిలో ఉన్నారు. తిరుపతి, బళ్లారి, కమలాపురం ఒక్క రౌండ్ కొట్టి, భార్యతోపాటు బయలుదేరి యాద్‌గిరి స్టేషనులో ఆవిడను దింపాను. మునుపటి ఏర్పాటుప్రకారం ఈ ప్రయాణంలోనూ మా బావగారు వచ్చి ఆవిడను పిలుచుకువెళ్లారు.

రైలు మంత్రాలయం వద్ద తుంగభద్ర వంతెన దాటుతూంది. మా ఆవిడ

నాతో అన్నది. "మీకు ఒక శాపం పెడుతున్నాను" అని. నేను అదిరిపడి "నాకు శాపమా?" అన్నాను. 'ఔను, ఊర్వశి అర్జునునికి పెట్టిన శాపం లాంటిది. ఊర్వశి స్వార్థం నెరవేరక చేసింది. నేను స్వార్థం కోసమయినా మీ శీలం కోసం" అన్నది. "ఏమిటా శాపం?" అనడిగాను. "పరాయి ఆడవారి వద్ద మీకు చలనం ఉండదు" అన్నది. నేను వాత్స్యాయనుడు, కొక్కోకుడు –ధ్వజభంగమని, ధ్వజపతనమని చెప్పిన మాటను ఎంత సులభంగా చెప్పిందీవిడ అనుకుంటూ ఉండగా, యాద్‌గిర్ స్టేషను వచ్చింది. ప్రశ్నించే అవకాశం లేకపోయింది.

నేను మూడోనాడు ఉదయం జలంధర్ చేరాను. మిలిటరీ అకౌంట్స్ ఆఫీసర్ జమ్మలమడక లక్ష్మీనారాయణగారి ఆఫీసుకు వెళ్లి గోంగూర బుట్ట అందజేసి, జలంధర్‌కు ఐదు మైళ్లలోని కర్నైయిల్‌సింగ్ ఊరు పాన్స్‌టా కు కాలి నడకన బయలుదేరాను. నిలువెత్తు ఆవ చేలలో, మొక్కజొన్న చేలలో నడుస్తూ సాయంకాలం నాలుగు గంటలకు పాన్స్‌టా చేరాను. కర్నైయిల్‌సింగ్ ఇంటికోసం అడుగుతుండగా అతడే కనిపించాడు. నేను సెలవుల్లో వస్తానని ఇదివరకే చెప్పాను గనుక, ఎదురు చూస్తున్నానన్నాడు. ఇంటికి పిలుచుకొని పోయి వాళ్ల అమ్మగారిని పరిచయం చేశాడు.

ఆమె పేరు మరచాను. యాభయ్యేయిదేళ్లుంటాయి. అయినా, ఎంత మాత్రం సడలని అంగసౌష్ఠవం. నమస్కారం చేశాను. పంజాబీ తప్ప మరేం రాదు. నేను హిందీ, పంజాబీ కలగలపు భాషలో మాట్లాడాను. ఆవిడ ఎంతో ఆదరంతో "నా కొడుకుల దోస్తువు. నా కొడుకువే. ఏం మిఠాయి కావాలి చెప్పు - పేడా, బర్ఫీ, మలాయి" అంటూ పెద్ద జాబితా చదివింది. నేను "నాకేమీ వద్దు, యవలపిండి, సెనగపిండి కలిపి చేసే రొట్టె, ఆవాకు కూర చాలు" అన్నాను. ఆవిడ "ఎంత వెర్రివాడివి? కోరక కోరక ఏం కోరావయ్యా బ్రాహ్మడా?" అంటూ చప్పట్లు కొడుతూ విరగబడి నవ్వింది. ఆ నవ్వుకు ఇరుగమ్మలు పొరుగమ్మలూ వచ్చారు. వాళ్లూ నవ్వుకున్నారు.

నేను తెలుసుకోదగిన ముఖ్య విషయాన్ని ఎలా ప్రస్తావిద్దామా అని ఆలోచిస్తుండగా, కర్నైయిల్ సింగ్ ఒక పెద్ద మనిషితో వచ్చి, మా పితాజీ అన్నాడు. నేను లేచి వినయంగా నమస్కారం చేశాను. ఆయన కొంతసేపు నాతో మాట్లాడి కుమారునితో పాటు వెళ్లిపోయాడు.

నేను ఆమె వైపు తిరిగి చూచాను. ఒకే ఏడుపు! "ఏమిటి మాతాజీ?

ఏడుపెందుకు. మేము ముగ్గురం ఉన్నాం గదా?" అన్నాను. ఆమె కన్నీళ్ళు తుడుచుకొని నా తలమీద కుడిచేయి పెట్టి "జీతే రహో పుత్రా!" అని హిందీ పంజాబీలు కలిపి ఆశీర్వదించి, "నా దుఃఖం నీ దగ్గర కాక మరెవరి దగ్గర చెప్పుకోను! ఇప్పుడు వచ్చాడే అతడు నా పెద్దమరిది. పెద్ద జమీందారీ. ఆస్తి పాడయిపోతుందని మా కులపెద్దలు చెబితే విని ఫతేసింగ్ తండ్రిపోయిన తర్వాత ఇతన్ని చేసుకొన్నాను. ఫతేసింగ్ కోప్పడి ఫౌజ్‌లో చేరాడు. పదిహేనేళ్లుగా ఒక్క ఉత్తరం లేదు. ఈ చిన్న కుమారుని వల్ల, నీ వల్ల అతని యోగక్షేమాలు తెలిశాయి" అంటూ ఫతేసింగ్ మంచితనం, బుద్ధిమంతునితనం గంటసేపు తెలిపింది. నా సందేహం తీరింది. అలాటి వివాహాన్ని ఏదో అంటారు. ఆ పదం మరిచాను.

రెండు రోజులుండి లాహోర్‌కు బయలుదేరాను. మాతృవాత్సల్యం, మిత్రప్రేమ లాహోర్ వరకు పారాయంటే అతిశయోక్తి లేదు.

లాహోర్‌లో మా బెటాలియన్ వాళ్ళు చాలామంది కలిశారు. మేమెక్కిన బోగీలో క్వెట్టాలో పనిచేసే రైల్వే అధికారి ఒకరు ఎక్కారు. ఆయన పేరు రామేశ్వర దయాళ్ గౌడ్. భార్య శాంత. మధ్య వయస్కురాలు. ఇద్దరు పిల్లలు. ఓంవతీ, రాజో. లాహోర్‌లో సాయంకాలం బయలుదేరే బండి మరుసటి దినం మూడు గంటలకు గాని క్వెట్టా చేరదు. ఆ పిల్లలు నన్ను చూస్తూ నవ్వడం. నాలుగు గంటల తర్వాత వచ్చే బహవల్‌పూర్ అనే నవాబు సంస్థానం రాజధాని వరకు ఓర్చుకున్నాను. తల్లిదండ్రులు వారిస్తూనే ఉన్నారు. చివరకు అడిగాను "గౌడ్‌సాబ్! ఎందుకు ఆ నవ్వులు?" అని, అతడూ - ఆమె కొంచెం గాభరాపడి "ఏం లేదు. మీ కాళ్ల పారాణి బూట్లలోపలి నుంచి కనిపిస్తూంది. మీ మద్రాసీ జరీ పంచెల లాంటివి ఇక్కడ ఆడవాళ్లు కడతారు. పిల్లలు, అపార్థం చేసుకోకండి" అని ప్రాధేయపడ్డారు.

నేను "హోష్! ఇంతేనా?" అంటూ నా కిట్‌లో నుంచి రెండు జరీ ఉత్తరీయాలు తీసి ఆ పిల్లలకు అందించి "మున్నియో! చున్నీ (ఓణీ) లాగ వేసుకోండి" అన్నాను. వాళ్లు సంకోచపడినా నేను బలవంతం చేశాను. వాళ్లు నా సంగతులు కనుక్కున్నారు. నేను వారికి జిగిరీ దోస్త్ అయ్యాను. క్వెట్టాలో వారం వారం వాళ్లింటికి వెళ్లి వేడినీళ్లు స్నానం చేసి, భోజనం చేసి, సినిమాకు వెళ్లేవాడిని. శాంత మంచి ఇల్లాలు. సోణియా! సోణియా! అని పిలిచేది. నిజానికి నన్ను కాలియా అని పిలవాలి.

నేను కొన్నేళ్ల తర్వాత మా ఆవిడను అడిగాను "నీ శావం ఉపసంహరించుకోవా? ఒక గొప్ప రచయిత్రి పీక్కుతింటూంది నన్ను. నేను శాపగ్రస్తుడిని అని అన్నాను. నీ వొక వెర్రి మొగం! నీ పెళ్లామొక వెర్రి మొగం! అని నా మూతి పొడిచింది" అన్నాను. మా ఆవిడ "మీ పుస్తకాల అట్టలు పీక్కుతినమనండి. మీ వ్యాసాలు చుట్ట చుట్టి మింగమనండి, దాని తలకాయ!" అంటూ కొంతసేపు ఆగి, "పక్కన ఏదైనా నది ఉందా?" అని అడిగింది. "ఎందుకు?" అన్నాను. "అంతగా తాపం ఎక్కువయితే దాన్లో దూకడానికి!" అన్నది.

నేనొకమారు ఆ శాపాన్ని పరీక్షిద్దామనుకున్నాను. కాని దానిలో ఒక చిక్కు కనిపించింది. నేను ఆ పరీక్షలో విఫలుణ్నయ్యాననుకోండి. అక్కడా అవమానం. యథాస్థితి చాలు - అని ఊరుకుండిపోయాను. శాపం త్రిప్పే శక్తి తనకు లేదంటూ మా ఆవిడ చూసిన చూపు భామినీ విలాసంలోని ఒక శ్లోకాన్ని గుర్తుకు తెచ్చింది.

**తదవధి కుశలీ పురాణ శాస్త్ర**
**స్మృతి శత చారు విచారజో వివేకః !**
**యదవధి న పదం దధాతి చిత్తే**
**హరిణ కిశోర దృశోః దృశో ర్విలాసః !!**

**(హరిణనేత్ర దృగ్విలాసం మగవాని మనసును తాకనంతవరకే అతని శాస్త్ర పురాణ స్మృత్యాది విచారజనిత వివేకం క్షేమంగా ఉంటుంది. లేడికంటిదాని చూపు పడగానే సకల శాస్త్రజ్ఞానమూ మటుమాయమైపోతుంది!)**

# 58

# కోర్ట్ మార్షల్

**వనే రణే శత్రు జలాగ్ని మధ్యే**
**మహార్ణవే పర్వత మస్తకే వా!**
**సుప్తం ప్రమత్తం విషయం స్థితం వా!**
**రక్షంతి పుణ్యాని పురా కృతాని !**

**(అరణ్యంలోను, యుద్ధంలోను, శత్రువుల నడుమ, నీటిలోను, నిప్పులోను పడినపుడు; సముద్రంలోగాని కొండకొనమీద గాని ఉన్నప్పుడు, నిద్ర పోతున్నప్పుడు, స్పృహలో లేనప్పుడు, భయంకర పరిస్థితులలోను మానవులను పూర్వపుణ్యాలు కాపాడుతాయి.)**

**అ**చ్చర్‌సింగ్ రవాణా పరిశ్రమలో నిపుణుడయిన శిక్కు సజ్జనుడు. చమన్‌లో కాపురం. భార్య, ఇద్దరుకకుమార్తెలు, అచ్చర్‌సింగ్ వయస్సు దాదాపు యాభయి సంవత్సరాలు. మమ్ముల్ను అప్పుడప్పుడు ఇంటికి పిలిచి, చాయ్, ఫలహారాలు ఇచ్చేవాడు. మేము వారానికి ఒకటి రెండు సార్లు సాయంకాలాల్లో ఆయన ఇంట్లో గడిపేవాళ్ళం. అతని కూతుళ్ళు చదువుకొన్న వాళ్లు, మా సంభాషణలో గొంతు కలిపేవారు.

అచ్చర్‌సింగ్ గతమెంతో గొప్పది. అతడు క్వెట్టా నుంచి కాంధార్‌కు (అఫ్ఘనిస్తాన్) బస్సులు, లారీలు నడిపి లక్షలు గడించాడు. వైభవంగా పెట్టుపోతలతో గడిపాడు. ఒకసారి దురాశ కలిగింది. ఏకంగా ఇరవై ముప్పైలారీలు అదనంగా తెప్పించదలచాడు. లండన్ నుంచి అవి రావాలి. అవి గడువుకు చేరలేదు. ఇక్కడ పోటీ పెరిగింది. చమన్‌లో ఒక చిన్న ఇల్లు మిగిలింది. దివాలా తీశాడు. కుప్పగా కూలిపోయాడు. మా బెటాలియన్ కమాండెంట్‌కూ మిత్రుడు. 'నేను సానుభూతి

చూపడం వల్ల నాకు ఎక్కువ ఆప్తుడయ్యాడు. ఒంటిగానూ అతని ఇంటికి వెళ్లేవాడిని.

ఒకమారు నేను డ్యూటీలో ఉన్నప్పుడు దీనంగా ముఖం వేలవేసుకొని నా వద్దకు వచ్చాడు. "సర్దార్ జీ! కీ గల్?" (ఏమిటి సంగతి?) అని అడిగాను. "మూడు రోజులుగా అందరూ ఏకభుక్తం. ఈ రోజు అదీ లేదు" అన్నాడు. ఏదో కొంత దబ్బిచ్చి పంపుతున్నాను. చప్పున జ్ఞప్తికి వచ్చింది ఒక సంగతి.

"క్వెట్టా నుంచి పదిమంది ఉన్న ఒక చిన్న యూనిట్ (దళం) మా బెటాలియన్‌కు వచ్చింది ఏదో ట్రెయినింగ్ కోసం. మా బెటాలియన్ కోటకువెలుపల మా గుడారం వరుసలోని మూడు గుడారాలలో వాళ్లున్నారు. వారికి రేషన్ మా నుంచే ఇస్తున్నాము. వారు ఇవాళ వెళ్లిపోతున్నారు. వారివద్ద వంద పౌనుల గోధుమ పిండి బస్తా (ఆటా బోరీ) పడి ఉంది. దానిని నియమం ప్రకారం బెటాలియన్ ఖాతాకు చేర్చాలి. ఆ యూనిట్ కమాండర్ నాతో బాబూజీ వంద పౌండ్లే కదా! ఖాతాకు జమచేయడం ఎందుకు? వాడేసుకోండి - అని నన్ను పరీక్షించడం కోసం అన్నాడు. నేను ప్రలోభపడతాననుకోండి. మా కమాండెంట్‌కు చెబుతాడు, ప్రభుత్వ ద్రోహులు మీ బెటాలియన్‌లో ఉన్నారని. నేను చాల హెచ్చరికతో నా కెందుకండీ ఆ ఆటా? నేనేం చేసుకోను? బెటాలియన్ ఖాతాకే చేరుస్తాను, అని అన్నాను. అతడొక నవ్వు నవ్వాడు, సాభిప్రాయంగా. ఆ గుడారంలో ఆ ఆటా బస్తా పడి ఉంది. "మీరు తీసుకొని పోగలిగితే తీసుకుపోండి. మీకు రెండు మూడు వారాల పాటు వస్తుంది" అన్నాను. ఆ గుడారానికీ, చమన్ ఊరికీ మధ్య చమన్ రైల్వే స్టేషను, రైల్వేలైనూ తప్ప మరేమీ లేవు. ఈ సంగతి నేను అతనికి ఉదయం చెప్పాను. అతనూ వెళ్లిపోయాడు, అంగీకారం తెలుపుతూ. తర్వాత నా పనిలో మునిగిపోయి ఆ సంగతే మరచిపోయాను. మరుసటి ఉదయం కాలకృత్యాలు ముగించుకొని ఎనిమిది గంటలకల్లా డ్యూటీకి వచ్చాను. కార్యాలయం తలుపు తెరిచి నా సీటు దగ్గరికి వెళ్లి, ఇంకా ఆర్డర్లీ రాలేదేమిటి? నేను తలుపు తెరిచే వేళకు వెలుపల సెల్యూట్ కొట్టి నిలబడాలి కదా - అని అనుకుంటూ ఒక క్షణం నిలుచున్నాను.

ఇంతలో సిపాయి, నా హిత చింతకుడు షా నవాజ్ తొందర తొందరగా వచ్చి చేతిలోని తుడుపు గుడ్డతో టేబిల్ తుడుస్తున్నట్టు నటిస్తూ "బాబూజీ! సత్యానాశ్ హోగయా. భగవాన్ కో యాద్ కరో!" అంటూ గొణుగుతుండగా నలుగురు మిలిటరీ

పోలీసులు వచ్చి నాకు రెండు పక్కల నిలబడి, "యూ ఆర్ అండర్ అరెస్ట్" అంటూ నా చేతులు గట్టిగా పట్టుకున్నారు. ఎందుకు? – అని ప్రశ్నించే సమస్యే లేదు. వాళ్లేమీ మాట్లాడరు. వాళ్ల పని అరెస్టు చేసి పై అధికారుల ఎదుట నిలబెట్టడం. కనుక నేను అడగనూ లేదు. వారు నోరు విప్పనూ లేదు.

నాకు ఏమీ తోచలేదు. నేను ఏ తప్పయినా చేసినట్టు గుర్తు లేదు. అరెస్టు చేయదగినంత నేరం ఏమిటో అర్థమే కాలేదు. నన్ను నడిపించుకొని వంద అడుగులలో ఉన్న కల్నల్ కామకాక ఆఫీసుకు మా కమాండెంట్ ఆఫీసర్ ఆఫీసుకు – వెళ్లుతున్నారు. ఆఫీసు నడవలో చూచాను. దాదాపు రెండు మూడు వందల మంది నిలబడి ఉన్నారు. వారి కళ్లలో, చేతలలో ఉత్కంఠ కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నది. నా సీనియర్ జోషీ అయితే, చేతిలో పెద్ద ఫైలు పట్టుకుని అటూ ఇటూ తెగ తిరుగుతున్నాడు. నిలుచున్న వారికి ఏదో సలహాలిస్తున్నాడు. వారు శ్రద్ధగా వింటున్నారు. ఒకటి రెండు చాల పరిచితమయిన ముఖాలే. అయినా జోషి నాపై ఏదో నేరం ఆరోపించాడని తోచలేదు.

పక్కన ఉన్న పోలీసు నన్ను ఆఫీసులో నా పట భవన సహవాసి షా మహమ్మద్ బల్లముందు నిలబెట్టారు. అతడు తలవంచుకొని ఏదో వ్రాస్తున్నాడు. ఒక్కమారు తల యెత్తాడు. కన్నీళ్లు కురుస్తున్నాయి. ఎందుకని ప్రశ్నంచబోయాను. పక్కన ఉన్న పోలీసులు ఖామోష్ అన్నారు ఏకగ్రీవంగా. నేను ఊరకుండిపోయాను. జోషీ నా దగ్గరికి వచ్చి, నన్ను ఒక పొగరు చూపుతో చూచి, షా మహమ్మద్‌తో మాట్లాడి పోయాడు. అతడు అయిపోవచ్చింది – అని గొణిగాడు. మాట పెగలడం లేదు. ఎందుకంత దుఃఖమో అర్థం కాలేదు. ఉదయం అతను కొంచెం ముందుగా బయలుదేరాడు గుడారం నుంచి, ఇంతగా కన్నీళ్లు కురిపిస్తున్నవాడు సంగతేమిటో రాత్రన్నా చెప్పవచ్చు గదా! ఎంతటి కష్టమో పాపం – అని అనుకున్నానే గాని మరేమీ తోచలేదు.

షా మహమ్మద్ వ్రాత పని పూర్తయింది. జోషీ వచ్చి ఆ కాగితాలు పుచ్చుకున్నాడు. మా కల్నల్ అసిస్టెంట్ దగ్గరకు వెళ్లి ఏదో మాట్లాడాడు. అతడు లోపలికి వెళ్లి కల్నల్‌తో మాట్లాడి వచ్చాడు. ఐదు నిమిషాలు తర్వాత లోపలికి పిలుచుకు వెళ్లండి – అని జోషీకి చెప్పాడు నా మిత్రుడు షా మహమ్మద్. నేను చూస్తుండగా అలసిన

చేతులను సవరించుకోవడానికా అన్నట్టు పైకి ఎత్తి నీళ్లతో నిండిన కనుగుడ్లతో పైకి చూస్తూ క్షణం ఆగి చేతులు కిందికి దించుకున్నాడు. ఇంతయినా, ఇదీ నా సంగతి అని గాని అతడు నా కోసం దుఃఖిస్తున్నాడని గాని నాకు తోచలేదు. అతని సైగలు నాకు అర్థం కాలేదు.

ఐదు నిమిషాలు గడిచింది. కల్నల్ గది తలుపులు తెరుచుకున్నాయి. మిలిటరీ పోలీసులలో ఒకడు అటెన్షన్ అని గర్జించాడు. షా మహమ్మద్ కన్నీటి కథను గురించి ఆలోచిస్తున్న నేను ఉలికిపడి అటెన్షన్‌లో నిలబడ్డాను. మార్చ్ అనగానే కల్నల్ గదివైపు నడిచాను. గదిలో ప్రవేశించిన తర్వాత హాల్ట్! అనే ఆజ్ఞ వినిపించి ఆగాను. మిలిటరీ పోలీసులు వెనక్కు తప్పుకున్నారు.

కల్నల్ గదిలోప్రవేశించే అవసరం నా బోటి హవాల్‌దార్‌కు ఏముంటుంది గనుక? ఎప్పుడూ చూడలేదు. విశాలంగా ఉంది. మధ్యన కల్నల్‌కోసం కాక, మరి ముగ్గురి కోసం వేసిన కుర్చీలలో కొత్తవారు, ఎవరో ఆఫీసర్లు కూర్చున్నారు. కల్నల్ తన దినసరి ఆసనం నుంచి లేచి వచ్చి ఖాళీగా ఉన్న కుర్చీలో కూర్చున్నారు. అందరి ముఖాలు గంభీరంగా ఉన్నాయి. జోషీ వచ్చి పెద్ద ఫైలొకటి కూర్చున్న వారి మధ్యన ఉన్న బల్లమీద పెట్టి, అటెన్షన్‌లో సెల్యూట్ చేసి "కేసుకు సంబంధించిన వాళ్లంతా సిద్ధంగా ఉన్నారు. తమరు ఎప్పుడు రమ్మంటే అప్పుడు వస్తారు." అని వినయం ఉట్టిపడేట్టు చెప్పి, కల్నల్ తల పంకించడం చూచి, ఎబౌట్ టర్న్ చేసి వెళ్లిపోయాడు.

కల్నల్ ఫైలు విప్పి కొన్ని కాయితాలు పట్టుకొని, లేచి నా దగ్గరికి వచ్చి, "హవాల్‌దార్ రామచంద్ర! వాట్ డు యు సే ఫర్ దిస్?" అని గర్జించారు. సంవత్సరంన్నరగా చూస్తున్న కల్నల్, మా సంగతి ఈ దక్కనీ బ్రాహ్మణ కుర్రాడికి ఏం తెలుసు అని మాంసం కంట్రాక్టరుతో పరాచకం ఆడే కల్నల్, అప్పుడప్పుడు పిడుగుపాటుగా స్టోరులో ప్రవేశించి, సరుకులు తూపించి, నా లెక్కలతో సరిపోల్చి, 'కీపిట్ అప్' అని ఉత్సాహవచనాలు పలికే కల్నల్, సాయంకాలాలలో ఆటల వేళలో బ్యాట్ చేతపట్టుకొని మాతో ఒక పట్టు పట్టే కల్నల్, అంతటి సరళహృదయుడు, ఆఫీసరు క్లబ్బు ఉన్నా, అందరికీ ఉత్సాహం కలిగించడానికి డ్యూటీ వేళల తర్వాత ఎంతో కలివిడిగా ఉండే కల్నల్ హఠాత్తుగా గర్జించే వేళకు ఒళ్లు జలదరించింది. సంగతేమిటో తెలీదు. దేన్ని గురించి ప్రశ్న? ఏమి చెప్పను? ఈ ఆలోచనలతో నోరు విప్పి ఏదో అనబోయాను.

కల్నల్ మహోగ్రుడయి, షటప్ అంటూ గది తలుపును విసురుగా మూశారు. అది పెద్దమోతతో పడింది. కల్నల్ గొంతు తగ్గించి "ఇప్పుడు చెప్పు. ఏమిటిదంతా? నీవు దక్షిణాది బ్రాహ్మణ బాలుడివి; బాగా పనిచేస్తున్నావనీ, మంచివాడివనీ అనుకున్నాను. ఏమిటి ఇదంతా?" అంటూ చేతిలోని కాగితాల గుత్తిని గాలిలో రెపరెపలాడించారు. నాకు ఏమీ తోచలేదు. సంగతి తెలిస్తే గదా సమాధానం చెప్పడానికి? నా సహజధోరణిలో విషయమేమిటో సెలవీయండి అని అనబోయాను. ఆయన అడ్డు తగిలి కాగితాల గుత్తి నా ఎదుట పెట్టి అన్నారు.

"దీనిలోని నేరాలకు నీకు ఇరవై సంవత్సరాల శిక్ష. మాబ్‌జెయిలులో, నీవు విడుదల అయ్యే నాటికి నీ ఒంట్లో తోలు మాత్రం మిగులుతుంది. ప్రభుత్వ వస్తువుల అపహరణం, ప్రభుత్వ వస్తువులను అన్యాయంగా అమ్మడం, నిరంకుశంగా ఇతరులకు స్వార్థదృష్టితో ఇచ్చుకోవడం, అనధికారికంగా అనుభవించడం, మిగిలిన వస్తువులను ప్రభుత్వం ఖాతాకు చేర్చకపోగా, దాచి పెట్టి అమ్మజూపడం, గట్టిగా సవ్యంగా ఉన్న వస్తువులను కండెమ్ ముద్రవేసి ప్రభుత్వాన్ని మోసగించడం, ఆహార పదార్థాలను అర్హులయిన వారికి ఇయ్యకుండా, అనర్హులకు పంచి పెట్టి, వాని నుంచి లాభాలు పొందడం... ఇంతేనేమిటి? ఇలా యాభై నేరాలు. జీవితంలో నీవు మిలిటరీ జెయిళ్ల నుంచి వెలుపలికి రాలేవు. ఇప్పుడు చెప్పు. ఏమిటిదంతా? నీవు దుర్మార్గుడనడానికి రెండు వందలమంది సాక్షులు. ఈ జాబితా చూడు" అంటూ ఆ జాబితాను నా కళ్ల ఎదుట పెట్టారు కల్నల్.

నేనొక మూర్ఖాగ్రేసర చక్రవర్తిని. అంతయినా నా తప్పేమిటో తోచలేదు. అందుకే నన్నమాట జోషీ సంబరం! అందుకేనేమో షా మహమ్మద్ కన్నీళ్లు! రెండు వందల మంది ప్రతికూల సాక్షులా? ఇదంతా జోషీ కుట్ర. నిజమే అని ఆలోచన సాగింది గాని, దీనికంతా మూలమేమిటో తెలియలేదు. కల్నల్ మరొకసారి ఏకపాత్రాభినయం చేశారు. తక్కిన ముగ్గురూ బెల్లం కొట్టిన రాళ్లలాగ కుర్చీలకు అతుక్కుపోయారే గాని, నోరు విప్పలేదు.

ఈ నాటకంలో నేను యథాలాపంగా గదిని కలయజూచాను. ఒకచోట ఎగ్జిబిట్స్ అనే వ్రాత కాగితం గ్రుచ్చిన బల్లమీద ఒక నూరు పౌనుల ఆటా సంచి కనిపించింది. అప్పుడు మెరుపులాగ మెరిసింది, నా మనసులో అచ్ఛర్‌సింగ్ సంగతి.

పాపం! ఆ అమాయకుడు ఆటా సంచితో పట్టుబడ్డాడేమో! అతన్ని పోలీసులుగాని, మిలిటరీ పోలీసులుగాని, ఏమి చేశారో? శారీరకమయిన బాధకు ఎలా తట్టుకున్నాడో? – అని పరిపరి విధాల ఆలోచన తీగలు సాగింది. గాని, దానిలో నా తప్పేమిటో అప్పటికీ అర్థం కాలేదు.

కల్నల్ అరగంట సేపు మాట్లాడి అలసిపోయారు. “ఇప్పటికయినా నోరు తెరు. నిజం చెప్పు” అంటూ మరొకమారు గర్జించారు. నాకు ఆటో బోరీ దర్శనంతో నా వరకు జరిగిన విషయాలు స్పష్టమయ్యాయి గదా! దాచవలసినవి ఏమున్నాయి గనుక? సవినయంగా మనవి చేశాను. అచ్ఛర్‌సింగ్ అని ప్రారంభించబోయాను. స్థాణువులుగా ఉన్న ముగ్గురు ఉలిక్కిపడ్డారు. చెవులు రిక్కించుకొని విన్నారు.

“అచ్ఛర్‌సింగ్ నిన్న నా దగ్గరికి వచ్చారు. ఆయన మీకూ మిత్రుడే. మూడు నాళ్లు ఒక్క పొద్దనీ, నేడు అదీ లేదనీ, సాహాయ్యం చేయమనీ కోరారు. నేను ఏదో కొంత రెండు పూటలు గడిచేంత డబ్బిచ్చి, బెటాలియన్ కోట వెలుపల క్వెట్టా నుంచి డ్రాఫ్టయి వెళ్లిపోయిన వారు విడిచిపెట్టిన వంద పౌనుల గోధుమ పిండి బస్తా ఉంది, తీసుకొని పోగలిగితే తీసుకుపొమ్మన్నాను. తర్వాత ఏం జరిగిందో నాకు తెలియదు.” అన్నాను.

కల్నల్ కూర్చున్న వారివైపు తిరిగి, ఘోరమయిన నేరం – అంటూ నా వైపు తిరిగి “నీకు ప్రభుత్వం సొమ్మును ప్రభుత్వం ఖాతాకు జమ చేయకుండా ఇతరులకు ఇచ్చే అధికారం ఎవరిచ్చారు? నీవు యూనిట్ కమాండెంట్‌వా? బెటాలియన్ కమాండరువా? వారికి కూడా ఇలాంటి అధికారాలు లేవే? ఎలా చేశావు? ఎందుకు చేశావు?’ అని గద్దించారు.

నేను సవినయంగా, “నేను చేసింది అపరాధమే. మూడు నాళ్లుగా పస్తు అంటే, మానవత్వ దృష్టితో చూచాను. ఆ వృద్ధునికి ఆకలికి తోడు ఇంకేమయినా అయిందేమోనని బాధగా ఉంది. ఆయనను శిక్షించకుండా, బాధించకుండా నాకే శిక్ష విధించండి, నా వల్ల అతడు ఇరుకున బడ్డాడు” అన్నాను.

కల్నల్ నా మాటకు అడ్డు తగిలి తలుపు తెరిచారు. అక్కడ సిద్ధంగా ఉన్న అసిస్టెంట్ “ఎగ్జిబిట్ నంబర్ వన్!” అంటూ కేకవేశాడు. ఒక ఆరితేరిన సిపాయి లెఫ్ట్‌రైట్‌గా అడుగులు వేస్తూ కల్నల్‌కు సెల్యూట్ కొట్టి, ఆయన అనుమతితో గదిలో

ప్రవేశించగానే.

కల్నల్ తలుపు విసురుగా వేశారు.

కల్నల్ అతన్ని ప్రశ్నించారు – "నీ పేరు?

"బహదూర్ గురంగ్ సర్.

"గుర్ఖా బెటాలియన్ వాడివా?"

"అవును సర్."

"ఏమి డ్యూటీ?"

"బ్రిగేడియర్ సాబ్ దగ్గర ఆర్డర్లీని సర్?"

"నిన్న ఏమి జరిగింది?

నీవు ఏమి చూశావు?"

"నిన్న రాత్రి ఎనిమిది గంటలండి సర్. నేను బ్రిగేడియర్ సాబ్ బంగ్లానుంచి రైలు లైన్లు దాటి వస్తున్నాను సర్."

"అప్పుడెందుకు వస్తున్నావు?"

"నా డ్యూటీ దిగాను సర్, బెటాలియన్ బారక్స్‌కు తిరిగి వస్తున్నాను. సర్"

"అప్పుడేమి చూచావ్?"

"నాకు ఎదురుగా యాభై అడుగుల దూరంలో ఒక ఆకారం ఏదో సంచి మోసుకొని వస్తున్నట్టు కనిపించింది సర్. నన్ను చూచి ఆ ఆకారం గూడ్సు పెట్టెల మరుగున దాక్కున్నట్టు అనిపించింది సర్. ఆ వ్యక్తి దొంగ కాకపోతే దాక్కోవలసిన అవసరం ఏమిటనే సందేహం కలిగింది సర్.

"మరి పరుగెత్తి పట్టుకోలేకపోయావా?"

"అది తప్పుసర్, సివిల్ వ్యవహారాలలో జోక్యం చేసుకోరాదని ఉత్తరువు, సర్. అంతేకాక, అతడు ఎలాటివాడో నాకంటే బలవంతుడేమో! ఆయుధాలున్నా యేమో! ఎన్నో సందేహాలు కలిగాయి, సర్!"

"ఇంత ఆలోచించేవాడివి నీదారిన నీవు వెళ్లలేకపోయావా?"

"వెళ్లవచ్చు సర్, కాని, ఆ వ్యక్తి బెటాలియన్ నుంచి వస్తున్నందున మిలిటరీ వస్తువులేమోనని సందేహం కలిగింది సర్."

"పళ్లబుట్టలు మేవాల బస్తా ఉన్న గూడ్సు పెట్టెలు గదా! అవి కాకూడదా? మిలిటరీ వస్తువేనని ఎందుకు సందేహం కలిగింది?"

"బస్తా సగం బస్తాగా ఉంది సర్. పిండి బస్తాగా అనుమానమయింది సర్. వంద పౌనులు సగం బస్తాలు మిలిటరీవే గాని సివిల్‌వి లేవు సర్"

"దట్స్‌రైట్, ప్రొసీడ్."

"నేను దాదాపు అరగంట అలాగే నిలుచున్నాను సర్. అతడు వస్తే పట్టుకుందామని, కాని అతడు బస్తా రైలు పట్టామీద పడవేసి, విసవిస వెళ్లిపోయాడు సర్."

"నీవు అంతగా కాచుకొన్న వాడివి అతనిని ఎందుకు వెన్నాడ లేదు?"

"నేను అతని వెంట బడితే, అతని మనుష్యులు వెనక ఎవరైనా ఉంటే, బస్తాను మాయం చేయవచ్చు సర్. అందుకని నేను పరుగెత్తి బస్తాను పట్టుకున్నాను సర్."

"దట్స్ గుడ్. ఆ మీదట?"

"బస్తాను చూచాను సర్. ఇండియన్ ఆర్మీ గూర్ఖా కోర్ అనే ముద్ర ఉంది సర్. ఆ రాత్రి తమ కార్యాలయాన్ని ఇబ్బంది పెట్టడం సముచితంగా తోచలేదు సర్. కనుక దానిని మోసుకొని బ్రిగేడియర్ సాబ్ బంగ్లాకు వెళ్లి అక్కడ అప్పగించాను సర్. బ్రిగేడియర్ సాబ్ తమతో ఫోనులో మాట్లాడుతామని సెలవిచ్చారు. సర్."

"సరే. నీవు వెళ్లవచ్చు."

బహదూర్ గురంగ్ అటెన్షన్‌లో నిలబడి సెల్యూట్ కొట్టి ఎబౌట్ టర్న్ చేసి వెళ్లిపోయాడు. నాకు అప్పటికి స్పష్టమయింది. పాపం! అచ్చర్‌సింగ్ బ్రిగేడియర్ ఆర్డర్లీకి భయపడి ఆటా బస్తా తీసుకొని వెళ్లలేకపోయాడు. ఆకలితో మాడుతుంటారు ఇంటిల్లిపాదీ. భగవంతుడు దయతలచాడు. దెబ్బలు తగల్లేదు... అంటూ ఇంకా ఏమేమో ఆలోచిస్తున్నాను. నేనే ఆయన ఇంటికి మిలిటరీ బస్తాలో కాకుండా చేతి సంచుల్లో కొద్దికొద్దిగా చేరవేసే ఏర్పాటు చేసి ఉంటే సరిపోయేది. అని అనుకుంటుండగా, "దీనికి ఏమంటావ్" అనే కల్నల్ గర్జన వినిపించింది.

నేను సవినయంగా అటెన్షన్‌లో నిలబడి

"నేను చేసింది తప్పే కాని, మానవత్వ దృష్టితో చేశాను..." అంటుండగా,

కల్నల్ కూర్చున్న వాళ్లవైపు తిరిగి మనం ఇన్‌కెమెరా సంప్రదిద్దాం" అన్నారు. వారు లేచారు. నలుగురూ ఆ గదికి ఆనుకొని ఉన్న కల్నల్ విశ్రాంతి గదిలో ప్రవేశించారు. పదిపదహైదు నిమిషాలు చర్చించారు, తలుపులు మూసుకొని. తర్వాత తిరిగి వచ్చారు. ఆ ముగ్గురూ కల్నల్‌తో కరస్పర్శ చేసి వెళ్లిపోయారు. వాళ్లు వెళ్లినప్పుడు తీసిన తలుపు నుంచి వెలుపలి దృశ్యం కనిపించింది. జోషీ, ఆయన మిత్రులూ మహోల్లాసంతో ఉన్నారు. షా మహమ్మద్ తలమీద చేతులు పెట్టుకొని కూర్చున్నాడు. పాపం! నాకోసం అల్లాను ఎంతగా ధ్యానిస్తున్నాడో! కల్నల్ తలుపులు గట్టిగా వేసి, నా వైపు తిరిగి "రామచంద్రా! యు ఆర్ ది ఫూల్ ఆఫ్ ది ఫస్ట్ ర్యాంక్! మేము నలుగురం బాగా ఆలోచించాం. నీకు శిక్ష విధిస్తే కనీసం పదేళ్ల శిక్ష పడుతుంది. నీ జీవితం నాశనమైపోతుంది. మొన్ననే భార్యను చూచి వచ్చావు. ఇకమీద ఇలాటి వెర్రి పనులు చేయక, నెత్తిమీదికి తెచ్చుకోక. ఇంకొక సంగతి విను. జోషీకి, రాత్రి నాకు బ్రిగేడియర్ చేసిన ఫోన్ సంగతి చెప్పి విచారణకు సిద్ధంగా ఉండమన్నాను. రాత్రి లోపల ఇంత మంది సాక్షులను సిద్ధపరచి, నీపై ఛార్జిషీటు తయారు చేసి నాకు తెలిపాడు. నీవు చేసింది తప్పు కనుక, ఆరాలు తీసి, ఇరికించాడు. జాగరూకతతో, మెలగు." అంటూ తలుపు తీశారు. నేను ఏదో చెప్పబోగా, "షటప్! ఎబౌట్ టర్న్! క్విక్ మార్చ్!" అని హుకుం చేశారు. ఆయనకు థాంక్స్ చెప్పడానికీ అవకాశం లేకపోయింది.

కేసు తుస్సుమన్నందుకు జోషీ ముఠా ముఖాలు నల్లబడిపోయాయి. నేను సరాసరి ఆఫీసుకు వచ్చి అదివరకే తెరిచినందున, నా కుర్చీలో కూలబడ్డాను. ఏదో నాటకం చూచినట్టనిపించింది. పరుగుతో వచ్చి షా నవాజ్ నన్ను కుర్చీతో పాటే పైకి ఎత్తి "బాబూజీ! భగవాన్‌కో యాద్ కరో, అల్లాకీ దువా, ఫాంసీ నుంచి - ఉరి నుంచి దిగి పంచకల్యాణి గుఱ్ఱం ఎక్కావయ్యా! అల్లా నాకు కనిపించాడయ్యా. ఉరితాడు కొలికి సడలడం ఏమిటి; గుఱ్ఱం వీపుపై పడడమేమిటి? ఎంత విచిత్రం!" అంటూ పదినిమిషాలు కన్నీళ్లతో ఏమేమో వాగాడు.

నేను అంతా విని "షా నవాజ్ భాయీ! నీవు కాళిదాసును మించిపోయావు." అన్నాను. "వాడెవడు మధ్య?" అన్నాడు షా నవాజ్. 'అతనొక గొప్ప షాయర్ - కవి. నీవు ఉరితాడు నుంచి దింపి పంచకల్యాణి గుఱ్ఱం మీద పడ్డా నన్నావు. అతడు "శూలా దవతార్య హస్తిస్కంధ మారోపితః" - అంటే; శూలి -

కొఅత – నుంచి దింపి ఏనుగు మీద ఎక్కించిన వాడిలాగ అని అన్నాడు. చూచావా? నీలోని షాయర్ నా వల్ల మేలుకొన్నాడు." అని అన్నాను. షా నవాజ్ నన్ను మరొక మారు ఎత్తి కుదిపి కౌగిలించుకొని డ్యూటీకి వెళ్లిపోయాడు.

మనస్సంతా నీళ్లుకకుమ్మరించి వేసిన కుండలాగ ఉంది. ఏమీ పాలుపోలేదు. ఇంతలో భోజనం అలారం వినిపించింది. నేను ఆఫీసు గది తాళం వేసి పట భవనానికి వెళ్లాను. ముంగిట్లో కాచుకొని ఉన్నాడు, షా మహమ్మద్. నన్ను కౌగిలించుకొని కన్నీటితో తడిపివేశాడు. "రామచంద్రజీ! ఎంత దురదృష్టం నాది! నా మిత్రునిపై ఛార్జ్ షీటు నేనే వ్రాయవలసి వచ్చింది! ఈ వేళ నాకు అల్లా అదోలా కన్పించాడయ్యా! నా బాధ చెప్పుకున్నాను. నీవు డరో మత్. నీ దోస్త్‌కు ఏమీ కాదు. సహీ సలామత్, విడుదలయి పోతాడన్నాడయ్యా రామచంద్రజీ! ఎంతటి అదృష్టం! జీవితమంతా జెయిలులో మగ్గిపోవడమనే నరకం తప్పిందయ్యా. అల్లా చెప్పాడు కన్నీళ్లు ఆపు – అని. కాని, నా వశమా? ఇదొక పెద్ద అద్భుతం! ఇక నా కంట బడతాడా అన్న రామచంద్రజీ, అల్లా – కరీమ్ – కరుణామయుడైన అల్లా వల్ల నా ఎదుట ఉన్నాడు." అంటూ విలపించాడు. నా పాషాణ హృదయంలోను భగవంతుని తలపించాడు, షా మహమ్మద్! షా నవాజ్! ఎలాంటి బంగారు వంటి మిత్రులయ్యా మీరు? మీరు మీ వంశాలు చిరకాలం వర్ధిల్లనీ! ప్రేమతో అందరినీ అల్లుకొనే అల్లా మీలో ఉన్నాడు.

రాత్రి పడుకున్నపుడు రెండు నాళ్లుగా జరిగినదంతా చిత్ర పటంలాగ నా ఎదుట కదలాడింది. నా ప్రమేయం లేకుండానే మంచీ, చెడూ జరిగిపోయాయి. మా నాన్నగారు, పూర్తిగా దైవాన్నే నమ్మిన మా నాన్నగారు; చెప్పిన శ్లోకం గుర్తుకు వచ్చి నవ్వుకున్నాను.

**అచింతితాని దుఃఖాని**
**యథై వాయాంతి దేహినామ్!**
**సుఖాన్యపి తథా మన్యే**
**దైవ మత్రాతిరిచ్యతే!!**

**(మానవులకు అనుకోకుండా దుఃఖాలు ఎలా కలుగుతాయో, సుఖాలుక కూడా అలాగే కలుగుతాయి. ఇదంతా దైవం గొప్పతనమే సుమా!)**

# 59

# మొహెంజోదడో - హరప్పా

**"సా రమ్యా నగరీ మహాన్ స నృపతిః**
**సామంత చక్రం చ తత్**
**పార్శ్వే తత్ర చ సా విదగ్ధ పరిషత్**
**తాః చంద్రబింబాననాః!**
**ఉద్వృత్త స్స చ రాజపుత్ర నివహః**
**తే వందినః తాః కథాః**
**సర్వం యస్య వశా దగాత్ స్మృతి పథం**
**కాలాయ తస్మై నమః!!"**

**(ఆ అందమైన నగరం, ఆ గొప్ప నరపాలుడు, అతని సామంతరాజుల బృందం, అతని పక్కన ఉన్న పండిత పరిషత్తు, ఆ చంద్రముఖులైన సుందరీమణులు, పోతరించిన ఆ రాజకుమారుల గుంపు, ఆ వందిమాగధులు, ఆ కథలు - అంతా ఎవని వల్ల స్మరించదగినదైందో, ఆ కాలపురుషునికి నమస్కారం.)**

**కోర్ట్** మార్షల్ తర్వాత మిలిటరీ జీవితం 'ఛీ' అనిపించింది. "ఏమిటీ ఇరవై నాలుగు గంటల కూలీ! వదిలించుకుంటే పోలా?" అని అనుకున్నాను. కాని, వదిలించుకోవడం అంత సులువు కాదు. జన్మాంతర సంచితపాపం వంటిది మిలిటరీ.

మా బెటాలియన్‌లో కడప వెంకటకృష్ణ అనే ఒక సివిల్ డాక్టర్ ఉండేవాడు. వయస్సు దాదాపు యాభై. ఆయన మద్రాసులో ఎం.బి.బి.ఎస్. ముగించి ఆగ్నేయాసియాలోని

సారవాక్‌కు వెళ్లాడు. అక్కడ నర్సింగ్ హోమ్ పెట్టి లక్షలు ఆర్జించాడు. బంధుమిత్రులను చూడడానికి 1938లో భారత దేశానికి వచ్చాడు. కోయంబత్తూరు మొదలయిన ప్రాంతాలలో ఉన్న బంధువులతోను, తక్కిన వారితోను వినోదంగా గడుపుతుండగా సంవత్సరం గడిచింది. ఇంతలో ద్వితీయ ప్రపంచ యుద్ధం ప్రారంభమయింది. బ్రిటిష్‌ప్రభుత్వం వెంకటకృష్ణగారికి సారవాక్‌కు తిరిగి వెళ్లడానికి అనుమతి నిరాకరించింది. ఆయనను నిర్బంధసేవ కింద మిలిటరీలో సివిల్ డాక్టరుగా చేరమని ఆదేశించింది. ఆయన అప్పుడు చమన్‌కు వచ్చాడు. మొత్తం బెటాలియన్‌లో తెలుగువారం మేమిద్దరమే గనుక ఆత్మీయత బాగానే ఉండేది.

నా కోర్ట్‌మార్షల్ సంగతికి ఆయన కూడా నొచ్చుకున్న వాడే. నేను నా అంతర్మథనాన్ని ఆయనకు వినిపించి మిలిటరీ నుంచి విముక్తి మార్గం కోరాను. ఆయన నన్ను రకరకాలుగా పరిశీలించి నాకు ఆవేశోద్రేకాలు ఎక్కువ కావడం వల్ల ఒకొక్కప్పుడు మతిమరుపు ఎక్కువవుతుందని, ఇలాటి వారి వల్ల సైన్యానికి నష్టమని ఒక అధికారిక నివేదిక వ్రాసి, నన్ను అనంతర పరిశీలనకు క్వెట్టాకు బదిలీ చేయించాడు.

నేను వెళ్లిపోదలచుకుంటే క్వెట్టా నుంచి సులభంగా రైలెక్కవచ్చు. నేను, రైల్వే ఉద్యోగి రామేశ్వరదయాళ్‌గౌడ్ ఇంటికి వెళ్ళి, నా నిర్ణయం తెలిపి; ఫలానా రోజున వస్తాను. లాహోర్‌కు టిక్కెట్టు కొనిపెట్టి  సిద్ధంగా ఉంచమని కోరాను. “చిక్కుల్లో పడతావేమో, ఈ నెల ఆగరాదా?, మేము వచ్చే నెల సెలవు మీద మీరట్‌కు వెళ్లుతున్నాము. బ్రహ్మపురిలో మా ఇల్లు. మాతో పాటు వద్దువుగాని” అని సలహా ఇచ్చింది శాంత. ఎప్పుడెప్పుడు వదిలి పోదామా అని ఆత్రంతో ఉన్న నాకు ఆ సలహా నచ్చలేదు.

నేను వెళ్లేలోగా రామేశ్వరదయాళ్‌కు నేను చేరవేయదగినన్ని రగ్గులు, ఫ్లానల్ షర్టులు, గ్రేట్ కోట్లు ఇంకా ఎన్నో విలువయిన ఉన్ని దుస్తులు విధవిధాల పద్ధతులలో చేరవేశాను. అప్పటి విలువ ప్రకారమే కొన్ని వేల సరుకు.

నేను ఒకనాడు “నా మెడికల్ రిపోర్ట్ మీ వద్ద ఉంది. దానిపై నిర్ణయం మీ ఇష్టం, నేను వెళ్లిపోతున్నాను. గుడ్‌బై!” అని మా కమాండెంట్ ఆఫీసరుకు ఒక రాజీనామా వంటిది వ్రాసి పంపి సాయంకాలం ఊరుచూచి వస్తానన్న సాకుతో రామేశ్వర్ దయాళ్ క్వార్టర్‌కు వెళ్లాను. అతడు రాత్రి పదిగంటల బండికి నాకు టిక్కెట్టు కొని తెచ్చాడు. నేను వారందరి దీనాలాపాల మధ్య నా పాతవేషంలో బండెక్కాను.

రోహ్రీ జంక్షన్ వచ్చింది. అక్కడ ఒక చరిత్ర విద్యార్థి పరిచయమయ్యాడు. పండిట్‌జీ! మనం ఇక్కడ దిగి సింధునదిలో స్నానం చేద్దాం. పక్కనే సుందరమైన హైదరాబాద్ పట్టణం. నేను మొహెంజోదడో చూడదలచాను. నా వెంట రండి, ఇంతదూరం వచ్చి, ఐతిహాసికప్రాధాన్యమున్న మొహెంజోదడో చూడకపోతే ఎలా?" అన్నాడు. "నేను లాహోర్‌కు టికెట్ కొన్నానే!" అని నీళ్లు నమిలాను. "టిక్కెట్ కో గోలీ మారియే. డబ్బుకు ఆలోచించకండి. ఇన్నివేల మైళ్ల దూరం రాగలరా మీరు? మొహెంజోదడో నుంచి హరప్పా వెళ్లుదాం. అక్కడి నుంచి లాహోర్ దగ్గరే. జరూరు పనులేమీ లేవు గదా?" అన్నాడు. నాకు జరూరేమిటి? నిత్యదీర్ఘసూత్రుణ్ని.

నేను 1922ప్రాంతం నుంచి మొహెంజోదడో, హరప్పాలలో జరిగిన త్రవ్వకాల సంగతి చదివాను. మద్రాసు మ్యూజియంలోను, లాహోర్ మ్యూజియంలోను ఆ త్రవ్వకాలలో దొరికిన వస్తువుల ప్రతిరూపాలు చూచాను. నాకు కూడ వాటిని ప్రత్యక్షంగా చూద్దామనే ఉత్కంఠ కలిగింది. నిజమే. అతడన్నట్టు మళ్లీ జీవితంలో ఇక్కడికి రాగలమా? ఎన్ని మార్పులు వస్తాయో? సరేనన్నాను.

ఇద్దరం రోహ్రీలో దిగాం. "రోహ్రీ వద్ద సింధునది పై ఉన్న పెద్ద రైలు వంతెన మీ విజయవాడ, రాజమండ్రి రైలు వంతెనల కన్నా పెద్దది" అన్నాడు అతడు, ఓమ్ ప్రకాశ్. తల ఊపాను. రైలువంతెన మాత్రం భయంకరంగా ఉంది. హైదరాబాద్ సింధ్‌కు వచ్చి అక్కడ స్నానం చేశాం. స్నానఘట్టంలో ముష్టిగ్రాహ్యస్తనులు మొదలు, వ్యామ గ్రాహ్యస్తనులు తువాళ్లు కట్టుకొని స్నానం చేస్తున్నారు. నేను భయపడి "ఇది స్త్రీల స్నానఘట్టమేమో!" అని అన్నాను ఓమ్ ప్రకాశ్‌తో. "ఇక్కడ అదేం లేదు. సంకోచపడకండి, మనం పుణ్యస్నానం చేయడానికి వచ్చాం. వాటిని చూడకండి" అన్నాడు. స్నానానంతరం సుందరమైన ఆ పట్టణంలో తిరిగాం. బస్సులో వెళ్లితే జనాన్ని చూచినట్టుగా ఉంటుందని అతడు అనడం వల్ల బస్సులో మొహెంజోదారోకు బయలుదేరాం. సింధ్ రాష్ట్రంలో కరాచీ తర్వాత అందమైన నగరం హైదరాబాద్ సింధ్.

రోహ్రీ జంక్షన్ సమీపంలోనే ప్రపంచ విఖ్యాతమైన సుక్కూరు జలాశయం (డామ్). "రోహ్రీలోనే స్నానం చేయవచ్చుగదా! మళ్లీ వెనక్కు పోవడం ఎందుకు?" అనడిగాను ఓమ్‌ప్రకాశ్‌ను. "పండిట్‌జీ! అంతా సింధునదే. కాని హైదరాబాద్‌లో స్నానం చేయడం సంప్రదాయం. నాకు తెలిసిందంతే" అన్నాడు ఓమ్‌ప్రకాశ్.

మొహెంజోదారో అని ఆంగ్లోచ్చారణతో విశ్వవిఖ్యాతి గాంచిన ఈ ప్రాచీన శిథిలాలను అక్కడ వారు మొ ఎన్-జో-దడో అని వ్యవహరిస్తారు. దీని అర్థం మృతుల దిబ్బ. ఇది ఇప్పటి సింధ్ రాష్ట్రంలో (పాకిస్తాన్) లార్కానా జిల్లాలో లార్కానా పట్టణానికి పది పదిహేను మైళ్లు దక్షిణాన, దాదాపు యాభై మైళ్లు పశ్చిమాన సింధు నదిగట్టున ఉన్నది. మృతుల దిబ్బ అని నేను సంస్కృతీకరించాను గాని, అక్కడి వారు దీని ప్రాచీనత్వ, ప్రాశస్త్యాలు తెలియక ముందు పీనుగుల దిబ్బలు అనేవారట. మొఎన్ అంటే మృతుల; దడో అంటే తటం - గట్టు. జరా - ము - ఈ -నా - భయ్-ము-ఆ - ముదిమి చావలేదు. భయం చావలేదు - అన్నాడు కబీర్. మొఎన్‌జోదడో సింధు రాష్ట్ర రాజధాని అయిన కరాచీకి దాదాపు 320 మైళ్లు ఉత్తరంలో ఉంది.

సింధునది కుడిగట్టున కొన్ని దిబ్బలు చాలాకాలంగా ఉన్నాయి. ఇవి నదీతీరానికి దాదాపు రెండు మైళ్లలో ఉన్నాయి. పురాతత్వ డైరెక్టర్ జనరల్ సర్ జాన్ మార్షల్ ఈ దిబ్బలను చూచాడు. భారతదేశంలోని తక్కిన ప్రాంతాలలో దిబ్బలు చాల వరకు పురాతన నగరాల శిథిలాల దిబ్బలయినందున మార్షల్ ఇవి కూడా ఏ పురాతన నగర శిథిలమో అయి ఉంటుందని ఊహించి 1921-27ల మధ్య ఈ దిబ్బలను త్రవ్వించాడు... ఈ త్రవ్వకాలు మూడు మైళ్ల వైశాల్యంలో జరిగాయి. వరుసగా ఏడెనిమిది దిబ్బలు. ఈ దిబ్బలలో పెద్దవి దాదాపు ఆరేడు ఫర్లాంగుల పొడవు, చిన్నవి ఒకటిన్నర రెండు ఫర్లాంగుల పొడవు. సర్ జాన్ ఈ త్రవ్వకాలపై మూడు పెద్దగ్రంథాలు, లభించిన వస్తువుల చిత్రాలలో సహా రచించారు. 1927 నుంచి 1931 వరకు జె. హెచ్. మాక్యే మరి కొన్ని త్రవ్వకాలు జరిపాడు. తర్వాత మరికొందరు పరిశోధనలు జరిపారు. ఈ త్రవ్వకాలలో పెద్ద పెద్ద ఇటుకలతో కట్టిన గోడలు వాటికి ఆసరాగా గోడలు, యజ్ఞశాలలు, కలప, ధాన్యం భద్రపరచే శాలలు, తీర్చిదిద్దిన వీధులు, ఇండ్లలో గాలి, వెలుతురు రావడానికి ఏర్పాట్లు, స్నానాగారాలు, మరుగుదొడ్లు, మురుగునీటికాలువలు - బయటపడ్డాయి. వీటిని బట్టి నగరం సింధునది వరదల తాకిడికి మునిగిపోకుండా కోటలాంటి గోడ కట్టుకుని ఉంటారని, వ్యవస్థితమైన నాగరికత గల జనం నివసించేవారనీ ఊహించారు.

ఇక్కడా దాదాపు 2000 మృణ్మయముద్రికలు దొరికాయి. వీటిపై మేకలు, ఒంటికొమ్ముగల ఖడ్గమృగాలు, ఏనుగులు, మొసళ్లు, దుప్పులు, పెద్ద పులులు మొదలయిన జంతువుల రూపాలున్నాయి. ఒక ముద్రికపై ఎద్దు కొమ్ముల కిరీటం ధరించి,

సింహాసనాసీనుడయిన యోగి రూపం ఉంది. అతని చుట్టూ వివిధ క్రూర జంతువులు మూగి ఉన్నవి. కొన్ని ముద్రికలపై చిత్ర విచిత్రమైన లిపులున్నవి. ఈ ముద్రికలను నాణేలుగా వాడేవారని చిత్రకారుల ఊహ.

రకరకాల నగలు ధరించిన మృణ్మయ మహిళా విగ్రహాలు, గొడ్డళ్లు, కత్తులు, పదునైన కత్తుల వంటి రేకులు, స్ఫటికాల నీలాలవంటి పూసలదండలు,బంగారు గొలుసులు, ఇంకా వివిధాభరణాలు దొరికాయి. గృహోపకరణ సామగ్రి, చిత్రాలున్న కొమ్ములు; నల్లని సిరాతో వ్రాసిన చిత్రాలు లభించాయి. ఒక ముద్రికపై ఒక కొమ్మ కింద ఒక వ్యక్తి, కొమ్మ చివర పైన మరొక పక్షి రూపాలున్నాయి.

ఇవన్నీ అక్కడి మ్యూజియంలో భద్రపరచబడ్డాయి. మేము యజ్ఞశాలలు, ప్రార్థనాగారాలు, స్నానాగారాలు, నివాసగృహాలూ తిరిగాము. ముద్రికలన్నీ శ్రద్ధగా చూచాము. నా చరిత్ర పరిశోధకమిత్రుడు ఎన్నో విషయాలు నోట్ పుస్తకంలో వ్రాసుకుంటూ నాకు వివరించాడు. అక్కడ రోజంతా గడిపాము. రోహ్రీకి తిరిగి వచ్చి హరప్పా చూడడం కోసం లాహోర్ బండి ఎక్కాము.

హరప్పా; లాహోర్ – ముల్తాన్ రైలు మార్గంలో, ముల్తాన్‌కు ఈశాన్యంగా, షాహీవాల్ – చించివాట్నీ రైలుస్టేషన్‌ల మధ్య ఉంది. హరప్పా రోడ్డు అనే స్టేషనులో దిగి, రెండు మైళ్లదూరంలో ఉన్న శిథిలాలకు వెళ్లాలి. ఇది పాకిస్తాన్‌లోని పంజాబ్ ప్రాంతంలో మాంటోగుమరీ జిల్లాలోనిది. రావీ నది ఎడమ గట్టున ఉంది. ఈ గ్రామం నిండా దిబ్బలే. హరప్పాను స్థానికులు హడప్పా అని అంటారు. హడ్‌నా అంటే మింగి వేయడం, ముంచి వేయడం. రావీనది వరదలలో మునిగిపోవడం వల్లనో, రావీనది దీనిని పొట్టన బెట్టుకోవడం వల్లనో ఈ గ్రామానికి ఈ పేరు వచ్చి ఉంటుందని నేను భావించాను.

హరప్పా నగరం విచిత్రంగా వెలుగుకు వచ్చింది. లాహోర్ –ముల్తాన్ రైలు దారిని వేయడానికి కూలీలు ఈ హరప్పాప్రాంతాన్ని తవ్వుతుండగా ప్రాచీన నగర శిథిలాలు కానరాగా, పురాతత్వశాఖ త్రవ్వకాలు కొనసాగించింది. 1921–1934 వరకు ఈ ప్రాంతంలో ఎం.ఎస్.వాట్స్, సర్ మార్టిమర్ వీలర్ అనే పురాతత్త్వశాఖాధికారులు త్రవ్వకాలు కొనసాగించారు. ఈ ఖనన పరిశోధనల వల్ల మొహెంజోదడో వంటిదే హరప్పా కూడ అనే నిశ్చయం కలిగింది పరిశోధకులకు.

మొహెంజోదడో – హరప్పాలు పాకిస్తాన్‌లో ఉండడంవల్ల భారత పురాతత్వవేత్తలు,

తర్వాత గుజరాత్‌లోని లోథాల్‌లోను, రాజస్థాన్‌లోని కాళీబంగన్‌లోను త్రవ్వకాలు జరిపి, మొహెంజోదడో – హరప్పా సంస్కృతినే కనుగొన్నారు. ఈ సంస్కృతి ఒకప్పుడు పశ్చిమ పంజాబ్, రాజస్థాన్, గుజరాత్‌ల వరకు వ్యాపించి ఉండినదని నిశ్చయించారు. ఈత్రవ్వకాలలో సుప్రసిద్ధ పురాతత్త్వవేత్త, మిత్రులు డాక్టర్ ఇంగువ కార్తికేయశర్మగారు – అప్పట్లో సాలార్‌జంగ్ మ్యూజియం డైరెక్టర్ (ఇప్పుడు రిటైరైనారు) – పాల్గొని చాల గొప్ప విషయాలు కనుగొన్నారు.

మేము హరప్పాలో ఒక రోజు గడిపాము.. సమీపంలో ఝీలం – చీనాబ్ – రావీనదుల, సంగమం కనుక నా మిత్రుని ప్రోత్సాహంతో అక్కడ కూడా అఘమర్షణస్నానం చేశాను.

ఈ రెండు త్రవ్వకాలలో వెలువడిన వస్తువులను బట్టి ఇది వేద పూర్వసంస్కృతి అని, క్రీస్తు పూర్వం ఐదారు వేల సంవత్సరాల నాటిదని, ఆర్యేతర సంస్కృతి అని కొందరు, కాదని కొందరు; విద్వాంసులు–గ్రంథాలకు గ్రంథాలే వ్రాసి వేశారు. మహాయాన బౌద్ధుల తొలి బుద్ధచరితమయిన లలితవిస్తరంలో బుద్ధునికి వచ్చిన లిపులలో పాదలిఖిత లిపి, ద్విరుక్త పద సంధిలిపి అనే లిపులున్నాయి. ఇవి ఒక పదంలో ఒక పాదమైన లిపి, పదాల చేరిక వల్ల ఏర్పడే లిపి అని మనం భావించవచ్చు. ఈజిప్టు చిత్రలిపి లాగానే మొహెంజోదడో–హరప్పాల చిత్రలిపి కూడ మొదట వస్తువు బొమ్మగాను, తర్వాత వస్తువును సూచించే పదభాగంగాను, పద ప్రథమాక్షరంగాను అయి ఉంటుంది. దాని నుంచే తర్వాత బ్రాహ్మీలిపి పుట్టి ఉంటుంది. దీని క్రమపరిణామం పరిశోధనవల్ల మున్ముందు రుజువు కావాలి. ఈజిప్టు లిపి, బ్రాహ్మీలిపి, ప్రపంచంలోని ఎన్నో లిపులు ద్విభాషా శాసనాల వల్లనే చదువడానికి సాధ్యమయ్యాయి. సింధులోయ లిపులు కూడ ద్విభాషా శాసనం వల్లనే సాధ్యమవుతాయని నా నమ్మకం.

అంతేకాక, ఒక చెట్టు కొమ్మ, దాని మీద కొంత ఎడంగా రెండు పిట్టలు కింద మీదుగా కూర్చున్నట్టున్న ముద్రికను చూచినపుడు ఋగ్వేదంలోని ఒక ఋక్కు జ్ఞాపకం వచ్చింది.

**"ద్వాసుపర్ణా సయుజా సఖాయా**
**సమానం వృక్షం పరిషస్వజాతే,**
**తయో రన్యః పిప్పలం సాద్వత్తి**
**అన్నశ్నన్నన్యో అభిచా కపీతి"**

చెలిమితో కలిసి తిరిగే రెండు పక్షులు సమంగా ఒక చెట్టును అంటిపెట్టుకొని ఉన్నాయి. వాటిలో ఒకటి తియ్యని రావి పండును తింటున్నది. రెండవది పండు తినక సాక్షిగా చూస్తున్నది – అని దీని అర్థం

అలాగే యోగి బొమ్మ ఉన్న ముద్ర, గంగడోలు భూమి వరకు వ్రేలాడే వృషభాలో, ఆవులో ఉన్న ముద్రల, దేవతామూర్తుల విగ్రహాలు పూర్తిగా ఆర్యసంస్కృతిని, ఋగ్వేద సంస్కృతిని తెలుపుతున్నాయని నా విశ్వాసం. డాక్టర్ సునీతి కుమార్‌చటర్జీ అన్నట్టు మన సంస్కృతి ఆర్య ఆర్యేతర సంస్కృతుల సమ్మేళనమని, ఇది స్నేహంతో జరిగిందే గాని కత్తివాదరతో జరుగలేదని నేను నమ్ముతున్నాను. దీనికి ఆగ్నేయాసియాలోని భారతీయ సంస్కృతి వైభవమే తార్కాణం. వీటి భాష ప్రాకృతమని నా విశ్వాసం.

హరప్పా రోడ్డుకు తిరిగి వచ్చి స్టేషనులో దొరికే వస్తువులు తిని లాహోర్ రైలు ఎక్కాము. లాహోర్ చేరిన తర్వాత ఓమ్‌ప్రకాశ్, నేను పరస్పరం ధన్యవాదాలు చెప్పుకొని విడిపోయాము. ఓమ్‌ప్రకాశ్‌ను తర్వాత ముప్పై యేళ్లకు ఒక ఓరియంటల్ కాన్ఫరెన్స్‌లో – కురుక్షేత్రంలో అనుకుంటాను కలుసుకున్నాను. హరప్పా యాత్ర గుర్తులు స్మరించుకొని సంతోషించాము.

లాహోర్ నుంచి ఢిల్లీకి వస్తూ అమృత్‌సర్‌లో దిగాను. ఎందుకంటే, అమృత్‌సర్‌లో జలియాంవాలా బాగ్‌లో జనరల్ ఓ. డయ్యర్ కాల్పులు జరిపించి వందల మందిని పొట్టబెట్టుకున్నప్పుడు తుపాకి గుండ్లు తగిలిన గోడల రంధ్రాలను మరొకమారు దర్శించుకుందామనిపించింది.

ఆ గోడ మూడంతస్తుల మేడ గోడ. జలియాంవాలా బాగ్‌కు ఆనుకొని ఉంది. కొన్ని పదుల గుండ్లు తగిలి క్షతగ్రాతుడయిన వీరుని వలె నిలిచి ఉంది. ఆ మేడ యజమాని చూడవచ్చిన వారి కందరికీ ఆనాటి సంగతులు చెబుతూ, ఆ తుపాకి గుండ్ల చిల్లుల గాథలను వివరించే వాడు. జలియాంవాలా బాగ్ కాల్పుల దురంతాన్ని గురించి భారతీయులకు చెప్పనక్కరలేదు.

నేను ఆ రంధ్రాలను దర్శించి, చేతులతో తడిమి కళ్లు మూసుకొని అమేయానుభూతి చెంది, వదలలేక వదలలేక వదలి; ఢిల్లీ రైలెక్కాను. రైల్లో కళ్లు మూసుకుంటే ఆ రంధ్రాల గోడలే కనిపించాయి ఢిల్లీ వరకు. ఇది జీవితానికొక గుణపాఠంగా భావించాను.

ఒక సంగతి చెప్పడం మరచాను. రోహ్రీ నుంచి మొదట ముల్తాన్ వెళ్లాము. అక్కడ

నా మిత్రుడు గోపాల్ అనే సంస్కృత విద్యార్థి సంస్కృత కళాశాలలో శాస్త్రి పరీక్షకు చదువుతున్నాడు. అతనిని చూడాలనిపించింది. నా మిత్రుడు ఓమ్‌ప్రకాశ్‌ను ఒప్పించి టికెట్లపై సంతకాలు చేయించుకొని దిగాము.

ముల్తాన్ గొప్ప పట్టణం. దీని పూర్వ నామం మూలిస్తాన్. చరిత్ర ప్రసిద్ధమయిన నగరం. అక్కడ సంస్కృత పాఠశాలను వెదుక్కుంటూపోయి, గోపాల్‌ను పట్టుకున్నాం. అతడు లాహోర్‌లో నాకు మిత్రుడు. తెలుగువాడు. తెనాలి ప్రాంతం వాడనీ గుర్తు. దురదృష్టవశాన రెండు సార్లు 'శాస్త్రి' పరీక్షలో ఫెయిలయి ముల్తానుకు వెళ్లిపోయాడు. ముల్తాన్‌కు లాహోర్ దాదాపు రెండువందల యాభై మైళ్ల దూరంలో ఉన్న నగరం. గోపాల్ వైశ్య యువకుడు. కొన్నేళ్లు పంజాబులో ఉన్నాడు. గృహచ్ఛిద్రాలతో ఇల్లు వదిలి వచ్చానని ఒక మారు సూచించాడే గాని, వివరాలు చెప్పలేదు, నేనూ అడగలేదు.

అలాగే వక్కలగడ్డ వెంకటేశ్వర్లు మరొక విద్యార్థి. మహామేధావి. సంగం జాగర్లమూడి వాడు. లాహోర్‌కు వచ్చిన ఆరు నెలలకే చక్కని హిందీ, పంజాబీలు మాట్లాడేవాడు. వీరు గొప్ప విద్వాంసులయి ఉంటారు. తర్వాత ఇంత వరకు వారి వార్త తెలియలేదు.

నేను నా పాత బెంగాలీ మిత్రుడు శ్యామ్‌ప్రసాద్ మిత్రను వెదుక్కుంటూ పురానీ అనార్కలి తిరిగాను. ఆయన అప్పటికి తనుప్రేమించిన మహిళను పెళ్లాడి గృహస్థుడయ్యాడు. భోజనానికి పిలిచాడు. నా కోసం చెంబులు, గ్లాసులు, కంచాలు పదిసార్లు తోమించాడట. చేపల కంపు పోలేదు.

ఆ దినం ఆదివారం కాబోలు మిత్రతో మొహెంజోదారో-హరప్పా సంగతులు ముచ్చటిస్తూన్నాను. ఏదీ నిత్యం కాదనే విషయంపై మా చర్చ కొనసాగింది. తర్వాత యుద్ధ పరిణామం పైన చర్చ మళ్లింది. ఈ ప్రపంచంలో ఎవ్వరికీ రక్షణలేదని మిత్ర అన్నాడు. తనకు కలకత్తాకు బదిలీ అయిందని, ఇన్నేళ్లుగా ఉన్న లాహోర్‌ను - లావణ్య విలసితమయిన లాహోర్‌ను - వదలబుద్ధి పుట్టడం లేదని అన్నాడు. ఆ విషయంలో నేనూ ఏకీభవించాను (లాహోర్ పాకిస్తాన్‌కు పోయినపుడు నా పిత్రార్జితం పోయినట్టు ఏడ్చాను.) మరొక మారు అనిత్యత్వం పై దృష్టి మళ్లింది. నేను కబీర్ వ్రాసిన

**"కుసల కుసల సబ్ పూఛతే**

**కుసల కిసీ కా హోయ్**

**జరా ము ఈ నా భయ్ ము అ**

**కుసల కాహే కో హోయ్"**

అనే దోహాను ఉదాహరించి అర్థం వివరించాను. లోకంలో కుశలమా? క్షేమమా? బాగున్నారా? కులాసాయేనా? - అని అందరూ అడుగుతారు. కుశలం ఎక్కడుంది? ఎవరి కుంది? ముదిమి పోలేదు. మృత్యుభయం పోలేదు. ఇక కుశలమనేది ఎక్కడిది? అని దీని అర్థం. మిత్రదంపతులకు వీడ్కోలు చెప్పి ఢిల్లీకి బయలుదేరాను.

ఎవరో సంస్కృత కవి కాలం లీలలను చూచి ఆక్రందించిన శ్లోకం గుర్తుకు వచ్చింది.

**"కాంశ్చిత్కల్ప శతం కృత స్థితి చయాన్**

**కాంశ్చి ద్యుగానాం శతం**

**కాంశ్చి ద్వర్ష శతం తథా కతిపయాన్**

**జంతూన్ దినానాం శతమ్**

**తాంస్తాన్ కర్మభి రాత్మనః ప్రతిదినం**

**సంక్షీయ మాణాయుషః**

**కాలోఽ యం కవలీ కరోతి సకలాన్**

**భ్రాతః కుతః కౌశలమ్"**

**(సోదరా! ఈ సంసారంలో - ప్రపంచంలో కుశలం అనేది ఎక్కడుంది? కాలమనేది అందరినీ, అన్నిటినీ మింగేస్తుంది. కొన్నిటిని కల్పశతాల పాటు, మరి కొన్నిటిని యుగశతాల పాటు, ఇక కొన్నిటిని నూరు సంవత్సరాల పాటు, ఇంకా కొన్ని జంతువులను వంద దినాలపాటు, ఉండనిచ్చి వాటి వాటి కర్మలను అనుసరించి ఆయుష్ను క్షీణిస్తుండగా చివరకు ఈ కాలం గుటుక్కున మింగివేస్తుంది. క్షేమం ఎక్కడిది తమ్ముడూ?)**

# ౬౦

# గంగాతీరంలో

"తృష్ణే దేవి నమస్తుభ్యం
యాత్వం సర్వత్ర సర్వదా
ఉత్పాపదయస్వ యత్నేన
గోష్పదే సాగర భ్రమమ్"

**(ఓ ఆశాదేవి! నీకు నమస్కారం. నీవు ఆవు కాలి గిట్టంత నీటిలో సాగరమంత భ్రాంతిని అన్ని చోట్ల, అన్ని వేళల, అప్రయత్నంగా కలిగిస్తావు. ఆశతో మానవుడు ఆవు గిట్ట మేర భూమిలో ఉన్న నీటిని సముద్రమనుకుంటాడు. ఆశ అంత బలం గలది).**

"**మ**నం నేపాల్ వెళ్లుదాం" అన్నాడు మిత్రుడు రఘునాథ్‌సింగ్.

"ఎందుకు?" అని ప్రశ్నించాను యథాలాపంగా.

"ఎందుకు గిందుకు అని అడక్కండి. నేను మీ మిత్రుణ్ని. మిమ్మల్ని మోసం చేయను గదా! నేను చెప్పినట్టు చేయండి. ఇద్దరికీ లాభం" అన్నాడు రఘునాథ్‌సింగ్.

నేను ఏమీ మాట్లాడలేదు. లాహోర్‌లో ఎన్నో పనులు చేసి మిలిటరీలో చేరాను. అక్కడ పరిచయమయ్యాడు, రఘునాథ్‌సింగ్. జబ్బుపడి మిలిటరీ నుంచి డిస్చార్జ్ అయ్యాడు. ఉత్తరప్రదేశ్‌లోని ఒక స్వదేశ సంస్థానం వాడు. సూర్యవంశ క్షత్రియుడు. స్నేహపాత్రుడుగానే కనిపించాడు. నేను ఎవరితోనన్నా స్నేహం చేస్తాను. ఎదుటివాడు

మోసం చేశాడా నాకు పోయేదేమీ లేదని నా విశ్వాసం, ఉపకారం జరిగిందా సరే. "బృహస్పతే రవిశ్వాసః" – అనేది బృహస్పతి నీతిసూత్రం. ఎవరినయినా మంచివాడని రూఢి అయ్యే వరకు నమ్మకు అని దీని అర్థం. దీనిని నేను నమ్మను. ప్రతివాడూ మంచివాడని రుజువు కావడానికి ఏండ్లూ, పూండ్లూ పడుతాయి. మనకు మనశ్శాంతీ ఉండదు. కనుక నమ్మడం మంచిది. మోసపోయామా, మరొక అనుభవం.

లాహోర్ నుంచి వస్తున్నప్పుడు దారిలో సత్యనారాయణ అనే అతను కలిశాడు. వజీర్ సుల్తాన్ కంపెనీ (హైదరాబాద్‌లో) పని చేస్తున్నానన్నాడు. తాను సుభాస్‌చంద్రబోస్ స్థాపించిన ఇండియన్ నేషనల్ ఆర్మీలో ఉన్నానన్నాడు. అతని వెంట అస్సాం వరకు వెళ్లాను. అతను హఠాత్తుగా పట్టుబడ్డాడు, మిలిటరీ పోలీసులకు. నేను మిగిలిపోయాను. తిరిగి పడుతూ లేస్తూ కాన్పూరు చేరాను. అదొక అనుభవం. ఇప్పుడు ఈ రఘునాథ్‌సింగ్. ఏం జరుగుతుందో చూద్దాం, ఇదొక అనుభవం; ఉత్తరోత్తరా జాగ్రతపడవచ్చు – ఇలా ఆలోచిస్తున్నాను. ఎంతసేపు గడిచిందో! (సత్యనారాయణ మొదట మిలిటరీలో చేరి తర్వాత ఐ.ఎన్.ఏ.లో చేరాడు. కనుకనే మిలిటరీ పోలీసులు అరెస్టు చేశారు.)

"ఏమిటాలోచిస్తున్నారు? అటు పోదాం రండి; గంగాతీరానికి. నేపాల్‌కు మనం ఎందుకు పోవాలంటున్నానో మీకే అర్థమవుతుంది" అన్నాడు రఘునాథ్‌సింగ్.

ఇద్దరం బయలుదేరాం గంగాతీరానికి. కాన్పూరు వద్ద గంగానది దాదాపు రెండు మైళ్ల వెడల్పు. తెల్ల కాయితం పరచినట్టుగా ప్రవహిస్తుంటుంది. గట్లూగిట్లూ పెద్దగా ఏమీ ఉండవు. నేల బారుగా నీళ్లు పోతూన్నట్లు ఉంటుంది. కాని, చేయి నీటిలో పెట్టమా ఎవరో చేతిని లాగినట్టుగా, విద్యుదాఘాతం తగిలినట్టుగా చేయి వెనక్కు బలమంతా ప్రయోగించి లాక్కోవలసి ఉంటుంది. అంతవేగం. గంగాతీరంలో వ్రతాలు, వైదిక కర్మలు చేసేవారు కొల్లలు గనుక వారి వసతి కోసం సత్రాలు ఉచితంగా లభించే ఏర్పాటూ ఉంటుంది.

గంగాతీరంలో కూర్చున్నాం ఇద్దరం. నేను గంగ వేగాన్ని చూస్తున్నాను. పుణ్యస్నానాలు చేసే వాళ్లు చేస్తున్నారు. తీర్థవిధులు నిర్వహించే వాళ్లు నిర్వహిస్తున్నారు. కాశీప్రయాగలలో లాగ యాత్రికుల సమ్మర్దం లేకపోయినా, యాత్రికులకు కొరతేం లేదు. కొన్నిచోట్ల గట్లు పెద్ద పెద్ద దుంగలతో నిండి పోయాయి. వాటిమీద ఏవేవో అంకెలు, గుర్తులూ ఉన్నాయి. వాటిని దోటీల వంటి ఇనుప ఊచలతో కొందరు లాగుతున్నారు. నడి

ఏట్లోనూ పెద్ద పెద్ద దుంగలు కొట్టుకు పోతున్నాయి. కొందరు పడవలలో వాటి వెంట వెళ్లుతూ, వాటిని తమకు ఇష్టమయిన చోట్లకు మళ్లిస్తున్నారు. గట్టుకు లాగిన వాటిపైన ఉన్న అంకెలను, గుర్తులను కొందరు పరిశీలిస్తున్నారు. కొందరి ముఖాలు సంతోషంతో వెలిగిపోతున్నాయి. కొందరు ముఖాలు వ్రేలవేసుకుంటున్నారు.

"ఏమిటి ఇదంతా?" అని ప్రశ్నించాను రఘునాథ్‌సింగ్‌ను.

"అందుకే నేపాల్ వెళ్లుదామన్నాను. చూస్తున్నారు గదా! ఆ దుంగలు నేపాల్‌వి. నేపాల్ సరిహద్దు అడవులను కొట్టి, నంబర్లు గుర్తులు వేసి, గండకీ నదిలోను, ఉప నదుల్లోను పడదోస్తారు. అవి ఇక్కడికి కొట్టుకొని వస్తాయి. ఇలాగే ఇంకా కింది ప్రాంతాలకూ వెళ్లుతాయి. ఇక్కడ ఆయా వర్తక సంస్థల ఏజంట్లు ఉంటారు. దుంగల మీద సంకేతాలు చూచుకొని, తమవని రూఢి అయిన తర్వాత తీసుకువెళ్లుతారు" అన్నాడు రఘునాథ్‌సింగ్.

"ఈ వ్యాపారం బాగానే ఉందే!" అన్నాను నేను.

"బాగా ఉండడం మాత్రమే కాదు. అపారమైన లాభం. ఒక్కొక్క దుంగ కనీసం వంద రూపాయలు, ఆ పైనే. (ఇది అర్ధశతాబ్ది క్రితం సంగతి, ఇపుడు పదివేలు). కనుకనే నేపాల్‌కు పోదామన్నాను. నాకు ఈ వ్యాపారంలో కొంత అనుభవం ఉంది. పెట్టుబడి నాది. మీరు వర్కింగ్ పార్ట్‌నర్. మీరు శరీరశ్రమ ఏమీ చేయనక్కరలేదు. దానికి జనం ఉన్నారు. నాకు నమ్మకమయిన మనిషి మీరు. మీలాటి వారు కావాలి నాకు. మీరు లెక్కలు అవీ చూచుకోండి. తక్కినదంతా నేను చూచుకుంటాను. లాభం చెరిసగం. సంవత్సరం లోపల మనం కాన్పూరులో రెండు మేడలు లేపవచ్చు" అన్నాడు సింగ్.

"ఆశా బలవతీ రాజన్" – అన్నాడు గదా వ్యాసుడు! నాకూ ఆశ పుట్టింది. జేబులో రూపాయి ఉంది. నా సామానంతా వావిలాల గోపాలకృష్ణయ్య మార్కు సంచీ, ఒక్క రూపాయ అంటే, ఎనిమిది రోజుల భోజనం. కాన్పూరులో అప్పుడు అణాకు ఉదయిస్తున్న చంద్రబింబమంత పెద్ద చపాతీలు గాని, పూరీలు గాని ఆరు, కూరతో సహా ఇచ్చేవారు. పూటకు అణా ప్రకారం పదహారు పూటలు గడిచిపోతాయి. నా ఆలోచన లెక్కల్లో ఉంది.

"మరి సమ్మతమేనా? మీరు ఊ అంటే చాలు. మీరు గంగాతీరంలో ఆ గదులలో

ఉండండి. ఉచితంగా ఉండవచ్చు. నేను వెళ్లి, ఇంట్లో కొన్ని ఏర్పాట్లు చేసి వస్తాను. రెండు రోజుల్లో రాక్సాల్‌కు వెళ్లి అక్కడి నుంచి నేపాల్ చేరుదాం" అని ప్రయాణం వివరాలు తెలిపాడు సింగ్. నా మౌనాన్ని అర్ధాంగీకారంగా కాక పూర్ణాంగీకారంగా భావించి వెళ్లిపోయాడు.

అడివి బాపిరాజు గారి 'ఒక్కణ్నే' గీతంలాగ నేను ఒక్కణ్నే మిగిలిపోయాను, గంగాతీరంలో. అది వేసవి గనుక ఇబ్బంది ఏమీ కాలేకపోయింది. ఉదయం పంచ పంచ ఉషఃకాలంలో లేవడం, కాలకృత్యాల తర్వాత గంగాస్నానం చేయడం, పది గంటలకు అణాపెట్టి ఆరు చపాతీలు తినడం, ఊరు తిరగడం, మళ్లీ రాత్రి అణా భోజనం. మూడు రోజులు గడిచాయి. రఘునాథ్‌సింగ్ రాలేదు. మూడు రోజుల్లో అంటే, సరిగ్గా పట్టుకత్తిరించినట్టు సమ్మసరిగా మూడే రోజులా, కొంచెం ముందు వెనుక వస్తాడు, పాపం! ఏం తొందరలో ఉన్నాడో! వారం గడిచింది. ఇక రెండణాలే మిగిలాయి. అదీ అయిపోయింది. తొమ్మిదో రోజు నుంచి ఎవరిని అడుగను? యాచించడానికి మనసొప్పలేదు. వేరే ఉద్యోగ ప్రయత్నం చేద్దామంటే సింగ్ వచ్చే వేళకు నేను లేకపోతే, పథకమంతా చెడిపోతుందే! చూద్దాం, రెండు మూడు రోజులు తిండి లేకుండా ఉండలేమా?

తొమ్మిదో రోజు నుంచీ స్నానానంతరం, భోజనం వేళకు నాలుగు దోసిళ్ల గంగాజలం త్రాగడం, ఉదయం, రాత్రీ – ఎదురు చూడడం. తొమ్మిదీ – పదీ – ఇలా ముప్పై తొమ్మిది రోజులు గడిచాయి. కాసబియాంకాలాగ గంగాతీరంలో కదలకుండా ఉన్నాను. గంగ నీటి మాహాత్మ్యమో, నా ఆశాబలమో, వయసు తెగింపో – నెలరోజులూ నీరసం కాని, ఆకలి గాని లేకుండా ఉన్నాను.

అప్పుడొక మధ్యవయస్కునితో పరిచయమయింది. అతని పేరు పండిత్ హరిలాల్ అనుకుంటాను. వెడల్పాటి సరిగంచు ఖద్దరు పంచె, కామరాజ నాడార్ మార్క్ సగం చేతుల ఖద్దరు లాల్చీ – అతనికి నేను విడ్డూర మనిపించానేమో, తానే పరిచయం చేసుకొన్నాడు. నా సంగతి అడిగాడు. వింటూ వింటూ కళ్లు పెద్దవి ఆశ్చర్యం కప్పిపుచ్చుకొని నవ్వు పులుముకొన్నాడు.

"మిమ్మల్ను చూస్తే ఆశ్చర్యం కలుగడం లేదు. విచారం కలుగుతూంది. మూడు నాళ్లలో వస్తానన్న వాడు ముప్పై తొమ్మిది రోజుల దాకా రాకపోతే, ఇంకా నమ్ముతున్నారే?

ఎంత వెర్రివారండీ? వేపకాయంత వెర్రికాదు. వెలక్కాయంత వెర్రి. పోనీ, మీకేమైనా బజానా ఇచ్చాడా? లేదే? నెల రోజులుగా నీళ్లు తాగుతూ ఉన్నారూ? నడవండి మా ఇంటికి. భోజనం చేసిన తర్వాత ఆలోచిద్దాం, అని అన్నాడు నిష్ఠూరంగా.

ఆయన మాటల ప్రభావమో, మొలకెత్తిన నిరాశో – నాకు ముప్ఫైరోజుల ఆకలీ ఒక మారు మండినట్టనిపించింది. శోష వచ్చినట్టయింది. నా స్థితి చూచి అతడు ఒక టాంగాలో నన్ను తన బసకు తీసుకువెళ్లాడు. అతడు ఉన్నది ఒక సత్రంలోని వాటాలో, ఆ సత్రానికి అతడు నిర్వాహకుడు – మేనేజర్. బస చేరగానే తన తల్లికి పరిచయం చేసి భోజనానికి లేవమన్నాడు. అతని తల్లికి నా ఉపవాసం చెప్పాడేమో! ఆ రోజున ఏదో పండుగ – మొట్టమొదట క్షీరాన్నం తినమని పక్కన కూర్చుని తక్కినవి తినిపించింది. నేను ముప్ఫై రోజులుగా అన్నం లేకుండా ఉన్నాను గదా! గొంతుక పూడిపోయినట్లూ, పేగులు కరిగిపోయినట్లూ అనిపించి భోజనం అయిందనిపించాను. ఆ తల్లి బలవంతం చేస్తున్నా లేచాను. నిద్ర ముంచుకొని వచ్చింది. సాయంకాలం హరిలాల్ చెప్పాడు, కాన్పూరులో దాదాపు నాలుగు వందలకు పైగా సత్రాలు ఉన్నాయి. సత్రాలు రెండంతస్తులవీ, మూడంతస్తులవీ ఉన్నాయి. ప్రతి సత్రంలో కనీసం యాభై గదులుంటాయి. కాన్పూరు గొప్ప పారిశ్రామిక నగరం. యాత్రికులు ఒక సత్రంలో మూడు రోజులు ఉచితంగా ఉండవచ్చు. సత్రం నిర్వాహకులు దయ దలిస్తే మరి నాలుగయిదు రోజులు ఉండవచ్చు. నగరంలోని మిల్లు కార్మికులు, ఉద్యోగులు చాలా మందికి క్వార్టర్లు ఉండవు. అలాటి వారంతా ఈ సత్రాలలో వంతుల వారీగా రోజులు కుటుంబంతోపాటు ఉంటూ ఉంటారు. మూడు రోజులు, వారం ప్రకారం ప్రతి సత్రంలో గడుపుతూ ఉంటారు. ఆ విధంగా మూడు నాలుగు సంవత్సరాలకు పాత సత్రం వంతు వస్తుంది. ఇలాగే సత్రాలలో జాతకర్మ నామకరణాది షోడశ కర్మలూ జరిగిపోతాయి. నేను ఆ విధంగానే సత్రాల్లో ఉంటూ ఏదైనా ఉద్యోగం చూసుకోవచ్చు. జీవయాత్ర గడవాలి గదా. జీవన్ భద్రాణి పశ్యతి.

మరుసటి రోజే నాకొక ఉద్యోగం చూచాడు హరిలాల్. లాల్ పనిచేసే మిల్లులో వడికిన ఉన్ని దారం కండెలూ, ఉన్ని బట్టల బేళ్లు మొదలయిన వాటి లెక్కలు వ్రాసేపని. ప్రారంభంలో ఇరవయ్యయిదు రూపాయల జీతం. పనిలో శ్రద్ధ చూపితే వచ్చే నెల నుంచే ముప్ఫై రూపాయలు. హోటలులో భోజనం పూటకి రెండణాలు. నెలకు ఏడున్నర

రూపాయల భోజనం ఖర్చు. సత్రంలో హరిలాల్ ఉన్నాడు, గనుక ఎంత కాలమయినా ఫ్రీగా ఉండవచ్చు. "ఎలా ఉంది ఉద్యోగం? రేపటి నుంచి వెళ్లండి. మీరు చేరే సెక్షను సూపరువైజరు నా మిత్రుడే! మర్యాదగా చూస్తాడు" అన్నారు హరిలాల్.

నా ఇష్టానిష్టాలప్రసక్తి ఏముంది? బతకడం ముఖ్యం. గంగలో పోయే దుంగలాగే నేనూ, ఎవరైనా ఒడ్డుకు లాగితే, అక్కడే పడి ఉండడం.

ఆ ఉద్యోగం మూడు నాలుగు రోజులు చేశాను. ఆ బేళ్లు నా పూర్వజన్మ కర్మల గుట్టలాగ, కండెలు భవిష్యత్తును మూసి బిగిస్తూన్న మర మేకులలాగ అనిపించసాగాయి. మనసు పనిచేయనంది. ఐదో రోజు మిల్లు నుంచి వస్తూ ఒక చోట తల ఎత్తి చూచాను. సెంట్రల్ ప్రెస్ అని సైన్ బోర్డు కనిపించింది. మిల్లు పని కంటే ప్రెస్ పని మంచిదేమోననిపించింది. పరిచితమైందీని. లోపలికి అడుగుపెట్టాను. "ప్రొఫెసర్ గంగాశరణ్ శర్మా, కామర్స్ డిపార్ట్‌మెంట్, సనాతనధర్మ కాలేజ్" అని నాకు ఫలకం కనిపించింది. చూస్తూ నిలబడ్డాను. లోపలికి రమ్మని ఎవరో పిలిచారు. వెళ్లాను. ఎదుట ఆజానుబాహువు, స్ఫురద్రూపి అయిన నడివయస్సు పెద్దమనిషి కూర్చుని ఉన్నాడు. కుశలప్రశ్న తర్వాత ఎందుకో ఆయనకు నాపై దయ కలిగింది. "దక్షిణ్‌కే?" అని అడిగారు. ఔనన్నాను. "నాకొక పరసనల్ అసిస్టెంట్ కావాలి. నాకు లక్నోలో ఒక బుక్‌స్టాల్ ఉంది. ఇక్కడ ప్రెస్సు. చూస్తున్నారు. గదా! నేను సనాతనధర్మ కాలేజిలో వాణిజ్య అర్థికశాస్త్రాధ్యాపకుడిని. తిలక్‌నగర్‌లో నా ఇల్లు. నా ఇంట్లో మీకొక గది ఏర్పాటు చేస్తాను. భోజనం మా ఇంట్లోనే" అన్నారు ఆయన.

నా సమస్య ఉద్యోగం కంటే భోజనమే గనుక వెంటనే నేను సరే నన్నాను. నేను సత్రానికి వచ్చి హరిలాల్‌కు సంగతి చెప్పాను. ఆయన బాగుందన్నాడు (అనకేం జేస్తాడు?) కృతజ్ఞత చెప్పి మకాం మార్చాను.

గంగాశరణ్ మంచి సంపన్నుడు. పెద్ద ఇల్లు, చుట్టూ తోట. ఉదయం ఐదు గంటలకే నన్ను లేపి గంగాస్నానానికి బయలుదేరే వాడు. ఆయనకు ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. ఒక కుమార్తె పేరు విష్ణు, రెండవ అమ్మాయి రాజు. పన్నెండు, పది ఏళ్లవాళ్లు. నన్ను చూచి విష్ణు ఒక మారు అడిగింది. "మా ఇతిహాస్ పుస్తకాల్లో మద్రాసీలంతాద్రావిళ్లని, రాక్షసులనీ, పరమ కురూపులని ఉంది. మీరు మా యు.పి. వారిలాగే ఉన్నారే. రాక్షసులలాగ లేరే!" అని. బ్రిటిష్ చరిత్రకారులు ఈ ఆర్య

ద్రావిడవాదంతో పసిపిల్లల మనస్సులు పాడయి పోయేంతగా ఎంత విషం వ్యాపింపచేశారో అని దుఃఖాశ్చర్యాలు కలిగేవి. నేను చెప్పేవాణ్ని "మనమంతా ఒక్కటే. పరిపాలకులు 'విభజించి పాలించు' విధానం ప్రకారం వ్రాసిన, వ్రాయించిన పుస్తకాలవి. పెద్దయింతర్వాత నీకే తెలుస్తుంది" అని. "మీ భాషలో కొంచెం మాట్లాడండి. చరిత్ర కథలు మీ. భాషలో తెలుపండి" అనే వారు చెరొక వైపు కూచుని. నేను సులభమైన వేమన పద్యాలు చెప్పి వివరించి కబీరుదాసు దోహాలతో పోల్చేవాడిని. వాళ్లు ఎంతో ఆసక్తితో వినేవారు. భాగవతం పద్యాలు చదివితే వాళ్లు తలలు ఊపుతూ చేతులు ఉయ్యాలల్లాగా ఊపేవారు.

ఆయన సతీమణి "నాకు రామచంద్రా బేటా సేతు యాత్ర చేయిస్తాడు. హాయిగా వెళ్లివస్తాను" అనేది. కుమారులు నా చుట్టూ తిరిగేవారు. నా అనుభవాలు కథలుగా చెప్పేవాడిని.

నేను రెండు రోజులకొకసారి లక్నో వెళ్లి బుక్‌స్టాల్ చూచేవాడిని. అక్కడ యాదవ్ అనే అతను అమ్మకాలు చూచేవాడు. గంగా శరణ్ శర్మ పాఠ్యగ్రంథాలూ, వాచకాలూ వ్రాసేవాడు. నేను పాట్నా వరకు పోయి, ఆ పుస్తకాల ప్రచారం చేసే వాడిని. ఆ పర్యటనలో ఒకమారు గోరఖ్‌పూర్ వెళ్లాను. దారిలో మరొక పుస్తకాల ఏజంటు నాతో కలిశాడు. ఇద్దరం ఒక సత్రం గదిలో బస చేశాము. పుస్తకాల నమూనాలు ఇవ్వడం, ఆర్డర్లు తీసుకోడం అయి హోటలులో భోజనం చేసి, గదికి తిరిగి వచ్చిన తరువాత, నా సహచరుడు "పండిట్జీ! మీకు ఆక్షేపణ, అలుపూ లేకపోతే అలా తిరిగి వద్దాం" అన్నాడు. అతడొక హీరామండీకి (వ్యభిచారిణులున్న చోట్లను యు.పి.లో హీరామండి అంటారు) పిలుచుకుపోతాడని ఏం తెలుసు? బయలుదేరాను.

ఆ పరిసరాలు విచిత్రంగా ఉంటాయి. కింద దుకాణాలు. పైన వ్యభిచార గృహాలు. లాహోర్లో లాగే రంగు రంగుల దీపాల కింద కూర్చుని ఉంటారు. ఎవరి తాహతును, ఇష్టాన్ని బట్టి ఏరుకోవచ్చు. లౌండాలు (పిల్లవాళ్లు) కావలసి ఉంటే వాళ్లూ ఉంటారు. పశ్చిమద్వారం కోరుకునే వాళ్లు ఉత్తరభారతంలో ఎక్కువే.

ఇంతలో ఒకడు వచ్చి "అచ్చా మాల్ హై సాబ్! హీరా హీ సమఝో" అన్నాడు. నా సహచరునికి ఆ ఏవ ఎక్కువే. నేను – "దోస్త్! మనం ఒకరి పనిమీద పవిత్రమైన సరస్వతీ సేవ మీద వచ్చాము. ఆ డబ్బంతా వీళ్లు గోళ్లూడగొట్టి లాక్కుంటే మనకు

ఎంత అప్రతిష్ఠ? ఆలోచించు" అన్నాను. ఈ లోగా ఆ తార్పుడు గాళ్లు మమ్మల్ని ఇద్దరినీ లాక్కుని వెళ్లారు. నా మిత్రునితో అన్నాను "ఈ బలవంతం చూస్తే మన పరువు దక్కదు. కట్టుగుడ్డలూ మిగిలేట్టు లేదు" అని. అతనిలో కొంత ఆలోచన తోచింది. వాళ్లను కసురుకొన్నాడు. నాకూ ఆ పరిసరాలను చూచి చాంచల్యం కలుగడం వాస్తవమే. కాని, నాకు పరాయి సొమ్ము మనవద్ద ఉన్నప్పుడు ఇలాటి ఆకర్షణలకు లోబడితే మళ్లీ ఎక్కడ పోలీసుల పాలవుతామో అనే భయం ఉండేది. సుఖవ్యాధుల భయమూ ఉండేది. "జ్ఞాతాస్వాదో వివృత జఘనాం, కో విహాతుం సమర్థః" । రుచి మరిగిన వాడు దిస మొలతో ఉన్న దానిని వదలగలడా? అని కాళిదాసే అన్నాడు. నేనెంతటి వాడిని? నన్ను అలాటి భయంకర కూపాల్లో పడకుండా కాపాడింది ధర్మభీతి కాదు. సుఖరోగభీతి, అపకీర్తిభీతి. నేను నా సహచరుణ్ని కూడా హెచ్చరించాను సుఖరోగాలను గురించి. అతడూ వివాహితుడే. నాలాగ కాకుండా కాపురం చేసినవాడు. నిజంగానే భయపడ్డాడు. ఆ తార్పుడుగాళ్లకు ఏదో కొంత ముట్టజెప్పి, హీరామండీ అంతా తిరిగి గది చేరుకున్నాము. అతనితో అన్నాను "భగవంతుడు మనను కాపాడాడని అనుకోవాలి. నీవే గనుక ఏ హీరానో ఆలింగనం చేసుకొని ఉంటే ఏ భయంకరమైన ఉపదంశం (కొరుకు) వంటి జబ్బో తగిలితే ఏడుతరాలు స్వాహా!"

నేను కాన్పూర్‌కు తిరిగి వచ్చాను. నా పనికి గంగాశరణ్ శర్మ చాల సంతోషించారు. ఒకనాడు పాట్నా నుంచి ఒక అరకొర జ్ఞానం, మేకపోతు గాంభీర్యం ప్రధాన లక్షణమయిన ఒక బిహారీ పురోహితుడు వచ్చాడు, శర్మకు ఆశ్రితుడు. నేను ఆ కుటుంబంతో కలివిడిగా ఉండడం చూచాడు. కన్నుకుట్టి ఉంటుంది. పొగరుబోతు ఆంబోతు మనం ఊరికే ఉన్నా కొమ్ము విసరుతుంది. "మీరు ఆ పరాయి పిల్లవాడితో ఇంత చనువుగా ఉన్నారు. ఏం కులమో? ఏం గోత్రమో? ఏమన్నా ప్రమాదమయితే ఏం గతి? సత్యానాశ్‌హోగా?" అని విషబీజం నాటాడు. జాతి చెట్టు పెరగడానికి కొంత కాలం పడుతుంది. కాని నాగజముడు (పాపాసుకళ్లి) నిముషాలపైన పెరుగుతుంది. అందిన మేర ఆవరిస్తుంది. ఆ మాటలు నా చెవిన పడేశారు. విష్ణూ, రాజూ. ఆ దినం దీపావళి. శర్మను సకుటుంబంగా లక్ష్మీపూజకు, నిమంత్రణకూ పిలిచారు. (దక్షిణాపథంలో నిమంత్రణ శబ్దానికి శ్రాద్ధభోజనాహ్వానమని అర్థం. కాని ఉత్తర భారతంలో ఆ అర్థం లేదు.) కాకతాళీయమో, ఉద్దేశపూర్వకమో శర్మ కుటుంబం నన్ను వదిలి వెళ్లిపోయింది. దీపావళి

నాడు పస్తు ఉంటే నా విధికి నవ్వు వచ్చింది. అక్కడ ఇక ఉండడం ఉచితం కాదని నిశ్చయించుకున్నాను. మరుసటి ఉదయం శర్మాజీకి, ఆయన భార్యకు చెప్పి బయటపడ్డాను. పిల్లలకు చెప్పడానికి మనస్సు ఒప్పలేదు. శర్మాజీ, ఆయన భార్య కష్టపడ్డారు. "నిన్న మా వెంట మీరు రావలసింది. పొరపాటయింది" అని క్షమాపణగా నీళ్లు నమిలారు. అంతటి ప్రేమ ఏమైందో! ఒక ప్రాకృత కవి అన్నాడు.

**"అద్దం సణేణ పేమ్మం**

**అవేమి అఇదం సణేణ విఅవేహి,**

**ఫిసుణజణ జంహిఏణ వి"**

**అవేహి ఏమే అవి అవేహి.**

**ప్రేమ తరచు చూడకపోయినా పోతుంది. తరచు చూడడం వల్లనూ పోతుంది. దుర్మార్గులు కొండేలు చెప్పడం వల్లనూ పోతుంది. ఒకొకప్పుడు ఊరికేనే పోతుంది. ఇప్పటిది కొండేల ప్రభావమా?**

గంగాతీరంలో ఉండడానికి ముందు ఒక మిత్రుని ఇంట్లో ఒకటి రెండు రోజులున్నాను. అతడొక కార్మికుడు. భార్య సుశీల, అయినా సమవయస్కులతో ఛలోక్తులు స్వేచ్ఛగా విసిరేది. పరాచికాలాడేది. ఒక కార్మికుడు తరుచు ఆమెను "భాభీజీ తుమ్హారీ ఘడీమే కిన్నే బజే?" అని అడిగేవాడు. ఆమె ప్రతిసారీ "ఏక్ హీ బజా"అని సమాధాన మిచ్చేది. నాకు మొదట్లో అదేమిటో అర్థమయ్యేది కాదు. ఆమెనే అడిగాను. "తుమ్హీ సోచనా" అన్నది. నేను ఆలోచించాను. ఆ! ఎంత దుర్మార్గమయిన ప్రశ్న? ఎంత చతురత, ధైర్యంగా సమాధానం చెప్పింది ఈ అమ్మాయి! అని అనుకుని, ఆమె సమయస్ఫూర్తికి మెచ్చుకునేవాడిని.

అంతటి దుర్మార్గుడని నేను భావించిన వాడు రాత్రి ఆ వీధి చివరి బయలులో తులసీదాస్ రామాయణం చదివేవాడు. వందల మంది కార్మికులు శ్రద్ధగా వినేవారు. "నా వెంట అడవికి రావద్దు. కష్టపడుతావు" అనే అయోధ్య కాండ ఘట్టం - ఆ మాటలకు శ్రోతలు ఏడ్చేసేవారు.

**"కానన కఠిన భయంకర భారీ**

**గోరఘామ హిమవారి బయారీ**

**తృణ కంటకమయ అతిఘవ నానా"**

అంటూ కథకుడు చదువుతుండగా శ్రోతలు వెక్కి వెక్కి ఏడ్పులు. రామాయణ ప్రభావం సామాన్య ప్రజలలో అలాటిది. నేను అప్పుడప్పుడు అనుకొనే వాడిని - హిందూమతం కింద వర్గాల్లోనూ, మహమ్మదీయమతం పై వర్గాలలోను బలంగా ఉందేమోనని.

కథాగానం తర్వాత నేను ఆ కార్మికుణ్ణి అడిగాను "భాయీ! నీవేమో ఇప్పుడు సహృదయరంజకంగా పవిత్రమైన రామాయణం గానం చేస్తున్నావు. ఉదయం ఇంట్లో ఆవిడను అలాటి ప్రశ్నలు వేస్తావేమిటి?" అని. అతడు నవ్వుతూ, "అది కేవలం వినోదం. మా మందిలో వదినెలతో అలాటి పరిహాసం తప్పుకాదు. ఆమె సమాధానమూ విన్నారు కదా! అది అంతే" అన్నాడు. మన ప్రాంతాలలో అయితే, మరిది వదినెలతో అలాటి పరాచికాలు ఆడితే, ఇంకేముంది? ఇల్లు మూడు ముక్కలు, తలకాయ ముప్పై ముక్కలు అని అనుకున్నాను.

మన వీధినాటకాల వంటి "నౌటంకీ, బారాబంకీ"లనే వాటినీ చూచాను. ఉదయమంతా పనిచేసి అలసి సొలసిన జనం, రామాయణగానంతోను, నౌటంకీ మొదలయిన నృత్యరూపకాలతోను విశ్రాంతి, ఆనందం పొందడం చూచి చాలా ఆనందించాను. మిల్లు కార్మికులు, తక్కిన ప్రజాసామాన్యం ఏ మాత్రం తీరిక దొరికినా తులసీదాస్ రామాయణం ఒకరు పాడగా, తక్కిన వారు వింటారు. ఈ పద్ధతి మన ప్రాంతాలలోను ఉంటే భావ సమైక్యానికి ఎంతో ప్రయోజనకరమని అనిపించేది.

హరిలాల్ వద్దకు పోవడానికి సిగ్గయింది. మరొక సత్రంలో తలదాచుకున్నాను. చేత దమ్మిడీ లేదు. మొహర్‌సింగ్ అనే క్షత్రియ యువకుడు, నా పక్క గదిలో ఉన్నాడు. నన్ను పలుకరించాడు. పలుకరించడానికి కారణం నా ఖద్దరు. జరీ అంచు పంచె. నా పరిస్థితి అర్థం చేసుకున్నాడు. "మీకు ఆక్షేపణ లేకపోతే నా వెంట రండి, క్షత్రియుల హోటలు. కానీ కొక చపాతీ, నాలుగు చపాతీలు చాలు. నాకు అతిథిగా ఉండండి ఇప్పుడు రాత్రి, ఈ మధ్యాహ్నం లోపు ఏదో పని దొరుకుతుంది" అన్నాడు. గత్యంతరం ఏముంది? సరే నన్నాను. నేను మద్రాసు నుంచి కృష్ణ, గోదావరి, నర్మద, రావి, జీలం, చీనాబ్, సింధ్ నదులు దాటి వచ్చాను. నా ఆచారం ఏ నదిలో జారిపోయిందో? ప్రస్తుతం గంగాతీరం, సజ్జనుడైన మొహర్‌సింగ్.

"గంగా పాపం శశీతాపం
దైన్యం కల్పతరు స్తథా,
పాపం తాపం చ దైన్యం చ,
హంతి సంతో మహాశయాః"

(గంగానది పాపాన్ని పోగొడుతుంది, చంద్రుడు తాపాన్ని పోగొడతాడు. కల్పవృక్షం దారిద్ర్యాన్ని పోగొడుతుంది. గొప్ప ఆశయాలు గల సజ్జనులు పాపాన్ని, తాపాన్ని, దారిద్ర్యాన్ని పోగొడతారు.)

61

# డెయిలీ టెలిగ్రాఫ్‌లో

"సకృదుక్త గృహీతార్థో
లఘుహస్తో జితేంద్రియః
శబ్దశాస్త్రపరిజ్ఞాతా
ఏష లేఖక ఇష్యతే"

(ఒకసారి చెప్పిన మాటల అర్థాన్ని వెంటనే గ్రహించేవాడూ, తొందరగా వ్రాసేవాడూ, చాపల్యం లేకుండా ఇంద్రియాలను అదుపులో పెట్టుకున్నవాడు, శబ్దశాస్త్రాన్ని బాగా ఎరిగిన వాడు అయి ఉండాలి, లేఖకుడు; అంటాడు ఒక కవి. పత్రికలలో పనిచేసే విలేఖరులు కూడ సభల్లో వక్తలు చెప్పి మాటల అర్థాలను వెంటనే గ్రహించాలి. తొందరగా వ్రాయాలి. ఇతరుల ప్రలోభాలకు అతీతంగా ఉండాలి. భాషాజ్ఞానం బాగా ఉన్నవాడయి ఉండాలి. వక్తలు అపశబ్దాలు మాట్లాడినా సవరించి సుశబ్దాలుగా వ్రాయాలి. ఈ ప్రాచీన కవి అప్పటి వ్రాయసం వారి లక్షణాలను చెప్పినా, అవి ఇప్పటి వ్రాయసం వారికే కాక పత్రికలలో పనిచేసే వారి కందరికీ వర్తిస్తాయి.)

**మొ**హర్‌సింగ్‌కు అతిథిగా భోజనం ముగించి సత్రం గదిలో మంచంపై దొర్లుతూ ఆలోచనలో పడ్డాను. రాత్రి లోపల ఏదో నిర్ణయానికి రావాలి. మొహర్‌సింగ్‌కు బరువు

కాగూడదు - అని అనుకుంటూండగా, క్వెట్టా నుంచి లాహోర్ చేరిన తర్వాత జరిగిన సంఘటనలు కాశీపట్నం బొమ్మలలాగా కళ్ల ఎదుట తిరిగాయి.

లాహోర్ చేరిన వెంటనే నా వంగ మిత్రుడు శ్యామా ప్రసాద్ మిత్రను చూచాను. అతడిప్పుడు వివాహితుడు. భోజనానికి రమ్మన్నాడు. భోజన సమయంలో నా సంగతి తెలిపాను. మా మార్టిన్ అండ్ బర్న్ కంపెనీలో ఏదైనా గుమాస్తాగిరీ చూడనా - అని అన్నాడు. వద్దన్నాను. తర్వాత లాలాబిందా శరణ్ అనే కోటీశ్వరుని ఇంట్లో ఉన్న మిత్రుడు చీమకుర్తి సీతారామయ్యను కలుసుకున్నాను. వెంకటరామన్ అనే వారు కాన్పూరులో ఒక ఇంగ్లీషు దినపత్రిక పెడుతారని విన్నాను. దానికి కాన్పూర్‌లోని గొప్ప పరిశ్రమల యజమానులు, పద్మవత్ సింఘానియా, పోషకులట. మనం ఆ పత్రికలో ప్రయత్నిద్దామా? అన్నాడు సీతారామయ్య. ఏదో ఒకటి చేయాలి.

ఇద్దరం వెంకటరామన్ గారిని కలుసుకొనడానికి ఢిల్లీకి బయలుదేరాం. ఆయనను కలుసుకున్నాం. సీతారామయ్య ఏం.ఏ., ఎల్.ఎల్.బి, కనుక ఆయనే వెంకటరామన్ గారితో మాట్లాడాడు. నేను అర్హత లేని వాడిని గనుక వెలుపలే ఉన్నాను. "పత్రిక పెట్టడం వాస్తవమే. రెండు మూడు నెలల తర్వాత గాని సిబ్బందిని నియమించడం గురించి చెప్పలేను. మీకు ఆసక్తి ఉంటే రెండు మూడు నెలల తర్వాత కాన్పూరులో నన్ను కలుసుకోండి; అన్నారట వెంకటరామన్‌గారు. సీతారామయ్య లాహోర్‌కు తిరిగి వెళ్లిపోయాడు.

నేను ఢిల్లీలో ఏదో ధర్మశాలలో ఉండగా వజీర్ సుల్తాన్ కంపెనీ ఉద్యోగి సత్యనారాయణ పరిచయం కావడం, అస్సాం వరకు వెళ్లడం...

ఇలా ఆలోచనలతో సంఘటనలు తిరిగిపోతుండగా మొహర్‌సింగ్ తలుపు తట్టాడు. "ఏమిటి? విశ్రాంతి తీసుకుంటున్నారా? ఇబ్బంది పెట్టానేమో! అయినా ఒక శుభవార్త మీకు చెబుదామని వచ్చాను. ఇక్కడి నుంచి వస్తున్న ఆంగ్ల దినపత్రికకు హిందీ, ఇంగ్లీషు వచ్చిన వాళ్లు ప్రూఫురీడర్లుగాను, రిపోర్టర్లుగాను, పనిచేయడానికి మనుష్యులు కావాలట. ఎడిటర్ వెంకటరామన్ మీ ప్రాంతం వాడే. ప్రయత్నించండి. ఏమంటారు?" అంటూ నా ప్రత్యుత్తరం కోసం ఎదురు చూచాడు మొహర్‌సింగ్.

నాకు ఏవీ అర్హతలు లేవే. మిలిటరీ అనుభవం చెప్పుకోవడానికి వీలులేనిది. అనుకుంటూ తటపటాయిస్తున్నాను. మొహర్‌సింగ్ మళ్లీ గట్టిగా అన్నాడు.

"ప్రయత్నించండి. భగవాన్ దేనా చాహతా హైతో ఛపపర్ ఫాడ్‌కే దేతా హై". నాకు విశ్వాసం లేకపోయినా, ఆపత్కాలంలో ఆదుకున్న సజ్జనుణ్ని సంతృప్తిపరచడం ధర్మమనే దృష్టితో సరే నన్నాను.

వెంకటరామన్‌గారితో నా ఇంటర్వ్యూ విచిత్రమైంది. ఆయన సహృదయుడు గనుక ఉద్యోగం ఇచ్చాడు గాని, మరొకరయితే "వీడెవడో పిచ్చివాడు. గెంటి వేయండి వెలుపలికి! అనేవారే. కమలా టవర్ వద్ద డెయిలీ టెలిగ్రాఫ్ కార్యాలయం.

"మీ పత్రికా ప్రకటన చూచి వచ్చానండీ" అన్నాను నేను, ఆయనను కలుసుకొని నమస్కరించిన తర్వాత.

"ఏమిటీ మీ అర్హతలు?" అనడిగారు. ఆయన,

"అయ్యా! నేను తెలుగు, సంస్కృతం విద్వాన్, హిందీ ప్రభాకర్ పరీక్షలో ఉత్తీర్ణుణ్ని, ఆయుర్వేదంలో కూడా పరిచయం ఉంది. ఇంగ్లీషులో బి.ఏ. పూర్తి చేయలేదు. ఒక భాగం, మిగిలింది. డిగ్రీలు ఎందుకులే అనే విరక్తి కలిగి మానుకున్నాను. కాని నా ముఖ్యమయిన అర్హత ఆకలి!" అన్నాను.

ఆయన నావైపు రెండు నిమిషాలు చూచి ఆకలి అందరికీ ఉండేదే, మీ ప్రత్యేకత ఏమిటి? అన్నారు. నేనేమీ జవాబు చెప్పలేదు.

"ఆకలి నా అర్హత అంటే, ఉద్యోగం ఎవరిస్తారండీ? ఇంకేమన్నా పనులు చేశారా" అని ప్రశ్నించారు. తంజావూరు, మద్రాసు లాహోర్ లైబ్రరీల అనుభవం, భాషలు ఏకరువు పెట్టాను. ఆయన రెండు నిమిషాలు ఆలోచించి "ఇదంతా యోగ్యతే, ఎందుకు చెప్పలేదు?" అన్నారు.

"ఈ వృత్తికి ఇవన్నీ సంబంధించినవి కావు గదా!" అన్నాను.

"నో ! నో!.... జర్నలిజానికి అన్నీ పనికి వచ్చేవే... చివరకు హోటల్లో ఎంగిలి కప్పులు కడిగిన అనుభవమూ అవసరమే" అన్నారు. నతచ్ఛాస్త్రం, నతచ్ఛిల్పం, న సావిద్యా, న సాకలా, నా సౌయోగో... నాటకానికి అన్నా అర్హమైనవే అనే - భరతుని వాక్యం గుర్తుకు వచ్చి, అయితే నాకు ఆ అర్హత పూర్తిగా ఉందండి!" అని మింట్ స్ట్రీట్ హోటల్ రామవిలాస్ అనుభవాలు చెప్పాను.

"అదా, డా! మీ పేరు ఏమన్నారు? రామచంద్ర కదూ! నాకు సరైన అసామీ దొరికారయ్యా మీరు! ఒక గఢ్వాలీ బ్రాహ్మణుడు మా మెస్ వంటవాడు. మీరు ఆ

వంటవాడితో మంచి వంటలు చేయించాలి. రిపోర్టింగ్‌కి పంపుతాను. వచ్చిన భాషలో వ్రాయండి. దిద్దడానికి సబ్-ఎడిటర్లు ఉన్నారు గదా! తీరికవేళల్లో ప్రూఫ్ రీడింగ్, ఇక్కడే మాతోపాటు బస. ఎప్పడి ఇరుక్కు ఏర్పాడు? (ఎలా ఉంది ఏర్పాటు).. జీతం సంగతి నాకు వదిలేయండి. మూడు ఉద్యోగాలు గదా!" అన్నారు ఆయన.

"మూడు ఉద్యోగాలేమిటి?" అని అడిగాను, గాభరా గాభరాగా,

'అదేనండీ మెస్ మేనేజర్. రిపోర్టర్, ప్రూఫ్‌రీడర్" అంటూ నిష్కల్మషంగా నవ్వారు.

నేను నవ్వాను. జీతం ముఖ్యం కాదని, ఆకలి ముఖ్యమని మరొకసారి సవినయంగా మనవి చేశాను. ఆయన విరగబడి నవ్వుతూ అదేనండీ; మీకు ఆకలి సమస్య, మాకు ఆకలికి సరైన భోజనం లేని సమస్య. తమాషాగా ఉంది కదూ?... ఇంతకూ ఎక్కడ ఉంటున్నారు? సాయంకాలానికి బస మార్చండి. నాకు మీ బోటి వాళ్లే కావాలి. ముడిసరుకు. నాతో సంవత్సరం ఉండండి. గొప్ప ఎడిటర్ అయిపోతారు. అడా, డా! అరుమైయాన ఆళయ్య, నీర్. ఇవ్వళపు వెచ్చిందు పసి అన్రీరే. (అరేరే! ఎలాటి బంగారం వంటి వారయ్యా మీరు? ఇంత పెట్టుకొని ఆకలి అంటారే!) అడే, నాగేశా! ఈయన రాత్రికి ఇక్కడికి వస్తారు. రేపటి నుంచి మనకు మంచి భోజనం. అదిగో! ఆ గది ఖాళీ చేయించు..." అంటూ ఆ కుర్రవాడిని పిలిచి చెప్పారు.

నా ఆకలి సమస్య తీరింది. సత్రానికి వెళ్లి, మొహర్‌సింగ్‌కు జరిగినదంతా చెప్పాను. అతడు ఆనందంతో నన్ను కౌగిలించుకొన్నాడు. బ్రాహ్మణ్ దేవతా అంటూ పాదాలు స్పృశించి నమస్కరించాడు. ఆ రాత్రి అతనితో పాటు కాసీ చపాతీలు ఆరగించి, డెయిలీ టెలిగ్రాఫ్ కార్యాలయానికి బస మార్చాను.

మరుసటి దినం నా మొదటి పని మహానస పర్యవేక్షణం. గధ్వాలీ వంటవాడిని కుశల ప్రశ్న లడిగి వంటకు సూచనలివ్వడం. మనకూ తమిళులకూ భోజనపద్ధతిలో కొంచెం తేడా ఉంది. తమిళ మధ్యతరగతి భోజనంలో కొద్దిగా పరుప్పు (పప్పు), కూర, కూట్టు, సాంబారు, చారు, పెరుగు గాని, మజ్జిగ గాని, ఊరుగాయ లేక పచ్చడి వారికిప్రధానమైన ఆదరువులు. సాంబారు అంటే ముక్కలున్న పప్పుపులుసు. కూరలు, కూట్టు నంజుకుంటారు. పచ్చడి కలుపుకోడం అరుదు.దానిని కూడ నంజుకోవడమే అలవాటు, మనం కూరలు, పచ్చళ్లు కలుపుకుంటాం. నేను తెలుగు, తమిళ పద్ధతులు రెండు కలిపి పచ్చి మిరపకాయలు నూరి వేసి సాంబారు చేయమన్నాను. వంకాయ

వేపుడు చేసి, కందిపచ్చడి నూరి, వడియాలు వేయించమన్నాను. వెంకటరామన్‌గారికి అందరు తమిళులకిలాగే ఉడికించిన కూరలేగాని వేపుళ్లు అంతగా తెలియవు. ఒంటి గంటకు సుష్టుగా అందరూ భోజనం చేశారు. "అడా, డా! రామచంద్రా! ఎన్నా రుచి! ఎన్నా రుచి!" అంటూ లొట్టలు వేశారు వెంకటరామన్‌గారు, కాని పచ్చి మిరపకాయల మాహాత్మ్యం వల్ల రాత్రి కడుపులో గడబిడ కలిగి, "రామచంద్రా! కారం కొంచెం తగ్గించండి!" అని మరుసటి ఉదయం అన్నారు.

ఆ దినం సాయంకాలం రాహుల్ సాంకృత్యాయన్ ప్రసంగించే సభ ఒకటి ఉంది. "రామచంద్రా! మీకు హిందీ బాగా వచ్చు గనుక రాహుల్‌జీ ప్రసంగం కవర్ చేయండి" అన్నారు.

అది ఆంగ్లంలో నా మొదటి కవరేజ్. చాల జాగ్రత్తగా వ్రాశాను. రాహుల్‌జీ భావాలు స్పష్టంగా, వివరంగా ఇచ్చాను. ఆయన సోవియట్ యుద్ధం మీద, తక్కిన వాటి మీద ప్రకటించిన భావాలు ఎంతో అమూల్యమయినవి. వెంకటరామన్ నన్ను ప్రోత్సహించడానికి కాబోలు చాల మెచ్చుకున్నారు. తక్కిన పత్రికలతో పోల్చి బెస్ట్ కవరేజ్ అన్నారు. నేను ఉబ్బిపోలేదు గాని సంతోషం ప్రకటించి కృతజ్ఞత తెలిపాను. వంటింటి కవరేజీపైనే ఎక్కువ శ్రద్ధ వహించాను. నేను ఉన్నన్నినాళ్లు వెంకటరామన్ రామచంద్ర స్మరణ చేస్తూ హాయిగా భోజనం చేశారు. డెయిలీ టెలిగ్రాఫ్ మెస్సులో భోజనం చేస్తూంటే నాకు చమన్‌లో ఒక పఠాన్ విందు గుర్తుకు వచ్చింది. విందుకు వెళ్లాము మిలిటరీ వాళ్లం కొందరం. పెద్ద బల్ల, బల్లమీద మధ్యన పెద్ద పళ్లెంలో అమ్మవారి ఎదుట కుంభం తోడినట్టు పెద్ద అన్నపురాశి. అన్నకూటం. అందరూ - (కొందరు ఎంగిలిచేతితోనే!) - అన్నకూటం నుంచి అన్నం తీసుకుంటున్నారు. అది సఖ్యానికీ సమైక్యానికీ చిహ్నం. ఎవరూ ఏమీ అనడానికి లేదు. నేను మనసులోనే ఆ అన్నకూటంలో గిరి గీచుకున్నాను. నా ఎదుట ఉన్న అన్నం భాగంలో కిందిది నా వంతు. దానిలో చేయి పెట్టి తోడుకొనే వాడిని. ఎంగిలి, మంగలం ఏమయ్యాయి? - నా హద్దులో నేనున్నాను. పూర్తిగా మారిపోలేదు - అని అసహజమయిన సంతృప్తి! ఇక్కడ, ఈ మెస్సులో అట్లాకాదు. ఎంగిలి అంటే, ఇంకేమయినా ఉందా? తెలుగు వారికి అంటుముఖ్యం; తమిళులకు ఎంగిలి ముఖ్యం. నేను పఠాన్ ఇంట్లో కూడా ఆపోశనం పట్టాను. అదేమిటి? అని అడిగాడు అతను. భగవంతుడా! నీవు

అమృతస్వరూపుడవుగా నా ముందు ఉన్నావు - అని అర్థం. ప్రార్థిస్తున్నాను. మీరు అర్థాందుదుల్లా -భగవంతుని కరుణ అని భోజనం ప్రారంభిస్తారు కదా! అలాటిదే అన్నాను. "ఠీక్ హే-ఏసా" అన్నాడు ఆతిథేయుడైన ఆ పఠాన్ ఆశ్చర్యంతో. "అందరూ చేయడం లేదే, ఇలాగ? అనిప్రశ్నవేశాడు. అర నిమిషం ఆగి. "వాళ్లు మనస్సుల్లోనే భగవంతుని ధ్యానించుకుంటారేమో! అన్నాను. ఈ విషయాన్ని పొడిగిస్తే ఏం తగాదానో అనుకుంటూ, "ఏభీ ఠీక్ హే" అన్నాడు. అతిథేయ పఠాను అన్న కూటం శిఖరం నుంచి తన పెద్ద పంజాతో అన్నం తోడుకుంటూ. మరొకమారు నా మనస్సులోని అన్నకూటరేఖను గుర్తు చేసుకొన్నాను.

వెంకటరామన్‌గారి వల్ల నాకు వృత్తి విషయంలో స్థిరమయిన అభిప్రాయం కలిగింది. పత్రికారచన నా మనఃప్రవృత్తికి అనుగుణమయిన వృత్తి, అంతేకాక అది అప్పుడు దేశసేవలో భాగం. పత్రికల్లో పనిచేసేవారు దేశ సేవకులుగా గొప్ప గౌరవం పొందుతున్న కాలమది. పత్రికారచనా వృత్తిని వదలరాదు - అనే నిశ్చయం నా చంచల స్వభావానికే విరుద్ధంగా స్థిరపడింది.

దాదాపు రెణ్నెల్లు గడిచింది. మా నాన్నగారికి ఉత్తరం వ్రాశాను, నా వివరాలు తెలుపుతూ. ఆయన సంతోషం ప్రకటిస్తూనే ఒక సలహా ఇచ్చారు. ఇంగ్లీషు మహాసముద్రం. మహా మహా వాళ్లే నెగ్గడం కష్టం. నీవూ ఆలోచించు, తెలుగు పత్రికలలో చేరితే సేవ చేసిన తృప్తి నీకు ఉంటుంది. మాకూ దగ్గరగా ఉంటావు - ఇదీ సలహా.

నేను ఆలోచించాను.

ఉద్యోగం ఇయ్యగల తెలుగు పత్రికలు అప్పటికి రెండే - ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ. దేశాభిమాని వంటివి ఉన్నా ఎక్కువ సిబ్బందిని భరించదగినవేమీ కావు. ఆంధ్రపత్రికలో కాలమ్‌కు ఒకరి వంతున పెద్దమందే ఉండేది. అందరూ గొప్పవారే. ఆంధ్రప్రభలో నేను తంజావూరు ఉద్యోగానికి వెళ్లడానికి ముందు ప్రయత్నిస్తే ప్రూఫురీడరుగా రమ్మన్నారు. నాకు నచ్చలేదు. ఇది ఐదేళ్ల కింది సంగతి. ఇప్పుడు కొత్తగా వచ్చిన పత్రికలేవీ లేవు. ఆలోచన తెగలేదు.

రెన్నాళ్ల తరువాత వెంకటరామన్‌గారికి మా నాన్నగారి ఉత్తరం సంగతి తెలిపాను. ఆయన చిరునవ్వుతో "అప్పడి ఆనా, రామచంద్ర నమ్మైవిట్టార్! (అంటే రామచంద్ర మమ్మల్ను వదిలారు -) నాన్నగారి మాట ముఖ్యం కదా!" అన్నారు.

లేదండీ, నేను మా నాన్నగారిని ఒప్పిస్తాను. తెలుగులో ఉన్న దినపత్రికలలో పెద్దవి రెండే కదా! అన్నాను.



"రామచంద్రా! మీకు తెలీదు. అక్కడికి వెళ్లిన తరువాత తిరిగి రావడం కష్టం. మీరు రాగలిగితే ఎప్పుడు వచ్చినా స్వాగతమే. మళ్లీ మా కర్మ, గఢ్వాలీ పండిట్ భోజనం. కడవుళే (దేవుడా) ఏకాంబ్రేశ్వరా!" అని నిట్టూర్చారు వెంకటరామన్‌గారు.

నేను ఎంతసేపో నచ్చజెప్పాను. ఆయన నమ్మలేదు. సరే, ఎంతో కష్టంతో నన్ను పంపించారు.

నేను మూడోనాడు అనంతపురం చేరాను. మా నాన్నగారూ అమ్మా సంతోషించారు. చెల్లెళ్లు, తమ్ముళ్లూ ఆశ్చర్యంతో నన్ను చూచారు. అమ్మ నేను గడపదాటి లోపలికి వెళ్లకముందే పదిసార్లు దిష్టి తీసి వేసింది.

వారం గడిచింది. నేను కాన్పూరు సంగతి ప్రస్తావించాను. ససేమిరా ఎవరూ ఒప్పుకోలేదు. నేను మద్రాసుకు వెళ్లి ఏ పత్రికలో నయినా ప్రయత్నించాలనీ; అక్కడ కుదరకపోతే; అత్తవారి ఊరు నిజాం రాష్ట్రంలోది గనుక (అప్పుడు గుల్బర్గా జిల్లా నిజాం రాష్ట్రంలోది, తర్వాత కర్నాటకకు చేరింది) అక్కడికి వెళ్లి, భార్యను చూచి, హైదరాబాద్‌లో ఏ పత్రికలోనయినా ప్రయత్నించాలని మా నాన్నగారు నిర్ణయించారు. కానీ, నేను మద్రాసు వెళ్లలేదు. భర్తృహరి అన్నట్టు "స్త్రీ యంత్రాక్షరణతో" అత్తవారి ఊరికే వెళ్లదలచాను.

మూడో నాడు మా అమ్మ తన కోడలి కోసం చేసి రకరకాల పిండివంటల బుట్టలతో అత్తవారి ఊరు సురపురం చేరాను. ఉత్తరం పత్తరం లేకుండా హఠాత్తుగా వచ్చిన నన్ను చూచి అత్తవారింట్లో అందరూ ఆశ్చర్యపడ్డారు. వారం పదిరోజులు అక్కడ ఉన్నాను. శ్వశుర గృహనివాసం స్వర్గతుల్యం గదా! పది నాళ్లూ సూర్యుణ్ణే చూడలేదు.

ఆ పదినాళ్లు నా మనస్సు క్వెట్టా నుంచి కాన్పూరుకు చాలసార్లు పరుగులు తీసింది. సరిహద్దు గాంధీ ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్, ఆయిన అగ్రజుడు డాక్టర్ ఖాన్‌సాహెబ్, బలూచిస్తాన్ గాంధీఖాన్. అబ్దుస్సమద్ ఖాన్, సింధ్ జాతీయ ఆహ్రార్ పార్టీ నాయకుడు (ఇంకా జీవించి ఉన్న 96 సంవత్సరాల) సైయద్, నేను దర్శించిన మహానాయకులెందరో గుర్తుకు వచ్చారు. చమన్ మిత్రులను, నన్ను రైలెక్కించిన రామేశ్వరదయాళ్‌గౌడ్‌ను ఆయన అర్ధాంగి శాంతను వారి సంతానాన్నీ స్మరించాను.

పదినాళ్ల తర్వాత నా బావగారి అర్ధాంగి సౌభాగ్యవతి ఇందిరమ్మ ఇచ్చిన పిండివంటల బుట్టతో హైదరాబాద్ రైలెక్కాను. ఒంటిగా కొన్నాళ్లుండి; ఉద్యోగం దొరికిన వెంటనే

కాపురం పెడతానని అర్ధాంగి అనంతలక్ష్మికి మరీ మరీ మాట ఇచ్చాను. నాంపల్లి స్టేషను ఎదురుగా ఒక సత్రం ఉందనీ, అక్కడ మూడు నాళ్లు ఊరికే ఉండవచ్చని, గది దొరకకపోయినా, అల్మయిరాలు ఇస్తారనీ వాటిలో సామాన్లు దాచుకొని ఉద్యోగప్రయత్నాలు చేసుకోవచ్చునని నాకు నా బావగారు పదే పదే చెప్పారు. ఒక తాళం కూడా ఇచ్చారు.

మరుసటి దినం నాంపల్లి రైలుస్టేషనులో దిగి, నా బావగారు చెప్పినట్టే స్టేషన్ ఎదుట ఉన్న రాంప్రతాప్ భవన్ అనే సత్రంలో దిగి ఒక కప్ బోర్డులో సామాన్లు - ఒక సంచీ, పిండివంటల బుట్ట - పెట్టి తాళం వేసి కాలకృత్యాలు ముగించుకొని బుట్టలోని పిండివంటలు (చక్కిలాలు, కజ్జికాయలు, రవలడ్డూలు, అతిరసాలు, కారప్పూస, పూరీలు) - తిని, అనంతర కార్యక్రమం ఏమిటీ అని ఆలోచిస్తూ కూర్చున్నాను.

అత్తవారి వైపు బంధువులు హైదరాబాద్‌లో చాలమందే ఉన్నారు. కాని, ఉద్యోగాన్వేషి అయిన నేను వాళ్ల ఇళ్లకు పోదలచుకోలేదు. నా బావగారూ ఈ దృష్టితోనే వారి చిరునామా ఇయ్యలేదు. నాకు తెలిసిన ఒకే ఒక వ్యక్తి సంగెం లక్ష్మీబాయిగారు. ఆమె చిరునామా స్పష్టంగా తెలియదు, ఇసామియా బజారు చివర వంతెన. దానిని దాటితో సర్కారీ క్వార్టర్సు అని మాత్రం గుర్తు. ఆమెను కలుసుకొని నా భవిష్యత్తును నిర్ణయించుకుందాం అనుకున్నాను. ఇసామియా బజారు వంతెన చాదర్‌ఘాట్ వంతెన అని తెలుసుకొన్నాను. అక్కడికి వెళ్ళి తెలుసుకుందాం; ప్రయత్నం ఫలించకపోతుందా? బుట్టలో పదినాళ్లకు తగినంత పిండివంటలున్నాయి. మూడు నాళ్లు సత్రంలో హాయిగా గడపవచ్చు. అటు తర్వాత నౌకరీ కోసం వచ్చానయ్యా అంటే సత్రం మేనేజర్ కప్‌బోర్డు మరి మూన్నాళ్లు ఇయ్యకుండా పోతాడా? ఇలా ఆలోచించి కాలినడకన బయలుదేరాను ఇసామియా బజారుకు. అప్పుడు నిజాం నాణేలు హాలీ అణన్నర రిక్షాకు. అదీ ఖర్చు పెట్టదలచలేదు. నాంపల్లి స్టేషన్‌రోడ్డు, ఆబిడ్స్ సర్కిల్, ట్రూప్‌బజార్, బ్యాంకి స్ట్రీట్, కోఠీ, ఇసామియా బజార్, చాదర్‌ఘాట్ పుల్ (వంతెన). పక్కనే గవర్నమెంట్ క్వార్టర్స్. అక్కడ కొందరిని అడిగి లక్ష్మీబాయిగారి ఇల్లు చేరాను.

నన్ను - ఆకాశం నుంచి ఊడిపడినట్టు నిలుచున్న నన్ను - చూచి లక్ష్మీబాయిగారు ఆనందాశ్చర్యాలతో ఉక్కిరిబిక్కిరయి "ఏం తమ్ముడు! అంతా బాగానా? ఒక పత్రం

ముక్క వ్రాయకపోతివి? ఎట్లా ఊడిపడితివి? ఒక్కడివే వచ్చినావా? మరదలు పిల్లని తోల్కొని రాలేకపోతివి? యాడ దిగినవు? భోజనం గిట్ల అయిందా? ఏం తిన్నవో ఏమో? ఎన్నేళ్లాయె సూసి..." ఇలా ప్రశ్నల వర్షం కురిపించారు. నా సంగతి వివరించాను.

ఆమె "కొలువుకు ఏమి తొందర? ఉండు చూద్దాం. ఏదీ దొరక్కపాయెనా, పదిమంది పోరలతో సాలె (బడి) పెట్టుకుందువంట. మరదలు పిల్లనుతోలమని వ్రాయి మీ వోళ్లకు. నా క్వార్టర్స్‌లో ఒక గది ఖాళీగానే ఉంది" అని తను చిత్రకళోపాధ్యాయినిగా పనిచేస్తున్న కళాశాలకు వెళ్లుతూ, "సాయంత్రానికి సత్రం నుంచి వచ్చేయి. వాసుదేవరావుతో (ఆమె మేనమామ కుమారుడు, కఠోర ఆర్య సమాజానుయాయి) నీ సంగతి అంటాను. వస్తడు. నీకు తోడుగ ఉంటడు. బుగులు పడొద్దు" అన్నారు.

నేను నడుస్తూనే సత్రం చేరాను. పనేముంది? సత్రంలో దిగేవాళ్ళను వెళ్లిపోయేవాళ్లను చూస్తూ ఆలోచించాను - బంగారం వంటి ఉద్యోగం మానుకొని రావడమేమిటి? మళ్లీ ప్రయత్నించడమేమిటి! డెయిలీ టెలిగ్రాఫ్‌లోనే ఉంటే...? అంతా విధివిలసితమా? స్వయంకృత మూర్ఖత్వమా? పితృవాక్య పరిపాలనమా? ఏమిటి? ఏమిటి? ఇస్మామియా బజారు నుంచి రాను పోను నడక, అలసట, అగమ్య భవితవ్యతను గురించిన ఆలోచన - వీటితో నాకు తెలీకనే నిద్రపట్టింది. నిద్ర చాల విషయాలకు మందు - అందువల్లనే వాగ్భటుడన్నాడు.

"నిద్రాధీనం సుఖం దుఃఖం<br>
బుద్ధిః కార్శ్యం బలాబలమ్,<br>
వృషతో క్లీబతా జ్ఞానం<br>
అజ్ఞానం జీవితం న చ."

**(మానవునికి నిద్ర చాల అవసరం. సుఖం, బుద్ధి, నిద్రాధీనాలు. నిద్రలేకపోతే చిక్కిపోతాడు. నిద్రవల్ల లావెక్కుతాడు. పుష్టిగా ఉంటాడు. తగిన నిద్ర లేకపోతే దుర్బలుడవుతాడు. మంచి నిద్ర పురుషత్వాన్ని పెంచుతుంది. నిద్రలేమి నపుంసకత్వాన్ని కలిగించవచ్చు. జ్ఞానం, అజ్ఞానం, అంతెందుకు జీవితం, మరణమూ నిద్రపైనే ఆధారపడి ఉన్నాయి - అని ఈ శ్లోకార్థం.)**

నేను కళ్లు తెరిచే వేళకు రాత్రి ఎనిమిది కొట్టింది. అప్పుడు లక్ష్మీబాయి గారి ఇంటికి

మారడం ఎందుకులే - అని అనుకున్నాను. రాత్రి సత్రం పంచలోనే కప్‌బోర్డ్ ఎదుట అందరితోపాటే ఉత్తరీయం పరచుకొని పడుకున్నాను. ఉదయం లేచాను. పని పునరావృత్తం అయింది. అవును, ఈ పునరావృత్తి - రొటీన్ జీవికే కాదు. సృష్టికే తప్పదా? భూమి తిరుగుతూనే ఉంది, సూర్యుని చుట్టూ; తన చుట్టూ చంద్రుణ్ణి తిప్పుకుంటూ. సూర్యుడు కూడ తిరుగుతాడట. ఈ భూ చక్రానికే తప్పనప్పుడు నేనెంతటి వాడిని? అయినా నేను నష్టపడింది లేదనే అనిపించింది. దేశం తిరిగాను; వయస్సు గడిచినా అనుభవం కలిగింది గదా అనుకుని లక్ష్మీబాయి గారి ఇంటికి బయలుదేరాను. అప్పుడు ఒక సూక్తి గుర్తుకు వచ్చింది.

**"యస్తు సంచరతే దేశాన్**
**యస్తు సేవేత పండితాన్ !**
**తస్య విస్తారితా బుద్ధిః**
**తైల బిందు రివాంభసి !!"**

**ఎవడు దేశాలు తిరుగుతాడో, ఎవడు పండితులను సేవిస్తాడో, వాడి బుద్ధి నీటిలో పడిన నూనె చుక్కలాగ విస్తరిస్తుంది. నా కవిరెండూ ఎంతవరకు అబ్బినాయో బేరీజు వేసుకుంటూ నడిచాను. నూరేళ్లూ ఇలా నడక తప్పదేమోనని అనిపించింది.**

# కృతజ్ఞత

ఇవి నాకు జీవితంలో మూడోవంతు సంఘటనలు. నేను సామాన్య మానవుణ్ని. సగటు మనిషిని. కాని నాలో వైచిత్ర్యం, వైవిధ్యం ఉన్న మాట నిజం. ఎవరి జీవితంలో లేవు గనుక? ప్రతి మనిషీ ఒకే మూసలో పోసినట్టున్నాడా? అయినప్పుడు జీవితంలోనూ వైవిధ్యం తప్పదు. అందువల్ల మిత్రులు కొందరు నాలోని వైవిధ్యాల కన్నా వైరుధ్యాలు చూచి ముచ్చటపడి నా జీవితంలోని కొన్ని సంఘటనలను వ్రాయమన్నారు. కొందరు మారాం చేశారు. మిత్రులు బరోడా బ్యాంక్ సికిందరాబాద్ శాఖ, చీఫ్ మేనేజర్ జొన్నలగడ్డ లక్ష్మీనారాయణ గారు రెండు మూడు నాళ్లు నాతో ఉండి, నా చిన్ననాటి సంఘటనలను ప్రశ్నిస్తూ, గుర్తు వచ్చేట్టు చేస్తూ చెప్పినవి చెప్పినట్టు కాయితంపై వ్రాస్తూ, వివరంగా వ్రాయాలని ప్రోత్సహించారు. మిత్రుడు డాక్టర్ అక్కిరాజు రమాపతిరావుగారు ఉదంతాలుగా వ్రాయండని బలవంతపెట్టారు. అరవై ఒక్క వారాల పాటు ప్రచురించారు ఇప్పటి సంపాదకులు. నా చిన్ననాటి మిత్రులు ఏ.వి. దేశికాచార్యులుగారు, బాణగిరి శ్రీకృష్ణమాచార్యులుగారు, కోలాచలం బాలకృష్ణ వంటి వారూ, పోలవరపు కోటీశ్వరరావుగారి వంటి సహృదయ పాఠకులూ ఏ వారానికి ఆ వారం చదువుతూ సంతోషం ప్రకటించారు. శంకరగల్లు వరదరాజాచార్, కుంటిమద్ది భక్తవత్సలం వంటి భ్రాతృవర్గం వారు ఎప్పటికప్పుడు ఉత్తరాలు వ్రాశారు మెచ్చుకుంటూ. ఇక మహిళాలోకం గురించి చెప్పనక్కరలేదు. నేను ఏ సమావేశానికి వెళ్లినా, ఏ పెండ్లికి వెళ్లినా, ఒకే పొగడ్తలు. వీరందరికీ కృతజ్ఞత ఎలా చెప్పుకోను. నమస్కరించడం తప్ప?

భాషా సేవకుడు

**తిరుమల రామచంద్ర**

**భాషా సేవకుడి జీవిత చరితార్థతలో ముఖ్య ఘట్టాలు**

| | | |
|---|---|---|
| **జననం** | : | 17-6-1913 |
| **తల్లిదండ్రులు** | : | శ్రీమతి జానకమ్మ, శ్రీ శేషాచార్యులు |
| **జన్మస్థలం** | : | రాఘవంపల్లె, అనంతపురం జిల్లా |
| **ప్రాథమిక విద్యాభ్యాసం** | : | 10 ఏళ్ళ వయస్సున, కాకినాడలో |
| **జాతీయోద్యమ ప్రవేశం** | : | కాంగ్రెస్‌కు వెళ్లడం (1923) |
| **కారాగారశిక్ష** | : | 1932, రాయవెల్లూరు, తిరుచిరాపల్లి జైళ్లలో |
| **విడుదల** | : | 1933లో |
| **తర్వాత చదువు :** | | 1933 నెల్లూరు ఆయుర్వేద కళాశాల, మద్రాస్ మైలాపూర్ కళాశాలలో |
| **మద్రాసు కుట్రకేసులో ముద్దాయి** | : | 1934 - 1936 |
| **ఉద్యోగాలు** | : | 1934, ఓరియంటల్ కాలేజీలో కాపీయిస్టుగా<br>1937-38 తంజావూర్ సరస్వతీ మహల్‌లో ఉద్యోగం |
| **వివాహం** | : | 1938 మే 7వ తేదీన, ఇల్లాలు శ్రీమతి సౌభాద్యవతి అనంతలక్ష్మి తో |
| **సైన్యంలో** | : | 1940-44, హవల్దార్ క్లర్క్‌గా |
| **పత్రికారంగంలో** | : | 1944లో డెయిలీ టెలిగ్రాఫ్‌లో, మీజాన్‌లో,<br>1947-59 ఆంధ్రప్రభ,<br>1960-1971 ఆంధ్రపత్రిక,<br>1975-1979 ఆంధ్రభూమి |
| **సన్మానాలు** | : | ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి పురస్కారం,<br>1970 సాహితీ సుగతుని స్వగతం,<br>1980 - గాథాసప్తశతిలో తెలుగు పదాలు<br>1988 - డాక్టరేట్ (డా.అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం) |

**బిరుదులు** : మహామహోపాధ్యాయ, (కాశీ పండిత పరిషత్తు)
ప్రపంచ తెలుగు సభల్లో సన్మానం:
(హైదరాబాదు, కౌలాలంపూర్);
ఆంధ్రసంఘం వారి సన్మానం,
ఏకతా అవార్డు (హైదరాబాదు),
'పత్రకారశిరోమణి' బిరుదు ప్రదానం
(కలకత్తాలోని ఉదంత
మార్తాండ పత్రిక తరపున).
తెలుగు విశ్వవిద్యాలయం డాక్టరేట

**పరమపదం** : అక్టోబర్, 12, 1997.

**డా. తిరుమల రామచంద్ర వాఙ్మయ తపస్వితలో విరబూసిన సాహితీ కుసుమాలు**

మన లిపి-పుట్టుపూర్వోత్తరాలు,
నుడి-నానుడి,
సాహితీ సుగతుని స్వగతం,
గాథాసప్తశతిలో తెలుగు పదాలు,
హిందువుల పండుగలు-పర్వాలు,
హాలుని గాథలు,
బృహదారణ్యకం, మనవిమాటలు,
అహంభో అభివాదయే,
తెలుగు పత్రికల సాహిత్యసేవ,
మూడు వాఙ్మయ శిఖరాలు,
బుద్ధుణ్ణి బళ్ళోవేశారు,.
లలిత విస్తరం, అవదాన కల్పలత (ఈ రెండూ అనువాదాలు);

పలుకుబడి, హైదరాబాద్ నోట్‌బుక్, హైదరాబాద్ లేఖ మొదలైన శీర్షికలు నిర్వహించారు. శతాధికంగా పీఠికలు ఎందరి పుస్తకాలకో, సహస్రాధికంగా సమీక్షలు, వివిధ పత్రికలలో వ్రాశారు.

## ఈ పుస్తకంలో ఉదాహృతులయిన వ్యక్తుల పేర్లు

అంబాళం వెంబారు రామాచార్యులు

అక్బర్ చక్రవర్తి

అదపా రామకృష్ణారావు

అడివి బాపిరాజు

అద్దంకి శ్రీరామమూర్తి

అనంతలక్ష్మి

అనార్కలి

అభినవ గుప్తుడు

అమృతానంద స్వామి

అల్లూరి సీతారామరాజు

అష్టమ ఎడ్వర్డు చక్రవర్తి

ఆంధ్ర శేషగిరిరావు

ఆచంట లక్ష్మీపతి

ఆచార్య ఆత్రేయ

ఆదిభట్ల నారాయణదాసు

ఆదిలక్ష్మి

అనీబిసెంటు

ఆళ్ల బాలకృష్ణారెడ్డి

ఇంగువ కార్తికేయశర్మ

ఈయుణ్ణి జగన్నాథాచార్యులు

ఈశ్వరయ్య నవరు
ఉత్తమూరు వీరరాఘవాచార్యులు
ఉన్నవ లక్ష్మీనారాయణ
ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ
ఎన్.డి. కృష్ణారావు
ఎన్.కె. రామనాథశాస్త్రి
ఏలూరు పేర్రాజు పంతులు
ఎ.వి. సుబ్రహ్మణ్యం
ఎ.ఆర్. కృష్ణ
ఎ.ఎస్. రామన్
ఓరుగంటి వెంకట సుబ్బయ్య
ఔరంగజేబు
కంచనపల్లి కనకమ్మ
కట్టమంచి రామలింగారెడ్డి
కనకదాసు
కన్నయ్యనాయుడు
కపిస్థలం కృష్ణమాచార్యులు
కప్పగల్లు సంజీవమూర్తిరావు
కప్పగంతుల లక్ష్మణశాస్త్రి
కలచవీడు శ్రీనివాసాచార్యులు
కామకోటి పరమాచార్యులు
కామరాజ నాడార్
కాళయ్యశెట్టి
కాళిదాసు
కాశీ కృష్ణాచార్యులు
కాశీనాథ శాస్త్రి
కాశీనాథుని నాగేశ్వరరావు
కుంటిమద్ది రామాచార్యులు
కుంటిమద్ది శేషశర్మ

కుంటిమద్ది శ్రీనివాసాచార్యులు
కుప్పమ్మ రాణీ సాహెబ్
కుప్పుస్వామి శాస్త్రి
కూచి నరసింహము
కృత్తివెంటి పేర్రాజు
కె.వి. రాఘవాచార్యులు
కె.వి. రెడ్డినాయుడు
కైప నాగరాజు
కొండమ్మవ్వ
కొమఱ్ఱాజు లక్ష్మణరావు
కోడి రామమూర్తి
కోమల
కోలాచలం వెంకటరావు
కోలాచలం సుబ్బశాస్త్రి
క్షీరాబ్ధినాథ శర్మ
గన్నవరపు సుబ్బరామయ్య
గాంధీజీ
గిడుగు రామమూర్తి పంతులు
గొడుగుపాలుడు
గౌరీనాథశర్మ
చక్రవర్తుల రాజగోపాలాచారి
చదువుల రామచంద్రయ్య
చర్చిల్
చింతలపల్లి వెంకటసుబ్రహ్మణ్య శాస్త్రి
చీమకుర్తి సీతారామయ్య
చలమచర్ల రంగాచార్యులు
చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి
చేమకూర సత్యనారాయణ

ఛత్రపాల్

జగద్గురు అనంతాచార్యులు

జమ్మలమడక లక్ష్మీనారాయణ

జానకమ్మ

జార్జి చక్రవర్తి

టంగుటూరి ప్రకాశంపంతులు

టేకూరు సుబ్రహ్మణ్యం

తాతాచార్యులు

తిప్పావఝుల రామశర్మ

తిరుపతి వేంకటకవులు

తిరుమల వేంకటరంగాచార్యులు

తెనాలి రామన్న

తోళప్పాచార్యులు

దంటు సుబ్బావధాని

దక్షిణామూర్తి

దమ్మాలపాటి రామారావు

దమ్మాలపాటి శేషగిరిరావు

దాదాభాయి నౌరోజీ

దాసాచార్యులు

దాసూరావు

దీవి గోపాలాచార్యులు

దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి

దొడ్డ గోవిందరావు

దొరస్వామి అయ్యంగార్

ధర్మవరం గోపాలాచార్యులు

ధర్మవరం రామకృష్ణమాచార్యులు

నడాదూర్ కృష్ణమాచార్యులు

నరసింహ తాతాచార్యులు

నాగపూడి కుప్పుస్వామయ్య

నేలటూరి శ్రీనివాసాచార్యులు

పంగనామాల బాలకృష్ణమూర్తి

పన్నారాజు

పాతాళభేది సుబ్రహ్మణ్యం

పానుగంటి లక్ష్మీనరసింహారావు

పింగళి లక్ష్మీకాంతం

పుట్టపర్తి నారాయణాచార్యులు

పురందర దాసు

పురుషోత్తమ ఆర్య

పెరియ తిరుమల నంబి

పెరుమాళ్ల వేంకటాచార్యులు

పేరంగూరు తిరునారాయణాచార్యులు

ప్రయాగ్ దాస్

బళ్లారి రాఘవ

బసివి నాగమ్మ

బాబూరావు

బాలగంగాధర తిలక్

బులుసు వేంకటరమణయ్య

బూర్గుల రామకృష్ణారావు

బెజవాడ గోపాలరెడ్డి

భగత్‌సింగ్

భట్ట నారాయణుడు

భావనాచార్యులు

భోగరాజు పట్టాభిసీతారామయ్య

భోగీంద్రనాథ్

మాడభూషి వెంకటాచార్యులు

మదనమోహన మాలవ్యా

మలయవాసిని, కోలవెన్ను
మాడభూషి నరసింహాచార్యులు
మానవల్లి రామకృష్ణకవి
మారేపల్లి రామచంద్రశాస్త్రి
ముల్క్‌రాజ్ ఆనంద్
ముస్సోలినీ
మొహర్‌సింగ్
యదవల్లి సూర్యనారాయణ
యల్లాప్రగడ సుబ్బారావు
యామునాచార్యులు
రంగదేవరాయలు (శ్రీరంగదేవరాయలు)
రంగస్వామి సరస్వతి
రఘునాథసింగు
రఘువరదాస్
రఘువీర, డాక్టర్
రాఘవమ్మ
రాజగోపాలాచార్యులు
రామదాసు
రామాచార్లు
రామానుజులు
రాయసం వెంకట శివుదు
రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ
రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు
రాహుల్ సాంకృత్యాయన్
రూపనగుడి నారాయణరావు
లక్ష్మణ స్వరూప్
లక్ష్మీనారాయణ శాన్ భోగ్
లార్డ్‌రిప్పన్

